# తెలుగు సాహిత్య చరిత్ర

తృతీయ భాగము

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

cp 11058
I

# తెలుగు సాహిత్యచరిత్ర

## తృతీయభాగము

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
ఎం.ఏ. పి.హెచ్.డి., డి.లిట్
విశ్రాంతాచార్యులు, తెలుగు శాఖ
ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు

" తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థికసహాయంతో ప్రచురితం. "
" ఈ గ్రంథంలోని రచయిత అభిప్రాయాలతో తెలుగు విశ్వవిద్యాలయానికి ఎలాంటి సంబంధం లేదు. "

రమణశ్రీప్రచురణ
విశాఖపట్టణము

# అంకితము

శ్రీవిశ్వప్రకృతిప్రఫుల్లకవితాశీర్వాదమోదమ్ముతో
జీవత్కావ్యకళాప్రపూర్ణకవితాశ్రేయోభిలాషమ్ముతో
వైవిధ్యస్థగితస్వతంత్రకవితావైదగ్ధిసంసిద్ధితో
దైవానుగ్రహదత్తమైనయది మత్సాహిత్యచారిత్రమున్

శ్రీకృష్ణదేవరాయమ
హాకవియుగము మనుసంభవాదిమనోజ్ఞా
నేకస్వతంత్రకావ్యస
మాకీర్ణస్వర్ణయుగము మత్సహచరికిన్

శ్రీమతికి గేహలక్ష్మికి
క్షేమాంచత్పుత్రపౌత్రగృహభారతికిన్
ధామాశ్రితాన్నపూర్ణకు
ప్రేమాగతబంధుమిత్రప్రియదేవతకున్

అనుదినసుఖమయసంసా
రనిర్వహణచణనిరంతరనిపుణమతికిన్
అనుగుణవితరణనిష్కప
టనిమంత్రణహృదయవేంకటరమణసతికిన్

వరసాహిత్యచరిత్రగ్రంథరచనావ్యాపార మేపారగా
కర మాహ్లాదముతో ప్రతిక్షణము సౌకర్యమ్ము కల్పించుచున్
పరిపాటిన్ పరమానుకూలమతియై వర్తిల్లు మజ్జీవితే
శ్వరి అర్ధాంగికి అంకితమ్మిడెద స్వచ్ఛప్రేమచిహ్నమ్ముగా!

IV

# ద్వితీయభాగము - ముద్రణస్ఖాలిత్యములు

పుట 9పంక్తి28,పుట10పంక్తి1- మహానాటకసుధానిధి ప్రౌఢదేవరాయల పేర. రామాభ్యుదయము సాళువనరసింహరాయల పేర కలవు.

పుట35పంక్తి2- "గోచరోదరి" కలదు. "గమికర్మీకృతనైకనీవృతా" లేదు. రెండవ పద్యమునందు "గమికర్మీకృతనైకనీవృతా" కలదు. "సదసత్సంశయగోచరోదరి"లేదు. కాని శ్రీహర్షుని ప్రయోగముతో పందెము చఱచునట్లు ప్రతిద్వంద్విప్రాయముగ "అస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరి" కలదు. ఇది హర్షాతిశాయికము.

పుట 104 పంక్తి 10- శైవవైష్ణవమతభేదములు కారణము. పలనాటి వీరచరిత్ర వైష్ణవమతవిజయప్రతిపాదకము.

పుట143పంక్తి21- బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత

పుట174పంక్తి25- నవమస్కంధమునందు ఆటవెలదులు ఇరువదినాలుగు తక్కువ. (20-44) దశమస్కంధము పూర్వభాగమునందు ఆటవెలదులు ఇరువదియొకటి ఎక్కువ. (62-83)

పుట201పంక్తి14- క్రమపరిమాణ. క్రమపరిణాహదృశ్యము.

పుట282పంక్తి12- ధారాసురత్రాణునికి. కటకగజపతికి కలహము కలిగించునదని కూడ అర్థము వచ్చును.

# భూమిక

పవనాందోళితనారికేళకదళీపత్రావళీనృత్యకో
నవనాంతవ్యవసాయజీవనవిధానప్రాప్తి చెట్టిక్కఁ స
త్కవనోద్దీపితనారికేళకదళీద్రాక్షావళీపరీపాకవ
ర్ణవితానవ్యవసాయజీవనవిధానధ్యాస సంప్రాప్తమై 1

వరగురువాక్సుధారసము వాకలు కట్టు, నిసర్గలాలసాం
కురమును ప్రోది చేసి, నునుక్రొంజిగురాకిడ, పాదుకొల్పి, పం
దిరిపయి నిల్పుకొంటి మది తీగలు సాగిన సాహితీలతన్
పరిణతపత్రపుష్పఫలభారగభీరసముజ్జ్వలాకృతిన్. 2

కన్నుల నిప్పులైన వడగాల్పుల ధాటికి వాడకుండఁ గా
వన్నెల చిన్నెలైన జడివానల దాడికి వీడకుండఁ గా
మిన్నుల మ్రోతలైన మిడిమేలపు పిడ్గుల మాడకుండఁ గా
సన్నుతసాహితీలత వసంతవికాసము చెందు నిత్యమున్. 3

ప్రాకృతసంస్కృతాదిబహుభాషలభానుమయూఖమాలికల్
సాకినవైన వీ తెలుగు శారద శారదచంద్రచంద్రికల్
వాకున కందరానివగు స్వాదురసామృతపూరసారశ
య్యాకమనీయముల్ సహృదయప్రకరానుభవైకవేద్యముల్. 4

సాహిత్యార్ణవమంథనోత్థచరితాంశస్వచ్ఛకావ్యామృత
గ్రాహిగ్రంథము వాంఛనీయమని పూర్వగ్రంథసంధానముల్
సాహాయ్యమ్ముగ నూతనాంశములతోడన్ తథ్యమిథ్యావివ
క్షాహృద్యమ్ముగ సంఘటింతును యథాశక్తిన్ సమగ్రమ్ముగన్. 5.

VI

# స్వగతము

సరిగా పాతికసంవ
త్సరములు ఎం.ఏకు తెలుగు సాహిత్యచరి
త్ర రమణ పాఠము చెప్పిన
పరిపాటిమెయిన్ రచింతు పరమార్థముగా 1

ఆంధ్రవిశ్వకళాసంసదాంధ్రశాఖ
శిష్యమిత్రసహవ్రతుల్ చేసినట్టి
మామకపదవీవిరమణామంత్రణసభ
వ్రాసెదననిన ప్రకటన వాస్తవముగ 2

విశ్వవిద్యాలయసహాయవిత్తసంఘ
మున్నతతమవిద్యార్హత, ఉజ్జ్వలపరి
శోధనము, ప్రచురణములు చూచి యిడిన
సార్థగౌరవపదవియు సార్థకముగ 3

సంగ్రహములు సర్వస్వముల్ సకలవిషయ
కలితసిద్ధాంతగ్రంథముల్ కలవుగాని
స్నాతకోత్తరతరగతిస్థాయి పాఠ్య
గ్రంథమగు చరిత్రము లేని కారణమున. 4

సహజము ప్రమాదపతితము
ప్రహసనసదృశము ప్రమాణరహిత ముపేక్షా
సహము కువిమర్శ కావున
సహృదయసముచితసమీక్ష సాపేక్షముగా 5.

# పీఠిక

స్నాతకోత్తరతరగతిస్థాయి సాహిత్యచరిత్ర వ్రాయవలయునని సంకల్పము. అందుకు స్నాతకోత్తరతరగతివిద్యార్థులకు సాహిత్యచరిత్ర పాతికసంవత్సరములు నిరంతరముగ పాఠప్రవచనము చేసిన అనుభవము మూలధనము. ముప్పది నాలుగుసంవత్సరములు పరిశోధనము చేసిన, పాతిక సంవత్సరములు పైగా పరిశోధనము చేయించిన అనుభవము చక్రవృద్ధి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో తెలుగుశాఖ 1931 వ సంవత్సరమునందు తేజరిల్లినది. ఆనర్సుతరగతులకు బోధన, పరిశోధనకార్యక్రమము ప్రారంభమైనది. అప్పటి తెలుగు శాఖ అధ్యక్షులు పింగళి లక్ష్మీకాంతముగారు సాహిత్యచరిత్రను, సాహిత్యవిమర్శను పాఠ్యప్రణాళికను ప్రవేశపెట్టి, వానికి రూపురేఖలు దిద్ది తీర్చిరి. 1931 వ సంవత్సరమునుండి 1949 వ సంవత్సరమువఱకును వారు పాఠప్రవచనము చేసిన సాహిత్యచరిత్ర, సాహిత్యవిమర్శ శిష్యప్రశిష్యుల ద్వారా దేశమంతట దీధితులు ప్రసరించినవి. లిఖితరూపము నందినవి. అవి రూపాంతరము చెంది అచ్చయినవి. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి ఆంధ్రసాహిత్యచరిత్ర అసమగ్రముగ 1974 వ సంవత్సరమునందు ముద్రితమైనది. లిఖితప్రతికి ముద్రితగ్రంథమునకు చాల అంతరము కలదు. ఆంతర్యము దురవగాహము. లిఖితప్రతియందు అజ్ఞాతయుగము మొదలు ఆధునికయుగమువఱకు కలదు. అందు చక్కని ప్రణాళిక కలదు. సమగ్రమైన సమ్యగవగాహనము కలదు. స్పష్టమైన ప్రతిపాదనము కలదు. కమనీయమైన కవితాశైలి కలదు. అది సమగ్రసుందరమైన అప్పటి సాహిత్యచరిత్ర. ముద్రితగ్రంథము సమగ్రము కాదు. సుందరమును కాదు. ప్రణాళిక సడలినది. అవగాహనము మారినది. ప్రతిపాదనము పలచబడినది. శైలి శ్లథమైనది. ఉభయత్ర విషయమునకు కాలదోషము పట్టినది. కాబట్టి స్నాతకోత్తరతరగతిస్థాయి సాహిత్యచరిత్ర సాపేక్ష్యము.

స్నాతకోత్తరతరగతిపరీక్షలందు, ఉద్యోగార్హతానిర్ణయపరీక్షలందును వ్యాసప్రశ్నలు, వామనప్రశ్నలు అడుగుట సర్వసాధారణము. అవి పాఠ్యప్రణాళికానుసారములు. వ్యాసప్రశ్నలకు సంబంధించిన విషయములు సవిస్తరముగను, వామనప్రశ్నలకు సంబంధించిన విషయములు సంగ్రహముగను ఉండవలయును. ప్రముఖకవుల గుఱించి ప్రత్యంశవివరణము, ఇతరకవులగుఱించి ప్రత్యేకాంశవివరణము తదనుకూలము. అది ఈ గ్రంథరచనాప్రణాళికకు ప్రాతిపదిక. ఇది సాహిత్యచరిత్రగ్రంథరచనాప్రణాళికకు సంవదించునదియే.

పూర్వాభిప్రాయములను పునఃపరిశీలనము చేయునెడ ప్రతిపాదకుల పేరులు తెలుపలేదు. అందుకు రెండు హేతువులు కలవు. 1. విద్యార్థులు, పరీక్షార్థులు

విపర్యయములకు పాల్పడు ప్రమాదము కలదు. అది వారికి నష్టము కలిగించును. 2. ప్రతిపాదనము ప్రధానము కాని, ప్రతిపాదకుడు ప్రధానము కాదు. అయిన రాగద్వేషములు అంకురించును. అవి కుశంకలకు, కువిమర్శలకు దారి తీయించును. ఉత్తమవిమర్శ వ్యక్తిపరము కాదు. వస్తునిష్ఠము. ప్రతిపాదకుల పేరులు వలయువారికి సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును. ఇతరత్ర విపులీకరించిన విషయములు ఇందు సూచనప్రాయముగను, సంక్షిప్తరూపముననుకలవు. అందుకు రెండు కారణములు కలవు.1.గ్రంథరచనాప్రణాళిక. 2.గ్రంథప్రయోజనము. జిజ్ఞాసువులకు విపులీకరించిన తావులను సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును.

ఇట్లు ప్రథమ,ద్వితీయభాగములు ప్రకటితపూర్వములు. (1991,92)ప్రథమభాగము స్థూలముగ కవిత్రయయుగము. ద్వితీయభాగము శ్రీనాథయుగము. ఇది తృతీయభాగము. రాయలయుగము. స్వర్ణయుగము.

ముద్రించుటకు వీలుగా, ప్రత్యేకసందర్భముగా పరిగణించి, పదివేలరూపాయలు మంజూరుచేసిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారికి -

అడిగిన పుస్తకములు అందిచ్చిన ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, ఆచార్య పల్లికొండ ఆపదరావు, డాక్టర్ యం. జయదేవ్, డాక్టర్ బి. అరుణ కుమారి, డాక్టర్ సజ్జా మోహనరావు, డాక్టర్ కవెవరపు వెంకట్రామయ్యప్రభృతులకు -

సమీక్షించిన ఆచార్య కోలవెన్ను మలయవాసిని, ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మలకు -

స్పందించిన డాక్టర్ గుండవరపు లక్ష్మినారాయణకు -

ముద్రణమును సరిజూచుటయందు సహకరించిన ఆచార్య కోలవెన్ను మలయవాసిని, డాక్టర్ సజ్జా మోహనరావులకు -

డి.టి.పి. ముద్రణ కావించిన వాస్కా లేజర్ ప్రెస్ వారికి -

కృతజ్ఞతలు

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి.

# కవిత్రయయుగము

ఆంధ్రవాఙ్మయరంగమున నేటివరకు ఆ యా విషయములపై సాగిన అనేకానేకచర్చలను, చారిత్రకాధారములను, శాసనప్రమాణములను నిశితముగా పరిశీలించి, పరిశోధించి; ఐదు పుష్కరముల కాలము సాహితీరసతరంగములలో నిరంతరము మునిగి తేలుచు, పఠనపాఠనకార్యక్రమమును పాటించుచు వచ్చిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, తమ పదవీవిరమణానంతరము యు.జి.సి ఎమెరిటస్‌ఫెలోగా తెలుగు సాహిత్యచరిత్రను రచించుటకు పూనుకొనుట అత్యంతముదావహము. వీరి అనుభవసారము పిండితార్థమై సాహిత్యవిద్యార్థులకు, జిజ్ఞాసువులకు పసం[illegible] ఇందు అగును.

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు మహాకవుల పరమైన యుగవిభజనమే ఉత్తమమైనదిగా భావించి, నిరూపించి, తెలుగు సాహిత్యచరిత్రను క్రొంగ్రొత్తగా ఉత్తంసమైన ఉపపత్తులతో, విశిష్టమైన వివరణలతో, నూత్నపరిశోధనాంశములతో సర్వాంగసుందరముగా, తీర్చి దిద్దిరి. నన్నయకు పూర్వము ఆంధ్రదేశములోని బౌద్ధజైనకావ్యముల విషయము కూడ ఈ గ్రంథములో కూలంకషముగ చర్చింపబడినది. పరంపరగా చెప్పుకొను విషయములలో ఆంధ్రరాష్ట్రమునకు దగ్ధరాష్ట్రమను పేరు ఉండెడిదనుట ఒకటి. ఆ పేరు ఉండెననుటకు ఆధారము మృగ్యమని; వేంగిదేశమునకు మాత్రమే, అది కూడ నన్నయ తర్వాతనే దగ్ధరాష్ట్రమను పేరు వచ్చుటకు అవకాశమున్నదని శాసనప్రమాణముతో నిరూపింపబడినది.

ఒక కవియొక్క ఒకానొక కవితాలక్షణమును ఆ కవియే పేర్కొన్నప్పుడు, ఆ లక్షణ మా కవి కవితలో సమన్వయింపవలసియున్నది. నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తికి ప్రసన్నకథాకలితార్థయుక్తి అను పాఠాంతరమును గ్రహించి ఇచ్చిన ఉదాహరణములే గతానుగతికముగా పఠనపాఠనాదులయందు చోటు చేసికొన్నవి. ప్రసన్నకథాకవితార్థయుక్తి అను పాఠమే కవిహృదయమని అర్థ,యుక్తిశబ్దముల నన్నయ ప్రయోగాంతరములను బట్టి నిర్ణయించి సమన్వయింపబడినది. అక్షరరమ్యత కుంతకుడు ప్రతిపాదించిన వర్ణవిన్యాసవక్రత అని వివరింపబడినది. నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత ఉన్నంత, కన్నంత విప్పి చెప్పగల శక్తి కలిగించు వివరణ మీ గ్రంథమునందు కలదు.

"భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయంగ లేను నే బసవలింగ" అని మల్లికార్జునపండితుడు అన్నట్లు పరంపరగా వ్రాయుచున్నారు. కాని ఈ సీసపాదమునకు ఆకరము మృగ్యము. పై వాక్య మాధారముగా మల్లికార్జునపండితుని చూచిన దృష్టిని మార్చుకొనవలసిన అవసరము. మల్లికార్జునపండితుని గ్రంథములను

బట్టి వివరింపబడినది. పాల్కురికి సోమనాథుని కవితారీతులు. పాండిత్యప్రతిభలు. మతోద్యమతీవ్రతలు విశదీకరింపబడినవి. చక్రపాణి రంగనాథుని కృతుల గూర్చి. యథావాక్కుల అన్నమయ్య పూర్వకవితాచర్వణము గూర్చి ప్రత్యేకముగ వివరింపబడినది.

తిక్కన పునరుద్ధరించిన హరిహరనాథతత్త్వము ప్రత్యేకవివరణము కోరు నట్టిది. తిక్కన "మహాకవిత్వదీక్షావిధినొంది ... రచించెద"నని చెప్పుకొనినాడు. ఆ మహాకవిత్వ దీక్షావిధిస్వరూపస్వభావము లెట్టివి? అనునది సాహిత్యవిద్యార్థులకు, జిజ్ఞాసువులకు తెలియవలెను. ఇట్టి కవుల స్వీయవచనముల వివరణము. సోదాహరణనిరూపణమును అత్యంతావశ్యకములైన విషయములు. ఈ రీతి వివరణలతో నిరూపణలతో ఈ గ్రంథము పరమప్రయోజనకారి.

రంగనాథరామాయణకర్తృత్వము. రంగనాథు డెవరు? అను విషయముల వివరణములతోపాటు రంగనాథరామాయణకవితారామణీయకము, అవాల్మీకవృత్తాంతముల అపూర్వవిషయముల వివరణము ఈ గ్రంథమునందు సర్వసమర్థముగ ఉన్నవి.

ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరప్రశంసలోని పరమార్థవివరణము, సూక్తివైచిత్రి విశదీకరణము ఇందులోని నూతనాంశములు. నాచన సోముని ఆశ్వాసాంతగద్యములోని విశేషణములు స్థూలముగా నిర్వచించి, సూక్ష్మముగా వివరింపబడినవి. భాస్కరరామాయణము షట్కాండములసమీక్షసవివరణగ ఉన్నది.

ప్రసిద్ధకవుల ఆత్మీయతలను అవలోడించుట, ప్రతియుగవైశిష్ట్యమును సూక్ష్మేక్షికతో పరిశీలించుట ఈ గ్రంథము ప్రత్యేకతలు.

కావ్యసారమును కాచి వడగట్టిన సాహిత్యచరిత్ర ఇది.

శ్రీరామమూర్తిగారి తెలుగుసాహిత్యచరిత్రలోని శైలి గాంభీర్యమాధుర్యముల సమ్మేళనము. కావ్యపఠనదశలో సహృదయుడు పొందు అనుభూతి, ఈ సాహిత్యచరిత్రపఠనదశలో పాఠకుడు పొందుట ఈ గ్రంథము విశిష్టత.

విద్యార్థులకు విషయవిస్తరము, పరీక్షార్థులకు సమాధానసౌకర్యము, పరిశోధకులకు ప్రరోచనపాటవము, జిజ్ఞాసువులకు ప్రామాణికదర్శనము అందించగల "వేడీమెకమ్" (Vademecum) ఈ తెలుగుసాహిత్యచరిత్ర.

- ఆచార్య కోలవెన్ను మలయవాసిని
తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్
వాల్తేరు

# శ్రీనాథయుగము

సలక్షణమైన భాషలో విలక్షణంగా సంతరించబడిన ఉద్గ్రంథం తెలుగు సాహిత్యచరిత్ర. స్నాతకోత్తరతరగతి విద్యార్థుల్ని ఉద్దేశించి వ్రాయబడినా, సాహిత్యజిజ్ఞాసువుల కందరకీ ఉపాదేయం ఈ చరిత్రం. కథలూ కాకరకాయలుగా కాక ప్రమాణసహితంగా నేడు సాహిత్యాధ్యయనం చేసే విద్యార్థులే రేపు ఉత్తమబోధకులు కాగలుగుతారు. కనుక పాఠప్రవచన, పరిశోధనానుభవాల ఫలంగా వెలసిన యీ రచన తెలుగు వారికి ప్రామాణికమైన సాహిత్యచరిత్రగ్రంథం లేదనే అభిప్రాయాన్ని పరాస్తం చేసి పుణ్యం మూట కట్టుకుంది. ఈ ప్రతిష్ఠ మిత్రులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి దక్కడంముదావహం.

చారిత్రికవిశేషాలు శాసనాధారాలూ కొత్తవి లభ్యమవుతున్న యీనాళ్లలో సాహిత్యచరిత్రనిర్మాణం అనుకున్నంత సులభం కాదనడం నిర్వివాదం. వాటికే తప్ప స్వాభిప్రాయప్రకటనకో ఊహలకో పెద్దపీట వేయడం అభిలషణీయంకాదు. చారిత్రికాధారం, శాసనప్రమాణం, ఆంతరంగికసాక్ష్యం ముప్పిరిగొన్న యీ రచన విశ్వసనీయతను సంతరించుకోవడంలో ఆశ్చర్యం లేదు. ఏది చెప్పినా, సందేహానికి తావు లేకుండా చెప్పడం కొర్లపాటి వారి స్వభావం దానికి పరిశోధనాపాటవం తోడు కావడం పసిడికి పరిమళం అబ్బినట్టే అవుతుంది. ఈ సందర్భంగా ఒకటి రెండు విషయాలు ముచ్చటించుకోవడం అవసరం.

ఆధునికమైన ఆర్యద్రావిడదృష్టితో రామాయణాంతర్గతవిషయాలు కొన్నిటిని పరిశీలించడం జరుగుతున్నది. ఇందుకు సులోచనావృత్తాంతం ఒక మచ్చుతునుక. సీత ఆర్యపతివ్రత, సులోచన ద్రావిడపతివ్రత అనడం అసంగతమనీ, ఆ భేదదృష్టి"బుద్ధారెడ్డి కాలమునందు కలదనుటకు ఆధారము లేదు. " అని కుండ బ్రద్దలు కొట్టినంత స్పష్టంగా కొర్లపాటివారు పేర్కొనడం ప్రశంసార్హం. మండోదరి మహాపతివ్రత అని ఆర్యపరిగణనమే - అని కూడా ఆయన పేర్కొన్నారు. ఆధునికదృష్టితో ప్రాచీనగాథలను పరిశీలించడం సమంజసం కాదు.

తెలుగు సాహిత్య చరిత్రలో శ్రీనాథయుగవైశిష్ట్యాన్ని లెస్సగా గ్రహించినవారు కనుకనే, కొర్లపాటివారు యావదాంధ్రదేశాన్ని ఆవరించిన ఆ యుగానికి ద్వితీయసంపుటాన్ని పూర్తిగా వినియోగించడం సరసమూ సహృదయరంజకమూను.

ప్రథమసంపుటం కవిత్రయం వారికి పరిమితం కాగా ద్వితీయసంపుటం శ్రీనాథాదిమహాకవులకు ఉద్దిష్టం కావడం రచయిత పాటించిన ఔచిత్యాన్ని వ్యక్తం చేస్తున్నది. సాహిత్యచరిత్రరచనావసరంలో ఔచిత్యపోషణం అవసరమే. కాక

అభిలషణీయం కూడా. కోర్లపాటివారు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలు పరిశీలనార్హాలు.

పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతమే. పలనాటియుద్ధం మతయుద్ధం కాదు. పురుషాధిపత్యయుద్ధం. వల్లభామాత్యుని రచన అయిన క్రీడాభిరామంలోని సప్తశతిపద్యాలు శ్రీనాథుని శాలివాహనసప్తశతిలోని పద్యాలు కాజాలవు. పోతనగారి భాగవతావతరణానికి చారిత్రికనైపథ్యం కలదనీ, ఆ భక్తకవి 12 స్కంధాల భాగవతం వెలయించడం పరమసహజమనీ పేర్కొనవచ్చు.

17 వ శతాబ్దివాడుగా భావించబడుతున్న వేమన 15 వ శతాబ్ది ఉత్తరార్ధంలో జీవించినట్లు కోర్లపాటి వారి నిశ్చితాభిప్రాయం. ఈ అంశం సోపపత్తికంగా వివరించబడింది. విశ్వదాభిరామవినురవేమ అన్న మకుటానికి గల అర్థాన్ని వివరించిన తీరు హృద్యం. రచయిత తెలిపిన వివిధాంశాలను పర్యాప్తంగా పరిశీలిస్తే, ఆ ప్రజాకవిని గురించి మనం తెలుసుకున్నది తక్కువే అనిపిస్తుంది.

సందర్భానుసారంగా వ్యాకరణవిశేషాలను కూడా తెలపడం కోర్లపాటివారి పాఠప్రవచనానుభవఫలితమని భావిస్తున్నాను. అర్థవివరణ కూడా కొన్ని చోట్ల చేశారు. బాలసఖుడనగా బాల్యసఖుడని గ్రహించడం యుక్తం కాదని నిరూపించారు. కవిహృదయాన్ని అర్థం చేసుకోవడానికి అర్థగ్రహణం చాలా అవసరం. ప్రస్తుతపరిస్థితులలో ఇలాంటి రచనావిధానం ప్రశస్తమనడం సాహిత్యవిద్యార్థుల్ని శంకించడం కాదు.

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తిగారు తలపెట్టిన యీ బృహత్కార్యం అందరినీ అలరించగలదనే నా నమ్మకం. ఇతరసంపుటాలు త్వరలోనే వెలుగుచూడాలి.!

- ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ
విశ్రాంతాచార్యులు, తెలుగుశాఖ
మధురై కామరాజ్ యూనివర్సిటీ
మధురై

# సప్తపది

పసరు వయస్సులో కలము పట్టుట నేర్పెడి కాలమందు మా
నసమును మాయ చేసి రసనన్ రసరాజ్ఞి పదాల తొత్తుగా
మసలగ చేసినట్టి తమ మాంత్రికబోధనశక్తికిన్ నమః
కుసుమమహార్చనల్ సలిపి. కోరి నుతించుచునుంటి దేశికా!

ఎపుడో పింగళి నోట్సును
తపస్సుగ జపించినాడ . తదుపరి మరలన్
జపియింపజేసె మీ దౌ
అపారసాహిత్యమంత్రహార్ద్యక్షరముల్

అంతుచిక్కకఒక్కొకగొంతుతోడ
కవికి కవికినిక్రొంగ్రొత్త కళను చూపి
కవుల కలముల కులికెడి కవనకాంత
అన్ని గొంతుల మీకు ప్రత్యక్షమయ్యె

తెలుగు కలముల వెలుగులు తెలియగోరు
రసపిపాసువుల్ లోకాన మసలు దాక
ఏలుచుండు మీ తెలుగు సాహిత్యచరిత
పఠనపాఠనసామ్రాజ్యపట్టమెక్కి

సత్యవిషయగవేషణాచారహృదయ
తర్కవేషభూషితశుభోదర్కవాక్కు
వేయి వర్షాల కైతల పిండివంట
ఎంచి పలుక మీ తెలుగు సాహిత్యచరిత

కలములుశబ్దపాత్రముల కైతరుచుల్ వడబోయు దాక - నా
దలయలు జంత్రగాత్రములు తన్మయతన్ తలపోయు దాక - కుం
చెలు నులులున్ జడంబులకు జీవకళల్ కలబోయు దాక - మీ
తెలుగుల సాహితీచరిత తీర్పును కొల్వు తెలుంగునేలపై

సునిశితశోధనార్భటుల - సూన్నృతవాదపరాయణమ్ములన్
జననుతసద్విమర్శనవచస్సుల - సూత్రసమానవాక్యగుం
ఫనముల - దేశికానుభవవర్ధితబోధనలక్షణమ్ములన్ -
కన గరుదేవ! మీ కృతియు కన్పడు మీ వలె సత్య మెంతయున్.

- డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ
తెలుగు రీడర్
జె.కె.సి. కళాశాల
గుంటూరు

# విషయసూచిక

# రాయల యుగము

## చారిత్రికనైపథ్యము

శ్రీకృష్ణదేవరాయలు యుగకర్త."రాయలు"అను నామాంతము విజయనగర సామ్రాజ్యాధిపతులు అందఱికిని కలదు. అయినను శ్రీకృష్ణదేవరాయలకు రూఢమైనది. అందువలన శ్రీకృష్ణదేవరాయల యుగము రాయలయుగము. శ్రీకృష్ణదేవరాయలు విజయనగరసామ్రాజ్యాధిపతి మాత్రమే కాదు. కవి కూడ. కవిపరమైన యుగవిభాగమే రాయల యుగము. ప్రబంధయుగమనుట పరిపాటి. స్వర్ణయుగమగుట సార్థకము.

విజయనగరసామ్రాజ్యము మొదట సంగమవంశము పరిపాలించినది[1] (1336 -1485) సంగమవంశము క్షీణించి, సాళువవంశము రాజించినది[2] (1485-1506)ఆ సాళువ వంశమును అంతరించి తుళువవంశము తులదూగినది[3] (1506-1571) తుళువవంశము కూడ తుదముట్టి, ఆరవీటివంశము కొనసాగినది[4].(1571-1649) తుళువవంశము ఆరవీటివంశము పరిపాలించిన పదునాఱవశతాబ్ది రాయల యుగము. శ్రీకృష్ణదేవరాయలు తుళువవంశీయుడు. పదునాఱవశతాబ్దిని తెలుగు సాహిత్యము తేజరిల్లుటకు మూలవిరాట్టు శ్రీకృష్ణదేవరాయలే.

అసలు విజయనగరసామ్రాజ్యము కేవలాంధ్రదేశము కాదు. యావదాంధ్రదేశమును కాదు. తమిళకర్ణాటాంధ్రప్రదేశము. శ్రీకృష్ణదేవరాయలు విజయనగరసామ్రాజ్యాధిపతి అగు నాటికి తమిళకర్ణాటప్రాంతములలోని ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము పాళయగాండ్రు తిరుగుబాటు ప్రకటించిరి. ఆంధ్రప్రాంతములోని ఉదయగిరిదుర్గము మొదలు ఉత్కళదేశము వఱకు తీరాంధ్రదేశమెల్ల ఉత్కళదేశాధిపతి అధీనమైనది. తెలంగాణము, కృష్ణాతుంగభద్రానదుల అంతర్వేది, కృష్ణాభీమానదుల అంతర్వేది మహమ్మదీయవశమైనది.

శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలము[5] 1509-1530. బళ్ళారి జిల్లాలోని గుళ్యము శాసనమునందు శ్రీకృష్ణదేవరాయలు విజయనగరమున రత్నసింహాసనాసీనుడై పృథివీ

సామ్రాజ్యమును ఏలుచున్నట్లు కలదు[6]. శాసనకాలము 26-7-1509 వ తేది. హంపీ శాసనములోని శ్రీకృష్ణదేవరాయల ప్రశస్తియందు"పరిభూతసురత్రాణేన" అని కలదు[7]. సుల్తానుని పరాభవించినవాడని అర్థము. శాసనకాలము 28-1-1510 వ తేదీ. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందు ఇట్లు కలదు.

"అలుక న్యోటకథట్టికాఖురపుటీహల్య న్ఖురాసాని పు
చ్ఛలు వో దున్ని చలచ్ఛమూగజమదాసారప్లుతి న్కీర్తిపు
ష్కలసస్యంబిడి యేకథాటి భళిరా కట్టించితౌ దృష్టి కే
దులఖానూగ్రకపాల మర్థపహరిద్భూజాంగలశ్రేణికిన్." 42ప.1ఆ.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు అలుకచేత ఏకథాటిగ అశ్వసైన్యమనెడు నాగళ్ళతో ఖురాసానిదేశమును పుచ్ఛపాదులు పోవునట్లు దున్ని. గజసైన్యమదధారలతో తడిపి. కీర్తిసస్యము నిలిపి. ఏదులఖాను కపాలమును ఉత్తరదిశ మెట్టభూములకు 'దిష్టిపిడత' గ పెట్టించినట్లు కలదు. అప్పటికి బహమనీరాజ్యము అయిదు భాగములైనది. 1.విజాపురరాజ్యము.2.అహమ్మద్‌నగరరాజ్యము. 3.బీదర్‌రాజ్యము.4.బిరార్‌రాజ్యము 5.గోలకొండరాజ్యము. అందు విజాపురరాజ్యసంస్థాపకుడు ఖురాసానిదేశీయుడైన యూసఫ్ ఆదిల్‌ఖాను. అతని రాజ్యకాలము[8] 1482-1510. అతడు విజాపుర,గోలకొండ రాజ్యముల సంధిప్రదేశములోని కోవెలకొండదుర్గము దగ్గఱ చనిపోయినట్లు మహమ్మదీయగ్రంథములందు కలదు[9]. అది యుద్ధమరణమే అగును. అతని తల "దిష్టిపిడత"అగుట శ్రీకృష్ణదేవరాయలు సురత్రాణుని పరాభవించుటయే. అందుకు హేతువు అలుక. అలుక హేతువు యూసఫ్ ఆదిల్‌ఖాను దండయాత్ర గాని. ఉమ్మత్తూరు దుర్గాధిపతి గంగరాజు ఉడయరుసకు అతని అండదండలుగాని అగును.

అనంతరము శ్రీకృష్ణదేవరాయలు వరుసగ ఉమ్మత్తూరు. శివసముద్రము. శ్రీరంగపట్టణములను ముట్టడించెను. అవి కావేరితటమునందలి జలదుర్గములు. మూడు జలదుర్గముల అధిపతి గంగరాజుఉడయరు. అతడు శ్రీకృష్ణదేవరాయల ప్రబలశత్రువు. శత్రుసంహారముతోపాటు శ్రీకృష్ణదేవరాయలు మూడు కోటలును కూలగొట్టించెను. ఇది నంది తిమ్మన పారిజాతాపహరణమునందు ఇట్లు కలదు.

" శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంటెఁ జోళేంద్రత
న్వీరాజత్కుచపాళిమంజరులకంటెన్సహ్యభూభృత్తటీ
నీరంధ్రీకృతగైరికద్రవముకంటె న్వన్నె గావించెఁ గా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్తప్రభన్." 18ప. 1ఆ

"సమ్మర్దక్షమ!ధీనిబంధనవిధాసంక్రందనాచార్య! ఉూ
రమ్మన్యాచలవజ్రపాత! జగతీరక్షాంబుజాక్షా! శర
ధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యాప్రోద్భవాతీరభా
గుమ్మత్తూరిశివంసముద్రపురవప్రోన్మూలనాడంబరా!" 104ప.2ఆ.

పంకజరజముకంటె, మంజరులకంటె, గైరికద్రవముకంటె, కావేరీజలమును శత్రురాజు రక్తప్రభతో ఎఱుపు కావించుటకు; ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగ పట్టణము కోటలను కూలగొట్టించుటకు మూడు సంవత్సరములుపట్టినది[10]. 1512వ సంవత్సరము నాటికి తమిళకర్ణాటప్రాంతము విజయనగరసామ్రాజ్యవిధేయమైనది.

యూసఫ్ ఆదిల్‌ఖాను అనంతరము విజాపురరాజ్యాధిపతి ఇస్మాయిల్ ఆదిల్‌ఖాన్. ఇతని రాజ్యకాలము 1510-1534. అంతకు బహుపూర్వమే విజయనగర సామ్రాజ్యములోని కృష్ణాతుంగభద్రానదుల అంతర్వేది. రాయచూరు,ముదగల్లు దుర్గములు విజాపురరాజ్యమునందు చేరిపోయినవి. అవి తిరిగి సాధించుటకు శ్రీకృష్ణదేవరాయల రాయచూరు దండయాత్ర సాగినది. ఇది మొదటి రాయచూ రుయుద్ధము. 1512వ సంవత్సరమునందు జరిగినది[11]. విజయలక్ష్మి శ్రీకృష్ణదేవ రాయలను వరించినది. రాయచూరు. ముదగల్లు దుర్గములు విజయనగర సామ్రాజ్యమునందు విలీనములైనవి.

శ్రీకృష్ణదేవరాయల కలబరిగ దండయాత్ర 1514 వ సంవత్సరమునందు జరిగి నది[12]. కలబరిగ విజయము మనుచరిత్రమునందు, ఆముక్తమాల్యదలోను కలదు.

" ప్రళయఘనాఘనఘోషభయానకభాంకృతిభీమచపేటలుఠ
త్కలబరిగీకటకక్షితిరక్షక" 81ప.2ఆ.మ.చ.

" తిరుగు హరిపురి సురతరుసురల మరగి
బహుళహళహళిభరితకల్బరిగనగర
సగరపురవరపరిబృఢజవనయవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ!" 41ప.1ఆ.ఆ.మా.

కలబరిగ బహమనీరాజ్యమునకు ప్రాచీనరాజధాని. ఇప్పటి గుల్బర్గా. సగరపు రము గుల్బర్గాజిల్లాలోని భీమానది సమీపమునందలి నస్రతాబాద్‌సాగర్[13].

కలబరిగ దండయాత్ర కాగానే, శ్రీకృష్ణదేవరాయల బెడందకోట దండయాత్ర సాగినది. బెడందకోట అన బీదర్. బీదర్ రాజ్యాధిపతి కావలసిన ఇమ్మడి మహమ్మ

దుషాను కారాగారమున బంధించి, బరీదు పాలకుడయ్యెను. అతనిని ఓడించి, ఇమ్మడి మహమ్మదుషాను విడిపించి, బీదర్ సింహాసనమునందు శ్రీకృష్ణదేవరాయలు పునఃప్రతిష్ఠించెను. యవనరాజ్యస్థాపనాచార్యబిరుదు నందెను. అది ప్రథమతః 1.9.1514 వ తేదినాటి నెల్లూరు శాసనమునందు కలదు[14]. ఇది మనుచరిత్రమునందు ఇట్లు కలదు.

" ... ... ... ... యవనక్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష! " 142ప. 33అ.

ప్రతాపరుద్రగజపతి అధీనములోని తీరాంధ్రదేశమెల్ల తిరిగి గైకొనుటకు శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయయాత్ర కావించెను. అదిఏకధాటికాదు. అయిదాఱు పర్యాయములు జరిగినది. "1514వ సంవత్సరము జూన్‌లోని ఉదయగిరి శాసనమునందు శ్రీకృష్ణదేవరాయలు వుదయగిరిదుర్గం మీద విడిశి ప్రతాపరుద్రగజపతిని కొండవీడుపర్యంతం విరుగంబొడిచి వుదయగిరిదుర్గానకు మేణత సేయించి దుర్గం పుచ్చుకొని ప్రతాపరుద్రగజపతివారి పిన్నతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని తిరిగి విచ్చేసి యిప్పుడు వుదయగిరి కోన వల్లభరాయనికి సమర్పించి"నట్లు కలదు[15]. ఉదయగిరిదుర్గవిజయము ఆముక్తమాల్యద ప్రథమాశ్వాసాంతపద్యము.

" ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజాహేవాకలబ్ధీధరా
డుదయోర్వీధరతత్పితృవ్యకృతనవ్యోపాయనోష్ణీషర
త్నదృగంచత్పదకృష్ణరాయవసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహిం బొల్పగున్."

ఇందు శ్రీకృష్ణదేవరాయలు గజపతి పినతండ్రి సరిక్రొత్త కానుకగా ఇచ్చిన రత్న కిరీటమును కాలితో తాకినట్లు కలదు. ప్రతాపరుద్రగజపతి అధీనములోని ఉదయగిరి దుర్గము 1514జూన్ నాటికి విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది.

25-10-1514వతేదితిరుపతిశాసనమునందు"శ్రీవీరప్రతాప శ్రీకృష్ణరాయమహారాయలు విజయనగరాననుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి వుదయగిరిదుర్గంన్ను సాధించి తిరుమలకాంతరాయమహాపాత్రునిన్ని పట్టుకొని అద్దంకి వినికొండ బెల్లంకొండ నాగార్జునకొండ తంగేడు కేతవరం మొదలయిన గిరిదుర్గస్థలదుర్గాలు యేకధాటిని కైకొని కొండవీటి దుర్గం మీదను విడిచి దుర్గం చుట్టు చుట్టి మొదట చప్పరాలు పెట్టి కోట పడకొట్టించి దుర్గమును పట్టుకొని దుర్గం మీద నుండు

ప్రతాపరుద్రగజపతిరాయల కొమారుండు వీరభద్రరాయుండు కొమారహంవీర పాత్రుని కొడుకు నరహరదేవు రాచూరు మల్లుఖానుండు వుద్దండఖానుండు జన్యావు ల కసవపాత్రుండు పూసపాటి రాచిరాజు శ్రీనాథరామరాజు లక్ష్మీపతిరాజు పశ్చిమబాలచంద్రమహాపాత్రుండు వీరు మొదలైన పాత్రసామంతులాను మన్యవారి నిన్ని జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయదానమును యిచ్చి ధరణికోట అమ రేశ్వరానకు విచ్చేసి"నట్లు కలదు[16].

" మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు కృష్ణనందను
న్మనసిజుని న్జయించె నది మానుషమే నరసేంద్రుకృష్ణరా
యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁ డగు వీరభద్రుఁ గరుణామతిఁ గాంచె జగత్ప్రసిద్ధిగన్" 21ప.1ఆ

అని పారిజాతాపహరణమునందు కలదు. కసవాపాత్రుని విషయము మనుచరి త్రమునందు కలదు. (37ప. 1ఆ) కొండవీడు దుర్గవిజయము ఆముక్తమాల్యద ద్వితీయా శ్వాసాంతపద్యము.

" ఇది భూమండనకొండవీడుధరణీభృద్దుర్గపూర్వాద్రిభా
స్వదిభేశాత్మజవీరభద్రజనజీవగ్రాహరాహూయమా
ణదృఢాంచద్భుజకృష్ణరాయమహిరాణ్ణామాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీయంబై మహిం బొల్పగున్."

ఇందు శ్రీకృష్ణదేవరాయలు గజపతి తనయుడు వీరభద్రుని జీవగ్రాహముగా పట్టుకొన్నట్లు కలదు. ప్రతాపరుద్రగజపతి అధీనములోని వినుకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము మొదలైన గిరిదుర్గస్థలదుర్గములతోపాటు కొండవీడు దుర్గము 1514 అక్టోబరునాటికి విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది.

29-3-1516 వ తేదీ సింహాచలశాసనమునందు శ్రీకృష్ణదేవరాయలు కొండపల్లి దుర్గమును సాధించినట్లు కలదు[17]. కొండపల్లి దుర్గవిజయము ఆముక్తమాల్యద తృతీయాశ్వాసాంతపద్యము.

"ఇదిపాత్రప్రహరేశ్వరప్రభృతిబంహిష్ఠోత్కలానీకగు
ప్తదివిస్ఫూర్జిత్పఱుయంత్రకొండపలిహృద్గ్రాహాసికద్రాజదీ
ప్యదుదారోద్యమకృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృతాముక్తమా

ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్చుగున్".

ఇందు శ్రీకృష్ణదేవరాయలు ప్రహరేశ్వరపాత్రుడు మొదలైన ఉత్కళసైనికుల గుప్తమహాయంత్రములు కల కొండపల్లిని హరించెనని కలదు. ప్రతాపరుద్రగజపతి అధీనములోని కొండపల్లిదుర్గము1516మార్చి నాటికే విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది.

పయి సింహాచలశాసనమునందే శ్రీకృష్ణదేవరాయలు "రాజమహేంద్రవరం"దుర్గమును సాధించినట్లు కలదు. ప్రతాపరుద్రగజపతి అధీనములోని రాజమహేంద్రవర దుర్గమును 1516 మార్చి నాటికే విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది.

పయి సింహాచలశాసనమునందే శ్రీకృష్ణదేవరాయలు"సింహాద్రికి విచ్చేసి"నట్లు కలదు. ఇది మనుచరిత్రమునందు ఇట్లు కలదు.

అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకుం దిగు సురప్రకరంబు కళింగమేదినీ
విభు నపకీర్తికజ్జలము వేనుఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్." 39ప.1ఆ.

ఇందలి కళింగమేదినీవిభుడు ప్రతాపరుద్రగజపతియే. కళింగవిజయము ఆముక్తమాల్యద చతుర్థాశ్వాసాంతపద్యము.

" ఇది సింహాచలదంభికేసరిపదాభీష్టార్చనాపుణ్యల
బ్ధదురుట్టంకణపొట్టునూరివిజయస్తంభోపలోట్టంకితాం
కదృఢేష్టాక్షరకృష్ణరాయనృపసంజ్ఞాస్మృత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాల్గవది హృద్యంబై మహిం బొల్చుగున్."

ఇందు శ్రీకృష్ణదేవరాయల బిరుదాంకములు చెక్కించిన విజయస్తంభమును పొట్టునూరికడ ప్రతిష్ఠించినట్లు కలదు. అది కళింగదేశవిజయమునకు ధ్వజస్తంభప్రాయమైన చిహ్నము. ప్రతాపరుద్రగజపతి అధీనములోని కళింగదేశము 1516 మార్చి ప్రాంతమున విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది.

ఇట్లు ఉదయగిరిదుర్గము మొదలు ఉత్కళదేశమువఱకు తీరాంధ్రదేశమెల్ల 1513-1516 సంవత్సరముల మధ్య విజయనగరసామ్రాజ్యమయినది. అంతేకాదు. శ్రీకృష్ణదేవరాయల పూర్వదిగ్విజయయాత్రలో తెలంగాణావిజయమును కలదు.

2-1-1517 వ తేది తిరుపతి శాసనమునందు " శ్రీవీరప్రతాపకృష్ణరాయమహా రాయలు ...... అనంతగిరి, ఉంద్రకొండ, ఆరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి, నల్లకొండ, కంభంమెట్టు, కనకగిరి, శంకరగిరి ఇవి మొదలయిన తెలుంగాణ్యపు దుర్గాలు ఏకధాటిని కైకొని"నట్లు కలదు[18]. ఇందలి అనంతగిరి, జల్లిపల్లి, కంబముమెట్టు దుర్గములతోపాటు దేవరకొండ దుర్గమును శ్రీకృష్ణదేవరాయలు జయించినట్లు పారిజాతాపహరణమునందు కలదు. (23ప. 1ఆ.) కనకగిరి జయించినట్లు మనుచరిత్రమునందు కలదు. (37ప.1ఆ.) పరాధీనమైన తెలంగాణము 1516 నాటికి విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది.

ఉదయగిరిదుర్గము 1513 వ సంవత్సరమునందు, కొండవీటిదుర్గము 1514 వ సంవత్సరమునందు, కొండపల్లిదుర్గము 1515 వ సంవత్సరమునందు, కళింగదేశము 1516 వ సంవత్సరమునందు విజయనగరసామ్రాజ్యమునందు విలీనమగును. ఆముక్తమాల్యద ప్రథమ,ద్వితీయ,తృతీయ,చతుర్థాశ్వాసాంతపద్యక్రమమునందు విజయక్రమము కలదు. పంచమ,షష్ఠ, సప్తమాశ్వాసాంతపద్యక్రమమునందును విజయక్రమము విధాయకము. పంచమాశ్వాసాంతపద్యమిది:

"ఇది యంధ్రోక్తియథార్థనామయవనాసృక్పూర్ణకెంబావివా
రిదపద్ధత్యవరోధివప్రవలయశ్రేణీవిఘాతక్రియా
స్పదసేనాగ్రదకృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బలరు హృద్యంబైనపద్యంబులన్."

ఇందు శ్రీకృష్ణదేవరాయలుమేఘముల దారికి అవరోధమైన కెంబావి కోటగోడలు కూలగొట్టిన సేనకు అగ్రగామి అని కలదు. అంతేకాదు. కెంబావి యవనరక్తము నిండి తెలుగుభాషను (కెంపు + బావి = కెంబావి = ఎఱ్ఱనిబావి) సార్థకమని కూడ కలదు. కెంబావి రాయచూరుమండలములోనిది[19]. రాయచూరు దుర్గము 1512 వ సంవత్సరమునందు విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనదని పూర్వోక్తము. అది తిరిగి సంపాదించుటకు విజాపురరాజ్యాధిపతి ఇస్మాయిల్ ఆదిల్‌ఖాను ప్రయత్నించుట సహజము. అందుకు శ్రీకృష్ణదేవరాయల కళింగ దండయాత్ర కాలము అనుకూలము. కళింగవిజయానంతరము శ్రీకృష్ణదేవరాయలకు కెంబావివిజయము సంభవము. సంభావ్యము. కాబట్టి శ్రీకృష్ణదేవరాయల కెంబావి విజయము1516 వ సంవత్సరమునందు కావచ్చును.

షష్ఠాశ్వాసాంతపద్యమిది :

"ఇది నైరామనయవనావనీధవాహినాగ్రచుంబితస్ఫుర
ద్విదితాభీలమణీగృహావళిదళనోద్వేలోగ్రహస్తిప్రజో
ద్యదనీకాగ్రగకృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మృదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్.'

ఇందు శ్రీకృష్ణదేవరాయలు నైరామనయవనాధిపతి మహోన్నతమణిగృహ ములను కూలగొట్టిన గజసైన్యమునకు అగ్రగామి అని కలదు. "నైరామన"పాఠము నకు 'నైజామన" అను పాఠాంతరకల్పనము కలదు[20]. "ఇది రాయచూరుజిల్లాలోని. మాన్వేపురమున కీశాన్యమూల నున్న గ్రామము. నైరామనమున కిప్పటి పేరు నిరుమానూరు." అని ఒక అభిప్రాయము కలదు[21]. నైరామనగ్రామనామము నిరుమా నూరు అగుట సంగతము కాదు. నైరామనయవనాధిపతి జాడ అన్వేషణీయము. తద్విజయము 1517 వ సంవత్సరము కావలయును.

సప్తమాశ్వాసాంతపద్యమిది :

"ఇది నీలాచలనీలచేలకసుభద్రేందీవరాభాక్షికో
ఱద్భృగంచద్భుజవీరధుర్యజయసన్నాహార్భటీవాద్యభీ
త్యుదితేభేశ్వరకృష్ణరాయమహిజాన్యుత్పాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బలరు హృద్యంబైన పద్యంబులన్."

ఇందుశ్రీకృష్ణదేవరాయల జగన్నాథక్షేత్రమునందలి జయసన్నాహవాద్యములకు గజపతి భయపడినట్లు కలదు. శ్రీకృష్ణదేవరాయలుప్రతాపాగ్ని "కటకపురిఁ గాల్పె గజరాజు గలఁగి పఱవ" అని మనుచరిత్రమునందు కలదు. (37ప. 1ఆ.) గజరాజు ప్రతాపరుద్రగజపతియే. శ్రీకృష్ణదేవరాయల కటకదండయాత్ర. కాలము 1519 వ సంవ త్సరము కావచ్చును. ఫలితము శ్రీకృష్ణదేవరాయలకు ప్రతాపరుద్రగజపతితో సంధి. ప్రతాపరుద్రగజపతి తనయతో వివాహము.

శ్రీకృష్ణదేవరాయలు "ఒరియారాజు కూతురును వివాహమాడిన అనంతరము. మహాసైన్యముతో- ఏబదిసంవత్సరములనుండి కప్పము చెల్లింపకుండ తిరుగుబాటు చేసిన- సామంతరాజు నెలవైన చోళమండలములోని కాటూరునగరమును ముట్టడిం చెను. నగరమును పరివేష్టించియున్న నటి వఱదనీటితో నిండియుండగా. గట్టులు తెగగొట్టించి. వఱదనీటిని వైదొలగించి. కోటలో ప్రవేశించి. ఎదుర్కొన్న లక్ష కాల్బల మును. సహస్రాశ్వదళమును హతమార్చెను." అని ఫెర్నో న్యూనిజ్ గ్రంథస్థము

చేసెను[22]. కాటూరు చెంగల్పట్టు జిల్లాపొన్నేరితాలూకాలోని కాటూరు అగును[23]. అది చోళమండలతీరస్థము. నదీపరివేష్టితము. కాటూరుయుద్ధము కాలము 1520 వ సంవత్స రము కావచ్చును.

శ్రీకృష్ణదేవరాయల మహామంత్రి సాళువ తిమ్మరుసు. అతడే శ్రీకృష్ణదేవరా యలను రత్నసింహాసనాసీనుని చేసినట్లు ఐతిహ్యము కలదు శ్రీకృష్ణదేవరాయలు మంత్రి తిమ్మరుసును అప్పాజీ అని పిలుచుట అత్యంతప్రసిద్ధము. శ్రీకృష్ణదేవరాయల భుజబలమునకు తిమ్మరుసు బుద్ధిబలము రక్షాకవచము. అయినను. శ్రీకృష్ణదేవరా యలు ఆరేళ్ళ కుమారునికి పట్టాభిషేకము చేసెనని. అతడు ఎనిమిదినెలలకే విషప్రయోగమువలన చనిపోయెనని. అది తిమ్మరుసు కొడుకు తిమ్మన చేసినట్లు విని శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసును. తిమ్మనను. తిమ్మరుసు సోదరుడు గోవిందరుసును కారాగారమునందు బంధించెనని న్యూనిజ్ గ్రంథస్థము చేసెను[24]. శ్రీకృష్ణదేవరాయలకు 1518 వ సంవత్సరమునందు కుమారుడు జన్మించెను. అతని పేరు తిరుమలరాయలు. అతడు రాజ్యము సేయుచున్నట్లు 1524 వ సంవత్స రమునందు మాత్రమే అనేకశాసనములు కలవు. 1524 నుండి1528 వఱకు శాసన ములందు తిమ్మరుసు జాడకానరాదు.1524, 1528 సంవత్సరములందు అచ్యుతదేవ రాయల శాసనములు కలవు. కావున న్యూనిజ్ గ్రంథస్థము చేసిన విషయము సత్యము కావచ్చును[25]. కాబట్టి శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము 1505-1524 మాత్రమే.

శ్రీకృష్ణదేవరాయల కాలమునందే . విజయదశమినాడు (12-9-1520) భువనవిజయభవనమును కనులార గాంచి. మనసార వివరించిన డొమింగోస్ పేయస్. అది శ్రీకృష్ణదేవరాయలు గజపతితోడి యుద్ధమునుండి తిరిగి వచ్చి. విజయచిహ్నముగ కట్టించినట్లు గ్రంథస్థము[26] చేసెను. కటకవిజయముకంటె. కొండవీటివిజయము గొప్పవిజయము. ప్రతాపరుద్రగజపతి కొడుకు వీరభద్రగజపతిని జీవగ్రాహముగాను. ప్రతాపరుద్రగజపతి రాణిని బందీగ్రాహముగాను తీసికొని. శ్రీకృష్ణదేవరాయలు విజయనగరమునకు విజయంచేసినది. అది 1514 వ సంవత్సరమునందు జరిగినది[27]. కావున భువన విజయభవననిర్మాణకాలము 1515 వ సంవత్సరము కావలయును.

## నవరత్నకవులు

శ్రీకృష్ణదేవరాయలకు నంది తిమ్మన పారిజాతాపహరణమునందు.

" భువనవిజయాఖ్యసంస
న్నవరత్నవిభాప్రభాతనలినాప్త!"

అని ఆశ్వాసాంతసంబోధనము కలదు (110ప.5ఆ.) ఇట"భువనవిజయ = భువనవిజయమనెడు. ఆఖ్య = పేరుగల. సంసత్ = సభయందలి. నవరత్నవిభా = నవరత్నములకాంతులకు.ప్రభాతనలినాప్త = బాలసూర్యుఁడైనవాఁడా!; (సూర్యోదయమునసూర్యకిరణసంబంధమున మణులు దేదీప్యమానమగుట సహజము. కృష్ణరాయలు బాలసూర్యుని పగిది నా కొలువుకూటమున వెలుంగ నమ్మణుల కపూర్వశోభ కల్గెనని భావము.)" అను టీకాతాత్పర్యములతోపాటు."కృష్ణరాయని కొలువున నష్టదిగ్గజకవులుండిరని కింవదంతి. కాని నవరత్నశబ్దసారస్యము ననుసరించి నవరత్నకవు లుండిరేమో యని యనుమానము పొడమెడి." అను విశేషార్థమును కలదు. అష్టదిగ్గజకవులుండుట కింవదంతి కాదు. యథార్థము. సమకాలికశాసనప్రమాణసహితము. అయినను నవరత్నకవులును కలరనుటకు అవకాశము కలదు.

అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు శ్రీకృష్ణదేవరాయలకు "విద్యాఖేలనభోజ" అని ఆశ్వాసాదిసంబోధనము కలదు.(1ప.2ఆ.) అంతేకాదు. "భోజక్ష్మాపతివిద్యాపరిపాక"(105ప.5ఆ.),"భోజముఖభూపవిపులాంసోత్తీర్ణితధరాభరణదీక్షితభుజా"(125ప.6ఆ.)అనికూడ ఆశ్వాసాంతసంబోధనములు కలవు. భోజరాజాస్థానమునందు నవరత్నకవులు కలరని ఒక ప్రతీతి కలదు. అపరభోజుడైన శ్రీకృష్ణదేవరాయల భువనవిజయసభయందును నవరత్నకవులు ఉండుట సంభవము. సంభావ్యము. ఉన్నట్లు ఒకరి అభిప్రాయము కలదు[28]. ఆధారము తెలుపలేదు. పై ఆధారము కాజాలదు. నవరత్నకవులే కాలక్రమమున అష్టదిగ్గజకవులు కావచ్చును.

## అష్టదిగ్గజకవులు

1527 వ సంవత్సరము నాటి తిప్పలూరు శాసనమునందు "శ్రీకృష్ణదేవరాయమహారాయలవారు అష్టదిగ్గజకవీశ్వరులకు ధారవోసి యిచ్చిన తిప్పలూరు అగ్రహారమందు దొమ్మర్లు ఇచ్చు పన్ను ఈ గ్రామమున నున్న శివ. విష్ణువుల దేవాలయముల ఆరగింపులకు సమర్పించిరి."అని కలదు[29]. ఇది శ్రీకృష్ణదేవరాయల శాసనము కాదు. ఇతరశాసనము. 1527 వ సంవత్సరమునకు పూర్వమే శ్రీకృష్ణదేవరా

యలు అష్టదిగ్గజకవులకు తిప్పలూరు అగ్రహారమిచ్చినట్లు స్పష్టము.

మఱొకనంది దుర్గాలయశాసనమునందును అష్టదిగ్గజకవుల ప్రసక్తి కలదు. కాని, ఆ శాసనము కూటశాసనము[30]. అప్రామాణికము. శ్రీకృష్ణదేవరాయల భువనవిజయసభను అష్టదిగ్గజకవులు కలరనుటకు తిప్పలూరు శాసనము తిరుగు లేని ప్రమాణము. అందలి "శాలివాహనశకవర్షములు 1450 నేంటి సర్వజిత్తు సంవత్సర శ్రావణ బ 30 సోమవారము" సరిగా 26-8-1527వతేదీ.

అష్టదిగ్గజకవుల పట్టిక కొండవీటిదండకవిలయందు కలదు[31]. అందలి కవులు1 అల్లసాని పెద్దన్న 2.భట్టుమూర్తి 3.ముక్కు తిమ్మన 4.పింగళి సూరన్న5.తెనాలి రామలింగము 6.రామభద్రకవి 7.శంకరకవి 8.ధూర్జటి. ఇందు భట్టుమూర్తి, పింగళి సూరన్న, తెనాలి రామలింగము, రామభద్రకవి అష్టదిగ్గజకవులగుటకు కాలానుకూల్యము లేదు. శంకరకవి అగుటకు ప్రమాణాంతరము లేదు. అసలు దండకవిల వృత్తాంతమే అంత ప్రమాణము కాదు. కొండవీటిదండకవిల కంటె కొంత ప్రమాణమైన విశ్వనాథస్థానాపతి రాయవాచకమునందు ఇట్లు కలదు.

> "రాయలవారుంన్ను చాలా సంతోషబడి ముక్కు తింమ్మయ్య
> అల్లసాని పెద్దయ్య మాదనగారి మల్లన మొదలైనకవీశ్వరులతో
> కృతు లంద్దుకోవలెనని ........ పారిజాతాపహరణమున్ను మను
> చరిత్రాను చెప్పుమని ఆనతిచ్చినారు." 1982ముద్రణ.పుట 80.

శ్రీకృష్ణదేవరాయలకు పారిజాతాపహరణమును అంకితమిచ్చిన నంది తిమ్మన, మనుచరిత్రమును అంకితమిచ్చిన అల్లసాని పెద్దన, రాజశేఖరచరిత్రమును గాక మఱొక కృతి అంకితమిచ్చియుండు మాదయగారి మల్లన అష్టదిగ్గజకవులగుట నిరాఘాటము. నిర్బాధకము. నిర్వివాదము.

రాయవాచకమును అనుసరించి కుమారధూర్జటి రచించిన కృష్ణరాయవిజయమునందు ఇట్లు కలదు.

> "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో
> యతులితమాధురీమహిమ నా మును మీ పెదతాత చాల స
> న్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభన్ విను మీవునట్లు మ
> త్కృతబహుమానవైఖరుల గీర్తి వహింపుము ధాత్రిలోపలన్." 29ప.పీ.

ఇది "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గె నీ యతులిత మాధురీమహిమ ? హా! తెలిసెన్" అను ప్రసిద్ధమైన చాటుపద్యమునకు ప్రతికృతి. "కృష్ణరాయల మనోజ్ఞసభను చాల సన్నుతి"గన్న ధూర్జటి అష్టదిగ్గజకవి అగుట సుకరము. అంతేకాదు. కుమారధూర్జటి కుమారుడు లింగరాజు రచించిన శ్రీకాళహస్తిమాహాత్మ్యమను మఱొక గ్రంథమునందు ఇట్లు కలదు.

" శ్రీకాళహస్తిగౌరీనాథపదపద్మ
సద్భక్తియుక్తి నిశ్చలతఁ గాంచి
సారసుధాసారసరసోక్తిగుంభనఁ
గాళహస్తిమహత్త్వకథ నొనర్చి
కృష్ణరాయకిరీటకీలితమణిగణా
ర్చితపదాబ్జద్వయశ్రీ వహించి
యాసేతుకాశితటావనీవిఖ్యాత
సత్కీర్తివిస్ఫూర్తి జాలవెలసి
ధరణిఁ జెలువొందె నే కవీశ్వరవతంస
రత్న మమ్మహనీయధూర్జటి సుధీంద్రుఁ
దలఁతు జలనిధివీచికాకలకలాను
కారిభూరికవిత్వవాక్పటిమ గులుక"

ఇందు ధూర్జటి " కృష్ణరాయకిరీటకీలితమణిగణార్చితపదాబ్జశ్రీవహించినట్లు" ఇదమిత్థముగ కలదు. అనగా శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రకవి ధూర్జటికి పాదాభివందనము చేసెనని అర్థము. అట్టి ధూర్జటి అష్టదిగ్గజకవి అగుట తథ్యము.

నంది తిమ్మన. అల్లసాని పెద్దన. మాదయగారి మల్లన. ధూర్జటి తోపాటు అయ్యలరాజు రామభద్రుడు. తెనాలి రామ(లింగ)కృష్ణుడు. పింగళి సూరన. భట్టుమూర్తి అష్టదిగ్గజకవులని జనశ్రుతి కలదు.

రామభద్రకవి అయ్యలరాజు రామభద్రుడని. పుత్తేటి రామభద్రుడని. ఇద్దఱును ఒక్కడే అని. ఇద్దఱును ఇద్దఱే అని- అభిప్రాయభేదములు కలవు. అయ్యలరాజు రామభద్రుడే పుత్తేటి రామభద్రుడని గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు కలదు. అతని రామాభ్యుదయము రచనాకాలము1555 ప్రాంతము. అప్పటికి అయ్యలరాజు రామభద్రుడు ఏబదియైదేండ్లవాడని అనుకొన్నను. శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలాంతము (1524) నాటికి సుమారు పాతికేండ్లవాడే అగును. ఆ వయస్సున

ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱీ అసంభవము. కనుక అయ్యలరాజు రామభద్రుడు అష్టదిగ్గజకవులలో ఒకడు కాడు.

సకలకథాసారసంగ్రహమని ఒక అముద్రితగ్రంథము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు కలదు. అది తాళపత్రగ్రంథము కాదు. కాగితపు ప్రతి. అందు ఆశ్వాసాంతగద్యము "రామభద్రప్రణీతం"బని కలదు. అంతేకాదు. అవతారికలో శ్రీకృష్ణదేవరాయలు అతనిని సకలకథాసారసంగ్రహము రచింపుమని ప్రార్థించినట్లు కలదు. అందు"ఎలకూచిసాహిత్యలక్షణచిత్రకవిత్వప్రభావంబులొక్కొక్కచోటంగనుపడ రచియింపవలయునని ప్రార్థించి"నట్లును కలదు. అది ఎలకూచి కాదు; ఎలకూర్చి అనుట సంగతము కాదు. ఎలకూచిసాహిత్యలక్షణచిత్రకవిత్వప్రభావమన ఎలకూచి బాలసరస్వతి సాహిత్యమునకు లక్షణమైన చిత్రకవిత్వముయొక్క ప్రభావమని అర్థము వచ్చును. రామాభ్యుదయమును రచించిన అయ్యలరాజు రామభద్రుడు కౌండిన్యస గోత్రుడు. సకలకథాసారసంగ్రహమును రచించిన రామభద్రుడు కాశ్యపసగోత్రుడు. గోత్రభేదము లేఖకప్రమాదము కాదు. అంతేకాదు. సకలకథాసారసంగ్రహమునందు అల్లసాని పెద్దన మనుచరిత్రములోని పద్యములకు, కనపర్తి అబ్బయామాత్యుని కవిజనమనోరంజనములోని, శేషము వేంకటపతి శశాంకవిజయములోని ప్రసిద్ధపద్యములకు అనుకరణము కలదు. ఎలకూచి బాలసరస్వతి [32] కాలము పదునేడవశతాబ్ది. కనపర్తి అబ్బయామాత్యుని కాలము పదునెన్మిదవశతాబ్ది. శేషము వేంకటపతి కాలమును పదునెన్మిదవశతాబ్దియే. కనుక సకలకథాసారసంగ్రహకర్త రామభద్రుని కాలము పదునెన్మిదవశతాబ్ది తుది కావలయును. పదునెన్మిదవశతాబ్ది తుది రామభద్రుని, పదునాఱవశతాబ్ది తొలి శ్రీకృష్ణదేవరాయలు ప్రార్థించుట అబద్ధము. రామభద్రుని కథనమెల్ల అసంబద్ధము. సకలకథాసారసంగ్రహము కూటసృష్టి. కూటసృష్టికర్త రామభద్రుడు అష్టదిగ్గజకవులలో ఒకడగుట అత్యంతాసంభవము. అటు రామాభ్యుదయకర్త అయ్యలరాజు రామభద్రుడు కాని, ఇటు సకలకథాసారసంగ్రహకర్త రామభద్రుడు కాని అష్టదిగ్గజకవి కాడు.

తెనాలిరామలింగడే తెనాలిరామకృష్ణుడు.[33] తెనాలి రామలింగడు రచించినట్లు ఉద్భటారాధ్యచరిత్రము కలదు. తెనాలి రామకృష్ణుడు రచించినట్లు పాండురంగమాహాత్మ్యము కలదు. అందును, ఇందును గోత్రము, శాఖ, జననీజనకులు సమానము. కౌండిన్యసగోత్రము. శుక్లయజుర్వేదశాఖ. తండ్రి రామయ. తల్లి లక్ష్మమ. లక్కమాంబ అని ఉద్భటారాధ్యచరిత్రమునందు కలదు. లక్ష్మమ అని పాండురంగమాహాత్మ్యము నందు కలదు. ఇది సి. ర్తమముగ రామయకు ఇద్దఱు భార్యలని, లక్కమాంబ కొడుకు

రామలింగము, లక్ష్మమ కొడుకు రామకృష్ణుడు అనికక విపరీతవాదము కలదు.[34] అది కేవలము అవిచారమూలకము. ఊహాగానము. లక్ష్మమ ప్రకృతి. లక్కమాంబ వికృతి. అంతేకాదు. ఇద్దఱు భిన్నులైనచో. తెనాలిరామభద్రకవి ఇందుమతీపరిణయ ములోని పద్యమునందు ఇద్దఱును ఉందురు. కాని లేరు. తెనాలి రామకృష్ణుడే కలడు. తెనాలి రామలింగడు లేడు. ఆ పద్యమిది:

" క్రౌఢి మీ పెదతాత పాండురంగాదిస
త్కృతులు చేసెనురామకృష్ణసుకవి
యనుజుఁ డన్నప్ప మీ పినతాత రచియించెఁ
బరఁగ సుదక్షిణాపరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీవిఖ్యాతి
శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చెఁ
గడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణార్యుఁ
డనఁ గీర్తిఁ గనె సంస్కృతాంధ్రములను
వారలను మించె మీ యన్న వీరరాఘు
వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
ని న్ననూచాన సంతాను నెన్నఁ దరమె
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి!" 22ప.1ఆ.

తెనాలి రామభద్రసుకవి అన్న వీరరాఘవకవి. తండ్రి ఇమ్మడి రామకృష్ణుడు. తాత శ్రీగిరి. పినతాత అన్నయకవి. పెదతాత రామకృష్ణుడు. పాండురంగాదిసత్కృతికర్త. అతని అనుజుడు అన్నయ. రామలింగడు అగ్రజుడని లేదు. రామలింగడు రామకృష్ణుడే. ఉద్భటారాధ్యచరిత్రము రచనాకాలము స్థూలముగ 1530 వ సంవత్సరము. పాండురంగమాహాత్మ్యము రచనాకాలము స్థూలముగ 1575వ సంవత్సరము. ఘటికాచలమాహాత్మ్యము రచనాకాలము1580 ప్రాంతము. అది తెనాలి రామ(లింగ)కృష్ణుని చరమకాలము. జననకాలము 1500 ప్రాంతమగును. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలాంతము నాటికి (1524) తెనాలి రామ(లింగ)కృష్ణుడు కూడ సూమారు పాతికేండ్లవాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱి అసంభవము. కాబట్టి తెనాలి రామ(లింగ)కృష్ణుడు కూడ అష్టదిగ్గజకవులలో ఒకడు కాడు.

పింగళి సూరన రాఘవపాండవీయము రచనాకాలము 1550 ప్రాంతము.

కళాపూర్ణోదయము రచనాకాలము 1565 కావలయును. ప్రభావతీప్రద్యుమ్నము రచనాకాలము 1585 ప్రాంతము కావలయును. పింగళి సూరన చరమకాలము1585 ప్రాంతము కావచ్చును. జననకాలము 1515 ప్రాంతమగును. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలాంతము నాటికి (1524) పింగళి సూరన కూడ సుమారు పదేండ్లవాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే అసంభవము. అష్టదిగ్గజకవి అగుట అత్యంతాసంభవము. కాబట్టి పింగళి సూరన సహితము అష్టదిగ్గజకవులలో ఒకడు కాడు.

భట్టుమూర్తి నరసభూపాలీయము రచనాకాలము 1560 ప్రాంతము. వసుచరిత్రరచనాకాలము. 1571 వ సంవత్సరము. హరిశ్చంద్రనలోపాఖ్యానము రచనాకాలము 1575 ప్రాంతము కావచ్చును. భట్టుమూర్తి చరమకాలము 1580 ప్రాంతము కావలయును. జననకాలము 1500 ప్రాంతమగును. కనుక శ్రీకృష్ణదేవ రాయల ప్రాభవకాలాంతము నాటికి (1524) భట్టుమూర్తి కూడ సుమారు పాతికేండ్ల వాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱి అసంభవము. కాబట్టి భట్టుమూర్తి సైతము అష్టదిగ్గజకవులలో ఒకడు కాడు.

కందుకూరి రుద్రయ నిరంకుశోపాఖ్యానము రచనాకాలము స్థూలముగ 1570 ప్రాంతము కావలయును. రాష్ట్రౌఢవంశమహాకావ్యమునందలి స్కందపురరుద్రకవి కందుకూరి రుద్రకవి అని ఒక అభిప్రాయము కలదు.[35] రాష్ట్రౌఢవంశమహాకావ్యము రచనాకాలము 1536 వ సంవత్సరమని అందే కలదు. అయిన రుద్రకవి జననకాలము 1505 ప్రాంతమగును. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలాంతము నాటికి (1524) కందుకూరి రుద్రయ సుమారు ఇరువదేండ్లవాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱి అసంభవము. కాబట్టి కందుకూరి రుద్రకవి కూడ అష్టదిగ్గజకవులలో ఒకడు కాడు.

శ్రీకృణదేవరాయల ప్రాభవాంతకాలమునకు (1524) ఇరువది, పాతిక సంవత్సరముల వయస్సు కల అయ్యలరాజు రామభద్రుడు, తెనాలి రామ(లింగ) కృష్ణుడు: పింగళి సూరన, కందుకూరి రుద్రయ భువనవిజయభవననిర్మాణ కాలమునకు పది, పదియేను సంవత్సరముల వయస్సు కల వారగుదురు. అట్టి వారు భువనవిజయసభను (1515-1524) అష్టదిగ్గజకవు లగుట దుర్ఘటము. మండ లక్ష్మీనరసింహాచార్యుల ఆంధ్రకౌముదియందు "ముప్రత్రయాభావస్య అల్లసాని పెద్దనార్యశిష్యేణ

భట్టుమూర్తిమహాకవినా విరచితే వసుచరిత్రే" అని కలదు. భట్టుమూర్తి అల్లసాని పెద్దన శిష్యుడగును. పింగళి సూరన అల్లసాని పెద్దన మనుమరాలి భర్త కావచ్చును.

నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి-ఈ నలుగురు కాక, మఱి కడమ అష్టదిగ్గజకవులు ఎవరు?

భట్టుమూర్తికి రామరాజభూషణబిరుదనామము కలదు. వసుచరిత్ర ఆశ్వాసాంత గద్యను "సాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతంబైన" అని కలదు. హరిశ్చంద్ర నలోపాఖ్యానము పద్యమునందు "రామనృపభూషణసుకవి" అని కలదు. (53ప.పీ.) అనగా రామరాజు ఆస్థానమునకు ఆభరణము వంటివాడని అర్థము. రామరాజు ఆస్థానమునందు ప్రముఖకవి అని తాత్పర్యము. రామరాజన శ్రీకృష్ణదేవరాయల అల్లుడైన అళియరామరాయలు. అళియరామరాయల సోదరుడు తిరుమలరాయలకు వసుచరిత్ర అంకితమిచ్చినను, అంతకు పూర్వము భట్టుమూర్తి అళియరామరాయల ఆస్థానమునందు ప్రముఖకవి కానిదే రామరాజభూషణబిరుదనామము లభింపదు. కనుక భట్టుమూర్తి అళియరామరాయల ఆస్థానమునందును ప్రముఖకవి. ఇది సర్వసమ్మతము. మఱి భట్టుమూర్తి తండ్రికి వేంకటరాయభూషణబిరుదనామమే కలదు. ఇది భట్టుమూర్తి తెలిపిన సంగతి.

"-అమితయమకాళిసిద్ధి ప్రబంధాంకసింగ
రాజసుత తిమ్మరాజపుత్త్రప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్త్రు
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు" 13ప.1ఆ.

ఇట్లు కావ్యాలంకారసంగ్రహమునందు కలదు. ఇందు ప్రబంధాంకము సింగరాజు కొడుకు తిమ్మరాజు అని, తిమ్మరాజు కొడుకు ప్రసిద్ధుడైన, సరసుడైన వేంకటరాయభూషణుడని, వేంకటరాయభూషణుని కొడుకు భట్టుమూర్తి అని కలదు. వేంకటరాయభూషణునకు నామధేయము లేదు. బిరుదనామమే కలదు. అనగా అతడు బిరుదనామప్రసిద్ధుడని అవగాహనమగును. వేంకటరాయభూషణుడు వేంకటరాయల ఆస్థానమునందు ప్రముఖకవి కానిదే, వేంకటరాయభూషణబిరుదనామము కలుగదు. వేంకటరాయలు అచ్యుతదేవరాయల తనయుడు. అళియరామరాయలకు పూర్వము విజయనగరసామ్రాజ్యాధిపతి. ఇట్లు అచ్యుతరాయభూషణబిరుదనామప్రసిద్ధుడును ఉండవచ్చును. ఉన్నట్లు ప్రమాణము లేదు. కాని, కృష్ణరాయభూషణబిరుద నామ ప్రసిద్ధుడు కలడనుటకు ప్రమాణము కలదు.

"సకలసత్కవిపూజ్యసుకవిత్వసామ్రాజ్య
నిర్వాహకుఁడు పెద్ద పర్వతన్న
వివిధభాషావాక్యవిరచనాచాతుర్య
సర్వంకషుఁడు బోడి పర్వతన్న
వరపద్యదాకారవాచాచమత్కార
నిరుపమమతిశాలి తిరుమలన్న
యవధానకృతిగర్భకవితాచ్ఛసందర్భ
కీర్తితప్రజ్ఞుండు కేశవన్న
దనకు నన్నలు గాఁగను దనరు కృష్ణ
రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజపర్వతాధీశవేంక
టాద్రి నిదె కావ్య మేనిత్తు నంకితముగ."

ఇట్లు పైడిమఱ్ఱి వేంకటపతి చంద్రాంగదచరిత్ర అవతారికయందు కలదు. ఇందు వేంకటపతి తండ్రి పర్వతరాజు, తాత కేశవరాజు, ముత్తాత రామరాజు, మూలపురుషుడు కృష్ణరాయభూషణుడు అని కలదు. కావ్యాలంకారసంగ్రహమునందు వేంకటరాయ భూషణునికి నామధేయము లేనట్లే చంద్రాంగదచరిత్రయందు కృష్ణరాయభూషణునికి కూడ నామధేయము లేదు. బిరుద నామమే కలదు. అనగా ఇతడును బిరుదనామ ప్రసిద్ధుడని అవగాహనమగును. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు ప్రముఖకవి కానిదే, కృష్ణరాయభూషణబిరుదనామము కలుగదు. అతడు కృష్ణరాయ బిరుదనామ ప్రసిద్ధుడుకానిదే పైడిమఱ్ఱి వేంకటపతి వంశము కృష్ణరాయభూషణ కులము కాదు. వేంకటపతి కాలము స్థూలముగ 1700 ప్రాంతము. అతని ముత్తాత రామరాజు కాలము స్థూలముగ 1600 ప్రాంతమగును. తన్మూలపురుషుడు కృష్ణరాయభూషణుని కాలము శ్రీకృష్ణదేవరాయల కాలమగును. కావున కృష్ణరాయభూషణుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు ప్రముఖకవి అగును. అంతేకాదు. రామరాజ భూషణ, వేంకటరాయభూషణ బిరుదనామములకు కృష్ణరాయభూషణబిరుదనామమే ఆదర్శమగును. శ్రీకృష్ణదేవరాయలే అట్టి బిరుదనామమును పొదుకొల్పుట. అది అచ్యుతదేవరాయలు, వేంకటరాయలు, అళియరామరాయలు అనుసరించుట సుసంగతమగును. అట్టి కృష్ణరాయభూషణుడు అష్టదిగ్గజకవులలో ఒకడు.

నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి, కృష్ణరాయ భూషణుడు అష్టదిగ్గజకవులు. అయిదుగురును ఆంధ్రకవులు. అష్టదిగ్గజకవులు

ఎనమండుగురును ఆంధ్రకవులే కావలసిన ఆవశ్యకము లేదు. అక్కఱ లేని ఆవశ్యకము కలదు. విజయనగరసామ్రాజ్యము కేవలాంధ్రదేశము కాదు. తమిళకర్ణాటాంధ్రదేశము. "సకలభాషలకును జనని సంస్కృతము." కాబట్టి సంస్కృతకర్ణాటతమిళకవులును అష్టదిగ్గజకవులందు భాగస్వాములగుట భాగధేయము.

శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకమహోత్సవము రాయవాచకమునందు వర్ణింపబడినది. అందిట్లు కలదు.

> "- నగరి విద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషాకవిత
> కృష్ణావధానులు శాబ్దికం పాండిత్యం వెంకటరామశాస్త్రుర్లు సహస్రావధాని
> ప్రభాకరశాస్త్రుర్లు జోస్యులు కవీశ్వరులు మరిన్ని గలిగిన పిన్న పెద్దలు
> అందరున్ను శుభముహూర్తమందలి కృష్ణరాయలవారికి మంగళస్నానం
> చేయించి-"

ఇందు శ్రీకృష్ణదేవరాయలకు మంగళస్నానము చేయించినవారు అతిముఖ్యులు. అముఖ్యులు కారు. వారిలో "అష్టభాషాకవిత కృష్ణావధానులు" ఒకడు. అతడు అష్టభాషాకవితావిశారదుడని విశేషణార్థము. సంస్కృతము. ప్రాకృతము. శౌరసేని. మాగధి. పైశాచి. చూళికాపైశాచి. అపభ్రంశము. ఆంధ్రము- అష్టభాషలు. అష్టభాషాకవితావిశారదులు ప్రాధాన్యవిపక్షను సంస్కృతకవులు. కృష్ణావధానులు సంస్కృతకవి. అతడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవిగ కొనసాగును. అష్టదిగ్గజకవులలో ఒకడు. అతడు సంస్కృతకవి.

ప్రతాపరుద్రగజపతి ఆస్థానకవి లొల్ల లక్ష్మీధరుడు. కటకదండయాత్రానంతరము శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి. కృష్ణావధానులు పట్టాభిషేకసమయమునందే శ్రీకృష్ణదేవరాయలు ఆస్థానకవి. అతడు పరస్థలాగతుడు. ఇతడు పరంపరాగతుడు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవులలో తిమ్మణ్ణ ఒకడు. చాటువిట్ఠలనాథుడు మఱొకడు. ఇద్దఱును కన్నడకవులు. తిమ్మణ్ణ కర్ణాటకవికులసార్వభౌమబిరుదాంకితుడు. శ్రీకృష్ణదేవరాయల ఆదేశానుసారము కుమారవ్యాసభారతమునకు ఉత్తరభాగము రచించి. "కృష్ణరాయభారత" అని పేరు పెట్టి. 1510వ సంవత్సరమునందే శ్రీకృష్ణదేవరాయలకు అంకితమిచ్చెను. చాటువిట్ఠలనాథుడు కుమారవ్యాసుడు సంగ్రహముగ అనువదించినమహాభారతములోని పౌలోమ. ఆస్తీకపర్వములను మఱల విపులముగ అనువదించెను. అంతేకాదు. భాగవతమును అనువదించెను.

కన్నడభాగవతమునందు శ్రీకృష్ణదేవరాయలను. అచ్యుతదేవరాయలను ప్రశంసించిన పద్యములు కలవు. కర్ణాటకవికులసార్వభౌమబిరుదాంకితుడైన తిమ్మణ్ణ. కన్నడభాగవతకర్త చాటువిఠ్ఠలనాథుడు. ఇద్దఱును అష్టదిగ్గజకవులగుదురు. కాబట్టి తిమ్మణ్ణ. చాటువిఠ్ఠలనాథుడు అష్టదిగ్గజకవులలో ఇద్దఱు కన్నడ కవులు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవులలో హరిదాసు ఒకడు. అతడు తమిళకవి. శైవ. వైష్ణవ సమయములు రెండును వివరించు ఇరుసమయవిళక్కమ్ అను గ్రంథమును వైష్ణవము మీద మొగ్గుతో రచించెను. అతడు అష్టదిగ్గజకవి అగును. తమిళకవి.

నంది తిమ్మన. అల్లసాని పెద్దన. మాదయగారి మల్లన. కృష్ణరాయభూషణుడు ఆంధ్రకవులు అయిదుగురు. కృష్ణావధానులు సంస్కృతకవి ఒకడు. తిమ్మణ్ణ. చాటువిఠ్ఠలనాథుడు కన్నడకవులు ఇద్దఱు. హరిదాసు తమిళకవి ఒకడు. మొత్తము తొమ్మండుగురు నవరత్నకవులు. ఒకరి అభావమున అష్టదిగ్గజకవులు. తమిళకవి అభావము [36] చరిత్రకు అనుకూలము.

# నంది తిమ్మన

నంది తిమ్మన సకలవిద్యాచతురుడు. మలయమారుతకవీంద్రునకు (ఘంట సింగన) మేనల్లుడు. కృష్ణరాయక్షితీశకరుణాసమాలబ్ధచతురంతయానమహాగ్రహార సన్మానయుతుడు. శివపరాధీనమతి. అఘోరశివగురుశిష్యుడు. (108ప.5ఆ. పారిజాతాపహరణము) శ్రీకృష్ణదేవరాయల భార్య తిరుమలదేవి వంక అరణపుకవి అని ప్రసిద్ధుడు.

నంది తిమ్మనకు ముక్కు తిమ్మన అను వ్యవహారనామము కలదు. అందుకు హేతువు. భట్టుమూర్తి వసుచరిత్రలోని గిరికాదేవి ముక్కునువర్ణించిన" నానాసూనవితానవాసనల అను పద్యము (46a;.2".) నంది తిమ్మన ప్రాయుట అని ఐతిహ్యము కలదు. ఆ పద్యమునకు మూలభూతమైన శ్లోకము పదునాల్గ వశతాబ్ది అగస్త్యుని నలకీర్తికౌముది అను కావ్యమునందు కలదు. ఆ శ్లోకమిది:[37] —

" భృంగా నవాప్తి ప్రతిపన్నఖేదా
కృత్వా వనే గంధఫలీ తపోలం
తన్నాసికాభూ దనుభూతగంధా
స్వపార్శ్వనేత్రీ కృతభృంగసేవ్యా."

ఇది నిమిత్తముగ "నానాసూనవితానవాసనల" అను పద్యమును భట్టుమూర్తి రచించుట అసంభవము కాదు. కాబట్టి ఐతిహ్యము కల్పితమే. తిమ్మన ముక్కు పొడవైనముక్కు తిమ్మన అనుట లోకసహజము.

నంది తిమ్మన కృతులు 1. పారిజాతాపహరణము. 2. వాణీవిలాసము. మొదటిది ఉపలబ్ధము. రెండవది అనుపలబ్ధము. అది నంది తిమ్మన రచించినట్లు కూచిమంచి వెంకటరాయని కవిమనోరంజనియందు కలదు.[38]

## కాలము

తిమ్మన శ్రీకృష్ణదేవరాయలను వర్ణించిన ఒక అవతారికపద్యమిది:

" ఉదయాద్రి వేగ యత్యుద్ధతి సాధించెఁ

వినుకొండ మాటమాత్రన హరించె
గూటము ల్సెదరంగ కొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండ యుద్వృత్తి భంగము సేసె
జల్లిపల్లి సమగ్రశక్తి డులిచెఁ
గినుక మీఱ ననంతగిరి క్రిందుపడఁజేసెఁ
గంబంబుమెట్టు గ్రక్కనఁ గదల్చె
బలనికాయము కాలిమట్టులనె యడంచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు." 23ప.1ఆ.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు ఉదయగిరి, వినుకొండ, కొండవీడు, బెల్లముకొండ, దేవరకొండ, జల్లిపల్లి, అనంతగిరి, కంబముమెట్టు జయించినట్లు కలదు. కటకమును జయించినట్లు లేదు. కటకమునుకూడ శ్రీకృష్ణదేవరాయలు జయించునేమో అని ఉత్కళదేశాధిపతి(ప్రతాపరుద్రగజపతి) భయపడుచున్నట్లు మాత్రమే కలదు.

ఒక ఆశ్వాసాంతపద్యమిది:

" చండతరమూరురాయర
గండమహోబిరుద! ధాటీకారయవిచల
త్కొండపలికొండవీటీ
మండల! కటకేశసింధుమందరకుధరా!" 93ప.4ఆ.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు కొండవీడు, కొండపల్లి జయించినట్లు ఇదమిత్థముగ కలదు.[39] మూరురాయరగండబిరుదము అనువంశికము. రెండవ ప్రౌఢదేవరాయలకు కలదు. కటకేశసింధుమందరకుధరుడన కటకాధిపతి అయిన ప్రతాపరుద్రగజపతి అంతర్మథనము కలవాడని ఆంతర్యము. కటకమును కూడ జయించునేమో అను భయమే అంతర్మథనము. కారణము శ్రీకృష్ణదేవరాయల కళింగవిజయము. కావున పారిజాతాపహరణము రచనాకాలము కళింగదండయాత్రానంతరము. కటకదండయాత్రపూర్వము కావలయును. కళింగవిజయకాలము 1516 వ సంవత్సరము కటకదండయాత్రాకాలము 1519 ప్రాంతము. కాబట్టి పారిజాతాపహరణము రచనాకాలము స్థూలముగ 1517 వ సంవత్సరము.

# పారిజాతాపహరణము

నంది తిమ్మన పారిజాతాపహరణము రచించుటకు కారణముగ ఒక ఐతిహ్యము కలదు.[40]

" ఒకప్పుడు తిరుమలదేవి కృష్ణరాయల కంటె ముందుగ శయనింపనేఁగి-రాజుకంటె రాణి ముందుగా జని నిద్రించునెడల. రాజు పరుండుశయ్యపై నాతని పాదములుండు తావునం దన శిరముంచి పండుకొను- ఆచారప్రకారముగ నిద్రించెనఁట. రాజకార్యసమాలోచనము ముగించుకొని కృష్ణరాయలు పరుండబోయి నిద్రించుచున్న తిరుమలదేవిని లేపకయే తాను నా శయ్యయందే పరుండి నిద్రించెనఁట! నిద్రలో నుండగా బంగారుటందియలతోనున్న తిరుమలదేవి పాదము కృష్ణరాయని శిరమునకుఁ దగుల నాతఁడు లేచి యామె బుద్ధిపూర్వకముగనే యట్లు చేసియుండునని శంకించి యామెపైఁ గ్రోధము వహించి నాఁటనుండియు నామెతో సహశయ్యాసంభాషణాదులను వర్జింపఁ దిరుమలదేవి తన నిర్దోషిత్వమును రాయలకు విన్నవించియు నాతని యనుగ్రహమును సంపాదింపఁజాలక పోయెనఁట! అరణపుగవి యగు నంది తిమ్మయ దాసీజనమూలమున నీ యుదంతమును విని పారిజాతాపహరణకావ్యమును రచియించి కృష్ణరాయల కంకితమొనర్చి యా గ్రంథమును గవిపండితబంధుసామంతసమక్షమున మహాసభలోఁ జదివి వినిపించినప్పుడు. సత్యభామ కోపోద్దీపితయై తనకు నమస్కరించుచున్న శ్రీకృష్ణుని యుత్తమాంగము నెడమకాలితోఁ దలఁగంద్రోచిన ... కథ పట్టును .. విని రాయ లద్దానిని మరలఁ జదువుమని హెచ్చరించి విని సంతసించి యానాఁటికి సభ చాలించెనఁట . ఆనాఁటినుండియు రాజామెను మరల నాదరించి పూర్వము వలె గౌరవించెనఁట"

ఇందు సత్యము కలదనుటకు సాధనములు కలవు. అవి: 1.తిమ్మన సంకల్పము. 2. ప్రథమాశ్వాసాంత. ద్వితీయాశ్వాసాద్యంతపద్యములు. 3.అమూలకరచనము.

1. పారిజాతాపహరణము శ్రీకృష్ణదేవరాయలకు అంకితము. అయినను శ్రీకృష్ణదేవరాయలు నంది తిమ్మనను పారిజాతాపహరణమును రచింపుమన్నట్లు అవతారికయందు లేదు. అల్లసాని పెద్దన మనుచరిత్రమును శ్రీకృష్ణదేవరాయలకు అంకితము. అందు శ్రీకృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనను మనుచరిత్రమును రచింపుమన్నట్లు కలదు. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద వేంకటేశ్వరునకు

అంకితము. అందు శ్రీకాకుళాంధ్రవల్లభుడు శ్రీకృష్ణదేవరాయలను ఆముక్తమాల్యదను రచింపుమన్నట్లు కలదు. కావున పారిజాతాపహరణము రచించుట నంది తిమ్మన సంకల్పము.

2. పారిజాతాపహరణములోని ప్రథమాశ్వాసాంతపద్యమిది :

"ప్రతివర్షవసంతోత్సవ
కుతుకాగతసుకవినికరగుంభితకావ్య
స్మృతిరోమాంచవిశంకిత
చతురాంతఃపురవధూప్రసాదనరసికా! 139ప.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు- ప్రతిసంవత్సరము వసంతోత్సవము సేయునెడ సంతోషాతిశయముతో వచ్చు సుకవులు కూర్చిన కావ్యముల స్మరణమున కలిగిన రోమాంచమును మిక్కిలి శంకించిన చతురలైన అంతఃపురాంగనల యెడ ప్రసన్నుడగుటయందు రసికుడు అని కలదు. "అంతఃపురవధూప్రసాదనరసికా" అను పంక్తిని తిరుమలదేవి యెడ ప్రసన్నుడగుట ప్రతీయమానము.

ద్వితీయాశ్వాసాదిపద్యమిది :

"శ్రీసదనలోచనాబ్జద
యాసారమరందపోషితార్థిభ్రమరో
ల్లాసగుణమలయకూట
ప్రాసాదనివేశ! కృష్ణరాయమహీశా."

ఇందు శ్రీకృష్ణదేవరాయలు మలయకూటప్రాసాదమునందు నివసించుట కలదు. మలయకూటము తిరుమలదేవి ప్రాసాదము. అదే శ్రీకృష్ణదేవరాయల నివాసము కాదు. అయినను "మలయకూటప్రాసాదనివేశ" అనుటవలన పారిజాతాపహరణప్రథమాశ్వాసకథాశ్రవణమున మొదట నిరాకరించిన మలయకూటప్రాసాదమునందు మఱల నివసించుట వ్యక్తమగును.

ద్వితీయాశ్వాసాంతపద్యమిది :

"తిరుమలదేవీవల్లభ!
కరుణామయహృదయ! రాజకంఠీరవ! యీ
శ్వరనరసభూపురందర

వరనందన బాసదప్పవరగండాంకా!" 105ప.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు తిరుమలదేవీవల్లభుడని కలదు. చతుర్థాశ్వాసాది పద్యమునందు చిన్నమదేవీజీవితనాయకుడని కలదు. మనుచరిత్ర అవతారికయందు శ్రీకృష్ణదేవరాయల దేవేరులు చిన్నాదేవి, తిరుమలదేవి అని కలదు. ఆముక్తమాల్యద అవతారికయందు తిరుమలదేవి, అన్నపూర్ణాదేవి అని కలదు. పారిజాతాపహరణములోని అవతారికయందుగాక ద్వితీయాశ్వాసాదిపద్యమునందు తిరుమలదేవిమలయ కూటప్రాసాదము, ద్వితీయాశ్వాసాంతపద్యమునందు తిరుమలదేవీ వల్లభత్వము ప్రసక్తమగుట ప్రథమాశ్వాసకథకు సంబంధించిన ఐతిహ్యమును బలపఱుచును.

3. పారిజాతాపహరణములోని పాదతాడనము సంస్కృతహరివంశమునందు లేదు.[41] తదనుసారి రుద్రభట్టు కన్నడజగన్నాథవిజయమునందును లేదు.[42] అది కేవలము నంది తిమ్మన స్వతంత్రకల్పనము.' ఇది పై ఐతిహ్యములోని పాదతాడనప్రభావమే అగును.

ఈ మూడు సాధనములనుబట్టి పై ఐతిహ్యమునందు సత్యము కలదని స్పష్టమగును. కాబట్టి పై ఐతిహ్యము నంది తిమ్మన పారిజాతాపహరణము రచించుటకు కారణము కాగలదు.

## మూలము

నంది తిమ్మన పారిజాతాపహరణమునందు ఇట్లు కలదు.

"జనమేజయనృపవల్లభుఁ
డనుదినమును హరికథాసుధాస్వాదమునం
దనివిసనక వైశంపా
యనముని కిట్లనియెఁ గౌతుకాయత్తమతిన్.35
హరివంశకథలెల్ల నానుపూర్విగ నిట్లు
విని కృతార్థుఁడనైతి మునివరేణ్య
యా దానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యా యదువంశమున జనించి
యతఁడు గ్రమ్మఱ వారి కాధారమగు పారి
జాతంబు పుడమి కేరీతిఁ దెచ్చె

> ననుమతి నిచ్చిరో యా వేల్పులొండేని
> బలిమిఁ జేకొనియెనో పొంది దొఁగఁగి
> తెలియ నానతియుమ్ము సందియము దీఱ
> వినఁగ వేడుకయయ్యె సవిస్తరముగ
> ననిన నా వ్యాసమునిశిష్యుఁ డతనితోడ
> నధిప వినుమని పలికె సత్యాదరమున." 36ప.1ఆ.

ఇందు జనమేజయుడు శ్రోత. వైశంపాయనుడు వక్త. శ్రోత జనమేజయుడు ప్రశ్నలు వేయుట, వక్త వైశంపాయనుడు సమాధానములు చెప్పుట భారతమునందే కలదు. భారతపరాంశమైన హరివంశమునందును కలదు. పారిజాతాపహరణవృత్తాంతము సంస్కృతహరివంశమునందు కలదు. అది ద్వివిధము.[43] మొదటి విధము ఎఱ్ఱన హరివంశమునందు కలదు. రెండవ విధము లేదు. కారణము ద్వైవిధ్యమే కావచ్చును. ఎఱ్ఱన హరివంశమునందు లేనిది తిమ్మన పారిజాతాపహరణమునకు మూలము. అంతేకాదు. విష్ణుపురాణములోని పారిజాతాపహరణవృత్తాంతమును ఇంచుక మూలమే. అయినను కన్నడములోని రుద్రభట్టు జగన్నాథవిజయము మూలమని ఒక అభిప్రాయము కలదు.[44] కన్నడములోనిదే కనకదాసు హరికథాసారము మూలమని మఱొక అభిప్రాయము కలదు.[45] సంస్కృతహరివంశమునందు లేకుండ జగన్నాథ విజయమునందు కల అంశములు పారిజాతాపహరణమునందు లేవు.[46] జగన్నాథవిజ యమునకును మూలము సంస్కృతహరివంశమే. కనకదాసు, పురందరదాసు సమకాలికులు.[47] పురందరదాసు కాలము[48] 1484-1564. కనకదాసు కాలమును అదే. పారిజాతాపహరణము పూర్వకావ్యము. హరికథాసారము తర్వాతికావ్యమును అగును. హరికథాసారమునకును మూలము సంస్కృతహరివంశమే అగును. జగన్నాథవిజయమును కావచ్చును. కాబట్టి హరికథాసారమును పారిజాతాపహరణమునకు మూలము కాజాలదు.

హరికథాసారమునకు, జగన్నాథవిజయమునకు మూలమైన సంస్కృతహరివంశములోని ద్వితీయపారిజాతాపహరణవృత్తాంతము ప్రక్షిప్తమైనను, అది జగన్నాథవిజయము కంటె పూర్వమే ప్రక్షిప్తమగును. ఎఱ్ఱన హరివంశము పదునాల్గవశతాబ్ది పూర్వార్ధములోని గ్రంథము[49] కాని, రుద్రభట్టు జగన్నాథవిజయము పదమూడవశతాబ్ది పూర్వార్ధములోని గ్రంథము.[50] ఎఱ్ఱన ద్వితీయపారిజాతాపహరణవృత్తాంతమును తెనిగింపకపోవుటకు హేతువు ద్వైవిధ్యమే అగును.

సంస్కృతహరివంశములోని ప్రథమపారిజాతాపహరణవృత్తాంతమునందు శ్రీకృష్ణుడు పారిజాతవృక్షమును పెకలించిన సంగతి విని దేవేంద్రుడు అనుమతించి నట్లు కలదు. ఎఱ్ఱన హరివంశమునందు "ఒడంబడియున్" (221ప.)

" మనసు పట్టు లేక యనిమిషకోటితో
నరిగి యాతని దాఁ కి యని యొనర్చి
వజ్ర మాతని మీద వైచి తద్వేగసం
స్తంభనమున మదము దక్కి స్రుగ్గి " 224ప.4ఆ.ఉ.భా.

ఒడబడినట్లు కలదు. దేవేంద్రుడు యుద్ధము చేయుట ద్వితీయపారిజాతా పహరణవృత్తాంతమునందు కలదు. అది ఎఱ్ఱన తెనుగుసేతను పొడసూపినది. ఇది ద్వితీయ పారిజాతాపహరణవృత్తాంతము ఎఱ్ఱన నాటికే సంస్కృతహరివంశమునందు కలదనుటకు సాధకము.

సంస్కృతహరివంశములోనిద్వితీయపారిజాతాపహరణవృత్తాంతమునందుశ్రీకృష్ణుడు పారిజాతవృక్షము కొఱకు ప్రద్యుమ్నుని. దారకుని రథము మీద రమ్మని. తాను. సాత్యకి గరుడవాహనము మీద అమరావతికి వెడలినట్లు కలదు. ప్రథమపారిజాతాపహరణవృత్తాంతమునందు సత్యభామతోనే గరుడవాహనము మీద వెడలినట్లు కలదు. ఇట్లు పారిజాతాపహరణమునందు కలదు. ఇది నంది తిమ్మన ప్రథమపారిజాతాపహరణవృత్తాంతమును పరిగణించుటకు నిదర్శనము.

సత్యభామ శచీదేవితో పందెము నఱచినట్లు తిమ్మన పారిజాతాపహరణము నందు కలదు. ఇది సంస్కృతహరివంశమునందు నిరవకాశము. ఇట్లు విష్ణుపురాణమునందు కలదు. కనుక తిమ్మన పారిజాతాపహరణమునకు విష్ణుపురాణమును ఇంచుక మూలము. ముఖ్యమైన మూలము హరివంశమే.

నంది తిమ్మన పారిజాతాపహరణము ఆంధ్రీకరణము కాదు. అనుసరణము. కతిపయకథాంశములకు. కతిపయశ్లోకములకు ప్రపంచీకరణము. నారదుడు శ్రీకృష్ణునికి పారిజాతపుష్పమును ఇచ్చుట. శ్రీకృష్ణుడు రుక్మిణికి సమర్పించుట. సత్యభామ కోపగృహమునందు ప్రవేశించుట. శ్రీకృష్ణుడు అనునయించుట. ఉభయులు అమరావతికి వెడలుట. శ్రీకృష్ణుడు ఇంద్రునితో యుద్ధము చేయుట. పారిజాతవృక్షమును తెచ్చుట. సత్యభామ పుణ్యకవ్రతము నలుపుట అను కథాంశములు సంస్కృతహరివంశమునందు కలవు. సంస్కృతహరివంశములోనినారదు

ని రాయబారము పారిజాతాపహరణమునందు లేదు. పారిజాతాపహరణములోని సత్యభామ పాదతాడనము సంస్కృతహరివంశమునందు లేదు. అది పారిజాతాపహరణమునకు ప్రాణభూతము. మొత్తము మీద పారిజాతాపహరణము స్వతంత్రరచనము.

# ఇతివృత్తప్రపంచీకరణము.

రుక్మిణీశ్రీకృష్ణులు రైవతకాద్రి కేగి. ఉపవాసదీక్ష పూని. ఉపవాసానంతరము బంధుమిత్రపరివారమును రప్పించి సమారాధన సేయు సమయమునందు నారదుడు వచ్చినట్లు మూలము. నారదుని పంపున శ్రీకృష్ణుడు పదియాఱువేవురను పరిణయమాడి సౌఖ్యరసలోలుడైన (37-42ప.)

" అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేది మీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జాద మ
త్యంతవినోదకేలిమెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగన్." 43ప. 1అ.

నారదుడు వచ్చినట్లు పారిజాతాపహరణము. నారదుని వర్ణన (44ప.) తిమ్మన స్వతంత్రకల్పనము. శ్రీకృష్ణుని సౌఖ్యరసలోలతయు తిమ్మన స్వతంత్రకల్పనము. అది పురాణసహజము. ఇది కావ్యోచితము. కథారంగము కమనీయదృశ్యము. సౌఖ్యరసలోలత సన్నివేశమునందే రుక్మిణీసత్యభామల సాపత్న్యము కలదు. (42ప.) అది అనంతరకథకు ప్రాతిపదిక. ఇది తిమ్మన కథాకథనకౌశలమునకు సూచిక.

నారదుడు ఇచ్చిన పారిజాతపుష్పమును రుక్మిణి ప్రక్కనుండుటవలన ఆమె ధరించుటకు తగునని శ్రీకృష్ణుడు ఇచ్చినట్లు మూలము. రుక్మిణిని చూచి. సత్యభామ తలపునకు వచ్చి.

" ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి దానికే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసిన జాడ దోఁచునొకొ యీ లెమ్మిందు నేనున్కిఁ జె
ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్" 54ప.

ఇచ్చినట్లు తిమ్మన స్వతంత్రకల్పనము. ఇందు శ్రీకృష్ణుని సందేహడోల సత్యభామ వైపు సాగును. ఇందు సత్యభామా కోపస్వభావమునకు. శ్రీకృష్ణుని

సత్యభామావిధేయతకు బీజావాపనము కలదు. ఇది కూడ తిమ్మన కథాకథనకౌశలమునకు మూదల.

పారిజాతపుష్పము ధరించిన రుక్మిణి శోభ ద్విగుణీకృతమైనదని మూలము. ప్రత్యేకమొక సీసపద్యము (56ప.) తిమ్మన స్వతంత్రకల్పనము. అది సత్యభామ అలుకకు ప్రాతిపదిక. కథాప్రయోజని. నారదుని పారిజాతపుష్పమహిమాభివర్ణనము మూలమునందు కలదు. అది నిమిత్తముగ పారిజాతాపహరణమునందు కలదు. ఆంధ్రీకరణము గాదు. అనుసరణము. అందు అగ్రేసరమైనది.

" అనిష్టగంధహరణ మేత త్సద్గంధవర్ధనమ్
ప్రదీపకర్మ రాత్రౌ చ కరోతి కమలేక్షణే "27శ్లో.65అ.
అను శ్లోకము నిమిత్తముగ తిమ్మన రచించిన పద్యమిది:
"అలినీలాలక! నీవు నీ పతి రహస్యక్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్." 60ప.1అ.

ఇది అనౌచిత్యమని. జగన్నాథవిజయమునందు కలదని అభిప్రాయములు కలవు. జగన్నాథవిజయమునందు రత్నదీపమని కలదు. అది భ్రమ కలిగించినది. రత్నదీపముప్రకాశమాత్రప్రయోజని. ఉజ్జ్వలదీపాంకురము"లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు"నది. అందువలన"రతిశ్రమతనూసంజాతధారాళఘర్మలవంబుల్ దొలగింపఁగా సురటియై రంజిల్లు"నది. ఇది కామశాస్త్రమును ఉపలక్షించునది. "ప్రదీపకర్మరాత్రౌ" అను మూలసూత్రమునకు భాష్యప్రాయము. ఇది అనౌచిత్యమైన, అది కూడ అనౌచిత్యమే. "ప్రదీపకర్మరాత్రౌ" అను మూలమునకు అంతర్యము రత్యుద్దీపనమే. అది గుంభనముగ కలదు; ఇది విజృంభణముగ కలదని అనవచ్చును. గుళికయైనను. గుప్పెడు ముద్దయైనను విషము విషమే. సంస్కృతాంధ్రకావ్యములందు రతిప్రసంగము విషము కాదు. అమృతమే. అంతేకాదు. పారిజాతపుష్పము మహిమలన్నియు నొక యెత్తు. ఇది యొక్కటి ఒక్క యెత్తు. ఇతరమహిమల కంటె ఇది సత్యభామ సాపత్న్యాగ్నికి ఆజ్యము పోయినది. స్వాతిశయమునకు భంగము కలిగించునది. అది అనంతరకథకు ఆవశ్యకము. కనుక అనౌచిత్యము కాదు. అత్యంతకథాప్రయోజనాత్మకము. ఇది కూడ తిమ్మన కథాకథనకౌశలమునకు నిదర్శనము.

నారదుడు సత్యభామ నిస్పృహ చెందుననీ, రుక్మిణి శ్రీకృష్ణుని ద్వితీయాత్మ అని పలికినట్లు మూలమునందు కలదు. ఇది నిమిత్తముగ పారిజాతాపహరణ మునందు ఇట్లు కలదు.

" ఇన్ని దినంబులన్ సవతు లిందఱిలో నల సత్యభామ కన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన వింటిఁగాని యో
కన్నియ! నీ యెడం గలుగు గారవ మెయ్యెడఁ జూచి కాన లే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చెనే? 65ప.
చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కకయున్నె నీ మహిమ సూచిన బోఁటులు విన్నవించినన్." 66ప.1ఆ.

ఇట మూలము యథాలాపముగ కలదు. తిమ్మన స్వతంత్రకల్పనము కథారూపముగ కలదు. శ్రీకృష్ణుడు అష్టమహిషులు ఉండగా నారదుని పంపున పదియాఱువేవురను పరిణయమాడినట్లు ముందు కలదు. కనుక శ్రీకృష్ణుని పదియాఱువేల పరిణయములకును పెండ్లిపెద్ద నారదుడు. అందఱి క్షేమమును ఆకాంక్షించుట పెండ్లిపెద్ద లక్షణము. అందుకు సత్యభామ సౌందర్యగర్వము, నూత్నయౌవనగర్వము, కీర్తిగౌరవము, స్వాధీనపతికతాగర్వము బలిసి నిక్కుచు, విఱ్ఱవీగుచు, సవతులను లెక్కచేయకపోవుట ప్రతిబంధకము. కాబట్టి ఆమెకు గర్వభంగము కావించుట నారదుని ఆశయము. శ్రీకృష్ణుడు సత్యభామ కనుసన్నల మసలుట వినుటయేకాని, రుక్మిణిని గారవించుట కనుటయైనది. ఎవ్వరికిని ఈయకుండ అనర్ఘమైన, దివ్యమైన, ఉత్తమమైన పారిజాతపుష్పమును రుక్మిణికి ఇచ్చుట గౌరవమని నిర్ధరించుట సత్యభామను కవ్వించునది. అది చెలికత్తెలు విన్నవించిన సత్యభామ స్రుక్కునని, స్రుక్కవలయునని నారదుని అంతర్యము. అనంతరకథకు ఆవశ్యకము. ఇదియెల్ల తిమ్మన కథాకథనకౌశలమునకు తార్కాణము.

సత్యభామ శౌరి కడకు పోయిన చెలికత్తె రాలేదని, మఱొక చెలికత్తెతోడి సరసగోష్ఠిని శౌరిగుణములు వర్ణించుట, సంశయించుట, కలత చెందుట (70-73ప.1ఆ.) తిమ్మన స్వతంత్రకల్పనము. ఇది శౌరి కడకు పోయిన చెలికత్తె తిరిగి వచ్చి చెప్పబోవు విషయము దుర్భరముగుటకు దోహదము సేయును. అనంతరకథకు అనుకూలవాతావరణము. శౌరి కడకు పోయిన చెలికత్తె తిరిగి వచ్చి చెప్పిన

విషయమును (74-81ప.1ఆ.) తిమ్మన స్వతంత్రకల్పనమే. అందు.

" ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతుకు వచ్చు సత్య గరువం బిఁక జెల్లదటంచు మానినీ! 80ప.
ఆ రణభోజను మతకము
లా రుక్మిణినటన లా మురాంతకు చెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రీ!" 81ప.
అన విని వ్రేటువడ్డ యురగాంగనయుం బలె నేయి వోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు దన చెక్కులఁ గుంకుమపత్రభంగసం
జనితనవీనకాంతి వెదచల్లఁగ గద్గదభిన్నకంఠియై" 82ప. 1ఆ.

పలికినది కూడ తిమ్మన స్వతంత్రకల్పనమే. వ్రేటువడ్డ ఉరగాంగన, నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశనకీల, కనుదోయి కెంపు సత్యభామ రుద్రావతారమును రూపు కట్టించును. ఇది తిమ్మన పాత్రచిత్రణపాటవమునకు పతాక. ఇట్లు గద్గదభిన్న కంఠియై పలికిన ఘట్టమునందు (83-98ఉ.1ఆ.),

" ఏమేమీ! కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యా మాట ల్చెవియొగ్గి తా వినియెనా యా గోపికావల్లభుం
డేమేమాడెను రుక్మిణీసతియు నీ వింకేటికిన్ దాఁచెదే
నీ మోమోటలు మాని నీరజముఖీ! నిక్కం బెఱిఁగింపవే. 83ప.
అతులమహానుభావమని యవ్వరిఁ దానొక పెద్దసేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగనేల యచ్చటన్. 84ప.
కలలోననైన నవ్వులకైన నా మాట
జవదాఁట వెఱచునో చంద్రవదన!
యే పదార్థంబు నా యెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁడో యిగురుబోఁడి!

చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నో చంచలాక్షి!
తోడి చేడియలు నాతోడి వంతులకు రా
సహియింపఁ జాలఁ డో సన్నుతాంగి
యరమరలు లేని కూరిమి ననఁగి పెనఁగి
కొదలు దీఱని కోర్కులఁ గూడి మాడి
కపట మెఱుఁగని మమతలఁ గలసి మెలసి
యున్న విభుఁ డిట్లు సేయునే యో లతాంగి!" 94ప.1ఆ.

అను పద్యములు అగ్రేసరభాసమానములు. చెలికత్తె విన్నవించినప్పుడే సత్యభామ ఇంధనములు మండుచున్న అగ్ని వలె, ప్రజ్వరిల్లుచున్న పావకజ్వాల వలె క్రోధగృహమునందు ప్రవేశించినదని మూలమునందు కలదు.

" దందహ్యమానా జ్వలనేన వర్ధతా ఈర్ష్యాసముత్థేన గతప్రభేవ
క్రోధాన్వితా క్రోధగృహం వివిక్తం వివేశ తారేవ ఘనం సతోయమ్."

ఇది నిమిత్తముగ తిమ్మన రచించిన పద్యమిది:

" అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁ బోలెన్." 99 ప.1ఆ

ఇందు " హరిచందనకోటరమునకు నాగతరుణియుఁ బోలెన్." అను ఉపమానము సందర్భస్థగితము. సత్యభామ తారాసదృశ కాదు; నాగతరుణీసన్నిభయే. కుంకుమరంగు చీర విడిచి తెల్లచీర కట్టినట్లు మూలము. " మాసిన చీర గట్టుకొని"నట్లు పారిజాతాపహరణము. (99ప.) అది తెల్లచీరయే. (113ప.) తెల్లచీర ప్రియుని మీద కోపచిహ్నామని మూలమునందు కలదు. శ్రీకృష్ణుడు సత్య సముదంచితకాంచనసౌధవీథికి కక్ష్యాంతరములు గడిచి, అలబలము లేని నగరెల్ల అరసి, వర్ణించి అనుమానించి, " మధ్యందినభానుమండలకరావళి హావళి వాడియున్న తీఁగం దలపించు" సత్యభామను కనుగొన్న వివరము(100-108ఉ.1ఆ.) తిమ్మన స్వతంత్రకల్పనము. శ్రీకృష్ణుడు సత్యభామకు తాలవృంతము విసురుట స్మూలకమేగాలి, " తద్వపుఃకీలితపంచసాయకశిఖిం దరికొల్పుచునున్న కైవడిన్" అను హేతుకల్పనము (109ప.1ఆ.) తిమ్మన స్వతంత్రకల్పనమే. శ్రీకృష్ణుని

అనునయము సమూలకము. సత్యభామ పాదతాడనము అమూలకము.

" పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటును బాటుగామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్. 120ప.
జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి; యట్ల యగు నాథుల్నేరము ల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారము ల్నేర్తురే. 121ప
కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలుపడంగన్. 122ప.

నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తాఁ
చినయది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁకనైన నరాళకుంతలా!" 123ప.1ఆ.

ఇందు "జలజాతాసన"పద్యములోని "తొలఁగంద్రోచె"నను మాటను పట్టుకొని సత్యభామ శ్రీకృష్ణుని తన్న లేదు. వామపాదముతో మృదువుగా త్రోసినది అనుట కలదు. కాని "కోపన"పద్యములోని "పదహతి" మృదుసరసము కాదు. మోటు సరసమే. పదహతి అనగా పాదతాడనమే. అంతేకాదు. " నను భవదీయ"పద్యములోని "తాఁచినయది" అనగా తన్నినది అనియే అర్థము. అమరుకకావ్యములోని అంతిమశ్లోకమిది:

"సా లక్తకేన నవపల్లవకోమలేన
పాదేన నూపురవతా మదలాలసేన
య స్తాడ్యతే దయితయా ప్రణయాపరాధా
త్సోఙ్గీకృతా భగవతా మకరధ్వజేన."

ఎవడు ప్రణయాపరాధము వలన ప్రియురాలిచేత లత్తుక పూయబడిన, క్రొత్తచిగురు వలె కోమలమైన పాదముచేత తన్నబడునో, అతడు మదనదేవునిచేత

మెచ్చుకొనబడిన వాడని అర్థము. మదనదేవుని పితృదేవుడును అంతే. అది దోషము కాదని అనిపించుటకే గదా అరణపుకవి పారిజాతాపహరణరచనాసంకల్పము. తిమ్మన సంకల్పసిద్ధుడే.

సత్యభామ శ్రీకృష్ణుని దూఱుట, మూలమునందు కలదు. "మానవర్జితమైన జీవితమును జీవింపనొల్లను" అని సత్యభామ అన్నమాట ఆధారముగ తిమ్మన రచించినపద్యమిది :

"ఉవిద యెవ్వతె నోఁచియున్నదో యీ స్యమం
తకరత్న మింక నొందల ధరింప
నీ రైవతకశైలచారుకూటవిటంక
కేళి కింకెవ్వతె పాలుపడునొ
యెవ్వతె కబ్బునో యీ వసంతారామ
కర్పూరకదళికాగారవసతి
లీల నీ మణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁగలదొ
యకట! నేఁ బెంపఁ బెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ
నన్ను నాతోడి సవతులు నగకమున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ గాక " 131ప.1ఆ.

ఇటు మూలము వాచ్యము. అసమ్మతిప్రకటనము. తిమ్మన పద్యము వ్యంగ్యవైభవోపేతము. ఆత్మహత్యానిశ్చయప్రకటనము.

సత్యభామ ఏడ్పుట మూలమునందు కలదు. అది పురాణధోరణి. పారిజాతాపహరణమునందు కావ్యసరణి.

" ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేల చెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్." 133ప.1ఆ.

ఇది శ్రీనాథుని "కొనరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చిన భంగి" అను కాశీఖండపద్యమునకు (167ప.5ఆ.) అను పల్లవి.

శ్రీకృష్ణుడు పారిజాతవృక్షమును "తెచ్చెద నిచ్చెద"ననుట మూలమునందు కలదు. అందుకు సత్యభామ సంతోషింతునని, తన ఆధిక్యమును నిలుపుకొందునని అన్నట్లును మూలమునందు కలదు. ఇది పారిజాతాపహరణమునందు ఇట్లు కలదు.

"అని పలుకు నంబుదశ్యా
ముని గర్జితమధురవాక్యముల సత్యామా
నిని నిపలతిక వోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁ గన్." 137ప.1ఆ.

ఇది ప్రథమాశ్వాసకథకు ముగింపు. కొసమెఱుపు. వ్యంగ్యమర్యాదావిలసితము ఇట్లు ప్రథమాశ్వాసకథ పారిజాతాపహరణమునందు పద్యకథానిక వలె కలదు.

నారదుడు సత్యభామ సౌధమునకు వచ్చి ఆతిథ్యము గొనుట (16-21ప.2ఆ.) మూలమునందు కలదు. సత్యభామ నారదునికి పాదాభివందనము చేయుట, నారదుడు సత్యభామను ఆశీర్వదించుట (22-26ప.2ఆ.) తిమ్మన స్వతంత్రకల్పనము. నరకాసురుడు అపహరించిన అదితికుండలములు ఆమెకు తిరిగి ఇచ్చుటకు స్వర్గలోకమునకు వచ్చుచున్నట్లు శ్రీకృష్ణుడు నారదుని ద్వారా ఇంద్రునికి వర్తమానము పంపినట్లు పారిజాతాపహరణమునందు కలదు. అదితికుండలముల సమర్పణముసంస్కృతహరివంశములోని ప్రథమపారిజాతాపహరణవృత్తాంతమునందు కలదు. వర్తమానము కాక, పారిజాతవృక్షము కొఱకు ఇంద్రునియొద్దకు నారదుని ద్వారా రాయబారము పంపినట్లు ద్వితీయపారిజాతాపహరణవృత్తాంతమునందు కలదు. నారదుని రాయబారము విఫలమగును. బృహస్పతి ఆవేదన చెందును. ఇదియెల్ల తిమ్మన విడిచిపెట్టెను. ఇందుకు హేతువు ఇంద్రుని శ్రీకృష్ణనిందయే. అంతేకాదు. శ్రీకృష్ణదేవరాయలు శ్రీకృష్ణుని అవతారమని పారిజాతాపహరణమునందు ముందు కలదు. (19ప.1ఆ.) అంతకంటె ముందు తిమ్మణ్ణ కృష్ణరాయభారతమునందు కలదు.[51] అనగా శ్రీకృష్ణదేవరాయలు ఆనాడు శ్రీకృష్ణావతారముగ భావింపబడుచున్నట్లు అవగాహనమగును. కథానాయకునికి, కృతినాయకునికి అపకర్ష కలిగించునది పరిత్యాజ్యమే. ఉత్కర్ష కలిగించునది ఉపాదేయము. అది ఇంద్రోపేంద్రుల యుద్ధము. మూలములోని యుద్ధము కంటె పారిజాతాపహరణములోని యుద్ధము ప్రచండము. శ్రీకృష్ణదేవరాయల యుద్ధములకు స్ఫోరకము.

సత్యాకృష్ణులకు ఇంద్రుని స్వాగతసన్నాహము (3-41ప.3ఆ.) తిమ్మన స్వతంత్ర

కల్పనము. సత్యాకృష్ణుల నందనోద్యానవనవిహారము ప్రథమపారిజాతాపహ రణవృత్తాంతమునందు ప్రసక్తిమాత్రము. పారిజాతాపహరణమునందు ప్రత్యేకఘట్టము. పారిజాతవృక్షమును పెకలించు శ్రీకృష్ణుని నందనవనపాలకులు అడ్డగించుట హరివంశమునందు లేదు. విష్ణుపురాణమునందు కలదు. సత్యభామ వనపాలకులను నిర్భర్త్సించుట కూడ హరివంశమునందు లేదు. విష్ణుపురాణ మునందు కలదు.

"ఇత్యుక్తే తై రువాచైతాన్ సత్యభామాతికోపినీ
కా శచీ పారిజాతస్య కో వా శక్ర స్సురాధిపః 11 45.
సామాన్య సర్వలోకస్య యద్యేషోమృతమన్థనే
సముత్పన్న స్తరుః కస్మా దేకో గృహ్ణాతి వాసవః." 46శ్లో30అ.5అం.

అను శ్లోకములు ఆధారముగ తిమ్మన రచించిన పద్యమిది:

"వినుఁడు సురేశ్వరు వనపాలకులు! వార్థిఁ
బొడమిన యీ దివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిదియేమి యొకరి సొమ్మె
యిదె నాదువిభునిచే నీ వదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదానఁ
బలుకు లేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిటఁబంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుతెపో వాసితనము." 59ప.4ఆ.

ఇది అస్వతంత్రాంధ్రీకరణము కాదు. అతిస్వతంత్రాంధ్రీకరణము. ఇందు శచీదేవిని"వీరపత్నియేని" అని పందెము సఱచినట్లు పలుకుట. శ్రీకృష్ణుని" సత్యభామావిధేయు"డనుట తిమ్మన స్వతంత్రకల్పనములే.

ఇంద్రోపేంద్రుల యుద్ధమునందు ఒకరి నొకరు జయింపలేకపోయిరని, బ్రహ్మదేవుని ప్రార్థనపై అదితికశ్యపులు వచ్చి సంధిచేసిరని మూలమునందు కలదు.

ఇంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధమును శ్రీకృష్ణుడు ఒడిసి చేపట్టిన, ఇంద్రుడు సాష్టాంగదండప్రణామము చేసి, పారిజాతవృక్షమును సమర్పించినట్లు పారిజాతాపహరణమునందు కలదు. (36-40ప.5ఆ.) ఇది తిమ్మన స్వతంత్రకల్పనము. నాయకోత్కర్షాపాదకము. సత్యాకృష్ణుల ద్వారకానగరప్రవేశము (43-49ప.) పారిజాతప్రతిష్ఠ (50-52ప.5ఆ.) తిమ్మన స్వతంత్రకల్పనమే. నారదాగమనము, పుణ్యకవ్రతము మూలమునందు సంగ్రహముగ కలవు. వాని ప్రపంచీకరణము పారిజాతాపహరణమునందు కలదు. నారదుని శ్రీకృష్ణస్తుతి తిమ్మన స్వతంత్రకల్పనములే.

ఇట్లు సంస్కృతహరివంశములోని ఇతివృత్తము నిమిత్తమాత్రముగ గైకొని, స్వకపోలకల్పనమున ప్రపంచీకరించి, రసమయము కావించినది తిమ్మన ఇతివృత్తప్రపంచీకరణము.

## వర్ణనాభూయిష్ఠత

పారిజాతాపహరణములోని ప్రథమాశ్వాసము కథాప్రధానము. ద్వితీయాశ్వాసము వర్ణనప్రధానము. మాధ్యాహ్నికస్నానము (4-14) సాయంకాలము (30-33) అంధకారము (34-36) నక్షత్రములు (37) చంద్రోదయము (38-51) చంద్రికావిహారము (53) వేగుజుక్క (54) వైతాళికగానములు (55-69) ప్రయాణసన్నాహము (72,74) ప్రయాణము (79-84) మేరుపర్వతము (85-88) కిన్నరసాధ్యవిద్యాధరయక్షగుహ్యకగరుడచారణాదులు (89-93) ఆకాశగంగ (94) దివ్యర్షినికేతనము (95) కామధేనువు (96) వైజయంతము (97-100) ద్వితీయాశ్వాసములోని వర్ణనములు. తృతీయాశ్వాసమును వర్ణనప్రధానము. సత్యాకృష్ణులకు స్వాగతసన్నాహము (4-10) దేవకాంతల కృష్ణవిలోకనము (12-21) అదితి (24) దశావతారములు (28-37) వైజయంతము (41) వనవిహారము (42-53) తృతీయాశ్వాసములోని వర్ణనములు. చతుర్థాశ్వాసము కూడ వర్ణనప్రధానము. పారిజాతవృక్షము (3-10) పుష్పాపచయము (13-16) మధ్యాహ్నము (17-23) జలకేళి (24-40) సూర్యాస్తమయ, చంద్రోదయ, ప్రభాతములు (42-49) యుద్ధము (61-90) చతుర్థాశ్వాసములోని వర్ణనములు. పంచమాశ్వాసము కథాప్రధానము. యుద్ధవర్ణనము కొనసాగినది. (3-37).

పుష్పాపచయఘట్టమునందు వృషభగతిరగడ కలదు. (16) దశావతారవర్ణనములందు మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామ, రామ, బలరామ

బుద్ధావతారములు కలవు. బుద్ధావతారమునందు బుద్ధశబ్దము లేదు. జినశబ్దము కలదు. జిన. బుద్ధశబ్దముల వ్యత్యయము పూర్వకావ్యములందు కలదు.

పారిజాతాపహరణమునందు ఏడు వచనములు కలవు. ఏడు వచనములును వర్ణనములే. పారిజాతప్రసూనప్రదానము (52వ.1ఆ.) చంద్రికావిహారము(53వచ.2ఆ.) ప్రయాణసన్నాహము (74వచ.2ఆ.) మేరుపర్వతము (88వచ.2ఆ.) వైజయంతము (41వచ.3ఆ.) యుద్ధవర్ణనము (67వచ.4ఆ.)యుద్ధవర్ణనము(13వచ.5ఆ.) వచనములే. సగము పద్యములు వర్ణనములు. సంస్కృతభూయిష్ఠములు.

# సజీవపాత్రచిత్రణము

పారిజాతాపహరణమునందు సత్యభామ. శ్రీకృష్ణుడు.నారదుడు ప్రధానపాత్రలు. నారదుడు కలహాభోజనుడు. సర్వపురాణసాధారణము. అది ప్రయోజనాత్మకమైనది పారిజాతాపహరణము. శ్రీకృష్ణుడు రుక్మిణీగృహములో ఉండగా. నారదుడు పనిగట్టుకొని వచ్చి. శ్రీకృష్ణునికి పారిజాతపుష్పమును సమర్పించుట. పారిజాతపుష్ప ప్రశంసను సత్యభామ గర్వాతిశయమును నిర్మూలించుటకు సమిధలు వ్రేల్చుట నారదుని కలహప్రియత్వమును సూచించునదియేకాని. శ్రీకృష్ణుని అష్టమహిషుల. తన పంపున శ్రీకృష్ణుడు పరిణయమాడిన పదియాఱువేవుర క్షేమమును కాంక్షించినది. కాని సత్యభామ గర్వాతిశయము నిర్మూలము కాలేదు సరికదా. తాలోత్తాలమగు స్థితి తటస్థించినది. శ్రీకృష్ణుడు పారిజాతవృక్షమును సత్యభామ పెరటిచెట్టుగ నాటించుట గర్వమునకు భంగము కల్గించునది కాదు. శృంగము కల్పించునదియే. అందువలన నారదుడు సత్యభామచేత పుణ్యకవ్రతమును ఆచరింపజేసెను. అది కలహాభోజనము కాదు. సహనభాజనము.

శ్రీకృష్ణుడు దక్షిణనాయకుడు. జగన్నాటకసూత్రధారి.

> "ఏ యే వేళల నే సరోజముఖి యే యే లీలలం గోరుఁ దా
> నా యా వేళల నా సరోజముఖి నా యా లీలలం దేల్చి యే
> చాయం జూచినఁ దానయై మెలఁగుచు న్సౌఖ్యాబ్ధి నోలాడు భో
> గాయత్తుండయి పెక్కురూపముల.మాయాకల్పనాచాతురిన్." 40ప.1ఆ.

ఇది దక్షిణనాయకలక్షణము. బహుప్రియాసదృశశీలుడు దక్షిణనాయకుడు. అయినను శ్రీకృష్ణుడు సత్యభామను అనునయించునెడ.

"మనమున మాటలం గ్రియల మన్నన లీ నొకనాఁడు నెట్టి కా
మినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁ గాని పా
యని యనురక్తి నీ యెడన యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచిన పంపు సేయుటయ ప్రాభవ మౌటది నీ వెఱుంగవే;" 118ప.1ఆ.

అనుట మఱి అనునయార్థమే. సత్యభామకు మ్రొక్కినపుడు యదునందనుడు "జగన్నాటకసూత్రధారి" అని నందితిమ్మన నిర్దేశము. ఆ మ్రొక్కు ప్రధానమైన సంఘటన. అది నాటకము. జగన్నాటకసూత్రధారి అంతర్నాటకసూత్రధారి అగుట నిరాఘాటము. అంతర్నాటకమును జగన్నాటకమే.

సత్యభామ సహనము లేని సపత్ని. గండరించిన గర్వితమతి. సంశయము కల సహధర్మచారిణి. అవధి లేని అభిమానవతి. కొలది లేని కోపమతి. పట్టుదల వహించిన ప్రచండజీవి. పంతము నెరవేఱిన ప్రసన్నమూర్తి. ఇట్లు తిమ్మన దిద్ది తీర్చిన సత్యభామ సజీవపాత్ర.

"కులమును రూపము న్మగని కూరిమియుం గలదాన నంచు నీ
వల నల రుక్మిణీరమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపమున్మగని కూరిమియుం గలదాన నంచు నా
వలఁ బచరింపఁగా రవరవ ల్వొడమె న్మది వారి కెంతయున్." 42ప.1ఆ.

అని కవి ఉపక్రమణిక. రుక్మిణి మదిలోని స్పర్ధ గుంభనము. సత్యభామ మదిలోని స్పర్ధ విజృంభణము. ఇది సహనము లేని సపత్ని లక్షణము.

"చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాననంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁడంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య -" 66ప.1ఆ.

అని నారదుని అభిభాషణము. "కలలోననైన నవ్వులకైన నా మాట జవదాట వెఱచు నో చంద్రవదన" అని సత్యభామ స్వవచనమే. పూర్తిపద్యము పూర్వోదాహృతము. (94ప.1ఆ.) ఇది గర్వాతిశయమునకు పరకాష్ఠ.

సౌందర్యవతి. మానవతి. మహనీయసౌభాగ్యవతి అయిన సత్యభామ ఒక సఖి శౌరి కడకు పోయి రాలేదని, మఱొక సఖికి శౌరి గుణములు వర్ణించుచు సంశయించును.

" అకట! యదేమియో యెఱుఁగ నయ్యెడఁ దొయ్యలి దక్షిణాంసచూ
చుకనయనప్రకంపగుణసూచనలేమియు వల్లగావు సా
రెకు మది జాలివొందెడి యొకరీతిఁ దలంకెడుఁ బ్రాణనాథుఁ డొం
డొక చపలాక్షిఁ గూడి నను నొల్లని చెయ్దము లేమి చేసెనో. " 73ప.1ఆ.

కుడిభుజము, కుడిచూచుకము, కుడికన్ను అదిరినంతమాత్రమున శ్రీకృష్ణుడు మఱొక చపలాక్షిని కూడి తన్ను ఒల్లని చేష్టలు ఏమిచేసెనో అని సత్యభామ సంశయము. మఱొక చపలాక్షిని కూడుటే సత్యభామకు మనస్కరింపని విషయము.తన మీది వలపు తఱుగరాదని ఆమె తాపత్రయము.

శౌరి కడకు పోయిన సఖి వచ్చి, "అమ్మా! యేమని చెప్పుదును" అని కొంప మునిగిపోయినట్లు మొదలుపెట్టె.

"ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతుకు వచ్చు సత్య గరువంబిఁకఁ జెల్లదటంచు మానినీ. 80
ఆ రణభోజను మతకము
లా రుక్మిణినటన లా మురాంతకు చెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రీ!" 81ప.1ఆ.

అనగానే సత్యభామకు మహాకోపము వచ్చెను. త్రేట్టువడ్డ ఉరగాంగన వలె, నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశనకీల వలె ఆ ముగ్గురిపైన అక్షతలు చల్లినది. "ఏమేమీ కలహాశనుండు" (83ప.) "అతులమహానుభావమని" (84ప.) అను పద్యములు పూర్వోదాహృతములు. అందు "ఆ మతకరివేలుపుందపిసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్" అను సత్యభామ ఆవేదన సాహంకారము. అవధి లేని అభిమానమునకు ఫలము.

"ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు మగఁ డింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె యింక నేటి మాటలు చెలియా!" 97ప.1ఆ.

అని సత్యభామ అమితదుఃఖమున పరితపించుచు జనితామర్షమున హరిచందనకోటరమునకు నాగతరుణి వలె కోపసదనమునకు వెడలెను.

"మాసిన చీర గట్టికొని మౌనముతోడ నిరస్తభూషయై
వాసెనకట్టు గట్టి నిడువాలిక కస్తురిపట్టు వెట్టి లో
గాసిలి చీఁకటింటి కడకంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజవిషాదవేదనన్." 99ప.1ఆ.

శ్రీకృష్ణుడు వచ్చి తాలవృంతము వీచిన. పారిజాతకుసుమాగతవాసనలకు పరికించి. శ్రీకృష్ణుని చూచి. కన్నీరు నించి-

" తల వాంచి మగుడ మునుఁగిడెఁ
గొలుకుల డిగజాఱి జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళపతితమరందబిందుతతిఁ బురుడింపన్." 111ప.1ఆ.

సత్యభామ కోపభారమును ఏవిధముగను తీర్పలేక శ్రీకృష్ణుడు పాదాభివందనము చేసిన. సత్యభామ శ్రీకృష్ణుని శిరస్సున పాదతాడనము చేసెను. అది మన్నన అనిన శ్రీకృష్ణుని మందలించెను. అందు.

" ఈ నయగారపుంబ్రియము లీ పస లీ మొగమిచ్చుమాట లే
లా నిను నమ్మియుండిన ఫలంబిదె తోడన కల్గె నాకు నీ
యానసుమీ ననుం జెనకి యాఱడివెట్టిన నవ్వువారలం
గాన వెఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్" 125ప.1ఆ.

అను సత్యభామ అవహేళనము పాదతాడనము కంటె పరమదారుణమైనది. ఇదియెల్ల సత్యభామ పట్టుదలకు నిలువుటద్దము. అంతేకాదు. "ఉవిద యెవ్వతె నోచియున్నదో యీ స్యమంతకరత్న మౌఁదల ధరింప" అని(పూర్తిపద్యము (131ప.1ఆ.) పూర్వోదాహృతము) చనిపోవుదునని బెదిరించినది. శోకాస్త్రమును కూడ ప్రయోగించినది.

" ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్." 133ప.1ఆ.

.కృష్ణుడు సత్యభామను "నిండుగౌఁగిటం జేరిచి, బుజ్జగించి, కన్నీరుదుడిచి .(134ప.) "ఇటుఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్" (135ప.) "పెరటిచెట్టుగ నాటింతు పెంపు గనుము" అనగానే (136ప.) సత్యభామ నిలువెల్ల పులకించిపోయెను.

సత్యభామాసమేతుడై శ్రీకృష్ణుడు సురలోకమున కేగి, పారిజాతవృక్షమును పెకలించి, గరుడస్కంధము మీద నిలిపినపుడు ప్రతిఘటించిన వనపాలకులకు

"పలుకు లేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిటుఁ బంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుటె పో వాసితనము" 59ప.4ఆ.)

అని శ్రీకృష్ణుని సమక్షమునందే శ్రీకృష్ణుడు సత్యభామావిధేయుడని సమాధానమిచ్చెను. శచీదేవితో పందెము సఱచెను. ఇది సత్యభామ మహాగర్వమునకు మకుటప్రాయము.

ఇంత మహాగర్విష్ఠురాలైన సత్యభామ పుణ్యకవ్రతాచరణమునకు నారదుడు,

"కువలయనేత్ర! తొంటి తన కోపము గర్వము మత్సరంబు మా
ని వినయముం బ్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున
న్సవతుల యిండ్ల కెల్లఁ దొలునాఁడు క్రమంబున నేగి తద్వ్రతో
త్సవమున కామతించి యతి సంభ్రమలీలలఁ దోడితేఁ దగున్" 57ప.5ఆ.
అనిన సత్యభామ అట్లే,
"దినదిన మట్లు తత్పరమతిం బదివేవురు పేరటాండ్ర క
ర్చన లొనరించి సారఘనసారసుగంధములు న్విచిత్రనూ
తనపటువస్త్రభూషణవితానము లిచ్చుచు వేడ్కఁ జైత్రశు
ద్ధనవమి యాదిగా నెల వ్రతంబొనరించిన"ది. 58ప.5ఆ.

నారదుడు "పుణ్యకవ్రతవిధానమునకు నాథుని ధారోదకపూర్వ మీవలయు నియ్యకొలుపుమా" అనెను.(76ప.)

"అనవుడు సత్యభామ హృదయంబున లజ్జయు సమ్మదంబునుం
బెనఁగొనఁ బ్రాణవల్లభునిఁ బ్రేమరసాలసవీక్షణంబునం
గనుఁగొని మోము వాంచి మధుకైటభమర్దన చిత్తగించితే

మునిపతి మాట నావుడును మోవిపయిం జిఱునవ్వుగుర్పఁగన్ " 77ప.5ఆ.

శ్రీకృష్ణుడు ధారవోయుమనిన సత్యభామ శ్రీకృష్ణవిధేయురాలై ధారవోసెను.

"తనుతరమధ్య యాగమువిధానము తప్పకయుండ మౌనిచే
ననుమతిఁ గాంచి మ్రొక్కి వినయంబున నందఱ నామతించి క
ల్పనగము క్రొవ్విరు ల్కనకపాత్రమునం దగనించి యిచ్చె వా
యనములు రుక్మిణీప్రభృతులౌ సతుల్పదియాఱువేలకున్." 90ప.5ఆ.

ఇట్లు ప్రచండజీవియైన సత్యభామ ప్రసన్నమూర్తి.

# ముద్దు పలుకు

ఇది నా కవితారీతి అని కృతికర్త నందితిమ్మన తెలుపలేదు. ఇది నీ కవితారీతి అని కృతిభర్త శ్రీకృష్ణదేవరాయలు పలుకలేదు. కాని, కాకమాని మూర్తి పాంచాలీ పరిణయమునందు ఇట్లు కలదు.

"అల్లసానివాని యల్లికబిగి సొంపు
ముక్కు తిమ్మనార్యు ముద్దుఁ బలుకుఁ
బాండురంగసుకవి పద్యంబు హరువును
గాకమానిరాయ నీకె కలదు. " 13ప.1ఆ.

ఇందలి బిగిసొంపు "జిగిబిగి"గ. పద్యంబు హరువును "పదగుంభనంబును"గ. నీకె కలదు. "నీకెతగుర"గ ఇదే పద్యము ప్రచురప్రచారమునందు కలదు. అంతేకాదు. పాంచాలీపరిణయపద్యము చాటుపద్యముగ, కాకమానిరాయడు భట్టుమూర్తిగ ప్రసిద్ధమైనది. ముక్కు తిమ్మన అనగా నందితిమ్మన. అతని కవిత ముద్దుపలుకు. ముద్దు గొలుపు పలుకు ముద్దు పలుకు. అది మృదుపదసంయోజనము. ఇది పారిజా తాపహరణములోని పాత్రల సంభాషణములందు పరాకాష్ఠదశను కలదు. ఇంతవఱకు ఉదాహరించిన పారిజాతాపహరణములోని పద్యములెల్ల ముక్కు తిమ్మన ముద్దుప లుకులే.

సత్యభామ ధారాపూర్వకముగా దానమిచ్చిన శ్రీకృష్ణుని చేత పనులు చేయిం చుకొను నారదుని వైఖరిని వర్ణించిన పద్యమును ముద్దుపలుకుల ముత్యాల మూటయే.

" మేళవించినవి సుమ్మీ దీని మెట్లని

మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటిజలము సుమ్మీ తొలంకెడుననీ
డాచేత మణికమండలు వొసంగి
యిది జపోచితము సుమ్మీ జతనంబని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిధియని
శార్దూలచర్మంబుఁ జంకఁ జొనిపి
పొమ్ము పొమ్మని యొక కొంత పోవఁ బోవ
రమ్ము రమ్మని మఱలఁ జేరంగఁ బిలిచి
కపటనటనాపరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వు వటాలకుఁ బనులుగొనియె." 86ప.5ఆ.

వర్ణనపద్యములును వైకల్పికముగ ముద్దుపలుకులే.

"అమరుల బోనపుట్టిక సహస్ర మయూఖుని జోడుకోడె సం —
తమసము వేరువిత్తు కుముదంబుల చక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మి దొలంగుబావ కో
కములకు గుండెతల్లడము కైరవమిత్రుఁ డు దోఁచెం దూర్పునన్." 41ప.2ఆ.
"సరసిజనేత్ర! చూచితె వసంతుఁడు నీ వనవాటికారమా
తరుణియుఁ బాణిపీడనవిధానసమయంబునఁ గేలుదోయి నొం
డొరుపయి సమ్మదంబు లిగురొత్తఁగ మాటికిఁ జల్లు సేసఁ బ్రా
ల్నెరసెననంగ వ్రాలెఁ గుహాళివిగళన్నవకోరకావళుల్." 53ప.3ఆ.
"కనుఁగవ మ్రాన్పడంగ నెఱక ల్విరియంబడ బోరమోవ నెం
డిన వదనంబులం దెఱచి నిక్కిన యఱ్ఱులు దల్లడించుటల్
గనఁబడ నూరుపు ల్దకముగా సిగుడ న్వడఁగంది యీరెలుం
గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతము లయ్యెడ నిల్చె మ్రాఁకులన్."
21ప.4ఆ.

ఇట్టి ముద్దుపలుకుల మూటకు గట్టి ముడులు కలవు. అవి అనులోమవిలోమకందము (92ప.) పాదభ్రమరకము (93ప.) ద్వ్యక్షరికందము(98ప.) ద్వికందక్రౌంచపదము (99,100ప.) భుజంగప్రయాతస్రగ్విణి (101ప.) గోమూత్రికాబంధము (94ప.) నాగబంధము (95ప.) ఛురికాబంధము (96ప.) చక్రబంధము (97ప.5ఆ.) ఇవి

చిత్రగతుల నారదుని శ్రీకృష్ణస్తుతులు.

## ఆత్మీయత

నందితిమ్మన శివపరాధీనమతి. (108ప.5.) పారిజాతాపహరణము హరికథామృతకృతి. కవి ఆత్మీయత ప్రతిఫలించుటకు అవకాశము లేదు. అలతిగ ప్రతిఫలించినది. తిమ్మన ప్రభావమున విద్యాధరులు " శివధ్యానైకనిష్ఠాపరుల్ (91ప.2ఆ.) " గంగ అనంగహర మౌళితటరంగనటి" (92ప.2ఆ.) పారిజాతవృక్షము గౌరీనాథు జూటుస్థలంబు " మృగాంకుండు" వలె "మరుల్లోక మలంకరించునది." (3ప.4ఆ.) చీకటి "ధూర్జటి కంఠకాంతి." (46ప.4ఆ.)

# అల్లసాని పెద్దన

అల్లసాని పెద్దన ఆంధ్రకవితాపితామహుడు. శ్రీకృష్ణదేవరాయలహితుడు. చతుర వచోనిధి. చతుర్విధకవితాచతురుడు. అతులపురాణాగమేతిహాసకథార్థస్మృతియుతుడు. పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిరుడు. అనగా విష్ణుభక్తుడు. శఠకోప యతి శిష్యుడు. హరికథాసారము. మనుచరిత్ర. కృతులు.

## హరికథాసారము

హరికథాసారము అనుపలబ్ధము. కాని గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు "అల్లసాని పెద్దిరాజుహరికథాసారము"నుండి పదిమిది పద్యములు ఉదాహరింపబడినవి. ఆరు కందపద్యములు. రెండు సీసపాదములు. తుది కందపద్యమిది :

"శఠకోపయతి కఖిలతరు
కుఠారరూపమతికిశతగురుమతహృత్కా
ర్మఠనిరతికి చతురాగమ
పఠనాయతనియతికి యజపాధికభృతికిన్."

ఇది ముద్రితగ్రంథములందు ఇట్లు కలదు.

"శఠగోపయతికి శఠతరు
కుఠారకోపమమతికినిగురుమతహృత్కా
ర్మఠనిరతికిఁ జతురాగమ
పఠనాయతనియతికి నజపాసంభృతికిన్."

ఇది అంకితచిహ్నమైన షష్ఠ్యంతపద్యము. శఠకోపయతి అహోబలమఠాధిపతి. ఆదివణ్ శఠకోపజీయ్యరు. పెద్దన గురువు.

" కొలుతున్ మద్గురు విద్యా
నిలయుఁ గరుణాకటాక్షనిబిడజ్యోత్స్నా

దళితాశ్రితజనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠకోపయతిన్." 6ప.1ఆ.

ఇది మనుచరిత్రములోని పెద్దన గురుస్తుతి. ఆంధ్రప్రయోగరత్నాకరమునందు ఉదాహృతమైన మఱొక పద్యమిది :

" గంధయుతవాక్యవిలస
ద్గ్రంథనవయంధ్రకవిపితామహ మా పై
గ్రంథము ఘటింపుమని శ్రీ
గంధము కప్పురపువిడెంబు కరుణ నొసంగెన్."

ఇది కూడ లేఖకదోషజుష్టము. ఇట్లుండవలయును.

" గంధయుతవాక్యవిలస
ద్గ్రంథనవాంధ్రకవితాపితామహ మా పై
గ్రంథము ఘటింపుమని శ్రీ
గంధము కప్పురపు విడెంబు కరుణ నొసంగెన్."

ఇది శఠకోపయతి కృతి రచింపుమని కోరిన పద్యము. అది షష్ఠ్యంతపద్యము కాబట్టి హరికథాసారము శఠకోపయతికి అంకితము గుర్వంకితము.

## మనుచరిత్రము

కథాప్రారంభమునందు "నా యొనర్పంబూనిన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునకు"అనికలదు. (48వచ.1ఆ.) ఆశ్వాసాంతగద్యలందు"పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబు" అని కలదు. కావ్యాంతమునందు "కోరిక నీ స్వారోచిషచారిత్రము విని" అనికలదు.(121ప.6ఆ.) పెద్దన చాటుపద్యమునందే "మనుచరిత్రం బందుకొనువేళ" అని కలదు. మనుచరిత్రమనినను, స్వారోచిషచారిత్ర మనినను స్వారోచిషమనుసంభవమే. స్వారోచిషమనుసంభవమునకు హేతుభూత మైన పూర్వకథ ప్రధానమైనది మనుచరిత్రము. స్వారోచిషమనువు జీవితచరిత్రము కాదు. స్వారోచిషమనుసంభవకథయే.

## కాలము

శ్రీకృష్ణదేవరాయలు "భువనవిజయాఖ్యసంసద్భవనస్థితసింహపీఠిఁ బ్రాజ్ఞుల

గోష్ఠిం గవితామధురిమ డెందము దవులం గొలువుండి" 13ప.1ఆ.

" సప్తసంతానములలోఁ బ్రశస్తి గాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియ కాన
కృతి రచింపుమా మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య" 14ప.1ఆ.

అనగా పెద్దన రచించినది మనుచరిత్రము. భువనవిజయభవననిర్మాణ కాలము1515 వ సంవత్సరమని పూర్వోక్తము. మనుచరిత్రమునందు.

-"మాడెములు వ్రేల్చె నొడ్డాది మసి యొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగిపఱవఁ
దోఁకచిచ్చన నౌర యుద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని." 37ప.1ఆ.

అని కలదు. ఇందు శ్రీకృష్ణదేవరాయల కటకదండయాత్ర. ప్రతాపరుద్రగజపతి పలాయనమంత్రపారాయణము కలదు. అది 1519 వ సంవత్సరమునందు జరిగినదని పూర్వోక్తము. కాబట్టి మనుచరిత్రరచనాకాలము 1519వ సంవత్సరము కంటె పూర్వము కాదు. తర్వాత కావలయును. 1520 వ సంవత్సరము కావచ్చును.

## మూలము

" మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రససమంచితకథలస్
విన నింపు కలిధ్వంసక
మనఘ భవచ్చతురరచన కనుకూలంబున్. 17ప.
కావున మార్కండేయపురాణోక్తి ప్రకారంబునం జెప్పుము. " 18వచ.1ఆ.

అని శ్రీకృష్ణదేవరాయల ఆదేశము. ""జైమినిముని స్వాయంభువమనుకథా శ్రవణానంతరంబున మీఁద నెవ్వండు మనువయ్యె నెఱింగింపు మనవుడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పిన ప్రకారంబున .... చెప్పందొడంగి"నది (48వచ.1ఆ.) పెద్దన రచించిన మనుచరిత్రము. మార్కండేయుడు క్రోష్టికి చెప్పిన ప్రకారమున. పరమజ్ఞానచక్షులైన పక్షులు జైమినికి చెప్పినది మార్కండేయపురాణము. అందు స్వారోచిషమనుసంభవవృత్తాంతము కలదు. కాబట్టి పెద్దన మనుచరిత్రమునకు

మూలము మార్కండేయపురాణము. అష్టాదశపురాణములందు అదొకటి. అది మారన తెనిగించినది. సంస్కృతాంధ్రమార్కండేయపురాణములు రెండును పెద్దన సంప్రతించినవియే.

మనుచరిత్రములోని ప్రవరవృత్తాంతము,వరూథినీప్రవరవృత్తాంతము, వరూథినీ మాయాప్రవరవృత్తాంతము, స్వరోచివృత్తాంతము, మనోరమావృత్తాంతము, ఇందీవరాక్షవృత్తాంతము విభావసీవృత్తాంతము, కళావతీవృత్తాంతము, కలహంసీచక్రవాకీ వృత్తాంతము, హరిణవృత్తాంతము, వనదేవతావృత్తాంతము, స్వారోచిషమను వృత్తాంతము, వాని వాని పరస్పరసంబంధము మార్కండేయపురాణమునందు కలవు. అవి రససముంచితకథలు. మనుచరిత్రము రసమయకావ్యము. పురాణకథ పుండ్రేక్షుఖండ. కావ్యరసము పీయూషలహరి. మార్కండేయపురాణాంతర్గతమైన స్వారోచిషమనుసంభవకథ నిమిత్తమాత్రముగ గైకొని, స్వకపోలకల్పనమున ప్రపంచీకరించి, రసవత్తరముగ రచించినది మనుచరిత్రము. స్వారోచిషమనుసంభవ కథ సంస్కృతమార్కండేయపురాణమునందు రెండువందల ఏబదియారు శ్లోకములందు కలదు. తెలుగు మార్కండేయపురాణమునందు నూటనలుబదియైదు పద్యగద్యములందు కలదు. మనుచరిత్రము అయిదువందల తొంబది పద్యగద్యముల కావ్యము. కథ సమూలకమైనను కవిత్వము పెద్దన స్వకీయము. కావున మను చరిత్రము స్వతంత్రకావ్యము.

## ఇతివృత్తప్రపంచీకరణము

అసలు ప్రవరాఖ్య సంస్కృతమార్కండేయపురాణమునందు లేదు. ఒకానొక బ్రాహ్మణప్రవరుడని కలదు.

> " కశ్చి ద్ద్విజాతిప్రవరః పురేz భూదరుణాస్పదపురే
> వరుణాయా స్తటే విప్రో రూపేణాత్యశ్వినావపి." 5శ్లో. 58అ.

ఇందు "ద్విజాతిః ప్రవరః" అను పాఠాంతరకల్పనమునకు అవకాశము కలదుగాని, ఉత్తరార్ధమునందు "విప్రః" అని ఉండుటవలన అనావశ్యకము. విప్రుడు ద్విజాతిప్రవరుడని వివక్ష.

> "అతిసుకుమారమూర్తి ప్రవరాఖ్యుడు"- 214ప.4ఆ
> అని తెలుగు మార్కండేయపురాణమునందు కలదు.
> " - ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁ డై." 51ప.1ఆ.

అని మనుచరిత్రమునందు కలదు. నామకరణము మూరనకృతము. సజీవపాత్రీకరణము పెద్దనకృతము.

విప్రుడు రూపమునందు అశ్వినీదేవతలను మించినవాడు. మృదుస్వభావుడు. సచ్చరిత్రుడు. వేదవేదాంగపారగుడు. అతిథిప్రియుడు. రాత్రి వచ్చువారికిని ఆశ్రయమిచ్చువాడు అని మూలమునందు కలదు. అది నిమిత్తముగ ప్రవరుని సౌందర్యము. పాండిత్యము. వ్యాసంగము. వైరాగ్యము. సంసారము. దినచర్య. స్థితిగతులు. తీర్థసందర్శనాభిలాష ఏడు పద్యములలో మనుచరిత్రమునందు కలవు. (51-57ప.1ఆ.) అందు మూడు పద్యములు అతిముఖ్యమైనవి. అవి:

"ఆ పురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్యతనూవిలాసుఁ డై." 51.
"తీర్థసంవాసు లేతెంచినారని విన్న
నెదురుగా నేఁగుఁ దవ్వెంతయైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్నసంతృప్తులఁ గాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ దెలియనడుగు
నడిగి యోజనపరిమాణమరయు నరసి
పోవలయుఁ జూడననుచు నూర్పుల నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శనాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి." 57ప. 1ఆ.

ఇవి అనంతరకథకు అత్యంతప్రయోజనాత్మకములు.

"ప్రవరుని ఇంటికి ఒకనాడు ఒకానొక అతిథి వచ్చెను. అతనిని ప్రవరుడు అభ్యర్చించెను. అతిథి తాను తిరిగిన దేశములు నగరములు తెలిపెను. అతివృద్ధుడు. అతియువకుడు కాని అతిథి అనేకదేశదర్శిత్వమునకు ప్రవరుడు విస్మయము చెంది. అల్పకాలమున పృథివి నెట్లు పర్యటించితిరని ప్రశ్నించెను. మంత్రౌషధప్రభావముచేత

అర్ధదినమునకు సహస్రయోజనములు సంచరింతునని అతిథి సమాధానమిచ్చెను. నాకు మహీతలము చూడవలెనను కోరిక మిక్కిలి కలదు. మంత్రప్రభావమును ప్రసాదింపుమని ప్రవరుడు కోరెను. అతిథి పాదలేపమును అభిమంత్రించి ఇచ్చెను." అని సంస్కృతమార్కండేయపురాణమునందు కలదు. అతిథి ఔషధసిద్ధుడని తెలుగు మార్కండేయపురాణమునందు కలదు. అంతేకాదు. "ఇమ్మహి విశేషపుంజోద్యము లేవి సూచితీ వచ్చుగఁ జెప్పవే" అని 15ప.4ఆ.) ప్రవరుడు అడిగినట్లు కూడ కలదు. అది. ఇది నిమిత్తమాత్రముగ ఔషధసిద్ధాగమనము మొదలు పాదలేపప్రదానము వఱకును మనుచరిత్రమునందు ఇరువదియొక్క పద్యములు కలవు. అందు ప్రవరుని అభిలాష పృథ్వీయాత్ర కాదు. తీర్థయాత్రయే.

" ఏ యే దేశములన్ వసించితిరి మీరే యే గిరుల్ చూచి నా
రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి రే యే ద్వీపముల్ మెట్టినా
రే యే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రే యే తోయధుల్ డాసి నా,
రా యా చోటులఁ గల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపరే." 68ప.

అని ప్రవరుని అభ్యర్థనము. ఇందు "ఏ యే తీర్థములందుఁ గ్రుంకిడితిరి ఏ యే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితిరి?" అను ప్రశ్నలు అతిముఖ్యములైనవి. ఔషధసిద్ధుని సమాధానమును తీర్థయాత్రావిషయమే. (78-31వచ.1ఆ.) అందు పుణ్యనదీనదములు, కేదారహింగుళాప్రయాగబదరిక్షేత్రములు కలవు. ఉదయ. మలయ. అస్త. రజత. మేరు పర్వతములు కలవు. "రజతశైలంబు నోలంబులం గాలగళవిహారప్రదేశంబులం గన్న సంసృతిక్లేశంబులు వాయవే" అని కలదు. బదరీక్షేత్రము. రజతాచలము హిమాలయ పర్వతమునకు సంబంధించినవి. ప్రవరుని హిమాలయ ప్రయాణము వినోదయాత్రకాదు. తీర్థయాత్ర. కారణము ప్రవరుని తీర్థయాత్రాభిలాష. అది అనంతరకథాప్రయోజనాత్మకము.

విప్రుడు హిమాలయపర్వతమునందు ప్రకృతిసౌందర్యమును పరికించినట్లు మాత్రమే సంస్కృతమార్కండేయపురాణమునందు కలదు. తెలుగు మార్కండేయపురాణమునందును అట్లే కలదు. (224ప.4ఆ.) ప్రకృతిసౌందర్యము తోపాటు ప్రవరుడు తీర్థయాత్రాస్థలములను సందర్శించినట్లు మనుచరిత్రమునందు కలదు. (3-11ప.2ఆ.) ప్రకృతిసౌందర్యమును వర్ణించు పద్యములు రెండు మాత్రమే మూలమును మూదలించునవి. (3,6ప.) రెండు పెద్దన స్వతంత్రకల్పనములు. (7,11ప.) తీర్థయాత్రాస్థలములను తెలుపు పద్యములు రెండును పెద్దన స్వతంత్రకల్పనములే.

"నరనారాయణచరణాం
బురుహద్వయభద్రచిహ్నముద్రితబదరీ
తరుషండమండలాంతర
సరణిన్ ధరణీసురుండు సనఁ జన నెదుటన్." 5ప.
" నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరు ము
మ్మనుమండు తపము గైకొనిన చోటు
జరఠకచ్ఛపకులేశ్వరు వెన్ను గానరా
జగతికి మిన్నేఱు దిగిన చోటు
పుచ్చడీకతనంబు పోఁ బెట్టి గిరికన్య
పతిఁ గొల్వ నాయాసపడిన చోటు
వలరాచరాచవాం డలికాక్షు కనువెచ్చఁ
గరఁగిన యల కనికరఁపుఁ జోటు
తపసి యిల్లాండ్రు చెలువంబుఁ దలఁచి తలఁచి
మున్ను ముచ్చిచ్చును విరాళిఁ గొన్న చోటు
కనుపపులు వేల్పుఁ టడవాలుఁ గన్న చోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన." 11ప.2ఆ.

ఇందు బదరీక్షేత్రము, భగీరథాశ్రమము, గంగావతరణప్రదేశము, స్థాణ్వాశ్రమము, దారుకావనము, కుమారస్వామి జన్మస్థలము వినోదయాత్రాస్థలములు కావు. తీర్థయాత్రాస్థలములే. ప్రవరునికి ప్రకృతిసౌందర్యదిదృక్ష కంటె తీర్థయాత్రాభిలాష సహజము. అది హిమాలయమునకు వచ్చుటకు నిమిత్తము. అనంతరకథకు ఆవశ్యకము.

విప్రుడు "హిమవారిచేత పాదలేపము నష్టమైనది. శైలము అతిదుర్గమమైనది. అజ్ఞానము వలన అతిదూరము వచ్చితిని. అగ్నికార్యాదికమునకు హాని కలిగినది. మహాసంకటము వచ్చినది. ఏమి చేయుదును?" అని చింతించినట్లు మూలమందు కలదు. ఇది మనుచరిత్రమునందు నాలుగు పద్యములందు కలదు. (14-17ప.2ఆ.) అందు,

" నను నిముసంబు గానకయున్న నూరెల్ల
నరయు మజ్జనకుఁ డెంతడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలువెళ్లనీక న
న్నోమెడు తల్లియెంతొఱలునొక్కొ

యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
గెడఁ దోడు నీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకునెంత చింతింతురొక్కొ
యతిథిసంతర్పణంబులేమయ్యెనొక్కొ
యగ్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ కినుక నిట్లు
పాఱవైచితి మిన్నులు పడ్డచోట." 17ప.2ఆ.

అను పద్యము ప్రవరుని శీలమునకు అచ్చపు మణిదర్పణము.

విప్రుడు ఇంటికి దారిఎవ్వరు తెలుపుదురని తిరుగుచున్నప్పుడు వరాప్సర, మహాభాగ, మౌనేయ, రూపశాలిని అయిన వరూథిని అతనిని చూచెనని మూలము నందు కలదు. ప్రవరుడు "గంధర్వయక్షగానఘూర్ణితమగు నొక్క కోనఁ గనియె"నని, అది ముని ఆశ్రమమను తహతహను అచటికి వెళ్లిన ఉపాయము లభించునని, "లోయకుఁ దలక్రిందులై దిగు కాలువ వెంట ... మణిపట్టభంగసరణి"ని ఏగి, సమీప మునందు గారుడోత్కీర్ణమైన భవనమును గాంచెనని మనుచరిత్రమునందు కలదు. (19-22ప.2ఆ.) ప్రవరుడు భవనమును కాంచి, ఆశ్చర్యపడి, ఇంచుక సమీపించుటకు ఏగెడు వేళ

"మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువ పొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్." 24ప.2ఆ.

అని పెద్దన అపూర్వస్వతంత్రకల్పనము. ఒక పాలు కస్తూరి, రెండు పాళ్లు పచ్చకర్పూరము కలిపిన తాంబూలపరిమళముతోడి పూలపరిమళము మొదలైన ఇతర పరిమళములును వెదజల్లు మారుతము ప్రసరించినది. అందు పైవిధమైన తాంబూలపరిమళము- అది స్త్రీలకు విహితము కావున- మగువజాడ తెలుపునది. ఇది పెద్దన తాంబూలపరిమళపరిజ్ఞానము. అది ప్రవరునికి పట్టలేదు. అతడు స్త్రీజనాన్విత ముని సమీపించలేదు. జనాన్వితమనియే చేరబోయెను.

"అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా

న్వితమిచ్చోటని చేరఁ బోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీశిరోరత్నమున్." 25ప.2ఆ.

జనాన్వితమన స్త్రీపురుషజనాన్వితము. ప్రవరుడు స్త్రీపురుషజనాన్వితమని చేరబోయి చూచినది మరున్నారీశిరోరత్నమును మాత్రమే. ఆమె వరూథిని. ప్రవరుడే వరూథినిని చూచినట్లు పెద్దన ప్రకల్పనము. అంతేకాదు. వరూథిని.

" తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగు వలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁ గాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూతతంత్రీస్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కియరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గ్రమకరపంకరుహరత్నకటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండి" 27ప.2ఆ.

ప్రవరుని చూచెనని పెద్దన స్పష్టప్రతిపాదనము. (28ప.2ఆ.) ఇందు శశికాంతమణిపీఠికి. గీతప్రబంధములు పలికించుటకు- మారన మార్కండేయపురాణములోని వపువను అప్సరస "చంద్రకాంతవేదిక మీఁదన్ ఎలమిఁ గూర్చుండి యెలుఁగెత్తి యింపు మిగుల వట్టి మ్రాఁకులు చివుళులు వెట్ట పాడెను" అను ప్రసక్తి ఆద్యప్రకృతి. (25-26ప.1ఆ.) అయినను. పెద్దన స్వతంత్రకల్పనమైన సన్నివేశమిదియెల్ల వరూథినీప్రవరసమావేశమునకు రంగుహొరంగుల రంగవల్లికలతోడి రంగభూమి.

వరూథిని ప్రవరుని చూచిన విధానము. చేసిన సంధానము మనుచరిత్రమునందు రసవత్తరము.

" అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె

ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁ గా
గుబ్బమెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్. 28
చూచిఝుళంఝుళక్కటకసూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్కపోఁ కనుఁబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లి గొల్పుచున్ 29.
మునుమున్ పుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
బొనుపం గోర్కులు గ్రేళ్ల ద్రిప్ప మది మెచ్చుల్ ఔప్ప లల్లార్ప న
త్యనుషంగస్థితి జిచ్చపాటొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్." 30ప.2ఆ.

ఎదుటినుండి, సగము చాటునుండిచూచిచూచివరూథినికిమోహము కలిగినది. (31-33ప.2ఆ.) వరూథిని విప్రుని చూచి తత్క్షణమే మదనాకృష్టహృదయురాలు, అనురాగముతో కూడినది అయి, "ఏమి రమణీయతమాకృతి! అహో స్వరూపమాధుర్యము! అహో లలితగతి! ఆ మహాత్మునికి దేవదైత్యసిద్ధగంధర్వపన్నగులందు తుల్యరూపుడు ఒక్కడును లేడు. నాకు అతనిపై అనురాగము కలిగినట్లు, అతనికి నాపై అనురాగము కలిగినచో పుణ్యసంచయము. అతని సుస్నిగ్ధమైన దృష్టి ప్రసరించినచో మూడులోకములందును పుణ్యము చేసినది మఱొకతె ఉండదు." అని చింతించెనని మూలమునందు కలదు. "అతని రూపరేఖావిలాసంబులకుం జొక్కి" వరూథిని "ఆత్మగతంబున" (34వచ.)

"ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంతవసంతకంతులం
జక్కఁదనంబునన్ గెలువఁ జాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీ తనూవిభవ మెక్కడ యేలనిబంటుగా మరుం
డక్క గొనంగరాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్. 35ప.
వదనప్రభూతలావణ్యంబుసంభూత
కమలంబు లన వీని కన్ను లమరు
నిక్కివీనులతోడనెక్కసక్కెములాడు
కరణి నున్నవి వీని ఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠిక వోలె,
వెడఁదయై కనుపట్టు వీని యురము

ప్రతిఘటించు చిగుళ్లపై నెఱ్ఱవ్రాఁతిన
రీతి నున్నవి వీని మృదుపదములు
నేరెటేటియసల్ తెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేని కాంతి. 36ప.
సురగరుడోరగనరఖే
చరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరగంధర్వకుమారుల
నిరతము గనుఁ గొనమె పోలనేర్తురె వీనిన్." 37ప.2ఆ.

అని చింతించెనని మనుచరిత్రమునందు కలదు. అందు మూడవపద్యము మూలవిధేయము. రాక్షసులను పరిహరించి, గరుడనరఖేచరకిన్నరసాధ్యచారణ విద్యాధరులను చేర్చుట ఉచితము. మొదటి పద్యములోని యక్షతనయేందుజయంతవసంతకంతుల పట్టిక శ్రీనాథుని ప్రభావము. (2వచ.8ప.4ఆశృం.నై) "మరుండక్క గొనంగరాదె" అనుట మారన ప్రమేయము. "కామునిదక్కనేలుదున్." (230ప.4ఆ.) రెండవ పద్యము పెద్దన స్వీయకవిత్వము. సంస్కృతాంధ్రకావ్యములందు నాయకుడు నాయికను వర్ణించుట సర్వసాధారణము. నాయిక నాయకుని వర్ణించుట అరుదు. వరూథిని వర్ణనమునందు ప్రవరుని కన్నులు, భుజములు, ఉరము, పదములు కంటె మేనికాంతి వర్ణనము మేలిమి బంగారము. అతిశయోక్తివిలసితమైనను అనంతరకథా ప్రయోజనాత్మకము.

ఇక మూలమునందు ఇట్లు కలదు.

విప్రుడు "కమలగర్భాభ! నీవు ఎవ్వతెవు? ఎందుకిచట ఉన్నావు? నేను బ్రాహ్మణుడను. అరుణాస్పదపురమునుండి వచ్చితిని. రప్పించిన పాదలేపము కరిగిపోయినది." అనెను. వరూథిని "నేను మౌనేయను. మహాభాగను. నా పేరు వరూథిని. నిన్ను చూచుటవలన కామవిక్లబత కలిగినది. నా కార్యము నీ అధీనము" అనెను. విప్రుడు "కల్యాణి! నేను ఇంటికి పోవుటకు ఉపాయము తెలుపుము. నీకు హాని కలుగదు. నన్ను హిమాలయమునండి ఉద్ధరింపుము. బ్రాహ్మణులకు ప్రవాసము ప్రశస్యము కాదు. భీరు! నా దేశదర్శనకౌతుకము అపరాధము." అనెను. వరూథిని "మహాభాగ! ఇట్లనవలదు. నన్ను వదలి ఇంటికి పోవలదు." అని భోగము

లు ఏకరువుపెట్టి విప్రుని ఆలింగనము చేసికొనెను. విప్రుడు వరూథినిని వారించి. హోమప్రాధాన్యమును ఉగ్గడించెను. స్వల్పకాలమైనను భోగము లనుభవింపుమని వరూథిని. త్రేతాగ్నులే తన కిష్టమని విప్రుడు. దయ చూపుమని వరూథిని. ఇంటికి పోవుటకు ఉపాయము తెలుపుమని మఱల విప్రుడు. స్వల్పకాలమైనను భోగము లనుభవింపుమని మఱల వరూథిని. విప్రుడు భోగార్థము కాదని విప్రుడు." నేను చనిపోవుదును. నీవు పాపము కట్టుకొందువు" అని వరూథిని."పరస్త్రీవాంఛ వలదని మద్గురూపదేశము. ఏడ్చినా ఎండినా నీ కామము నేను కోరను." అని విప్రుడు గార్హపత్యాగ్నిని ప్రార్థించి గృహము చేరెను.

ఇది నిమిత్తమాత్రముగ. ప్రవరుడు ధర్మప్రతినిధిగ. వరూథిని కామప్రతినిధు రాలుగ. ధర్మకామముల సంఘర్షణ సంఘటనగ. కథాసంవిధానము కమనీయముగ. రసపోషణము రమణీయముగ. చతురవచోనిధిత్వము చరితార్థముగ - పెద్దన స్వతంత్రకల్పనమున సంతరించినది మనుచరిత్రములోని వరూథినీప్రవరసంవాదము.

## చతురవచోనిధిత్వము

"కృతి రచింపుము మాకు" అని శ్రీకృష్ణదేవరాయలు అనిన వెంటనే.

> "హితుఁడవు చతురవచోనిధి
> వతులపురాణాగమేతిహాసకథార్థ
> స్మృతియుతుఁడ వాంధ్రకవితా
> పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్." 15ప.1ఆ.

అని పెద్దనను అభినందించెను. అంతేకాదు. స్వారోచిషమనుసంభవము" భవ చ్చతుర రచనకనుకూలంబున్" అని కూడ ప్రతిపాదించెను. (16ప.1ఆ.) పూర్తిపద్య ము పూర్వోదాహృతము. చతురరచనమే చతురవచోనిధిత్వము. అది ప్రతిపద్యము నందును పరిఢవిల్లినది వరూథినీ ప్రవరసంవాదము.

ప్రవరుని మేనికాంతి మనసునకు హత్తిన వరూథిని. మన్మథపరవశయై తత్తఱమున పేటెత్తిన లజ్జతో ప్రవరునికి అడ్డు నిల్చెను. ఆమెను చూచి విభ్రాంతుడై చేరజని ప్రవరుడు పల్కిన మాట లివి :

> " ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటి చరించె దోట లే
> కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం

గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే తెరు వెద్ది శుభంబు నీ కగున్." 39ప.2ఆ.

ప్రవరుడు ప్రథమతః చూచినప్పుడు శతపత్రేక్షణ అయిన వరూథిని ప్రకృతము భీతహరిణేక్షణ. శతపత్రేక్షణత్వము సౌందర్యద్యోతకము. హరిణేక్షణత్వమును సౌంద ర్యద్యోతకమేకాని. భీతిహరిణేక్షణత్వము కేవలము సౌందర్యద్యోతకముకాదు. భీతిద్యో తకము కూడ. భీతహరిణేక్షణసమాసమునందు "భీత"విశేషణము వ్యర్థము కాదు. విశేషణార్థము విశేష్యార్థమును కుంచింపజేయును. గోడ అనిన ఏ గోడయైనను అగును. తెల్లగోడ అనిన తెల్లని గోడయే అగును. ప్రతి గోడ కాదు. తెల్లదనమునకు ప్రాధాన్యము అట్లు భీతహరిణేక్షణ అనిన భీతికే ప్రాధాన్యము. ప్రీతికి కాదు. ప్రవరుని చూచినపుడే వరూథిని బిత్తరపుచూపు అనిమేషస్థితిని మాన్పెను. (33ప.) ప్రకృతము తత్తఱమున పేెత్తిన లజ్జను అడ్డము నిల్పినది. బిత్తరపు చూపులు. తత్తఱపు చూపు లు ప్రవరునికి భీతహరిణేక్షణములుగ కనిపించినవి. బెదరిన చూపులు అందములు చిందించునవి కావు. భయాందోళనములు స్పందించునవి. వరూథిని పేెత్తిన లజ్జ ప్రవరునికి రేకెత్తిన భీతి అనిపించినది. అందుకు "భీతహరిణేక్షణ" అని సంబుద్ధి. అది ప్రవరుని పరముగ కారుణ్యద్యోతకము. మన్మథపరవశయైన వరూథిని పరముగ విశేషణము విస్మృతప్రాయమై సౌందర్యద్యోతకము కావచ్చును. అది వరూథిని అభిమతార్థమునకు అనుకూలము. "ఎవ్వతె వీవు" అనుట పరిచయప్రశ్న."ఒంటి చరించె దోట లే కివ్వనభూమి" అనుట కుశలప్రశ్న. ఒంటితనము ఏకాంతము. ఓటు లేకపోవుట నిస్సంకోచము. అవి ప్రవరుని పరముగ సానుభూతి ప్రకటించునవి. వరూథిని పరముగ తన ఏకాంతము. నిస్సంకోచము ప్రవరుడు గమనించెనని అభిమ తార్థమునకు అడియాసలు కలిగించునవి.

" నేను భూసురుడను. ప్రవరాఖ్యుడను. దారి తప్పితిని. కొవ్వెక్కి ఈ కొండ కొమ్మునకు వచ్చితిని. మా యూరికి ఏవిధముగ చేరెదను? తెరువేది? తెల్పగదవే. నీకు శుభమగును." అనుట ప్రవరుని పరముగ యథార్థకథనము. వరూథిని ప్రవరుని చూడగానే భూసురుడని గ్రహించినది. "మహీసురాన్వయంబెక్కడ" (35ఉ.) భూసురు డను అని ప్రవరుని స్పష్టప్రతిపాదనము. అంతేకాదు."శుభంబు నీ కగున్" అని ప్రవరుని బ్రాహ్మణాశీర్వాదము. అది విధినిర్వహణము. విధి నిర్వహణము సేయు బ్రాహ్మణప్రవరుడు వరూథిని అభిమతార్థసిద్ధికి ప్రతికూలుడు. కాని వరూథినికి అనుకూలుడే అనిపించు విశేషములును ఇందు కలవు. "దారి తప్పితిన్" అనుట ప్రవరుని పరముగ మార్గవిషయము. వరూథిని పరముగ విధివిషయము. విప్రునికి

దేశాటనము విధ్యుక్తము కాదు. ఒక విధిని పాటించనివాడు మఱొక విధిని కూడ పాటించకపోవుట సహజము. ప్రవరుడు కొండకొమ్మునకు వచ్చినది "క్రొవ్వున;". కొవ్వెక్కినవాడు కోర్కి తీర్చును. ఆశీర్వాదములోని శుభము సర్వసాధారణము. అందు వరూథిని అభిమతార్థము గతార్థము. "దారి తప్పితిన్". "క్రొవ్వున". "శుభంబు నీ కగున్" అను పలుకులు వరూథినికి ప్రవరుడు అనుకూలుడే అనిపించువిశేషములు. ప్రవరుని యథార్థకథనము వరూథిని కథార్థమథనము. ఇది చతురరచనము.

ప్రవరుని కథ విని వరూథిని "కనుఁగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములుం జనుఁగవయు నడుము వడఁకఁగ సెలవి వాఱ నవ్వి" (40ప.) ఇట్లన్నది.

" ఇంతలుకన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతిమి మాట లేటికిన్." 41ప.2ఆ.

ఇది "నర్మగర్భంబుగాఁ బలికి"నట్లు పెద్దన హెచ్చరిక. (42వచ.) నర్మమన పరిహాసము. నర్మగర్భమన పరిహాసము లోపల కలది.

భూసురేంద్ర! అని సంబుద్ధి. నేను "భూసురుడ"నని ప్రవరుడు అనగా, నీవు "భూసురేంద్రుడవు" అని వరూథిని అభిప్రాయము. భూసురేంద్రుడన బ్రాహ్మణశ్రేష్ఠుడని వాచ్యార్థము. భూలోకసురేంద్రుడని వ్యంగ్యార్థము. శబ్దశక్తిమూలకధ్వన్యర్థము. అది. ఇది పద్యములోని ప్రతివాక్యమునకును అన్వయించునవి. "ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేడెదు?" అని ఒక వాక్యము. ఇంతలు కన్నులన ఎంతలు కన్నులు? పెద్ద కన్నులని వాచ్యార్థము. వరూథిని భావించినంత కన్నులని ఒక వ్యంగ్యార్థము. చేరెడేసి కన్నులని వరూథిని చూపించినంత కన్నులని మఱొక వ్యంగ్యార్థము. బ్రాహ్మణశ్రేష్ఠుడా! పెద్ద కన్నులుండగా ఇంటికి దారి ఒకరిని అడుగనేల? అని వాచ్యార్థము. "వదనప్రభూతలావణ్యాంబుసంభూతకమలంబులన వీని కన్ను లమరు"నని వరూథిని భావించినది. లావణ్యాంబుధిలోని కమలములంత కన్నులు కలవాడు జగదేకసుందరుడు. భూలోకసురేంద్రుడు కూడ. సురేంద్రుడు మహాభోగి. అతడు ఇంటికి దారి అడిగినది తన్ను. తాను అతిలోకసుందరియైన మరున్నారీశిరోరత్నము. జగదేకసుందరుడు అతిలోకసుందరిని. భూలోకసురేంద్రుడు మరున్నారీశిరోరత్నమును అడుగవలసినది ఇంటికి దారి కాదు. మహాభోగాను భవము. ఇదొక వ్యంగ్యార్థము. చేరెడేసి కన్నులని చెప్పునపుడు చేయెత్తి

చూపించుట లోకసహజము. వాచికము తోపాటు ఆంగికము. వరూథిని ఆంగికాభిన యమునందు. ఆమె కనుగవ మెఱుగులు చనుగవ చలనములు, తాటంకముల తళతళలు, నడుము కదలికలు ప్రస్ఫుటముగ ప్రదర్శితము లగును. అవి చేరెడేసి కన్నులకు తేవలీలగ కనిపించును. అవి చూచి కూడ భూలోకసురేంద్రుడు మరు న్నారీశిరోరత్నమును అడుగవలసినది ఇంటికి దారి కాదు. మహాభోగానుభవము. ఇది మఱొక వ్యంగ్యార్థము. ఇందును, అందును ఇంటికి దారి అడుగుట పరిహాసగర్భితము.

" ఏకాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులాఁగు అని మఱొక వాక్యము. బ్రాహ్మణశ్రేష్ఠుడు స్త్రీని ఇంటికి దారి అడుగుట, ఏకాంతమునందు నున్న జవరాండ్రను నెపంబడి పల్కరించు విధమని వ్యంగ్యార్థము అంతేకాదు. సురేం ద్రుడు మరున్నారీశిరోరత్నములను వలె, భూలోకసురేంద్రుడైన ప్రవరుడు, బ్రాహ్మణ శ్రేష్ఠుడైన ప్రవరుడు ఏకాంతమునందు నున్న ఎందఱో జవరాండ్రను ఏదో వంకను పల్కరించువాడని, అట్లు ఇంటికి దారి అని తన్ను పల్కరించుట మహాభోగార్థమను వరూథిని ఆశయము కూడ వ్యంగ్యార్థము. ఎందఱో జవరాండ్రను ఏదో వంకను పల్కరించు విధమనుట పరిహాసగర్భితము.

"ఇంతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు" అని ఇంకొక వాక్యము. బ్రాహ్మణశ్రేష్ఠుడు పల్కరించుట నెపమేకాని, వచ్చినదారి వైనము తెలియక కాదని వాచ్యార్థము. భూలోకసురేంద్రుని ఆంతర్యము మరున్నారీశిరోరత్నముతోడి మహాభోగానుభవమే అని వరూథిని ఆశయము వ్యంగ్యార్థము. "నీ కింతభయంబులే కడుగనెల్లిదమైతిమి. మాటలేటికిన్ అని వేఱొకవాక్యము. బ్రాహ్మణశ్రేష్ఠుడు కావున కొంచెమైనను భయము లేకుండ అడుగ లోకువైతిమి" అని వాచ్యార్థము. సురేంద్రునికి రంభాద్యప్సరసలు లోకువ. భూలోకసురేంద్రునికి వరూథిని లోకువ అని వ్యంగ్యార్థము. మాట లేటికిన్ అనగా పలుమాటు లేల అని వాచ్యార్థము. మహాభోగమును అనుభవింపుమని వ్యంగ్యార్థము. ఇదియెల్ల పెద్దన చతురవచోని ధిత్వమునకుచక్కనితార్కాణము.

ప్రవరుని ఆంతర్యము మహాభోగానుభవమని వరూథిని ఆంతర్యము కావున- ఆభిజాత్యము, పాండిత్యము, ప్రావీణ్యము, సద్యోగము, ఉద్యోగము, పేరు, పరివారము, వైభవము తెలిపి ఆతిథ్యమునకు ఆహ్వానించినది. (43-47ప.) ఆతిథ్యము లభించినట్లే అని సరిపెట్టి, ఇల్లు సేరుటకు ఉపాయము చెప్పుమని ప్రవరుడు

కోరెను.(48-49ప.) "ఎక్కడియూరు?" అని ఎగతాళి చేసి (50ప.) వరూథిని తన వాంఛను వాచ్యముగ తెలిపెను. వ్యంగ్యార్థము గ్రహింపని వానికి వాచ్యార్థమే గతి.

"నిక్కము దాఁపనేల ధరణీసురనందన యింక నీ పయిం
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజు బారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల చూఱలఁ బాటల పాడు తేంట్ల సొం
పెక్కిన యట్టి పూవుఁ బొదరిండ్లను గౌఁగిట గారవించెదో" 51ప.2ఆ.

వాచ్యార్థమును గ్రహించిన ప్రవరుడు, "వ్రతులై దినములు గడపెడు విప్రులఁ జనునే కామింప మది విచారము వలదే" అని మందలించి, (52ప.)

" వ్రేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడు వృద్ధు లాఁ కటన్
సోలుచుఁ జింతతో నెదురు సూచుచునుండుదు రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁ డిలు సేరకుండినన్." 53ప.2ఆ.

అని ధర్మకర్మదీక్షాపరతంత్రతను ఉద్ఘాటించెను.

" నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁ బల్కె నో
భావజరూప యిట్టి యెలప్రాయము వైదిక కర్మనిష్ఠలం
బోవఁగ నింక భోగములఁ బొందుట యెప్పుడు యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మా కవుఁగిళ్ల సుఖించుటే కదా" 54ప.2ఆ.

అని వరూథిని ప్రతిఘటించెను. ప్రవరుని ఉక్తికి వరూథిని ప్రత్యుక్తి అప్రతి విధానముగ కలదు. అందుకు" భోగపరుండవయి రమింపుము ననుఁగూడి యిందు" అని (55ప.) నిర్దేశించెను. అంతేకాదు. "గంధర్వాంగనల పొందు గాదని సంసారాంధువునం బడియెద"వని గర్హించెను. (56ప.)"ఎన్ని భవంబులం గలుగు .... వెన్న వలెం గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్" అని ఊరించెను. (57.ప.)

" కుశలత యే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియనిరోధమునన్
గృహుఁడవయి యాత్మ నలంచుట
నశరీరస్వర్గసుఖము సమకొనియుండన్." 58ప.2ఆ.

అని కూడ వితండవాదము చేసెను. ఇట్లు వరూథిని,

"అనినఁ బ్రవరుండు నీ వన్న యర్థమెల్ల
నిజము కాముకుఁడైన వానికి. నకాముఁ
డిది గణించునె? జలజాక్షి! యెఱిఁగితేని
నగరమార్గంబుఁ జూపి పుణ్యంబునఁ బొమ్ము." 59ప.2ఆ.
బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మచరణైకనిపుణచిత్తజనిశితా
జిహ్మగముల పాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై." 60ప.2ఆ.

ప్రవరుడు బ్రాహ్మణప్రవరుడు. బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః అని బ్రాహ్మణశ బ్దవ్యుత్పత్తి. బ్రహ్మజ్ఞాని గమ్యము బ్రహ్మానందాధిరాజ్యపదవి. అతడు ఇంద్రియలోలు డు, మన్మథబాణబద్ధుడు అయిన బ్రహ్మానందాధిరాజ్యపదవీభ్రష్టుడగును. కాబట్టి ప్రవరుడు ఇంద్రియలోలుడు కాడు. మన్మథబాణబద్ధుడు కాడు. వరూథిని వితండవాదమెల్ల వాతోద్ధూతతూలమైనది. ప్రవరుని ప్రచండవాదమెల్ల పతాకస్థాయిని చేరినది. నానావస్థలు పడి (61వచ.2ఆ.) వరూథిని బ్రహ్మానందమునకు వక్రభాష్యము వక్కాణించినది.

" ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప. నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁ గను నా యింపే పరబ్రహ్మ. "మా
నందో బ్రహ్మ" యటన్న ప్రాఁ జదువు నంతర్బుద్ధి నూహింపుమా."
62ప.2ఆ.

ఏ విషయమునందు మనస్సు మొలకెత్తు రక్తిచేత కుండలోని దీపకళిక శోభ కనిపించునట్లు ఊటట చెందునో, ఇంద్రియములు ఇతరములైన ఏ యే విషయములందును ప్రసరింపక ఏ విషయమునందు సుఖమును పొందునో, ఆ ఆనందమే పరబ్రహ్మము. ఆనందోబ్రహ్మ అను వేదవాక్యము అంతరార్థమును తెలిసికొమ్ము అని అర్థము. గాలిలోని దీపకళిక కాంతి నిశ్చలము కాదు. కుండలోని దీపకళిక కాంతి నిశ్చలము. మనస్సు పరమాత్మవిషయమునందు మొలకెత్తు రక్తిచేత నిశ్చలమగుస్థితి సమాధ్యవస్థ. ఇంద్రియములు పరమాత్మవిషయమునందు సుఖమును పొందు స్థితి కూడ సమాధ్యవస్థయే. అట్టి సమాధ్యవస్థలోని ఆనందమే పరబ్రహ్మము. ఆనందో పరబ్రహ్మ అను వేదవాక్యమునకు అర్థము. అంతరార్థమును అదే. సమాధ్యవస్థ

యోగశాస్త్ర విషయము. అది కామశాస్త్రవిషయముగ వరూథిని వక్రభాష్యము.

ఇట్లు వరూథిని తన్ను అంగీకరింపజేయు తత్తఱమును చూచి, ప్రవరుడు సిగ్గు, వెగటు కలిగి, నిస్పృహగ ఒక చిఱునవ్వు నవ్వి ఇట్లనెను.

" ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మేలో హో త్రయీధర్మము
ల్పాపంబుల్ రతి పుణ్యమంచు నిఁక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో మీ సంప్రదాయార్థముల్." 64ప.2ఆ.

బ్రహ్మానందమును రత్యానందమును జేయు పాండిత్యము నీకు తప్ప మఱెవ్వరికిని లేదు. ఋగ్యజుస్సామవేదధర్మములు పాపములు. రతి పుణ్యము అని కామశాస్త్రోపాధ్యాయి అనునట్లు వచించెదవు. ఇక నీతో తర్కము లెందుకు? మోక్షసంపదకు మార్గములైన వేదసూత్రములకు మీ అప్సరసల సంప్రదాయార్థములు ఇవే కాబోలు! అని ప్రవరుడు అధిక్షేపించెను. అంతేకాదు.

"తరుణీ రేపును మాపు హవ్యములచేతం దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైన ట్లన్యముల్ గా వొడల్
తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్." 65ప.2ఆ.

అని ప్రవరుడు స్థిరనిశ్చయమును ప్రకటించెను. అది స్థిరసిద్ధాంతము. వరూథిని వాదమెల్ల ప్రధ్వంసమయినది. "శేషం కోపేన పూరయేత్" అన్నట్లు" కనలుచు ..... గద్దికం దలయూఁచి ...... వనిత తనంతఁ దా వలచి వచ్చిన చుల్కన గాదె యేరికిన్. వెతలం బెట్టకు మింక నన్ననుచు ..... పైపైఁ బడన్ .... కౌఁగిలించి యధరం బాసింప "హా శ్రీహరీ!" యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం బంటి పొమ్మంచుం ద్రోచె"ను.(66-68ప.) వరూథిని ఏడ్చినది. ఎత్తి పొడిచినది. దుమ్మెత్తిపోసినది. (69-70ప.)వరూథిని పరాశరాదిమునులు"తామరసనేత్రలిండ్ల బందాలు కారె" అని ఉద్ఘాటించినది. వరూథిని ఏమి-

" అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేని జవ్వాది పస గదంబించు నొడలు
గడిగికొని వార్చి ప్రవరుండు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి" 74ప.2ఆ.

పొగడి (75,76ప.2ఆ.) ప్రవరుడు. "పావకప్రసాదలబ్ధంబగు పవనజవనంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించెను." (77వచ.2ఆ.) ఇది వరూథినీప్రవరవృత్తాంతము. చతురవచోనిధిత్వమునకు కాణాచి.

## అనంతరకథ

వరూథినీప్రవరవృత్తాంతమును ఒక గంధర్వకుమారుడు తెలిసికొనెను. (67వచ.3ఆ.) అతడు వరూథిని చేత అంతకుముందు తిరస్కృతుడైన రాగాంధుడు.(68ప.3ఆ.)

"ఒక్కొక వేళఁ బద్మముఖు లొల్లమి సేయుదు రొక్క వేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్
పక్కున వేసరం జన దుపాయములం దగు నిచ్చకంబులం
జిక్కఁ గఁ జేసి డాసి సతి చిత్తముఁ బట్టి సుఖింపఁ గాఁ దగున్." 69ప.3ఆ.

అని తలచి అతడు "శాంతరస మొలుకు బ్రహ్మతేజముతోడ (71ప.3ఆ) ప్రవరుడయ్యెను. ప్రవరవిరహపరితప్తయైన వరూథిని సఖీసమేతముగ విహరించు ప్రమదావనమునందు ప్రవేశించి. దేవతార్చనకు పువ్వులు కోయు ప్రవరుని వలె ప్రవర్తించెను. అతడు ప్రవరుడే అనుకొని వరూథిని "కలత్క్వణకాంచియై సమీపించి. గుండె జల్లుమన. కాళ్ల తొట్రుపాటు గదుర. ముఖమునందు దైన్యము ముద్రపడ. కనుదోయి చంచలత కలుగ. లేజెమ్మట గ్రమ్మ. గద్గదిక తనర. కాటుక కన్నీరు కాఱ.

" ఏలర యీ చలం బుడిగి యేలర బాలరసాలమాలతీ
జాలములో శశాంకకరజాలములో వలవంత నశ్రువుల్
జాలుగ నాల్గు జాలు నిఁ కఁ జాలు భవంబను నంత కాఁ కకుం
బాలయి రాత్రి పంచశరు బారికిఁ జిక్కితి నీకు దక్కితిన్." 93ప.3ఆ.

అని ప్రాధేయపడెను. అంతేకాదు. వైరాగ్యము పూని. నిర్దాక్షిణ్యముగ నిరాకరించిన ప్రాణత్యాగము చేసెదనని బెదిరించెను. వాడు ప్రవరుడు కాడు. వియచ్చరప్రవరుడని వరూథినికి తెలియదు. వియచ్చరప్రవరుడు ప్రవరుని వలె పలికెను.

" తల్లిందండ్రియు నన్నుఁ గానని మనస్తాపంబునం బొక్కఁ గా
నిల్లా లార్తిఁ గృశిపఁ గా సవనవహ్నిశ్రేణి చల్లారఁ గా

నిల్చున్ శూన్యత నొంది సొంపు చెడఁగా నిచ్చోట నేఁ జిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యే సుఖమతిన్ భోగించెదం జెప్పవే. 98
ఓ సరసీరుహాక్షి వినవో రతిఁ గౌఁగిట నీవు చేర్చు నిం
పౌ సురభర్తకైనఁ గలదా వలదంచుఁ బెనంగ నేను స
న్యాసినె యొక్కటే తహతహన్ మనసొగ్గదు కేళిపై 'ననా
శ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్య'మనా నెఱుంగవే." 99ప.3ఆ.

ఇంకను నమ్మించుటకు ఆమె దీనతకు వ్రతము విడిచితినని. వాంఛితము తీఱ తన్ను వదలం జెల్లదని ఇచ్చకము లాడెను.

" నీ చనుదోయి సంకుమదనిర్భరవాసన మేన నూన న
య్యో చిరసౌఖ్యముల్ గనుట యొండెఁ దపం బొనరించి పాపముల్
రాచుట యొండెఁ గా కిహపరంబుల కూరక దూరమై వయ
శ్శ్రీ చన వెంబికిం జెడిన రేవఁడ నౌదునె నీరజేక్షణా!" 105ప.3ఆ.

అని సమ్మోహనాస్త్రమును ప్రయోగించెను. వలరాచవాని వలలో పడిన వరూథిని. మాయాప్రవరుని బుట్టలో పడిపోయెను. ఇది వరూథినీమాయా ప్రవరవృత్తాంతము.

వరూథినీమాయాప్రవరుల సుపుత్త్రుడు స్వరోచి. అతడు జన్మించినపుడు అమరశ్రేణులు ప్రసూనవర్షము కురిపించెను. అచటి మునులు జాతకర్మలు. ఉపనయనము చేసిరి. నిగమార్థవేదియే గాక. వివిధాయుధవేది అయిన స్వరోచి యౌవనారంభవేళ విశ్వకర్మ చేసిన నగరిని సామ్రాజ్యాధిపతి అయ్యెను. ఒక్క ఎఱుకతేని కోరికను వేటకు వెడలెను. వేట వర్ణన సుదీర్ఘము. (27వచ.-59ప.4ఆ.) అనన్యసామాన్యము. అల్లసానిపెద్దన శ్రీకృష్ణదేవరాయల వేటను చూచిన అనుభవము గోచరించును. స్వరోచి వేట చాలించి. విశ్రాంతి గైకొనువేళ.

" ఆ విపినాంతరమున "హా!
హా! వనిత ననాథ నబల నార్తివిపన్నం
గావరె యీ పుణ్యమునం
బోవరె" యని పలుకు నాఁడు మొఱ వినఁబడియెన్." 66ప.4ఆ.

ఆ మొఱ వేమఱు చెవి నిడి. జాలిపడి స్వరోచి చూచునెడ భయశోకముల వెక్కి వెక్కి పడుచు ఒక్క యువతి వచ్చెను. ఆమె వచ్చిన తీరు వర్ణన అవస్థాద్యోతకముగ లేదు.

శృంగారరసస్ఫోరకముగ కలదు.

" మట్టెల్ మ్రోయఁగ గబ్బి చన్నుగవ గంపం బంద వేణీభరం
బట్టిట్టు కటిఁ జిమ్మ చీకఁటులుగా నశ్రువ్రజంబోడిక
ల్గట్టం జూపులు చిమ్మి రేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేని యడవిన్ మీనాక్షి దీనాకృతిన్." 68ప.4ఆ.

ఆమె మనోరమ. ఇందీవరాక్షుడను గంధర్వరాజు తనయ. తండ్రి చిన్నప్పుడు గారాబముగ పెంచెను.

" రారాపిల్ల భుజాంగదంబుల మణుల్ రాలంగ విద్యాధరుల్
గారా మొప్పఁగ నెత్తికొండ్రు నను నంకస్థాయినిం జేయఁగా
వారిన్ వీడ్కొని సింహపీఠికఁ జలత్వం బొందు మా తండ్రి మం
జీరం బించుక గల్లుమన్న నవి దాఁ జెప్పంగ నింకేటికిన్." 76ప.4ఆ.

అని మనోరమ అన్నది. అట్టిది యౌవనమున ఆమె. ఆమె తండ్రి కూడ శాపగ్రస్తులెరి. ఒక రాక్షసుడు తఱుమ వచ్చిన మనోరమ కాపాడుమని స్వరోచికి అస్త్రహృదయవిద్యను ప్రయోగోపసంహారరహస్యోపదేశపూర్వకముగ ఇచ్చెను. అది రుద్రవరప్రసాదము. ఆనువంశికముగ ఆమెకు వచ్చెను. (93ప.4ఆ.) స్వరోచి అస్త్రహృదయవిద్యాప్రభావమున రాక్షసుని సంహరించెను. సంహృతుడైన రాక్షసుడు గంధర్వు డయ్యెను. అతడు మనోరమ తండ్రి ఇందీవరాక్షుడే. ఇందీవరాక్షుడు స్వరోచికి ఆయుర్వేదవిద్యను ఇచ్చి. రమానారాయణపరిణయగేయవిగాయ నగంధర్వమైన మందరపర్వతము మీద మనోరమకు పెండ్లి చేసెను. మనోరమ స్నేహితురాండ్రు విభావసి. కళావతి అను యువతులు కూడ శాపగ్రస్తలు. మనోరమ కోరికను స్వరోచి. వారి వ్యాధులను ఆయుర్వేదవిద్యాస్ఫురణమున పరిహరించి. వారిని కూడ పరిణయమాడెను. విభావసి తిర్యగ్భాషావిద్యను ఇచ్చెను. కళావతి పద్మినీవిద్యను ఇచ్చెను. ముగ్గురిని వివాహమాడిన స్వరోచి.

" తమక తమక ప్రియుండని తమకమెసఁగఁ
బడఁతు లుప్పొంగఁ గ్రీడించెఁ బద్మినీప్ర
భావఘటితాన్నపానభూషావిశేష
మాల్యవస్త్రానులేపసామగ్రిఁ జెంది." 62ప.6ఆ.

ఇది పద్మినీవిద్యాప్రభావము. ఇక తిర్యగ్భాషావిద్యాప్రభావమున.

" తగులు నెవ్వఁ డొక్క తరుణికి నొకనికి
మెలఁత వలచు నదియు మే లనంగ
వచ్చుఁ గాని పెక్కు వనితలపైఁ గూర్మి
గలుగుననుట బొంకు గాదె తరుణి." 74ప.6ఆ.

అని సవివరముగ (69-73ప.6ఆ.) చక్రవాకి అనిన పలుకులు ఆలకించి, స్వరోచి సిగ్గున

" తల వాంచి యుస్సురని మదిఁ
దలపోయుచు మానరాని తమకంబున నా
నెలఁతలతో నూఱేడులు
విలసితగతి సౌఖ్య మనుభవించుచు నెలమిన్." 76ప.6ఆ.

శతవర్షానంతరము. ఒక మృగలేడి.

' హుంకారం బొనరించి వే తలఁగు పోహో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడఁగించినారు తలపోయన్ నాకు రోఁతయ్యె మీ
రింకం బోయి వరింపుఁ డొక్కొరుని భోగేచ్ఛన్ నివారించితిన్." 79ప.6ఆ.

అని సతులను అదలించుట (80,81ప.6ఆ.) విని, స్వరోచి

" అరయ నిట్టి రోఁతలకు నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడి సంగమిఁక వీడెదనంచుఁ దలంచి తోన దు
ర్వారములైన కోరికల వంక వివేకము చొప్పు దక్కి యిం
పారఁగ నాఱు నూఱు సురహాయనముల్ చరియించెఁ గమ్మఱన్."
82ప.6ఆ.

అవి వంద సంవత్సరములు. ఇవి ఆరువందల సంవత్సరములు. మొత్తము ఏడు వందల సంవత్సరములు. దేవమానములోనివి. తదనంతరము స్వరోచి మనోరమయందు విజయుడు, విభావసియందు మేరునందనుడు, కళావతియందు విభావసుడు అను ముగ్గురు పుత్త్రులను బడసెను. పద్మినీవిద్యాప్రభావమున ప్రాగ్దిశను విజయాఖ్యపురము, ఉత్తరదిశను గంధవతీపుటభేదనము, దక్షిణదిశను ధారాపట్టణ

ము కల్పించి. ముగ్గురు పుత్రులకు పట్టములు కట్టి "కృతార్థు"డయ్యెను. (84వచ.6ఆ.) తదుపరి స్వరోచి మఱల మృగయావినోదము సాగించెను. ఒక అడవిపందిని చూచి. బాణము గుఱిపెట్టునెడ ఒక ఆడులేడి సమీపించి.

"నృప యీ క్రోడము నీకే
యపకారము సేసె దీని కలుగఁగ నేలా
కృప మదిఁ జొనుపక నాపై
నిపు డీ శరమేసి నిగ్రహించుట యొప్పున్." 89ప.6ఆ.

అనెను. స్వరోచి కారణ మడిగెను. ఆడులేడి సమాధానమిది:

"అన్యసతులయందు నాసక్తుఁ డగువానిఁ
దమక మొదవి కూడఁ దలఁచు కంటె
మరణమైన మేలు మఱి వితర్కింపంగ" 91ప.6ఆ.

అతడెవడని స్వరోచి అడిగెను. నీవే అన్నది హరిణి. అందుకు సిగ్గుపడవలసిన స్వరోచి. "హరిణాంగన వీవు నరుండ నే ముదం బొదవఁగ నీకు నాకు మిథునోచితకృత్యము లెట్లు చేకుఱున్" అని ప్రశ్నించెను. ఆడులేడి "నను నాలింగన మీ వనురాగమునం జేయు మింతియ చాలున్" అనిన స్వరోచి ఆడులేడిని కౌగిట చేర్చెను. (88-94ప.6ఆ.) ఆడులేడి అమాంతము వనదేవత అయ్యెను. స్వరోచియందు మనువర్యుని పడయుటకు ఆడులేడి నయితినని వనదేవత పలుక స్వరోచి అంగీకరించెను.

ప్రవరుడు ధర్మప్రతినిధి. మాయాప్రవరుడు రాగాంధుడు. వరూథిని కాముకి. మఱి దేవమానములోని ఏడువందల సంవత్సరములు పైగా నలుగురు భార్యలతో సంసారము సాగించిన స్వరోచి? మనువర్యుని పడయుటకు మహనీయుడు!

ఇంతవఱకు- ప్రవరవృత్తాంతము. వరూథినీప్రవరవృత్తాంతము. వరూథినీమాయాప్రవరవృత్తాంతము. స్వరోచివృత్తాంతము- మనోరమ. ఇందీవరాక్షుని. విభావసి. కళావతి వృత్తాంతముల తోపాటు- మనుచరిత్రము అయిదువందల అరువదియాఱు పద్యగద్యముల గ్రంథము. వనదేవతాస్వరోచులకు స్వారోచిషుడు జన్మించుట. అచ్యుతుని గుఱించి తపస్సు చేయుట. అచ్యుతుడు ప్రత్యక్షమగుట. స్వారోచిషుడు విష్ణువును స్తుతించుట. సాలోక్యమును కోరుట. విష్ణువు ద్వితీయమనువును చేయుట. స్వారోచిషమనువు పరిపాలించుట మొత్తము ఇరువది మూడు పద్యముల తుది ఘట్టము. (98-120ప.6ఆ.) అది "రససమంచితకథ" అనిపించుకొనదు. ప్రవరవృత్తాం తము

వరూథినీప్రవరవృత్తాంతము. వరూథినీమాయాప్రవరవృత్తాంతము. స్వరోచివృత్తాంతము మాత్రమే "రససమంచితకథలు". అంతేకాదు. స్వరోచిపుత్తుని మనువుగ చేసినది బ్రహ్మాగ సంస్కృతాంధ్రమార్కండేయపురాణములందు కలదు. విష్ణువుగ శఠకోపయతి శిష్యుడైన అల్లసాని పెద్దన అన్యథాకల్పనము.

ఇట్లు ప్రతివృత్తాంతము మూలము నిమిత్తమాత్రముగ ప్రపంచీకరించి. కథాసంవిధానము కల్పించి. రసపోషణము రంజించి. చతురవచోనిధిత్వము చాటించి. పెద్దన స్వతంత్రకావ్యముగ సంతరించినది మనుచరిత్రము.

## అల్లిక జిగిబిగి

పూర్వోదాహృతమైన కాకమాని మూర్తి పాంచాలీపరిణయములోని పద్యము నందు "అల్లసానివాని యల్లిక బిగిసొంపు (జిగిబిగి)" అని కలదు. అనంతరము "ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు" అని కలదు.ప్రసిద్ధచాటుపద్యమునందు "పాండురంగవిభునిపదగుంభనంబును" అని కలదు. పద్యము హరువైనను. పదగుంభనమైనను శైలీవిషయమే. ముద్దుపలుకును శైలీవిషయము. కావున "అల్లిక బిగిసొంపు లేక జిగిబిగి" కూడ శైలీవిషయము కావలయును. కాని "కావ్యరచనాశిల్ప "మని. అది"ఏకవాక్యతాసంపాదన"మని ఒక అభిప్రాయము కలదు.[52]

"- స్వారోచిషమనువునకు పరమోత్తమమానవధర్మ
పరిపాలనాసమర్థమైన జీవశక్తి సంస్కారరూపముగా నతని
జీవసంపుటిలో నున్నదని నిరూపించుటకు ఈ స్వారోచిషమను

సంభవము వ్రాయబడినది ..........

మానవధర్మశాస్త్రమునకు మూలభూతమైన. ప్రధానస్తంభమైన.బ్రాహ్మణధర్మ లక్షణములన్నియు ప్రవరునియందుండి. వాని జీవసంపుటియందుండి. యది స్వరోచియందు సంక్రమించి. స్వారోచిషమనువుయొక్క జీవసంపుటిలోఁ జేరినవి ..

(స్వరోచి) తల్లి దేవతాస్త్రీయైన అప్సరస. తండ్రి దేవయోనివిశేషమైన గంధర్వుడు. "తత్ప్రవరదేహనిబద్ధశిఖిదీప్తిశాంబరీమహిమచే సంగ్రహించి"న ఆ గంధర్వుని సంయోగసమయమునందు 'చలనమేదిన' వరూథినియొక్క'మానసాబ్జమున' ఆశిఖిదీప్తి నిలిచి 'తేజోమయంబైన వృద్ధి'నందినది .........."ప్రవర దేహసమిద్ధశిఖిదీప్తి" జన్మించు శిశువుయొక్క శరీరము దేవతాలక్షణము కలది. లోని జీవుఁడు

ప్రవరలక్షణము కలవాడు ...... వాడు దేవయోనివిశేషమే. కాని మనస్సు పరమోత్తమమైన బ్రాహ్మణలక్షణములు కలది. ఈ రెండును మనువునకుఁ గావలయును ....... ఈ రెండును వారి గర్భమున జన్మించిన స్వరోచియందుఁ గలవు .......

స్వరోచి మృగయాకౌతుకము కలవాఁడు. ఇది రాజలక్షణము. అతఁడు ధనుర్విద్యాపారంగతుఁడు. అది రాజలక్షణము. అతఁడు బహుస్త్రీప్రియుడు. ఇదియు రాజలక్షణము. ఆతఁడు శరణాగత రక్షకుఁడు. ఇదియు రాజలక్షణము.

మనోరమ స్వరోచికి 'అస్త్రహృదయ'మన్న విద్య నిచ్చెను. అది సకలరిపునాశకము. యశస్కరము. మనోరమ చెలికత్తెలలో నొకతె విభావసి. మృగపక్షిజాతుల భాషల నెఱుంగు విద్యను స్వరోచి కిచ్చెను. రెండవ యామె కళావతి. పద్మిని యను విద్య నిచ్చెను. దానివలన నభీష్టసౌఖ్యములు సిద్ధించును. ఇవి యన్నియు మానవజాతి కోర్కెలు. ఈ కోర్కె లన్నియు విద్యలచేత ఫలించును. ..... ఈ ఫలితములు దివ్యమంత్రములచేత సాధ్యములు. ఆ మంత్రములు తపశ్శాలురకు వశంవదములు ....... దీని సర్వస్వరూపము రాశీభూతమై. సూక్ష్మమై స్వరోచి జీవసంపుటియందు సంస్కారరూపముగా నిస్సంశయముగా భాసించును. .......

ఇంక మిగిలిన దొక్కటే కలదు. ... జన్మయెత్తి నంతనే పురుషునకు బహుస్త్రీగత వాంఛ సహజముగా నున్నది. ..... జీవుఁడు నిరంతరప్రవణశీలుఁడై యెచ్చటికిఁ బోవును? ఏమి యగును? ఈ జీవునకు ముక్తి యెప్పుడు/ తా నేకరూపుఁడని తెలిసినప్పుడు ...... మనువై జన్మించిన వాని జీవసంపుటియందు తల్లక్షణము సంస్కారముగా నుండవలయును గదా! ఈ సంస్కారము కూడ స్వరోచికిఁ గలుగవలయును .... స్వరోచి జీవసంపుటియందుఁ బుట్ట బోవుమనువుయొక్క పరమసంస్కారమంతయుఁ గలిగియున్నది గాని. స్వరోచి కా పరిణతి లేదు.

వనదేవతకు. స్వరోచికి స్వారోచిషుఁడు జన్మించెను. ఆ జీవుని లక్షణము వేఱు. అతఁడు పుట్టినంతనే శాంతిదాంతి దయాసత్యశౌచనిరతుండై యకామతఁ జిరతపం బాచరించెను. ఆ జీవుఁడు పండినవాఁడు. మనువగుటకు నీ స్వరోచి ప్రవర గంధర్వుల సంస్థియాసంపుటియంతయు నతని జీవసంపుటిలో నిక్షిప్తము కావలయును. అయినది. మనువైనాడు ......

ఇది స్వారోచిషమనుసంభవకథ. ఇది ఏకవాక్యత సాధించిన శిల్పములోని పరమమైన లోతు."

ఇందు ప్రవరుని బ్రాహ్మణధర్మలక్షణములు స్వరోచికి సంక్రమించినట్లు కలదు. చింత్యము. స్వరోచికి బ్రాహ్మణలక్షణములు లేవు. రాజలక్షణములే కలవు. అవి ప్రవరుని వలన సంక్రమించునవి కావు. మాయాప్రవరుని వలనను సంక్రమించునవి కావు. వరూథిని వలన కూడ సంక్రమించునవి కావు. అంతేకాదు. ప్రవరుడు ఏకపత్నీవ్రతుడు. స్వరోచి బహుపత్నీవ్రతుడు. చక్రవాకి ప్రత్యాఖ్యానమునందు (69-73ప.6ఆ.) ఒక పద్యమిది:

"పలువురయందు నొక్కనికి బ్రాతియు నొక్కనియందుఁ జూడ న
గ్గలమగు ప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుత మట్లు గాక యి
వ్వెలఁదులయందుఁ గూర్మిపస వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గదీ జలరుహాక్షు లకుం బ్రియ మెవ్విధంబునన్." 70ప.

హరిణోత్తంసము అభిశంసనమునందును (79-81ప.6ఆ.) ఒక పద్యమిది:

"బరు వన కింతులం దనకుఁ బల్వురఁ గూర్చుట భోగవాంఛఁ గా
కరయఁ గ నొండు గాదు ధనమన్న ధ్రువంబుగ నంగనాజనో
త్కరసముపార్జితం బటులు గావున వీనికి లే దిహంబునుం
బరమును నన్నూ నట్ల పఱుపం బని లేది చెప్ప నేటికిన్." 80ప.

పశుపక్షుల పరామర్శ విని కూడ స్వరోచి ప్రవర్తనమిది:

" ఆరయ నిట్టి రోఁతలకు నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడి సంగమిఁక వీడెదనంచుఁ దలంచి తోన దు
ర్వారములైన కోరికల వంక వివేకము చొప్పు దక్కి యిం
పారఁ గ నాఱు నూఱు సురహాయనముల్ చరియించెం గ్రమ్మఱన్."

స్వరోచి పరివర్తనము క్షణికము. ప్రవర్తనము దేవమానములోని ఆఱువందల సంవత్సరములు. అంతకుముందు పందసంవత్సరములు. ఇది ప్రవరుని పరమోత్తమబ్రాహ్మణధర్మలక్షణము కాదు. వరూథినీమాయాప్రవరుల మహాకాముకధర్మలక్షణము.

" మున్ను విప్రాకారమునఁ గూడుచో శంకఁ
గనుమూయఁ బనిచె నా ఖచరభర్త
యవ్వరారోహయు నాసక్త గావున
నిచ్చలో నటు సేయ నియ్యకొనియె
నా ప్రతిజ్ఞాపూర్తి యయ్యెఁ దనంత న

వ్వనితకు రతిపారవశ్యపటిమ
నపుడు తత్తవరదేహసమిద్ధశిఖిదీప్తి
శాంబరీమహిమచే సంగ్రహించి
నట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ
జలన మేదిన మానసాబ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి
మేటి గర్భంబు నెలలు తొమ్మిదియు నిండె. 3
అనంతరంబ యొకానొక పుణ్యదినంబున 4
తేజం బజ్జభవాండగేహమునకున్ దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జేరంబోని లగ్నంబునన్
రాజీవాక్షి గుమారుఁ గాంచె సుమనోరాజన్యమాన్యున్ జనుల్
జేజే వెట్టఁ బ్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రహర్షింపఁ గన్." 5ప.4ఆ.

అను మనుచరిత్రములోని స్వరోచి జన్మవృత్తాంతము మార్కండేయపురాణములోని.

"తతః కాలేన సా గర్భ మవాస మునిసత్తమ
గంధర్వవీర్యతో రూపం చింతనా చ్చ ద్విజన్మనః 4శ్లో.
"జజ్ఞే బాలో ద్యుతిమాన్ జ్వలన్నివ విభావసుః" 6శ్లో60అ.

అను శ్లోకపంక్తులకు ప్రపంచీకరణము. ప్రవరరూపచింతనము చేత తేజము. గంధర్వవీర్యధారణముచేత శీలము. వరూథినివలన స్వరోచికి సంక్రమించుట సహజము. స్వరోచి తేజము స్వారోచిషునకు సంక్రమించినది. స్వారోచిషుడును తేజోనిధి. (98ప.6ఆ.) స్వరోచిశీలము స్వారోచిషునకు సంక్రమింపలేదు. ప్రవరుని శీలము సంక్రమించినది.

" ... .... స్వారోచిషాఖ్య నతఁ డు
శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుఁ
డై యకామతఁ జిరతపం బాచరించె
నచ్యుతునిఁ గూర్చి ... ... ... " 99ప.6ఆ.

స్వారోచిషుని శాంతి, దాంతి.. సత్యము, శౌచము, అకామత ప్రవరలక్షణములు. తాత లక్షణములు మనుమనికి సంక్రమించుట కూడ సహజము. స్వారోచిషుని చిరతపము స్వలక్షణము. ప్రవరునిది కర్మమార్గము. స్వరోచిది రాజమార్గము.

గిమ్మన నీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌను గాన రా
దమ్మకచెల్ల వాని వికచాంబకముల్ శతపత్రజైత్రముల్. 6ప.3ఆ.
"వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతాం
లోలత్తంత్రుల మేళవింపఁ గదవే లోలాక్షి దేశాక్షికిన్." 57ప.3ఆ.
"పలాశి దాసి రాజుఁ జూచి పల్కె నోరి నోరి కీ
పొలానఁ బెన్ పొలాన లేకపోవ నీవు దోఁ చితా
బలా బలాలి తోడ బాలఁ బట్టి బిట్టు చుట్టి నిన్
హళాహళిన్ హలాహలాభయో బుభుక్షఁ దీర్చెదన్." 98ప.4ఆ.
"రాజు చూడ్కి కపుడు రాజీవముఖి చూడ్కి
యెదురుకొనియె లజ్జఁ గొదికి కొదికి
జడిసి జడిసి జహ్నుసంభవాంభోవేణి
కెదురు లెక్కు మీల కొదమ లనఁ గ." 83ప.5ఆ.
"చలిగాలి బొండుమల్లెల పరాగము రేఁచి
నిబిడంబు సేసె వెన్నెల రసంబు
వెన్నెల రసముబ్బి వెడలించె దీర్ఘికా
మందసౌగంధికమధునదంబు
మధునదం బెగఁబోసె మాకందమాలికా
క్రీడానుషంగి భృంగీరవంబు
భృంగీరవం బహంకృతిఁ దీఁగె సాగించెఁ
బ్రోషితభర్తృకారోదనముల
విపినవీథుల వీతెంచెఁ గుపితమదన
సమదభుజనతసుమధనుష్టాంకృతములు
సరసమధుపానవిధువనోత్సవవిలీన
యువతియువకోటి కోరికల్ చివురులొత్త." 29ప.6ఆ.

ఇట్లు సరసమృదుమధురపదసుదృఢబంధము కథాకథనమునందు. పాత్రలసంభాషణములందు. వర్ణనములందును సర్వత్ర కలదు. సరళమైన శైలి సమధికము. కఠినమైనశైలి క్వాచిత్కము. జటిలమైనశైలి పుళక్కి. ఇది "అల్లసాని వాని అల్లిక జిగిబిగి."

# వర్ణనాభూయిష్ఠత

నంది తిమ్మన పారిజాతాపహరణము వలె అల్లసాని పెద్దన మనుచరిత్రము కూడ వర్ణనాభూయిష్ఠము. పారిజాతాపహరణమునందు కథ స్వల్పము. ఆద్యంతము లందు కలదు. మనుచరిత్రమునందు కథ సమధికము. అంతట కలదు. పారిజాతాపహరణము 455 పద్యగద్యముల ప్రబంధము. మనుచరిత్రము 590 పద్యగద్యముల మహాప్రబంధము. అందువలన పారిజాతాపహరణమునందు వర్ణనలు కొట్టవచ్చినట్లు కనిపించును. మనుచరిత్రమునందు వర్ణనలు తట్టవచ్చినట్లు కనిపించును. కాని పారిజాతాపహరణము వలె మనుచరిత్రము కూడ వర్ణనాభూయిష్ఠమే.

ప్రథమాశ్వాసమునందు పుర (49,50ప.). నాయక (51-57ప.). నగ (72వచ.) వర్ణనములు కలవు. ద్వితీయాశ్వాసమునందు నగ (93-11ప.). నాయిక (25-33ప.). నాయక (35-37ప.)వర్ణనములు కలవు. తృతీయాశ్వాసమునందు నాయికావిరహ(8,9,28-51ప.). ప్రకృతి (10-28ప.). వనవిహార(73-84ప.). జలక్రీడ (85,86ప.). రతి(114,117ప.). దౌహృద (118-128ప.)వర్ణనములు కలవు. చతుర్థాశ్వాసమునందు కుమారోదయ (3-5ప.) నాయక (5-9ప.) ప్రయాణ (27-36ప.) మృగయా (38-60ప.). యుద్ధ (95-116ప.) వర్ణనములు కలవు. పంచమాశ్వాసమునందు ఆశ్రమ (20,21ఉ.) పుర (30ప.). ప్రకృతి (36-40ప.) ఆకాశయాన (44,45ప.). నగ (47-52ప.). నాయక(57-59,71,76ప.). నాయిక (83-86ప.) వివాహ (55-103ప.) వర్ణనములు కలవు. షష్ఠాశ్వాసమునందు నాయిక (96ప.). కుమారోదయ (99,100ప.). నాయకాభ్యుదయ (101 118,119ప.). దశావతార (106-115ప.) వర్ణనములు కలవు.

ప్రకృతివర్ణనములందు సంధ్యాకాల. సూర్యాస్తమయ. అంధకార. అభిసారికా. చంద్రోదయ. చంద్రికావిహార. చంద్రాస్తమయ. శుక్రోదయ. కృకవాకుకూజిత. దీపకళికావర్ణనములు కలవు. విరహవర్ణనమునందు శీతలోపచార. చంద్రోపాలంభ. మన్మథోపాలంభవర్ణనములు కలవు. వనవిహారవర్ణనమునందు పుష్పాపచయఘట్టము ద్విరదగతిరగడయందు కలదు. ప్రయాణవర్ణనమునందు ఆకాశయానవర్ణనము కలదు. అశ్వవర్ణనమును కలదు. మృగయావర్ణనమునందు అరణ్యవర్ణనము కలదు. పంచమాశ్వాసములోని నగవర్ణనమునందు సముద్రవర్ణనము స్మరణప్రాయముగ కలదు. వివాహవర్ణనమునందు వధూవరుల శృంగారనైపథ్యములు. వరుని ఊరేగింపు. వనితల వరావలోకనము (60-70ప.5ఆ.) విడిది. తెర. కన్యాదానము. మధుపర్కము.

తలంబ్రాలు. మంగళసూత్రధారణము. హోమము. సన్నెకల్లు త్రొక్కించుట. అరుంధతీదర్శనము. చదివింపులు. కట్నములు. కానుకలు వర్ణింపబడినవి. ఇవియెల్ల అవాంతరవర్ణనములు.

మంత్ర. దూత్య. మద్యపానవర్ణనములు వినా మహాకావ్యలక్షణమైన అష్టాదశవర్ణనలక్షితమైనది మనుచరిత్రము.

# పూర్వకవితాచర్వణము.

పూర్వకవితాచర్వణము సర్వకవిసాధారణము. అందు శ్రీనాథుని పూర్వకవితాచర్వణము అగ్రేసరమైనది. అట్టిది శ్రీనాథకవితాచర్వణమే పెద్దన మనుచరిత్రమునందు మకుటాయమానముగ కలదు.

" కుతపవేళలయందు నాకొన్నవారి
కమృతదివ్యాన్న మిడు విశాలాక్షి గౌరి. 3 ప.2౪.
"విశ్వపతిదేవి మధ్యాహ్నవేళఁ బెట్టు
నమృతపాయసదివ్యాన్న మనుదినంబు." 148ప.7ఆ.

అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. "అంశోऽ ష్టమోऽ హ్నః కుతపోऽ స్త్రియామ్." అని అమరము. పగలు పదియేను భాగములందు ఎనిమిదవ భాగము కుతపసమయము. కాబట్టి కుతపవేళ ఇంచుమించు మధ్యాహ్నవేళయే.

"ఈ విధమున నభ్యాగత
సేవాపరతంత్రసకలజీవనుఁడయి భూ
దేవకుమారకుఁ డుండం
గా విను మొకనాఁడు కుతపకాలమునందున్." 58ప.
"చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు." 59ప.1ఆ.

అని పెద్దన మనుచరిత్రమునందు కలదు. ఇట మూలమునందు కుతపకాల నిర్దేశము లేదు. కాని. ఆతిథ్యభ్యాగతులు వచ్చుకాలము. ఆతిథ్యమిచ్చు కాలము కుతపకాలమే. పెద్దన సమయనిర్దేశము శ్రీనాథకవితాచర్వణము.

ఇది విమర్శకు గుఱియైనది. ఔషధసిద్ధుడు ఇంచుమించు మధ్యాహ్నము వచ్చెను. ప్రవరుడు ఆతిథ్యమిచ్చెను. తీర్థయాత్రాగోష్ఠి సాగించెను. ఔషధసిద్ధుడు

ప్రవరుని పాదములకు పాదలేపము పూసెను. "ఆ మందిడి యతఁ డరిగిన" ఇతడు హిమాలయమునకు ఏగెను. అచట పర్యటించెను. అంత జరిగి.

" తలమే బ్రహ్మకునైన నీ నగమహత్త్వం బెన్న నే నియ్యెడం
గల చోద్యంబులు తేపు గన్గొనియెదం గాకేమి నేఁ డేగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్." 12ప.2ఆ.

అని ప్రవరుడు తలపోసెను. ఇంచుమించు మధ్యాహ్నమునకు. మధ్యాహ్నమునకు మధ్య అంత జరుగుట అసంభవము. అని విమర్శ.[53] ఔషధసిద్ధుడు వచ్చిన ఆనాడు గాక మఱునాడు ఉదయము ప్రవరుడు హిమాలయమునకు ఏగెనని సమర్థనము. అయిన ప్రవరుడు ఆనాడు పాదప్రక్షాళనము చేసికొనలేదా? పాదలేపము మంచునీటికే గాని. మంచినీటికి కరగిపోదా? అని ప్రశ్నలు. వ్రణగ్రస్తములైన పాదములను వలె ప్రవరుడు పాదప్రక్షాళనము చేసికొనెనని సమాధానము.[54] హాసజనకము.

" ఇట్లు చనుదెంచు పరమయోగీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేగి ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి
యిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁ జేసి" 60ప.1ఆ.

ప్రవరుడు తీర్థయాత్రాగోష్ఠి చేసినట్లు కలదు. "వ్రేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయు భుక్తి" చేసినట్లు లేదు. మఱునాడు ఉదయము ప్రవరుడు ఏగినను. అవి చేసినట్లు కాదు. తీర్థయాత్రాప్రలోభమున తిరిగివచ్చి చేయవలసినవియే. అవి చేయకుండ ఆతిథ్యమిచ్చుట అపచారము కాదు.

పాదలేపప్రభావమిది :

"పరమంబైన రహస్యమౌ నయిన డాఁపం జెప్పెదన్ భూమిని
ర్జరవంశోత్తమ! పాదలేపమనుపేరం గల్గు దివ్యౌషధం
పురసంబీశ్వరసత్కృపం గలిగెఁ దద్భూరిప్రభావంబునం
జరియింతుంబవమానమానసతిరస్కారిత్వరాహంకృతిన్." 75ప.1ఆ.
దివి బిసరుహబాంధవసైం
ధవసంఘ... ...ంత దవ్వు దగ లే కరుగున్

భువి నంతదవ్వు నేమును
రవరవ లే కరుగుదుము హలాహలుటి నడలన్."76ప.1ఆ.

పాదలేపము పరమరహస్యము. దివ్యౌషధరసము. ఈశ్వరసత్కృపను లభించినది. వాయువేగము కంటె మనోవేగము కంటె మహావేగము కలది. కాంతివేగమును కలది. కాబట్టి వైశ్వదేవాదికము వెంటనే తిరిగి వచ్చి చేయవచ్చును.

పరమయోగీంద్రుడు వచ్చిన సమయము కుతపకాలము. ప్రవరుడు తలపోసిన సమయము మధ్యాహ్నము. మట్ట మధ్యాహ్నము కాదు. సరిగా 12గంటల సమయము మట్టమధ్యాహ్నము 11గం12ని॥ల నుండి 12గంటల వఱకు కుతపకాలము. 3గంటలవఱకు మధ్యాహ్నమే. ప్రవరుడు 12 గంటల తర్వాత హిమాలయమునకు ఏగిన. 2 గంటలకు" పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్" అని తలపోయుట సంగతమే. తర్వాత వరూథినీప్రవరవృత్తాంతము 3,4 గంటలకు ముగిసినట్లు ప్రవరుడు గార్హపత్యవహ్నిని.

"దానజపాగ్నిహోమపరతంత్రుఁడనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండనేనిఁ బరదారధనాదులఁ గోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా!" 76ప.2ఆ.

అని సంస్తుతించుటను బట్టి స్పష్టమగును. పావకప్రసాదము పవనవేగమే కాని(77వప.2ఆ.) పాదలేపప్రభావము వాయువేగము కంటె.మనోవేగము కంటె మహావేగమైన కాంతివేగము. ఇది గమనార్హమైనది. ఇట్లు మనుచరిత్రములోని ప్రవరవృత్తాంతము. వరూథినీప్రవరవృత్తాంతమును ఏకైకదివసప్రవృత్తమే. కుతపకాలనిర్దేశము దోషము కాదు. గుణమే.

ప్రవరుడు "వివిధాధ్వరనిర్మలధర్మదీక్షాపరతంత్రుఁ డైనను."కౌతుకభరవ్యగ్రాంతరంగుండు". "మునిలోకగ్రామణీ! సత్కృపన్ నను మీ శిష్యునిఁ దీర్థయాత్రవలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే" అని (77ప.1ఆ.) ఔషధసిద్ధుని అభ్యర్థించిన తీర్థయాత్రా ప్రలోభి.

"నలిన సంభవు సాహిణము వారువంబులు
కొలము సాములు మాకుఁ గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు

భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి
సత్యలోకము దాఁక సకలలోకంబులు
నాటుపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులె యోగ్య లనుపమాంగి
భారతీదేవి ముంజేతి పలుకుఁజిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాదివిద్యలెల్లఁ
దరుణి నీ యాన ఘంటాపథంబు మాకు" 49ప.2ఆ.

అను శ్రీనాథుని శృంగారనైషధములోని సీసమునకు.

" చిన్నివెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్ట జంత్రగాత్రముల రాల్ కరగించు
విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁడఁ బెట్టినది మాకుఁ
హయమేధరాజసూయములనఁ బేర్వడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకుఁ
గనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవవైకుంఠభర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర." 43ప.2ఆ.

అను పెద్దన మనుచరిత్రములోని సీసము మూసకట్టు. అది హంస ఆత్మచరిత్రము. ఇది వరూథిని స్వీయచరిత్రము.

"యమునానదీసైకతమున జాలరికన్య
చనుదోయి నంటఁడే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు
విహరించెఁ బదియాఱు వేల సతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు

మునిభామినుల నెట్లు మోసపుచ్చెఁ
గొక్కురో కోయని కోడియైయెలుఁగించి
యమరనాయకుఁ డె ట్లహల్యఁ గలసె
మొలక చన్నుల ప్రాయంపు ముద్దుఁగూతుఁ
బట్టుకొనె నెట్లు కవియంగఁ బద్మభవుండు
చందురుం డెట్లు పొందె నాచార్యు భామ
ననుచు విప్రుండు రమియించు నన్యసతుల." 101ప.2ఆ.

అను శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యములోని సీసపద్యమునకు.

" వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి దప్పుఁ జేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టరికము
ననుపుకాడై వేల్పు నాగవాసముఁ గూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైన జంభాసురారి
వారి కంటెను నీ మహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షులై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్రలిండ్ల బందాలు గారె" 73ప.2ఆ.

అను పెద్దన మనుచరిత్రములోని సీసపద్యము అనుసరణము. అది సుకుమారుని వర్తనము. ఇది వరూథిని వాదము.

"కాయజవిక్రియం బడయఁ గాని కులంబున సంభవించి య
న్యాయము సేయునే యిటు దురాత్ముఁ డు పేఁ డు త్రపాభిమానము
ల్మాయఁ గఁ దట్టి యంచు నతిమాత్రము లజ్జితుఁడైన కైవడిం
దోయజషండబాంధవుఁ డధోముఖుఁ డయ్యె నభోంగణమ్మునన్."

అను శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యములోని పద్యమునకు.

"తరుణీ ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా

భరవివశాంగి నంగభవు టారికి నగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్." 10ప.3ఆ.

అను పెద్దన మనుచరిత్రములోని పద్యమును అనుకరణము. ఇది కూడ విమర్శకు గుఱియైనది.

సుకుమారుడు దురాత్ముడు. మన్మథవికారమున లజ్జాభిమానములను ఉజ్జగించి అన్యాయము సేయునే అని సూర్యుడు అథోముఖుడయ్యె ననుట సముచితము.

ప్రవరుడు కర్మదీక్షాపరతంత్రుడు. వరూథిని కామదీక్షాపరతంత్రురాలు. నిరాకరించుట అధర్మము కాదు. అయినను ప్రవరుడు మహీసురాధముడు. క్రూరుడై అరిగెనని సూర్యుడు కషాయదీధితిని రోషభీషణస్ఫురణ వహించెనో అన దాల్చె ననుట సముచితమా? అని విమర్శ[55]. 'సూర్యుడు నభోమణి. ఉన్నతస్థానీయుడు. ప్రవరుడు. మహీసురుడు. అథమస్థానీయుడు. కనుక అథముడు కాగలడు అని ఒక అభిప్రాయము. అగుగాక స్థానభేదమున క్రూరుడు అగునా? నిరాకరించుట అహంకారమా? అయిన మఱి అవినీతిబోధకము కాదా? అను ప్రశ్నలకు అవకాశము కలదు. అందువలన పద్యమే ప్రక్షిప్తమని మఱొక అభిప్రాయము కలదు[56]. సంతృప్తికరము కాదు. ఇది కేవలము శ్రీనాథకవితాచర్వణపరాయణము కాదు. స్థితగతిచింతనము కర్తవ్యము.

వరూథినీప్రవరవృత్తాంతమునకు నాయికానాయకులు వరూథినీప్రవరులు. వరూథిని నాయికాత్వము సంశయము కాని, ప్రవరుని నాయకత్వము నిశ్చయము. వరూథినీ ప్రవరవృత్తాంతమునకు పర్యవసానము ధర్మవిజయము. కామపరాజయము. ధర్మవిజేత ప్రవరుని నిష్క్రమణము నాయకచ్యుతి. కామపరాజిత వరూథిని ఉనికి నాయికాస్థితి. ఆమె అవస్థ పాలైనది. (3-9ప.3ఆ.) అంత సూర్యాస్తమయసమయమైనది. "నాయకస్య కవే శ్రోతుః సమానానుభవ స్తతః" అని సహృదయలక్షణము. నాయకునియొక్క, కవియొక్క హృదయముతో సమానమైన హృదయము కలవాడు సహృదయుడు. నాయకహృదయము ధర్మవిజయము. కవిహృదయమును ధర్మవిజయము. సహృదయహృదయమును ధర్మవిజయము. కాబట్టి కామపరాజిత వరూథిని పరముగ సానుభూతి కలుగదు. సానుభూతి లేనిచో అనంతరకథ సాగదు. రసపోషణము రాణిల్లదు. అనంతరకథకు ఆలంబనవిభావము వరూథినియే. కావున సానుభూతి కలిగింపవలయును. కవి కంటె కర్మసాక్షి సానుభూతి ప్రకటించినచో సహృదయునికి సానుభూతి కలిగితీరును. అందుకే

పద్యము పెద్దనకృతమే. అనంతరకథాప్రయోజనాత్మకము. ప్రవరుని పరముగ విరోధము కలదు. పరిహారమును కలదు.

" స్ఫుటసౌగంధిక రాగరక్తరుచిమైఁ బూనెం జపాసన్నిధి
స్ఫటికం బట్లుదయాద్రిగైరికశిరస్థానస్థితిం జంద్రుఁ డ
చ్చోటు వాయన్ శుచియయ్యె నౌఁ బ్రకృతి నచ్ఛుండైన సన్మార్గి యె
న్నటికిం గూటమి వంక వచ్చు వికృతి న్మగ్నుండు గానేర్చునే." 24ప.3ఆ.

ఇది చంద్రోదయవర్ణనము. ఇందు చంద్రుడు సహజముగ స్వచ్ఛమైన సన్మార్గి. ఉదయాద్రిపైని గైరికశిలలతో గూడిన శిఖరప్రదేశమునందు దాసానిపువ్వు దగ్గఱి స్ఫటికము వలె చెంగలువ ఎఱ్ఱదనము వంటి రక్తకాంతిని పొందెను. ఆ చోటు దాటగానే శుభ్రవర్ణము నందెను. సహజముగ స్వచ్ఛమైన వాడు కూటమి వంక వచ్చు వికృతియందు మగ్నము కాడని సమర్థనము. ప్రవరుడు"శశాంకమనోజ్ఞమూర్తి." చంద్రుని కంటె సహజముగ స్వచ్ఛమైన సన్మార్గి. కథాప్రయోజనము వలన వికృతి కలిగినది. విరోధము తటస్థించినది. కథా ప్రయోజనము సిద్ధించిన తదుపరి పరిహారమే. "సన్మార్గి" అను పదప్రయోగమును బట్టి ఇది ప్రతీయమానార్థము. సూర్యాస్తమయవర్ణనమునందు విరోధము వాచ్యార్థము. చంద్రోదయవర్ణనము పరిహారము వ్యంగ్యార్థము. అది వరూథినీకథాప్రయోజనము. ఇది ప్రవరధర్మపరిరక్షణార్థము.

వరూథిని తరుణి. ఇది కవినిర్దేశము. తరుణీ! అని ప్రవరుని సంబోధనము.(65ఉ.2ఆ.) వరూథిని అనన్యకాంత అని కూడ కవినిర్దేశము. అన్యకాంతుడు లేనిది. కన్య. "అనన్యకన్యాసామాన్యలావణ్యరేఖామదంబునను" అని పెద్దన స్పష్టప్రతిపాదనము. (61వచ.2ఆ.) ఇతరకన్యలకు ఎవ్వరికిని లేని శరీరకాంతిరేఖ వలని మదము. ఆమె కన్య కానిచో అన్యకన్యల ప్రసక్తి అనావశ్యకము."ననవిల్తు మినుకు లావర్తించు పని వెన్నతోడఁ బెట్టినది మాకు" అనుట నిజవృత్తి కాదు. కులవృత్తి.

" కాలమనియెడు సిద్ధుండు గమిచి మ్రింగి
కుతుక మొప్పంగ నుమిసిన ఘుటిక యనఁగ
గగనమందిరదీపికాకళిక యనఁగ
భానుఁ డుదయించె దేదీప్యమానుఁ డగుచు." 55ప.2ఆ.

అను శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని సూర్యోదయవర్ణనమునకు.

" ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితాజాండంబులోఁ జంద్రుఁ డా

ప్పారెం గాలభిషగ్వరుం డవిరతంబై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి ఘుటికాసిద్ధౌషధంబో యనన్." 25ప.3ఆ.

అను పెద్దన మనుచరిత్రములోని చంద్రోదయవర్ణనము చర్వితచర్వణమైన రసోద్గారము. ఇట్టి వింకను కలవు. ఇతరకవుల పూర్వకవితాచర్వణమును కలదు. సంస్కృతకవితాచర్వణమును క్వాచిత్కముగ కలదు. కాళిదాసు మేఘసందేశములోని శ్లోకమిది:

" ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రై
స్త్వయ్యారూఢే శిఖరమచలస్స్నిగ్ధవేణీసవర్ణే
నూనం యాస్యత్యమరమిథునప్రేక్షణీయామవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాణ్డుః."
"బటువయి విఙ్ఞపిఁ గి పరిపాటిగఁ బూచి పరాగపుంజ మొ
క్కొటఁ గలయంగఁ బర్వఁ గొనగొమ్మను గోయిల మించ నొప్పెఁ జెం
గటి యెలమావి హారరుచి గందవొడిం గనుపట్టి నీలతా
స్ఫుటతరచూచుకం బగుచుఁ బొల్చు వనేందిర గుబ్బచన్ను నన్." 75ప.3ఆ.

అని పెద్దన మనుచరిత్రములోని పద్యము. సంస్కృతకవితాచర్వణము స్పష్టము.

## ఆంధ్రకవితాపితామహబిరుదము

"హితుఁడవు" అను పూర్వోదాహృతపద్యమునందు అల్లసాని పెద్దనను శ్రీకృష్ణదేవరాయలు "ఆంధ్రకవితాపితామహుఁడవు" అని నిర్దేశించినట్లు కలదు. మనుచరిత్రములోని ఆశ్వాసాంతగద్యను"ఆంధ్రకవితాపితామహసర్వతోముఖాంక ...... పెద్దనార్యప్రణీతంబు" అని కలదు. అంతేకాదు. పెద్దన చాటుపద్యమునందు.

"ఆంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలు _ "

అని కలదు. ఆంధ్రకవితాపితామహుడన ఆంధ్రకవితాబ్రహ్మ. ఆంధ్రకవితా సృష్టికర్త అని. అతఃపూర్వము లేని ఆంధ్రకవితను- ఆంధ్రీకరణముగ గాక. స్వతంత్రకావ్యరచనముగ మనుచరిత్రమును- పెద్దన సృష్టించుటవలన

ఆంధ్రకవితాపితామహబిరుదము పెద్దనకు అన్వర్థమని ఒక అభిప్రాయము కలదు[57]. కాని మనుచరిత్రము రచింపుమనుటకు శ్రీకృష్ణదేవరాయలు పెద్దనను ఆంధ్రకవితాపితామహుఁడవు అని నిర్దేశించెను. అనగా మనుచరిత్రము రచించుటకు పూర్వమే పెద్దనకు ఆంధ్రకవితాపితామహబిరుదము కలదని అవగాహనమగును. అంతేకాదు. మనుచరిత్రమును రచింపుమనుటకు శ్రీకృష్ణదేవరాయల వలె, హరికథాసారమును రచింపుమనుటకు శఠకోపయతి పెద్దనను ఆంధ్రకవితాపితామహ అని సంబోధించినట్లు హరికథాసారమునందు కలదు. ఆ పద్యము పూర్వోదాహృతము. అనగా హరికథాసారమును రచించుటకు పూర్వమే పెద్దనకు ఆంధ్రకవితాపితామహ బిరుదము కలదని అవగాహనమగును. హరికథాసారము తొలి కృతి, మనుచరిత్రము మలికృతి అనుట ప్రసిద్ధము. కాబట్టి మనుచరిత్రము కంటెను మాత్రమేగాక, తత్పూర్వకృతి అయిన హరికథాసారము కంటెను పూర్వమే, అనగా మనుచరిత్రము కంటె బహుపూర్వమే పెద్దనకు ఆంధ్రకవితాపితామహబిరుదము కలదని స్పష్టమగును. అది మనుచరిత్రమును స్వతంత్రకావ్యముగ రచించుట వలన సిద్ధించునది కాదు. అంతేకాదు. ఎఱ్ఱన నృసింహపురాణము, శ్రీనాథుని హరవిలాసము, భీమేశ్వరపురాణము, శివరాత్రిమాహాత్మ్యము, నంది తిమ్మన పారిజాతాపహరణమును పెద్దన మనుచరిత్రము కంటె ముందే స్వతంత్రకావ్యములు.

తిక్కనకు కవిబ్రహ్మబిరుదము కలదు. కాని తిక్కన కవిసృష్టికర్త కాడు. స్వతంత్రకావ్యసృష్టికర్త కూడ కాదు. కొఱవి సత్యనారనకు ఆంధ్రకవిపితామహబిరుదము కలదు. సత్యనారన ఆంధ్రకవిసృష్టికర్త కాడు. స్వతంత్రకావ్యసృష్టికర్త కూడ కాదు. రామాయణాంధ్రీకర్త. అల్లాడవేమారెడ్డి పోషించిన సంస్కృతకవులలో సరస్వతీభట్టునకు కవితాబ్రహ్మ అను బిరుదము కలదు. అతడు సంస్కృతకవితాబ్రహ్మ అగును. సంస్కృతకవితాసృష్టికర్త కాడు. సంస్కృతకవులు అందఱును స్వతంత్రకావ్యకర్తలే. శివదేవయ్య "అతులితసంస్కృతాంధ్రకవితావలికెల్లఁ బితామహుండనన్ సతతము వన్నెకెక్కె"నని అర్వాచీనగ్రంథమునందు కలదు[58]. అతడు సంస్కృతాంధ్రకవితాపితామహుడు - అనవచ్చును. కాని శివదేవయ్య సంస్కృతాంధ్రకవితాసృష్టికర్త కాడు.

బ్రహ్మశబ్దము శ్రేష్ఠవాచి. తదర్థకమైన పితామహశబ్దమును శ్రేష్ఠవాచియే. తిక్కన కవి శ్రేష్ఠుడు. సత్యనారన ఆంధ్రకవిశ్రేష్ఠుడు. సరస్వతీభట్టు సంస్కృతకవితాశ్రేష్ఠుడు అల్లసాని పెద్దన ఆంధ్రకవితాశ్రేష్ఠుడు. అర్వాచీనకాలమునందు శివదేవయ్య

సంస్కృతాంధ్రకవిశ్రేష్ఠుడు. సత్యనారన బిరుదమునందు ఆంధ్రశబ్దము సంస్కృతకవులను పృథక్కరించునది. పెద్దన బిరుదమునందు ఆంధ్రశబ్దము సంస్కృతకర్ణాటతమిళకవులను పృథక్కరించునది. శ్రీకృష్ణదేవరాయలు ధూర్జటి గుఱించి.

" స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో
యతులితమాధురీమహిమ -"

అని ప్రశ్నించినట్లు చాటుపద్యము కలదు. ధూర్జటిని శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రకవి అనుటకు హేతువు సంస్కృతకర్ణాటతమిళకవుల పృథక్కరణమే. అల్లసాని పెద్దనను "ఆంధ్రకవితాపితామహ" అనుటకు హేతువు సంస్కృతకర్ణాటతమిళకవితా పృథక్కరణమేఅగును.

"బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని నాదు పాదమునఁ దొడిగె"

అనిపెద్దన చాటుపద్యమునందు కలదు. కవిగండపెండేరము బిరుదము. కవితాపితామహబిరుదమును బిరుదము. కవిగండపెండేరబిరుదమునకు కారణము ఆశుకవితావిజయము. "పూతమెఱుంగులుఁ బసరుపూపబెడంగులు" అను ఉత్పల మాలమాలిక సుప్రసిద్ధము. కవిగండపెండేరముతోపాటు కవితాపితామహబిరుదము ను అప్పుడే శ్రీకృష్ణదేవరాయప్రదత్తము కావచ్చును. అది సర్వవ్యాప్తమగును.

అల్లసాని పెద్దన శాసనములు మూడు లభించినవి[59]. రెండు కోకటశాసనములు. ఒకటి అన్నూరు శాసనము. కోకటశాసనములు రెండును 1518వ సంవత్సరము నాటివి. ఒక నెల వ్యత్యాసము. ఒకటి భాద్రపదమాసము. మఱొకటి కార్తికమాసము. ఈ రెండు శాసనములందును అల్లసాని పెద్దనకు ఆంధ్రకవితాపితామహబిరుదము లేదు. అన్నూరుశాసనము 1520 వ సంవత్సరము నాటిది. కార్తికమాసము. ఇందు అల్లసాని పెద్దనకు ఆంధ్రకవితాపితామహబిరుదము కలదు. "ఆంధ్రకవితాపితా మహులయిన పెద్దిరాజుగారు." కావున 1518వ సంవత్సరము కార్తికమాసమునకు తర్వాత.. 1520 వ సంవత్సరము కార్తికమాసమునకు పూర్వమును అల్లసాని పెద్దనకు ఆంధ్రకవితాపితామహబిరుదప్రాప్తి కావలయును. ఆశుకవితావిజయకాలము1518వ సంవత్సరము, హరికథాసారము రచనాకాలము 1519 వ సంవత్సరము, మనుచరిత్రము రచనాకాలము 1520 వ సంవత్సరము కావచ్చును.

# ఆత్మీయత

అల్లసాని పెద్దన "పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందురు"డని ఆశ్వాసాంత గద్యను కలదు. శఠకోపయతి శిష్యుడని అవతారికను కలదు. విష్ణుభక్తుడే కాని వైష్ణవుడు కాడు. కోకటగ్రామములోని సకలేశ్వరునికి భూదానము చేసినట్లు మొదటి కోకట శాసనమునందు కలదు. కోకటగ్రామములోని చెన్నకేశవపెరుమాళ్లకు భూదానము చేసినట్లు రెండవ కోకట శాసనమునందు కలదు. అన్నూరుగ్రామములోని వరదరాజపెరుమాళ్ల నగరు పూర్తిచేయించి, అంగరంగవైభవములకు నిత్యనైవేద్యములకు దీపారాధనమునకు భూదానముచేసినట్లు అన్నూరుశాసనము నందు కలదు. కోకటగ్రామమును వైష్ణవులకు అగ్రహారముగా ఇచ్చినట్లు కోకటము కైఫీయతునందు కలదు[60]. అయినను శివకేశవ సమదర్శనము కలవాడు.మనుచరిత్రము నందు విష్ణుస్తుతి తోపాటు శివస్తుతి కలదు. (1,2ప.1ఆ.)

వరూథిని "కౌఁగిలించి యధరం బాసింప" ప్రవరుడు "హాశ్రీహరీ" అనుట పెద్దన ప్రభావమే. కటికచీకటి.

"మృగనాభిపంకంబు మెయినిండ నలఁదిన
మాయాకిరాతి మైచాయఁ దెగడి
నవపింఛమయభూష లవధరించి నటించు
పంకజాక్షుని చెల్వు సుంక మడిగి-" 19ప.3ఆ

రోదసీగహ్వరమున కవిసెనట. దానవుని మేటి త్రిశూలము" గిరీశగళమూలహాలాహలకాంతితో మేనఱికంబులాడు"ను. (96ప.4ఆ.)

" సాంధ్యనటనచండచండీశపదహతిఁ
ధరణిచక్ర మొదిగి శరధిఁ గ్రుంగ
దొరగల్లు వడియె భూరథేతరభాగ
చక్రమనఁగ నపుడు శశియుఁ దోఁచె" 35ప.5ఆ.

అని సూర్యాస్తమయ. చంద్రోదయవర్ణనము.

స్వరోచి రాజభవనాంగణమునకు చేరవచ్చినపుడు కోలాహలమునందు" వేల్పుగాణలు వాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁ బాటలం దీటుకొను తిన్నని

రవంబులుం గలిసి"నవి. (71వచ.5ఆ.)

స్వారోచిషుని బ్రహ్మ మనువును చేసెనని మూలమునందు కలదు. "తతః స్వారోచిషం నామ్నా ద్యుతిమంతం ప్రజాపతిః మనుంచకార." "మనువుంగా స్వారోచిషు వనరుహగర్భుం డొనర్చె" (103ప.5ఆ.)నని తెలుగు మార్కండేయపురాణము నందు కలదు. విష్ణువు అనుగ్రహించినట్లు మనుచరిత్రమునందు కలదు. అంతేకాదు. స్వారోచిషుడు విష్ణువును గూర్చి బహుకాలము తపస్సు చేయగా, విష్ణువు బ్రహ్మాదులతో ప్రత్యక్షమగును. (101ప.6ఆ.) హరికి స్వారోచిషుడు "సాష్టాంగ మెరగి భక్తిని" పొగడును. (102ప.) విష్ణువును స్తుతించును. (103-106ప.) దశావతారస్తోత్రము సేయును.(107-115ప.) విష్ణువు వరము వేడుమన. స్వారోచిషుడు సాలోక్యము కోరును.(116-117ప.)

" సాలోక్యముఁ దుది నిచ్చెద
నేలు మిల ద్వితీయమనువ వీవై నయధ
ర్మాలోలబుద్ధిఁ దిరముగ
వేలుపులకుఁ దపసులకును విధికిఁ బ్రియముగాన్." 118ప.6ఆ.

అని విష్ణువు "మనుత్వమున కాతని పట్టము గట్టి" విధిప్రభృతులతో అంతర్ధానమగును. విష్ణుస్తుతిలోని "శేషభూతసమస్తశేషి"అను సంబుద్ధి విశిష్టాద్వైత విశేషము. అది శఠకోపయతి శిష్యత్వముద్ర.

ఇవియెల్ల అల్లసాని పెద్దన శివకేశవసమదర్శనమునకు నిదర్శనములు.

# శ్రీకృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు "కవితాప్రావీణ్యఫణీశు"డని నంది తిమ్మన పారిజాతాపహరణమునందు కలదు. (1ప.4ఆ.) "కవితాస్త్రీలోలు"డని అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు కలదు. (45ప.1ఆ.) "సాహితీసమరాంగణసార్వభౌము"డని శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందు కలదు. (44ప.1ఆ.) "అపరభోజు"డని, "కావ్యనాటకాలంకారమర్మజ్ఞు"డని13-7-1513 వ తేదీ తిరుపతి శాసనమునందు కలదు[61]. కనుక మహా కవిపోషకుడు కూడ.

" వీఁడు మనీషి వీఁడు రసజ్ఞుఁడు వీఁ డిపెన్నఁడున్
రాఁడని కృష్ణరాయలతొ నవ్వుచు విన్నప మాచరించు తన్
వేఁడినచో నభీష్టములు వేమఱు నిచ్చుచు ముక్కు తిమ్మఁ డు
న్నాఁ డిఁక ధాత్రిపై కవిజనంబులు బేదవడంగ నేటికిన్ "

అని ఒక అముద్రితచాటుపద్యము కలదు[62]. ఇంతవఱకు నిది ఇనాలోకసంసర్గము లేకపోయిన పేటికాంతర్గతరత్నము. ఇందు ముక్కు తిమ్మన ఇతడు పండితుడు, ఇతడు కవి, ఇతడు రసజ్ఞుడు అని నవ్వుచు విన్నవించిన అందఱికిని శ్రీకృష్ణదేవరాయలు అభీష్టములు నెరవేర్చెనని కలదు. అంతేకాదు. ముక్కు తిమ్మన ఉండగా కవులు పేదలు కావలసిన అవశ్యకము లేదని కూడ కలదు. అనగా ముక్కు తిమ్మన మాటపై శ్రీకృష్ణదేవరాయలు అంతగా కవిపండితరసజ్ఞపోషణము కావించెడి వాడని అర్థము. ఇది ముక్కు తిమ్మన సహకారమునకు, శ్రీకృష్ణదేవరాయల మహాకవిపోషణమునకు నిదర్శనము.

" ఎదురైనచోఁ దన మదకరీంద్రము డించి
కేలూఁతయొసఁగియెక్కించుకొనియె
మనుచరిత్రంబందుకొనువేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని నాడు పాదమునఁ దొడిగెఁ

గోకటుగ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దనకవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగ లేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు."

అని అల్లసాని పెద్దన చాటుపద్యము. కవి ఎదురైనపుడు గజారూఢుడై తన ఏనుగును డించి కేలూత ఇచ్చి ఎక్కించుకొనుట. కృతిని స్వీకరించినపుడు కృతిని. కవిని ఊరేగించుటకు పల్లకీ తన చేతితో పట్టుకొని ఎత్తుట. బిరుదైన కవిగండపెండేరమును కవి ఎడమకాలికి తానే తొడుగుట. అడిగిన చోట కోకటము మొదలైన గ్రామములు అగ్రహారములుగ ఇచ్చుట అన్యరాజులే కాదు; భోజరాజును చేసినవి కావు. శ్రీకృష్ణదేవరాయలు మాత్రమే చేసినవి. ఇవి అల్లసాని పెద్దనకు మాత్రమేకాదు. ఆంధ్రకవిజాతికి గౌరవప్రదము. గర్వకారణము.

కుమారధూర్జటి పుత్రుడు లింగరాజు శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు ధూర్జటి.

"కృష్ణరాయకిరీటకీలితమణిగణా
ర్చితపదాబ్జద్వయశ్రీ వహించి"

నట్లు కలదు[63]. అనగా శ్రీకృష్ణదేవరాయలు ధూర్జటికి పాదాభివందనము చేసెనని అర్థము. ఒక సామ్రాజ్యాధిపతి ఒకానొక కవికి పాదాభివందనము చేయుట సాధారణవిషయము కాదు. అట్టిది శ్రీకృష్ణదేవరాయలు ధూర్జటికి పాదాభివందనము చేసెను. అది శ్రీకృష్ణదేవరాయలకు కవులయెడల గల పూజ్యభావమునకు మూదల.

సమస్యాపూరణమైన సంస్కృతశ్లోకమొకడు కలదు[64].
" శ్రీకృష్ణక్షితిపాలదత్తమణిభి ర్విద్వత్కవీనాం గృహా
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వం గతా
అబ్ధిః కేవలవారిపూరనిలయ స్సంభాష్యతే సజ్జనై
రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః."

ఇది లొల్ల లక్ష్మీధరపండితునిచే పూరింపబడినది. ఇతడు ప్రతాపరుద్రగజపతి ఆస్థానము నుండి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునకు వచ్చిన సంస్కృతపండితుడు.

అబ్ధి. అంభోధి. జలధి. పయోధి. ఉదధి. వారాన్నిధి. వారిధి. అను పదములెల్ల సముద్రమునకు పర్యాయపదములు. అవియెల్ల నీరు కలది అను వ్యుత్పత్త్యర్థము కలవి. సముద్రము కేవలము నీటితోనే నిండియుండుటవలన నీరుకలది అను వ్యుత్పత్త్యర్థము కల పర్యాయపదములనే పలుకుదురు. అని సమస్య. రత్నములు లేక పోవుటవలన రత్నాకరమని పలుకరని ధ్వని. కారణము శ్రీకృష్ణదేవరాయలు దానము చేసిన రత్నములచేత విద్వత్కవుల గృహకుట్టిమములు నానారత్నస్థగితములై. రత్నాకరత్వమును పొంది. సముద్రమునందు రత్నములు లేకుండచేసినవని సమస్యా పూరణము. అతిశయోక్తివిలసితమైనను శ్రీకృష్ణదేవరాయలు విద్వత్కవులకు అసంఖ్యాకరత్నములు దానముచేయుట యథార్థము.

రాయవాచకములోని "నగరి విద్వాంసులు చతుర్వేగి రామాదీక్షితులు. అష్టభాషా కవిత కృష్ణావధానులు. శాబ్దికం పాండిత్యం వెంకటరామశాస్త్రుర్లు. సహస్రావధాని ప్రభాకరశాస్త్రుర్లు " కాక "వెంకటనాథ. స్వయంభూనాథ. ఏకామ్రనాథ"ప్రభృతిసంస్కృతకవులు. కుమారసరస్వతి. జ్ఞానప్రకాశుడు మొదలైన తమిళకవులు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవులని ఒక సమాచారము కలదు[65]. మంగళపురుష అను నిఘంటుకారుడు కలడని మఱొక సమాచారము కలదు[66]. అతని నిఘంటుచూడామణియందు దాతృత్వశబ్దమునకు శ్రీకృష్ణదేవరాయలు ఇచ్చునది అని అర్థము కలదట! సమాచారము లేని సంస్కృతాంధ్రకర్ణాటతమిళకవులు ఎందఱో ఆస్థానకవులు. మఱెందఱో యాతాయాతకవులు.

భువనవిజయభవనమును అలంకరించిన నవరత్నకవులు. అష్టదిగ్గజకవులు శ్రీకృష్ణదేవరాయల మహాకవిపోషణమునకు మకుటాయమానమైన నిదర్శనము. అష్టభాషాకవిత కృష్ణావధానులు సంస్కృతకవి. నంది తిమ్మన. అల్లసాని పెద్దన. మాదయగారి మల్లన. ధూర్జటి. కృష్ణరాయభూషణుడు ఆంధ్రకవులు. తిమ్మణ్ణ. చాటువిట్ఠలనాథుడు కన్నడకవులు. హరిదాసు తమిళకవి. వెరశి నవరత్నకవులు. ఒకరి అభావమున అష్టదిగ్గజకవులు. విజయచిహ్నముగ 1515 వ సంవత్సరమునందు నిర్మించిన భువనవిజయభవనమును నవరత్నకవులు అలంకరించిన కాలము 1515-1520 సంవత్సరముల మధ్యకాలమని. అష్టదిగ్గజకవులు అలంకరించిన కాలము 1520-1524 అని పూర్వోక్తము.

ఇంత మహాకవిపోషకుడు కవితాప్రావీణ్యఫణీశుడు. కవితాస్త్రీలోలుడు. సాహిత్యాంగణసార్వభౌముడు మహాకవి అగుట సహజము.

"పలికి తుత్రేప్వక్షోపమల జాతిఁ బెంపెక్క
రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁ గఁ జె
ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహితలేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి
మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నంధ్రభాషయసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ 13
ఎన్నినుఁ గూర్తునన్న వినుమే మును దాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము మున్ను గొంటి నే
వ న్ననదండ యొక్క మగవాఁ డిఁడ నేను దెలుంగురాయడన్
గన్నడరాయ యక్కొదువఁ గప్పుప్రియాపరిభుక్తభాక్కథన్.14
తెలుఁగదేల యన్న దేశంబు దెలుఁగేను
దెలుఁగు వల్లభుండఁ దెలుఁగొ కండ
యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స." 15ప.1.ఆ

అని స్వప్నమునందు సాక్షాత్కరించిన శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు ఆదేశమున." కృతి వినిర్మింపు" మనిన (44ప.1ఆ.) విద్వజ్జనుల ఆమోదమున శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను రచించినట్లు అవతారికను, ఆశ్వాసాంతపద్యములందును కలదు. కాని శ్రీకృష్ణదేవరాయలు రచింపలేదని, అల్లసాని పెద్దన రచించెననీ; అల్లసాని పెద్దన రచింపలేదని శ్రీకృష్ణదేవరాయలే రచించెనని వాదప్రతివాదములు కలవు[67].

## కర్తృత్వము

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద రచింపలేదనుటకు గల ఉపపత్తులివి :

1. రాజులు కవులు కారు. ఆస్థానకవులు రాజులు రచించినట్లు ప్రకటించుట

కలదు. మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మొదలైన సంస్కృతకృతులు రాయలు రచించినవి కావు. ప్రపంచదర్పణమను గ్రంథమునందు "అల్లసానిపెద్దనార్యేణ సత్యావధూపరిణయే:", "అల్లసాని పెద్దనార్యేణాప్యేవ ముక్తం రసమంజర్యామ్" అని కలదు. సంస్కృతకృతుల తోపాటు ఆంధ్రకృతి ఆముక్తమాల్యద కూడ అల్లసాని పెద్దన కృతమే.

రాజు లందఱును కవులు కాని మాట నిజము. కొందఱు కవులైన మాట కూడ నిజము. ఆస్థానకవులు రాజులు రచించినట్లు ప్రకటించుట వాస్తవము. రాజులే రచించి నను, ఆస్థానకవులు తామే రచించినట్లు ప్రకటించుట కల మాట కూడ వాస్తవము. అయినను రాజకవికృతమైన గ్రంథమును ఆస్థానకవికృతముగ పరిగణించుట లోకరీతి. అది ప్రపంచదర్పణము వంటి అర్వాచీనగ్రంథమునందు గ్రంథస్థమగుట సంభవము. అది నిర్ధారకసాధనము కాదు. మదాలసచరిత్రాదులు అనుపలబ్ధములు. శ్రీకృష్ణదేవరాయల సంస్కృతరూపకము జాంబవతీపరిణయము సముపలబ్ధము. అందు అల్లసానిపెద్దనకృతమనుటకు అంతస్సాక్ష్యము లేదు. అంతేకాదు. అల్లసాని పెద్దన ఆంధ్రకవితాపితామహుడు. సంస్కృతాంధ్రకవితాపితామహుడు కాడు. కవితాప్రావీణ్య ఫణీశుడు, కవితాస్త్రీలోలుడు,సాహిత్యాంగణసార్వభౌముడు, కావ్యనాటకాలంకార మర్మజ్ఞుడును అయిన శ్రీకృష్ణదేవరాయలు సంస్కృతాంధ్రకావ్యములు సంతరించుట అసంభవము కాదు. సుసంభవమే.

2. అప్పకవి "ఆంధ్రకవితాపితామహుండు కొనియె ననుటకుఁ గొనె నని చెప్పెను." అని (129వ.1ఆ.) "విష్ణుచిత్తీయమునందు" అని "పూని ముకుందు" అను పద్యమును ఉదాహరించెను. (131ప.1ఆ.) శ్రీనివాసవ్యాఖ్యయందు,

> "ఈరువగు విష్ణుచిత్తతనయోద్వహనంబును సంస్కృతాంధ్రవా
> గ్గరిమ నలంక్రియారససఖం బగునట్లుగఁ బెద్దనార్యుఁ డు
> ద్ధురఫణితిన్ రచించె-"

అని కలదు. గుడిపాటి వేంకటాద్రి వ్యాఖ్యానమునందు,

> "పేర్మి నల్లసాని పెద్దన యాముక్త
> మాల్యదాఖ్యకృతి సమంచితముగఁ
> జేసె నీవు టీక సేయుము చెఱుకునఁ
> బండు పండినట్లె యుండుఁ గాక."

అని కలదు. కనుక అముక్తమాల్యద పెద్దనకృతమే.

అప్పకవి లాక్షణికుడు. పూర్వుడు. శ్రీనివాసవేంకటార్యులు తర్వాతివారు. అర్వాచీనులు. అప్పకవి వ్యాఖ్యాతల కంటెను పూర్వుడైనను శ్రీకృష్ణదేవరాయలకు శతాబ్దిన్నర తర్వాతివాడు. సమకాలికసమాచారము కాదు. అంతేకాదు.

"ఊపము గలిగెను శయ్యల నొప్పియున్న
నంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు" 26ప.1అ.

అని అప్పకవి అహంప్రత్యయము. శ్రీకృష్ణదేవరాయలు అంఘ్రిభవుడు. అముక్త మాల్యద అగ్రాహ్యము కాదు. గ్రాహ్యమగుటకు పెద్దనకృతి అని కల్పించుట ఆవశ్యకము. అప్పకవి వ్రాత అనంతరలాక్షణికులకు, అర్వాచీనవ్యాఖ్యాతలకు శిరోధార్యము. కాని లాక్షణికోదాహరణములు, వ్యాఖ్యాతృవివరణములు కర్తృత్వనిర్ణ యములకు పరమప్రమాణములు కావు. కాబట్టి అముక్తమాల్యద పెద్దనకృతము కావలసిన ఆవశ్యకము లేదు.

3. అల్లసాని పెద్దన అముక్తమాల్యదరచించినట్లు చాటుపద్యములు కలవు. కాబట్టి అముక్తమాల్యద పెద్దన కృతమే.

ఒక చాటుపద్యమిది :

"కృష్ణరాయల పేరఁ గృతిని నీ వొనరించి
తివి తొల్లి విష్ణుచిత్తీయ మనఁగ
కాఠిన్య మర్థంబు గ్రాహ్యంబు గాదు సా
ధారణుల కని భూధవుఁడు పలుకఁ
దరువాత మనుచరిత్రము రచియించి తు
త్తమకావ్యము మహాద్భుతముగఁ బిదపఁ
బెక్కుకావ్యములు పెంపెక్కరచియించి
మంటివి రాజసమ్మానమునను
భంగ మొందిన యల రామలింగముఖులు
సాటి రాఁ గల వారె నీ తోటి యోర!
ఆంధ్రకవితాపితామహా! యల్లసాని
పెద్దనార్య! విశేషవివేకధుర్య!"

ఇందు చాటుపద్యకర్తృనిర్దేశము లేదు. ఆముక్తమాల్యద గ్రంథనామము విష్ణుచిత్తీయమని కలదు. అర్థవంతమేకాని విష్ణుచిత్తీయమని ఆముక్తమాల్యదయందు లేదు. అప్పకవీయమునందే కలదు. కవి పెట్టిన పేరు కాదు. అప్పకవి పెట్టిన పేరు. ఆ పేరు కల ఈ చాటుపద్యము, అప్పకవీయము తర్వాతి దగుట తథ్యము. ఆముక్తమాల్యద కర్తృనిర్దేశమును అప్పకవి ప్రభావమే అగును. అది నిజమేని అల్లసాని పెద్దన ఆముక్తమాల్యదను వలె మనుచరిత్రమును శ్రీకృష్ణదేవరాయల పేర రచింపవలయును. ఈ చాటుపద్యమునందు ఆముక్తమాల్యద తొలి కృతి, మనుచరిత్రము మలి కృతి అని కలదు.

మఱొక చాటుపద్యమిది :

" ప్రౌఢదీర్ఘసమాసపదములఁ గూర్చి శ్రీ
నాథుండు కూలార్చె నైషధంబు
దాని తల్లిగ నల్లసాని పెద్దన సెప్పె
ముదిమది దప్పి యాముక్తమాల్య
దూహించి తెలియరాకుండ సూరపరాజు
శ్రమఁ గళాపూర్ణోదయము రచించె
నతిశ్లేషశబ్దవాగాడంబరం బొప్పఁ
బస ఘటించెను మూర్తి వసుచరిత్ర
నిట్టి కవులకు నేను వాకట్టు కొఱకు
చెప్పినాఁడ మదీయవైచిత్రి మెఱయఁ
బాండురంగవిజయమును బటిమ దనర
విష్ణువర్ధిష్ణుఁ డగు రామకృష్ణకవిని."

ఇందు చాటుపద్యకర్తృనిర్దేశము కలదు. పాండురంగ, రామకృష్ణపదబంధములు పాండురంగమాహాత్మ్యమును రచించిన తెనాలిరామకృష్ణకవిని జ్ఞప్తికి తెచ్చుట సహజము. తెనాలి రామకృష్ణుడు పాండురంగవిజయము కూడ రచించినట్లు ప్రతీతి కలదు. గ్రంథము లేదు. ఇతరగ్రంథములందు ఉదాహృతపద్యములును మృగ్యము. ప్రతీతికి హేతువు చాటుపద్యమే అగును. అందు తెనాలి రామకృష్ణకవి అని లేదు. పాండురంగమాహాత్మ్యమని కూడ లేదు. చాటుపద్యకర్త తెనాలిరామకృష్ణకవి అయినచో "పాండురంగవిజయమును బటిమ దనర" అను పాదము, "పాండురంగ మాహాత్మ్యముఁ బటిమ దనర" అని ఉండును. పాండురంగమాహాత్మ్యము పాండు

రంగవిజయము కాదు. రామకృష్ణకవి తెనాలిరామకృష్ణుడు కాడు. మఱొక రామకృష్ణుడు. అతడు కూడ అప్పకవి ప్రభావమునకు లోనైన వాడే అగును. ఈ చాటుపద్యమునందు "ముది మది దప్పి" అని ఉండుటవలన మనుచరిత్రము తొలి కృతి. ఆముక్తమాల్యద మలి కృతి అగును.

ఒక చాటుపద్యమునందు తొలికృతి ఆముక్తమాల్యద. మలి కృతి మనుచరిత్రము.మఱొక చాటుపద్యమునందు తొలి కృతి మనుచరిత్రము. మలి కృతి ఆముక్తమాల్యద. పరస్పరవిరుద్ధము. ఇట్టి చాటుపద్యములు కర్తృత్వనిర్ణయమునకు నిర్ధారకసాధనములు కావు. ఆముక్తమాల్యద పెద్దనకృతము కావలసిన ఆవశ్యకము లేదు.

4. మనుచరిత్రములోని పద్యములు ఆముక్తమాల్యదయందు కలవు. కాబట్టి ఆముక్తమాల్యద అల్లసాని పెద్దనకృతము.

మనుచరిత్రమునందు శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైనట్లు కల పద్యములోని సీసపాదములు (101ప.6ఆ.). ఆముక్తమాల్యదయందు శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు ప్రత్యక్షమైనట్లు కల పద్యమునందు కలవు.(12ప.1ఆ.)

మనుచరిత్రమునందు పెద్దన కావించిన శ్రీకృష్ణదేవరాయల వంశవృక్షవర్ణనములోని పద్యములు (18-26, 30-34, 37, 39ప.1ఆ.) ఆముక్తమాల్యదయందు విద్వజ్జనులు కావించిన శ్రీకృష్ణదేవరాయల వంశవృక్షవర్ణనమునందు కలవు. 19-34, 37, 40ప.1ఆ.)

మనుచరిత్రమునందు స్వారోచిషుడు చేసిన దశావతారస్తోత్రములోని ఒక్క పద్యము 112ప.6ఆ.) ఆముక్తమాల్యదయందు విష్ణుచిత్తుడు చేసిన దశావతారస్తోత్రమునందు కలదు. (26ప.4ఆ.)

ఇవి మూడును ఉభయకృతులందును సదృశఘట్టములు.

అల్లసాని పెద్దనకు శ్రీకృష్ణదేవరాయలకు అవినాభావసంబంధము కలదు. పెద్దన యెడల రాయలకు అపారమైన గౌరవము కలదు. పెద్దన శ్రీమహావిష్ణువు వర్ణనములోని నాలుగు సీసపాదములును తేటతెనుగు తేనె లూరించునవి. రసలోలుపుడై రాయలు గ్రహింపవచ్చును. శ్రీనాథుని పద్యమును పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు గ్రహించుట పూర్వోక్తము.[68]

శ్రీకృష్ణదేవరాయలు తన వంశవృక్షమును తానే వర్ణించుకొని ఆత్మస్తుతికి, పరనిందకు పాల్పడుట కంటె, ఆస్థానకవుల వంశవృక్షవర్ణనములను ఆత్మీయము చేసికొనుట అత్యంతసహజము. అత్యంతసముచితము. ఆముక్తమాల్యదలోని వంశవృక్షవర్ణనము నందు, మనుచరిత్రములోని వంశవృక్షవర్ణనమునందు లేనివి ఏడు, పద్యములు కలవు. (35, 37-39, 41-43ప.1ఆ.) అందొక్క పద్యముమాత్రమే రాయల పద్యమే అనిపించును.

రాయల వర్ణనములందు ఒక అత్యపూర్వవిశేషము కలదు. అది పెద్దన వర్ణనములందే కాదు; అతఃపూర్వకవుల ఇతఃపరకవుల వర్ణనములందు మృగ్యము. అతిసామాన్యమైన అంశములను గైకొని, అత్యంతధీమాన్యమైన కల్పనము సేయుట రాయల వర్ణనములలోని అత్యపూర్వవిశేషము.

" కచసక్తఫణికంచుకము మౌళి వీరకే
దారంపుఁ బాగ చందంబు నొందఁ
గలయ నంగమున మర్కటకీటకృతమైన
మగ్గంబు నేత్రసంపద వహింప
ధ్వాంతగహ్వరశిలాతాడితాలికచిక్క
ణాస్రపంకము చంద్రమై పొసఁగఁ
దనుభృశశ్రాంతవేష్టనలగ్నబర్హిబ
ర్హంబు మువ్వన్నెచుంగై చెలంగ
నిద్ర మేల్కాంచి సెలయేట నీడఁ గాంచి
గోపవేషంబు సెడి తొంటి భూపవేష
మగుట య వ్వనమహిమగా నలికి యచటు
విడుచు గజరాజు నీ ధాటి వింధ్యవాటి" 39ప. 1ఆ

ప్రతాపరుద్రగజపతి పసులకాపరి వేషమున వింధ్యపర్వతమునకు పాఱిపోయెను. ఒక చీకటిగుహలో ప్రవేశించెను. ప్రవేశించినపుడు నొసట ఱాయి తగిలి నెత్తురు కాఱెను. అచట నిదురించెను. నిదురించునపుడు పాము కుబుసము జుట్టునకు తగులుకొనెను. మీద సాలెగూడు కట్టెను. అటు ఇటు పొరలినపుడు నెమలి పింఛము లంటుకొనెను. మేలుకొని సెలయేటి నీటిలో తన నీడ చూచెను. పాము కుబుసము పాగా అనిపించెను. నొసటి నెత్తురు సిందూర తిలక మనిపించెను. సాలెగూడు దుకూల మనిపించెను. నెమలి ఫించములు మువ్వెన్నె ఉత్తరీయ

మనిపించెను. గోపవేషము పోయి భూపవేషము వనమహిమను వచ్చెనని భయపడి ఆ చోటు విడిచెను. ఇందు సామ్ము కుబుసము, నెత్తురు, సాలెగూడు, నెమలి ఫించము లు - అతి సామాన్యములైన అంశములు. అవి భూపవేషముగ భ్రమపెట్టిన విధము అతిధీమాన్యకల్పనము. ఇట్టి కల్పనములు మనుచరిత్రమునందు గగనము. ఆముక్తమాల్య దయందు గహనము.

మనుచరిత్రమునందు దశావతారములు కలవు. బౌద్ధావతారము లేదు. ఒక్కొక్క అవతారమునకు ఒక్కొక్క పద్యము కలదు. ఆముక్తమాల్యదయందు ఏకాదశావతార ములు కలవు. బౌద్ధావతారము కలదు. మత్స్యావతారమునకు మూడు, నృసింహావతా రమునకు రెండు రామావతారమునకు రెండు పద్యములు కలవు. మిగిలిన అవతారములకు ఒక్కొక్క పద్యము కలదు. అవతారములోని అంశములకు రెండిట భేదములు కలవు. మనుచరిత్రములోని ఒక్క పద్యమును ప్రక్షిప్తము కావచ్చును. కవిగౌరవముతో పాటు కవితాగౌరవము కారణముగ నిక్షిప్తమును కావచ్చును.

5. ఆముక్తమాల్యదయందు రాజులకు తెలియరాని జానపదవిషయములు, తత్త్వజ్ఞానవిషయములు కలవు. కాబట్టి ఆముక్తమాల్యద అల్లసాని పెద్దన కృతమే.

జానపదవిషయములు, తత్త్వజ్ఞానవిషయములు రాజులకు తెలియరానివి కావు. తెలిసికొను జిజ్ఞాస కలదేని తెలియును. అంతేకాదు. పెద్దనకు తెలియరాని స్థానికవిశేషములు ఆముక్తమాల్యదయందు కలవు. కాబట్టి ఆముక్తమాల్యద పెద్దన కృతము కావలసిన ఆవశ్యకము లేదు.

ఇంత కంటె ఆముక్తమాల్యద శ్రీకృష్ణదేవరాయకృతమే అనుటకు బలవత్తరమైన ఉపపత్తులు కలవు. అవి :

1. మనుచరిత్రమునందు భాష సరళము. భావము స్పష్టము. అర్థము సుగమము. ప్రతిపద్యమునందు భావము సరిపడినట్లుండును. ఆముక్తమాల్యదయందు భాష జటిలము. భావము క్లిష్టము. అర్థము దుర్గమము. అనేక పద్యములందు భావము క్రిక్కిరిసి నట్లుండును. ఆచ్ఛిక పదములు బలవదాకృష్టములు. మనుచరిత్రములోని శైలి అల్లిక బిగిబిగి. ఆముక్తమాల్యదలోని శైలి అల్లిక గజిబిజి.

"సాయంకాలము లం దదీశమురజిత్సద్మస్వనద్దుందుభి
స్ఫాయత్కాహళకాప్రతిస్వనతదోఃప స్సుంజ గర్భంబుల

స్త్రోత్రీయుం గేళివనిం గులాయగమనప్రోత్క్షిప్తదంతస్సర
స్థాన్యయిశ్వేతగరుద్గరుత్పుటపటాత్కారంబుఁ గ్రేంకారమున్." 72ప. 1ఆ.
"పౌలయుం గాడ్పు లుదజ్మహాలయవదంభోజాక్షవక్షస్థల
స్యలఘుస్రజ్మకరందబిందువులఁ బణ్యారంపుఁ బుణ్యాంపుఁ గం
పులఁ దాపత్రయి మీఁటి పీట నటనప్రోద్యోగసజ్జీభవ
ల్లలనావర్జితకైశికక్షరితకహ్లారాళి నల్లార్చుచున్." 73ప. 1ఆ.
"పులు మఖశాలికానికటభూముల మేయుచు నేటి వెంటఁ బె
ల్లలమెడు నీఁఅముం దఱిసి యామ్యపతాకన ధర్మధేనువా
కెలవుల నాడు వాలభుజగిం గని గోండ్రని యంగలార్చుచున్
గళగతఘంటు మ్రోయ నుఱుకం బిడుగుం బలెఁ దాఁకి యుద్ధతిన్."

ఇవి శిరీషకుసుమపేశలములు కావు. ఖడ్గచాలనకౌశలములు. ఏవంవిధమైన శైలి ఆముక్తమాల్యదయందు ఆద్యంతము కలదు. మార్దవము కాదాచిత్కము. కాఠిన్యము సార్వత్రికము. ఇట్టి శైలి అల్లసాని పెద్దనకు ముదిసుది దప్పినను, ముది ముది దప్పినను అలవడుట దుర్ఘటము.

2. మనుచరిత్రములోని వర్ణనములు అపూర్వములు కావు. సర్వకవిసామాన్యములు. ఆముక్తమాల్యదలోని వర్ణనములు అత్యపూర్వములు. అనన్యకవిధీమాన్యములు. అవతారికలోని పూర్వోదాహృతపద్యమేకాదు; కావ్యములోని అనేకవర్ణనములు అట్టివే. వర్ణనావైదగ్ధి అను శీర్షికను అరయునది.

3. మనుచరిత్రమునందు వైదికధర్మము వైభవము నందినది. ఆముక్తమాల్యదయందు రాజధర్మము ప్రాభవము నందినది. మనుచరిత్రములోని వైదికధర్మము వేదప్రోక్తము. ఆముక్తమాల్యదలోని రాజధర్మము శాస్త్రప్రోక్తమేగాక స్వానుభవపూర్వకము. అది పెద్దనకు అందని ఫలము. రాయలకు అందిన ఫలము. ఇందుకు యామునాచార్యవృత్తాంతములోని రాజనీత్యుపదేశము నిదర్శనము.

"చదివి యధర్మభీరున్నతిశాస్త్రవిధిజ్ఞతల న్వయస్సు డె
బ్బదిటికిలోను నేఁబదికి బాహ్యమునై యరుజ న్స్వపూర్వులై
పదమున రాజు ప్రార్థన సమాత్యుఁగఁ గైకొని తీర్చు పెంపువా
రొదవిన నింగియు న్దిగుల నూర్జితమౌటకుఁ బాటు సాలదే." 211ప. 4ఆ.

ఇందు అమాత్యునికి అధర్మభీతి, రాజనీతిశాస్త్రజ్ఞత, ఆరోగ్యము అనువంశికాను

బంధము శాస్త్రోక్తమే. రాజు ఆనతి కాక ప్రార్థన. ఏబదికి పైన డెబ్బదికి లోపు మంత్రి వయస్సు స్వానుభవపూర్వకము. ఆ వయస్సులోని మహామంత్రి తిమ్మరుసును శ్రీకృష్ణదేవరాయలు అప్పాజీ అని పిలుచుట. అప్పాజీ ఆమోదముద్ర లేనిదే రాజ్యని ర్వహణము చేయకపోవుట శ్రీకృష్ణదేవరాయల స్వానుభవమే. రాజాజ్ఞను రాజప్రార్థనగ ఆస్థానకవి పలుకుట అసంభవము.

"భండారముతో హయమద
శుండాలఘటాళి దనదు సొమ్మై పాగా
నుండిన నంతటఁ బాయదె
పండితుఁడును బిరుదునైన పతికిని బయలై." 232ప. 4ఆ.

పండితుడు, పరాక్రమశాలి అయిన పతి శ్రీకృష్ణదేవరాయలే.

"కన్నొకటి నిద్రవోఁ బెఱకంట జాగ
రంబు గావించు భూరుహాగ్రంబు మీఁది
యచ్ఛభల్లంబు గతి భోగ మనుభవించు
నెడను బహిరంతరులపై దృష్టి వలయు." 241ప. 4ఆ.

భోగానుభవము, బహిరంతరులపై దృష్టి శ్రీకృష్ణదేవరాయల స్వీయానుభవమే. ఇట్టి వింకను కలవు. అంతేకాదు. ఆముక్తమాల్యద రాజకవికృతము కానిచో రాజనీత్యుపదేశమునకు ప్రాధాన్యమే ప్రశ్నార్థకచిహ్నా యోగ్యము.

4. మనుచరిత్రమునందు శివకేశవసమదర్శనము కలదు. విశిష్టాద్వైతసూచనము కలదు. ఆముక్తమాల్యదయందు శివకేశవసమదర్శనము లేదు. శైవమతఖండనము కలదు. వైష్ణవమతాంతరీకరణము కలదు. విశిష్టాద్వైతసిద్ధాంతము కలదు. అది కథానుగతమైనను కవి అభినివేశము కలదు.

మన్నారుదేవుడు విష్ణుచిత్తుని, పాండ్యరాజును "వైష్ణవు గా నొనరింపు" మని ఆదేశించెను. (89ప. 2ఆ.) విష్ణుచిత్తుడు పాండ్యరాజసభలో "విశిష్టాద్వైతంబును దేటగాఁ దెలుప" మాటాడిన ప్రమాణమిది :

"ఆదినారాయణుం డాయె నొక్కఁడు: బ్రహ్మ
లేఁడు మహేశుఁడు లేఁడు, లేదు
రోదసి, లేఁడు సూర్యుఁడు లేఁడు చంద్రుఁడు

లేవు నక్షత్రము ల్లేవు నీళ్లు
లే దగ్ని. యట్లుండలీల నేకాకిత
చనదు పెక్కయ్యెదనను చునయ్యెఁ
జిదచిద్ద్వయంబు సొచ్చి యని ఛాందోగ్యంబు
దెలిపెడు నంతరాదిత్యవిద్య
నర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడయగుట
కక్షిణీ యని యష్టదృక్త్ర్యక్షదశశ
తాక్షవిధిరుద్రశక్రాదులందు నొకఁడు
కామి కా శ్రుతియే విలక్షణతఁ దెలిపె"10ప. 3ఆ.

మన్నారుదేవుడు యామునాచార్యునికి పాండ్యరాజు పూర్వవంశ్యుని గుఱించి తెలిపిన విషయమెల్ల (42-47ప. 4ఆ.) శైవమతఖండనమే. ఉపక్రమణమిది :

"వెఱ్ఱి శైవంబు ముదిరి మద్వినుతి వినఁడు
నతి యొనర్పఁడు మామకప్రతిమలకును,
హరుఁడె పరతత్త్వమను మదీయాలయముల
నుత్సవంబుల కులుకు, నెయ్యురును నట్ల" 42ప. 4ఆ.

అట్టి పాండ్యరాజు పూర్వవంశ్యుని సభలో యామునాచార్యుడు "విష్ణుదేవుండె పరతత్త్వంబనియు విశిష్టాద్వైతంబ మతంబు నగుటం బ్రతిష్ఠిం"చెను. (73వచ.4ఆ.) ఇది యెల్ల అల్లసాని పెద్దన ఆత్మీయత కాదు. శ్రీకృష్ణదేవరాయల ఆత్మీయతయే.

5. మనుచరిత్రమునందు మాంసాహారప్రసక్తి లేదు. ఆముక్తమాల్యదయందు మాంసాహారపరిజ్ఞానము మాత్రమేగాక మాంసాహారభుక్తానుభూతిరసోద్గారము కలదు.

"మీటగు మీల నెల్ల మును మ్రింగి క్రమంబుననైన యెండ పె
న్నీటిక వెంటఁ దోఁచు తొగ వేరుబడి న్గొడుపై చెలంగఁ గాఁ
ద్రోటికఁ గర్దమద్రవముతోనె నశించిన బొమ్మిడాయడా
ట్కొటకులంబులం దినె బకోటకులంబు జలహ్రదంబులన్" 54ప. 2ఆ.

ఇందు కొంగల గుంపు మొదట మడుగులలోని పెద్ద చేపలను తిని, పిదప ఎండకు బీటలు వాఱిన బొరియలందు కలువవేళ్ల సందుల కొడుపుల వలె నున్న బొమ్మిడాయ చేపలను, బురదతోగూడి ఎగిరిపడు చేదుచేపలను తినెనని కలదు. పెద్ద

చిన్న. తీపి చేదు. బొమ్మిడాయ చేపల పరిజ్ఞానము మాంసాహారి పరిజ్ఞానమే.

"తారుణ్యాతిగపూతనూత్నఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబుపృథుకమాత్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుం గనరార్పు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్." 69ప. 2ఆ.

ఇందు భోగులకు సాయంకాలములందు. క్రీడావనములోని ఇసుకయందు పాతిన కొబ్బరి బొండముల చల్లని నీళ్లు. దోరమామిడికాయముక్కలతోడి చేపముక్కల కూర తినుట వలన కలుగు త్రేన్పుల గొంతును పోగొట్టునని కలదు. ఆ త్రేన్పుల గొంతు అనుభవైకవేద్యము. అది పెద్దనకు భుక్తానుభూతిరసోద్గారము కాదు. శ్రీకృష్ణదేవరాయలకే భుక్తానుభూతిరసోద్గారము.

కాబట్టి ఆముక్తమాల్యద శ్రీకృష్ణదేవరాయ కృతమే.

## కాలము

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద రచించుటకు హేతువు. స్వప్నమునందు సాక్షాత్కరించిన శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు ఆదేశము. శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు ఆదేశానుసారమే ఆముక్తమాల్యద తిరుపతి వేంకటేశ్వరునికి అంకితము. (16ప. 1ఆ.) ఆముక్తమాల్యద అవతారికయందు శ్రీకృష్ణదేవరాయలకు స్వప్నమునందు శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు సాక్షాత్కరించిన కాలము కలదు.

"మున్నే గళింగదేశజిగీషామనీషన్ దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి హరి వాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున-" 11వచ. 1ఆ.

ఇందు "మున్ను" అనగా ఆముక్తమాల్యదరచనాకాలమునకు పూర్వము. శ్రీకృష్ణదేవరాయలు శ్రీకాకుళాంధ్రమహావిష్ణువును సందర్శించిన కాలమును తెలుపు శాసనము కలదు. అందు రెండు కాలములు కలవు. ఒకటి సందర్శించిన కాలము. మఱొకటి దానమిచ్చిన కాలము. సందర్శించిన కాలము కుంభసంక్రమణపుణ్యకాలము. అది 27-1-1519వ తేదీ.[69] దానమిచ్చిన కాలము శాసనకాలము. ఇది 11-2-1519వ తేదీ.[70] కుంభసంక్రమణపుణ్యకాలమే హరివాసరోపవాసకాలము. కాబట్టి స్వప్నవృత్తాంతఘటనాకాలము 27-1-1519వ తేదీయే. కావున

ఆముక్తమాల్యదారచనాకాలము 27-1-1519 తర్వాత కావలయును.

పారిజాతాపహరణమునందు శ్రీకృష్ణదేవరాయలకు "తిరుమలదేవీవల్లభ" అను సంబుద్ధి ముందు (105ప. 2ఆ.). చిన్నమదేవీజీవితనాయక" అను సంబుద్ధి తర్వాత (1ప. 4ఆ.) కలవు. నంది తిమ్మన తిరుమలదేవి వంక అరణపుకవి కావున, ఆతని కృతియందు అట్లుండుట సహజము. మనుచరిత్ర అవతారికను ఇట్లు కలదు.

"ఆ విభు ననంతరంబ ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగాన్." 33ప. 1ఆ.

ఇందు చిన్నాదేవికి ప్రథమస్థానము కలదు. తిరుమలదేవికి ద్వితీయస్థానము కలదు. ఇట్లు "చిన్నాజీదేవమ్మ, తిరుమలదేవమ్మ"అని స్థానచలనము లేకుండ శాసనములందు కలదు. ఆముక్తమాల్యద అవతారికను ఇట్లు కలదు.

"ఆ విభు ననంతరంబ ధ
రావలయముఁ బూనితీవు రహిమైఁ దిరుమ
ల్దేవియు నన్నపూర్ణా
దేవియు గమలాబ్జముఖులు దేవేరులుగాన్. " 30ప. 1ఆ.

ఇందు చిన్నాదేవి లేదు. తిరుమలదేవికి ప్రథమస్థానము లభించినది. అన్నపూర్ణాదేవికి ద్వితీయస్థానము వచ్చినది. అందుకు హేతువు చిన్నాదేవి అభావమే అగును. చిన్నాదేవి ప్రసక్తి 1517 వ సంవత్సరము తర్వాతి శాసనాదికము లందు లేదని పూర్వాభిప్రాయము.[71] 1521 వ సంవత్సరము నాటి రాయచూరు శాసనమునందు, 1522 వ సంవత్సరము నాటి నలంజీశాసనము నందు, 1542వ సంవత్సరమునాటి హండే అనంతపురచరిత్రములోని సంఘటనమునందు కలదని నూతనాభిప్రాయము.[72] ఇందు హండే అనంతపురచరిత్రము పరమప్రమాణము కాదు. నలంజీశాసనము పరమ ప్రమాణమేకాని, అందు చిన్నాజీదేవమ్మ అని లేదు. చిన్నాదేవి అని కూడ లేదు. చినదేవి అని కలదు. ఆమె అన్నపూర్ణాదేవి కావచ్చును. రాయచూరు శాసనము పరమప్రమాణము. కాబట్టి చిన్నాదేవి అభావకాలము 1517వ సంవత్సరము తర్వాత కాదు. 1521 వ సంవత్సరము తర్వాత మాత్రమే. కావున ఆముక్తమాల్యద రచనాకాలము 1521 తర్వాత కావలయును.

పారిజాతాపహరణమునందు, మనుచరిత్రమునందు ప్రసక్తము కాని శ్రీకృష్ణదేవరాయల యుద్ధవిజయము ఆముక్తమాల్యద అవతారికయందే కలదు. అది సగరపురవిజయము. సగరపురము గుల్బర్గాజిల్లాలోని భీమనదీసమీపమునందలి నస్రతబాద్ సాగర్ అని పూర్వోక్తము. శ్రీకృష్ణదేవరాయలు సగరపురమును స్వాధీనము చేసికొన్న కాలము 1523వ సంవత్సరము.[73]. కావున ఆముక్తమాల్యదారచనాకాలము 1523 తర్వాత కావలయును.

కాబట్టి ఆముక్తమాల్యద రచనాకాలము 1524వ సంవత్సరము.

# మూలము

ఆముక్తమాల్యద అనగా ధరించిన పూలదండను ఇచ్చునది అని అర్థము. అట్లు చేసినది గోదాదేవి. ఆమె వృత్తాంతమే గ్రంథనామమును బట్టి ఆముక్తమాల్యద ఇతివృత్తము కావలయును. అది గోదాదేవి, శ్రీరంగనాథుడు "రంగమందయిన పెండిలి." ఈ ఇతివృత్తమునకు ముందు ఆముక్తమాల్యదయందు ఇతరవృత్తాంతములు కలవు. అవి 1. విష్ణుచిత్తుని వృత్తాంతము. 2. ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము. 3. యామునాచార్యవృత్తాంతము. 4. మాలదాసరి వృత్తాంతము. ఇందు ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము విష్ణుచిత్తుని వృత్తాంతమునందు ఉదాహరణము. మాలదాసరి వృత్తాంతము గోదాదేవివృత్తాంతమునందు నిదర్శనము. అయిదు వృత్తాంతములకు అంతరంగికముగనైన అనుస్యూతసూత్రము లేదు. అయిదు వృత్తాంతముల సంపుటి ఆ [illegible]క్తమాల్యద.

విష్ణుచిత్తుని వృత్తాంతమునకు, యామునాచార్యుని వృత్తాంతమునకు, గోదాదేవి వృత్తాంతమునకు మూలము గురుంపరంపరాప్రభావము. ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమునకు మూలము విష్ణుపురాణము. మాలదాసరి వృత్తాంతమునకు మూలము వరాహపురాణము. కథామూలమే. కావ్యమూలము కాదు. ఆముక్తమాల్యద కూడ స్వతంత్రకావ్యము.

# ఇతివృత్తప్రపంచీకరణము

విష్ణుచిత్తుడు శ్రీవిల్లిపుత్తూరు వాస్తవ్యుడు. శ్రీవిల్లిపుత్తూరు వర్ణనము ఇరువదియాఱు పద్యములందు కలదు. (51-76ప. 1ఆ.) విష్ణుచిత్తుని పరిచయము తొమ్మిది పద్యగద్యములందు కలదు. (77-85ప. 1ఆ.) మధురవర్ణనము ముప్పదియేడు

పద్యము లందు కలదు. (2-38ప. 2ఆ.) పాండ్యరాజు పరిచయము ఆరు పద్యగద్యములందు కలదు. (39వ.-46వచ. 2ఆ.) గ్రీష్మర్తువర్ణనము పాతిక పద్యము లందు కలదు. (47-71ప. 2ఆ.) పరదేశివిప్రుని శ్లోకపఠనము. పాండ్యరాజు ప్రవర్తనము. పరివర్తనము పదాఱు పద్యములందు కలదు.(71-87ప. 2ఆ.) అందు పాండ్యరాజు భోగిని కడకు బయలుదేఱుట అమూలకము. మన్నారుదేవుడు విష్ణుచిత్తుని పాండ్యరాజు సభకు వాదమునకు పంపుట ఎనిమిది పద్యములందు కలదు. (88-95ప. 1ఆ.) ఇందు విష్ణుచిత్తుని విన్నపము.

"స్వామీ నన్ను నితఃపురాపఠితశాస్త్రగ్రంథజాత్యంధు నా
రామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరున్ భవద్భవనదాసున్ వాదిగాఁ బంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబుల్ మీకు రాకుండునే. 91
గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్." 92ప. 2ఆ.

రాయల ప్రపంచీకరణమే. రసవత్తరరచనమే. ఇందు మొదటి పద్యము సుదీర్ఘసమాసభూయిష్ఠము. పరుషాక్షరపదబంధనిబంధము."అపఠితశాస్త్రగ్రంథ జాత్యంధుడు" అట్లుపలుకునా? అని ఒక ఆక్షేపము. నిజముగ విష్ణుచిత్తుడు "అపఠితశాస్త్రగ్రంథజాత్యంధుడు"కాడు. అట్లనుటవినయప్రకటనము. అతడు"అపరనా సంజాతతజ్జన్యనిష్పందద్వైతనుసంవిదాలయుండు" అని ముందే కలదు. (77ప.1ఆ.) రెండవ పద్యము సుకుమారసుందరము. ఇట్టి పద్యములు ఆముక్తమాల్యదయందు విరళము. మొదటి పద్యము వంటి పద్యములు బహుళము. విష్ణుచిత్తుడు పాండ్యరాజు కొలువు కూటమునందు విశిష్టాద్వైతసిద్ధాంతమును ప్రతిపాదించుట పదునాలుగు పద్యగద్యములందు కలదు. (93-99ప. 2ఆ., 2-11వచ. 3ఆ.) విష్ణుచిత్తుని విజయము ఏడు పద్యములందు కలదు. (3-9ప. 4ఆ.) విష్ణుసాక్షాత్కారము ఆరు పద్యములందు కలదు. (10-15ప.4ఆ.) విష్ణుచిత్తుని దశావతారస్తోత్రము పదాఱుపద్యములందు కలదు. (16-31ప. 4ఆ.) విష్ణుచిత్తుని శ్రీవిల్లిపుత్తూరు ప్రవేశము అయిదుపద్యములందు కలదు. (32-36వచ. 4ఆ.) ఇదియెల్ల శ్రీకృష్ణదేవరాయల స్వతంత్రకల్పనమే.

ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము యథామూలము.

యామునాచార్యవృత్తాంతము పరమస్వతంత్రము. అన్యథాప్రకల్పనము. పాండ్యరాజు పూర్వవంశ్యుని వీరశైవము. అతని భార్య వీరవైష్ణవము. యామునా చార్యుని వైష్ణవమతాంతరీకరణము. రాజనీత్యుపదేశమును అమూలకము. శ్రీకృష్ణదేవ రాయల అన్యథాప్రకల్పనము. పరమస్వతంత్రకల్పనము.

శ్రీకృష్ణదేవరాయల తీర్థయాత్రలు వైష్ణవక్షేత్రములకు పరిమితము కాక, శైవక్షేత్ర ములకును పర్యాప్తమగుట రాజధర్మము. శైవమతఖండనము వ్యక్తిధర్మము.

"అశ్రాంతజంగమార్చాశ్రద్ధ వర్తిలు
వేదవిద్ద్విజపూజ వీటిఁ గలిపి
భౌమవారపు వీరభద్రపళ్లెర మిడు
గృహదైవతంబు లిఙ్గింకు లింక
షణ్ణవతిశ్రాద్ధచయ మారఁబెట్టు శం
కరదాసమయ్య భక్తప్రతతికి
నాద్యంబులైన దేవాలయంబులు ప్రాల
నవని నిరాశ మఠాళి నిలుపు
జందె ముత్తరశైవంబుఁ జెంది త్రెంచుఁ
బతితు లారాధ్యదేవళ్లె ప్రాపు్య లనుచు
నుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు
వెండి యే జంగమెత్తిన వెఱఁగుపడును. 43ప. 4ఆ.

ఇది వీరశైవమతసోల్లుంఠనమే. "వెఙ్గి శైవంబు" అను ఎత్తుగడ (42ప. 4ఆ.) వీరశై వవికృతి. యామునాచార్యవృత్తాంతమునందు వర్షర్తువర్ణనము అఱువది పద్యము లందు కలదు. (76-135ప. 4ఆ.) ఋతువర్ణనము శ్రీకృష్ణదేవరాయల స్వీయ కవిత్వము.

యామునాచార్యుడు రామానుజాచార్యుల సమకాలికునిగ గురుపరంపరా ప్రభావమునందు కలదు. విష్ణుచిత్తునికిపూర్వకాలికునిగ ఆముక్తమాల్యదయందు కలదు. విష్ణుచిత్తుడు పన్నిద్దరాళ్వారులలో ఒకడు. నాల్గవవాడు. కాలము తొమ్మిదవశతాబ్ది కావచ్చును. పదవశతాబ్ది యామునాచార్యుడు తొమ్మిదవశతాబ్ది విష్ణుచిత్తునికి పూర్వుడు కాడు. కనుక ఆముక్తమాల్యదయందు చారిత్రికవిరోధము కలదు. "ప్రమాదో ధీమతా మపి."

ఇంతవఱకు ఆముక్తమాల్యద చతురాశ్వాసములు. ప్రధానేతివృత్తమైన గోదాదేవి

పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచు నుండున్" 95ప. 5ఆ.

గోదాదేవి పాడుచునుండ ఉత్తరాయణము వచ్చెను. హేమంత, శిశిర వసంతర్తు వర్ణనములు నలుబదియేడు పద్యములందు కలవు. (97-143ప.5ఆ.) మఱల గోదాదేవి విరహము పది పద్యములందు కలదు. (145-154ప.5ఆ.) ఇదియెల్ల శ్రీకృష్ణదేవరాయల స్వతంత్రకల్పనమే. స్వీయకవిత్వమే.

గోదాదేవి విరహావస్థ అర్థము కాక, విష్ణుచిత్తుడు విష్ణువునడిగినట్లు మూడు పద్యగద్యములందు కలదు. (155-157వచ.5ఆ.) ఇట్లు మూలమునందు లేదు. అది పరమతపమని, ఆమెను శ్రీరంగమునకు తోడ్కొనిపోయి రమ్మని విష్ణువు చెప్పుట. విష్ణుచిత్తుడు అట్లు చేయుట (26వచ. 7ఆ.) మూలానుసారము. శ్రీరంగ వర్ణనము ఒక్క పద్యమునందు కలదు. (27ప. 7ఆ.) విష్ణుచిత్తుని శ్రీరంగనాథసందర్శనము ఏడు పద్యగద్యములందు కలదు.(28-34వచ.7ఆ.) శ్రీరంగనాథస్తుతి అయిదు పద్యములందు కలదు. (35-39ప. 7ఆ.) శ్రీరంగనాథుడు గోదాదేవిని చూచి ఉవ్విళ్లూరుట ఒక పద్యమునందు కలదు. ఆ పద్యమిది:

"దీని చూ పెదురెక్కఁ గానె కా సిరిపట్టి
కిని బోర బిరుదుటెక్కెంబు గలిగె
దీని కౌ నల్లాడఁ గానె కా గర్వించి
యుర్విఁ జైత్రునకుఁ గాలూఁదఁ గలిగె
దీని పాలిం డ్లుబ్బఁ గానె కా రతి చేతి
కిన్నెరద్రిమ్మోఁతకు వన్నె గలిగె
దీని మో మొప్పారఁ గానె కా వాణి రా
యంచలేమకుఁ గులాయంబు గలిగె
దీని పెన్నెఱు లేపారఁ గానె కా ప్ర
పోషితమయూరికి పిరాళి పొందు గలిగె
దీని యడుగులు రంజిల్లఁ గానె కా పి
పాసఁ బడు తేఁటులకు మెట్టపంట గలిగె" 41ప. 7ఆ.

ఇట్లు ఉవ్విళ్లూరి గోదాదేవిని అంతఃపురమునందు ప్రవేశపెట్టి, మాయావధూటిని కల్పించుట, ఇంటికి వెళ్లి ఆమెను గానక విష్ణుచిత్తుడు విలపించుట, శ్రీరంగనాథుని అనుగ్రహమున కనిపించుట పది పద్యగద్యములందు కలదు. (42-51ప. 7ఆ.) గోదాదేవీశ్రీరంగనాథుల వివాహము ఇరువది యొక్క పద్యగద్యములందు కలదు.

(52-71ప. 7ఆ.) ఇవియెల్ల శ్రీకృష్ణదేవరాయల స్వతంత్ర కల్పనములే. వివాహవర్ణము నందు కన్యాదానము. తెర. జీలకఱ్ఱ బెల్లము. తలంబ్రాలు. మంగళసూత్రధారణము. లాజలు. అరుంధతీదర్శనము ఉడుగరలు కలవు. తెలుగు వివాహమే.

మాలదాసరి వృత్తాంతమునందు మాలదాసరి "మహాత్ముఁడు" (4ప.6ఆ.) మహాభక్తుఁడు. పరిచయము ఎనిమిది పద్యగద్యములందు కలదు. (3-10వచ. 6ఆ.) అతడు మంగళకౌశికీగానము సేయుట యథామూలము. కురుంగుడినంబికోవెల శ్రీకృష్ణదేవరాయల స్వతంత్రకల్పనము. మంగళకౌశికీగానవిధానమిది:

"గండాభోగముల న్మదశ్రులహరు ల్గల్గ న్నుతు ల్పాడి యా
దండ న్వ్రేఁగులు డించి భక్తిజనితోద్యత్తాండవం బాడు నా
చండాలేతరశీలుఁ డుత్పులకియై చాండాలిక న్మీటుచున్
గుండు న్నీరుగ నెండ గాలి పసితాఁకుం జూడ కాప్రాహ్ణమున్" 7ప. 6ఆ.

అతడు ఒకనాడు బ్రాహ్మవేళ గాక అర్ధరాత్రమున బయలుదేరుట. శూన్యగ హనవాటికను పాడైన భూమిని పయనించుట. వటవృక్షమును కాంచుట దుర్గంధభూయిష్ఠమైన కాలిబాటను నడచుట. బ్రహ్మరాక్షసుని కాంచుట పదిపద్యములందు కలదు. (11-20ప. 6ఆ.) ఇదియెల్ల ప్రపంచీకరణము. ఇందు మాలదాసరి వర్ణనము. అర్ధరాత్రప్రయాణము. వటవృక్షవర్ణనము. బ్రహ్మరాక్షసుని వర్ణనము. శ్రీకృష్ణదేవరాయల స్వతంత్రకల్పనములు. అర్ధరాత్రప్రయాణమునకు పిల్లి ప్రవేశించిన కోళ్లగూడు లోని కోడికూత హేతుకల్పనము సముచితము. బ్రహ్మరాక్షసుడు మాలదాసరిని భక్షింపదలచుట. మాలదాసరి కురుంగుడినంబిని కొలిచి వత్తుననుట ఇరువది మూడు పద్యగద్యములందు కలదు. (21-43ప. 6ఆ.)ఇది యెల్ల శ్రీకృష్ణదేవరాయల ప్రపంచీకరణమే. ఇందు.

"ఎవ్వని చూడ్కిఁ జేసి జనియించు జగంబు వసించు నిజ్జగం
బెవ్వనియందు డిందు మఱియెవ్వనియం దిది యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన నిన్గదియనేని యన న్విని బంధమూడ్చినన్." 43ప. 6ఆ.

అను పద్యములోని మాలదాసరి శపథము యథామూలము. పద్యము పోతన ప్రభావము. మాలదాసరి కురుంగుడినంబి కోవెలకు ఏగి. మంగళకౌశికీగానము సేసి మరలి వచ్చుట. అతని సత్యసంధతకు బ్రహ్మరాక్షసుడు ఆనందపడుట (44-45ప.)

మూలానుసారము. బ్రహ్మరాక్షసుడు మాలదాసరిని నిరంతరమంగళకౌశికీగీతఫలము గాని, తదర్థఫలముగాని, ఏకయామగీతఫలముగాని, అది కూడ అనిష్టమైన చరమగీతఫలము గాని - ధారవోయుమని పాదాక్రాంతుడై ప్రార్థించినట్లు మూలమునందు కలదు. బ్రహ్మరాక్షసుడు మాలదాసరికి ప్రదక్షిణముచేసి ప్రశంసించినట్లు మూడు పద్యములందు కలదు. (47-49ప.6ఆ.) మాలదాసరి తన్ను పారణసేయుమనుట నాలుగు పద్యములందు కలదు.(50-53ప. 6ఆ.) బ్రహ్మరాక్షసుడు మాలదాసరిని ఏకదివసమంగళకౌశికీగీతఫలమును అడుగుట ఆరు పద్యగద్యము లందు కలదు.(54-59వచ. 6ఆ.) మాలదాసరి ఒక్కనాటి ఫలము కాదు. సరికదా, త్రుటి ఫలము కూడ ఒసగననుట మూడు పద్యములందు కలదు. (60-62ప. 6ఆ.) అయినను బ్రహ్మరాక్షసుడు అర్ధదివసఫలమునైన కోరుట, మాలదాసరి నిరాకరించుట రెండు పద్యములందు కలదు. (64, 65ప. 6ఆ).

"ఏలా నొంచె దదేయ మిల్లడిగి యెంతే బాస మేనం బలం
బో లీలావటుగీతకీర్తనఫలంబో నీయెడ న్మున్ను పా
తాళప్రశ్నలు మాని మేన్గొనుము బేతాళచ్ఛలోక్తిన్ రుషం
దూలింపం దలఁ తేని పుట్టు మఱి నూత్నుల్ద్రవ్వ బేతాళముల్" 65ప. 6ఆ.

అను మాలదాసరి మాటలకు బ్రహ్మరాక్షసుడు కటకటంబడి యుక్తులు చెప్పి పాదముల మీద పడి లేవకుండుట ఒక సుదీర్ఘ వచనమునందు కలదు. (66 వచ.6ఆ.) లక్ష్మణయోగీంద్రుడు - అనగా రామానుజాచార్యులు - గురుసందేశమునకు విరుద్ధముగ శ్రీరంగములోని గుడిగోపురమెక్కి భగవద్గీతాచరమశ్లోకార్థమును లోకమునకు చాటుట, రామానుజాచార్యులే శఠకోపసమాఖ్యను సంభవించి - అహోబలమఠాధిపతి ఆదివణ్ శఠకోపజీయ్యరు - సకల శాస్త్రార్థములు సమస్తభక్తులకు వివరించుననుట, వేంకటేశుండను మనీషి అనగా వేదాంతదేశికులు విశిష్టాద్వైతమతప్రతిపాదకమైన ప్రబంధశతము రచించి మోక్షప్రదానము సేయున నుట యుక్తులు. ఇవి వరాహపురాణములోని మాలదాసరి కథాకాలము నాటికి లేవు. ఆముక్తమాల్యదలోని మాలదాసరి కథాకాలమునాటికి మాత్రమే కలవు. సమకాలిక సమాచారము.

మాలదాసరి బ్రహ్మరాక్షసుని లేవనెత్తి, అతని పూర్వజన్మవృత్తాంతమును అడుగ, బ్రహ్మరాక్షసుడు చెప్పిన అతని పూర్వజన్మవృత్తాంతము ఆముక్తమాల్య దయందు పదునెనిమిది పద్యగద్యములందు కలదు. (3-20ప. 7ఆ.) ఇది

మూలభిన్నము. సోమశర్మ తలపెట్టిన యజ్ఞము పూర్తి కాక. దీక్షాకాలమునందు శూలదోషము చేత మరణించుట వలన మాత్రమే బ్రహ్మరాక్షసుడైనట్లు మూలము నందు కలదు. ఆముక్తమాల్యదలోని సోమశర్మ చతుష్షష్టికళావేత్త. మహాతర్కపండితుడు. శ్రౌతనిష్ణాత. కాని దోషైకదృక్కు. మృషావాది. ద్రవ్యభిక్షార్థి. దొంగవడ్డీవ్యాపారి.

"బహివడ్డ ద్విజున కల్పపుఁ బాచితం బిడి
పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి
కలసి వణిక్పురోధలతోడఁ బుణ్యాహ
ముల బియ్యములకునై మొత్తులాడి
శశిరవిగ్రహజపస్నానాదికములెల్ల
దొరల వాకిండ్లకే దొద్ద యిచ్చి
పచ్చిఱ్ఱితో ల్పబ్జె చుచ్చాల మెట్లంది
కొనఁ దాన యూరెల్ల గుత్తవట్టి
దర్భపోటులఁ దిని లేని తఱుల మైత్రి
నంటి పితృశేషము భుజించి యదియు నెడల
నక్కవాడలనఱకూళ్లమెక్కిమీఁద
వీని శేఖర మొక తులార్త్విజ్యము కొని.5
ఇ ట్టొనగూర్చి వైశ్యునకు నిచ్చి చన న్మఱి పుచ్చి చౌకము
ల్వెట్టుచు వడ్డిలెక్క లటువెట్టుచు ధారణ వాసికై కొదల్
పెట్టుచు వాఁడు రేఁగి మఱి పెట్టుదుఁ బెట్టుననంగ మిట్టఁగూ
పెట్టుదు -" 6ప7ఆ.

ఇట్టి దొంగ వడ్డీవ్యాపారిని గట్టి గజదొంగ కొల్లగొట్టి కుళ్లబొడిచిన బ్రహ్మరాక్షసుడయ్యెను. జన్మాంతరశిక్ష కాదు. జన్మశిక్ష.

అల్లసాని పెద్దన ప్రవరుడు ధర్మప్రతినిధి. శ్రీకృష్ణదేవరాయల సోమశర్మ అధర్మప్రతినిధి. బ్రహ్మరాక్షసుని పూర్వజన్మవృత్తాంతము విని మాలదాసరి మంగళకౌశికీగీతఫలము "కొంతఁ గొమ్మన వెఱతు భగవంతుండ రక్షించు నూఱడిల్లుము" అన్నట్లు "అ న్నోరిమాట నోరనయుండ" బ్రహ్మరాక్షసుడైన సోమశర్మ "వైష్ణవుఁడై" నట్లు. సోమశర్మ మాలదాసరిని పూజించి. ప్రశంసించినట్లు శ్రీకృష్ణదేవరాయల స్వతంత్ర కల్పనము. (19-21ప.7ఆ.)

ఇట్లు శ్రీకృష్ణదేవరాయల ఇతివృత్తప్రపంచీకరణమునందు ప్రతివృత్తాంతము

రసవంతమగుటయేగాక, విశిష్టాద్వైతపరమగుట ఇతోధికవిశేషము.

# వర్ణనావైదగ్ధి

శ్రీకృష్ణదేవరాయల కావ్యనిర్మాణము కంటె వర్ణనాకౌశలము వైభవోపేతము. స్థానికప్రకృతిచిత్రణము, సహజప్రకృతిచిత్రణము, సామాన్యాంశధీమాన్యచిత్రణము, కృషీవలజీవనచిత్రణము రాయల వర్ణనలలోని వైవిధ్యము. స్వభావోక్తి, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, అత్యుక్తి వైదగ్ధ్యము.

పురవర్ణనములందు స్థానికప్రకృతిచిత్రణము పుష్కలము. శ్రీవిల్లిపుత్తూరు వర్ణనమునందు

-"పెఱ పురాళి గృహశ్రీలఁ బెండ్లియాడ
భవనరాజులు గట్టిన బాసికమనఁ
దనరు మణితోరణములతో ద్వారవితతిఁ
బరఁగు వీథులు పురి సూత్రపట్టినట్లు" 53ప. 1ఆ.

అని కలదు. ఇతరపురముల గృహసంపద లనెడు స్త్రీలను పెండ్లియాడుటకు శ్రీవిల్లిపుత్తూరు గృహము లనెడు రాజులు కట్టుకొన్న బాసికము లనునట్లు మణితోరణములు కలవనుట ఉత్ప్రేక్ష. వీథులు పురి సూత్రపట్టినట్లు పరగుట స్థానికవిశేషము. శ్రీవిల్లిపుత్తూరులోని వీథులు ఇప్పటికిని అట్లే కలవు. అందు గోదాదేవి గుడి యెదుటివీథి మిక్కిలి సూత్రపట్టినట్లు కలదు. అచటి స్త్రీలు -

"శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ జన్దోయి లేఁ గౌనుపై
దయఁ దప్పన్ బసపాడి పాగడపుఁ బాదంబొప్పఁ జెంగల్వడి
గ్గియ నీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపు లోత్రోవలన్" 56ప. 1ఆ.

శ్రీవిల్లిపుత్తూరులోని స్త్రీలు ద్రవిడాంగనలే. విష్ణుభక్తివిలసితలే. చెంగలువ దిగుడుబావి దగ్గఱ పసుపు పూసికొని స్నానము చేసి, అందెలు ధరించిన పాదములు ఖంగుమన, చేతిలోని పూజాపద్మములు కూజాబిందె మీద తడబడ, కూజాబిందెను కటిసీమను కీలించి, వంగి, దివ్యప్రబంధమును పాడుకొనుచు, పూలతోటలలోని దారుల వెంట అచ్యుతుని అభిషేకము కొఱకు చెంగలువదిగుడుబావినీరు తెచ్చుట స్థానికవిశేషము. స్వభావోక్తి. ఘటి అన కూజాబిందె. ఇప్పటికిని అచట

కూజాబిందెలు కలవు. లోహముతో చేసినవేకాదు. ప్లాస్టిక్కుతో చేసినవి కూడ. దివ్యప్రబంధము తిరువాయ్‌మొళి. ఇప్పటికిని వైష్ణవద్రవిడాంగనలు నిత్యపారాయణము చేయునది. అచటి పురుషులు భాగవతులు. అతిథులైన భాగవతులకు మాత్రమే అర్చన కావింతురు. (76ప. 1ఆ.)

శ్రీవిల్లిపుత్తూరులోదేవునిరథములురెండు కలవు.అవి'కల్యాణమంథాద్రులో'అన. 'లిఖితనరావాప్తదాంపత్యమ్మొప్పు'నట్లు కలవట.(58ప. 1ఆ.) ఆ రథములు ప్రత్యంగుళము మిథునశిల్పములు కలిగి మేరుమందరపర్వతములే అనిపించునవియే. అంత శిల్పసంపద, అంత పరిమాణము, అంత ఎత్తు కల రథములు అన్యత్ర మృగ్యము. ఇంకను పూలతోటలు (66ప.) వరిపైరులు (67ప.) వేఱుపనసలు (68ప.) అరటితోటలు (69ప.) పోకతోటలు, చెఱుకుతోటలు (70ప.) మావితోపులు (71ప.) జానపదస్త్రీల పేపగంపలలోని పూలదండలు (75ప.1ఆ.) మొదలైనవి స్థానికవిశేషములే. దక్షిణ మధుర (మధురై) వర్ణనమునందు పుష్పలావికల పూలవ్యాపారముకలదు. (19-22ప.2ఆ.)ఇప్పటికిని మధురమీనాక్షీదేవ్యాలయమునందు స్త్రీల పూల వ్యాపారము కలదు. సుదీర్ఘమైన మధురవర్ణనమునందు సుప్రసిద్ధమైన మీనాక్షీదేవ్యాలయము ప్రసక్తిలేదు. కారణము శ్రీకృష్ణదేవరాయల వీరవైష్ణవమే.

ఋతువర్ణనములందు సహజప్రకృతి చిత్రణము సమధికము-

"నిర్ఝరప్రబలవేణిక లింకఁ జత్రాలఁ
బేరిన ప్రాఁచి పెన్బ్రుఁట లెగసె
నెఱుకులు పడియ నీరివుర గువ్వలఁ బట్టఁ
బోయు నీరాడాడఁ బొలము నెఱసె
సురగాలి దవదగ్ధతరుపర్ణతతి రేఁపఁ
బావురాలని డేఁగ పదుపు దూఱె
స్నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరుగ వెం
టడిన యధ్వగపంక్తి పొరలు వెట్టె
క్షేత్రపాలున కుదికిన చీర లాఱు
చాకిరేవుల గములయ్యె సకలదిశలు
దెలుపులుగఁ దోఁచె నెండమావుల బయళ్లు
గండె నివి యెంత నన దిఙ్ముఖములు రాజె" 46ప. 2ఆ.

ఇది గ్రీష్మర్తువర్ణనము. ఇందు "సెలయేటి మహాప్రవాహములు ఇంకిపోగా,

చక్రాతిబండల పేరుకొన్న ప్రాచి పెద్ద పెద్ద బీటలు తీసినదని, పడియలందలి నీరుకూడ ఆవిరైపోగా, ఎఱుకలవాండ్రు గువ్వలను పట్టుకొనుటకు పోయుచున్న నీరే అక్కడక్కడ నేలమీద కనబడుచున్నదని, కార్చిచ్చుచేత కాలిపోయిన చెట్ల ఆకుల రాశిని సుడిగాలి ఎగురగొట్టగా, దేగల కదుపు పావురాలని పట్టుకొనబోవుచున్నదని, పవళించిన చెట్లనీడ నిలువక జరిగిపోవుచుండగా, బాటసారుల గుంపు పొరలసాగె నని, సకలదిశలు దిగంబరుడైన భైరవునికి ఉదికిన చీరలు ఆరవేసిన చాకిరేవు లయ్యెనని అనగా శూన్యము లయ్యెనని, ఎండమావుల బయళ్లు తెల్లబడెనని, దిక్కుల ముఖములు రాజు కొనెనని" కలదు. సహజత్వ ముట్టిపడునది. స్వభావోక్తి. మండుటెండలోని ప్రకృతిబింబమునకు దర్పణప్రతిబింబము.

"ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖి యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు రాఁజిన రవులుకొ ల్పాసలె
గాని కల్గదు గూడు దానఁ గలిగె
నేని కూరగుట మందైనఁ బెన్పొగ సుఖ
భుక్తి సేకూర దా భుక్తి యిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న
మాజ్యపటముఖ్యలయ మెన్న రాలయాంగ
దారులయ మెన్న రంతిక కారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ బడక మురుఁడు
వెడవెడనె యార్వ నొగిలి రజ్జడిని గృహులు. 127 ప. 4 ఆ.

ఇది వర్షర్తువర్ణనము. ఇందు వర్షాకాలము నందలి గృహస్థుల అవస్థలు పరమవాస్తవికముగ కలవు. ఇంటింటికి తిరిగినను ఇసుమంత నిప్పు పుట్టదు. ఒకవేళ దొరికినను, ఇంటిలోని పూరిగడ్డి దానిపై ఇడి విసిరిన గాని రాజుకొనదు. రాజుకొ నినను రవులుకొనదు. రవులుకొనినను కూడు ఉడుకదు. కూడు ఉడికినను కూర ఉడుకదు. ఉడికినను దట్టమైన పొగవలన దిట్టమైన భోజనము సమకూడదు. ఆ భోజనమే పెట్టినను, అందఱికిని సరిపడు అన్నము ముందు భోజనము చేయు పురుషులకే సరిపడును. స్త్రీలకు మఱల వంటప్రయత్నము చేయవలసివచ్చును. అందుకు నెయ్యి, గుడ్డలు ఇంటివాసములు మొదలైనవి నాశనమైనను లెక్కించక గృహస్థులు అర్ధరాత్రి వఱకు వంట చేయుచున్న, అన్నము తినకుండ ఉన్న, ఆరాఁగి

చెంతకు రాలేదని జడివానకు మన్మథబాధ తాళలేక మథనపడుదురట. వంటకు నిప్పు. వంటకట్టెలు మాత్రమే శరణ్యమైన కాలములోని వర్షాకాలమునందలి గృహస్థుల అవస్థ లివి సర్వసాధారణము. అతిశయోక్తికాదు. స్వభావోక్తియే. అంతేకాదు. అగ్గిపుల్ల వంటి నిప్పురవ్వ కవితామయమైనది!

> "అప్పు ల్వారిధిచేతఁ బుచ్చుకొని కార్యంబైన మున్నొన్న య
> య్యప్పు ల్దా చనియున్ సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా
> నప్పుణ్యాత్మవిశుద్ధజీవుఁడు నిజాచ్ఛాంగంబులం దోచు న
> ట్లొప్పారె న్శశిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్." 158ప. 4ఆ.

ఇది శరదృతువర్ణనము. ఇందు జడప్రకృతిలక్షణము. జనప్రకృతిలక్షణమును కలవు. సముద్రజలము మేఘమై వర్షించుట. వర్షించిన జలము అధికముగ సముద్రము నందు చేరుట. వర్షాకాలము ముగిసి శరత్కాలము రాగానే ఆకాశము నందు తెల్లమబ్బులు ఏర్పడుట. అవి శరదిందుకాంతిని మఱింత తెల్లగ కనిపించుట జడప్రకృతి సహజలక్షణము. అప్పు పుచ్చుకొని స్వకార్యమును చక్కబెట్టుకొని తర్వాత వడ్డీతో అప్పు తీర్చుట. అప్పు తీర్చిన వాని మనస్సు హృదయము స్వచ్ఛమగుట జనప్రకృతి సహజలక్షణము. అప్పు అను తెలుగు శబ్దమునకు ఋణమని అర్థము. అప్ అను సంస్కృతశబ్దమునకు జలమని అర్థము. ఉభయశబ్దములకు అప్పులు బహువచనరూపము. జడప్రకృతి సహజలక్షణమునకు. జనప్రకృతిసహజలక్షణమునకు శ్లేషమూలకముగా సాదృశ్యము గమ్యమానము. అది సహజప్రకృతి చిత్రణము. స్వభావోక్తి కాదు. శ్లేషానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

పురవర్ణనములందు. ఋతువర్ణనములందు సామాన్యాంశధీమాన్యచిత్రణము కలదు. అతి సామాన్యములైన అంశములను గైకొని అనన్యధీమాన్యముగ కల్పనము చేయుట సామాన్యాంశధీమాన్యచిత్రణము. ఇది శ్రీకృష్ణదేవరాయల వర్ణనములందు అత్యపూర్వవిశేషము.

> "తలఁ బక్షచ్ఛటఁ గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
> స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నాతప్రయాతద్విజా
> వలిపిండీకృతశాటిక ల్తావిఁ దదావాసంబుఁ జేర్చంగ రే
> వుల డిగ్గ న్వెసఁ బాఱువానిఁ గని నవ్వు న్శాలిగోపీస్తోమముల్." 65ప. 1ఆ.

ఇది శ్రీ విల్లిపుత్తూరు వర్ణనము. శ్రీకృష్ణదేవరాయల కాలమునకు బాతులు దేశములోనికి దిగుమతి అయినవి. బాతు బుడతకీచుపదము. ఉకారాంతసంస్కృత ప్రాతిపదిక వలె వుగాగమము. శ్రీవిల్లిపుత్తూరు వరిచేలలోని కాలువల నడుమ బాతులు తల ఱెక్క సందున ముడుచుకొని-ముడుచుకొనునపుడు మెడ మెలితిరుగును - నిద్రించుట చూచి. ఊరికాపరులు ఉషఃకాలమునందు స్నానము చేసి మఱచి పోయి వెళ్లిపోయిన బ్రాహ్మణుల బట్టలని భ్రమపడి. వారికి అప్పగించుటకు రేవులందు దిగబోవ. అవి పాఱిపోవుటను చూచి. ఊరికాపరులైన పురుషుల అమాయకత్వము నకు పైరుకాపరులైన స్త్రీలు నవ్వుదురని కల్పనము. బాతులు మెడలు వెనుకకు త్రిప్పి ఱెక్కలందు దూర్చుకొని నిద్రించుట అతిసామాన్యమైన అంశము. దానిపై ఆరెకుల భ్రమ. శాలిగోపికల నవ్వు అత్యంతధీమాన్యమైన చిత్రణము.

> "సరియగు నిట్టి వెట్ట నివి సర్వమునం చటు మీఁది సృష్టికై
> శరధిపదిజ్మరుజ్జ్వలితచండతరాతపవహ్ని నాఱఁగాఁ
> గరువు లజుండు పీనిపయిఁ గట్టెననన్ గనుపట్టె వెచ్చల
> న్గరికిరికాసరాంగీములు గప్పిన ఱొంపులు నందె యాఱఁగన్" 47ప. 2ఆ.

ఇది గ్రీష్మర్తువర్ణనము. మండుటెండకు తట్టుకొనలేని జంతువులు ఏనుగులు. పందులు. దున్నలు. గేదెలు. అవి మండుటెండకు తట్టుకొనలేక బురదగుంటలయందు దొరలును. అప్పుడు ఒంటినిండ బురద అంటుకొనును. అది బయటకురాగానే మండుటెండకు ఎండిపోయి అచ్చులు కట్టును. ఇది సామాన్యమైన అంశము. ఏదైన సృష్టించుటకు తదాకృతి మూస కావలయును. అది కాల్పవలయును. ఇది కూడ అతిసామాన్యమైన అంశము. ఇటువంటి మండుటెండకు ఏనుగులు. పందులు. దున్నలు. గేదెలు సర్వనాశమగునని బ్రహ్మ నూతనసృష్టికి వానిపై మూసలు కట్టె ననునట్లు - పడుమటి గాడ్పు ప్రజ్వలించిన తీక్ష్ణమైన ఎండ అను అగ్నికి. ఏనుగుల. పందుల. దున్నల. గేదెల ఒంటి బురదలు అచ్చులు కట్టెనని అత్యంతధీమాన్యమైన చిత్రణము. అత్యుక్తి. కుక్కకంటె హీనమైన పంది కవితామయమైనది.

> "గగనలక్ష్మి నిజోరునక్షత్రమాలి
> కలు వియన్నది జలములఁ గడుగఁ బిసుక
> నెఱయు కుంకుడుపండుల నురువు లనఁ గఁ
> బలపలని పాండురాంబుదపంక్తు లమరె" 157ప. 4ఆ.

ఇది శరదృతువర్ణనము. శ్రీమంతురాలు తన సువర్ణాభరణములను శుభ్రము

చేయుటకు, నురుగు వచ్చునట్లు పిసికిన కుంకుడుకాయల పులుసునందు కడుగుట ఆ కాలమునందు అతిసామాన్యమైన అంశము. శరత్కాలమునందు ఆకాశమునందు తెల్లతెల్లని మబ్బుపింజలు చెల్లాచెదురుగ అలముకొనుట ఏ కాలమునందును అతిసామాన్యమైన విషయము. ఆకాశమనెడు లక్ష్మీదేవి తన నక్షత్రమాల అనెడు సువర్ణాభరణమైన నక్షత్రమాలను ఆకాశగంగ జలముల కడుగుటకు పిసికిన కుంకుడుకాయల పులుసు నురుగు లనునట్లు తెల్లతెల్లని మబ్బుపింజలు చెల్లాచెదురుగ అలముకొనెనని అత్యంతధీమాన్యమైన చిత్రణము. శ్లిష్టరూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష. సబ్బుబిళ్ల వంటి కుంకుడుకాయల పులుసు కూడ కవితామయమైనది.

ఋతువర్ణనమునందు, కథాకథనమునందు, రాజనీత్యుపదేశమునందు కృషీవల జీవనచిత్రణము కలదు. కృషీవలుడు లేనిది ఎవరి జీవితమును లేదు. ఎంత మహారా జైనను, మఱెంత మహావిద్వాంసుడైనను జీవనాధారము కృషీవలుడే. కృషీవలుడు చెమటోడ్చి పండించునది ఋషిజీవుల కడుపులు నిండించునది. అట్టి కృషీవలుని జీవనము మహావిద్వాంసుడైన కవికి పట్టలేదు. మహారాజైన కవికి పట్టినది. రైతు లేనిది రాజ్యము లేకపోవుట తన్నిమిత్తము కావచ్చును.

"ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళారామాంబుకుల్యాబహు
స్రోతస్సంధుల నంధుయంత్రనతికృత్ప్రోద్గీతగేయౌఘముల్." 55ప.2ఆ.

ఇది గ్రీష్మర్తువర్ణనము. ఇందు రైతులు ఏతాము త్రొక్కుట ఇమిడియున్నది. ఏతాము త్రొక్కునపుడు కడవ నీటిలో మునిగిపైకి లేచును మునిగినప్పుడెల్ల చప్పుడ గును. అది ఏతాము త్రొక్కువారు పాడుపాటలకు వాద్యధ్వని వలె అమరును. వాద్యసహకారము కల జానపదగేయములు కృషీవలుర జీవనమునందు శ్రమాపనోద నములు

"అంటులు గట్టి చేలకును నాంౘ్రుడును బిడ్డలుఁ గూరఁ గోయఁ బోఁ
గంటకము ల్పదాగ్రములఁ గాఁడఁగ దూసిన నొప్పి గూయిడన్
గంటికి నిద్రగాన కొదుగంబడి వేఁగెదమిందు; నొక్కమా
కంటయ కాదు, నీవు వడునట్టి యవస్థ వచింప శక్యమే." 33ప. 3ఆ.

ఇది ఖాండిక్యుని మంత్రుల మంతనము. ఇందును కృషీవలజీవనము

ఇమిడియున్నది. భార్య, బిడ్డలు చేలకు పోయి కూరగాయలు కోయుట, వారి కాళ్లకు ముళ్లు గ్రుచ్చుకొనుట, వారు నొప్పివలన నిద్రపట్టక బాధపడుటకృషీవలుని జీవనమునందు తారసపడునదియే.

"మును దన సీమ చేసికొని ముల్లిడి గుద్దలు వెండి చేని మె
త్తనకయి వేరు వెల్లఁ కియుఁ ద్రవ్వెడు కర్షకు నట్లు శత్రుతో
నెనసియయైన దుర్గబల మేకొనియైన నిజాత్మ చింత లే
క నెగడఁ జేసి లోన మఱి కంటకశోధనఁ జేయు టొప్పగున్." 219వ. 4ఆ.

ఇది రాజనీతి. ఇందు కృషీవలుని జీవనముతోడి సాదృశ్యము కలదు. రైతు ధర్మము రాజు ధర్మము సమానము. రైతు తన భూమికి సరిహద్దులు ఏర్పఱుచుకొని, చుట్టును ముళ్లకంచె వేసికొని, పంటకు భూమి పదనగుటకు గుద్దలితో ముళ్లు వేళ్లు త్రవ్వి పాఱవేయును. రాజుకూడ తన రాష్ట్రమునకు సరిహద్దులు ఏర్పఱుచుకొని, కోట కట్టుకొని, నిశ్చింతగ ఉండుటకు ఆయుధముతో శత్రువులను నిర్మూలింపవలయును. రాజునకు, రైతునకు కంటకశోధన ముఖ్యకర్తవ్యము.

## శైలి

ఆముక్తమాల్యద భాష జటిలము. భావము క్లిష్టము. అర్థము దుర్గమము. అనేకపద్యములందు భావము క్రిక్కిరిసినట్లుండును. ఆచ్ఛికపదములు బలవదాకృష్ట ములు. శైలి అల్లిక గజిబిజి అని పూర్వోక్తము. అంతేకాదు. ఎంత సంస్కృతభాషనైన పద్యమునందు పట్టించును.

"ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించిన నొ్మ్రయు నెం
తే నాగేంద్రశయానుపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్వానము నాస్తిశాకబహుళతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్య మన్మాటలున్" 84ప. 1ఆ.

విష్ణుచిత్తుని ఇంట "నాగేంద్రశయాను" కథలు వినిపించుటకు హేతువు శ్రీవిల్లిపుత్తూరులోని విష్ణువు విగ్రహము నాగేంద్రశయానువిగ్రహమగుటయే.

"అద్ధావాగ్విబుధమ్మహోవచనకవ్యాహార మాహోవచ
స్విద్ధ మ్మాఃకృతతాం గతిః కలిరితిశ్రీసూక్తివిద్యాధర
మ్మిద్ధౌద్ధత్య మగాల్లయం హి కుధియా మిత్థం వదత్కిన్నర

మ్మర్ధిరాగ్రణి గెల్పు టుత్సవమునం దయ్యె న్నభమ్మంతయున్." 6ప. 4ఆ.

నభశ్చరులైన దేవతలు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, కిన్నరులు మాటాడు భాష సంస్కృత భాష. కనుక పద్యము సంస్కృతమయమగుట సందర్భోచితము.

## ఆత్మీయత

శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవమతావలంబి. సమరాంగణసార్వభౌమునిగ శైవసహనము కలవాడు. సాహిత్యాంగణసార్వభౌమునిగ వైష్ణవాతిశయము కలవాడు. శ్రీకృష్ణదేవరాయలు అమరావతీతీర్థయాత్ర చేసి, అమరేశ్వరుని సన్నిధిని తులాపురుష మహాదానము చేసి, దేవేరులు చిన్నాదేవి చేతను, తిరుమలదేవి చేతను మహాదానములు చేయించినట్లు శాసనప్రమాణము కలదు.[74] ఇది శైవసహనమునకు నిదర్శనము.

శ్రీకృష్ణదేవరాయలు తిరుపతి, అహోబలము, శ్రీకాకుళము, సింహాచలము బహుపర్యాయములు తీర్థయాత్రలు చేసి, కంఠమాలలు, పదకములు, నవరత్నఖచితపీతాంబరము, ముత్యాలు, వజ్రాలు, మాణిక్యాలు, పచ్చలు, నీలాలు, నవరత్నఖచితమైన వింజామరలు, నవరత్నపదకములు, పచ్చల పదకము, శంఖచక్రాల పదకము, పైడి పళ్లెరము, టూంకాలు, కానికమాడలు, వరహాలు మొదలైనవి సమర్పించినట్లు, తన దేవేరులు చిన్నాదేవి చేతను తిరుమలదేవి చేతను సమర్పింపజేసినట్లు, తిరుపతి వేంకటేశ్వరాలయము గర్భగృహము మీది విమానము పైడిపూతకు 30,000 వరహాలు ఇచ్చినట్లు బహుశాసన ప్రమాణములు కలవు. ఇవియెల్ల వైష్ణవమతాభినివేశనమునకు మచ్చుతునుకలు.

శ్రీకృష్ణదేవరాయల ఇష్టదైవము తిరుపతివేంకటేశ్వరస్వామి. ఆముక్తమాల్యద తిరుపతివేంకటేశ్వరునికే అంకితము. ఇష్టదేవతాస్తుతియందు వేంకటభర్తకు (1ప.) అనంతునికి (2ప.) గరుత్మంతునికి (3ప.) విష్వక్సేనునికి (4ప.) సుదర్శనచక్రమునకు (5ప.) పాంచజన్యమునకు (6ప.) కౌమోదకీగదకు (7ప.) శార్ఙ్గమునకు (8ప.) నందకమునకు (9ప.) పన్నిద్దరాళ్వారులకు (10ప.)మాత్రమే స్థానము కలదు. అన్యదైవ ప్రసక్తిలేదు. ఆశ్వాసాద్యంత పద్యములందు అలమేల్మంగ (87ప.1ఆ.) శ్రీభూనీళలు (1ప.2ఆ.)రాధ (100ప. 2ఆ.) పారిజాతాపహరణసత్యభామ (288ప. 4ఆ.) జాంబవతి (1ప. 5ఆ.) కలరు. శేషశైలము(1ప.6ఆ.) కలదు. ఆభీరకాంతామణులు (67ప.

6ఆ.) కలరు. వంశీనాదము, గరుడ వాహనము (73ప.7ఆ) కలవు. ఇవియెల్ల శ్రీకృష్ణదేవరాయల వీరవైష్ణవమునకు నిదర్శనములే.

ఇతివృత్తస్వీకారమువైష్ణవపరము. ఇతివృత్తప్రపంచీకరణము విశిష్టాద్వైత పరము. అన్యథాప్రకల్పనము వైష్ణవమతాంతరీకరణపరము. ఇవి పూర్వోక్తములు. అవి శ్రీకృష్ణదేవరాయల ఆత్మీయతాప్రతిఫలనమునకు అచ్ఛపుమణిదర్పణములు.

రాజనీత్యుపదేశము (204ప. 285వచ) రాజలక్షణమునకు, నాగవాసము వర్ణనము (35వచ4ఆ.) రాజభోగమునకు రాజమార్గములు. వేశ్యావర్ణనము (59-63ప. 1ఆ.) పుష్పలావికావర్ణనము (19-22ప. 2ఆ.) శృంగారశేఖరత్వమునకు శృంగగ్రాహికలు. ఐహికమైన భోగము, పారమార్థికమైన మోక్షము శ్రీకృష్ణదేవరాయల ధ్యేయములే.

# ధూర్జటి

స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో
యతులితమాధురీమహిమ? హా! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసుధారసధారలు గ్రోలుటం జుమీ"

అను చాటుపద్యము సుప్రసిద్ధము. అంతేకాదు. ధూర్జటి వంశీయుడైన కుమారధూర్జటిని. ఆతని కృతిభర్త ఆరవీటి చినవేంకటరాజు.

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో
యతులితమాధురీమహిమ నా మును మీ పెదతాత చాల స
న్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ న్విను మీవు నట్ల మ
త్కృత బహుమానవైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్" 29ప. 1ఆ.

అని అన్నట్లు కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునందు కలదు. కుమార ధూర్జటి కుమారుడు లింగరాజు శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు ఇట్లు కలదు.

"శ్రీకాళహస్తిగౌరీనాథపదపద్మ
సద్భక్తియుక్తి నిశ్చలతఁ గాంచి
సారసుధాసారసరసోక్తిగుంభనఁ
గాళహస్తిమహత్త్వకథ నొనర్చి
కృష్ణరాయకిరీటకీలితమణిగణా
ర్చితపదాబ్జద్వయశ్రీ వహించి
యాసేతుకాశీతటావనీఖ్యాత
సత్కీర్తివిస్ఫూర్తిఁ జాలవెలసి
ధరణిఁ జెలువొందె నే కవీశ్వరవతంస
రత్న మమ్మహనీయు ధూర్జటిసుధీంద్రుఁ
దలఁ తు జలనిధివీచికాకలకలాను
కారిభూరికవిత్వవాక్పటిమ గులుక".

ఇవి ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజకవి అగుటకు సాధకములు. బాధకములు లేవు. అళియరామరాయల మనుమని మునుమనుమడైన అరవీటి చిన వెంకటరాజునకు కృష్ణరాయవిజయమును అంకితమిచ్చిన కుమారధూర్జటికి ధూర్జటి 'పెదతాత' కాదు పితామహపరంపరలో ఒకడు.

ధూర్జటి కృతులు రెండు కలవు. 1. శ్రీకాళహస్తిమాహాత్మ్యము. 2. శ్రీకాళహస్తీశ్వరశతకము.

## శ్రీకాళహస్తిమాహాత్మ్యము

శ్రీకాళహస్తిమాహాత్మ్యము శ్రీకాళహస్తిక్షేత్రమాహాత్మ్యకావ్యము. శ్రీకాళహస్తిక్షేత్రదైవమైన శ్రీకాళహస్తీశ్వరునికి అంకితము. ధూర్జటి ఇష్టదేవతాస్తుతికూడ (1-5ప. 1ఆ.) శ్రీకాళహస్తిక్షేత్రమునకే పరిమితము.

## కాలము

శ్రీకాళహస్తిమాహాత్మ్యము రచనాకాలము నిర్ణయించుటకు చరిత్రాంశము లేదు. అవతారికయందు "మహాదేశికసార్వభౌముడు" అని గురుప్రసక్తి (8ప.1ఆ.) కలదు గాని, గురుదేవుని నామధేయము లేదు. ఆశ్వాసాంత గద్యను "భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతంబు" అని కలదు. అనగా ధూర్జటి భవపరాఙ్ముఖుడైన అనంతరము శ్రీకాళహస్తిమాహాత్మ్యమును రచించినట్లు అవగాహనమగును. భక్తుడైనను ధూర్జటి భవపరాఙ్ముఖుడగు కాలము శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము (1509-1524) కాజాలదు. శ్రీకాళహస్తిమాహాత్మ్యము నందు శ్రీకృష్ణదేవరాయల ప్రసక్తి లేశమాత్రమును లేదు. కావున శ్రీకాళహస్తిమాహాత్మ్యము రచనాకాలము శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము తర్వాత కావలయును. అది ధూర్జటి భవపరాఙ్ముఖుడగుటకు అనువైన కాలము. కాబట్టి శ్రీకాళహస్తిమాహాత్మ్యము రచనాకాలము 1528 ప్రాంతము కావచ్చును

## మూలము

ధూర్జటి తన శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు మూలము తెలుపలేదు కాని,

"విని కాళహస్తిమహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయికథన్

దెనుఁ గునఁ గావ్యముగా నొన
ర్చెను బెద ధూర్జటి కవీంద్రశేఖరుఁ డనఘా"

అని లింగరాజు శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కలదు. అంతేకాదు.

"బహుపురాణమథిత భవ్యార్థశివతత్త్వ
సారమెల్ల నైక్యసరణిఁ బొదలి
జగతి శివరహస్యసంగ్రహమను నితి
హాసమొనరు విబుధు లనుమతింప"

అని కూడ కలదు. కావున ధూర్జటికి షడధ్యాయికథ. లింగరాజునకు శివరహస్యసంగ్రహము మూలము కావలయును. షడధ్యాయికథ గ్రంథనామము కాదు. స్కాందపురాణములోని వైష్ణవఖండమునందలి వేంకటాచలమాహాత్మ్యమునందు ముప్పదవ అధ్యాయము మొదలు ముప్పదియైదవ అధ్యాయము వఱకు(ఆరధ్యాయములు) శ్రీకాళహస్తిమాహాత్మ్యము కథ. సువర్ణముఖీనది ఉత్పత్తికథ కలవు.[75] అది షడధ్యాయి కథ అగును. అంతేకాదు. తమిళమునందు సీకాళత్తిపురాణము కలదు. అది ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు సంవదించునది.[76] అందు మాయాజంగమస్వరూపము. సువర్ణముఖరీజన్మప్రకారము. సరస్వతీచతుర్ముఖవృత్తాంతము. శ్రీకాళహస్తిమాహాత్మ్యము. తిన్ననికథ. నత్కీరుని కథ. వేశ్యాబాలికల వృత్తాంతము. శ్రీకాళహస్తుల పూర్వజన్మవృత్తాంతములును కలవు. నత్కీరుని కథ షడధ్యాయి కథయందు లేదు. సీకాళత్తిపురాణమునందు కలదు. ఇతరతమిళగ్రంథములందును కలదు. అది ముందు వివరింతును. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు స్కాందపురాణషడధ్యాయికథ కంటె తమిళములోని సీకాళత్తి పురాణము మూలము కావచ్చును. అయినను స్వతంత్రకావ్యమే.

ధూర్జటిశ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు అనిదంపూర్వముగను. బహుశః అనితఃపరముగను కృత్యాదిపద్యమునందు వస్తునిర్దేశము వాచ్యముగ కలదు.

"శ్రీవిద్యానిధియై మహామహిమచేఁ జెన్నై వసిష్ఠాజ లూ
తావాతాశనసామజాటవికగోత్రాదేవనత్కీరరా
జీవాక్షీయుగయాదవాధిపులకున్ శ్రేయస్కరంబైనయా
ర్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టము ల్సల్పెడున్" 1ప. 1ఆ.

శ్రీకాళహస్తిలోని దివ్యలింగము మోక్షమును అనుగ్రహించిన వసిష్ఠుని కథ.

బ్రహ్మ కథ. సాలెపురుగు కథ. పాము ఏనుగుల కథ. తిన్ననికథ. శివద్విజనత్కీరుల కథ. వారయువతీద్వయకథ శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కలవు. అవి మాయాజంగముడైన శివుడు యాదవరాజునకు చెప్పినవి. (61-62ప.1ఆ.) యాదవరాజు వృత్తాంతము ఆద్యంతములందు కలదు. అతడు"వీరనృసింహయాదవమేదినీకాంతుం"డని కూడ కలదు. (198ప. 4ఆ.) కావ్యాదికథను మాయాజంగముడైన శివుడు శ్రీకాళహస్తిలోని మహాలింగమునకు నివాసము లేదని యాదవరాజును "కలధౌతశైలశిఖరాలయగేహము కట్టఁ బంపవే" అని కోరును. "దివ్యనివాసపంక్తి మోహనముగఁ గట్టఁబంచెద"నని యాదవరాజు చెప్పును. (58-59ప. 1ఆ.) కావ్యాంతపద్యము వీరనృసింహయాదవమేదనీకాంతుని శ్రీకాళహస్తీశ్వరాలయనిర్మాణమే.

"దక్షిణకైలాసధరహేమముఖరీన
ఖోనదీమధ్యమభూమియందుఁ
దిరుకాళహస్తీశుఁ దిరుగు వాఱంగ జ
లాంతశిలాంతపర్యంతముగను
నేల త్రవ్వించి యన్నెలవున నుండియు
రసవర్గమిళితచూర్ణంబుతోడ
నిటికల శిలల సం దీకుండ బంధించి
యా మీఁద హిమగిరిజాఖువాహ
చండగుహభైరవాదుల సదనములను
గోపురావర్ణవర్తనకూటములను
భక్తిఁ గట్టించి యమ్మహీపాలవరుఁడు
ధరణి నేలుచునుండె శంకరుని కరుణ" 203ప. 4ఆ.

యాదవరాజులు దేవగిరిపాలకులుగ చరిత్రప్రసిద్ధులు. పంద్రెండవశతాబ్దినుండి పదునాల్గవశతాబ్ది వఱకు దేవగిరి రాజధానిగ పరిపాలించినవారు.[77] వారిలో వీరనృసింహనామధేయుడు లేడు. పదమూడవశతాబ్దిని కేరళలోని వేనాడ్ రాజులు కొందఱు తాము యదుకులసంజాతులమని చెప్పుకొన్నారు.[78] వారిలోను వీరనృసింహనామధేయుడు లేడు. ఉన్నను, దేవగిరి యాదవరాజులకు, వేనాడ్ యాదవరాజులకు శ్రీకాళహస్తిక్షేత్రముతోడి సంబంధము లేదు. దక్షిణభారతదేశచరిత్ర మొత్తము మీద ప్రథమతః వీరనృసింహనామధేయుడు విజయనగరరాజులందే కలడు. అతడు వీరనరసింహరాయలు. (1506-1509) వీరనరసింహరాయల సవతిసోదరుడు

శ్రీకృష్ణదేవరాయులు. శ్రీకృష్ణదేవరాయలు "యాదవాన్వయమునందు జననమందె"నని నంది తిమ్మన పారిజాతాపహరణమునందు కలదు. (19ప. 1ఆ.) కాబట్టి వీర నరసింహరాయలు "వీరనృసింహయాదవమేదినీపతి" కాగలడు. కాని వీరనరసింహరాయల నాటికి బహుపూర్వమే శ్రీకాళహస్తీశ్వరాలయము కలదు. అది దేశము తురుష్కాక్రాంతమైనపుడు - పదునైదవశతాబ్దిని - నేల సపాటము కావచ్చును. అయిన వీరనరసింహరాయలు జీర్ణపునరుద్ధారము చేయవచ్చును. శ్రీకాళహస్తిక్షేత్రమునకు. విజయనగరరాజులకు సంబంధము కలదు. పాలిత ప్రాంతములోని పుణ్యక్షేత్రము. వీరనరసింహరాయల జీర్ణపునరుద్ధారమును ఆలయనిర్మాణముగ వీరనృసింహయాదవమేదినీపతి కథను ధూర్జటి కల్పించవచ్చును. ఇది సంభావ్యమైన సమన్వయము.

యాదవరాజు కావ్యాదికథయందు శివుడు మిండజంగము. మిండజంగముల కథలు తమిళ కర్ణాటాంధ్రశైవవాఙ్మయములందు తామరతంపరగ కలవు. యాదవరాజు పరిచారిక మిండజంగమునితో చేసిన ప్రప్రథమసంభాషణమునందు "బిజమాడు. దేవరు. బిడార. మూర్తమాడి. మాడబేకు అను కన్నడపదములు కలవు. బిజమాడు = విజయము చేయుము. దేవరు = దేవరవారు. బిడార = విడిదియిల్లు. మూర్తమాడి = కాసంతసేపు విశ్రాంతి తీసికొని. మాడబేకు = చేయవలయును. కన్నడపదముల ప్రయోగమునకుహేతువు. మిండజంగముని కథకు మూలము కన్నడశైవ వాఙ్మయములోని మిండజంగముని కథ అగుట కావచ్చును. తిన్నని కథకు మూలము తెలుగుశైవవాఙ్మయములోని ఉడుమూరి కన్నప్ప కథ. శివద్విజనత్కీరుల కథకు మూలము తమిళశైవవాఙ్మయములోని నక్కీరదేవనయనార్ కథ. వారయువతీద్వయకథకు మూలము తమిళ శైవవాఙ్మయకథయే అగును. కారణము మధురానగరము. వసిష్ఠుని కథకు. బ్రహ్మకథకు మూలము సంస్కృతపురాణము కావచ్చును. అన్వేషణీయము. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములోని సంస్కృతకర్ణాటాంధ్రతమిళకవుల కలిమికి. చెలిమికి. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యము స్వతంత్రకావ్యఫలము.

## క్షేత్రనామము

క్షేత్రనామము శ్రీకాళహస్తి. శ్రీ అన సాలెపురుగు. కాళమన పాము. హస్తి అన ఏనుగు. సాలెపురుగు. పాము ఏనుగు ఎచటి శివలింగములోని శివుని అనుగ్రహాము చేతమోక్షమును బడసెనో అచటి స్థలము శ్రీకాళహస్తిక్షేత్రము. శ్రీకాళహస్తీశ్వరలింగ

మునందు శ్రీకాళహస్తిత్రయచిహ్నము కలదు.

కృతయుగమునందు సాలెపురుగు శివుని కొలుచుటకు శిల్పకళాప్రవీణతను బహుతంతుపంక్తిని భక్తికొలది శివాలయము నిర్మించును. (95-96ప. 1ఆ.) సాలె పురుగు భక్తిని పరీక్షించుటకు శివుడు బహుతంతుశివాలయమును దీపశిఖచేత భస్మీపటలము సేయును. అది భరింపలేక సాలెపురుగు శివుని ఇట్లు ప్రార్థించును.

"దేవా! నిన్ను నుతింపలే నధమబుద్ధిన్. వేదశాస్త్రంబులున్
రా వేపాటియు. వచ్చినన్ శ్రుతులు శాస్త్రంబుల్ మిముంజెప్పఁగా
లే వాద్యంతములన్నఁ దద్విధులకున్ లెక్కింపఁగా శక్యమే
సేవాధర్మము మేలుగా కనుచు మీ శ్రీపాదముల్ గొల్చితిన్. 104
నా కీ భవదుఃఖంబులు
లేక మహాజ్ఞానరవవిలీనుఁడనగుచున్
లోకంబెన్నఁడు నెఱుఁగని
యాకైవల్యమె యభీష్టము - " 105ప. 2ఆ.

ఇందు సాలెపురుగు భక్తితోపాటు ధూర్జటి భవపరాఙ్ముఖత కూడ కలదు. శివుడు భక్తిలోలతను సాలెపురుగును శివలింగమునందు తన్మయము చేయును. (107ప.2ఆ.) ఇది సాలెపురుగు కథ.

త్రేతాయుగమునందు పాము మణులు పాతాళము నుండి తెచ్చి శివలింగార్చనము చేయును. తర్వాత ఏనుగు పత్రపుష్పములు తెచ్చి మణులు తొలగించి, గండూషజలముతోడ మజ్జనము చేసి పూజ చేయును. మఱునాడు పాము వచ్చి ఎవడో రత్నములు తొలగించి ముళ్లకంపలు పెట్టెనని వానిని తొలగించి రత్నపూజ చేయును. తర్వాత ఏనుగు వచ్చి రాళ్లు పెట్టెనని వానిని తొలగించి పత్రపుష్పపూజ చేయును. మఱునాడు పాము వచ్చి తన రత్నపూజ వమ్ము చేసి ఎవ్వడో కాష్ఠపూజ చేసెనని ఇట్లు విచారించును-

"కంటకమెట్లు నాక సుముఖత్వము నొందితివయ్య పార్వతీ
కంటకితాంగబాహులతికాయుగసంగతిఁ బోలె దుఃఖకృ
త్కంటక బిల్వికా కమలకాండము లెత్తిన మోచి మోచి ము
క్కంటియెఱుంగవే నొసలి కంటి మహత్త్వము నీకుఁ గల్గుటన్"

ఇట్లు విచారించి రత్నపూజ చేసి, తన నెలవునకు పోయి. ఆ రాత్రి శివరాత్రి

జాగరము చేయును. తర్వాత ఏనుగు వచ్చి ఇట్లు విచారించును.

"అచ్ఛపు నీలవర్ణదృషదావళి నల్లని కల్వలే? కడుం
బచ్చనిరాలు బిల్వనవ పత్రములే? యరుణాశ్మఖంగముల్
విచ్చిన యెఱ్ఱదామరలె? విశ్వపతీ! విరసోపలంబు లె
ట్లచ్చుదలయ్యె నీకు? నవి యందునె గంధమృదుత్వశైత్యముల్? 121ప. 2ఆ.

ఇట్లు విచారించి. పత్రపుష్పపూజచేసి. తననెలవునకు పోయి. ఆనాడు నిరాహారదీక్ష సేయును. ఆ మఱునాడు పాము వచ్చి తన రత్నపూజలేమికి వగజెంది. అందుకు కారకుడైన వానిని కడదేర్చుటకు మారేడు దళముల మాటున దాగియుండును. ఏనుగు వచ్చి తన పత్రపుష్పపూజ చూచి. సంతసించి అడవికిపోయి పత్రపుష్పములు తెచ్చి. శివలింగమును శుభ్రము చేయుటకు తొండము సాప. పాము తొండమునందు దూరును. ఏనుగు చావక తప్పదని పాము పాఱిపోకుండ తొండమును ఇఱియజుట్టి. శిరస్సునందు పట్టి కొండను ఢీకొట్టును. పాము. ఏనుగు చనిపోయి రుద్రగణాకారములు దాల్తురు. శివలింగము నుండి శివుడు ప్రత్యక్షమై వరము లడుగును. పాము. ఏనుగు కూడ.

" ఈ సంసారపయోధిలోనఁ బడి మే మీఁదీఁది దేహంబుపై
నాసల్మానక తేలుచు న్మనుఁగుచుం బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దేవా! మమ్ము రక్షించి మి
థ్యాసౌఖ్యంబులు చాలు నిత్యసుఖమిమ్మాయంచుఁ బ్రార్థించినన్"
(154ప.2ఆ.)

శివుడు "తన సర్వవ్యాపకజ్యోతిలో సాయుజ్యం బొనగూర్చె"ను ( 154ప.2ఆ.) "అది మొదలుగఁ జంద్రాలంకారుఁడు .... శ్రీకాళహస్తిపతి యనఁ బరగె"ను(156ప.2ఆ) శ్రీకి. కాళమునకు. హస్తికి పతి కావున శ్రీకాళహస్తీశ్వరుడు. శ్రీకాళహస్తీశ్వరశివలింగము కల స్థలము శ్రీకాళహస్తిక్షేత్రము.

ఇందుకు మూలము స్థలపురాణమే అగును. కథామూలమే. కవితాసృష్టి ధూర్జటి కృతమే. కథామూలము ఏకదేశమున శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కంటె పూర్వమే పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు గ్రంథస్థమైనది. కాని భేదము కలదు. సాలెపురుగు కట్టిన నూలు శివాలయమును ఏనుగు ధ్వంసము చేయును. సాలెపురుగు ఏనుగును తలకెక్కి చంపును. (1419-1458పం. 32ఆ)పాము

ప్రసక్తి లేదు. కాలమును బట్టి, ప్రాంతమునుబట్టి స్థలపురాణములందు చేర్పులు, మార్పులు సహజము. ధూర్జటి నాటి స్థలపురాణమే ధూర్జటికి కథామూలము.

# తిన్నని కథ

తిన్నడు శివునికి కన్ను అర్పించుట వలన కన్నప్ప. ఉడుమూరి కన్నప్ప "శ్రీకాళహస్తిగి రి ప్రదేశము వాడని పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు కలదు. (1245-7పం. 3ఆ.) "పొత్తపి నాటిలో"ని ఉడుమూరు నివాసి అని ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కలదు.(3ప.3ఆ.) పొత్తపినాడు కడపమండలము. రాజంపేట తాలూకాలోని టంగుటూరు దగ్గఱి ఉడుములపాడు ఉడుమూరు[79] రాయలసీమ ప్రాంతమునకు శ్రీకాళహస్తిగిరి ప్రదేశము స్థూలనిర్దేశము. ఉడుమూరు వర్ణనము (3-16ప.3ఆ.) పక్కణాధీశ్వరుడు నాథనాథుని వర్ణనము (18-19ప. 3ఆ.) తిన్నని జనన వృత్తాంతము (20-33ప. 3ఆ.) తిన్నని వేట (46-53ప. 3ఆ.) ధనుర్విద్యాభ్యాసము(24-36వచ.3ఆ.) నాథనాథుని మృగయావినోదము (20-33ప. 3ఆ.) తిన్నని వేట(46-53ప. 3ఆ.)ధూర్జటి స్వతంత్రకల్పనములు. తిన్నని స్వప్నమునందు శివుడు సాక్షాత్కరించుట, శివలింగస్థానమును తెలుపుట, తిన్నడు శివలింగమును గవేషించుట, ఉడుమూరికి ఆహ్వానించుట (55-73ప. 3ఆ.) బసవపురాణమునందు కలదు. శ్రీకాళహస్తిమాహాత్మ్యము నందు ప్రపంచీకరణము కలదు. తిన్నని వెదకి బోయలు దుఃఖించుట (74-83ప. 3ఆ.) ధూర్జటి స్వతంత్రకల్పనము. తిన్నడు శివలింగమునకు మాంసఖండములు నైవేద్యము పెట్టుట బసవపురాణమునందు కలదు. బసవపురాణములోని తపసిని (1400పం3ఆ.) శివబ్రాహ్మణుని చేయుట ధూర్జటి అన్యథాకల్పనము. శివలింగము కంటనీరు కాఱినట్లు బసవపురాణమునందు కలదు. నెత్తురు కాఱినట్లు శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కలదు. కడమ విషయమెల్ల సమానము. కావున ధూర్జటి ప్రపంచీకరణము. కడకు తిన్ననికి శివుడు మోక్షము నిచ్చుట కూడ సమానము. కావున ధూర్జటి తిన్నని కథకు మూలము బసవపురాణములోని ఉడుమూరి కన్నప్ప కథయే కావలయును.

శివుని రెండవ కంట నెత్తురు కాఱిన, తిన్నడు 'నగి ... నీకృప చేతఁ గన్నమందున్నది దీనికి న్వెఱవ నొక్కటి నా వ్రతమింక శంకరా" అని (116ప.3ఆ.).

"లాలాటలోచనంబునఁ
గీలాలము దొరఁ గనేని కేవల భక్తిన్.

గిలించి మనోదృష్టికి
మూలంబగు నాదు ప్రాణములు నీ కిత్తున్" 117ప. 3ఆ.

అనుట వీరభక్తికి నిదర్శనము.

## నత్కీరునికథ

ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు నత్కీరుడని యతిమైత్రిఘటితముగ కలదు. (167ప. 3ఆ.) అతడు తమిళ సంఘయుగకవి. అసలు పేరు కీరర్. నల్ల + కీరర్ = నక్కీరర్ అనియె తమిళగ్రంథములందు కలదు. పచ్చకప్పురపు తిరువేంగళనాథుని చొక్కనాథుని చరిత్రయందు నక్కీరుడని, నత్కీరుడని కలదు. తిరువేంగళనాథుడు ధూర్జటికి కించిదనంతరకాలికుడు. నక్కీరుడు తమిళవ్యవహారము వలన, నత్కీరుడు తెలుగు వ్యవహారమువలన ప్రయుక్తము కావచ్చును.

పరంజ్యోతిమునివర్ తిరువిళైయాదర్ పురాణమునందు కథాప్రారంభమిట్లు కలదు. 80 పాండ్యరాజు రాణితో ఉద్యానవనవిహారము సేయును. తీయని సువాసన వేయును. అది రాణి అందమైన ధమ్మిల్లము సువాసన అని తలంచును. ఆస్థానకవులను సంప్రదింపవలయునని భావించును. అదే సమయమునందు మధురైలోని దరుమి అనుపేద అర్చకునికి సుందరేశ్వరుడు తమిళ పద్యము కల తాళపత్రమునిచ్చి, పాండ్యరాజునకు వినిపించిన ధనము లభించునని తెలుపును. దరిమి అట్లు సేయును. అతడు చదివిన పద్యమునకు ఒక ప్రియుడు తనప్రియురాలి ధమ్మిల్లగంధము కంటె మహాసుగంధము కలదా? అని పూలను వెదకు తుమ్మెదను అడుగును. అది విని నత్కీరుడు అధిక్షేపించును...సుందరేశ్వరుడు పండిత వేషధారియై వచ్చి అందలి తప్పేమని అడుగును. ఏ స్త్రీ ధమ్మిల్లమును సహజగంధము కాదని నత్కీరుడు సమాధానమిచ్చును. దివ్యాంగనల ధమ్మిల్లములు కావా? అనిన, కావని, పార్వతి ధమ్మిల్లము కూడ కాదా? అనిన, కాదని నత్కీరుడు ప్రత్యుత్తర మిచ్చును. అది భరింపలేక సుందరేశ్వరుడు మూడవకన్ను తెఱచును. వెంటనే నత్కీరుని ఒంటిమీద మానని వ్యాధి కన్పించును. పశ్చాత్తాపము నొంది నత్కీరుడు ప్రార్థించును. కైలాసపర్వతమును సందర్శించిన వ్యాధి నిర్మూలమగునని సుందరేశ్వరుడు అనుగ్రహించును.

ఇందలి పాండ్యరాజదంపతుల ఉద్యానవనవిహారము, పాండ్యరాజు తీయని సువాసన తన రాణి ధమ్మిల్లము సువాసన అని తలచుట, సుందరేశ్వరుడు దరుమికి

ఇచ్చిన తాళపత్రలిఖితమైన తమిళపద్యభావము ధూర్జటి నత్కీరుని కథయందు లేవు. కారణము ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు ఆధారము తమిళగ్రంథమైన సీకాళత్తిపురాణమగుట కావచ్చును.

ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని మధురాపురవర్ణనము (131-139ప. 3ఆ.). దుర్భిక్షవర్ణనము (148-156ప. 3ఆ.) తీర్థయాత్రావర్ణనము (178-198ప.3ఆ.) ధూర్జటి స్వతంత్రకల్పనములే.

మధురాపురవర్ణనము స్థలచిత్రణము.

"కపటచతుష్షష్టిగతుల నాడిన వాల
వాయి చొక్కేశునివాసభూమి
యతని పట్టపుదేవియైన మీనేక్షణా
ధరతనూభవకుఁ బ్రధానగృహము
ద్రవిడభాషాపీఠతలశంఖఫలకంబు
గలకనకాబ్జపుష్కరిణికిరవు
దక్షిణాంబుధివధూతామ్రపర్ణినది
సవతు వైఘకు నెన్నఁజాలు నునికి
నిజదృగబ్జప్రపూజితనీలకంఠ
కూడ లళఘయవైకుంఠకుంఠితాఘ
నిఖిల సంపత్పరంపరానిహిత కింప
చానుతాపంబు మధురాభిధానపురము." 131ప. 3ఆ.

ఇందలి శంఖఫలకము సంఘఫలకమగును. నత్కీరుడు తమిళసంఘసారస్వతకవి.

దుర్భిక్షవర్ణనము సహజచిత్రణము

"తోలును నెమ్ములు నిమ్మగిలి డ్రోసినఁ దొంబది చోట్లఁ గూలు వా
రాలిని బిడ్డల న్విడిచి యాఁకటి చిచ్చున వెచ్చపోవువా
రేలిక బంటు వాసి యొక యించుక లేక కృశించువారునై
తూలె జనంబు మీనశనిదోషము దాఁకి నిరస్తసస్యమై. 153ప. 3ఆ.

సుందరేశ్వరుడు పండితవేషధారిగ కాక సుందరేశ్వరునిగానే వచ్చి అడిగిన విషయమిది :

"ఈ రాజన్యుని మీఁద నేఁ గవిత సాహిత్యస్ఫురన్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పి పంప విని మాత్సర్యంబు వాటించి న
త్కీరుం డూరక తప్పువట్టెనఁ ట యేదీ లక్షణంబో యలం
కారంబో పదబద్ధమో రసమొ చక్కంజెప్పుఁ డా తప్పనన్." 167ప. 3ఆ.

ఇందు మాధుర్యము, ప్రౌఢిమ, లక్షణము, అలంకారము, పదబద్ధము, రసము కవితా లక్షణములుగ కలవు.

శాపగ్రస్తుడైన నత్కీరుని దుఃఖము హృదయవిదారకము.

"ఎన్ని మహానదు, ల్వనములెన్ని, గిరీంద్రము లెన్ని, బోయవీ
డ్లెన్ని, మృగంబు లెన్ని, జనహీనములైన పథంబు లెన్ని, నే
నిన్నియు దాఁటి యే కరణి నీశ్వరు శైలముఁ జూడఁ బోయెదన్?
గన్నదికాదు విన్నయదికాదు గాని సదాశివా! యేమి సేయుదున్?"

నత్కీరుని తీర్థయాత్రాస్థలములైన పెన్న, గుండ్లకమ్మ, కృష్ణవేణి, గౌతమీగంగ, పీఠికాపురము, సింహాచలము, శ్రీకూర్మము ధూర్జటి స్వదేశాభిమానపురస్కారములు.

నత్కీరుడు కొలను చెంత మఱ్ఱిచెట్టు నీడను విశ్రమించి, మఱ్ఱిచెట్టు నుండి రాలిన పండుటాకులు నేలమీద పడినవి పక్షులగుట, నీటిలోన పడినవి మీనము లగుట, ఒక పండుటాకు సగము కొలను నీటిలోను, సగము కొలను గట్టుమీద పడి మీనత్వపక్షిత్వములు గైకొని లోపలికి వెలుపలికి లాగుకొనుట చూచుట, భక్తిరసమును వదలి అద్భుతరసమును ఆశ్రయించుట, అప్పుడొక భూతము వచ్చుట, నత్కీరుడు సుబ్రహ్మణ్యస్వామిని ప్రార్థించుట, సుబ్రహ్మణ్యస్వామి భూతమును చంపుట, నత్కీరుని శ్రీకాళహస్తికి చేర్చుట సీకాళత్తిపురాణమునందు కలదు. అది ధూర్జటి నత్కీరుని కథయందును కలదు. భూతము తన గుహలో తొమ్మిది వందల తొంబది తొమ్మిది మందిని బంధించి, భుజించుటకు వేయవవాని కొఱకు ఎదురుచూచుచున్నట్లు సీకాళత్తిపురాణమునందు కలదు. ధూర్జటి కథయందు ఇట్లు కలదు.

"నూఱుక త్రావు నీతఁడు కనుంగొనునంతటిలో మనుష్యులన్
నూఱువురైనఁ గాని తిన నోటికి నాఁటు దటంచుఁ గూర్చఁగా
నూఱువురైరి నేఁటికి మనుష్యులు నీవును గూడ నింతటన్
నూఱును నిండె నిండఱ కనుగ్రహ మీశ్వరుఁడేమి సేయునో" 205ప. 3ఆ.

ఇందు 99+1 = 100. అందు 999+1=1000. అంతే భేదము. మొత్తము మీద సీకాళత్తిపురాణములోని నక్కీరుని కథయే నిమిత్తమాత్రముగ. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని నత్కీరుని కథ స్వకపోలకల్పనమున ప్రపంచీకరించినట్లు కలదు.

# వర్ణనలు

కథాప్రారంభమునందు శ్రీకాళహస్తివర్ణనము (17-26తప. 1ఆ.). తిన్నని కథయందు ఉడుమూరు వర్ణనము (3-16ప. 3ఆ.). నత్కీరుని కథయందు వారయువతీ ద్వయకథయందును మధురాపురవర్ణనము (131-139ప. 3 ఆ.3-5ప.4ఆ.)కలవు. ఉడుమూరు వర్ణనమునందు స్థానికప్రకృతిచిత్రణము కలదు.

"స్తబ్ధరోమవిషాణలబ్ధమౌక్తికములఁ
బాటింపుదురు రేఁగుపండ్లపాటి
ముక్తకంచుకమస్తముక్తాఫలంబుల
మందలింతురు కురువింద లట్లు
సమదసామజకుంభజములైన ముత్తియం
బులఁ జూతు రుసిరికాయల విధమున
వేణుజాతములైన యాణిపూసల నెంతు
రూడుగ పండ్లకు నీడు గాఁగ
గంధసారాగురుద్రుమకాష్ఠఖండ
చయము దమ యింటి వంటికట్టియలు గాఁగ
జేయుదురు కాఁపురంబులు సేయునపుడు
చెంచెతలు చెంచులను గూడి చిత్రలీల.4
సంకుమదంబునుం బునుఁగుఁ జాఁదును గస్తురియుం ఘటంబులం
బంకముఁ జేసి యిండ్లలికి ప్రత్యహము న్వెలివైవ మార్గకూ
లంకషగోమయప్రతతులం బురుడించుచుంనుండుఁ గుప్పలై
యింకఁ దదీయభూతి నిదమిత్థమటంచు నుతింప శక్యమే." 5ప. 3ఆ.

ఇందు చెంచెతలు గంధసారాగురుద్రుమకాష్ఠఖండములను వంటకట్టెలను చేయుట. పునుగు జవ్వాది చాదు కస్తూరి మొదలైన పరిమళ ద్రవ్యములతో ఇళ్ళలుకుటయేగాక, పేడకుప్పలను చేయుట జగన్నాథపండితరాయల జగద్విదితమైన శ్లోకమును జ్ఞప్తికి తెచ్చును.

"అతిపరిచయా దవజ్ఞా సంతతగమనాదనాదరో భవతి
మలయే భిల్లపురస్త్రీ చందనతరుకాష్ఠ మింధనం కురుతే."

మధురాపురవర్ణనమునందు మీనాక్షిచొక్కనాథుల ప్రసక్తి కలదు.

"కపటచతుష్షష్టిగతుల నాడినవాల
వాయిచొక్కేశు నివాసభూమి
యతని పట్టపుదేవియైన మీనేక్షణా
ధరతనూభవకుఁ బ్రధానగృహము (131ప. 3ఆ.)
"హరుఁడు చొక్కేశ్వరుండు మీనాక్షిసతియుఁ
గాఁ పురం బుండు నమ్మధురాపురంబు" 3ప. 4ఆ.

పాము. ఏనుగుల కథయందు వారయువతీద్వయకథయందును సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత ప్రకృతి వర్ణనములు కలవు. అందు శ్రీనాథుని "కాదుకాదుదయాద్రి కనకకూటం బిది డంబైన పానవట్టంబు గాని" అను పద్యమునకు అనుపల్లవి కలదు.

"ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు వా
ర్ధి. ధరధ్వాంతము ధూపధూమము జ్వలద్దీపప్రభారాజి కౌ
ముది. తారానివహంబు లర్పితసుమంబుల్గాఁ దమోదూరసౌ
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగం బొప్పెం బ్రాచీదిశన్" 133ప. 2ఆ.

ఇంత శివభక్తుడైన ధూర్జటి రామాయణస్మరణము చేయుట విశేషము.

"సాయంకాలరఘుక్షితీశ్వరుఁడు కెంజాయ న్ముఖంబొప్పఁగా
డాయన్వచ్చి తమిస్రతీవ్రతరకాండధ్వస్తపాదంబుగాఁ
జేయం జక్రవధూధరాసుతకు విశ్లేషవ్యథాపాదియై
మాయాహేమమృగంబు నాఁబడియె నమ్మార్తాండు డస్తాద్రిపై." 87ప. 4ఆ.

ఇందు రాముడు. సీత. రామబాణము. మాయలేడి ఆధారముగ కల్పనము కలదు. శివుని దక్షిణామూర్తి రూపము (86ప. 1ఆ.) దక్షిణ కైలాసవిహారము (97-101ప. 1ఆ.) వేసవి వర్ణనము (142వచ. 1ఆ.) బ్రహ్మపుత్త్రుల దుష్టచేష్టలు (26-30ప. 2ఆ.) యుద్ధవర్ణనము (38-63ప. 2ఆ.) ఆశ్రమవర్ణనము (71ప. 2ఆ.) కాటితేని జాతర(35వచ-45ప. 3ఆ.) వేట వర్ణనము (47-54ప. 3ఆ.) తీర్థయాత్రావర్ణనము(178-192ప. 3ఆ.) అక్షయవటవృక్షవర్ణనము (198ప. 3ఆ.) భూతవర్ణనము(200ప.3ఆ.) మొదలైనవి. ధూర్జటి

శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని ఇతరవర్ణనలు.

కాటిఱేని జాతర ఆటవికుల పండుగ. వేటకు పోవుటకు ముందు చేయుదురు. అందుకు ముందు ఎఱుక ఱేడు కాటిఱేని జాతరకు చాటింపు వేయించును. ఆటవిక స్త్రీలు పొఱుటాకు చీరలు కట్టుకొని, కొప్పులందు ఎఱ్ఱ చేమంతి పువ్వుల గుత్తులు తుఱుముకొని, కన్నుల కాటుకలు పెట్టుకొని, పాదములందు లత్తుక హత్తుకొని, ఒడలెల్ల పునుగు పచ్చికస్తూరి జవ్వాది పూసికొని తిరుగుదురు. చాటింపు మఱుసటి మంగళవారము - నివ్వరి బియ్యము వండి వార్చిన అన్నభాండములు, ప్రాలపాయసముల కుండలు, వెదురు బియ్యము "పిండి గొట్టి క్రొత్రుంచోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించిన కుడుముల బానలు, పిండి కూరల చట్లు నానావిధమాంసముల అటికలు, ఆసవకలశములు గంపలను కావిళ్లను పెట్టుకొని బలిపశువులను పట్టుకొని, తప్పెటలు, కిన్నరలు, గుమ్మెటలు, కొమ్ములు మొదలైన వాద్యములతో ఆటవికులందఱును కాట్రేని గుడికి వత్తురు. ఎఱుకఱేడు సెలయేటిలో స్నానము చేసి, విభూతి పెట్టుకొని, కాట్రేని సన్నిధిని ఆయుధములు పెట్టి ఎఱ్ఱ విరిదండలతోను, నివ్వరిప్రాలతోను, గుగ్గిలంపుపొగ వేసి పునుగుజోతులెత్తి కానుక లిచ్చి వివిధోపచారముల కాటిఱేని పూజసేయును. అనంతరము శబరులు అన్నపానాదులొనరింతురు.

ఆటవికుల బాల్యక్రీడలను ధూర్జటి వివరించెను.

"చిట్లబొట్లాకాయ సిరిసింగణావత్తి
గుడుగుడు గుంచాలు కుందెనగుడి
డాఁగిలి ముచ్చులాఁటలు గ్రచ్చకాయలు
వెన్నెల కుప్పలు తన్నుబిల్ల
తూరన తుంకాలు గీరన గింజలు
పిల్లదీపాలంకి బిల్లగోడు
చిడుగు దువ్వల పోటి చెండు గట్టిన బోది
యల్లి యుప్పనఁ బట్టె లప్పళాలు
చిక్కనాబిల్లలోటిల్లుచిందఱాది
యైన, శైశవక్రీడావిహారసరణి" 33ప. 3ఆ.

ఇవి ధూర్జటి ఆటవికజీవనపరిశీలనమును పగటునవి. సహజత్వ ముట్టిపడునవి. జానపదవాఙ్మయమునకు జాడలు.

# శ్రీకాళహస్తీశ్వరశతకము

శ్రీకాళహస్తీశ్వరశతకము మహాశతకము. శతకవాఙ్మయమునకు మణిమకుటము. భక్తిశతకములందు భవ్యకవితావేశము భాసిల్లునది. శతక పద్యములు నూటపదార్లు. ప్రతిపద్యము అతిహృద్యము.

# కర్తృత్వము

శతకమునందు కర్తృనిర్దేశము లేదు. కాని కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందమునందు "ధూర్జటి వారి కాళహస్తీశ్వరశతకము" నుండి ఉదాహరించిన "నీకుంగాక కవిత్వ మెవ్వరికి నే నీనంచు" అను పద్యము శ్రీకాళహస్తీశ్వరశతకమునందు కలదు. (114ప.) అంతేకాదు. శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని పద్యములు బజ్జబంతులైన పద్యములు శ్రీకాళహస్తీశ్వరశతకమునందు కలవు. అందు "దేవా! నిన్ను నుతింపలేను", "ఈ సంసార పయోధిలోఁబడి" అనుపద్యములు పూర్వోదాహృతములు.

"ఈ సంసారము దుఃఖా
వాసానందంబు దీని వర్ణింపంగా
నే సుఖము గల్గు దయ న
న్నా సుఖమునఁ గూర్పవే కృతార్థుఁ డ నగుదున్" 221ప. 3ఆ.
"అమృతముఁ గ్రోలు జిహ్వ చవి యంచుఁ దలంచునె తేనె? నింటిలో
నమరమహీరుహం బుదయమైన నరుం డవనీశు వేఁడునే?
యమిజనభాగ్యరూపమగు నాదిమతత్త్వము గాళహస్తిదై
వము భజియించు మానసము వారవధూమదసౌఖ్య మెంచునే?" 43ప. 4ఆ.

అను మాహాత్మ్యపద్యములును శతక పద్యములకు ఆద్యప్రకృతులే.

"ఏ వేదంబుఁ బఠించె లూత భుజగం బే శాస్త్రము ల్సాచ్చెఁ దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి చెంచే మంత్ర మూహించె బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా! కావు మీ పాద సం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!" 13.

ఇది మాహాత్మ్యరచనామాహాత్మ్యమే. మాహాత్మ్యమునందు లూత "సేవాధర్మ

ము మేలుగాక " అన్నది. ఇందు "పాదసంసేవాసక్తియెకాక" అని కలదు. ఇది మాహాత్మ్యశతకసంవాదము. కాబట్టి శ్రీకాళహస్తీశ్వరశతకము ధూర్జటి కృతమే.

# కాలము

శ్రీకాళహస్తీశ్వరశతకమునందు కాలము నిర్ణయించుటకు చరిత్రాంశము లేదు. కాని శతకములోని శతారము వంటి రాజనింద సుతారముగ రచనాకాలమును సూచించును. ధూర్జటి రాజనిందను "రాజుల్మత్తులు" (18ప.) రాజకీటములు (25,44ప.) "దుర్మార్గులం జీ ధాత్రీశుల" (83ప.) అను దూషణవాక్యములే గాక, విమర్శనక శాఘాతములు కలవు.

> "రా జర్థాతురుఁ డైనచో నెచట ధర్మంబుండు నే రీతి నా
> నాజాతి క్రియ లేర్పడున్ సుఖము మాన్యశ్రేణి కెట్లబ్బు రూ
> పాజీవాళికి నేది దిక్కు ధృతినీ భక్తుల్ భవత్పాదనీ
> రేజంబుల్ భజియింతురే తెఱఁగునన్ శ్రీకాళహస్తీశ్వరా!" 22
> "రాజన్నంతనె పోవునా కృపయు ధర్మం బాభిజాత్యంబు వి
> ద్యాజాతక్షమసత్యభూషణము విద్వన్మిత్రసంరక్షయున్
> సౌజన్యంబు కృతం బెఱుంగుటయు విశ్వాసంబు గాకున్న దు
> ర్బీజశ్రేష్ఠులుగాఁ గతంబు గలదే శ్రీకాళహస్తీశ్వరా!" 39

ఇవి అచ్యుతదేవరాయలకు వర్తించునవి., అచ్యుతదేవరాయలు" పరమదు రాత్మ ...డు. మహాక్రూరుడు. శ్యాలకాయత్తసిద్ధుడు. అనార్జవశీలుడు. అందువలన ప్రజలు రాజోద్యోగులు అసంతృప్తి చెందిరి." అని 1533వ సంవత్సరమునందు విజయనగర మునకు విచ్చేసి, కొంత కాలము నివసించిన ఫెర్నొన్యూనిజ్ గ్రంథస్థము చేసెను.[81] న్యూనిజ్ గ్రథనము పరమసత్యము కాకపోయినను సత్యసన్నిహితము. శ్రీకృష్ణదేవరాయల అనంతరము స్వతంత్రుడైన అచ్యుతదేవరాయలు మహామంత్రి తిమ్మరుసును మంత్రి పదవి నుండి తొలగించెను. అల్పలక్షణమే. తిమ్మరుసు విజయనగరమును విడిచిపెట్టి తిరుపతికి పోయి శేషజీవితము దుర్భరముగ గడిపెను. 1536వ సంవత్సరమునందు తిమ్మరుసు దేవస్థానప్రసాదస్వామ్యమును మూడు పర్యాయములు తాళ్లపాక పెదతిరుమలాచార్యులకు విక్రయించినట్లు క్రయశాసనములు కలవు.[82] ఆంధ్రకవితాపితామహుడైన అల్లసాని పెద్దన "కృష్ణదేవరాయలతో దివికేఁగలేక బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు" అని పరితపించవలసివచ్చెను. మఱి ఆంధ్రకవి ధూర్జటి అంతకంటె దయనీయుడు. అచ్యుతదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజకవులకు స్వస్తి పలుకుట సహజము. సాపత్న్యము. చాటువిట్టలనాథుడు అపవాదము. పెద్దన జీవచ్ఛవమైన. భవపరాఙ్ముఖుడైన ధూర్జటి పరమవిరక్తుడగును. పరమవిరక్తియే శ్రీకాళహస్తీశ్వరశతకమునకు ప్రాణము. కాబట్టి శ్రీకాళహస్తీశ్వరశతక రచనాకాలము 1535 ప్రాంతము కావచ్చును.

శతకరచనాకాలము నాటికి ధూర్జటి బహువృద్ధు వలె ఒక పద్యము కలదు.

"ఎన్నేళ్లుండుదు నేమి గందు నిఁక నే నెవ్వారి రక్షించెదన్
నిన్నే నిష్ఠ భజించెద న్నిరుపమోన్నిద్రప్రమోదంబు నా
కెన్నం డబ్బెడు నెంతకాలమిఁక నేనిట్లున్న నేమయ్యెడిం
జిన్నం బుచ్చక నన్ను నేలుకొనవే శ్రీకాళహస్తీశ్వరా!" 33ప. 1ఆ.

ఇందు ధూర్జటి ఎన్నో యేండ్లు బ్రదికినట్లు భంగ్యంతరముగ కలదు. కనీసము డెబ్బది యైదు సంవత్సరములైన బ్రదికి యుండవలయును. కనుక ధూర్జటి కాలము 1460-1540 కావచ్చును. అయిన శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలమునందు (1509-1524) ధూర్జటి వయస్సు 40-55 సంవత్సరములు. అది ధూర్జటి అష్టదిగ్గజకవి అగుటకు సానుకూలము.

# సమీక్ష

శతకమునకు మూడు లక్షణములు ముఖ్యము. 1. సంఖ్యానియమము. 2. నియతమకుటము. 3. స్వీయానుభూతి. మూడవది నీతిశతకములందు మృగ్యము. భక్తిశతకములందు బాహాటము.

శ్రీకాళహస్తీశ్వరశతకమునందు నూటపదాఱుపద్యములు కలవు. పదాఱు పద్యములు అధికము. పాతికలోపు. శతసంఖ్యానియమమునకు విఘాతము కాదు. సంఖ్యానియమము సంగతమగును.

నూటపదాఱు పద్యములందును "శ్రీకాళహస్తీశ్వరా!" అను మకుటము నియతముగ కలదు. నియతమకుటము నిరపవాదము.

శతకమునందు ఆద్యంతము ధూర్జటి స్వీయానుభూతి కలదు. అదే ధూర్జటి ఆత్మీయత. వ్యక్తిత్వము. భోగానుభవము నుండి మోక్షానుభవమునకు పరిణతమైన ధూర్జటి మనస్తత్త్వము ప్రతిపద్యమునందు ప్రతిఫలించును. ఇందుకు ప్రథమపద్యమే

ప్రథమోదాహరణము.

"శ్రీవిద్యుత్కలితాజవంజవమహాజీమూతపాపాంబుధా
రావేగంబున మన్మనోబ్జసముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా! నీ కరుణాశరత్సమయ మింతే చాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా!" 1ప.

సంపద అను మెఱపుతో కూడిన సంసారమనెడు పెనుమబ్బుయొక్క పాపములనెడు నీటిధారలచేత మనస్సు అనెడు పద్మము యొక్క వికాసమును కోల్పోయితినని ధూర్జటి అనుభవప్రకటనము. సంపదతో కూడిన సంసారముయొక్క పాపముల చేత మనోవికాసమును కోల్పోయితినని అసలు విషయము. శ్రీకాళహస్తీశ్వరుని కరుణ కలిగిన చిద్భావనాసేవను మనియెదనని ఆశయము.

"కాయ ల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయ న్రాపడె ఱొమ్ము మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయం బాయెను బట్ట గట్టెఁ దల చెప్పన్ రోఁత సంసార మేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా!" 14ప.

ఇందు వధూశబ్దమునకు ఇటీవల భార్య అని అర్థము చెప్పుట కలదు. కాని స్త్రీ పర్యాయవాచిగ ధూర్జటి ప్రయోగమే శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కలదు. పూర్వోదాహృతమైన "అమృతముఁ గ్రోలు జిహ్వ" అను పద్యమునందు" వారవధూమదసౌఖ్య మెంచునే? అని కలదు. వారవధువులన వారకాంతలు. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి" అను చాటుపద్యములోని "వారవనితా" వ్యవహారము భవపరాఙ్ముఖుడు కాక పూర్వము ధూర్జటికి వాస్తవము కావచ్చును. అది కూడ సంసారములోని భాగమే. ధూర్జటి యౌవనదశ మన్మథవిహారక్లేశవిభ్రాంతమగుట విపరీతము కాదు. వార్ధకదశ వైరాగ్యప్రవణము. అది మాహాత్మ్యమునందు కంటె శతకము నందు అధికముగ కలదు. మాహాత్మ్యమునందు శృంగారలౌల్యము కలదు. కనుక తల బట్టకట్టినదనుట. చెప్పుటకు రోత అనుట చెల్లును. విరక్తికాంక్ష వార్ధకదశ విషయము.

"రోసీ రోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
బాసీ పాయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతివాంఛాలతల్
కోసీ కోయదు నా మనం బకట నీకుం బ్రీతిగా సత్క్రియల్.
చేసీ చేయదు దీని త్రుళ్ళణపవే శ్రీకాళహస్తీశ్వరా!" 32ప.

ఇందలి "పుత్రమిత్రజనసంపద్భ్రాంతివాంఛాలతల్" వలె, "కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబు"లు ధూర్జటి పూర్వసువాసనలే.

"ఏ లీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్యశ
బ్దాలంకారవిశేషభాషల కలభ్యంబైన నీ రూపముం
జాలుంజాలు కవిత్వము న్నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా!" 51ప.

ఇప్పటికిశ్రీకాళహస్తీశ్వరుని ఉపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్యశబ్దాలంకారవిశేషభాషలకు అలభ్యమైన రూపము నుతియింపలేమని ధూర్జటికి అనుభూతమైనది. అంతేకాదు. సత్యవర్ణనము సన్నిధిని కవిత్వము నిలువదని అర్థమైనది. సత్యమన లౌకిక సత్యము కాదు. పారమార్థికసత్యము. నిత్యసత్యము. శ్రీకాళహస్తీశ్వరుని రూపము. తన వంటి కవులు సిగ్గుపడరని కూడ ధూర్జటి సిద్ధాంతము. ఇందు ధూర్జటి విరక్తి ఇతోధికము.

"పరిశీలించితి మంత్రతంత్రములు చెప్ప న్వింటి సాంఖ్యాదియో
గరహస్యంబులు వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంకవో
దరయం గుమ్మడికాయలోను యవగింజంతైన నమ్మించి సు
స్థిరవిజ్ఞానము త్రోవఁ జెప్పఁగదవే శ్రీకాళహస్తీశ్వరా!" 77ప.

మంత్రశాస్త్రముల, తాంత్రికగ్రంథముల పరిశీలనము, సాంఖ్యాదియోగరహస్యముల శ్రవణము వేదశాస్త్రముల స్వీయప్రవచనము చేసినను, విన్నను, చెప్పినను శంక తొలగకపోవుట ధూర్జటి స్వానుభవము. గుమ్మడికాయలో యవగింజంతైన (ఆవగింజంత అని సామెత) నమ్మకము కలుగునట్లు సుస్థిరవిజ్ఞానము దారిచెప్పుమని ధూర్జటి అభ్యర్థనము.

ధూర్జటి స్వీయానుభూతిప్రకటనమునందు పూర్వభక్తుల పురస్కారమును కలదు.

"నీతో యుద్ధముఁ జేయనోఁపఁ గవితానిర్మాణశక్తి న్నినుం
బ్రీతుం జేయఁగ లేను నీ కొఱకుఁ దండ్రిం జంపఁగాఁ జాల నా
చేత న్రోఁకట నిన్ను మొత్త వెఱతుం జీకాకు నా భక్తి యే
రీతి న్నాకిఁక నిన్నుఁ జూడఁ గలుగున్ శ్రీకాళహస్తీశ్వరా!" 8ప.

శివునితో యుద్ధము చేసినవాడు అర్జునుడు. కవిత్వము చేత శివుని మెప్పించిన కవి మహిమ్నస్తవము రచించిన పుష్పదంతుడు. పుష్పదంతుడను గంధర్వుడు గంధర్వమాయచేత ఒక రాజు పూలతోటలోని పువ్వులుకోసికొనిపోయెడివాడని. అది తెలిసి రాజు పూలతోటలో శివనిర్మాల్యములైన పువ్వులు పోయించెనని. ఆ పువ్వులు దాటి వచ్చుట వలన గంధర్వుని మాయాశక్తి నశించెనని. మహిమ్నస్తవమును రచించి శివుని మెప్పించి మాయాశక్తిని పడసెనని ఐతిహ్యము. ఒక శివభక్తుడు తండ్రి వలదన్నను శివలింగార్చనము చేయునెడ. ఆ తండ్రి శివలింగమును తన్నెనని. అందుకు తండ్రిని తనయుడు చంపెనని. అతని శివభక్తికి మెచ్చి పితృహత్యాపాతకమును పరిహరించి దేవత్వమిచ్చెనని ఇంకొక ఐతిహ్యము. ఒక శివభక్తురాలు మాయాబ్రాహ్మణుడై అతిథిగా వచ్చిన శివుడు ఆతిథ్యము పూర్తిగా స్వీకరింపనందున రోకలితో శివునిమొత్తిన. ఆమె భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యెనని మఱొక ఐతిహ్యము. అటువంటి భక్తి తనకు లేదని ధూర్జటి ఆత్మపరిదేవనము.

"ని న్నే రూపముగా భజింతు మదిలో నీ రూపు మోఁకాలొ స్త్రీ
చన్నో కుంచమొ మేఁకపెంటికయొ యీ సందేహము ల్మాన్పి నా
కన్నార న్భవదీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే
చిన్నీరేజవిహారమత్తమధుపా శ్రీకాళహస్తీశ్వరా! "15ప.

అర్జునుడు శ్రీకృష్ణుని మోకాలు శివలింగముగా భావించి పూజించెనని. ఒక జారపురుషుడు వేశ్యాస్తనమునందు శివరూపము నిలిపి ధ్యానించెనని. ఒక అంధుడు బోర్లించిన కుంచమును శివలింగముగా భావించి పూజించెనని. కాటుకోటుడు మేకపెంటికను శివలింగముగా భావించి పూజించెనని. అట్లు పూజించిన అందఱికిని శివుడు ప్రత్యక్షమయ్యెనని ఐతిహ్యములు కలవు. కనుక శివుని రూపము మోకాలా? స్తనమా? కుంచమా? మేకపెంటికా? అని ధూర్జటి సందేహములు. సందేహనివృత్తి చేయుమని. సాకారరూపమును చూపుమని ధూర్జటి విన్నపము..

ధూర్జటి రాజనింద కూడ స్వీయానుభూతిపురస్కృతమే.

"రాజు ల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నం
భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా" 18ప.

రాజులు మత్తులు. శ్రీకృష్ణదేవరాయలు మత్తుడు కాడు. అప్రమత్తుడు. అచ్యుత దేవరాయలు, అతని బావమఱుదులు అప్రమత్తులుకారు. మత్తులు. వారి సేవ నరకప్రాయము. శ్రీకృష్ణదేవరాయల సేవ నరకప్రాయము కాదు. స్వర్గప్రాయము. అచ్యుత దేవరాయలు. అతని బావమఱుదుల సేవ నరకప్రాయమే. ధూర్జటికి పాదాభివందనము చేసిన రాజు శ్రీకృష్ణదేవరాయలు. అష్టదిగ్గజకవిపదవీచ్యుతి కలిగించిన రాజులు అచ్యుతదేవరాయలు, అతని బావమఱుదులు. ఆశ్రయించిన వారిచ్చు అంభోజాక్షులు, అందలములు, అశ్వములు, ఆభరణములు భవపరాఙ్ముఖుడైన ధూర్జటికి ఆత్మవ్యథాపాదకములు. కనుక తదపేక్ష చాలును. భవపరాఙ్ముఖుడు కాక పూర్వము శ్రీకృష్ణదేవరాయలు ఇచ్చిన అంభోజాక్షుల, అందలముల, అశ్వముల, ఆభరణముల అనుభవము పరిపూర్ణమైన తృప్తి కలిగించినది. అందువలన భవపరాఙ్ముఖుడైన పరమవిరక్తుడైన ధూర్జటి మోక్షాపేక్ష ప్రస్తుతాశయము. ఇది శతకరచనాకాలము నాటి స్థితి.

"వేధం దిట్టఁ గ రాదు గాని భువిలో విద్వాంసులం జేయ నే
లా ధీచాతురిఁ జేసెఁ జేసిన గులా మా పాటనే పోక క్షు
ద్బాధాదుల్ గలిగింపనేల యది కృత్యంబైన దుర్మార్గులం
జీ ధాత్రీశులఁ జేయనేటి కకటా! శ్రీకాళహస్తీశ్వరా!" 83ప.

శ్రీకృష్ణదేవరాయల అనంతరము చాటువిట్ఠలనాథుడు వినా అష్టదిగ్గజకవులు అచ్యుతదేవరాయల ఆస్థానకవులు కారు. ఎంత భవపరాఙ్ముఖుడైనను, మఱెంత పరమవిరక్తుడైనను క్షుద్బాధలు మానవసహజము. అవి ధూర్జటిని ఆవహించినట్లు ప్రకృతపద్యమునందు ప్రతీయమానమగును. క్షుద్బాధవలన కలుగు క్రోధమునకు అవధియుండదు. బ్రహ్మను తిట్టరాదు గాని అని, గులాము అని ధూర్జటి తిట్టెను. బ్రహ్మ సృష్టికర్త. విద్వాంసులకు క్షుద్బాధాదులు కలిగింపనేల? అది కర్తవ్యమైన, దుర్మార్గులైన ధాత్రీశులను సృష్టింపనేల? అని ప్రశ్నించెను. దుర్మార్గులైన ధాత్రీశులు అచ్యుతదేవరాయలు, అతని బావమఱుదులును. ప్రకృతపద్యమునందు ధూర్జటి దుర్భరజీవితము గర్భితము.

ఇట్లు ధూర్జటి స్వీయానుభూతి శ్రీకాళహస్తీశ్వరశతకమునందు సార్వత్రికము.

## అతులితమాధురీమహిమ

"ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో యతులిత మాధురీమహిమ" అనగా ధూర్జటి పల్కులకు అతులితమాధురీమహిమ కలదని అవగాహనమగును. అతులితమాధు

రీమహిమ అనగా అనన్యసామాన్యమైన మాధుర్యాతిశయము. మాధుర్యము కావ్యగుణము. సరసములగు పదములు సమాసభూయిష్ఠము గాకుండ విడివిడిగా కూర్చిన రచన. సమాసభూయిష్ఠరచన ఓజోగుణము. సరసపదసంయోజనము మాధుర్యగుణము. శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు ఓజోగుణము సకృత్తు. మాధుర్యగుణము సమృద్ధి. శ్రీకాళహస్తీశ్వరశతకమునందు ఓజోగుణము నామమాత్రము. మాధుర్యగుణము అతిమాత్రము. ఇందుకు పూర్వోదాహృతపద్యము లెల్ల ఉదాహరణములే.

## ఆత్మీయత

ధూర్జటి యౌవనమునందు "కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులు" కలవాడు. (32ప.శ్రీ.శ.)పూర్తిపద్యము పూర్వోదాహృతము.శ్రీకాళహస్తిమాహాత్మ్యరచనాకాలము నాటికి భవపరాఙ్ముఖుడు. అప్పటి వయస్సు డెబ్బది లోపు. శ్రీకాళహస్తీశ్వరశతకరచనాకాలము నాటికి పరమవిరక్తుడు. అప్పటి వయస్సు డెబ్బదిపైన. భవపరాఙ్ముఖుడైనను" కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబుల" ప్రభావము శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు ప్రతిఫలించినది. శ్రీకాళహస్తిలోని కామినులు ధూర్జటికి యోగినులు.

> "పరిచితబంధనైపుణి, నపారకళానుభవప్రసక్తి, నా
> దరసవివేకసంపద, సదాశుకవాక్యసుధానుభూతి, మో
> హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగ రహస్యవిచారబుద్ధి, న
> ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబు పోలికన్." 24ప. 1ఆ.

ఇందు కామశాస్త్రము, యోగశాస్త్రము కరచాలనము కావించినవి. ఉడుమూరులోని మంచెలమీది చెంచెతల మర్మాంగప్రదర్శనము (10ప.3ఆ.) ధూర్జటి మనోవికారమును ప్రకటించును. అంతేకాదు.

> "తేనియలు గ్రోలి పిదపన్
> మానవతుల యధర మాని మఱతురు శబరుల్
> తేనియ తియ్యఁ దనంబు స
> మానంబనఁ దగునె యధరమధురిమ కెందున్." 14ప. 3ఆ.

అను పద్యములోని "అధరమధురిమ". స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి అను పద్యములోని "...నస్థైకమోహానోద్ధతసుకుమార వారవనితాజనతాఘనతాప

హారిసంతతమధురాధరోదితసుధారసధార"లకు సూచిక. కాటితేని జాతరలోని పారదారిక శృంగారము మూడు పద్యములందు కలదు.(42-44ప. 3ఆ.) అందొక పద్యమిది.

"నాతి యొకర్తు చిత్త ముపనాథునిపై నిడి సారెసారె మో
హాతిశయానఁ బోలె నధికాసవమిచ్చి నిజేశుఁ గూర్చి య
ల్లాతని నాథు పేరనె ప్రియంబునఁ బిల్చుచు గౌఁగిలించి హే
లాతురతాత్మికాగతి విలాసము చూపుచుఁ గూడె వేడుకన్." 42ప. 3ఆ.

ఇది వాస్తవమైనను భవపరాఙ్ముఖుడు వర్ణింపవలసినది కాదు. అయినను. వర్ణించుటకు హేతువు యౌవనసంస్కారమే అగును.

ఇక ధూర్జటి భవపరాఙ్ముఖతకు శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని పూర్వోదాహృతములైన "దేవా! నిన్ను నుతింప", "ఈ సంసారపయోధిలోనఁ బడి", "ఈ సంసారము" "అమృతముఁ గ్రోలు" అను పద్యములు శృంగగ్రాహికలు. మఱి పరమ విరక్తికి శ్రీకాళహస్తీశ్వరశతకములోని పూర్వోదాహృతములైన స్వీయాను భూతిప్రతిఫలనపద్యములెల్ల చిహ్నపతాకలు.

"నీపైఁ గావ్యము చెప్పుచున్న యతఁడు న్నీపద్యముల్ వ్రాసి యి
మ్మా పాఠం బొనరింతు నన్న యతఁడున్ మంజుప్రబంధంబు ని
ష్టాపూర్తిం బఠియించుచున్న యతఁడున్ సద్బాంధవుల్ గాక చీ
చీ పృష్ఠాగతబాంధవంబు నిజమా శ్రీకాళహస్తీశ్వరా!"86ప.
"నీకుం గాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మోదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిం బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు నా తనువు కీలున్ నేర్పులుం గావు చీ
చీ కాలంబుల రీతి దప్పెడుఁ జుమీ శ్రీకాళహస్తీశ్వరా!" 114ప.

శివునిపై కావ్యము రచించువాడు, రచింపుమనువాడు, పఠించువాడు సద్బాంధవులని పృష్ఠాగతబాంధవమును రోసిన. కవిత్వము హరాంకితమే కాని పరాంకితము చేయనని ప్రతిజ్ఞచేసి. పాటించి వ్రతమాచరించి. కాలవైపరీత్యములను ఛీత్కరించిన ధూర్జటి ఆత్మీయత అద్వితీయము.

# మాదయగారి మల్లన

మాదయగారి మల్లన మాదయపుత్త్రుడు. మల్లయ నామధేయుడు. మల్లయనామధేయులైన కవులు మఱికొందఱు ఉండుట వలన గాని. మాదయ ప్రసిద్ధుడగుట వలన గాని మాదయగారి మల్లన అను వాడుక ఏర్పడును. మాదయగారి మల్లన కృతి రాజశేఖరచరిత్రము. ఇది శ్రీకృష్ణదేవరాయాంకితము కాదు. దైవాంకితమును కాదు. నాదిండ్ల అప్పమంత్రికి అంకితము. అప్పమంత్రి మహామంత్రి తిమ్మరుసు అల్లుడు. (34ప. 1ఆ.) మేనల్లుడు కూడ. అప్పమంత్రి అనుజుడు నాదిండ్ల గోపమంత్రి (26ప.1ఆ.). మదయగారిమల్లన అఘోరశివాచార్యుల శిష్యుడు. (ఆశ్వాసాంతగద్య)

## కాలము

రాజశేఖరచరిత్రమునందు అప్పమంత్రి గుణగణముల వర్ణనము కలదు. (31, 32, 35-37ప. 1ఆ.) కాని చరిత్రాంశములేదు. ఆశ్వాసాంతపద్యములందు"శుంభత్పూర్వభూభృద్దిశానారీమన్మథ" అని కలదు. పూర్వభూభృత్తు అనగా పూర్వాద్రి. ఉదయగిరి అగును. అప్పమంత్రి ఉదయగిరి దుర్గాధిపతి అనవచ్చును. కాని. అప్పమంత్రి అగ్రహారదానాదికములు వినుకొండ, రొంపిచర్ల, మద్దిరాల, నందిపాడు, నూతులపాడు, కాజ, మల్లవరము, అతుకూరు, మంగళగిరి, రేటూరు, ఏచూరు, భర్తపూడి, అన్నవరము, నాదిండ్ల గ్రామములందు కలవు.[83] అవి చాలవఱకు గుంటూరు మండలమునకు చెందినవి. కాబట్టి అప్పమంత్రి వినుకొండ దుర్గాధిపతి కావచ్చును. అయిన పూర్వభూభృత్తు ఉదయగిరి కాదు. తూర్పుకొండ అగును. అప్పమంత్రి ఉదయగిరి దుర్గాధిపతి అని గాని. వినుకొండ దుర్గాధిపతి అని గాని రాజశేఖరచరిత్రమునందు లేదు. నారీమన్మథత్వమునకు దుర్గాధిపతి కావలసిన ఆవశ్యకము లేదు. అప్పమంత్రి అగ్రహారదానాదికములు 1515-1519 సంవత్సరముల మధ్య సాగినవి. గోపమంత్రి గుత్తి దుర్గాధిపతి అని రాజశేఖరచరిత్రమునందు కలదు. "గుత్తిదుర్గలక్ష్మీపరిపాలన క్రమసమిద్ధభుజాబలశాలి". (27ప.1ఆ.) గోపమంత్రి కొండవీడు దుర్గాధిపతి కూడ. కొండవీడు దుర్గాధిపతి కాకపూర్వమే గుత్తిదుర్గాధిపతి. కొండవీడు దుర్గాధిపతి అయిన కాలము 1515-1533[84]. 1515-1519సంవత్సరములమధ్య సాగిన అప్పమంత్రి అగ్రహారదానాదికములు గాని. 1515-1533 సంవత్సరముల మధ్య గోపమంత్రి కొండవీడు దుర్గాధిపత్యవిశేషములుగాని. ఒక్కటి కూడ ప్రసక్తము కాని

రాజశేఖరచరిత్రము రచనాకాలము 1515వ సంవత్సరము కంటె పూర్వము కావలయును.

అయినను, పెద్దన మనుచరిత్రపద్యములకు రాయల ఆముక్తమాల్యద పద్యములకు అనుసరణములు కలవుగావున, రాజశేఖరచరిత్రము రచనాకాలము, మనుచరిత్రము ఆముక్తమాల్యదల రచనాకాలముల కంటె అనంతరమని ఒక అభిప్రాయము కలదు.[85] ఇది ఆంతరంగికసాధనము. అది బాహిరమైన సాధనము. అంతస్సాక్ష్యము కంటె బహిస్సాక్ష్యము బలీయమైనది. అంతేకాదు. అనుసరణము పెద్దనకు, రాయలకును అనభ్యస్తవిద్య కాదు. మాదయగారి మల్లన రాజశేఖరచరిత్ర పద్యములకు మనుచరిత్రమునందు, ఆముక్తమాల్యదయందును అనుసరణములు కలవని గ్రాహ్యము.

కాబట్టి రాజశేఖరచరిత్రము రచనాకాలము 1515 వ సంవత్సరము కంటె పూర్వము. కనీసము 1515వ సంవత్సరము కావచ్చును.

శ్రీకృష్ణదేవరాయల కంటె, అల్లసాని పెద్దన కంటె మాత్రమేగాక, నంది తిమ్మన కంటెను పూర్వమే కావ్యమును రచించిన మాదయగారి మల్లన, వారి కంటె మాత్ర మేగాక ధూర్జటి కంటెను తర్వాత ప్రసక్తుడగుటకు కారణము గుణపక్షపాతము. పారి జాతాపహరణము కంటె, మనుచరిత్రము కంటె, ఆముక్తమాల్యద కంటె శ్రీకాళహస్తిమాహాత్మ్యము కంటె రాజశేఖరచరిత్రము మహాకావ్యము కాదు. అష్టదిగ్గ జకవి అగుట వలన అనుబంధము.

మాదయగారి మల్లన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు ప్రవేశించుటకు మహామంత్రి తిమ్మరుసు అల్లుడైన నాదిండ్ల అప్పమంత్రికి రాజశేఖరచరిత్రమును అంకిత మిచ్చుట సంభవము. ఆస్థానకవి, అష్టదిగ్గజకవి అయిన తర్వాత మఱొక కృతిని శ్రీకృష్ణదేవరాయలకు అంకితమిచ్చుట సంభావ్యము.

## మూలము

మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రములోని హేమధన్వుడను రాజునకు శివుడు ఫలప్రదానము చేయుటకు మూలము జక్కన విక్రమార్కచరిత్రములోని బృహత్కథ. ఆ ఫలమును హేమధన్వుని భార్య పాలిక భుజించుట వలన జన్మించిన రాజశేఖరుడు భానుమతిని రక్షించిన కథకు మూలము విక్రమార్కుడు కమలావతిని రక్షించిన కథ. మల్లన రాజశేఖరచరిత్రములోని ప్రధానమైన కథ కాంతిమతీ

రాజశేఖరుల పరిణయవృత్తాంతమునకు మూలము. జక్కన విక్రమార్క చరిత్రములోని కర్పూరమంజరీరాజశేఖరుల పరిణయవృత్తాంతము. కాంతిమతి శాపవృత్తాంతమునకు మూలము భారతములోని సుకన్యోపాఖ్యానము. భానుమతి తండ్రి మునివృత్తాంతమునకు మూలము రామాయణములోని విశ్వామిత్రవృత్తాంతము. యథామూలములు కావు. కథామూలములు. అన్యథాకల్పనములు. ప్రపంచీకరణములు. స్వతంత్ర కల్పనములు బహుళము.

జక్కనవిక్రమార్కచరిత్రములోనియోగినివర్ణనమిది:

"మత్తికాటుక పొత్తు మరిగిన నునుగెంపుఁ
జూపులఁ గలికి మించులు నటింపఁ
బెక్కువన్నెలకంథచక్కినిక్కకఁ జిక్కి
చనుదోయి కెలఁకులఁ జౌకళింప
సంకుఁబూసల క్రొత్త సరుల నిగారించి
కంబుకంఠము నూత్నకాంతి నొసఁగఁ
బలుగుఁగుండలముల ప్రభఁ బ్రోదిచేయుచుఁ
జెక్కులఁ జిఱునవ్వు చెన్ను మీఱ
యోగదండాగ్రగతపాణియుగళి మీఁదఁ
జిబుకభాగంబు నిలిపి రాచిలుకతోడ
సకలవిద్యానుసంధానసరసగోష్ఠిఁ
గలసి భాషించు యోగీంద్రకాంతఁ గనియె." 14ప. 7ఆ.

మల్లన రాజశేఖర చరిత్రములోని యోగిని వర్ణనమిది:

'అలికంబుపై రక్తతిలకంబు తెలిగన్నుఁ
గవయందుఁ గాటుక, కర్ణపాళ
ములఁ బటికంపుఁ గుండలములు గళమున
సంకుఁబూసల కంఠసరులు, గుబ్బ-
చనుదోయి వన్నె కుచ్చులిగింత, దాపలి
కరమునందు విభూతి కక్షపాల
పాణిపద్మంబున మాణిక్యమయవీణ,
పదయుగంబునఁ బైఁడి పాదుకలును
నుదరబంధంబు, లాతంబు, యోగపట్టె

సింగినాదంబు. బెత్తంబు చెన్నుమెఱయ
నుట్టి పడ్డట్టు యోగిని యొర్తు వచ్చి
లీల నా రాజశేఖరు మ్రోల నిలిచి." 94ప. 2ఆ.

ఇది పెద్దన మనుచరిత్రములోని ఔషధసిద్ధుని వర్ణనమునకు అనుసరణము కాదు. జక్కన విక్రమార్కచరిత్రములోని యోగిని వర్ణనమునకు అనుసరణము. అంతే కాదు. యోగిని నాథిని. ఔషధ సిద్ధుడు నాథుడు. నాథవేషధారణము సర్వసమానము.

ఒక్కయోగిని వర్ణనమునకేగాక. రాజశేఖరచరిత్రము మొత్తమునకే విక్రమార్క చరిత్రము మూలమగుట వలన విక్రమార్కస్మరణమును రాజశేఖరచరిత్రమునందు కలదు.

"విక్రమార్కుని కంటె విక్రమోన్నతి గల.
పరమాప్తులైన సద్భటులు కోటి" 191ప. 3ఆ.

జక్కన విక్రమార్క చరిత్రము స్వతంత్రకథాకావ్యమని పూర్వోక్తము. మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రము కూడ స్వతంత్రకథాకావ్యమే.

# కృతిసమీక్ష

రాజశేఖరచరిత్రములోని కథ ప్రసిద్ధము కాదు. కల్పితము. అది కూడ అపూర్వము కాదు. కథాసంవిధానమును నిర్మాణ మార్మికతానిపుణము కాదు. కాంతిమతి పూర్వజన్మ వృత్తాంతము. అందు విప్రవృత్తాంతము ప్రధానకథాప్రయోజనాత్మకములు కావు. కాంతిమతి పూర్వజన్మమునందు గంధర్వాంగన అయినను ప్రస్తుత జన్మమునందు మానవాంగనయే. వర్ణనములందును వైదగ్ధ్యములేదు. కవిత మాత్రము కమనీయము.

పుత్రసంతానము లేని హేమధన్వుని హృదయవేదనమిది:

"చందురు వంటి నెమ్మొగము చక్కటిఁ దూలఁ గఁ బుట్టు వెండ్రుకల్
గెందలిరాకుఁ బాదములఁ గీల్కొనఁ జేసిన యట్టి చిన్నిపై
డందెలు గల్లుగల్లుమన నాడుచు నల్లనఁ జేర వచ్చి నా
ముందఱ నాడ నెన్నఁ డొకొ ముద్దియ! ముద్దుఁ గుమారుఁ గాంచుటన్."

ఇది హృదయంగమము. బాలరాజశేఖరునికి జోలపాడిన విధానమిది.

"కేళీకాంచనసౌధవీథికల చక్కిం దొట్లలోఁ బెట్టి యా
ప్రాలేయాచలకన్యకాధవకృపాపారంగతా! నిద్ర పో
వే! లావణ్యపయోనిధీ! యనుచు నావిర్భూతమోదంబునన్
జోలల్ పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్" 4ప. 2ఆ.

ఇది సహజసుందరము. సమాససౌభాగ్యము కల పద్యమిది :

"విందును బోలె నో విమతవీరభయంకర! రాజలోకసం
క్రందన!నీవు రా నెదురు రాఁ జనుదెంచె నిలింపకామినీ
బృందలతాంతకాంతకబరీభరసౌరభసారసన్మిళ
న్మందరకందరాసవిధమంథరబంధురగంధవాహముల్." 45ప. 2ఆ.

ఇది వాయుప్రసారము వలె తీగ సాగిన సమాసలతావితానము. కాళికాదేవి ప్రత్యక్షమైనప్పటి ప్రసన్నరూపమిది:

"కొప్పుపై నొప్పెడు కొదమచంద్రుని తోడఁ
గస్తూరికాతిలకంబుతోడ
సీమంత విరచితసిందూరరుచితోడఁ
గ్రొత్తముత్తియపుఁ జేర్చుక్కతోడఁ
దళతళమను దంతతాటంకములతోడ
గల్లుగల్లను రత్నకంకణంబుల తోడఁ
జిలుఁగైన చెంగావి వలువ తోడ
ముద్దు మోమున లేనవ్వు మొలకతోడఁ
జల్లచూపుల గరుణారసంబు తోడ
శాంతరూపంబు గైకొన్న శంభురాణి
యమ్మహాకాళి ప్రత్యక్షమయ్యె నపుడు" 87ప. 2ఆ.

ఇది శ్రీనాథుని కాశీవిశాలాక్షీ వర్ణనమునకు శిష్యప్రాయము. ఇక తొలిచూపు వలపులోని తొలిచూపు మెలపు-

'ఆ పుంస్కోకిలవాణి. యా జలధికన్యారత్నసౌందర్యరే
ఖాపాణింధమమూర్తి యా త్రిజగతీకాంతావతంసంబు కే
లీపద్మాకరవాంఛ దీఱదనఁగా లీలావతిన్ నిద్దపున్
జూపున్ గెల్వ వసంతమాడె మహీభృచ్చూడావతంసంబుపైన్" 170ప. 2ఆ.

రాజశేఖరుడు చూతగృహము వెడలి చూడ చూడ, సహస్రసఖీసమేతయైన కాంతిమతి జలకేళి చాలించి అల్లనల్లన రాసాగినది. జలకేళివాంఛ తీఱలేదనగా లీలావతిని, స్నిగ్ధమైన చూపును గెలుచుటకు రాజచూడావతంసముపై వసంత మాడెను. చూపులు గ్రుమ్మరించెనని అంత్యరము.

పూర్వకవులకు, అందులోను రాయలయుగములోని కవులకు అంతగా పట్టని దారిద్ర్యమును వర్ణించిన సందర్భము కలదు. (14-16ప. 3ఆ.)అందు,

"కుల నిర్మూలనకారణంబు, ప్రతిభాకుట్టాక, ముద్వేగకో
పలతాదోహద, మాజవంజవసుఖప్రత్యూహ, మాత్మవ్యథా
జ్వలనజ్వాలిక, కామినీనయనవీక్షాపాతసంరోధి, ని
త్యలఘుత్వాశ్రయభూమి, లేమి యది యాహా! యేమి గావింపదే? "

అనుపద్యము సార్వకాలికసత్యము, మనస్తత్త్వదర్శనము.

స్త్రీల కలహఘట్టమును (45-53ప.ఆ.) రాజశేఖరచరిత్రము నందు కలదు.

"కొప్పులు వీడఁ గా బిగువుగుబ్బలు పల్కుఱుఁ జాఱఁ బయ్యెదల్
గప్పుచు రత్న కంకణఝుళంఝుళనాదము మించ, హస్తముల్
ద్రిప్పుచుఁ గౌనుదీఁగెలు చలింపఁగ వేచని తోడివారితోఁ
జెప్పుచు నద్దిరా!యనుచుఁ జిట్టలు మీటుచు సందడింపుచున్" 46ప. 2ఆ.

ఇది స్వభావోక్తి. తన్వి విలాసము చిత్రముగ వర్ణించినపద్యమిది.

"కలితసుధారసంబు తొలుకన్ సరసప్రియభాషణంబులన్
బలికిన శీతకాలమగుఁ, బల్లవపాదములెత్తి లీలమై
మెలఁగ వసంతకాలమగుఁ, మించు కనుంగవఁ బాఱఁ జూచినన్
దలకొను కాఱుకాలమగుఁ, దన్వి విలాసము చిత్రమెన్నఁగన్. " 72ప. 3ఆ.

ఇది చమత్కారము. ఇంతకంటె చమత్కారము మఱొకటి కలదు.

"చిలుక పురోహితుండగుచుఁ జెంగట నుండగఁ, సిగ్గుపెందెరల్
దొలఁగఁగ ద్రోచి, బంధుగతిఁ దొరపుఁ గోర్కులు సందడింపఁగా
దలఁపు లతాంగి కన్నె మును తాన కనుంగవ దోయిలించి చూ
పులఁ దలఁబ్రాలు పోసె నృపపుత్రునిపై విరహాగ్ని సాక్షిగన్" 131ప. 3ఆ.

ఇవి పెండ్లి తలంబ్రాలు కావు. ప్రేమ తలంబ్రాలు ఇట్లు మల్లన కవిత మహనీయము.

రాజశేఖరచరిత్రమునందు పుర (44-54వచ.1ఆ.7ప.3ఆ.). కుమారోదయ (84-90 ప.1ఆ.). నాయక (3-9ప. 2ఆ.. నగ (44-47ప. 2ఆ.)సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంతప్రకృతి (61-69ప. 2ఆ. 139-143ప. 3ఆ.). యుద్ధ (71-80ప. 2ఆ.) ఆశ్రమ (106-107ప. 2ఆ.).వన (117-118ప.2ఆ.) సరోవర (121ప 2ఆ.) భోజన(127-132 ప.2ఆ.) వనవిహార (143-148ప.2ఆ.) పుష్పాపచయ (149రగడ). జలక్రీడ (150-153ప. 2ఆ.) నాయికా (174-184ప. 2ఆ.. 67-75ప. 3ఆ.). నదీ (32-35ప. 3ఆ.) వివాహ (154-228 ప.3ఆ.) వర్ణనలు కలవు. ఆదిని పురవర్ణనము దీర్ఘము. పది పద్యములు. అంతమున వివాహవర్ణనము అతిదీర్ఘము. డెబ్బదియైదు పద్యములు. కడమ వర్ణనలు కతిపయసంఖ్యాకములు. వివాహవర్ణనమునందు అలంకరణము. కల్యాణవేదిక. నీరాజనములు. కళ్యాణమంటపము. పెండ్లిపీట. గౌరీకళ్యాణముపాట. కాళ్లు కడిగిన కన్యాదానము. తెర. మంగళసూత్రము. తలంబ్రాలు. నాలుగవనాడు నాగవల్లి. ఐరేని కడవలు. దీపారాధనము చదివింపులు. కట్నములు. కానుకలు పసుపు కుంకుమ మాన్యములు. ముత్యపు ముంగర. పరిచారికలు. భటులు. అప్పగింతలు. పల్లకీ. అత్తింటి ప్రవేశము. అత్తమామలకు దండములు మొదలైన బహువిషయములు కలవు. పురవర్ణనములోని.

"గబ్బిపిసాళి వాలుఁదెలికన్నుల తేటమిటారి చూపులన్
మబ్బుకొనంగఁ జేసి విటమానసముల్ దమి వెల్లి ముంపుచున్
గుబ్బ మెఱుంగుఁ జన్నుఁగవ కుంకుమ పూఁతల కమ్మతావి యా
గుబ్బులుగాఁ జరింపుదురు కొమ్మలు. తత్పురమార్గవీథులన్." 48ప. 1ఆ.

అను పద్యము ప్రభావము పెద్దన మనుచరిత్రములోని.

"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁగ్రుమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బతిలంగఁ జూచె నల కూబరసన్నిభు నద్ధరామరున్" --ప. 2ఆ.

అను పద్యముపై ప్రసరించినది. పురవర్ణనములోనిదే అయిన.

"అరవిరిబాగుతో నలరులమ్ము లతాంగుల లేఁత నవ్వులన్
బెరసి సరంబులప్పటికిఁ బెంపు వహించుటఁ జేసి చూపరుల్

గర మనురక్తిమై నిలిచి కైకొని. పిమ్మటఁ బోయి చూచి యా
సరములు గావు పొమ్మనుచు సారెకుఁ గ్రమ్మఱి చిత్తరీమనన్" 49ప 1ఆ.

అను పద్యము ప్రభావము. రాయల ఆముక్తమాల్యదలోని

"సరసుల నర్మమింపుల నొసంగఁ గదంబపు దండ గట్టుచోఁ
గరఁ గుటఁ దెల్పు దృక్తరళకాంతులు నుత్తరమిచ్చు నంతరాం
తరముల నవ్వులు న్గలువతండము మొల్లలు నంచు మిన్నుగ్రు
చ్చి రఙొని రిత్తనూ లొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్." 20ప. 2ఆ.

అను పద్యముపై భంగ్యంతరముగ ప్రసరించినది. మల్లన పద్యములోని క్రయదారుల భ్రాంతి రాయల పద్యములోని పుష్పలావికలకు సంక్రమించినది.

మల్లన స్త్రీల కలహఘట్టములోని

"తొల! తొలఁగు! తొలఁగు మనుచుం
దల! తల! తల మనుచు వట్టి దంటతనంబుల్
వలదు వలదనుచుఁ బల్కఁగఁ
గలకంఠుల కపుడు మిగులఁ గలహము ముదురన్" 44ప. 2ఆ.

అను పద్యము స్వభావము. పింగళి సూరన కళాపూర్ణోదయములోని

"అంత మదింపకువే యని పల్కిన
నంత మదింపకువే యనుచున్" 205ప. 3ఆ.
"ఒట్టు సుమీ యన్న నొట్టుసుమీ! యంచు
నేమేమి? యనిన నేమేమి యనుచు" 206ప. 3ఆ.

అను పద్యములందు ప్రఫుల్లమైనది. రాజశేఖరచరిత్రములోని లతాకన కమంజరుల కలహఘట్టమే కళాపూర్ణోదయములోని రంభాద్వయకలహ ఘట్టమునకు మార్గదర్శకముగ కలదు.

రాజశేఖరుని చంద్రోపాలంభమునందు "కళాపూర్ణిమాచంద్రు" డని కలదు.(97ప. 3ఆ.) వివాహవర్ణనమునందు "ప్రో లనియెడు కాసారములో"అని కలదు.(177ప.3ఆ.) కళాపూర్ణోదయములోని కళాపూర్ణుని ప్రోలు కాసారము. కాని రాజశేఖరచరిత్రము పింగళిసూరన కళాపూర్ణోదయము తర్వాతి గ్రంథము కాదు. అట్లే అల్లసాని పెద్దన మనుచరిత్రమునకు, శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదకు తర్వాతి గ్రంథము కాదు.

ఇది స్థితిస్థాపకము.

# ఆత్మీయత

మాదయగారి మల్లన "శంకరపాదసేవనవశంవదమానసపంకజాతు"డు. (13ప.1 ఆ.) అఘోరశివాచార్యుల శిష్యుడు. అయినను వీరశైవుడు కాడు. స్మార్తశైవుడు. శివకేశవ సమదర్శి. మొగ్గు శివపరము.

హేమధన్వుడు పుత్రసంతానము కొఱకు చేసినది త్రికాలశివార్చనము. (74ప.1 ఆ.) శైవఘట్టము పదునాల్గు పద్యములందు కలదు. (65-78ప. 1ఆ.) అందు.

"నీలకంఠుని శిరసుపై నీళ్ళు చల్లి
పత్తి రిసుమంత నెవ్వఁడు పాఱవైచుఁ
గామధేనువు వానింటి గాడి పసర
మల్ల సురశాఖి వానింటి మల్లెచెట్టు" 65ప. 1ఆ.

అను పద్యము మనోజ్ఞము. అల్పాక్షరముల అనల్పార్థరచన. ఆణిముత్యము.

"కడలేని సంసారజలధిలో మునిఁగిన
జనుల పాలిటి నావ శంభుసేవ
కడుదూరమై యున్న కైవల్యసీమకుఁ
జక్కని పెనుఁద్రోవ శంభుసేవ
యతిభోగభాగ్యంబులను ముత్తియంబుల
సరులఁ గూర్చిన కోవ శంభుసేవ
సకలాగమజ్ఞానసారమహీజాత
జాతంబులోఁ జేవ శంభుసేవ
నిరవధిక్రూరపాతక దురవగాహ
గహనదహనసమున్నిద్రగంధవాహ
నఖశిఖామాలికల తేవ శంభుసేవ
(సద్గుణలతాంతముల తీవ శంభుసేవ)." 67ప. 1ఆ.

అను పద్యము మల్లన శివభక్తిపారవశ్యమునకు మచ్చుతునుక. హేమధన్వుడు "ఆదిమశైవకులాగ్రగణ్యుఁ" డని (70ప.1ఆ.) పాలికా హేమధన్వులు. "పరమశైవాచారసంపన్ను"లని (77వచ.1ఆ.) మల్లన ప్రతిపాదనము. "హాటకశైలధనుర్ధరుఁ బాటిం

పని వాఁడు" హేమధన్వునికి 'పగవాఁడు" (69ప.1ఆ.)

"ఆ మానవపతి చిత్తా
రామములో నుండ కురిగి, రాజతభూభృ
త్సీమకయి పోఁదలంపక
సోమకళాధరుఁడు మిగుల సోమరి యయ్యెన్." 78ప. 1ఆ.

అను పద్యము మల్లన ఉక్తివైచిత్రికి, శివభక్తి వైదగ్ధికి ఉదాహరణము.

వేదత్రయము, శాస్త్రవితతి, అఖిలపురాణేతిహాససమితి, కావ్యనాటకముఖగ్రంథములు చదివిన విప్రముఖ్యుడు "తపంబొనరించి యేను లక్ష్మీదయితప్రసాదమున" సమస్తసంపదలు పడయుదునని పలెకెను. (26ప.3ఆ.) "శ్రీహరిసేవాపరులైన పుణ్యులకుఁగాంతా! యేల చింతిల్లఁగన్?" అని ప్రకటించెను. (28ప.3ఆ.) అంతేకాదు. "పంచాగ్నిమధ్యంబున నిలిచి, హరిని గుణించి తపంబాచరిం"చెను. (41ప. 3ఆ.) ఇది మల్లన శివకేశవసమదర్శనమునకు నిదర్శనము. అయినను మొగ్గు అఘోరశివాచార్యుల శిష్యునకు శివపరమే.

"అబల! చూడు శివద్రోహి యనుచుఁ గెరలి
యతని కంకణ శేషాహి యావహించి
నాలుకలు గ్రోయు పగిది వనాలిఁ పలిత
లాలితైలాలతాగ్రపల్లవములమరె." 145ప. 2ఆ.

శివుని కంకణమైన శేషాహి శివద్రోహిని ఆవహించి, నాలుకలు సాచుచున్నట్లు, వనములోని ఏలకీలతల చివళ్ళ ఆకులు కదులుచున్నవట! ఇది మల్లన శివాభిమానమునకుతార్కాణము.

మల్లన కాంతిమతీరాజశేఖరుల వివాహమునందు గౌరీకల్యాణము పాట పాడించెను. పెద్దన మనోరమాస్వరోచుల వివాహమునందు లక్ష్మీనారాయణ కల్యాణము పాటలు పాడించెను ఇది వైష్ణవాభిమానము వలె, అది శైవాభిమానము.

"జటిసంఘాతసమీపసంఘటితరజ్యద్వాలుకాలింగసం
స్ఫుటముల్, జన్మపరంపరాఘలతికామూలచ్ఛిదాపాదనో
ద్భటముల్ ముక్తివధూకుచాగ్రపటముల్, భాస్వత్తనూసంభవా
తటముల్, వానికడ న్వసించు నరుచెంతం జేరవే చింతలున్" 33ప. 3ఆ.

ఇది మాదయగారి మల్లన శివలింగార్చనకు కరదీపిక.

# అయ్యలరాజు రామభద్రుడు

అయ్యలరాజు రామభద్రుడు అయ్యలరాజు వంశీయుడైన తిప్పయ్య ప్రపౌత్రుడు. పర్వతయ్యపౌత్రుడు.అక్కయ్యపుత్రుడు."అయ్యలరాజతిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాక్కయార్యపుత్ర .... రామభద్రకవి ప్రణీతంబయిన రామాభ్యుదయ మహాప్రబంధంబు" అని ఆశ్వాసాంతగద్యను కలదు. అయ్యలరాజు రామభద్రుని కృతి రామాభ్యుదయము.

## కాలము

రామాభ్యుదయము గొబ్బూరి నరసరాజునకు అంకితము. నరసరాజు అళియ రామరాయల మేనల్లుడు (48ప. 49వచ. పీ.) అల్లుడు కూడ."అళియరామరాజు జామాతృమణి" అని కలదు. (291ప. 7ఆ.) జామాత అన మేనల్లుడు కాదు. అల్లుడే. కాని. నరసరాజు కోనేటి తిమ్మరాజు కూతురుని ప్రేమించి పెండ్లాడినట్లు కలదు. (93ప.పీ.) అయినను నరసరాజు అళియరామరాయల అల్లుడు కావచ్చును. ఆ కాలమునందు బహుభార్యానిషేధము లేదు. విధానమే కలదు. నరసరాజు పెదతండ్రి ఓబళేశుడు "అల్లుఁడు రామరాజనుఁగుటల్లుఁడు" అని కలదు. (43ప.పీ.)నరసరాజు తండ్రి తిమ్మరాజు "ఆర్వీటిబుక్కభూపాలసుత్రామరామరాజన్యమూర్ధన్యశ్రీరంగరాజు" అల్లుడని కలదు.(48ప.49వచ.పీ.) ఆరవీటి బుక్కరాయల కుమారుడు రామరాజు. రామరాజు కుమారుడు శ్రీరంగరాజు. శ్రీరంగరాజు కుమారుడు అళియరామరాయలు. అన్న ఔబళేశుడు రామరాజునకు. తమ్ముడు తిమ్మరాజు శ్రీరంగరాజునకు అల్లుళ్లు. శ్రీరంగరాజు కూతురు తిమ్మరాజునకు కోడలు వరుస. అళియరామరాయల కూతురు నరసరాజునకు వావియే. వావి వరుసలకు వైపరీత్యము లేదు కావున నరసరాజు అళియరామరాయలకును అల్లుడు కావచ్చును.

అళియరామరాయల గురించి రామాభ్యుదయమునందు మూడు పద్యములు కలవు. (54-56ప. పీ.) అందు చరిత్రాంశము కల పద్యమిది:

"ఆ పటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమదుహితృప్రియుఁడై వితతప్రతాపసం
తాపితశత్రుఁడై యల సదాశివరాయ నిరంతరాయవి

ద్యాపుర రాజ్యలక్ష్మికి నిదానము దానయి మించె నెంతయున్." 55ప.పీ.

ఇందు శ్రీకృష్ణదేవరాయల అల్లుడైన రామరాయలు మహాపరాక్రమముచేత శత్రువులను సంతసింపఁజేసి, సదాశివరాయల నిరంకుశరాయమైన విజయనగర సామ్రాజ్యమునకు నిదానమయ్యెనని ఇతివృత్తమున కలదు. అళియరామరాయలు 1543వ సంవత్సరమునందు సలకరాజు చినతిరుమలరాజును సంహరించి, సదాశివరాయలకు పట్టాభిషేకము చేసి విజయనగరసామ్రాజ్యమునకు నిదానమగుట చరిత్రప్రసిద్ధాంశము.[86] అది ప్రసక్తమైన రామాభ్యుదయము రచనాకాలము 1543వ సంవత్సరము కంటె తదనంతరమగుట తథ్యము.

అళియరామరాయల సంతానము గురించి రామాభ్యుదయమునందు ఇట్లు కలదు.

"రామక్షోణివిభుండు కృష్ణమనుజేంద్రగ్రామణిన్ భీమసం
గ్రామేంద్రాత్మజుఁ బెద్ద తిమ్మవిభుని న్రాచూరి తిమ్మాధిపున్
శ్రీపె తుం బినకొండ భూవరవరున్ శ్రీరంగరాజన్మను
త్రాముం గాంచెఁ గుమారరత్నముల మందారోపమోదారులన్." 56ప.పీ.

ఇందు "చిన తిమ్మాధిపున్" అనుటకు "రాచూరి తిమ్మాధిపున్" అని కలదు. అంతేకాదు.

"రాచూరి తిమ్మవిభుని క
రాచూరిం దెగి నిరంతరము సమరమ్మునీ
లోచనల మదనశాస్త్రా
లోచనలం దవిలి వర్తిలుదు రభియాతుల్. " 61ప.పీ.

చిన తిమ్మాధిపుడు 1550 వ సంవత్సరమునందు రాచూరి యుద్ధమునందు శత్రు సంహారము చేసి, విజయము సాధించి, రాచూరి దుర్గాధిపతి అయి, రాచూరి తిమ్మరాజుగ ప్రసిద్ధుడగుట చరిత్రాంశము.[87] అది ప్రసక్తమైన రామాభ్యుదయము రచనాకాలము 1550వ సంవత్సరము కంటెను తదనంతరమగుట తథ్యము.

రామాభ్యుదయము కృతిభర్త గొబ్బూరినరసరాజు 1556వ సంవత్సరమునందు కడపజిల్లా పుల్లంపేట తాలూకలోని తొందూరు గ్రామము నందలి ఆంజనేయస్వామికి భూదానము చేసినట్లు శాసనము కలదు.[88]

కాబట్టి రామాభ్యుదయము రచనాకాలము 1555 ప్రాంతము.

## ఒంటిమెట్ట రఘువీరశతకము

రామాభ్యుదయములోని ఆశ్వాసాంతగద్యను ఒంటిమెట్ట రఘువీరశతకము ప్రసక్తి కలదు. అది రామభద్రుని కృతి అని ఒక అభిప్రాయము కలదు.[89] అయ్యలరాజు త్రిపురాంతకుని కృతి అని మఱొక అభిప్రాయము కలదు.[90] అటు, ఇటు అన్వయింప వచ్చునని ఇంకొక అభిప్రాయము కలదు.[91] ఇంతకు ఆశ్వాసాంత గద్యమిది:

"ఇది శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్మఠజగదేకధుర్యాయ్యలరాజు తిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాక్కయార్య పుత్రపరిశీలితసమిద్ధరామానుజసిద్ధాంత మర్మముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్రహృదయపద్మాధిష్ఠితశ్రీరామభద్రరామభ ద్రకవిప్రణీతంబయిన రామాభ్యుదయ మహాప్రబంధంబునందు-"

ఇందు హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర, ముమ్మడి వరదాచార్యకటాక్ష వీక్షా పాత్ర,పరిశీలితసమిద్ధరామానుజసిద్ధాంతమర్మ, అక్కయార్యపుత్ర, అయ్యలరాజు తిప్ప యమనీషిపర్వతాభిధాన పౌత్ర_, శ్రీమదొంటి మెట్ట రఘువీరశతకనిర్మాణ కర్మఠజగ దేకధుర్య అను విశేషణములు రామభద్రకవికి అన్వయించును. అథవా, పరిశీలితసమిద్ధ రామానుజసిద్ధాంతమర్మవిశేషణము ముమ్మడి వరదాచార్యునికి శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్మఠ జగదేకఖ్యాతిధుర్యవిశేషణము అయ్యల రాజునకు అన్వయించును. అయ్యలరాజు గృహనామము కాదు. వ్యక్తినామము. తిప్పయమనీషి తండ్రి లేక తాత. అంతేకాదు. అయ్యలరాజు కవికూడ.

"అయ్యలరాజుఁ దిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుండగు కొండధీరుసిం
జయ్యను సిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజు వంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్." 12ప. 1ఆ.

అని అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతియందు కలదు. అయినను, శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్మఠజగదేకఖ్యాతిధుర్యవిశేషణము తిప్పయమనీషికి అన్వయించుటకు హేతువులు రెండు కలవు.

1. అయ్యలరాజు అయ్యల, భాస్కరకవుల రెట్టమతశాస్త్రమునందు కృతిభర్తృపర

ముగ ఇట్లు కలదు.

"రాయకవియయ్య నయ్యలరాజు వంశ్యు
ననఘుఁడిన్నక్కవిభుపుత్త్రుఁ నయ్యలాఖ్యు
నాగఘనుసూనుభాస్కరనామధేయుఁ
గరుణ దళుకొత్త రావించి గారవించి"

"-విశేషించి మీరలు శ్రీరఘునాయకదయా లబ్ధసారస్వతులును, రఘువీరశతక నిర్మాణకర్మఠరాయకవితిప్పనార్యపాలకులును మదీయాశ్రితులునగుటంజేసియాభివత్కవిత్వంబు మాకభిమతం బయి యుండు"

ఇందు శతకకర్త తిప్పనార్యుడని కలదు. రఘువీరశతకనిర్మాణకర్మఠత్వము రామభద్రుని ఆశ్వాసాంతగద్యకు ప్రతిధ్వనియే.

2. ఒక రఘువీరశతకము కలదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందు రెండు తాళపత్రప్రతులు కలవు. అందొక ప్రతియందు 100 పద్యములు. మఱొకప్రతియందు 40 పద్యములు కలవు.[92] ముద్రితగ్రంథమునందు109 పద్యములు కలవు. కాని కర్తృనిర్దేశము లేదు. తంజావూరు సరస్వతీమహాలుగ్రంథాలయమునందు నాలుగు తాళప్రతులు కలవు. అందొక ప్రతియందు మాత్రమే కర్తృనిర్దేశము కల పద్యము కలదు.[93]

"అతులప్రౌఢిమ మీఱు రాయకవి యయ్యలరాజు సత్పుత్త్రుఁడం
చితభక్తిన్ త్రిపురాంతకుండు రచియించెన్ తెన్గు పద్యంబులన్
శతకం బొక్కటి దీని నీవు విని యాచంద్రార్కమై నిల్పు ప
ర్వతకన్యానుత యొంటి మిట్ట రఘువీరా జానకీనాయకా"

ఇందలి అయ్యలరాజు సత్పుత్త్రుడు త్రిపురాంతకుడు. అందలి అయ్యలరాజు తిప్పయమనీషి అయిన, రఘువీరశతకము రచనాకాలము 1450 ప్రాంతమగును. కాని శతకము 1550 ప్రాంతము నాటిదిగాను లేదు. అంతేకాదు. శతకమునందు నిర్మాణ కర్మఠత్వము లేదు. జగదేకఖ్యాతిధుర్యత్వము అతిశయోక్తిగనైన లేదు. అతులప్రౌఢిమ లేదు. భాషాదోషములు, ఛందోదోషములు బహుళము.

"గుర్వాన" (7ప.) ఇది గుర్వాజ్ఞ కావచ్చును. "అడిగే విద్యకు" (18ప.) "అరదిం బెట్టేవు" (18ప.) "పాఞుంబ్రోలే నరసింహా" (29ప.) "ధరించివినాశంబు" (30ప.) "చేసీ

మతి" (34ప.) "పట్టేదెట్లు" (35ప.) "కల్దో" (39ప.) "నమ్మేదెట్లు" (44ప.) "పొందే పుణ్యా ము" (51ప.) "అనే మాట" (47ప.) "చేసేవెల్ల" (77ప.) "నీ పంటాప్తుండు" (38ప.). ఇవి భాషాదోషములు. "ఈనికిస్థానము" (43ప.) "ముసలిప్రాయము" (55ప.) కే. లి గురువులు. ఛందోదోషములు

రఘువీరశతకమునందు పోతన భాగవతము ప్రభావము కలదు.

"చీరల్దియ్యకు చన్నుగుబ్బలపయిన్ జీకాకుగాఁ గాకుగా
చేరల్ దియ్యకు మందబోయఁడదె వచ్చెన్ వద్దురా వద్దురా
జారల్ మేనుల జారలం గవయు కృష్ణా యేకపత్నీవ్రత
ప్రారంభం బిపుడేల నీకు రఘువీరా జానకీనాయకా" 66ప.
"పరనారీకుచకుంభపాళికలపైఁ బాదాబ్జయుగ్మంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలతటిపైఁ గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ వాఱెడు-నా తలంపులు మిమున్ భావింపగాఁజేసి స
ర్వరసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘువీరా జానకీనాయకా" 69ప.
"వడుగా నీ వడుగంగ నేర విటు నల్పంబైన దానంబు న
న్నడుగన్ వచ్చితి వన్నఁ గన్గొని బలీంద్రా నాకు నీ విచ్చు మూఁ
డడుగుల్ మూఁడు జగంబు లంచుఁ గొని వాద్యంతంబులున్ మాటమా
ర్పడ నాడే మతికాఁడ వౌర రఘువీరా జానకీనాయకా" 104ప.

ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరశతకప్రభావమును కలదు.

"శ్రుతిపాథోధి మథించి శాస్త్రమహిమల్ శోధించి యష్టాదశ
స్మృతు లాలించి మహేతిహాసకథలున్ జింతించి లోకైక స
మ్మతమై సన్మను లాచరించిన మహామార్గంబు నీ సేవ దు
ర్మతులీ మార్గము గానలేరు రఘువీరా జానకీనాయకా" 22ప.

నారాయణశతకప్రభావము కూడ కలదు. (12ప.)

'అమరుల్ రాక్షసనాయకుల్ కణకతో నత్యంతగర్వంబునన్
తమ సత్వంబుల మందరాచలముచేఁ దర్పంగ నంభోధిలో
రమణం దద్గిరి మోచి కాచిన జగత్త్రాణుండ కూర్మావతా
రమనంగా మఱి నీవె కావె రఘువీరా జానకీనాయకా" 109ప.

కాబట్టి ఉపలబ్ధమైన రఘువీరశతకము అయ్యలరాజకృతము కాదు. అయ్యల రాజు తిప్పయమనీషికృతము కాదు. రామభద్రకృతము కాదు. అర్వాచీనకవిత్వము. మఱొక అయ్యలరాజు సత్పుత్రుడు త్రిపురాంతకుడు శతకకర్త అగును.

# సకలకథాసారసంగ్రహము

సకలకథాసారము కాగితపు ప్రతిమదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందు కలదు. అందు ఇట్లు కలదు.[94]

"ఇట్లు కీర్తివిస్తారధురంధరుండగు కృష్ణరాయనరపాలాఖండలుండు నన్నుఁ బిలిచి శ్రీమత్సీతారమణ చరణకమలపరిచరణాయమానమానసుండవు బహువిధకవితాచమత్కారధుర్యుండవు. మన్మనోరథకార్యనిర్వాహకుండవగుటంజేసి పురాతన మహాకవివిరచితప్రబంధంబు లన్వేషించి భగవద్భక్తినిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠుల వృత్తంబులు ప్రసిద్ధంబు లగునట్లుగాఁ బ్రశస్తకథలు విన్యస్తంబుగా యెలకూచి సాహిత్యలక్షణ చిత్రకవిత్వప్రభావంబు లొక్కొక్క చోటం గనుపడ రచియింప వలయు నని ప్రార్థించి మఱియు నిట్లనియె ..... అతిమధురరసాయన ద్రాక్షాపాకంబుగా శృంగారసంయుక్తంబగునట్లు సకలకథాసారసంగ్రహంబు గ్రంథవిస్తారంబు గాకుండునట్లుగా రచియింపుమని యుపన్యసించిన సంతోషితస్వాంతతరంగితాంతరంగుండనగుచున్న సమయంబున ..... మదీయభాగ్యవశంబునస్వప్నకాలంబునఁ బ్రసన్నుండై పరమమంత్రోపదేశపూర్వకంబుగా సకలకథాసారసంగ్రహంబునకుఁ గృతి నాయకునిఁ దన్నుం గావింపుమని హితోపదేశంబు చేసి యంతర్హితుండైన నేనంతట మేలు కాంచి ..... అమ్మహీకాంతునకు నెఱింగించిన ...... హరి కిమ్ము నావుఁ డున్."

ఆశ్వాసాంతగద్య ఇట్లు కలదు.

"ఇది శ్రీరామభద్రప్రసాదలబ్ధకవిత్వమహత్త్వవిశారదశారద సత్కవిమిత్రయాపస్తంబసూత్రపాత్రకాశ్యపసగోత్రపవిత్రరామభద్ర ధీముద్రాభద్రరామభద్రప్రణీతంబైన సకలకథాసారసంగ్రహము."

శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందు ఇట్లు కలదు.

"శ్రుతిపురాణోపసంహితలేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు" 13ప. 1ఆ.

కృష్ణరాయనృపాలాఖండలుండు శ్రీకృష్ణదేవరాయలని రామభద్రుడు అయ్యల రాజు రామభద్రుడని. సకలకథాసారసంగ్రహము రాయల కృతికి తెనుగుసేత అని తోచును. కాని పయి వచనమును, గద్యమును సరిగా పరిశీలించిన సంశయములు కలుగును. సకల కథాసారసంగ్రహమును సాంతము చదివిన, సంశయములు బలపడును. సకలకథాసారసంగ్రహము అయ్యలరాజు రామభద్రుని కృతి కాదని. అన్యుడైన రామభద్రుని కృతి అని నిశ్చయమగును. అందుకు హేతువులివి:

1. పయి వచనమునందు కృష్ణరాయనరపాలాఖండలుండు రామభద్రుని సకల కథాసారసంగ్రహమును రచింపుమని "ప్రార్థించి" నట్లు కలదు. శ్రీకృష్ణదేవరాయలు "ఆంధ్రకవితాపితామహ యల్లసానిపెద్దన కవీంద్ర" అని పిలుచునట్టి పెద్దనను మను చరిత్రమును రచింపుమని ప్రార్థింపలేదు. అట్టిది రామభద్రుని ప్రార్థించుట కల్ల.

2. పయి వచనమునందు "ఎలకూచిసాహిత్యలక్షణచిత్రకవిత్వప్రభావంబు లొక్కొక్కచోటఁ గనుపడరచియింపవలయుననికలదు.[95] కూచి కాదు కూర్చి అనుట విపరీతధీవిలాసము. "కూర్చి" అయిన "ఎల" ఏమగును? కూర్చుట కలదుగాని. ఎల కూర్చుట లేదు. ఎలకూచి సాహిత్యలక్షణచిత్రకవిత్వప్రభావమన ఎలకూచి లక్షణ గ్రంథములోని చిత్రకవిత్వము యొక్క ప్రభావమని అర్థము కాదు. ఎలకూచి సాహిత్య మునకు లక్షణమైన చిత్రకవిత్వము యొక్క ప్రభావమని అర్థము. "అల్లసాని వాని యల్లిక జిగిబిగి" అను పంక్తిని అల్లసాని అనగా అల్లసాని పెద్దన వలె పయి పంక్తిని ఎల కూచి అనగా ఎలకూచి బాలసరస్వతి అని అర్థము.[96] ఎలకూచి బాలసరస్వతి చంద్రికాపరిణయము, రాఘవయాదవపాండవీయము చిత్రకవిత్వవిశిష్టములే. ఎలకూచి బాలసరస్వతి కాలము పదునాఱవశతాబ్ది తుది నుండి పదునేడవ శతాబ్ది పూర్వము[97] కావున సకలకథాసార సంగ్రహము తదనంతర గ్రంథము కావలయును.

3. పయి గద్యమునందు సకలకథాసారసంగ్రహకర్త రామభద్రుడు కాశ్యపస గోత్రుడని కలదు. అయ్యలరాజు వంశీయులు కౌండిన్యసగోత్రులు. అట్లు రెట్టమత శాస్త్రమునందు, హంసవింశతియందును కలదు. కౌండిన్యశబ్దమునకు కాశ్యపశబ్దము లేఖకదోషమనుట[98] వితండవాదము. కౌండిన్య శబ్దమునకు కాశ్యపశబ్దము లేఖక దోషము కాదు. కాశ్యపశబ్దమునకు కాస్యపశబ్దము లేఖకదోషము. కాగితపు ప్రతి యందు "కాస్యప" అనియే కలదు. ఒక గోత్రమునకు మఱొక గోత్రము లేఖకదోష మైన మఱొక సందర్భము మృగ్యము. కౌండిన్యసగోత్రుడైన అయ్యలరాజు రామభద్రుడు, కాశ్యపసగోత్రుడైన రామభద్రుడు భిన్నులు. నామసామ్యము కంటె

గోత్రభేదము బలీయము.

4. సకలకథాసారసంగ్రహమునందు అల్లసానిపెద్దన మనుచరిత్రము మొదలు శేషము వేంకటపతి శశాంకవిజయము వఱకు ప్రసిద్ధకవుల ప్రసిద్ధపద్యములకు అనుకరణములు కలవు.[99]

"అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిపుల్లకలాపకలాపిజాలమున్
గటకచరత్కరేణుకరకంపితసాలముశీతశైలమున్." మనుచరిత్రము.
"అటఁ జని కాంచె భూమిసురుఁడంబర చుంబిత వింధ్యశైలవి
స్ఫుటఘనమూర్ధ్నినిర్గతసుశోభితపుణ్యశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగురనూత్నతరంగసంగతో
త్కటవరఫేననిర్జితసుధాంభమహానదినర్మదానదిన్" స.క.సా.సం.
"అనిమేషత్వము మాన్పె బిత్తరపుఁ జూ పస్వేదతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళ మాన్పె న్మోహవిభ్రాంతితో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్ప న్మను
ష్యని భావించుట మానుషత్వముమెయిం జూపట్టె నా నత్తఱిన్." మ.చ.
"అనిమేషత్వము మాన్పె చంచలపుఁ జూ పస్వేదభావంబు గ్ర
ద్దన వారించె వినూత్నఘర్మజలవిస్తారప్రపూరంబు తో
డన దేవాంగన కయ్యెడన్ భ్రమరకీటన్యాయమై యొప్పి య
మ్మనుజేంద్రున్ భ్రమియించు నంతనె రహిన్ మర్త్యత్వమున్ సంధిలెన్."
స.క.సా.సం.

"లోకములోనఁ గొంద ఱబలు ల్సతులం ద్గనియింపలేక య
స్తోకమనీష నన్యపురుష ల్దమ కాంతల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాపమంచు న
య్యాకులపాటుఁ జూచి యిపు డాకులపా టెనయంగ నేటికిన్"
శశాంకవిజయము

"కలిమిం గొందఱు శ్రోత్రియు ల్సతుల కాంక్ష ల్దీర్పఁ గాలేక యా
కలకంఠు ల్దముఁ బాసి చక్కఁదనము న్గాంభీర్యమున్ మన్మథో
త్కలనారంభము వాగ్విజృంభణము సత్కారుణ్యమున్ గల్గు వా

రలతోఁ బొంది తముం గణింప రనుచున్ గ్రంథంబులం దట్లు వ్యా
కులులై వ్రాసిన మార్గము ల్దలఁ తురే కుంభిన్ భుజంగాగ్రణుల్" స.క.సా.సం.

ఇది పంచపాది. శశాంకవిజయములోని పద్యమునందు పొందిక కలదు. సకల కథాసారసంగ్రహములోని పద్యమునందు పులుముడు కలదు. ఇట్టి పంచపాదులు సకలకథాసారసంగ్రహమునందు ఇంకను కలవు. ఇట్లు అల్లసాని పెద్దన మొదలు శేషము వేంకటపతి శశాంకవిజయము వఱకు గల ప్రసిద్ధ కవుల ప్రసిద్ధ పద్యముల అనుకరణములు "పురాతనమహాకవివిరచితప్రబంధంబు లన్వేషించి" రచించినవి. పురాతన మనగా సకలకథాసారసంగ్రహము నాటికి పురాతనము. కావున సకలకథాసారసంగ్రహము రచనాకాలము శశాంకవిజయరచనా కాలము కంటె వినూతనము. శశాంకవిజయము రచనాకాలము పదునెన్మిదవశతబ్ది పూర్వార్ధము.[100] సకల కథాసారసంగ్రహము రచనాకాలము పదునెన్మిదవశతాబ్ది ఉత్తరార్ధము కావచ్చును. కాబట్టి అయ్యలరాజు రామభద్రకవి కృతము కాదు. అన్యుడైన రామభద్రకవి కృతము. కూటసృష్టి.

## రామాభ్యుదయము

రామాభ్యుదయము రామాయణమే. సంస్కృతమునందు ఒక రామాభ్యుదయము కలదు. అది సాళువనరసింహరాయలు రచించినట్లు అరుణగిరినాథుడు రచించినది. అముద్రితము. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు తాళపత్రగ్రంథము కలదు. ఇరువది నాలుగు సర్గల మహాకావ్యము. ఇరువది మూడు సర్గాంతశ్లోకములు సాళువనరసింహరాయలు రచించినట్లు కలవు. పంచమ సర్గాంతశ్లోకము మాత్రము శోణాద్రీంద్రుడు రచించినట్లు కలదు.[101]

"శోణాద్రీంద్రం కవీంద్రం శ్రవణకటురటడ్డిండిమం సార్వభౌమమ్
ప్రాసూతాంబాభిరామనవనవకవితాభాజనం రాజనాథాత్
తస్మై తస్మిన్న యాతి క్రమవిషయమహానాటకస్యాగ్రజాతే
కావ్యే సర్గో నిసర్గోజ్జ్వలరసవిలస త్పంచమో Z యం జగామ."

శోణాద్రీంద్రుడన అరుణగిరినాథుడు. గౌడడిండిమభట్టు- మహానాటకమన మహానాటకసుధానిధి. అది ఇమ్మడి ప్రౌఢదేవరాయలు రచించినట్లు అరుణగిరి నాథుడే రచించినది. అదికూడ రామాయణమే. మహానాటకసుధానిధి పూర్వకృతి. రామాభ్యుదయము తదనంతరకృతి. సంస్కృతరామాభ్యుదయము, ప్రభావము రామ

భద్రుని రామాభ్యుదయమునందు కలదు.[102] సంస్కృతాంధ్రరామాభ్యుదయముల సమ్యక్పరిశీలనము సాపేక్ష్యము.

వాల్మీకిరామాయణములోని రామకథకు, రామాభ్యుదయములోని రామకథకు వ్యత్యాసములు కలవు. రామాయణములోని దశరథుడు ప్రారంభమునందు వృద్ధుడు రామాభ్యుదయములోని దశరథుడు ప్రారంభమునందు వృద్ధుడు కాడు. నాయక సదృశుడు. వనవిహారము సేయును. జలక్రీడ లాడును. చెంచుల ప్రార్థనమున మృగ యావినోదము సల్పును. శ్రావణకుమారుని శాపమును పుత్త్రసంతానప్రాప్తి వరముగా భావించును. వేట చాలించి అయోధ్యకు వచ్చి "పెక్కువేలేండ్లుండి" పుత్త్ర సంతానము లేమికి చింతించును.పుత్త్రకామేష్టిలబ్ధమైన పాయసమును కౌసల్యకు, కైకకు మాత్రమే ఇచ్చును. వారు సుమిత్రకు చెరిసగము ఇత్తురు. సీతారాముల కల్యా ణము రంగనాథరామాయణసరణి. రాముడు గుహుని ఆశ్రమమునందు తపోవేషము ధరించును. రాముడే శూర్పణఖ ముక్కుచెవులు కోయును. రాముడే సీత నగలు గుర్తిం చును. ఉత్తరీయము ధరించును. ఇది భాస్కరరామాయణ వైఖరి. సీత అభిజ్ఞానముగ కాకాసురవృత్తాంతము చెప్పదు. అది ముందే కలదు. రాముని సన్నిధికి సముద్రుడు గంగాతుంగభద్రాసమేతుడై వచ్చును.

రామకథ కంటె రామాభ్యుదయమునందు వర్ణనాబాహుళ్యము సమధికము. అష్టాదశవర్ణనలను అతిశయించినవి. అయోధ్యాపురవర్ణనము ముప్పదియాఱు పద్యములు (1-36ప. 1ఆ.)వసంతర్తువర్ణనము పదునాలుగు పద్యములు(44-56ప. 1ఆ.) దశరథుని వనవిహారము పాతిక పద్యగద్యములు (57వచ-80ప.1ఆ.) చెంచుల ఘట్టము పదియేను పద్యములు. (19-35, 55-59ప. 2ఆ.) వేశ్యలవనవిహారము ఆరుపద్యములు. (96-101ప.) ప్రభాతవర్ణన అయిదు పద్యములు(102-106ప. 2ఆ.) దేవతలు విష్ణువును స్తుతించుట ఇరువదియాఱుపద్యములు.(44-69ప.3ఆ.) రామభరతలక్ష్మణశత్రుఘ్నులకు మారోదయవర్ణనము పందొమ్మిది పద్యములు. (106-124ప. 3ఆ.) విద్యాభ్యాసము ఎనిమిది పద్యములు(149-156ప.3ఆ.) శివధనుర్భంగము ఎనిమిది పద్యగద్యములు. (58-95ప.4ఆ.) సీతారాముల కల్యాణము ముప్పదిరెండు పద్యములు (96-127ప.4ఆ.) పౌరవనితల పారవశ్యము మూడు పద్యములు. (148-150ప.4ఆ.) సీతారాముల సంభో గశృంగారము. ఇరువదియేడు పద్యగద్యములు. (151-177ప.4ఆ.) భాగీరథీవర్ణనము మూడు పద్యములు. (19-21ప.5ఆ.) చిత్రకూటవర్ణనము మూడు పద్యములు(60-62ప. 5ఆ.) హేమంతర్తువర్ణనము అయిదుపద్యములు (125-129ప.5ఆ.) శిశిరర్తువర్ణనమాత్రము ఒక పద్యము. (131ప.5ఆ.) జటాయురావణద్వంద్వయుద్ధము

పదమూడు పద్యములు (191-203ప.5ఆ.) వాలిసుగ్రీవయుద్ధము ఏడు పద్యములు. (305-311ప.5ఆ.) వర్షర్తు వర్ణనము పదాఱు పద్యములు (3-18ప.6ఆ.) శ్రీరాముని సీతావిరహము పదమూడు పద్యగద్యములు. (20-32వచ.6ఆ.) శరదృతువర్ణనము అయిదుపద్యములు. (33-37ప.6ఆ.) సముద్రలంఘనము పదునాలుగు పద్యములు(88-101ప. 6ఆ.) అక్షకుమారవధ ఏడు పద్యగద్యములు (214-220ప. 6ఆ.) లంకాదహనము ఎనిమిది పద్యములు (246-253ప.6ఆ.) శ్రీరాముని యుద్ధ ప్రయాణము ఒక పద్యము.(32ప.7ఆ.) మహేంద్రపర్వతవర్ణనము మఱొకపద్యము (34ప.7ఆ.)శ్రీరాముని సీతావియోగదుఃఖము నాలుగు పద్యములు (45-48ప.7ఆ.) రావణుని మంత్రాంగము పండ్రెండు పద్యములు (102-113ప.7ఆ.) సముద్రుడు రాముని శరణు వేడుట ఎనిమిది పద్యములు (114-121ప.7ఆ.) సేతుబంధనము పదకొండు పద్యములు. (123-133ప. 7ఆ.) శ్రీరాముని లంకాప్రయాణము ఇరువదియేడు పద్యగద్యములు. (134-160ప.7ఆ.) రామరావణసేనల యుద్ధసన్నాహము పదాఱు పద్యములు (274-289ప.7ఆ.) అష్టమాశ్వాసము బహుయుద్ధబహుళము. మొత్తము మీద కథాసూత్రము శలాకాసదృశము. వర్ణనసుమావళి తాళఫలప్రమాణతోరణము.

రామాభ్యుదయమునందు ఆవిష్కృతమగునది త్రేతాయుగము కాదు. రాయల యుగమే.

"రాజపరమేశ్వరుండు శ్రీరాఘవుండు" 23ప.5ఆ.

అని కవి నిర్దేశము. రాజపరమేశ్వరబిరుదము విజయనగరరాజులకు క్రమ పరిప్రాప్తము. ఆముక్తమాల్యదయందు శ్రీకృష్ణదేవరాయలకు కలదు. అది శ్రీరాఘవునికి అలంకారమైనది.

ఋష్యశృంగుని వేశ్యాసంస్పర్శనము వేలము వెఱ్ఱిగ కలదు.

"స్ఫటికాక్షమాలికల్ చక్కని వివి యంచు
హారలతాపంక్తు లంటి చూచు
హృద్యముల్ చోద్యంబు లీ కమండలు లంచుఁ
దమిఁ బయోధరములు నిమిరి చూచు
భసితాంగరాగసంపద బాపురే! యంచు
నొడలి గంధపుఁ బూఁత తడవి చూచు
నవి యపూర్వంబులైనవి వల్కలము లంచుఁ

బట్టఁ బుట్టంబులు ముట్టి చూచు
మణితముల్ విని యాశ్చర్యమెగ్న బుద్ధి
గాయసిద్ధిప్రభావంబు గాంచు దివ్య
తాపసులు వీరు వీరి మంత్రములు నేర్వ
వలయునని చేరి ప్రార్థించి పలుకఁ జూచు."21ప. 2ఆ.

సీతారామలక్ష్మణుల అరణ్యగమనమునకు దశరథుడు విలపించుఘట్టమునందు

"ఎదురఁ జను రథము గనుఁగొను
నదిగానక తత్పరాగ మాలోకించుం
దుదినది గానక యడలున్
మదిలోనన్ రాముఁ గూర్చి మహిపతి మఱియున్." 8ప.5ఆ.

అనుపద్యము స్వభావోక్తిసుభగము. మానసికావస్థను వ్యక్తీకరించును. తర్వాతి పద్యములు విమర్శకు గుఱియైనవి. అందు తీవ్రవిమర్శకు గుఱియైన పద్యమిది:

"కానక కన్న సంతానంబు గావునఁ
గానక కన్న సంతానమయ్యె
నరయ గోత్రనిదానమై తోఁచుఁగావున
నరయ గోత్రనిదానమయ్యెనేఁడు
ద్విజకులాదరణవర్ధిష్ణుఁడు గావున
ద్విజకులాదరణవర్ధిష్ణుఁడయ్యె
వివిధాగమాంతసంవేద్యుఁడు గావున
వివిధాగమాంతసంవేద్యుఁడయ్యెఁ
గటకటా! దాశరథిసముత్కటకరీంద్ర
కటకలితదానధారార్ద్రకటకమార్గ
గామి యెట్లు చరించు నుత్కట కరీంద్రు
కటకలిత దానధారార్ద్రకటకతటుల" 12ప.5ఆ.

ఇది "దశరథుఁడు 'నానార్థరత్నమాల'ను ఎదుట నుంచుకొని పుటలఁ ద్రిప్పుచు నేడ్చినాఁడో యనునట్లు దరిద్రము పట్టిన శ్లేషాలంకారములు పెట్టి .... ప్రలాపించినట్లు వ్రాసియున్నాడు." అని విమర్శ.[103] తీవ్రమైనను సత్యము. దశరథుడు కాక రామభద్రకవి ప్రత్యక్షమగుట కలదు. పాత్రను తెరవాటునకు పంపి, కవి రంగస్థలము మీదికి వచ్చుట మహాకావ్యలక్షణము. కాదు.

సీతారాముల సంభోగశృంగారము వాల్మీకి రామాయణమునందు లేదు. విప్రలంభశృంగారమే కలదు. అది కరుణరసశబలితము. ఔచిత్యసీమను అతిక్రమింపలేదు. అవతారమూర్తులైన సీతారాముల సంభోగశృంగారము - కుమారసంభవమునందు పార్వతీ పరమేశ్వరుల సంభోగశృంగారము వలె- అనౌచిత్యభరితము. అందును సీత "పల్లవాయుధకలహమునకుఁ గాలు ద్రవ్వు గతి పదాంగుళుల నేలఁ జిమ్ము" ననుట. రాముడు "కలయు తహితహం బ్రార్థించె" ననుట. "పల్మఱు నాలమునన్ బెనంగి" రనుట. "వివిధబంధవిశేషంబులఁ జొక్కి" రనుట అనుచితమే.

అయోధ్యాపురవర్ణనములోని చాతుర్వర్ణ్యవర్ణనము నందు హాలికులకు ప్రథమస్థానము లభించుట విశేషము.

" అనిశంబున్ బురి హాలికుల్ పయిరు సేయం గొంద్రనే ల్పండు నూ
తన ధాన్యంబులు రాశి కెక్కి తనుఁ జెందం గందబృందంబు దా
ర్కొని యా యొప్పులకుప్పలం గని చెలంగున్ నింగి ముట్టన్ ఘనుల్
మును దార్ పెంచిన వారి వంగడముపై మోహంబు వాటింపరే." 9ప. 1ఆ.

అయ్యలరాజు రామభద్రుని హాలికప్రీతి శృంగారవర్ణనమునందును పొడకట్టినది.

"పంటవలంతికిం బొడమి భాసిలు సీతవు గానఁ జేలతో
నంటిన ఘర్మవారిఁ బదనై పులకోదయసస్యసంపదన్
గెంటక యున్కి నీక తగు నేఁ డిట నా వ్యవసాయ మేర్పడెన్
గంటి నిరంతరానుభవగౌరవసౌఖ్యముఁ బండెఁ గోరికల్" 176ప.4ఆ.

# శైలి

అయ్యలరాజు రామభద్రుని శైలి మొత్తము మీద సరళము. ఎడనెడ ప్రౌఢము. తేట తెనుగు పద్యములు బహుళము. సంస్కృతభూయిష్ఠపద్యములు విరళము.

"క్రొవ్విరి లేని లేఁ బొగడకొమ్మ యొకానొక కొమ్మ కేలిచేఁ
జివ్వున వంచి యందు రుచి చిందఁగ నవ్వుచు సూనశాఖ యో
జవ్వని యన్న డాయఁ జని చాయకు బొంకితి వీవు నీ కిటన్
బువ్వక పూచె నంట తగుఁ బొమ్మని యొక్కతె వల్కె నల్కతో" 74ప. 1ఆ.

"సింహానఖాంకురచ్ఛిన్న వారణకుంభ

జనితముక్తాఫలశర్కరిలము
సమదసూకరపరస్పరభీకరాఘాత
శిథిలదంష్ట్రాచూర్ణసికతిలంబు
గంధసింధురఘటాకటకటాహస్రవ
ద్బంధురదానాంబుపంకిలంబు
దవగంధవహబంధుదహ్యమానానేక
కౌశికాగురుధూపగంధిలంబు
పృథులషడ్జస్వరోద్గీతభిల్లపల్ల
వాధరాగీతికాకర్ణనాతిభీతి
పరవశాత్మపటీరకోటరకుటీర
లీనఫణియగు నక్కాన కాననయ్యె" 25ప.2ఆ.

"రామరాజభూషణుడు ...... సంగీతమునకు సర్పము లానందింపవలసియుండఁగా భయపడి పటీరతరుకోటరములలో దాఁగినట్లు చెప్పితివి గాన నిది దోషమని యాక్షేపించె" నని, రామభద్రకవి "షడ్జస్వరముతో పాడఁబడిన గీతికకు పాములు .... భయపడి పాఱి తొఱ్ఱలు దూఱుట స్వభావమే యని సమాధానము చెప్పె"నని. "సభవా రా యాక్షేపణ సమాధానములు విని రామరాజభూషణుఁడే యోడెనని నిర్ధారణచేసి" రని ఒక ఐతిహ్యము కలదు.[104] రామరాజభూషణుడు "సంగీత కళారహస్యనిధి". "షడ్జం మయూరో వదతి" అను మాట తెలియనివాడు కాడు. అజ్ఞుడు చేసిన ఆక్షేపము, రామరాజభూషణునికి ఆపాదితము. అప్పకవి 'రామరాజవిభూషణరత్న ఖచితచారుమస్తకలాపాపహారి" అనుట తథ్యమిథ్యావివేచనము లేని గతానుగతికత.

## ఆత్మీయత

అయ్యలరాజు రామభద్రుని ఆత్మచరిత్రాంశము లేదు. ఆశ్వాసాంతగద్యలోని "పరిశీలితసమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ" విశేషణము వర్తించకపోయినను రామానుజమతసిద్ధాంతానుసారియే. ఇష్టదేవతాస్తుతి తిరుపతి వేంకటేశ్వరునికి. అలమేలు మంగకు. విష్ణుపంచాయుధికి. అనంతునికి. గరుత్మంతునికి. ఆంజనేయునికి. విష్వక్సేనునికి, సరస్వతికి మాత్రమే పరిమితము.(1-8పీ.)

"పరవస్తువంశరత్నా
కరకౌస్తుభమణిప్రభావఖనియయి నాకుం
బరమగురువయిన ముమ్మడి

వరదాచార్యాంఘ్రివనజవందారుఁ డనై" 11ప. పీ.

అని గురుస్తుతి పరమగురువన మహాగురువు. "ఆంధ్రవాగ్భాగవతకర్త నభి నుతించి" అని పోతన స్తుతి (10ప.పీ.) ఇవి అయ్యలరాజు రామభద్రుడు మహావిష్ణు భక్తుడని వ్యక్తము సేయును. దశరథుని పుత్రకామేష్టిసందర్భమున దేవతలు వైకుంఠమున కేగిన. విష్ణువును స్తుతించిన ఘట్టముల విస్తృతి విష్ణుభక్తిమహిమయే. వసంత ర్తువర్ణనములోని

"కాలకంఠసమిద్ధసఖ్యంబు మెఱయ
నతులతరవైఖరి సువర్ణగతులు దొరయ
నల శుకాదుల కక్షయఫలదుఁ డగుచుఁ
జేరె మాధవుం డుపవనశ్రీ దలిర్ప" 45ప. 1ఆ.

అను పద్యము. వర్షర్తు వర్ణనములోని

"మెఱుఁగు తఱితాడు పెనఁకువ మించి మొగులు
చాలు కవ్వపుమల మరుచ్ఛయము చేత
భ్రమణ మొందించి నూత్నపయో నమృత మౌర
వినుకడలిఁ గల్గఁ జేసెఁ బ్రావృణ్ముకారి." 6ప. 6ఆ.

అను పద్యమును అయ్యలరాజు రామభద్రుని ఆత్మీయతను ప్రతిఫలించునవి. ఎంత మహావిష్ణుభక్తుడైనను త్రిమూర్తిస్మరణమును కలదు. (8ప.6ఆ.) అయినను రామ భద్రుని మనోవీథిలో విష్ణువు "త్రిమూర్తివిలాసవర్తి" (62ప.3ఆ.) లక్ష్మి "త్రిలోకమాత" (63ప. 3ఆ.) కాబట్టి అయ్యలరాజు రామభద్రుడు మహావిష్ణుభక్తుడు.

# తెనాలి రామ (లింగ) కృష్ణుడు

"రామలింగయప్రణీత" ముగ ఉద్భటారాధ్యచరిత్రము."రామకృష్ణకవినాథ ప్రణీత"ముగ పాండురంగమాహాత్మ్యము. "తెన్నలిరామకృష్ణసత్కవికుల వజ్రపాణి... రచించి" నట్లు ఘటికాచలమాహాత్మ్యము కలవు. తెనాలి రామలింగయ కందర్ప కేళీ (కు) విలాసమునుండి హరిలీలావిలాసమునుండి పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు సంకలనము చేసిన పద్యములు కలవు. తెనాలి రామలింగము లింగపురాణము రచించెనని ప్రతీతి కలదు.[105] కాని గ్రంథము లభింపలేదు. సత్యము కాకపోవచ్చును. రామకృష్ణుడు పాండురంగవిజయము రచించినట్లు చాటుపద్యము కలదు. పూర్వోదాహృతము. అది కూడ లభింపలేదు. "అనున్" అను తెనుగు క్రియా పదముతో ముగియు సంస్కృతభాషాసంగ్రథితమైన దశావతారపద్యములు. కొన్ని చాటుపద్యములును అందులోని వనుట కలదు.[106] అవి మఱొక రామకృష్ణుని పాండురంగవిజయములోని వగును.[107]

ఉద్భటారాధ్యచరిత్రమునందు రామలింగయ కౌండిన్యసగోత్రుడు. శుక్లయజుర్వేది. పాలగుమ్మి ఏలేశ్వరుని శిష్యుడు. లక్కమాంబారామధీమణుల పుత్త్రుడు. కుమారభారతి బిరుదాభిరాముడు అని కలదు. (24ప.1ఆ. ఆశ్వాసాంతగద్య) పాండురంగమాహాత్మ్యమునందు రామకృష్ణకవినాథుడు కౌండిన్యసగోత్రుడు. శుక్లయజుర్వేది. భట్టరు చిక్కాచార్యుల శిష్యుడు లక్ష్మమారామయల పుత్త్రుడు. శారదారూపము అని కలదు. (17,23, 24,ప. 1ఆ.) రామలింగయ. రామకృష్ణుల గోత్రము. శాఖ. తల్లిదండ్రులు సమానము. కుమారభారతి బిరుదనామపరిణామమే శారదరూపము. కనుక "రామలింగడే రామకృష్ణుండు" అని ఒక సమన్వయము కలదు.[108] మొదట శైవుడైన రామలింగయ. పిదప వైష్ణవము పుచ్చుకొని రామకృష్ణుడయ్యెనను ప్రతీతి కలదు. అయినను రామలింగయ. రామకృష్ణుడు అభిన్నులు కారు: విభిన్నులని ఒక వినూతన వాదము కలదు. అందుకు ప్రదర్శించిన ఉపపత్తులివి.[109]

i. రామయకు ఇద్దఱు భార్యలు. లక్కమ్మ. లక్ష్మమ్మ. లక్కమ్మ కొడుకు రామలింగము. లక్ష్మమ్మ కొడుకులు ముగ్గురు. రామకృష్ణుడు అన్నయ శ్రీగిరి.

రామయకు ఇద్దఱు భార్యలని ఎక్కడను లేదు. లక్కమ్మ. లక్ష్మమ్మ భిన్నవ్యక్తు లనుట ఊహాగానము. వారు భిన్నవ్యక్తులు కావలసిన అవశ్యకము లేదు. లక్ష్మమ్మ

శబ్దము ప్రకృతి లక్కమ్మ శబ్దము వికృతి. ప్రకృతివికృతిభేదము వ్యక్తిభేదము కాదు. ఏకవ్యక్తి పేరులు

ii. రామలింగము శివభక్తుడైన అద్వైతి. రామకృష్ణుడు విష్ణుభక్తుడైన అద్వైతి.

రామలింగయ శివభక్తుడే. (24ప.1ఆ.) అద్వైతి కాడు. ఉద్భటారాధ్యచరిత్రమునందు అద్వైతసిద్ధాంతప్రతిపాదనము లేదు. ఆరాధ్యశైవసిద్ధాంతప్రతిపాదనమే కలదు. కనుక శివభక్తుడైన రామలింగయ ఆరాధ్యశైవుడు కావచ్చును. రామకృష్ణుడు విష్ణుభక్తుడే. అద్వైతి కాడు. పాండురంగమాహాత్మ్యమునందు పుండరీకముని "భస్మోద్ధూళి తపాంౘ రాంగము కలదు. (54ప.2ఆ.) రాధాదేవి "నొసలి భసితము" కలదు (3ప.4ఆ.) ఘటికాచలమాహాత్మ్యమునందు మానససరములోని మునులకు "భసిత"ము కలదు. (3ప.1ఆ.) అవి శైవచిహ్నములు కావు. అద్వైతలాంఛనములు కావు. తపోవేషములు మాత్రమే. పాండురంగమాహాత్మ్యమునందు ప్రపంచము వ్యావహారికసత్యమని కలదు.(16వచ4ఆ.) పరబ్రహ్మము నిజప్రతిభాసమున యాథార్థ్య భూమికను అభినయించునని కలదు. (20-37వచ.4ఆ.) అవి శంకరాచార్యుల మాయావాదమే అనిపించును. కాని శంకరాచార్యులు మాయావాదము సమ్మతమైన వైష్ణవము కలదు. ఆత్మీయత అను శీర్షికను అరయునది. పాండురంగమాహాత్మ్యమునందు ఘటికాచలమాహాత్మ్యమునందు వైష్ణవసిద్ధాంతప్రతిపాదనము కలదు. కనుక విష్ణుభక్తుడైన రామకృష్ణుడు వైష్ణవుడు కావచ్చును.

iii. శైవవైష్ణవపురాణావళీత్యాదిపద్యపాదము వలన కవికి శివకేశవుల యెడ గల సమభావము వ్యక్తమగుచున్నది. అది మతాంతరీకరణమును సమర్థింపదు.

శైవవైష్ణవపురాణావళీ నానార్థరచనాపటిష్ఠైకమతివి" అని రామకృష్ణుని గుఱించి పాండురంగమాహాత్మ్యమునందు కలదు. (23ప.1ఆ.)" శైవవైష్ణవపురాణావళీనానార్థములు నీకుఁ గరతలామలకములు" అని పాఠాంతరము కలదు. శైవపురాణములు శైవమును, వైష్ణవపురాణములు వైష్ణవమును ప్రతిపాదించునవి. పాండురంగమాహాత్మ్యమునందు శివకేశవసమభావము లేదు. విష్ణ్వాధిక్యము విస్తృతముగ కలదు. ఆత్మీయత అను శీర్షికను అరయునది. ఉద్భటారాధ్యచరిత్రము నందు శివాధిక్యము, పాండురంగమాహాత్మ్యమునందు విష్ణ్వాధిక్యము కలదు. అది శివకేశవ సమభావమును వ్యక్తము సేయదు. మతాంతరీకరణమునే సమర్థించును.

iv వివిధరాజసభలలో తనకున్న సంబంధమును చెప్పినప్పుడు కూడ రామకృష్ణుడు రాయల ఆస్థానమును పేర్కొనకపోవుట వలన అతడు రామలింగము కాడు.

రామకృష్ణుడు వివిధరాజసభలలో తనకున్న సంబంధమునుచెప్ప లేదు."అఖిల భూమీపాలకాస్థానకమలాకరోదయతరుణసూర్యోదయుండవు"అని మాత్రమే కృతి పతి అన్నట్లు పాండురంగమాహాత్మ్యమునందు కలదు. (23ప.1ఆ.) రామలింగయ కూడ వివిధరాజసభలలో తనకున్న సంబంధమును చెప్పలేదు. రాయల ఆస్థానమును పేర్కొనలేదు. కట్టుకథలు కలవు. అవి రామలింగయ పేరను. రామకృష్ణుని పేరను కలవు. కట్టుకథలు యథార్థములు కావు. కొన్ని యథార్థములైనను. అవి ఏ రాయల ఆస్థానమునకు సంబంధించినవి అయినను. ప్రసిద్ధినిబట్టి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునకు సంబంధించినట్లు ప్రచారమగును. అవి ప్రామాణికములు కావు

v రామలింగరామకృష్ణకవులు అన్నదమ్ములే కాబట్టి కవితారీతులలో సామ్య ముండవచ్చును. అది అభిన్నత్వమును స్థాపించలేదు.

రామలింగరామకృష్ణకవులు అన్నదమ్ములనుట ఊహామాత్రశరణ్యము. కవితా సామ్యము స్వతః అభిన్నత్వమును స్థాపించదు గాని. అన్యథాస్థాపితమైన అభిన్న త్వమును బలపఱుచును.

మొత్తము మీద రామలింగ. రామకృష్ణులు భిన్నులను వాదము విపరీతధీవిలా సము. అభిన్నులను సమన్వయము నవీనమైనను. పరిగణనము ప్రాచీనము.

> "రంగుగఁ బాండురంగని తెఱంగ గలరంగ రచించి వేడ్క మీ
> ఱంగ ఛలోక్తులన్ నృపుఁ గరంగ నొనర్చు హొరంగు నింగి ము
> ట్టంగ మెలంగు నేరుపుఁ గడంగి చెలంగు నభంగసద్యశో
> లింగని రామలింగశశలింగకళానిధినిన్ గణించెదన్."

అని వల్లూరి నరసింహకవి నాగ్నజిత్తీపరిణయమునందు కలదు. ఇందు రామ లింగయ పాండురంగమాహాత్మ్యమును రచించినట్లు కలదు. "రామలింగడే రామ కృష్ణుఁడు" కానిచో. ఇట్లు పూర్వకవిస్తుతిపురస్కారము లభింపదు. కాబట్టి. "రామలిం గఁడు రామకృష్ణుఁడే"

రామలింగయ వైష్ణవమతస్వీకారము వలన రామకృష్ణుడని పేరు మార్చుకొ న్నట్లు ప్రతీతి కలదు.[110] కాని వైష్ణవమతస్వీకారము కాదు. వైష్ణవనామస్వీకరణము అని మఱొక విపరీతవాదము కలదు.[111] అందుకు ప్రదర్శించిన ఉపపత్తులివి :

i ప్రాచీనశైవవాఙ్మయమును పరిశీలించిన నందు వీరశైవులు వైష్ణవనామములు ధరించినట్లుగా నెన్నియో యుదాహరణములున్నవి.

ఉన్న మాట నిజమే. కాని వారు శైవనామములు వదలి వైష్ణవనామములు ధరిం

ప లేదు. అవి నామకరణము నాటి నామధేయములే. మతాంతరీకరణము నాటివి కావు.

ii రామలింగమను పేరులోనే వైష్ణవమున్నది. అది శైవమే. అట్లే రామకృష్ణుడను పేరున్నను అది శైవమే.

రామలింగమను పేరులో వైష్ణవము లేదు. రామప్రతిష్ఠితమైన లింగము రామలింగము రామలింగేశ్వరుని పేరు రామలింగము. లింగశబ్దము శైవసూచకము. కృష్ణ శబ్దము వైష్ణవసూచకము. వైష్ణవనామస్వీకరణమునకు హేతువు వైష్ణవమతస్వీకారమే.

iiiరామలింగము ఉత్తరహరివంశమున శ్రీకృష్ణుఁడు సంతానార్థియై శివుని గూర్చి పంద్రెండేళ్లు తపస్సు చేసిన కథ యెఱుగును. అందువలన లింగశబ్దమునకు బదులు కృష్ణశబ్దమును చేర్చుకొని రామకృష్ణుడని వ్యవహృతుడైనాడు. కృష్ణుడు శివభక్తుఁడే గదా!

ఉత్తరహరివంశము కథ యెఱిగిన హరిహరాభేదము తెలియును. శైవుడు కథను బట్టి లింగశబ్దమునకు బదులు కృష్ణశబ్దమును చేర్చుకొనడు. కృష్ణుడు శివభక్తుడనుట శైవము. కృష్ణశబ్దము శివభక్తనామము. లింగశబ్దము శివనామము. శివనామమును కాదని శైవుడు. శివభక్తనామము ధరించెననుట అసంగతము.

iv ఆరాధ్యశైవమున రాముడు, కృష్ణుడు పరమపాశుపతులుగా నారాధితులు.

రాముడు, కృష్ణుడు పరమపాశుపతులుగా ఆరాధ్యశైవమునందు ఆరాధితులే. కాని పాండురంగమాహాత్మ్యమునందు.ఘటికాచలమాహాత్మ్యమునందు పరమపాశుపతులుగా ఆరాధితులు కాలేదు. పాండురంగమాహాత్మ్యమునందు. ఘటికాచల మాహాత్మ్యమునందు ఆరాధ్యశైవము లేదు. వైష్ణవమే కలదు.

మొత్తము మీద వైష్ణవమతస్వీకరణము కాదు. వైష్ణవనామస్వీకరణము అనుట కూడ విపరీతధీవిలాసమే.

రామలింగము జన్మతః శైవుడైనను. శ్రీకృష్ణదేవరాయల మెప్పుకొఱకు వైష్ణవుడై రామకృష్ణనామము ధరించెనని ఇటీవలి పుక్కిటి పురాణము కలదు. శ్రీకృష్ణదేవరాయల ఆరణపుకవి. అష్టదిగ్గజకవి నంది తిమ్మన శైవుడు. "శివపరాధీనమతి. అఘోరశివగురు శిష్యుడు" అని పారిజాతాపహరణము నందు కలదు. (100ప.5ఆ.) మఱొక అష్టదిగ్గజకవి మాదయగారి మల్లన శైవుడు. "శంకరపాదసేవనవశంవదమానసపంకజా"తుడు. అఘోరశివాచార్యుల శిష్యుడు. (13ప.1ఆ. ఆశ్వాసాంత గద్య) ఇంకొక అష్టదిగ్గజకవి ధూర్జటి మూర్తీభవించిన శైవమే. వారికి అవశ్యకము

కాని వైష్ణవమతస్వీకారము. శ్రీకృష్ణదేవరాయల మెప్పు కొఱకు రామ లింగయకు ఆవశ్యకమనుట అవిచారమూలకము.

"ఈ కవి మొట్టమొదట శివభక్తుఁడయినను విష్ణుభక్తులగు
చంద్రగిరిరాజులను సంతోషపెట్టుట కయి తరువాత విష్ణుభక్తుఁడయి
వైష్ణవులను గురువులనుగాం గైకొనెననియుఁ గూడఁ జెప్పుదురు"

అని వెనుకటి అభిప్రాయము కలదు.[112]. అది యథార్థము కావచ్చును.

## కాలము

"రామకృష్ణకవి యప్పయదీక్షితుల వారితోను, తిరుమల తాతాచార్యులతోను సమకాలికుడయి చంద్రగిరిరాజగు వేంకటపతిరాయల ప్రభుత్వకాలములో నుండిన వాండయినట్లు కొన్ని నిదర్శనములు కనంబడుచున్నవి. ఈ వేంకటపతిరాయలు వసుచరిత్రమును కృతి నందిన తిరుమలదేవరాయల యనంతరమున తన రాజధానిని విజయనగరము నుండి చంద్రగిరికి మార్చుకొని క్రీస్తుశకము 1585 వ సం వత్సరము మొదలుకొని 1614 వ సంవత్సరము వఱకు రాజ్యము చేసినవాండు"

అని ఒక అభిప్రాయము కలదు.[113] వేంకటపతిరాయలు తిరుమలదేవరాయల కాలము నుండి చంద్రగిరి పాలకుడు.[114] ఆ కాలము 1570-1582 అనంతరము పెనుగొండ రాజధానిగా విజయనగరసామ్రాజ్యపతి.[115] ఆ కాలము 1582-1620. అప్పయ్య దీక్షితుల కాలము [116] 1550-1620. తిరుమల తాతాచార్యులు లీలావతీగణితములోని కుమారతాతాచార్యులు. కోటికన్యాదానము లక్ష్మీకుమారతాతాచార్యులు[117] కారు. తిరుమల తాతాచార్యులే. అతడు విశ్వగుణాదర్శకర్త వేంకటాధ్వరి తండ్రి రఘునాథ దీక్షితుని మేనమామ తిరుమలతాతాచార్యులు.[118] వేంకటాధ్వరి ప్రాభవకాలము పదునేడవశతాబ్ది మధ్యభాగము.[119] జీవితకాలము 1590-1670 కావచ్చును. అయిన రఘునాథదీక్షితుని జీవితకాలము 1560-1640 అతని మేనమామ తిరుమల తాతాచార్యుల జీవితకాలము1530-1610 కావచ్చును. వేంకటపతిరాయలు, అప్పయ్యదీక్షితులు, తిరుమలతాతాచార్యులు సమకాలికులగుదురు. వారికి తెనాలి రామకృష్ణుడును సమకాలికు డనుటకు ఒక జనశ్రుతి కలదు.

"అప్పయ్యదీక్షితా త్పూర్వం
తాతః పూజ్యో న సంశయః"

అని వైష్ణవులు తాతాచార్యులను కీర్తింపగా రామకృష్ణుని

"ముఖప్రక్షాళనా త్పూర్వం
గుదప్రక్షాళనం యథా"

అని పరిహసించెనట! జనశ్రుతిని బట్టి కాలనిర్ణయము చేయుట కంటె, చరిత్రాంశములను బట్టి కాల నిర్ణయము చేసి జనశ్రుతి సత్యాసత్యములు నిర్ణయించుట సరియైన పద్ధతి.

ఉద్భటారాధ్యచరిత్రమునందు రామలింగయ తండ్రి "రామధీమణి" అని కలదు. (24ప.1ఆ.) పాండురంగమాహాత్మ్యమునందు రామకృష్ణుడు "తెనాల్యగ్రహారనిర్ణేత" అని కలదు. (23ప.1ఆ.) ఘటికాచలమాహాత్మ్యమునందు "తెన్నలి రామకృ"ష్ణుడని కలదు. (14ప.అ.వ.) తెనాలిలోని రామలింగేశ్వరస్వామి గుడిలోని ఒక ఇత్తడి విగ్రహము క్రింద ఇట్లు కలదు.[120]

"తెనాలి నగరే వ్యరాజయ।
ద్గార్లపాడిపురరామపండితః
శక్ల మాఘనిత పంచమీ గురౌ
రామలింగ ముమయోత్సవాకృతీం।"

ఇందు గార్లపాడి గార్లపాటికి, శక్ల శుక్లకు, నిత సితకు లేఖకదోషములు. గార్లపాటి- రామయపండితుని ఇంటిపేరని రామపండితుడే రామధీమణి అని, తెనాలి రామ(లింగ) కృష్ణుని ఇంటి పేరు అసలు గార్లపాటి అని, తెనాలి అగ్రహార నిర్ణయము వలన తెనాలి ఇంటిపేరుగ పరిణమించెనని అనుట ప్రసిద్ధము. కాని, గార్లపాటిపుర రామపండితుడన గార్లపాటిపురములోని రామపండితుడని అర్థము. శుకనామ సంవత్సర మాఘశుద్ధ పంచమీ గురువారము పదునాఱవ శతాబ్దిని లేదు.[121] అది మార్గశిర పంచమీ గురువారమని 14.1.1510 వ తేదీ అని ఒక సవరణ కలదు.[122] కాని శాసనలిపి అప్పటిది కాదు. పదునాఱవశతాబ్దికంటె పరమూర్వా చీనమైనది.

కాబట్టి తెనాలి విగ్రహశాసనములోని రామపండితుడు, ఉద్భటారాధ్యచరిత్రములోని రామధీమణి కాడు. మఱొకడు. అతడు ఉమతో కూడ రామలింగేశ్వరుని ప్రతిష్ఠించుట శాసనవిషయము. ఆ రామపండితుడు గార్లపాడు నివాసి. ఈ విగ్రహ శాసనము తెనాలి రామ(లింగ)కృష్ణుని కాలము నిర్ణయించుటకు నిరుపయోగము.

ఉద్భటారాధ్యచరిత్రము ఈశ్వరదేవమంత్రికి అంకితము. అతడు నాదిండ్ల గోప మంత్రికి "రాజకార్యనిర్వాహకుండు" (20ప.1ఆ.) "శాశ్వతైశ్వర్యధుర్యశాసనుండు" (22ప.1ఆ.) నాదిండ్ల గోపమంత్రి కొండవీటి దుర్గాధిపతి. (15ప.1ఆ. 292ప.2ఆ.)

మహామంత్రి తిమ్మరుసు మేనల్లుడు. నాదిండ్ల అప్పమంత్రి అనుజుడు శ్రీకృష్ణదేవరాయలు కొండవీడు దుర్గమును జయించిన కాలము 1515 వ సంవత్సరము.[123] 1531వ సంవత్సరము నందు కొండవీటి దుర్గాధిపతి రాయసం అయ్యపరుసయ్య అని శాసన ప్రమాణము కలదు.[124] కావున నాదిండ్ల గోపమంత్రి కొండవీటి దుర్గాధిపతి అయిన కాలము 1515-1530 కావలయును.

ఉద్భటారాధ్యచరిత్రము రచనాకాలము 1525 అని ఒక అభిప్రాయము కలదు.[125] అట్లు "నిర్ణయింపవచ్చును" అని మఱొక అభిప్రాయము కలదు.[126] 1520 ప్రాంతమని ఇంకొక అభిప్రాయము కలదు.[127] 1516 ప్రాంతమని వేఱొక అభిప్రాయము కలదు.[128] . 1516 ప్రాంతమనుటకు హేతువు 1517లో గోపమంత్రి అగ్రజుడైన అప్పమంత్రి ఊరదేవమంత్రికి ఇచ్చిన అగ్రహారము సంగతి లేకపోవుట మాత్రమే. అది ఉద్భటారాధ్యచరిత్రమునందు ఉండుటకు అగ్రహార మిచ్చినది గోపమంత్రి కాదు. అప్పమంత్రి. అప్పమంత్రి ప్రసక్తియే ఉద్భటారాధ్యచరిత్రమునందు లేదు. ఏ అగ్రహారము సంగతి కూడ ఉద్భటారాధ్యచరిత్రమునందు లేదు. కాబట్టి ఉద్భటారాధ్యచరిత్రము రచనాకాలము 1516 ప్రాంతమే కావలసిన అవశ్యకము లేదు. మఱి 1520 ప్రాంతమనుటకు హేతువు 1524లో శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసుతోపాటు గోపమంత్రికిని స్థానభ్రంశము కలిగించెనను సంభావనము. తిమ్మరుసు స్థానభ్రంశము సత్యసన్నిహితమేకాని. గోపమంత్రి స్థానభ్రంశము సంభావ్యముకాదు. కారణము 1531 పూర్వము కొండవీటి దుర్గాధిపతి మఱొకరు అయినట్లు ప్రమాణము లేదు. కాబట్టి ఉద్భటారాధ్యచరిత్రము రచనాకాలము1520 ప్రాంతమే కావలసిన అవశ్యకము లేదు. 1525 వ సంవత్సరమనుట స్థూల నిర్దేశము అది 1530 వ సంవత్సరమును కావచ్చును.

పాండురంగ మాహాత్మ్యము విరూరి వేదాద్రిమంత్రికి అంకితము. అతడు విరూరికి కరణము. పెదసంగభూపాలునికి వ్రాయసగాడు. (20,80, 81పు.1అ.) పెదసంగభూపాలుడు ష . రాజు మనుమడు గురవరాజు కొడుకు. మంగయరాజు కొడుకైన గురవయదేవచోడమహారాజు సదాశివరాయల కాలమునందు 1543వ సంవత్సరమున "తొమండ్రు కుమారులు సమీపస్థులయి వుండగాను గ్రామాలు" దానము చేసినట్లు శాసనము కలదు.[129] అందు గురవరాజు పెద్ద కొడుకు పెద్దసింగరాజు. రెండవ కొడుకు పిన్నసింగరాజు. అయిదవ కొడుకు బసవరాజు అని కలదు. ఇందు పిన్నసింగరాజు సిద్ధవటసీమను పరిపాలించినట్లు మఱొక శాసనము కలదు.[130] అందు శకవర్ష సంఖ్య లేదు. "ప్రమాదిసంవత్సర ఆషాఢశుద్ధ ౧౧లు" అని మాత్రమే కలదు.

"ఈ ప్రమాదినామసంవత్సరమునకు సరియైన శకవత్సరము 1441 అనగా క్రీ.శ. 1519 అని ఒకఅభిప్రాయము కలదు.[131] తండ్రి శాసనము 1543 వ సవత్సరమునందు ఉండగా, తత్తనయుని శాసనము 1519 వ సంవత్సరమునందు కలదనుట విపరీతము. కనుక తనయుని శాసనమునకు సంబంధించిన ప్రమాది నామసంవత్సరమునకు సరియైన శకవత్సరము 1501 అనగా క్రీ.శ 1579 అగును. తండ్రి శాసనము 1543వ సంవత్సరమునందు. తనయుని శాసనము 1579వ సంవత్సరము నందు ఉండుట సహజము. పిన్న సింగరాజు మూడవ తమ్ముడు బసవరాజు కొడుకు గంగాధరరాజు శాసనము1592వ సంవత్సరము నందు కలదు.[132] సింగరాజు సోదరుల మేనమామ కొండ్రాజు వెంకటరాజు శాసనములు 1584, 1585, సంవత్సరములందు కలవు.[133] ఈ కొండ్రాజు వెంకటరాజు, వేంకట రామకృష్ణకవుల కామందకమును కృతినందిన కాలము 1584వ సంవత్సరమని అందే కలదు.[134] ఇదియెల్ల సుసంగతము. ఇంతకు విరూరి వేదాద్రిమంత్రికి ప్రభువైన "మంగయగురువభూవిభుని పెద్ద సంగభూపాలమణి" 1543 వ సంవత్సరమునందు కుమారునిగ కలడు. అతని పెద్ద తమ్ముడు పిన్న సింగరాజు 1579వ సంవత్సరమునందు సిద్ధవటసీమపాలకుడుగ కలడు. కావున పెద్ద సింగభూపాలుడు విరూరి వేదాద్రి మంత్రికి ప్రభువగు కాలము 1570 ప్రాంతము కావలయును.

విరూరి వేదాద్రి మంత్రి గురువు కందాళప్పయ్యగారు. (77, 78ప. 1ఆ.) "ఈతని శాసనములు 1540-45 ప్రాంతమునం గన్పట్టు చున్నవి." అని కలదు.[135] కనుక విరూరి వేదాద్రి మంత్రి 1545 ప్రాంతమునందు కందాళప్పయ్యగారి శిష్యుడు. 1570 ప్రాంతమున పెద్ద సింగభూపాలుని వ్రాయసగాడు కావచ్చును.

తెనాలి రామకృష్ణుని గురువు భట్టరు చిక్కాచార్యులు. (17ప.1ఆ.) ఈయన తెనాలి రామకృష్ణుని అల్లుడైన లింగముగుంట రామకవికి, అతని తమ్ముడైన లింగముగుంట తిమ్మకవికి, వేంకటరామకృష్ణకవుల కామందకమును; అయ్యలు, భాస్కరకవుల రెట్టమతశాస్త్రమును అంకితము లందిన కొండ్రాజు వెంకట్రాజునకు గూడ గురువు. చిక్కయాచార్యుని కాలము 1520-90నడుమ[136] కావచ్చును.

కాబట్టి తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము రచనాకాలము 1575వ సంవత్సరము కావచ్చును. కావచ్చును కాదు, అగుననుటకు అంతస్సాక్ష్యము కలదు.

పాండురంగాలయమునకు పాము వచ్చుట, ఎలుకపిల్ల పాండురంగని పాదము

లు చేరుట పాండురంగమాహాత్మ్యమునందు ఇట్లు కలదు.

క. గిరికానుషక్తబుద్ధి ను
పరిచరునింబోలు నొక్కపన్నగ మొకనాఁ
డురవడ నెచ్చట నుండియొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్. 242
వ. ఆ సమయంబున 243
క. యమదండచండమగు భుజ
గమునకు వెఱచఱచి యాఖుకన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ
తమతికి నాముక్తమాల్యదకు నెన యగుచున్" 244ప. 4ఆ.

ఇందు మొదటి పద్యము వసుచరిత్రకు దీపిక. రెండవ పద్యము ఆముక్తమాల్యదకు జ్ఞాపిక. రెండు పద్యములకు సాన్నిహిత్యము కలదు. రెండవ పద్యమునకు గురుపరంపరాప్రభావములోని గోదాదేవి వృత్తాంతము ప్రేరకము కానట్లే, మొదటి పద్యమునకు మహాభారతములోని ఉపరిచరవసువృత్తాంతము కారకము కాదు. గురుపరంపరాప్రభావమునకు, మహాభారతమునకు సంబంధము లేదు. ఆముక్తమాల్యదకు వసుచరిత్రమునకు అనుబంధము కలదు. రెండును స్వతంత్రకావ్యములు ప్రౌఢ ప్రబంధములు. సమీపకాలికములు. అంతేకాదు. పయిరెండు పద్యములందలి ప్రకృతాప్రకృతశ్లేష. అర్థాంతరస్ఫూర్తి వసుచరిత్రవైఖరి. కావున తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద కంటె మాత్రమే గాక, భట్టుమూర్తి వసుచరిత్రము కంటెను అనంతరగ్రంథము కావలయును.

భట్టుమూర్తి వసుచరిత్రము తిరుమలదేవరాయలకు అంకితము. అతడు అళియరామరాయలకు అనుజుడు. (48ప.1ఆ.) "జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి" (10ప. 1ఆ.) కావించిన తిరుమలదేవరాయల రాజ్యకాలము 1570 నుండి 1572 వఱకు రెండు సంవత్సరములు మాత్రమే.[137] వసుచరిత్రము రచనాకాలము తన్మధ్యకాలమే. అది స్థూలముగ 1571 వ సంవత్సరము కావచ్చును. 1570-1572 మధ్య రచితమైన వసుచరిత్రము ప్రతిఫలించిన తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము రచనాకాలము 1572వ సంవత్సరము తర్వాత కావలయును. అది స్థూలముగ 1575 వ సంవత్సరమగును.

బహిరంతస్సాక్ష్యముల పరస్పరోపబలకతను తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము రచనాకాలము స్థూలముగ 1575 వ సంవత్సరము కావున. అతడే అయిన తెనాలి రామలింగయ ఉద్భటారాధ్య చరిత్రము రచనాకాలము 1516,1520, 1525 సంవత్సరములు కాజాలవు. 1530 వ సంవత్సరమగును.

తెనాలి రామలింగయ కందర్పకేలీ(తు) విలాసము. హరిలీలావిలాసములందు హరిలీలావిలాసము పేరును బట్టియే వైష్ణవగ్రంథమని వ్యక్తమగును. కనుక ప్రబంధ రత్నాకరములోని తెనాలి రామలింగయ. ధీరజనమనోవిరాజితము రచించిన తెనాలి రామలింగము కాక, పాండురంగ మాహాత్మ్యమును రచించిన తెనాలి రామకృష్ణుడే అగును. వైష్ణవుడు కాగానే హరిలీలావిలాసము. కాక పూర్వము కందర్పకేళీ(తు)విలాసము రచించుట సంభవము. తెనాలి రామలింగయ. తెనాలి రామకృష్ణుడైన కాలము 1550ప్రాంతము కావచ్చును. అయిన కందర్పకేళీ(తు) విలాసము రచనాకాలము 1545 ప్రాంతము. హరిలీలావిలాసము రచనాకాలము 1555 ప్రాంతమును అగును. మఱి ఘటికాచలమాహాత్మ్యము రామకృష్ణుడు అంకితమిచ్చినది కాదు. అతని వంశీయుడు (పౌత్రు__డు 20 ప. అవ.) అంకిత మిచ్చినది. అది రామకృష్ణుని అంతిమగ్రంథము. కాబట్టి ఘటికాచలమాహాత్మ్యము రచనాకాలము 1580వ సంవత్సరము కావచ్చును. అది తెనాలి రామ(లింగ) కృష్ణుని చరమకాలము. జననకాలము 1500వ సంవత్సరము కావచ్చును.

ఉద్భటారాధ్యచరిత్రము - అవతారిక యందు ఒక విశేషము కలదు. కృతిపతి ఊరదేచమంత్రి వర్ణన ఒక సీసపద్యమునందు. ఒక చిన్న వచనమునందు మాత్రమే కలదు. (21ప. 22వచ. 1ఆ.) కొండవీటి దుర్గాధిపతి నాదిండ్ల గోపమంత్రి వర్ణన రెండు ఉత్పలమాలపద్యములందు. నాలుగు సీస పద్యములందును కలదు. (15-20ప. 1ఆ.) ఇది నిర్నిమిత్తము కాజాలదు. అంత వర్ణనమునందును గోపమంత్రికి సంబంధించిన ఒక్క చరిత్రాంశమును లేదు. సామాన్యగుణసంకీర్తనమే కలదు. ఇది కూడ నిర్నిమిత్తము కాజాలదు. పరిచయము లేని గోపమంత్రితో. పరిచయము కల ఊరదేచమంత్రి ద్వారా పరిచయము కలిగించుకొని. గోపమంత్రి తోడి పరిచయము ద్వారా విజయనగర సామ్రాజ్యాస్థానప్రవేశము చేయదలచిన తెనాలి రామలింగయ ప్రారంభదశయే తన్నిమిత్తమగును. అనగా తెనాలి వాస్తవ్యుడైన రామలింగయ ఉద్భటారాధ్య చరిత్రము రచనాకాలము నాటికి. కొండవీటి ప్రవేశమేగాని. విజయనగరప్రవేశము చేయలేదని అవగాహనమగును.

"అఖిలభూమిపాలకాస్థానకమలాక
రోదయతరుణసూర్యోదయుఁ డవు" 23ప. 1ఆ.

అని పాండురంగ మాహాత్మ్యమునందు కలదు. అఖిల భూమిపాలకా స్థానములన ఆంధ్రదేశపాలకాస్థానములే. విజయనగరసామ్రాజ్యాధిపతులతోపాటు వివిధ దుర్గాధిపతులును పాలకులే. కొండవీటి ఆస్థాన ప్రవేశము చేసి. కొంత కాలముండి. అట నుండి వినుకొండ ఆస్థానప్రవేశము చేసి. కొంతకాలముండి అట నుండి ఉదయగిరి ఆస్థానప్రవేశము చేసి. కొంతకాల ముండి. అటనుండి విజయన గరాస్థానప్రవేశము చేసి. కొంతకాల ముండి. అటనుండి చంద్రగిరి ఆస్థానప్రవేశము చేసి కొంతకాలముండిన. తెనాలి రామకృష్ణుడు"అఖిలభూమిపాలకాస్థానకమలా కరోదయతరుణసూర్యోదయుం".డగును. ఈ దీర్ఘసమాసము " కర్ణాటదేశకటకపద్మవ నహేళి శ్రీనాథభట్టసుకవి" అను శ్రీనాథుని హ్రస్వసమాసమును (7వ. 1ఆ. కా.ఖం.) తివ్వ తీసినది. శ్రీనాథుని వలె తెనాలి రామ(లింగ)కృష్ణుడు కూడ నానారాజసం దర్శనము చేసినవాడు

తెనాలి రామ(లింగ) కృష్ణుని జీవితకాలము 1500-1580 కొండవీటి ఆస్థాన ప్రవేశకాలము 1530 ప్రాంతము. వినుకొండ ఆస్థానప్రవేశము 1535 ప్రాంతము. ఉదయగిరి ఆస్థాన ప్రవేశము 1540ప్రాంతము. విజయనగరాస్థానప్రవేశము.1545 ప్రాంతము. చంద్రగిరి ఆస్థానప్రవేశము 1565 ప్రాంతము కావచ్చును. విజయనగరాస్థాన ప్రవేశము నాటికి. విజయనగరసామ్రాజ్యమునకు నామకరాజు సదాశివరాయలు (1543-76) పాలకరాజు 1565 వఱకు అళియరామరాయలు. 138 1564-65 నాటి రాక్షసి తంగడి (తాలికోట) యుద్ధసమయమునందు విజయనగరాస్థానము విడిచిపెట్టి. తెనాలి రామ(లింగ) కృష్ణుడు చంద్రగిరి ఆస్థానప్రవేశము చేయుట సంభవము.

తెనాలి రామ (లింగ)కృష్ణుడు విజయనగరాస్థానమునందున్నపుడు - అళియ రామరాయల కాలమునందు-అయ్యలరాజు రామభద్రుడు పింగళిసూరన. భట్టుమూర్తి; చంద్రగిరి ఆస్థానమునందున్నపుడు - వేంకటపతిరాయలకాలమునందు - అప్పయదీక్షితులు. తాతాచార్యులు. తెనాలి రామ(లింగ)కృష్ణునికి సమకాలికులగుట చరిత్రను సంవదించునదియే. తత్తత్సంబంధి జనశ్రుతులు చారిత్రికసత్యములు కావచ్చును.

చరిత్రాంశములు కల చాటుపద్యములకు సంబంధించిన జనశ్రుతులందు చాలవఱకు రామకృష్ణుడని కలదు.[139] ఒక్కటి మాత్రము రామలింగయపరము. అళియరామరాయలకు వాయురోగము రాగా, అంతఃపురస్త్రీలకు రామలింగకవి చెప్పినట్లు కల పద్యమిది :[140]

"ఓ యమ్మలాల మందులు
వేయేల మకారకొమ్ము విషకవిగానిన్
వా యెత్తకుండఁ జేసిన
వా యెత్తదు రామరాయవసుధేశునకున్"

మకారకొమ్ము విషకవి భట్టుమూర్తి, రామకృష్ణుడు కాక పూర్వము రామలింగడు చెప్పినది. ఇది నిజమేని, అళియరామరాయల, రామ(లింగ)కృష్ణ, భట్టుమూర్తి కవుల సమకాలికతకు సాధకము.

## ఉద్భటారాధ్య చరిత్రము

ఉద్భటారాధ్యచరిత్రము శైవమతములోని ఆరాధ్యశాఖకు చెందిన ఉద్భటుని కథ. ఉద్భటులు ముగ్గురు కలరు. 1. సంస్కృతమునందు కావ్యాలంకారసంగ్రహమును రచించిన కాశ్మీరదేశీయుడు. 2. కన్నడమునందు హరలీలాస్తవమును రచించి బొందితో కైలాసమున కేగిన కన్నడదేశీయుడు. 3. భోజరాజునకు శివదీక్ష ఇచ్చి, శివైక్యము చెంది, చితాగ్ని పొగచేత ఏడువందల భూతములను కైలాసమునకు పంపిన బల్లకి పురవాస్తవ్యుడు. ఇందు కాశ్మీరదేశీయుడైన ఉద్భటుడు రచించిన సంస్కృతకావ్యాలంకారసంగ్రహము కలదు. అందు లక్ష్యశ్లోకముల క్రమము కుమార సంభవములోని కపటవటుసంవాదఘట్టము. అది హరలీల అని ఒక అభిప్రాయము కలదు.[141] అవిచారమూలకము. అది హరలీలాస్తవము కాదు.

"హరలీలాస్తవరచనా
స్థిరనిరుపమకీర్తి తనదు దేహముతోడన్
సురుచిరవిమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా!" 404ప.

అని మల్లికార్జునపండితారాధ్యుని శివతత్త్వసారమునందు కలదు అంతేకాదు మల్లికార్జునపండితుడు, లింగార్చనసమయమునందు,

"హరలీలఁ దేలుచు హరలీల దనర
'హరలీల' యను కృతి హరలీలఁ బొగడు"

అని పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందు కలదు."ఉద్భట య్య" అనియు 'ఉద్భట' అనియుఁ బేళ్లతోఁ బ్రసిద్ధుఁడగు కర్ణాటకకవి ..... హరలీలా స్తవము వేయి వృత్తములలో రచించెనని బ్రహ్మశివనకవి సమయపరీక్ష యను గ్రంథ మునందు" కలదు.[142] సంస్కృతకవి ఉద్భటుడు, కన్నడకవి ఉద్భటుడు భిన్నులు. ఉత్తరదక్షిణధ్రువములు. ఇక బల్లకీపురవాస్తవ్యుడైన ఉద్భటుడు ఇంకొకడు. ఇతడు కవి కాడు. ఆరాధ్యుడు మాత్రమే. ఈతని కథ పాలకుఱికి సోమనాథుని బసవపురాణ మునందు కలదు. (573-648పం. 7ఆ.) ముప్పది యెనిమిది ద్విపదలు. రామలింగయ ఉద్భటారాధ్యచరిత్రములోని ఉద్భటుని కథకు, పాలకుఱికి సోమనాథుని బసవపు రాణములోని ఉద్భటుని కథయే ఆధారము. బసవపురాణమునందు లేని బహువిష యములు ఉద్భటారాధ్యచరిత్రమునందు కలవు. ఉన్న విషయములందును ముఖ్య మైనది మార్పునకు గుఱియైనది.

ఉద్భటుని భార్య పాణసి. కులహీనురాలు అని బసవపురాణమునందు కలదు.

"... ... ... బొమ్మవ్వ నాఁగఁ
బాణసి సద్భక్తిపరురాలు గాన
యతివయుఁ దాను సమంచిత భక్తి
గతి నిరంతర సుఖస్థితిఁ దేలుచుండ
మనుజు లత్యద్భుతమానసు లగుచుఁ
బనువుచు నిట్టి సద్బ్రాహ్మణోత్తముఁ డు
కులహీనురాలిని గూడి యున్నాడు.
తలపంగఁ బెద్దలు దార యిబ్బువిని
ననుచు నబ్జోజరాజున కెఱింగింప" 579-587పం. 7ఆ.

ఉద్భటారాధ్యచరిత్రమునందు కాశిలోని విశ్వనాథుని ఘర్మజలమున అవతరిం చిన ఉద్భటుడు మహిమాన్వితుడైన

"తద్బుధులలో సుబుద్ధి యన్ ధరణీసురుఁ డు
సుగుణమణిగుణసౌభాగ్య సుందరి యను
పేరు గలిగిన కూఁతురఁ బెండ్లి చేసె

నుద్భటారాధ్యునకు నీశ్వరుండు దెలుప" 319ప. 3ఆ.

ఇందు ఉద్భటుని భార్య జొమ్మవ్వ కాదు. సుందరి ఆమె పొణసి కాదు. బ్రాహ్మణి. కులహీన కాదు. కులీన కారణము కృతిపతి ఊరదేచమంత్రి గురువు చంద్రశేఖరుడు (40ప.1ఆ.) ఉద్భటారాధ్యుని వంశీయుడగుట (532-334ప. 3ఆ.) ఇప్పటి ఆరాధ్యశాఖీయులు బసవపురాణములోని "పొణసి"కి "ప్రాణేశు" అను పాఠాంతరము కల్పించిన[143]పుడు. అప్పటి ఆరాధ్యశాఖీయులు వర్ణాంతరము కల్పించుట అబ్బురము కాదు.

ముప్పదియెనిమిది ద్విపదల బసవపురాణములోని ఉద్భటుని కథ. ఆరు వందల యెనుబదియాఱు పద్యగద్యముల ఉద్భటారాధ్యచరిత్రమైనది. అందు ఉద్భటుని కథలోని విషయము కల పద్యగద్యములు నూటనలుబది మాత్రమే. (3-10ప. 2ఆ..123-255ప. 3ఆ.) ఆ నూటనలుబది పద్యగద్యములందును ఎనుబది మూడు పద్యములు ఆరాధ్యశైవసిద్ధాంతప్రతిపాదనమే. (137-170ప., 194-242ప. 3ఆ.) కడమ విషయము లెల్ల తెనాలి రామలింగయ స్వతంత్రకల్పనములే.

ప్రథమాశ్వాసములోని సూతశౌనకాదిమునుల ప్రకరణము. గంధర్వుల శాపవృత్తాంతము. వల్లకీపురాధిపతి ప్రమథేశ్వరుని వృత్తాంతము. ఉద్భటుని భూలోకమునకు పంపిన వృత్తాంతము పౌరాణికప్రతిపత్తికి. ఆరాధ్యశైవసిద్ధాంతప్రతిపాదనమునకు కల్పించినవి. నూటయేబదిరెండు పద్యగద్యములు. ద్వితీయాశ్వాసములోని ఉద్భటుని భూలోకప్రవేశము. ప్రభావతీ ప్రమథేశ్వరుల వృత్తాంతము. కౌండిన్యముని వృత్తాంతము. కాశీక్షేత్రమాహాత్మ్యప్రతిపాదనము. మదాలసవృత్తాంతము పౌరాణికప్రతిపత్తికి. ఆరాధ్యశైవసిద్ధాంతప్రతిపాదనమునకు. కాశీక్షేత్రమాహాత్మ్య ప్రతిపాదనమునకు కల్పించినవి. నూటతొంబది తొమ్మిది పద్యగద్యములు. తృతీయాశ్వాసములోని ముంజభోజుని జన్మవృత్తాంతము. బాల్యయౌవన దశావృత్తాంతము. స్వప్నవృత్తాంతము. ఉద్భటుని ఆగమనము. ఉద్భటుని విభూతి రుద్రాక్షలింగధారణప్రకారవివరణము. ముంజభోజునికి శైవదీక్షాప్రదానము. పౌరాణికప్రతిపత్తికి. ఆరాధ్యశైవసిద్ధాంతప్రతిపాదనమునకు కల్పించినవి. ఉద్భటుని లింగైక్యము. ఉద్భటుని చితాగ్నిధూమముచేత. భూతములైన గంధర్వులు రుద్రమూర్తులగుట. ఎచటికో పోయి తిరిగి వచ్చిన చిత్రరథుడను గంధర్వుడు చితాగ్నిధూమఫలము చిక్కలేదని చింతించుట. అక్కడున్న ముంజభోజుడు శివధ్యానము చేయుట. శివుడు చిత్రరథుని ప్రమథుని చేయుట. ఉద్భటుడు అద్భుతముగ

ఉద్భవించి ముంజభోజుని ఆశీర్వదించుట బసవపురాణములోని కథను నిమిత్తమాత్రముగ గైకొని స్వకపోలకల్పనమున ప్రపంచీకరించినవి. ఉద్భటుడు ఆరాధ్యశైవమును ఉద్ధరించుట వివాహమాడుట సంతానమును పడయుట. ఊరదేచమంత్రి గురువు చంద్రశేఖరుని వఱకు ఉద్భటుని వంశవృక్షమును వివరించుట వినూతనకల్పనములు. మూడు వందల ముప్పదియైదు పద్యగద్యములు.

ఉద్భటారాధ్యచరిత్రము మొత్తము మీద రామలింగయ పైన శ్రీనాథుని ప్రభావము సమధికము. అందు కాశీక్షేత్రమాహాత్మ్యప్రతిపాదనమునందు శ్రీనాథుని కాశీఖండము ప్రభావము. మదాలసుని వృత్తాంతమునందు శ్రీనాథుని కాశీఖండము లోని గుణనిధి కథ. శివరాత్రిమాహాత్మ్యములోని సుకుమారచరిత్రముల ప్రభావము సముత్కటము. శ్రీనాథుని కృతులందు లేని లింగధారణప్రకారము రామలింగయ ఉద్భటారాధ్య చరిత్రమునందు విశేషము.

మదాలసుని వృత్తాంతము ఆదిని గుణనిధి కథకు సహోదరము. అవసానము నందు సుకుమారచరిత్రమునకు సదృశము. మధ్యను ప్రత్యేకము. మదాలసుడు గుణ నిధి వలె కానక కన్న సంతానము. వేదాదికములగు విద్యావిశేషములందు పాండిత్య ము కలవాడు. వివాహితుడు. భార్య చంద్రకళ. కాని "నాలుగంచుల నవయౌవనంబు నందు" భార్యావిముఖుడు. వేశ్యాలోలుడు. స్మరవాత్స్యాయనకూచిమారకృత శాస్త్రగ్రంథసాంగుడు.

"తగవు గాదని చెప్పెఁ దల్లి సద్బుద్ధులు
హేతుదృష్టాంతంబు లేర్పరించి
ధర్మశాస్త్రముల యంతర్మర్మములు దెల్పి
వలదని వారించెఁ బెలుచఁ దండ్రి
కులమును వాసియుఁ గలవాఁడ వేలన్న
యని చేరి బోధించి రనుఁగు సఖులు
"సరివారు నవ్వఁ ద్రిమ్మరి వేటి కయ్యెదు
చాలింపు" మనిరి సజ్జనులు పెద్ద
లిట్లు తగువారు సన్మార్గమెద్దియైన
వివరముగఁ దేటపఱిచిన వినఁ డతండు
మెచ్చి మూఁడవ పురుషార్థమే యిహంబుఁ
బరము నీఁ జాలునది గాఁగఁ బదిలపఱిచి" 132ప. 2ఆ.

తల్లిదండ్రులు కొడుకు దెస గలుగు మచ్చిక విడిచిన. తన్ను కాసునకైన గొనని వారలగుట చుట్టముల. పుట్టిన వారల పరిత్యజించి. దేశాంతరము పోవుటకు ఊరి శివాలయములోని దేవధనమును అపహరించి. కుంతలదేశము నుండి కాన్యకుబ్జమునకు పోవును. అచట ఒక బేహారుని వశము చేసికొని. అపహరించి తెచ్చిన దేవధనమును దాచుమని ఇచ్చి. సాత్త్వికుని వలె ప్రవర్తించి. ప్రాబడిన పిదప వేశ్యాలోలుడగును. కనకలత అను కన్యవేశ్యను చూచి విరహార్తుడగును. పరభావవేది అను ప్రాణసఖుని రాయబారమున కనకలతకు కన్నెఱికము తీర్చును. ధనమంతయు వ్యయమైన తర్వాత వేశ్యమాత వెళ్లగొట్టును. వింధ్యాచలపార్శ్వపట్టణములందు కన్నము వేయుటకు బయలు దేరును. అరణ్యమునందు సొమ్మసిల్లి పడిపోవును. ఒక రాజు చేత నిష్కములు. రత్నములు. వస్త్రములు దానము గైకొని. తన పట్టితో ఆ దారిని వచ్చిన విద్యాపాలుడు కాపాడును. మదాలసుడు.

"జాతివిప్రుండ వాదంబు చేత నోడి
సిగ్గుపడి శాస్త్రపాఠంబు సేయఁ గోరి
పోవుచున్నాఁడ నెటకైనఁ బోయి పోయి
అగ్గి దాఁకితి నిచ్చోటనైతి నిట్లు" 251

"కాఁపురము నాకుఁ గడుఁ బెద్దకంచి యంత
యుల్లు శ్రీధాన్యకటకమై హెచ్చు మిత్రు

లరయఁ దలవెంద్రుకల యంద ఇచ్చికంబు

లేదు గ్రాసంబునందు నో వేదమూర్తి" 253ప. 2ఆ.

అని విద్యాపాలుని నమ్మించి. విద్యాపాలుడు అతని పట్టి నిద్రించు సమయమున చంపి వైచి . దానధనము కనకలతకు ఇచ్చుటకు బయలుదేరి. దారి తప్పి కాశికి వచ్చును. సర్పదష్టుడై చనిపోవును. విశ్వనాథుడు తారకోపదేశము సేయును. యమభటులు చూచి వచ్చిన దారి పట్టి యమునికి తెలుపుదురు. యముడును ఉగ్రుడై కాశికి వచ్చి విశ్వనాథుని సరిగద్దెను కూర్చున్న మదాలసుని చూచి వాని పాపములు ఏకరువు పెట్టును. విశ్వనాథుడు.

"లోకుల్గాదనుచుండఁగా నవనిలో లోలాక్షులన్ విప్రులన్
బాకానాథగవాదులన్ గెడవనీ పట్టండు ... ...
... ... పుత్ర! మానవుఁడు మల్లీలానివాసార్థమౌ

నీ కాశీనగరంబునం దెగినచో హెచ్చున్ ననుంబోలుచున్" 279

"కావున సర్వకల్మషవికారనిబర్హణమైన యుప్పురిన్
జీవము నుజ్జగించిన విశిష్టుఁడు గావున దుష్టుఁడయ్యు భూ
దేవుఁ డితండు నేన యయి తేజముఁ గాంచెన కాక తక్కినన్
దావకదండఘాతముల దప్పునె వీనికి భానునందనా?" 288ప.2ఆ.

అని విశదీకరించును. గుణనిధికంటె. సుకుమారునికంటె ఘోరకర్ముఁడు మదాలసుడు. హంతకుడు అయినను కాశిలో చనిపోవుట వలన విశిష్టుఁడు. ఇది కాశీక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించును. కాశీఖండమునందు లేదు. రామలింగయ కల్పనమే.

ఉద్భటారాధ్యచరిత్రమునందు వర్ణనలును ఉజ్జ్వలము. నైమిశారణ్యవర్ణనము (53-59ప.1ఆ.) కైలాసగిరివర్ణన (76-81ప.1ఆ.) వసంతవర్ణనము (84-88వచ.1ఆ.) పార్వతీ పరమేశ్వరుల వనవిహారవర్ణన(89-95ప. 1ఆ.) వల్లకీపురవర్ణన (149-162వ. 1ఆ.) ప్రమథేశ్వరవర్ణన (164-182ప.1ఆ.) కౌండిన్యాశ్రమవర్ణన (32ప.2ఆ.) సూర్యాస్తమయవర్ణన (33-35ప.2ఆ.) కాశికాపురవర్ణన (73-106ప. 2ఆ.) మదాలసుని విరహవర్ణన (167-175, 188-191ప.2ఆ.) సూర్యాస్తమయవర్ణన (170-177, 179వ. 2ఆ.) నక్షత్రవర్ణన (178ప.2ఆ.) చంద్రోదయ వర్ణన (180-184, 187ప. 2ఆ.) చంద్రికావర్ణన (185-186ప.2ఆ.) వేశ్యమాత వర్ణన (205ప.2ఆ.) కాశీవర్ణన (259ప. 2ఆ.) ప్రభావతీ గర్భధారణవర్ణన (40-44ప. 3ఆ.) కుమారోదయవర్ణన (45-50ప. 3ఆ.) ముంజభోజుని బాల్యయౌవన వర్ణన (51-81ప. 3ఆ.) విభూతిరుద్రాక్షలింగధారణవర్ణనము. (145-171ప.3ఆ.) శరదాగమవర్ణన (173-179ప. 3ఆ.) ముంజభోజశివదీక్షాస్వీకారవర్ణన (190-220ప. 3ఆ.) ముంజభోజుని శివధ్యానవర్ణన (274-287ప. 3ఆ.) మొదలైన వర్ణనలు బహుళము.

ఉద్భటారాధ్యచరిత్రము ఉద్బోధించునది ఆరాధ్యశైవము. అది బ్రాహ్మణుల వీరశైవము. ఉద్భటుడు ఉద్బోధించిన ఆరాధ్యశైవము మాత్రమేగాక, రామలింగయ ప్రబోధించిన ఆరాధ్యశైవమును ఉద్భటారాధ్యచరిత్రమునందు కలదు. వీరశైవమునకు జీవలక్షణములైన శివాధిక్యము, శివభక్తిప్రాధాన్యము, పురాతనభక్తస్మరణము, శైవధర్మము రామలింగయ స్వతంత్రకల్పనములందు కలవు.

"చూడఁ దగదే వివేకించి సుజనులకును
జంద్రరేఖావతంసుని చరణయుగళి

యెంత చక్కనిదో రమాకాంతుఁ డంత
వాఁడు నందును దన కన్ను వైచె మున్ను." 69ప. 1ఆ.
"ఏ వేల్పు పదముల కిందిరా వల్లభు
వలకన్ను పూజనావారిజాతము" 73ప. 1ఆ.
"త్రినయనుఁడే దైవమని రహస్యస్థితి
నిగమంబులకుఁ దెల్పనేర్తురనఁగ
సఫలవాక్సిద్ధి బ్రహ్మవర్చససమృద్ధి
శబ్దపరిశుద్ధి శివదత్తశాంతబుద్ధి
తార తముఁబోలఁ దగుఁగాక తత్పురంబు
బ్రాహ్మణులఁ బోల వ్యాసనంభవుని వశమె" 154ప. 1ఆ.

ఇవి శివకేశవసమభావమును ప్రకటించునవి కావు. శివాధిక్యమును ఉద్ఘాటించునవి. శివభక్తి ప్రాధాన్యమును రామలింగయ ఉగ్గడించిన పద్యములు:

"ఆకులఁ గందమూలముల నంబుఫలంబులఁ గూరగాయలం
జేకొని ప్రాణరక్షణముఁ జేసి మహాటవిలోనఁ దీవ్రని
ష్ఠాకలనన్ శరీరము గృశంబుగ నుండిన ముక్తి గల్గునే
ప్రాకటమైన భక్తిఁ బురభంజనుఁ బూజ యొనర్పకుండినన్ 66
మ్రొక్కునెవ్వాఁ డష్టమూర్తికినలవోక
బలె నాతఁ డమరుల ప్రణతియందుఁ
జల్లు నెవ్వాఁడు ధూర్జటి మీఁదఁ బుడిసెఁడు
జలము లాతఁడు సుధాజలధిఁ దేలు
నుతియించు నెవ్వాఁడు శితికంఠు నేకవా
రం బాతఁడల వచోరమణి నేలు
నిలుపు నెవ్వాఁడీశు నిమిషమాత్రము మనం
బున నాతఁడా మీఁది పొడవుఁ దెలియుఁ
గాన మ్రొక్కఁగ నభిషిక్తుఁగా నొనర్ప
వినుతి సేయంగఁ దవిలి భావింపనెందుఁ
దగిన దేవాదిదేవుఁడాతండు సూవె
భుక్తిముక్తు లపేక్షించు భక్తులకును 67
వాసనలేని పూవు రసవర్ణన లేని కవిత్వరేఖ య
భ్యాసము లేని విద్య జలజాప్తుడు లేని దినంబు చంద్రికో

ల్లాసములేని రాత్రి కమలస్థితి లేని కొలంకు చూవె కై
లాసనివాసు నాత్మలఁ దలంపని మూఢుల జన్మమారయన్" 68ప. 1ఆ.

ఇవి సూతప్రోక్తములైనను రామలింగయ సూక్తములే. అంతేకాదు. 'హరదూరుఁ డగు వాఁ డు పశువు దెలియ" అని (71ప.1ఆ.) రామలింగయ స్పష్టప్రతిపాదనము.

శివకవి పాలకుఱికి సోమనాథుని వలె రామలింగయ పురాతనభక్తస్మరణమును ఉద్భటారాధ్యచరిత్రమునందు ఉత్కటముగ కలదు.

"తలఁ పవైతివె కాల దాఁ చి పై నుమిసిన
యెఱుక మాలిన యట్టి యెఱుకువాని
ధృతిఁ జిత్తమున మానితివె ఱాలుగొని ఱువ్వ
సాంఖ్యతొండఁ డు సేయు సాహసంబు
చింతింపవైతివె చేవ వింటను బెట్టు
గొన్న కుంతీదేవి కొడుకుఁ గుఱ్ఱ
ఊహింపవైతివె యుగ్రఘాటీచల
చ్చేరమక్షితిపతి చేతి గాసి
అకట నీ బంటు బంటులమైన మమ్ము
నొక్క తప్పును సైరింప కుఱక ఘోర
శాపదావానలంబున సగము చావు
చంపితివి చాలు నిఁ కఁ బ్రోవు చంద్రజూటు" 116ప.1ఆ.
"సింధుబల్లహురీతి శ్రీపతిపండితు
మరియాద ధూపద మాచిదేవు
నట్లు మహాకాళునను వున నల్ల క
ల్కదబ్రహ్మదేవఁ గక్కయవిధమున
శూలదబ్రహ్మయ్య చొప్పున బిబ్బిబా
చనలీలవీరనాచాంకు పోల్కి
కదిరె రెమ్మయగారి కైవడిఁ దెలుఁ గేశు
మహణయ్య చందాన మాచిరాజు
కరణి మౌళిగ మారయ్యగతి దెలుంగు
జొమ్మనార్యుని వడువున సురియ చౌడు
పగిది బసవేశ్వరుని మాడ్కి భక్తియుక్తి

శంభుఁ బూజించి బ్రదుకు రాజన్యచంద్ర" 186ప. 3ఆ.

వీరందఱు పాలకుఱికి సోమనాథుని కృతులందు ప్రసక్తులైన వీరశైవులే.

రామలింగయ కల్పనమున నైమిశారణ్యములోని అథర్వతపోధనులు "సంశీలిత శైవధర్మగతిచేఁ దనరారు"వారు.(59ప. 1ఆ.) వారికి "శైవధర్మసదాచారసరణి మిగుల వినఁ బ్రియంబగు" (62ప.1ఆ.) అంతేకాదు. సూతుని సూత్రీకరణములివి:

"శైవులగువారు చెప్పిన జాడయందు
నడువ నేరదు మూఢుల గడుసు బుద్ధి
వానపై వాన గురిసిన నానునొక్కొ
సహజకాఠిన్యముడిగి పాషాణకులము." 70ప.1ఆ.
"శివలింగదర్శనంబును
శివపూజావైభవంబు శివసద్గుణసం
శ్రవణంబును మానవులకు
భవనీరదపటలచటులపవమానంబుల్" 72ప.1ఆ.

రామలింగయ భావాంబరవీథిలో తారగిరిపాదపములు శివసాక్షాత్కారములు

"చిగురు జొంపంబుల నిగుడిన కెంజాయ
రుచిరజటాచ్ఛటారోచి గాఁగ
కలయంగఁ గప్పిన కమ్మపుప్పొడి దుమ్ము
పొలుపొందు భసితంపుఁ బూఁత గాఁగ
సోలుచుఁ బూఁ దేనెఁ గ్రోలు రోలంబబా
లిక లంచితాక్షమాలికలు గాఁగ
తఱచు కొమ్మల వెంటఁ దగిలి ప్రాఁకిన నవ్య
లత లహిభూషణతతులు గాఁగ
ఇసుక చల్లిన రాలక పసరుడాలు
నాకు దళసరి హస్తిచర్మాంబరముగ
నలరసాక్షాత్కరించినహరునిఁ బోలి
పాదుకొని యుండు నక్కొండఁ బాదపములు" 80ప. 1ఆ.

ఇట్టి రామలింగయ శివభక్తుడైన అద్వైతి కాడు. శైవుడే అగును. అద్వైతసిద్ధాంతచ్ఛాయ లేశమాత్రముగనైన ఉద్భటారాధ్యచరిత్రమునందు లేదు. ఆరాధ్యశైవ

సిద్ధాంతమే క్రాంతముద్రాకముగా ఉద్భటారాధ్యచరిత్రమునందు కలదు.

# కందర్పకేళీ (తు) విలాసము

ఇది ప్రబంధరత్నాకరము. తంజావూరి ప్రతియందు కందర్పకేతువిలాసమని కలదు ప్రత్యంతరమునందు కందర్పకేళీవిలాసమని కలదు. కందర్పకేతువిలాసమైన కందర్పకేతుని వృత్తాంతమగును. కథాకావ్యము కావచ్చును. కందర్పకేళీవిలాసమైన శృంగారకావ్యమగును. ప్రబంధరత్నాకరమునందు నికరముగ నాలుగు పద్యములు కలవు. నిరాకరముగ రెండు పద్యములు కలవు. ఆకరములు కల పద్యములివి. 1స్త్రీవిర హావర్ణన (79ప.2ఆ.) 2. పురుషవిరహావర్ణన (95ప.2ఆ.) 3. చంద్రోదయవర్ణన (198ప. 3ఆ.) 4.సిద్ధపురుషుని వర్ణన (116ప.4ఆ.) పురుషవిరహావర్ణన పద్యము క్రింద ఆకరము లు లేని పద్యములు రెండు (96, 97ప. 2ఆ.)కలవు. అవి కందర్పకేళీ (తు) విలాసము లోని పద్యములు కావచ్చును. కాకపోవచ్చును. వర్ణనపద్యములను బట్టి వస్తుస్వరూ పము దురవగాహము.

సిద్ధపురుషుని వర్ణనమిది :

"మౌళిఁ గెంజడల జొంపము ఫాలపట్టికఁ<br>
దీండ్రించు భసితత్రిపుండ్రకంబు<br>
కర్ణకీలితరత్నకామాక్షియుగళంబుఁ<br>
బలుచని నెమ్మేనిఁ బట్టు కంథ<br>
కరముల బంగారు సరకట్టుఁ గిన్నెర<br>
హరిణశృంగంబుఁ బేరురమునందుఁ<br>
గరమూలమున భూరితరవారి సన్నంపు<br>
నడుమున నొడ్డియాణంబు దిద్దు<br>
పిఱుఁదుపై వ్యాఘ్రచర్మ కౌపీనకలన<br>
యోగవాగలు శూలంబు నాగసరము<br>
పొలుపు దళుకొత్తు చెట్టునఁ బుట్టినట్లు<br>
నిరుపమాకారసిద్ధుఁడు నరుగుఁదెంచె" 116ప. 4ఆ.

ఆకరములందు తెనాలి రామలింగన. తెనాలి రామలింగయ అని కలదు. కనుక ఉద్భటారాధ్యచరిత్రము రచించిన రామలింగయయే కందర్పకేళీ (తు) విలాసమును రచించెనని గ్రహింపవచ్చును.

# హరిలీలావిలాసము

హరిలీలావిలాసము నుండి ప్రబంధరత్నాకరమునందు నికరముగ ఇరువది నాలుగు పద్యములు కలవు. పాండురంగమాహాత్మ్యమునుండి ఒక పద్యము(238ప.3 ఆ.) సాంబోపాఖ్యానము నుండి ఒక పద్యము (96ప.3ఆ.) హరిలీలావిలాసములోనివిగ కలవు. మఱొక పద్యము (122ప.4ఆ.) హరిలీలావిలాసములోనిది కావచ్చును. కాకపోవచ్చును. ఆకరములేదు. ఈమూడునుగాక ఇరువదినాలుగు పద్యములు. అన్ని పద్యములును వర్ణనపద్యములే. వస్తుస్వరూపము దురవగాహము. 1.2.పుర (129, 141ప.1ఆ.) 3.పరిఖా (144ప.1ఆ.)4. సౌధ (154ప.1ఆ.) 5.6.7.8.చాతుర్వర్ణ్య (180, 186, 199, 205ప. 1ఆ.) 9.పుష్పలావికా (212ప. 1ఆ.) 10.పురస్త్రీ (230ప.1ఆ.) 11.ఉపవన (246ప.1ఆ.) 12. గజ (271ప.1ఆ.) 13. అశ్వ (282ప.1ఆ.) 14. విషనిర్విష (162ప.2ఆ.) 15. సూర్యాస్తమయ (67ప.3ఆ.) 16. సాంధ్యరాగ(78ప.3ఆ.) 17. దీపకళికా (88ప.3ఆ.) 18.ప్రభాత (247ప.3ఆ.) 19. హేమంతర్తు (46ప.4ఆ.) 20. వనవిహార (70ప.4ఆ.) 21మధుపాన (113ప.4ఆ.) 22. ద్యూత (121ప.4ఆ.) 23. నదీ (162ప. 4ఆ.) 24. పుణ్యక్షేత్ర (165ప. 4ఆ.) వర్ణనలు కలవు. పుణ్యక్షేత్ర వర్ణనమిది:

"ఈఁత పంటికిఁ దాటి పండింతకింత
మ[శకమైనను] గొండొక శశకమైన
కాశికాసీమఁ గడనిద్రఁ గ[న్ను మొగి]చి
మేరుధనువెత్తి కదలని తేరు నడుపు." 165ప. 4ఆ.

కృతి హరిలీలావిలాసమైనను. పుణ్యక్షేత్రము కాశి. ఇరువది నాలుగు స్థలములందు మూడు స్థలములందు వినా. కృతి హరిలీలావిలాసమని కలదు. రెండు స్థలములందు హరివిలాసమని కలదు. (121, 162ప.4ఆ.) ఒక స్థలమునందు హరి అని మాత్రమే అసమగ్రముగ కలదు. (165ప4ఆ.) కృతికర్త తెనాలి రామలింగన్న, తెనాలి రామలింగయ్య. తెనాలి రామలింగయ. తెనాలి రామలింగకవి. తెన్నలి రామలింగయ్య అని కలదు. హరిలీలావిలాసము పేరునుబట్టి వైష్ణవగ్రంథమని వ్యక్తమగను. అది రామలింగయ రామకృష్ణుడై రచించినదగును. అయినను రామలింగయ పేర ప్రబంధరత్నాకరమునందు కలదు. కారణము "తెనాలి రామలింగడే రామకృష్ణుఁ" డగుట కావలయును.

# పాండురంగమాహాత్మ్యము

పాండురంగమాహాత్మ్యము ప్రౌఢకావ్యము. క్షేత్రమాహాత్మ్యకావ్యము కూడ. పౌండరీకక్షేత్రదైవమైన పాండురంగవిట్ఠలుని మాహాత్మ్యమును ప్రతిపాదించునది .అందు పౌండరీకక్షేత్రమాహాత్మ్యమును అంతర్గతము. తెనాలి రామ(లింగ)కృష్ణుని కృతులందు పాండురంగమాహాత్మ్యమే మహాకావ్యము. అది విరూరిపట్టణపతి వేదాద్రి మంత్రికి అంకితము. కాలము 1575 ప్రాంతమని పూర్వోక్తము.

"స్కందపురాణనీరనిధికౌస్తుభమైప్రభవించుదేవకీ
నందను సత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాపమన్
కుందనమున్ ఘటించి కడుఁ గ్రొత్తగు సొమ్మొనరించి విష్ణుసే
వం దులకించు నప్పరమవైష్ణవకోటి నలంకరింపుమా" 26ప.12ఆ.

అని కృతిభర్త ఆదేశించినట్లుకలదు. స్కందపురాణము సముద్రమే. అందు దేవకీనందనుని సత్కథోద్యమము కలదేని. అది కౌస్తుభమే. ఆ రత్నము నవ్యకవిత్వక ళాకలాపమనెడు కుందనమునందు స్థగితము చేసిన నూతనాభరణముగ ధగద్ధగిత మగును.

అగస్త్యుడు కుమారస్వామి తెలిపిన "తద్విరచితమహాస్కాందగ్రంథసందర్భం బునం బూర్వభాగంబు విని తదాశయావబోధసుధాధునీవినిమజ్జనంబునం గాశీవియోగజనితక్లేశంబుఁ దీసివైచి యందలి యుత్తరభాగంబున .... వార్త కెక్కిన తీర్థప్రవర్తనములు విని(147వచ.148ప.1ఆ.) "సమస్తముఁ గ్రిందుచేసి మించిన బలువే ల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుండెనేని" దెలుపుమనిన (152ప.1ఆ.) కుమారస్వామి "హరుచేత నెఱుంగ వలయు"ననెను. (156ప.1ఆ.) అంతేకాదు. కుమా రస్వామి శివునితో

"నా పేర స్కాందంబు నాఁ దగు నొక పురా
ణము నీదు కరుణకలిమి రచించి
యమ్మునీంద్రులకెల్ల నెఱిఁగింప నందు వీ
రలు సురక్షేత్రతీర్థముల కథలు
చాల విని విని సర్వాతిశాయియైన
దేవుఁ డేనియు నటువంటి తీర్థమేని
నట్టి సుక్షేత్రమేని భోగాపవర్గ

దాయి కలదేని యెఱిఁగింపు తడయ కనిన" 206ప.1ఆ.

తెలిసికొనుటకు వచ్చితి మన శివుడు తెలియజేసినది పాండురంగమాహాత్మ్యము. అది విని కుమారస్వామి "స్వకృతస్కాందోక్తియం దావహిల్లిన సందేహంబుఁ దండ్రిచేఁ దెలియ"గల్గెను (180ప.2ఆ.) అట్టి పాండురంగ మాహాత్మ్యము స్కాందపురాణాంతర్గతమగుట సంశయము కలిగించును. అంతేకాదు. స్కాంద పురాణమునందు పాండురంగమాహాత్మ్యము మృగ్యము. కాని స్కాంద పురాణోత్తరసంహితలోని ఉమామహేశ్వరసంవాదముగా, తొమ్మిది అధ్యాయముల చిన్న గ్రంథము సంస్కృతపాండురంగ మాహాత్మ్యము కలదు. అది తెనాలి రామ (లింగ) కృష్ణుని పాండురంగమాహాత్మ్యమునకు సంస్కృతీకరణముగ అనుమేయము.[144]

తెనాలి రామ (లింగ) కృష్ణుని పాండురంగమాహాత్మ్యము. ఉమామహేశ్వరసంవాదమాత్రముకాదు. శివనారదసంవాదము కూడ. శివనారదసంవాదములోని నిగమశర్మోపాఖ్యనము. రాధాదేవి చరిత్రము. సుశీల చరిత్రము. సుశర్మోపాఖ్యానము. అయితనియుతోపాఖ్యానము సంస్కృతపాండురంగమాహాత్మ్యమునందు లేవు. లోపాముద్రాగస్త్యులు సామిమల చేరుట. కుమారస్వామి స్కాందపురాణమును వినుట. శివుడు. పార్వతికి. కుమారస్వామికి అగస్త్యాదులకు పౌండరీకక్షేత్రమాహాత్మ్యము తెలుపుట మాత్రము సంగ్రహముగ కలవు. రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యములోని ప్రథమద్వితీయాశ్వాసములు ప్రపంచీకరణములు. తృతీయ. చతుర్థ. పంచమాశ్వాసములు స్వతంత్రకల్పనములు. మొత్తము మీద తెనాలి రామ(లింగ)కృష్ణుని పాండురంగమాహాత్మ్యము స్వతంత్రకావ్యమే.

పుండరీకమహాముని పేర వెలసిన క్షేత్రము పౌండరీకము. పుండరీకమహాముని కోరికను స్వయంప్రతిష్ఠితుడైన దైవము పాండురంగడు. అతడే విట్ఠలుడు. విష్ణుశబ్దమునకు మహారాష్ట్రీవికృతి విట్ఠలశబ్దము. తీర్థము భైమీనది. అది కూడ పౌండరీకము. (74ప.75వచ2ఆ.) "సమస్తముఁ గ్రిందు చేసి మించిన బలువేల్పు తీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుండుటకు మూలకారకుడైన పుండరీకమహాముని చరిత్రము ఉమామహేశ్వరసంవాదమునందు(5-75వచ.2ఆ.). శివనారదసంవాదమునందును (46-118వచ్న4ఆ.) కలదు. పుండరీకమహాముని చరిత్రద్వయము పాండురంగమాహాత్మ్యమునకు ప్రాణభూతము.

నిగమశర్మోపాఖ్యానము క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునది. అది కాశీఖండములోని గుణనిధి కథకు. శివరాత్రిమాహాత్మ్యములోని సుకుమారచరిత్రమునకు. ఉద్భటారాధ్యచరిత్రములోని మదాలసవృత్తాంతమునకుఅనుగుణమైనది. అపూర్వమైనది నిగమశర్మ అక్క పాత్ర. అది సహజసుందరమైన సజీవపాత్ర. "రామకృష్ణుఁడమృతములో లేఖిని నద్ది దిద్ది తీర్చి యాడించిన పుత్తడిబొమ్మ." 145

తండ్రి సభాపతి వేదములు పోసిన గాదె. శాస్త్రముల పుట్టినయిల్లు. కళాకలాపములు డాసిన రచ్చ. ఆహితాగ్ని తల్లి మహాభక్తురాలు. తమ్ముడు నిగమశర్మ నేతిబీరకాయ. మనసు కార్తీయపురుషార్థమునకు కార్చి ఇల్లు గుల్లచేసిన భ్రష్టుడు. భార్యముఖము చూడని వేశ్యాలోలుడు. తమ్ముని చెడునడవడిక చెవినిబడి సరిదిద్దుటకు భర్తతోను. పిల్లలతోను నిగమశర్మ అక్క పుట్టినింటికి వచ్చెను. వచ్చిన వెంటనే తొందరపడలేదు. కొన్నాళ్లు గడిపినది. కొడుకు చెడునడవడికి తల్లిదండ్రులు కృశించిపోవుట చూచెను. ఇలవేల్పు విష్ణువునకు పూజాపురస్కారములు లేకపోవుట గమనించెను. అతిథి సంతర్పణలు ఆగిపోవుట అరసెను. పశువులకు గడ్డి గాదము లేకపోవుట. శిశువులకు తిండితిప్పలు లేకపోవుట. దాసదాసీజనములకు వినయవిధేయతలు సన్నగిల్లుట గ్రహించెను. పుస్తకములు పరహస్తగతములగుట. పుస్తకభాండాగారము నిండ పురుగులు పట్టుట కనిపెట్టెను. చదువు సంధ్యలు సాగకపోవుట. పొలము పుట్ర చూచువారు లేక పోవుట పరికించెను చక్కదిద్దుటకు సంకల్పించెను. ముందు చమత్కారమైన మాటలతోను సంతోషకరమైన సపర్యలతోను తల్లిదండ్రులకు కొంత ఊరట కలిగించెను. మందిరముకుందారాధనము మఱల మొదలుపెట్టించెను. అతిథిసంతర్పణములుసాగించెను. తల్లి చూపించిన నష్టావశిష్టమైన విత్తనమును భద్రపఱిచెను. పశురక్షణ. శిశుపోషణ కావించెను. దాసదాసీజనములకు తనవారిని చేసికొనెను. పుస్తకభాండాగారమును భర్తచేత పునరుద్ధరింపజేసెను. కళావిహీనమైన పుట్టినింటికి యథాపూర్వమైన కళాకాంతులు సమకూర్చెను. చదువు సంధ్యలు సాగునట్లు చేసెను. అన్యాక్రాంతము కాని భూములను ఆత్మాధీనము చేసికొనెను. తన సంతానమును కావలి పెట్టెను. మఱదలి అందచందములు. అభినవయౌవనోజ్జృంభణమును అడవి గాచిన వెన్నెల అగుట భరించలేకపోయెను. "వగచి వగచి తెగచి కడుపు చుమ్మలు చుట్ట కన్నీ రుట్టిపడ" చింతింపసాగెను.

ఇంతవఱకు ఇంటికిరాని నిగమశర్మ ఒకనాడు చుక్క తెగిపడినట్లు ఊడిపడెను. అక్కను చూచి. జంకి. దండము పెట్టి తలవంచుకొనెను. తమ్ముని ఆప్యాయనముతో

కౌగిలించుకొనబోయి. అక్క తమ్ముని మేన నెత్తురులు చిలుకు నఖక్షతములు చూచి రోతపుట్టి అది బయటుపడకుండ "సీమంతపుఁ బెండ్లి కొడుకవు గమ్మ'అని హేతుగర్భితముగ ఆశీర్వదించెను. అది విద్యుద్ఘాతమైన నిగమశర్మ తప్పించుకొని పోవుటకు సిద్ధపడెను. అక్క తరంగితవినయసౌహార్దమార్దవమధురములైనమాటల తేటల పందిరి పెట్టెను. పందిరి అతనికి పంజరమయ్యెను. మేనల్లుని ఇందమని చంకకిచ్చి ఎచ్చటికి పోయెదవు? మీ బావ బంతి నారగింతువుగాక శాకపాకములు నిమిషములో కావింతునని అక్క తమ్ముని ముందఱి కాళ్లకు బంధము వైచెను. వెనుకనున్న మఱదలికి కనుసైగ చేసెను. ఆమె ప్రాణేశ్వరుని పాదద్వయమును కడిగెను. అక్క తమ్మునికి స్నానము చేయించి. మడుగు దోవతి కట్టించి. జుట్టు తడియార్చి. ఇలవేల్పగు విష్ణువునకు నివేదించిన మృష్టాన్నమును తల్లిదండ్రులకు. తమ్మునికి. భర్తకు. పిల్లలకు వడ్డించెను. చలిదన్నమైన తినుటకు ఇంటికి వచ్చిన నిగమశర్మ ఇష్టమృష్టాన్నము తృప్త్యాస్థగా భుజించెను. భార్య ఇచ్చిన తాంబూలము చర్వణము చేయుచు చిఱునవ్వు చిందించుచు నిగమశర్మ శిష్టుని వలె తిన్నెపై కూర్చుండెను. తాను కూడ భుజించి వచ్చి తన సంతానము సందడి చేయ. అక్క తమ్ముని దగ్గఱకు వచ్చి. జుట్టు ముడి విప్పి. కుశలాశయయై ఈళ్ళు క్రుక్కి. పేలు తీసి. జుట్టు దువ్వి. మెడమన్ను నలిచి. మఱదలు తాంబూలమిచ్చి విసర "పద్మకర్ణికఁ గొలువున్న పద్మ వోలె. చేటికానీతపీఠికాసీన యగుచు" ప్రారంభించినది హితబోధ.

"ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహమౌనంచునో
యేరా తమ్ముఁడ నన్ను జూడఁ జనుదే వెన్నాళ్లనో యుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నినుఁ గన్గో కున్కి మీ బావయున్
నీ రాకల్ మదిఁ గోరుఁ జంద్రుపొడవున్ నీరాకరంబుం బలెన్" 33ప.3ఆ.

ప్రారంభించిన వేదపాఠమునకు విఘ్నము కలుగునని కాబోలు మా ఇంటికి రావు. నిన్ను చూడలేకపోవుట వలన నా కన్నులు వాచిపోయినవి. మీ బావ కూడ నీ రాకనే కోరును అన్నది. ఇది వేదాధ్యయనము వదలి వేశ్యాలోలుడైన. ఆత్మీయులను విడిచి అయోగ్యుడైన నిగమశర్మకు మర్మభేదకము కావలసినది. ఆ మాటలకు బుద్ధి వచ్చునని అటువంటి తండ్రికి ఇటువంటి కొడుకు పుట్టుట సాలగ్రామఖనియందు జాత్యల్పపాషాణము పుట్టుట అని చురకవేసెను. తాను అమ్మడుపోగా తమ్ములు కనుగందులు కాగా. పెద్దవాడ వట్లగుట తల్లి దండ్రులకు ఎంత దుఃఖమో ఆలోచింపుమనెను. వంశగౌరవము తలపవని. తల్లిదండ్రులను సంతోషపెట్టవని. ఇల్లాలిని ఒల్లవని. సత్కీర్తి గడింపవని. నీ శీలము పిల్లి శీలమని నీ

చదువులు చిలుక చదువులని దులిపివైచెను. తోడి వారు నవ్వ ఏల బేలవైతివి? ఈ గుణమేల నీకు? అని కోప పడెను. కోపమునకు ఆ కుంత ఎక్కడికి పోవునో అని వెంటనే శాంతించెను. ఈ స్థితి నీకే ఎందుకు తటస్థించెనని జాలిపడెను. అయినను నిగమశర్మ ఉలకడు. పలకడు. అది పని కాదని అక్క ఒక సామోపాయము ప్రయోగించెను.

"నాదు సహోదరుండు సుజనస్తవనీయనయప్రసక్తి బ్ర
హ్మాదుల మెచ్చఁ దే నతని యజ్ఞమునం గడుఁ బూజ్యరాలనై
వేది యలంకరింతునని వేవురి ముందర నాడుకొందు నీ
వేదియు లేక సర్వగుణహీనుఁడవౌట యెఱుంగఁ దమ్ముడా!" 39ప.3ఆ.

ఇది కూడ సిగ్గు శరములేని నిగమశర్మ యెడల నిష్ఫలమైనది. అంత గొప్పగా చెప్పిన. సర్వగుణహీనుడవని చాటిన. చలనము లేని తమ్ముని చూచి అక్క ఒడలు మండినది. తీవ్రముగ ఖండించినది.

"వీరావేశము దాల్చి సర్వధనముల్ వెచ్చింతుగాకేమి ము
క్కారుంబండు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపుఁ గే
దారంబుల్ తెగనమ్మఁగా జనునె నిర్ధారుండవే వెన్క నె
వ్వారున్ లేరె సహోదరాదులు? కులధ్వంసంబు నీ కర్జమే?" 40ప.3ఆ.

ఇట్లు ఛీత్కరించినను నిగమశర్మకు చీమ కుట్టలేదు. అతని రోగము కామవికారము. దానికి చేదు మందు పని చేయదని అక్క గ్రహించెను. తీపి మందు తెలిపెను.

"కామవికార మాత్మ నవగాఢత దాల్చినయేని నిర్భర
శ్రీ మెఱయంగ రూపగుణశీలకులోన్నతి గల్గు విప్రక
న్యామణులన్ సహస్రమయినన్ వరియించి రమింపరాదె యే
మీ మునులే గృహస్థులు? రమించుట యెగ్గె కులాంగనాతతిన్" 41ప. 3ఆ.

అది బహుభార్యానిషేధము లేని కాలము. అయినను నిగమశర్మకు అభిమతము కాదు. వేశ్యాలోలత్వమే వేదురు. అది గ్రహించి అక్క వారయోవతము దుశ్శీలాగారమని దూషించెను. కడకు ప్రగల్భముతో ప్రాధేయపడెను.

"విడు మిఁక నైన నిట్టి యవివేకము, మానుకబుద్ధిపద్ధతిన్
నడువుము, నీకుఁ గావలసెనా హరికౌస్తుభమైనఁ దెచ్చెదన్

గడుసరి యచ్చుకూళపలుగాకుల వీడుము చేయిమీఁదుగా
నడచిన పూర్ణకాముఁడవు నా యనుజన్ముఁడ విట్లు సేయుదే?"44ప.3ఆ.

ఇట్లు నయము, ప్రియము కలుగ అక్క ఆనతిచ్చిన సద్బుద్ధిని నిగమశర్మ ఆదరించెను. కాని తేనె పూసిన కత్తి. ఒకనాటి రాత్రి తల్లినగలు, తండ్రి అలంకారములు, ఇల్లాలి భూషణములు, అక్క ఆభరణములు, బావ భూషలును అపహరించి పాఱిపోయెను. అప్పుడు

"శోకించు వృద్ధభూసురుఁడాత్మ పితృదత్త
దర్భముద్రికకుఁ జిత్తంబు గలఁగి
నత్తగారిచ్చిన హరిసుదర్శనపుఁ బే
రునకు ముత్తయిదవ వనటఁ బొందు
గ్రొత్తగాఁ జేయించుకొన్న ముక్కరకునై
యడలు దుర్వారయై యాఁడు బిడ్డ
జామాత వెతఁ బొందు వ్యామోహియై నవ
గ్రహకర్ణవేష్టనభ్రంశమునకు
నెంత దుర్బుద్ధి యెంత దుర్భ్రాంతి యహహా!
సర్వధనములునద్దురాచారశీలుఁ
డూచముట్టుగనిలుదోచి యుఱికి చనుట
యెఱుఁగరో గాక యవ్వేళ యెఱుక గలదె!" 50ప.3ఆ.

అని తెనాలి రామ(లింగ)కృష్ణుని సానుభూతి. ఇది రసానుభూతి కలిగించునదియే కాని, "అప్పుడింట నందఱు నేడ్చిరి వారితోడ నక్కయు నేడ్చినది. ఎందుకను కొన్నారు? తమ్ముడు చెడెనే యనికాదు, ఇల్లు మునిఁగెనే యని కాదు, తన ప్రయత్నము వ్యర్థమాయెనే యనియును గాదు! మఱి క్రొత్తగా జేయించుకొన్న ముక్కర పోయెనే యని 'దుర్వారయై" యడలెనఁట! పరిహాసము పవిత్రవస్తువును గూడ గమనింపదేమో" అని ఒక అభిప్రాయము కలదు.[146] ప్రత్యభిప్రాయములును కలవు. కాని, నిగమశర్మ సర్వధనములును ఊచముట్టుగ దోచుకొని పోవుట ఎవ్వరును ఎఱుగరు. ఎవరికి అతిముఖ్యమైన ఆభరణములు వారు వెదకి కొనిరి. తండ్రికి అతని తండ్రి ఇచ్చిన దర్భముద్రిక పోయినట్లు తెలిసెను. తల్లికి ఆమె అత్తగారిచ్చిన హరిసుదర్శనహారము పోయినట్లు తెలిసెను. అక్కకు క్రొత్తగా చేయించుకొన్న ముక్కర పోయినట్లు తెలిసెను, బావకు నవగ్రహముల చెవిపోగు

పోయినట్లు తెలిసెను. అందుకు తండ్రి, తల్లి, బావ ఏడ్చుట సహజము. తమ్ముని సరిదిద్దుటకు అత్తింటి నుండి పనిగట్టుకొని పుట్టినింటికి వచ్చి అంత ప్రయత్నము చేసిన అక్క తన ప్రయత్నమెల్ల వ్యర్థమయ్యెనని ఏడ్వవలయును. ఎంత క్రొత్తగా చేయించుకొన్నను ముక్కరకోసము దుర్వారయై అడలుట సహజము కాదు. ముక్కర ఎంత సౌభాగ్య చిహ్నమైనను . అది బాలతొడుగు కాదు. పెండ్లి నాటిది కాదు. క్రొత్తగా చేయించుకొన్నది. సరిక్రొత్తగా మఱల చేయించుకొనగలదు. తమ్ముని సరిదిద్దుట తరము కాదు .అందుకుఏడ్చుట ఆవశ్యకము. ఆ మాట తలపెట్టక క్రొత్తగా చేయించుకొన్న ముక్కరకోసము దుర్వారయై అడలినదనుట పవిత్రవస్తువును గమనింపని పరిహాసమే.

ఇంత భ్రష్టుడైన నిగమశర్మ ఇంకను భ్రష్టుడై, దుష్టుడై కడకు పౌండరీకక్షేత్రములోని సంగమతీర్థమునందలి నృసింహస్వామి ఉన్న పుణ్యప్రదేశమునందు మరణించుట వలన, పరమధామమునందు పరమపదనాథునకుపార్శ్వచరుడగును. ఇట్లు నిగమశర్మోపాఖ్యానము క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించును.

రాధాదేవి చరిత్రము క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునది కాదు. వైష్ణవతత్త్వమును ప్రతిపాదించునది. దాక్షిణాత్యవైష్ణవమునందు రాధాదేవికి ప్రాధాన్యము లేదు. ఔత్తరాహవైష్ణవమునందు రాధాదేవికే ప్రాధాన్యము. రాధాకృష్ణతత్త్వము సుప్రసిద్ధము. పౌండరీకక్షేత్రము మహారాష్ట్రదేశములోనిది. అచట దాక్షిణాత్య, ఔత్తరాహవైష్ణవముల సమ్మేళనము కలదు పాండురంగడు, విఠ్ఠలుడు కృష్ణుడే. కావున పాండురంగమాహాత్మ్యమునందు రాధాదేవి చరిత్రము ప్రసక్తమైనట్లు కనిపించును. రాధ విష్ణువునకు మనఃప్రీణనము కావించుటకు బ్రహ్మ సృజించిన శక్తి (179వచ3ఆ.) రాధ మాధవుని అధినాథునిగా కోరి గోవర్ధనాచలసమీపములోని ఋణవిమోచనతీర్థమునందు తపస్సు చేయును. రాధాదేవి చరిత్రము నందు రాధాదేవి తపస్సు ప్రధానమైన రమణీయమైన ఘట్టము. కాళిదాసు కుమారసంభవములోని పార్వతి తపస్సునకు ప్రతిబింబప్రాయము హేమంత, వసంత, గ్రీష్మ, వర్షర్తువర్ణనములు సంఖ్యాపరిగణనమునకు గాక, తపోనైపథ్యప్రయోజనము కలవి.

"చంద్రబింబాస్య కుచశైలజన్మభూమి,
గాన రాదూపు వోలె నక్కడఁ ది చలికి
నించు కంతయుఁ గంపింప దివముకొనుచు
ముజ్జగంబులు పచరింప మూటి లెక్క" 5ప.4ఆ.

"కెంజిగురాకు డాలు దులకించిన ధాతుపటంబు చాయఁ జే
యిం జదుకెక్కు పుప్పొడుల నంటిన తేఁటులు భూభృజ్జటా
పుంజముఁ బోలఁగా విపిన భూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణుఁ గోరి తప మర్మిలోనరించు మృగాక్షి కైవడిన్" 14తప. 4ఆ.
'ఆ పద్మిని దినకర కర
తాపమునకు నోర్చి ఘోరతప మొనరించెన్
శ్రీపతి యడుగుల గొడుగుల
ప్రాపొదవిన వారిఁ దాపభర మేలంటున్?" 17ప.4ఆ.
"పాపట తెఱువున డిగి నా
సాపుట ముక్తాఫల ప్రచారంబై రా
ధాపృథువక్షోరుహముల
పై పైఁ బ్రథమోదబిందుపటలము నిగిడెన్" 27ప.4ఆ.

ఇది కాళిదాసు కుమారసంభవములోని క్రింది శ్లోకమునకు అనుసరణము.

"స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధనిపాతచూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః" 24శ్లో. 5స.

రాధాదేవి తపస్సు ఫలించి "యాదవకిశోరుండును గృశోదరీసహాయుండై మాయాశబలితుండగు జీవపురుషుని పరుసున వివిధ భోగపరాయణుండై ప్రవర్తించుచుండె"నఁట (45ప.4ఆ.) అది రాధాకృష్ణతత్త్వము.

సుశీల చరిత్రము కరుణాద్భుతభక్తిరసభరితము. సుశీల ఒక వైష్ణవవరుని తనయ. వివాహమైనది మొదలు విషాదజీవన.

" తాళి విభుండు గట్టిన మొదల్ పతిదేవత యా సుశీల పెన్
గోలతనంబునన్ మగఁడు కొట్టినఁ దిట్టిన రట్టు పెట్టినన్
దాళి దినంబుఁ దచ్చరణతామరసంబులు గొల్చు నేలయున్
బోలునె యీమె కంచుఁ గృతిబుద్ధులు వృద్ధులు ప్రస్తుతింపఁగన్"

ఆమె భర్త అభాజనుడు. ఈగకు కాలు. పామునకు బలి ఒసగని పిసినిగొట్టు. అతడు లేని సమయమున కుహనావటువు భుక్తాపేక్షను వచ్చెను. చలిదన్నమైన

పెట్టుమని కోరెను. సుశీల కుండ ఊడ్చి పెట్టెను. అతిథి ఆకలి తీరలేదనెను. సుశీల పిండివంటలు పెట్టెను. అయినను వటువు ఆకలి తీరలేదు. సుశీల అగ్నిని ప్రార్థించెను. వివిధభక్ష్యములు సమకూఱెను. ఆమెపై అమరతరుప్రసూనములు కురిసెను. వటువువిష్ణువైసాక్షాత్కరించెను.

'సుచరిత్ర! నేఁడు నీ చే
తి చలిది భుజియింపఁ జాల తృప్తి యొదవెడిం
బచరణగా దిమ్ముల మును
రుచియింపదు శబరి విందు ద్రోవది విందున్" 189ప.4ఆ.

అని ప్రశంసించి. ఆమె భర్త అట్లగుటకు కారణము తెలిపి. ఇక అట్లుండదని తెలిపి.

"తృష్ణారహితులు మత్పద
నిష్ణాతలు నిత్యసత్యనిరతులు నగు శ్రీ
వైష్ణవులఁ గాంచి ననుఁ గా
విష్ణుపదవలగ్న! గారవించి కొలువుమీ" 205ప.4ఆ.

అని వరమిచ్చెను. సుశీలభర్త సుచరిత్రుడయ్యెను

"పాళము మీఱు పెద్ద పెద పాళములై బలితంపుఁ గాఁ గులన్
మూలుగు చున్న ప్రాఁ బసిఁ డి ముంచి ధనార్థుల కిచ్చు. విష్ణుదే
వాలయసుప్రతిష్ఠలకునై యొసఁ గున్ సతి కేల నించు నా
నాలఘుకర్మనిర్మితికి నగ్రకులేంద్రుఁ డనుగ్రహంబునన్" 211ప.4ఆ.

ఆలుమగలు విష్ణుపరాయణులైరి. సుశీల పుత్రులకు పాండురంగభక్తి ప్రబోధించి పౌండరీకప్రభు నారాధించి పరమపదము గాంచెను. ఇది క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించును.

అయుతనియుతోపాఖ్యానము మఱల క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించును. అంతేకాదు. గృహస్థాశ్రమమునకు పట్టము కట్టును. ప్రయుతుడను మునితనయులు అయుతనియుతులు. అగస్త్యుని శిష్యులు. గురూపదేశమున నియుతుడు గృహస్థాశ్రమము స్వీకరించును. అయుతుడు గృహస్థాశ్రమమును నిరాకరించి. గురుకృతానాదరుడగును.

"చిలుకలు కమ్మతెమ్మెరలు శీతమయూఖుఁడు దేఁటు లాదిగాఁ
గల ననవిల్తు సాధననికాయము వేలము పట్టు లంగనా
కుల, మటుగాన దాని విడఁ గొట్టక తృష్ణకదొట్ల వీతరా
గులమని విఱ్ఱవీఁ గెదరు కొందఱు బోడలు నానగండలై. 182
ఉర్విధరములెక్కి యుఱుకనేకుచకుంభ
యుగమొల్లఁ గాక తా నుఱుకు మనిన
వాండి కైదువులపై వ్రాలనే నిఱుఁ జూపు
వా లొల్లఁ గాక తా వ్రాలు మనిన
మున్నీటి సుడివడి మునుఁగనే నతనాభిఁ
గన నొల్లఁ గాక తా మునుఁగు మనిన
బెడఁ గారు కాలాహిఁ దొడుకనే నూఁ గారు
తొడు సొల్లఁ గాక తాఁ దొడుకు మనినఁ
జెప్పిన గురుఁడేమి పనిచినఁ జేయలేనె!
కావె తన సొమ్ము మామక కాయకర్మ
గతులు; మొఱ్ఱోయనంగ లింగంబు గట్టి
జంగమన సంగనలఁ గూర్పఁ జనదు గాక!" 184ప.5ఆ.

అని తలపోసి అయుతుడు తపస్సు ఆరంభించును. అది మాన్పించుటకు ఇంద్రుడు వృద్ధబ్రాహ్మణవేషధారియై వచ్చి గృహస్థాశ్రమముగుఱించి బోధించును.

"లలితాగారవిహారులై మణిమయాలంకారులై శీలవ
ల్లలనాలాలితులై యమూల్యమృదుచేలద్యోతితాకారులై
కలమాన్నప్రియులై సుగంధధరులై కందర్పునిం బోని భూ
తలనాథుల్ జనకాదు లొందిరి కదా తత్తాదృగానందముల్ 213.
కలలోవార్తలు విప్పిచెప్పెదు క్రియన్ గాథాపురాణార్థముల్
దెలుపన్నేర్తురుగాని నేరరుసుమీ తీవ్రవ్రతాచారశ
ష్కులుత్తై యుండెదు ముండధారులు సుముక్తుల్, డాయఁ గాఁ జింతకా
యలకజ్జాయము తోయ మింత చదరంబా తత్పరిష్వంగమున్. 214
వరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియున్
సర సావంతయుఁ గాన లేరు తుది మోషావిభ్రమాంభోధికిన్
విరసాంతఃకరణుండవై యెటులుగా నిందించెదో యయ్య!త
త్సారసాకార ముదారమన్మథకళాసర్వస్వశృంగారమున్. 215

కీలారమున నుండి పాలింటి కేతేర
బహుధాన్యములు చేలఁ బండి యొరఁగ
నెడనెడఁ బెండ్లిండ్లు వడుగులు వొదమఁ గృ
తార్థులై యర్థించు నర్థులలరఁ
బరిచారికాకోటి పనిపాటు పాటింప
జుట్టంపు సందడి నెట్టు కొనఁగ
గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షి గోర
నిత్యనైమిత్తికములు నిర్నిద్రబుద్ధి
నాచరించుచు హరిభుక్త మాత్మభార్య
భక్తినిడ భుక్తిఁ గొనుచున్కి ముక్తి కాని
నిదుర వంటిది జాతి వంటిదియుఁ గాదు " 216ప.5ఆ.

ఇందుకు అయుతుని ఇతోధికనిపుణమైన సమాధానమిది:

'అకుటిలగుణవాసనతో
న కలిగి మరువంపులేఁగొనయుఁ బోలిన శ్రీ
శుకు నెన్నరేమి? సారె జ
నకు నెంతురు పరముఖోపనతవిజ్ఞానున్. 222
మునిజనభాగధేయమగు మోక్షము పక్షము లేక పల్కి నీ
వనఘవిచార! సారె గొనియాడుదు బూడిద బొట్టు వోని యా
చెనఁటి గృహస్థధర్మమది; చిమ్మెట సింగమె? గాజు రత్నమే?
కనకశలాటుకాధమము కల్పఫలంబె? చలంబు లేటికిన్? 223
సంపదచేతఁ గాని కొనసాగవు సువ్వె గృహస్థధర్మముల్;
సంపద పూర్వజన్మవికసత్సుకృతంబునఁ గాని చేర దా
సంపద చేరియున్ మదవశంవదుఁ జేయు 'మహాత్మునేనియున్
జంపకు నన్ను గన్నసుమి. చంపుడు ముంపుడు బోధగాథలన్ 224
కందర్పాస్త్రములంచు నంచితతటిత్కాండంబులంచున్ సుధా
మందస్యందములంచుఁ గాంచనలతామత్తల్లులంచున్ సుధీ
బృందంబుల్ ధ్వనినిండలం దెగడు నీ బింబోష్ఠులందెల్ల నా
నందాభాసమెగాక భాసితచిదానందంబు పెంపొందునే? 225
కురుల సిరుల్ మెఱుంగుఁ జనుగుబ్బలనిబ్బరముల్ మొగంబు వి

స్ఫురణము లింద్రనీలమణిభూధరశృంగకురంగలాంఛనా
దరవశదృష్టిఁ జూచెదవు తాపసవంశవతంస! తజ్జరా
భరమున వచ్చు తెల్పుఁ బడుపాటు వళీవలనంబు నుండఁగన్" 226ప.5ఆ.

అప్రతివిధానమైన ఆయుతుని సమాధానమునకు మాటాడలేక ఇంద్రుడు కామధేనువు ముఖమున కార్యసంసిద్ధికి సమకట్టెను. కామధేనువు కారణముగ, వాధూలముని శాపము నంది, ఆయుతుడు పౌండరీకక్షేత్రమునకుపోయి, భేకమై గృహస్థాశ్రమము స్వీకరించి, పుత్త్ర సంతానము పొంది విష్ణుపదమును గాంచెను.

పాండురంగమాహాత్మ్యమునందు అష్టాదశవర్ణనావ్యామోహము లేదు. పౌండరీకక్షేత్రస్థానికప్రకృతివర్ణనము కాక, కథానుగతములైన కాశీపురవర్ణనము(98-118 ప.1ఆ.) మాల్యవంతవర్ణనము (130-136ప.1ఆ.) నదీవర్ణనము (139ప.1ఆ.)కుమారస్వామి వర్ణనము (147వచ.1ఆ.) ప్రయాణవర్ణనము (158-172ప.1ఆ.)కైలాసనగరవర్ణనము (173-176ప.1ఆ.) వనవర్ణనము (180-185ప.1ఆ.)వనవిహారవర్ణనము (186-190 ప.1ఆ.) దశావతారవర్ణనము (56-66ప.2ఆ.85ప.1ఆ.), క్షీరాబ్ధివర్ణనము(142-149ప. 3ఆ.) శ్వేతద్వీపవర్ణనము(150-154ప.3ఆ.)వైకుంఠవర్ణనము(155-157వచ. 3ఆ.) విష్ణువర్ణనము (160-168ప.3ఆ.) శ్రీకృష్ణవర్ణనము(177, 178ప. 3ఆ.)ఋతువర్ణనములు(7-13; 15-16, 18-26, 28-30, 37-43ప. 4ఆ.)మాత్రమేకలవు.

పాండురంగమాహాత్మ్యములోని వర్ణనములందు వ్యవసాయక్షేత్రము ప్రత్యక్షమగును.

"మారుతాహతి రాలు నారికేళఫలాళి
నిడిసి జల్లించు పుండ్రేక్షురసము
చిలుక పోటుల చేతఁ జీరిగిన సహకార
ఫలములఁ దొరఁగెడి పచ్చితేనె
చిక్రోడ దంష్ట్రలు చెక్కు సుగంధి య
నంటిపండ్లను గాఱు నవ్యసుధయుఁ
బాకవేగారంభపరిపాటిఁ దమయంతఁ
బగిలిన పనస గొబ్బిండ్ల బేస
మేకమై కాలువలు గట్టి యేక హేలఁ
బరఁగ నందలి క్రియ్యాట పసిమి తేటఁ
బండు నవ్వీట ముక్కారుఁ బసిఁడి గారు

సరసధాన్యంబు మంచి రాజనపుఁ జేల" 118ప. 1ఆ.
"యువమనోజాంగలక్ష్మీత మొత్తరించి
గరుసు వడ దున్ను మదనలాంగలికు హలము
కామినీమణి ము క్కుటుగాక యున్న
నాసికాభరణపుఁ గజ్జు నాటు నోటు" 195ప.3ఆ.

ఇవి తెనాలి రామ(లింగ)కృష్ణుని అగ్రహారపు భూములకు అద్దములు. కృతిపతు లైన రాజులు, మంత్రులు, కవులకు జాంబూనదాంబరములతోపాటు కర్పూరతాం బూలము లిచ్చుట బహుకాలముగ కలదు. అంత విలువైన కర్పూరతాంబూలమును ప్రథమతః అద్భుతముగ వర్ణించిన కవి తెనాలి రామ(లింగ) కృష్ణుడే.

"పలుకుందొయ్యలి మోవికాంతి కెనయౌ బాగాలు నయ్యింతి చె
క్కులఁ బోలుం దెల నాకు లయ్యబిద పల్కుల్వంటి కప్రంపుఁ బ
ల్కులతోఁ గూడిన వీడియం బొసఁగె నాకుం బద్మనాభార్చనా
కలనాపావనహస్తకంకణఝణత్కారంబుతోరంబుగన్" 29ప.1ఆ.

వక్కలు సరస్వతి మోవికాంతికి సాటి. లేత తమలపాకులు సరస్వతి చెక్కులకు సదృశము. కప్పురపు పలుకులు సరస్వతి పలుకులకు సయిదోడు. కర్పూర తాంబూలము సారస్వతము.

## ఘటికాచలమాహాత్మ్యము

ఇది "తెన్నాలి రామకృష్ణసత్కవికులవజ్రపాణి ... రచించి" నట్లు తెల్పి అతని పౌత్త్రుడు ఖండోజీరాయనికి అంకిత మిచ్చిన గ్రంథము. రామకృష్ణుని కాలము పదునా ఱవ శతాబ్ది. ఖండోజీరాయని కాలము పదునెనిమిదవశతాబ్ది కావచ్చును. కావున "పౌత్త్రుడు"వంశీయుడు కావలయును. అతని పూర్వులు రామకృష్ణుని అంతిమగ్రంథ మగు ఘటికాచలమాహాత్మ్యమును ఎవ్వరికిని అంకితమీయక పోవుటకు హేతువు కనిపించదు. పదునేడవశతాబ్ది ఖండోజీరాయని వంటి కృతిభర్త లభింపక పోవుట ఆశ్చర్యము కలిగించును. ఖండోజీరాయుడు తంజావూరు పాలకుడైన శహాజీ బంధువు కావచ్చును. ఖండోజీ తండ్రి "మల్లవడీపురీశ్వరుఁడు" అని (38ప. అవ.) ముత్తాపఖా ను, బలబలాఖాను, అంబారుఖాను, ఖానకానులను ఓడించి, మల్లాదళముల నణిచిన వీరుడని(39వ.అవ.) కలదు. మల్లవడీపురీశ్వరవిశేషణము బిరుదము కావచ్చును. అతడు సేనాధిపతి అగును. ఖండోజీరాయుడు శహాజీ రాజోద్యోగి కావచ్చును. శహాజీ

ఆస్థానకవి దర్భా వేంకటగిరి (కవిగిరి) ఘటికాచలమాహాత్మ్యమునకు అవతారికాశ్వా సాద్యంతపద్యములు సమకూర్చెను.

ఘటికాచలమాహాత్మ్యము ఘటికాచలక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించుక్షేత్ర మాహాత్మ్య కావ్యము. ఘటికాచలము తమిళనాడులోని ఉత్తరార్కాడుజిల్లావాలూజా తాలూకాలోని షోళింగపురము లేక షోళింగర్. చోళళిం గపురము పూర్వనామము.[147] అచటి దైవము శ్రీనృసింహస్వామి. బ్రహ్మవైవర్తపురాణోత్తరఖండమునందు ఘటికాచలమాహాత్మ్యము కలదు. కాని రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యమునకు మూలము కాదు.[148] అది భృగుపరాశరసంవాదము. ఇది భృగునారదసంవాదము. రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యము స్వతంత్రకావ్యమే.

ఘటికాచలమాహాత్మ్యము మూడాశ్వాసముల గ్రంథము. ప్రథమాశ్వాసమునందు నారదుని నూటయెనిమిది తిరుపతుల పర్యటనము. ఘటికాచలక్షేత్ర మాహాత్మ్యము. ధవళాంగుని కథ కలవు. ధవళాంగుని కథకు అనువృత్తముగ నారదుని పూర్వజన్మవృత్తాంతము. శతశృంగపర్వతమున తపస్సు చేయు సప్తర్షులు. ఆకాశవాణి మాట ప్రకారము జగన్నాథక్షేత్రము. శ్రీకాకుళక్షేత్రము. తిరుపతిక్షేత్రము. కంచిక్షేత్రము సందర్శించి. ఘటికాచలము చేరి. అచటి మునులతోపాటు తపస్సు చేయగా శ్రీనృసింహస్వామి సాక్షాత్కారమైన వృత్తాంతము ద్వితీయాశ్వాసము. శ్రీనృసింహస్వామి సౌమ్యాకృతి దాల్చి సప్తర్షుల.మునుల కోరికలు తీర్చుట. వైఖానసులు ఘటికాచలమునకు వచ్చుట. వారి కోరిక ప్రకారము శ్రీనృసింహస్వామి ఆదేశమున హనుమంతుడు విషమప్రదేశమును సమతలము చేసి హనుమద్గ్రామమును ఏర్పఱుచుట. వైఖానసులు శ్రీనృసింహస్వామికి కల్యాణమహోత్సవము తొమ్మిది రోజులు సేయుట. సేవించుట తృతీయాశ్వాసము.

నారదుని పూర్వజన్మవృత్తాంతములోని తరళ - ప్రవర్తనము. నిగమశర్మోపాఖ్యానములోని వికారపుఁ గోడలి ప్రవర్తనము వలె కలదు.

"పలువికారంబుల కలగల్పు చూపుల
రాకపోకలు బయల్ ప్రాకఁ జేయుఁ
దమకంబు గమకంబు దత్తరంబును హత్తి
మనసు సాఁగిన పజ్జఁ జొనుపుఁ గోర్కి
కుదురు పాలిండ్లపైఁ గొంగు జాఱఁగఁ గొప్పు
వీడ నూఱక నవ్వు వెఱ్ఱి నవ్వి

నేరాలి పట్టి బిగ్గెత్తి చెక్కిలి నొవ్వఁ
గఱచి వాఁ డేడ్చినఁ గౌఁగిలించు
దండ సకిమెడఁ బుంజాల దండఁ బెట్టు
దిట్టు మెట్టెలు బిగువంచుఁ దెగి కళాదు
వనిత చిన్నారి పొన్నారి వయసు వాని
విప్రనందనుఁ గన్నంత వెకిలియగుచు" 62ప.3ఆ.పాం.మా.
"నును వెండికడియముల్ మినుమినుక్కన సారె
కును దువ్వి పంకించి కొప్పు వెట్టు
గబ్బిగుబ్బలు బైలు గాఁగ బైట చెఱంగు
జాళించి సవరించు సారె సారె
కప్పుదంతపు డాలు గార్కమ్ము తక్కట
ద్దముఁ జూచి నాభియందముగ దిద్దు
పనిలేని పని కనుంగొను నేటవాలుగ
వాలుగన్నుల గరువమ్ము వొదల
ముద్దు ముద్దుగఁ గతప్రొద్దు ప్రొద్దు వన్నె
పుట్టములు గట్టి బిటిపొటి పూత సొమ్ము
వెట్టి మట్టెల రవళి కన్పట్టు తిరుగు
చిరుగు సిగ్గున పొరుగు భూసురుని యెదుట" 36ప.2ఆ.

సప్తర్షుల తపస్సునకు భంగము కలిగించుటకు, ఇంద్రుడు కొలువునకు రప్పించిన రంభను సభాసదులు వర్ణించుట (82-93ప.) రంభాద్యప్సరసల వనవి హారము (100-113ప.) పుష్పాపచయఘట్టము (114మధురగతి రగడ)సప్తర్షులను సంచలింప జేయు సన్నాహము (116-120ప.) జలక్రీడ (126-135)సూర్యాస్తమయవర్ణన (139-141ప.) అంధకార వర్ణన- (142-144ప.) నక్షత్రవర్ణన(146ప.) చంద్రోదయ వర్ణన (148, 149ప.) చంద్రికావిహారవర్ణన (149ప.150వచ.), వేకువ వర్ణన (156-158ప. 3ఆ.) సమకాలికప్రబంధములకు సయిదోడు.

సప్తర్షులు సందర్శించిన తిరుపతి వేంకటేశ్వరుని వర్ణనము అయిదు సీసపద్యములందు కలదు.(176-180ప. 2ఆ.) కాంచికాపురవర్ణనము ఇరువదియెనిమిది పద్యములందు కలదు.(197-224ప.2ఆ.)పాండురంగమాహాత్మ్యములోని కాశికాపురవర్ణనమునందు వలె, ఘటికాచలమాహాత్మ్యములోని కాంచికాపురవర్ణనమునందును చాతుర్వర్ణ్య, గజ, తురగ, వేశ్యా, మారుత, పుష్పలావికావర్ణనములు కలవు.

ఘటికామాత్రమున కాంక్షితము ఘటియిల్లును గావున. క్షేత్రమునకు ఘటికాచలక్షేత్రమను పేరు వచ్చినట్లు కలదు. ఆకాశవాణి ప్రకటనమిది:

"ఘటికాద్రి కరుగఁ దచ్చట
ఘటికామాత్రముఁన మీకు కాంక్షిత మెల్లన్
ఘటియిల్లు నెంచఁ దగు నా
ఘటికాద్రికి మాద్రి యద్రి గలదే జగతిన్." 162
"అద్రిరాజంబు శ్రీఘటికాద్రి దనరు
నదిగదా నిత్యసదన మయ్యచ్యుతునకు" 163ప. 2ఆ.

ఘటికాచలము మహాక్షేత్రమైనను. ఘటికాచలమాహాత్మ్యము మహాకావ్యము కాదు. కథలు రసవత్తరములు కావు. స్థానికప్రకృతి చిత్రణము సకృన్మాత్రమును లేదు. వైష్ణవతత్త్వము మాత్రము వైభవోపేతము.

# పదగుంభనము

పూర్వోదాహృతమైన పాంచాలీ పరిణయపద్యమునందు "పాండురంగను కవిపద్యంబు హరువును" అని కలదు. ప్రచురప్రచారములోని పద్యమునందు "పాండురంగవిభుని పదగుంభనంబును" అని కలదు. పద్యము హరువన పద్యము హృద్యత. పద్యహృద్యతకు ప్రాతిపదిక పదగుంభనమే. పదగుంభనమన పదసంయోజనము. పదసంయోజనమన పదముల కూర్పు. అది ప్రతికవి చేయుపనియే. ప్రతికవి చేయని పదముల కూర్పు కలదేని, అది పాండురంగవిభుని పదగుంభనమగును.

"తగ సంస్కృతము తెనుఁగుగఁ జేయఁ దెనుఁగు సం
స్కృతముగఁ జేయఁగఁ జతురమతివి" 23ప.1ఆ.

అని రామకృష్ణునికి కృతిభర్త ప్రశంస. సంస్కృతము తెనుగు సేయుట అనగా సంస్కృత గ్రంథమును, సంస్కృతశ్లోకమును తెనుగుసేయుట అగును. అయిన తెనుగు సంస్కృతము సేయుట అనగా తెనుగు గ్రంథమును, తెనుగు పద్యమును సంస్కృతము సేయుట కావలయును. కాని పాండురంగవిభుడు తెనుగు గ్రంథమునుగాని, తెనుగుపద్యమునుగాని సంస్కృతము సేయలేదు. సంస్కృతపదమును తెనుగుసేసెను. తెనుగు పదమును సంస్కృతము సేసెను. అది పదగుంభనములోని ఒక ప్రత్యేకత. మఱొక ప్రత్యేకత ప్రా. 'ప వములకు అపూర్వపర్యాయపదసృష్టి. ఇది ప్రధానమైన

పదగుంభనము. ప్రౌఢపదప్రయోగమును పదగుంభనమే.

పాంచాలీపరిణయకర్త అల్లసాని. ముక్కు తిమ్మన అని పేర్కొని. తెనాలి. అని గాని. రామకృష్ణుడని గాని పేర్కొనక పాండురంగవిభుడని పేర్కొనుట వలన పదగుంభనము పాండురంగమాహాత్మ్యమునకు ప్రత్యేకము కావలయును. అయినను పై విధమైనపదగుంభనము ఉద్భటారాధ్యచరిత్రమునందు బీజప్రాయముగ కలదు.

బాలాభరణమైన పులిగోరులు అను తెలుగుపదము "శార్దూలనఖములు" అని(57 ప.3ఆ.) సంస్కృతము సేయబడినది. పర్వతరాజపుత్రి అను సంస్కృతపదము "గుబ్బల ఱేని కూతు" అని (72ప.2ఆ.) తెనుగు సేయబడినది. కల్పవృక్షమునకు 'మరుద్భూజ ము" అని (167ప.1ఆ.) పామునకు మరుద్భుక్కు అని (2ప.1ఆ.)అపూర్వ పర్యాయప దములు సృష్టించబడినవి. పాము కూనలు అనుటకు" ఫణిడింభజాలములు." అని (55ప.1ఆ.) ప్రయోగింపబడినది.

హరిలీలావిలాసపద్యములందు విష్ణువు "కఱివేల్పు సామి" (205ప.1ఆ.ప్ర .ర)మహాకవులు "నెఱకవులు". (212ప.1ఆ.ప్ర.ర.) స్వర్ణగిరి "పసిఁడిగట్టు" (230ప.1 ఆ..ప్ర.ర.)

పాండురంగమాహాత్మ్యమునందు గోరువెచ్చని మంచినీళ్ళు "నఖంపచస్వచ్ఛజల ములు" (19ప.2ఆ.) చిక్కము "శిక్యము". (103ప.2ఆ.)తండ్రి బ్రదికియున్నవాడు "జీవత్తాతపాదుడు" (6ప.3ఆ.) సగము తిన్న అన్నపుముద్దలు "సామిదష్టాన్నకబళ ములు" (83ప.3ఆ.) ఉమ్మి" అంబూకృతము" (95ప.3ఆ.) వంటయిల్లు "రసవతి" (142ప.3ఆ.) ఇవి తెనుగునకు సంస్కృతముసేతలు.

కౌస్తుభము "నీలికెంపు" (13ప.1ఆ.) కర్ణరసాయనము "చెవికిం జవి" (151ప.1ఆ.) వృషభము"కొమ్ముతేజీ" (165ప.1ఆ.) హిమవంతుని పుత్రి "వలిగుబ్బలిపట్టి" (199ప.1 ఆ.) శివుడు"వాఁకదాల్పుఁడు" (199ప.1ఆ.) కృష్ణుడు "మందప్రోయాండ్ర మానిపండు" (15ప.2ఆ.) విష్ణుచక్రము "మిట్టుంగత్తి" (33ప.2ఆ.) మూలస్తంభము "మొదలికంబము" (55ప.2ఆ.) నూతనమకరకుండలములు "లే మొసలి వాగఁడ పోఁగులు" (70ప.2ఆ.) రక్షకుడు"మనుపుకాఁపు" (109ప.2ఆ.) గోపిక "పడిగాఁపు పూపవయసాకె". (128ప. 2ఆ.) పార్వతి వాహనము "గట్టురాచూలి వయాళి వావురము" (175ప.2ఆ.) దుష్ట బ్రాహ్మణుడు "పాఱుండొడవఁడు" (80ప.3ఆ.) శ్వేతద్వీపము "వెలిదీవి" "తెల్లదీవి" (151, 153ప.3ఆ.) . పీతాంబరము "హళదిపుట్టంబు" (166ప.3ఆ.) బ్రహ్మ "తొలుకారు

కలఁ కపులుగు మావురావుత్తు(51ఉ.4ఆ.)ఇంద్రధనుస్సు "వేలుపువిల్లు" (57ప.4ఆ.) పీతాంబరుడు "కడారపటుండు". (61ప.4ఆ.) ప్రాయశ్చిత్తము "పాచితము" (47ప.5ఆ.) రాక్షసుల త్రిపురములు "సోఁకుమూఁక కుడిదల యూళులు". (129ప.5ఆ.) శంఖధారి" వలమురి తాలుపు". (138ప.5ఆ.) బ్రహ్మచారి "గోచికట్టు". (238ప.5ఆ.) ఇవిసంస్కృత మునకు తెనుగుసేతలు. అచ్చతెనుగు కృతులకు అవ్యవహితపూర్వమైన ఆద్యప్రకృతులు.

శివుడు "కద్రూజాంగదుడు" (4ప.1ఆ.) పద్మాక్షులు పుష్కరాక్షులు. (101ప.1ఆ.)ఇంద్రధనుస్సు"మరుత్ఫలము" (161ఉ.1ఆ.) ముక్కంటి "అక్షికౌక్షేయుడు" (156ప.1ఆ.) త్రిశూలము " త్రిముఖాస్త్రము" (165ప.2) తనుమధ్య "కించిద్వలగ్న" (195ప.1ఆ.) కృష్ణుడు " అర్జునరథభూషణము " (10ప.2ఆ.)పశువులను తోలు కఱ్ఱ "ధేనుదండము". (14ప.2ఆ.) దేవకీనందనుడు "దేవకీతర్ణకము" (31ప.2ఆ.) ఘృత్స్యావతారుడు "అగ్రభూవాగ్గర్వోద్వహాభూమి ." (47ప.2ఆ.)మునిశ్రేష్ఠుడు "మునిమదావళము" (49వ.2.ఆ.) ఇందిరావిభుడు "ఇందీవిభుడు" (51ప.2ఆ.)చాతకపక్షి ఉత్పిబము. (68ప.2.ఆ.) మన్మథుడు "ఉగ్రశత్రువు". (72ప.2ఆ.) దేవతాప్రముఖుడు"మరుత్కరి(97ప.2ఆ.) విందు భోజనము "భుజాభోజనము". (111ప.2ఆ.) కృతార్థత "కార్తార్థ్యము". (140ప.2ఆ.)బ్రహ్మ "అంభోరుహాభూణుడు" (159ప.2ఆ.) నాగాభరణుడు"మరుద్భుక్కటకుడు (184ప.2ఆ.) కుమారస్వామి "కాసూధరుడు". (180ప.3ఆ.) శివుడు "ఆదికపి". "వృషాకపి". (190ప.2ఆ.) నారదుడు వీణాముని (2వచ.3ఆ.) సతీసమేతము "పురస్సరదార్యము"(75ప.3ఆ.) ఎండ తాపము "రవికరార్తి" (83ప.3ఆ.) నీరు త్రాగని వాడు "నిరంబుభజనుడు" (100వచ.3ఆ.) అతిదాహము ఒహాఅవిద్దైరాసక్తి" (102ప.3ఆ.) చంద్రుడు"క్షపాధిపతి"(124ప.3ఆ.) నారదుడు "వారిజభ్రూణసూతి" (128ప.3ఆ.) మరున్మని (134ప.3ఆ.) కుశేశయపౌత్రుడు = తామరపువ్వుమనుమడు (136ప.3ఆ.) ఇంద్రుడు "భూధ్రవైరి" (142ప.3ఆ.) దేవతలు "మరుత్కమనులు (143ప.3ఆ.) హిరణ్యగర్భుడు "గాంగేయగర్భుడు" (178ప.3 ఆ.) దేవతాశ్రేష్ఠుడు "మరున్మదావళము". (186ప.3ఆ.) వృక్షములు ద్రువులు" (13ప.4ఆ.) ఆకాశము "మేఘవీథి" (77వచ.4ఆ.) భ్రూణహంత "భ్రూణహలుడు" (131ప.4ఆ.) శర్కర "మత్స్యండిక" (178ప.4ఆ.) గోపిక "గోధుక్స్త్రీ (233ప.4ఆ.) భూసురులు "భూలేఖులు" (262ప.4ఆ.) అసంభవము "పర్వతాగ్రశిలాబ్జసంభవము". (285ప.4ఆ.) భుజగభూషణుడు "నాగాకల్పుడు". మహాపరాధి "గాఢాగఃకర్మఠుడు" (296ప.4ఆ.) మహత్పరివాదము "మహద్రీఢ(305ప.4ఆ.) చంద్రిక "చంద్రగోళి" (24ప.5ఆ.) కౌస్తుభము "వార్మణి" (25ప.5ఆ.) దడుల ఇళ్లు "ఏడూకములు" (29ప.5ఆ.) విద్వద్వర్యులు

"విద్వత్పుండరీకములు"(60వచ.5ఆ.) గోవర్ధనధారి "అద్రిభృత్" (65ప.5ఆ.) అనేకపాపముల సమూహములు "నానాంహోవిసరములు" (74ప.5ఆ.) పాపహరము "ఏనోహరము".(167ప.5ఆ.) అగస్త్యుడు "ఘటజమగు తేజము" (159ప.2ఆ.,168ప.5ఆ.) లతామతల్లులు"లతామతల్లులు" (255ప.5ఆ.) ఆవు "మాహేయి" (241ప.5ఆ.) స్వర్గము "అనంతఫలాయతనము", (192ప.5ఆ.) ఫలోదయము(265వచ.5ఆ.). కప్ప. "వరుణదంతావళము". (310ప.5ఆ.) ఇవి ప్రసిద్ధపదములకు అపూర్వపర్యాయపదసృష్టులు. అప్రయుక్తపూర్వములు.

రామకృష్ణుని అత్యపూర్వమైన పదప్రయోగము "కరపత్రము".

"కరపత్ర మిడవచ్చుఁ గల గాంచునపుడైనఁ
గోరికఁ బరకాంతఁ గోరఁ డనుచు" 63ప.1ఆ.

ఇది "సర్టిఫికేట్" అను ఇంగ్లీషు పదమునకు సరియైన తెనుగుపదము. శ్రీనాథుడు ప్రవేశపెట్టిన పాణింధమపదబంధము పాండురంగమాహాత్మ్యమునందు బహుధా ప్రయుక్తము. "బహుసంకుమదపాణింధమంబైన" (10ప.3ఆ.)"అశేషకళాకలాపపాణింధమస్వరభాస్వరంబగు" (179ప.3ఆ.) "అలరు వేణిపాణింధమంబై" (202ప.3ఆ.) ఇది ఉద్భటారాధ్యచరిత్రమునందును ప్రయుక్తము.

" వేదండముఖతడాగోదితపద్మసౌ
గంధికగంధపాణింధమంబు" 14ప.1ఆ.

ఇది ఘటికాచలమాహాత్మ్యమునందు ఘటితము కాలేదు. కాని శ్రీనాథుడు ప్రవేశపెట్టిన ప్రౌఢిమశబ్దము ప్రయుక్తము. "ఉజ్జ్వలవాక్ప్రౌఢిమ" (238ప.2ఆ.)

రామకృష్ణుని మురారిపదచింతనము పాండురంగమాహాత్మ్యమునందు కలదు. అది తత్తాదృక్పదప్రయోగము. "తత్తాదృక్తుండరుచి" (8ప.1ఆ.) "తత్తాదృగ్విభవప్రభావనిధి(78ప.1ఆ.) "తత్తాదృజ్మదజృంభమాణతరుణీతారుణ్య"- (4ప.4ఆ.)

పదగుంభనము కావ్యరీతికి ప్రాతిపదిక. మాధుర్యగుణము కలది వైదర్భీరీతి. ప్రసాదగుణము కలది పాంచాలీరీతి. ఓజోగుణము కలది గౌడీరీతి. వైదర్భీతికి ఉదాహరణములు:

" సకలము భద్రమయ్యె గుణసాగర! నాకుఁ గొఱంత లేదు ని
న్నొక్క పని వేఁడు కోర్కి నిటు కొయ్యన వచ్చితిఁ బ్రొద్దువోయె నేఁ

టికి నిది యెంతయేనియుఁ గడింది ప్రయత్నము విన్నవింతు మీ
కకుటిలబుద్ధి రేపకడ నంతయు విస్తరవాక్యపద్ధతిన్." 44ఉ.2ఆ.ఉ.చ.
" గంగాసంగము మెచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే యమునతో నానందముం బొందునే!
రంగత్తుంగతరంగహస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించె నేని గుణభద్రా! తుంగభద్రానదీ!
139ప.1.ఆ.పాం.మా.

" కలువకటారి యా చెలువగా దలసంపఁగి తూఁపు గాదు మే
ల్తళుకుల బిత్తరంపుఁ దమి తమ్మిమెఱుంగుల నోజ కాదు క్రొం
దలిరున రాజి కాదు జిగిఁ దార్కొను గేదఁగి చిక్కటారు కా
దలరుల వింటివానికిఁ బ్రియంబగు మోహనబాణ మెన్నగన్."
పాంచాలీరీతికి ఉదాహరణములు:
జలరుహగంధి! నీ వదనసన్నిధి పెన్నిధి. నీ మనోహరా
త్యలసకటాక్షవీక్షణవిహారము హారము. నీ సుధామిళ
త్కలమృదువాక్యవైఖరుల గర్వము పర్వము. నీ కపోలని
స్తులకళ చెల్మి కల్మి. యయి తోఁ చెడు నాకిఁ క నెన్ని రీతులన్."
"పాఁడియుఁ బంటయుం గలిగి పంకవిహీనమనోహరాంబువుల్
వేఁడిన చోటనెల్లఁ బ్రభవింపఁగ భానుఁడు శీతభానుఁడున్
గాఁడిన మేఘకాళిమవికారము దూరము సేయ నెంతయున్
నాఁడెము చూపె శారదదినంబులు నిర్మలమౌక్తికాకృతిన్."
"ఇనుఁ డత్యుత్కటతేజుఁడై మెలఁగి ధూయిష్ఠానురాగంబునం
దనుఁ జేరం జనుదేరఁగా నపరదిక్తన్విశిరోరత్నమె
త్తిన నీరాజనమో యనం దదనుషక్తిం బుట్టు రాగమ్ము త
త్కనదాశాసతి మేన బల్విరిసె నాఁ గన్పట్టె సాంధ్యద్యుతుల్."

గౌడీరీతికి ఉదాహరణములు:

" స్నిగ్ధాష్టాపదకుంభదీప్తి రవి నాశ్లేషింప శుభ్రాంబుద
స్రగ్ధావళ్యముఁ గేలిఁ బెట్టు శిఖరప్రాంశుచ్ఛటాశోభలన్
దుగ్ధాంభోవిధి దీటుకొల్పఁ గ సుధాంధోనాథకోదండస
మ్యగ్ధామాశ్రయతోరణద్యుతులు నేత్రానందముం జూపఁ గన్." 4ప.3ఆ.ఉ.చ.
" భ్రుకుటీభీషణఫాలభాగుఁ డు తనుప్రోద్భూతఘర్మాంబుబిం

దుకుఁ డుప్ బ్రస్ఫుటదోషపల్లవుఁ డు చేతోభీతికృల్లోలతా
రకఘూర్ణన్నయనుండు గాక శమసారస్మేరుండయ్యెం దప
స్వికులగ్రామణి చిచ్చు చంద్రుపొడవై చెన్నొందు చందంబునన్."
" వీక్షామాత్రఫలప్రదంబయిన యావిక్ష్వావనాఖ్యాతపు
ణ్యక్షేత్రంబున శాలిహోత్రమునిహర్యక్షంబు రక్షింపు ప్ర
త్యక్షంబై నిటలేక్షణుండు నుతిసేయన్ వీరకోటీరథా
ధ్యక్షుండై తగు వీరరాఘవు సమిత్కాండోల్లసల్లాఘవున్." 66ప.1ఆ.ఘు.మా.

పూర్వోదాహృతమైన "కందర్పాస్త్రములంచు" అను పద్యము ధ్వనికి ఉదా హరణము.

దొండపండు వంటి పెదవులు కల స్త్రీలు ఆకర్షింతురు. పూవుల వలె మృదువుగ ఉందురు. మెఱుపుదీగల వలె మెఱిసిపోవుదురు. అమృతమును కురిపింతురు. బంగారుతీగల వలె ప్రకాశింతురు. కనుక ఆనందము కలుగునని వాచ్యార్థము. ఇది ప్రశంస. దొండపండు బుద్ధిమాంద్యము కలిగించున . దొండపండు వంటి పెదవులు కల స్త్రీలును బుద్ధిమాంద్యమును కలిగింతురు. పూవుల వలె కొంతసేపటికి వాడిపోయి మార్దవము కోల్పోవుదురు. మెఱుపుదీగల వలె వెనువెంటనే అంతరింతురు. సున్నమును కురిపింతురు. ఉమ్మెత్తలతల వలె తల దిమ్మెక్కింతురు. కనుక ఆనందము కాదు; ఆనందాభాసము. భాసితచిదానందము కాదు అని వ్యంగ్యార్థము. ఇది నింద.

" సారథి ఛాందసుండు బడి సాగదు చక్రయుగంబు ప్రాత పం
చారపు గుఱ్ఱముల్ రథియు శౌర్యమునం దఱమాని సాత్మవి
స్తారము ఖండఖండములు తానఁట మా సరియంచుఁ దత్పురిం
దేరులు నవ్వ శంకరుని తేరిని గేతనకింకిణీధ్వనిన్." 115ప.1ఆ.పాం.మా.

సారథి వేదజడుడు. సారథ్యనైపుణి లేని వాడు. చక్రయుగము క్రమముగా సాగదు. ఎగుడు దిగుడు. గుఱ్ఱములు ప్రాతపంచారములు = మార్పులేని నడకలు కలవి. రథి పరాక్రమమునందు అర్ధపురుషుడు. పూర్తిపౌరుషము లేదు. తన స్వరూపము ఖండఖండములు. రథము శతాంగము. అని సామాన్యార్థము. సారథి బ్రహ్మ. చక్రయుగము. సూర్యచంద్రులు. గుఱ్ఱములు వేదములు. రథి అర్ధనారీశ్వరుడు. రథము బహుఖండమండితమైన భూమి. అని విశేషార్థము. ఇట్లు అర్థాంతరస్ఫూర్తి అప్రయత్నసిద్ధము. భట్టుమూర్తి శ్లేష ప్రభావము కలదు.

" అమృతభుగాస్పదంబు విశదాప్సరమున్ నవపారిజాతము
ఖ్యమహిజరాజిరాజిత మనంతఫలాయతనంబు నిత్యర
మ్యము నగు నొక్క యాశ్రమము హైమనగోపరిసీమ నుల్లసి
ల్లు మదధివాసమై. మదము లోభము క్రోధము మొల్వ దచ్చటన్."

ఇందు వృద్ధబ్రాహ్మణవేషధారి ఇంద్రుడను విషయము శ్లేషగర్భితము. స్వచ్ఛమైన జలముతో కూడినది ఆశ్రమము. అప్సరలతో కూడినది స్వర్గము. అనంతమైన ఫలములకు ఆశ్రయమైనది ఆశ్రమము. అనంతమైన స్వర్గము అనంతఫలాయతనము. పారిజాతాదివృక్షములు కలది ఆశ్రమము. కల్పవృక్షములు కలది స్వర్గము. ఇట్లు ఆశ్రమమునకు, స్వర్గమునకు అర్థద్వయము. శ్లేష.

ఉద్భటారాధ్యచరిత్రములోని కవితాసరణి పాండురంగమాహాత్మ్యమునందు కలదు.

" కవులున్ బాఠకులున్ బ్రధానులు సుధీగణ్యుల్ పురాణజ్ఞులున్
వివిధార్థుల్ సఖులున్ బురోహితులు నుర్వీనాథులున్ జోస్యులున్
ధవళాక్షుల్ గొలువంగ నిండుకొలువై దైవారు హర్షంబుతో
నవధానంబున నుండి శంకరకథావ్యాసక్తి భాసిల్లుచున్." 23ప.1ఆ.ఉ.చ.
" కవులుం బాఠకులున్ బ్రధానులు నలంకారజ్ఞులుం బ్రాజ్ఞులున్
ధవళాక్షుల్ భజియింప నిండుకొలువై తారేందుతారావళీ
ధవళంబైన సువర్ణకుంభయుతసౌధంబందు నాస్థానమై
వివిధామ్నాయపురాణగుంభనకథల్వించున్ బ్రమోదంబునన్."
"... ... పెక్కు లుపవాసములున్ మఱి పెక్కు లుప్పిండుల్
ధృతి నొనరించి మింటిదెయ్యముల నేలకుఁ దెచ్చి కుమారుఁ గాంచెఁ ద
త్సతి ... ... రగుఁ జామ పతివ్రత సంతసంబునన్." 115ప.2ఆ.ఉ.చ.
" ఆ మహీసురు లేమకు నతులనిష్ఠ
నింగివేల్పుల నేలకు, నేలవేల్పు
కొలము నింగికిఁ దెచ్చుచుఁ గొలువఁ బుత్త్రుఁ
డొక్కఁ డుదయించెఁ దత్కృపాభ్యుదయమహిమ.5ప.3ఆ.పాం.మా.
" మానితలీల సజ్జనుని మాడ్కి మహీసురుఁ డప్పురంబులో
మానవపంక్తితోఁ గలసి మచ్చికయై తలలోని నాల్కయై
ధీనిధి యాతఁ డే యనఁ గ దేఁకువఁ దేజముఁ గాంచియుండెఁ బెం

పూనఁ గఁ గొన్ని వాసరము ... ... ..." తటన్." 141ప.2ఆ.ఉ.చ.
" తలలోపలి నాలుక పూ
సలలో దారంబు పొలఁ జల్లిన నీరుం
బలె వెలి యొఱఁగక మనసులు
గలసి యభేదమునఁ గాపు కడ నతఁ డుండెన్." 60ప.3ఆ.పాం.మా.

ఉద్భటారాధ్యచరిత్రములోని కవితాసరణి ఘటికాచలమాహాత్మ్యమునందును కలదు.

" అచలసుతాభర్త కర్పించి మఱి కాని
మృగములు లేఁ బూరి మేయ వచటు
అసమలోచనునకు నర్పించి మఱి కాని
యళులు క్రొవ్విరితేనె లాన వచటు
అంధకధ్వంసికి నర్పించి మఱి కాని
కోయిల లిగురాకుఁ గొఱుక వచటు
అంగజారాతికి నర్పించి మఱి కాని
చిలుకలు పండ్లు భుజింప వచటు
తక్కఁ గల జంతువులు శంభుఁ దలఁచి కాని
యుచితవర్తనములఁ గోరి యుండవచటు
వదనములు వేయుఁ గలయంత వానికైన
నా యరణ్యంబుఁ గొనియాడ నలవి యగునె." 54ప.1ఆ.ఉ.చ.
" మొకరితేఁ టులు మూతి మొట్టవు తేనియల్
శ్రీమధుశాసి కర్పించి గాని
కోకిలమ్ములు చిగురాకులు గొఱుకవు
శ్రీవనమాలి కర్పించి గాని
లేఁ బచ్చికల్ గబళింపవు హరిణముల్
శ్రీనీలమూర్తి కర్పించి గాని
ఫలభుజిక్రియ్యలకుఁ జిలుకలు దలఁ పవు
శ్రీమాధవునకు నర్పించి గాని
యితరజంతువులును హరి మతిఁ దలంచి
గాని యే వర్తనములకుఁ బూన వనిన
నా తపోవనమాహాత్మ్య మభినుతింప

నలవియే వేమొగమ్ముల చిలువకైన." 13ప.1ఆ.ఘ.మా.
" వలదింద్రోపలఖండదీధితుల లేవల్ కంఠహాలాహలం
బులు సున్నంబులు భూతి వెల్లపదగల్ మూర్ధస్థితస్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరు సతుల్ సాఁబాలు మైఁగొన్న యా
యలరుంబోడుల యొప్పునై తగుఁ బురిన్ హర్మ్యేశ్వరశ్రేణికిన్." ఉ.చ.
" వలభింద్రోపలఖండదీధితుల లేవల్ కంఠహాలాహలం
బులు సున్నంబు విభూతి వెల్లపడగల్ మూర్ధస్థితస్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరు సతుల్ సాఁబాలు మైఁగొన్న యా
యలరుంబోడుల యొప్పునై తగుఁ బురిన్ హర్మ్యేశ్వరశ్రేణికిన్." ఘ.మా.
" మొదలఁ బురందరాశఁ దగ ముట్టితి రాగముతోడం బద్మినిన్
బిదపఁ జమత్కరించితివి వేడ్కఁ గరంబులు సాఁచి యింక నన్
బొదువకు మంచు దూఱుచు నపూర్వదిశాంగన కాలఁ దాఁచినన్
దదమితయావకద్రవముఁ దాల్చెను నా నినుఁ డొప్పె రక్తిమన్." ఉ.చ.
" మొదలఁ బూర్వాశఁ జెందితి పిదపఁ బద్మి
నికినిఁ గరములు సాఁచితి విఁకను దొలఁగు
మనియ పూర్వాశ కాలఁ దాఁచినఁ దదంఘ్రి
యావమున రాగ మిగురొత్తె నర్కుఁడేన." 139ప.2ఆ.ఘ.మా.

పాండురంగమాహాత్మ్యములోని కవితాసరణియు ఘటికాచలమాహాత్మ్యము నందు కలదు.

" చతురసమ్మార్జనాచరణంబు దొలునాఁటి
ప్రాఁచి వన్నియ త్రోపువడుట గాఁగ
గోమయగోముఖశ్రీ ముంగిలు ఘటించు
టలు సుఖమజ్జనకలన గాఁగ" 148ప.4ఆ.పాం.మా.
" వఱువాత లేచి యా బుధ
వరు వరవుడుఁ బోల్పఁ దగిన వారెవరన శ్రీ
వరుఁ గీర్తింపుచు వాకిలి
వరుసన్ ముంగిళ్లు దుడిచి వారని భక్తిన్." 21.
గోమయగోముఖకలన
శ్రీ మెఱయఁగఁ బంచవర్ణరీతుల ముగ్గుల్
ప్రేమ నలుగడల నించన్

వేమరు తరుణీజనంబు విస్మయ మందఁగ్." 22ప.2ఆ.ఘ.మా.

# ఆత్మీయత

రామలింగయ గురించి ఉద్భటారాధ్యచరిత్రమునందు ఉన్న విషయమిది :

" కౌండిన్యమునిరాజమండలేశ్వరవంశ
పాథోధినవసుధాభానుమూర్తి
పాలగుమ్మేలేశపదపయోజద్వయీ
ధ్యానధారణసముదాత్తచిత్తు
మానితాయాతయామా ... భావిత
విపులమహాయజుర్వేదవేది
రామేశ్వరస్వామిరమణీయకరుణావి
శేషపోషితవిలసితసమగ్ర
సహజసాహిత్యమాధురీసంయుతాత్మ
లక్కమాంబకు ఘనయశోలక్ష్మివెలయు
రామధీమణికిని బుత్రు రామలింగ
నామవిఖ్యాతుఁ గావ్యనిర్ణయధురీణు." 24ప.1ఆ.
" శ్రీమదేలేశ్వరగురువరేణ్యచరణారవిందషట్చరణ
సకలకళాభరణ రామనార్యసుపుత్ర సుకవిజనమిత్ర కుమార
భారతిబిరుదాభిరామ రామలింగయ- "ఆశ్వాసాంతగద్య.

పాలగుమ్మేలేశుడే ఏలేశ్వరగురువరేణ్యుడు. అతడు శైవగురువు. విపులమహాయ జుర్వేదవేది అన మొత్తము యజుర్వేదము తెలిసిన వాడు. యజుర్వేదము ద్వివిధము. 1. శుక్లయజుర్వేదము. 2. కృష్ణయజుర్వేదము. ఉభయయజుర్వేది "విపులమహాయ జుర్వేదవేది" అగును. రామేశ్వరస్వామి రాముడు ప్రతిష్ఠించిన శివుడు. రామలింగేశ్వరుడు. రామేశ్వరకరుణావిశేషము కలవాడు. రామేశ్వరభక్తుడు. శివభక్తుడు శైవుడగుట నిరాఘాటము.

రామకృష్ణుని గురించి పాండురంగమాహాత్మ్యమునందు ఉన్న విషయమిది:

" తగ సంస్కృతము తెనుఁ గుఁ గఁ జేయఁ దెనుఁ గు సం
స్కృతముగఁ జేయంగఁ జతురమతివి

నలుదెఱంగుల నెన్నఁగల కావ్యధారల
ఘనుఁడ వాళువునందుఁ గరము మేటి
వఖిలభూమిపాలకాస్థానకమలాక
రోదయతరుణసూర్యోదయుఁడవు
శైవవైష్ణవపురాణావళి నానార్థ
రచనాపటిష్ఠ కరమ్యమతివి
ఆంధ్రభూమీకుచాగ్రహారాభమైన
శ్రీతెనాల్యగ్రహారనిర్ణేత వగ్ర
శాఖికాకోకిలమ వీవు సరసకవివి
రమ్యగుణకృష్ణ! రామయరామకృష్ణ . 23.
కౌండిన్యసగోత్రుఁడ వా
ఖండలగురునిభుఁడ వఖిలకావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ
మండలవినుతుఁడవు లక్ష్మమావరతనయా" 24ప.1ఆ.
"శ్రీమత్పరమపదనాథవిరవధికకృపాపరిపాకపరిచిత
సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ-" ఆశ్వాసాంతగద్య.

రామకృష్ణుడు తెనాల్యగ్రహారనిర్ణేత. తెనాలి జన్మస్థలమగును. తెనాలియందు రామలింగేశ్వరాలయము కలదు. రామలింగయ పేరు తద్దైవనామము. అది శైవనామము అగును. అగ్రశాఖికోకిలమన ప్రథమశాఖనియోగి. శుక్లయజుర్వేదము ప్రథమ శాఖ. ప్రథమశాఖనియోగులు స్మార్తులు. అనగా స్మృత్యనుసారులు. స్మార్తులకు శివకేశవులు సమానము. కనుక శివభక్తుడైన రామలింగయ ఆరాధ్యశైవు డయినను. అసలు స్మార్తుడు కావున వైష్ణవుడును కావచ్చును. రామకృష్ణనామము వైష్ణవ నామము. రామకృష్ణని గురుస్తుతి పాండురంగ మాహాత్మ్యమునందు ఇట్లు కలదు.

"వాక్కాంతాశ్రయుభట్టరు
చిక్కాచార్యులమహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తిభజించెద
నిక్కావ్యకళాకలాపమీడేఱుటకున్". 17ప.1ఆ.

భటరు చిక్కాచార్యులు వైష్ణవగురువు. శైవగురువు. వైష్ణవగురువు విద్యాగురువులు †49 కారు. మతగురువులే.

ఉద్భటారాధ్యచరిత్రమునందు ఆరాధ్యశైవము ఉద్ధృతముగ కలదని పూర్వోక్త ము. రామలింగయ ఇష్టదేవతాస్తుతియందు విష్ణుస్తుతి (3ప.1ఆ.) లక్ష్మీస్తుతి(8ప.1ఆ.) కలవు. గ్రంథమునందు విష్ణుస్మృతి కలదు.(157ప.1ఆ;59ప.3ఆ.) కాని శివకేశవ సమభావము లేదు. శివాధిక్యమే కలదు. ఆరాధ్యశైవమునందు విష్ణ్వాదులు శివభక్తులు మాత్రమే.

హరిలీలావిలాసపద్యములందు పార్వతీపరమేశ్వరుల ద్యూతక్రీడ కలదు.(121ప .4ఆ.(ప్ర.ర.) శివాధిక్యము లేదు.

పాండురంగమాహాత్మ్యములోని కృత్యాదిపద్యము పాండురంగమాహాత్మ్యము నందు ప్రతిపాదితమైన వైష్ణవమునకు దిక్సూచిగ కలదు.

"శ్రీకాంతమణిఁ గన్నొమిఱంగి మది ధాత్రిన్ మంచినన్ దద్రుచి
శ్రీకాదంబిని మీఁది కుబ్బె ననఁగా శ్రీవత్సముం దాల్చి ము
ల్లోకంబుల్ పొదలించు కృష్ణుఁడు దయాళుం డేలు శ్రీవైష్ణవ
స్వీకారార్హు విరూరిపట్టణపతిన్ వేదాద్రిమంత్రీశ్వరున్." 1ప.1ఆ.

ఇందు శ్రీదేవి. భూదేవి. శ్రీవత్సము ప్రసక్తమైనను విష్ణువు అని లేదు. కృష్ణుడు అని కలదు. కృష్ణుడు విష్ణ్వవతారము కాదు. విష్ణువే. అంతేకాదు. ఈకృష్ణుడు దయాళుడు. పౌండరీకక్షేత్రదైవమైన పాండురంగడు లేదా విఠ్ఠలుడు లేదా పాండురంగ విఠ్ఠలనాథుడు కృష్ణుడే.

తెనాలి రామకృష్ణుని ఇష్టదేవతాస్తుతియందు విష్ణువైన కృష్ణస్తుతి తోపాటు. లక్ష్మి.బ్రహ్మ.సరస్వతీ.శివ.పార్వతీవిష్వక్సేన.గరుడ.అనంతస్తుతులు కలవు. శ్రీకృష్ణదేవ రాయల ఇష్టదేవతాస్తుతియందు వలె ఆళ్వారుల స్తుతి లేదు. శంఖచక్రగదా శార్ఙ్గ నందకస్తుతులు లేవు. ఇది రాయల వైష్ణవమునకు. రామకృష్ణుని వైష్ణవమునకు భేదమును సూచించును. శివస్తుతియందు శివుడు కామితార్థము లొసగు కల్పవృక్షము మాత్రమే. పార్వతీస్తుతియందు పార్వతి "చిద్రసవేదియో కొదమచిల్కకు విష్ణు సహస్రనామముల్ ముద్రతి" నేర్పును. కావున " విరూరి మంత్రి వేదాద్రికి విష్ణుభక్తి ను హిమాతిశయం బనయంబు నీవుతన్ " ఇది శివకేశవసమభావము కాదు. శివస్తుతి యందు నిగూఢముగ. పార్వతీస్తుతియందు ప్రగాఢముగ విష్ణ్వాధిక్యము కలదు. విష్ణువన కృష్ణుడే.

ఉద్భటారాధ్యచరిత్రమునందు కాశికాపురవర్ణనము సమారు ఏబది

పద్యములందు కలదు. (71-107;279-289ప.2ఆ.) అన్నీ పద్యములును క్షేత్రవర్ణనములే. అందు విష్ణుప్రసక్తి లేదు. పాండురంగమాహాత్మ్యమునందును కాశికాపురవర్ణనము ఇరువది యొక్క పద్యములందు కలదు. (99-119ప.1ఆ.) అందు పదునాఱు పద్యములు ప్రతిపురసాధారణవర్ణనములే. అయిదు పద్యములే క్షేత్రవర్ణనవము. అందు విష్ణుప్రాధాన్యము కలదు.

"ఆనందకాననంబున
నా నందకపాణి కేశవాహ్వయమునఁ బెం
పౌనం దగు ముక్తిప్రమ
దానందితహారనీలతరళోపముఁ డై." 102ప.1ఆ.

కేశవుని ప్రసక్తి సంస్కృతాంధ్రకాశీఖండములందు కలదుగాని, విశ్వేశ్వరుని వలె ముక్తికాంతను సంతోషపెట్టిన అతిశయము కలవాడని లేదు.

పాండురంగమాహాత్మ్యములోని ఉమామహేశ్వరసంవాదమునకు వక్త శివుడు. ప్రధానశ్రోత పార్వతి. సహశ్రోతలు కుమారస్వామి. అగస్త్యాదులు. కుమారస్వామి శివకుమారుడు. అగస్త్యుడు పరమశైవోత్తంసుడు. (128ప.1ఆ.) ఈ సంపుటియే విష్ణ్వాధిక్యమునకు వ్యంజకము. శివుడు విష్ణుభక్తుడు. అనగా కృష్ణభక్తుడు.

"ఆ యదుభర్త నా హలధరానుజు నా నవనీతచోరు నేఁ
బాయని భక్తితోఁ గొలుతుఁ బ్రత్యహమున్ గృహదైవతంబుగా
నో యరవిందకోరకసహోదరచారుపయోధరాఢ్య! ని
శ్శ్రేయసకాంక్షఁ దక్కొరులు చేరి భజింతు రనంగ నేటికిన్." 81ప.2ఆ.)

అని శివుడు పార్వతికి తెలిపెను. ఆ యదుభర్త, ఆ హలధరానుజుడు, ఆ నవనీతచోరుడు పౌండరీకక్షేత్రమునందు వెలసిన కృష్ణుడు. కృష్ణుడే పాండురంగడు. కృష్ణుడే విఠ్ఠలుడు. కృష్ణుడే పాండురంగవిఠ్ఠలనాథుడు. కృష్ణుడే పరమపదనాథుడు. (114ప.2ఆ.)

అసలు పౌండరీకక్షేత్రము ఏర్పడుటకు, అచట పాండురంగవిఠ్ఠలనాథుడు వెలయుటకు మూలకారకుడు పుండరీకమహాముని. అతడు "నిగమఘంటాపథైకాధ్వనీనబుద్ధి. బ్రహ్మవిద్యానవద్యుడు. (6ప.2ఆ.) "అంబుజోదరచరణారవిందసతతస్మృతిలోలుపయయ్యైన బుద్ధియున్ బరిణతిఁ గాంచిన వాడు. (7ప.2ఆ.) యోగమార్గి. (8ప.2ఆ.) మంత్రముల, హఠరాజయోగముల మర్మమెఱిగి.

హృదయపద్మగాఢపరిమళమునకు తుమ్మెదలైన కృష్ణుని కంటె ఇతరమును చూడని. నిశ్చలమైన స్నిగ్ధమైన ధ్యానమున. లోన శిరస్సు నుండి జాఱు అమృతము శ్రమ లేకుండ జేయ పరవశించువాడు. (9ప.2ఆ.) అమృతస్యందనము ఖేచరీముద్ర ఫలము- హఠ.రాజయోగములు. ఖేచరీముద్ర నాథసంప్రదాయమునకు సంబంధించినవి. నాథసంప్రదాయము శైవమునందు మాత్రమేగాక. ప్రాక్పశ్చిమోత్తరభారతదేశమునందు వైష్ణవమునందును కలదు. 150 పుండరీకుని ధ్యాతవ్యుడు కృష్ణుడు.

"మును మీనగుటఁ బట్టి మునులు వైచిన బత్తి
వలఁ బోలెఁ జిక్క మౌదలఁ దలిర్ప
వెలితిగాఁ జవిగొన్న వెన్నముద్దయుఁ బోలె
శంఖంబు వామహస్తమునఁ దనర
జగదండవహకాలచక్రభ్రమణహేతు
దండమై నిజధేనుదండ మమర
నంచిఁ బట్టిన పద్మజాతాండముల లీల
వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల
కలయఁ బూచిన కల్పవృక్షంబు చాయ
సరసనవపుష్పమాలికాభరసమగ్ర
విగ్రహముతోడ విలసిల్లు విప్రునెదుట
మందప్రోయాంధ్ర కూరిమి మ్రానిపండు." 14ప.2ఆ.)

పుండరీకుడు తండ్రి "విష్ణుసహస్రనామపాఠమొనరించు తఱిఁ దోడుప"డినను జనకు నానతి శిరమునఁ దాల్చి .... చక్రహస్తార్చనమున కుపక్రమించినను (20ప.2ఆ.) తిరువారాధనము చేసినను (21-24ప.2ఆ.). తల్లిదండ్రుల అనంతరము తనయులను గాంచి. "శేషఫణిశయనుఁ గను నఖిలాషోన్నతి"ని తపము చేయ(26-28ప.2ఆ.) "హృద్రాగసమగ్రగోపవనితాజనతాపరిరంభసంభ్రమోద్యోగకళాప్రవర్తికి ఉల్లము వెన్నవలె కరగెను."(30ప.2ఆ.) వెంటనే.

"యతిమనోగృహదీపికాంకూరమగు లీల
గోవర్ధనాచలగుహ మెలఁగుచు
గిరికూటతటరటత్కేకిరాజమురీతి
రాధ చన్గవ మీఁద వ్రాలి నగుచుఁ

జిత్రాభ్రముల నేలు సుత్రాము కైవడి
పలువన్నె యాలమందల మెలఁ పుచు
కమలకాననమధ్యకలహంసవిభు భాతిఁ
గూర్మినెచ్చెలిపిండుఁ గొని చెలఁగుచుఁ
జంద్రబింబంబునకు మృదుస్వనము గఱపు
రచనసంజ్ఞార్థశంఖ మూఁదుచు నొనర్చు
నాట లన్నియుఁ జాలించి యరిగెం
దపసి పర్ణశాలకు దేవకీతర్ణకంబు." 31ప.2ఆ.)

ఇందు రాధ ఇతోధికవిశేషము. పుండరీకుడు చూచిన కృష్ణుని విశాలనేత్ర ములు "రాధికాహృదయతోయజకోరకబోధనక్రియా తరుణతరార్కరుగ్విల సితస్ఫుటరక్తిమసక్తకోణభాస్వరములు." (44ప.2ఆ.) అంతేకాదు. శౌరి "ఉద్వేలాలోలకృపాజపాప్రసవకాంతిభ్రాంతికృల్లోచనాబ్జాళిందాశ్రితరాధికాసురతరాగాంకూరుఁ డు." (186ప.4ఆ.) పాండురంగమాహాత్మ్యమునందు కృష్ణచరిత్రము (177-178ప.3ఆ.) రాధ చరిత్రము (179-204 ప.3ఆ;3-45వచ.4ఆ.) కలవు. బృందావనమును కలదు. (178ప.3ఆ.)

శివనారదసంవాదములోని పుండరీకుని యోగమార్గము (47-50;69-76ప.4ఆ.) నాథసంప్రదాయసరణియే. ముద్ర ఖేచరీముద్రయే. ధ్యాతవ్యుండు కృష్ణుడే. పుండరీకుడు "గోవిందపదాబ్జార్చారసపాకవిధుడు. అనర్చితతదితరుడు. (55ప.4ఆ.) అతడు పరితపించినది కృష్ణుని గుఱించియే. (64ప.4ఆ.) ప్రత్యక్షమైనది కృష్ణుడే.(77వచ.4ఆ.) పుండరీకుడు "విష్ణు నిజభక్తవర్ధిష్ణుఁ గృష్ణుఁ గాంచి పఱచి"న. "ఘక్కునవ్విన"ది దేవకీసుతుడే. (79,80ప.4ఆ.) అతడే పాండురంగడు. విట్ఠలుడు. పాండురంగవిట్ఠల నాథుడు. పరమపదనాథుడు.

పౌండరీకక్షేత్రమునందు "పువ్విలుతు తండ్రి ... మువ్వంకమురువున మురళి మ్రోయిం"చిన చిహ్నము కలదు. (22ప.5ఆ.) రాసలీల కలదు.

"సురలీలావతులున్ నరాంగనలు చక్షుశ్శ్రోత్రకన్యల్ స్మర
జ్వరపీడాశయలై తముం గొలువ రాసక్రీడఁ బెన్ ప్రోడయై
కరలీనోర్మికలంగుళీచలనరింఖత్కాంతులైక్రాలఁ గా

మురళీనాదవినోదకేళిఁ దవిలెన్ మోదంబ సాదంబుగన్." 139ప.4ఆ.)

పుండరీకచరితములు రెండిట దశావతారస్తోత్రములు కలవు. అందు

కృష్ణావతారము లేదు. కారణము పాండురంగమాహాత్మ్యములోని కృష్ణుడు విష్ణువు అవతారము కాదు. విష్ణువే. విష్ణువే అయిన కృష్ణుడే బ్రహ్మము. పరబ్రహ్మము.

"పాండురంగండు సాకృతిబ్రహ్మలీల
నిలిచియున్నాఁడు భువనవర్ణితవిభూతి" 3ప.2ఆ.
"పౌండరీకపతి సాక్షాద్బ్రహ్మముం గొల్చి" 94ప.5ఆ.

పరబ్రహ్మమైన కృష్ణుడు "సచ్చిదానందకందము." (299వచ.4ఆ.) "మాయామానుషమూర్తి" (173ప.3ఆ.) "శాంబరీమానుషవేషధారి." (112ప.4ఆ.) " ఆత్ముడు మాయావృతుడు" (34ప.2ఆ.) జీవపురుషుడు మాయాశబలితుడు.(45వచ.4ఆ.) పౌండరీకపతి కృష్ణుడే " అఖిలజగము బ్రహ్మయై సృజియించుఁ బద్మాక్షుండై ప్రోచు మదనారియై త్రుంచు"ను. (90ప.5ఆ.) ప్రపంచము వ్యావహారికసత్యము. కాని యాథార్థ్యభూమికను అభినయించును.

"వ్యావహారికసత్యంబు ప్రకటించు ప్రపంచంబుచేత వంచితులగు
నెఱుక లేని కఱటుల కరణి హరిణంబులు మరీచికావీచికాపానవివ
శంబులై దిశలం బరిభ్రమించె" 16వచ.4ఆ.

చిలుక పరబ్రహ్మంబు చాడ్పున నగోచరంబయ్యెను దదీయ మాయా
విలసితం బునె సకలంబను నిజప్రతిభాసంబున యాథార్థ్య
భూమికఁ నభినయించును. 237 వ.చ.4ఆ.

మోక్షము పరమపదము. (129ప.271ప.4ఆ.) తత్త్వపదము (127ప.4ఆ.) విష్ణుపదము (235వచ.2ఆ.) కైవల్యసిద్ధి (19ప.5ఆ.) పునర్జన్మరాహిత్యము(155 ప.2ఆ; 277ప.4ఆ.) విష్ణుక్షేత్రమునందు మరణించినవాడు హరి అగును.(63ప.5ఆ.) మోక్షము చతుర్విధము.

"లోకేశస్థితలోకవాసకృతి సాలోక్యంబు నర్చింప. ల
క్ష్మీకాంతాంఘ్రియుగంబుఁ జేరు తమి సామీప్యంబు. సద్భక్తర
క్షాకారిం దన రూపుగా నిలుపుటన్ సారూప్యమున్. బుద్ధి నా
కౌకశ్శేఖరుఁ గూర్చి యున్కి నతి సాయుజ్యంబు నొందుం దుదిన్."

ఇందు సతి గోపిక. సాలోక్య.సామీప్య.సారూప్య.సాయుజ్యములు క్రమము.

నిగమశర్మ మోక్షము సాలోక్యము. సామీప్యము. సారూప్యమును.(109-111

ప.3ఆ.) కాకి, హంస, చిలుక, పాము, తేనెటీగ, ఆవుల మోక్షము సాలోక్యము, సామీప్యమును. (137ప.4ఆ.) సుశీల దంపతుల మోక్షము సాలోక్యము. (284ప.4ఆ.) అయుతుని మోక్షమును సాలోక్యము. (316ప.5ఆ.) ఆ లోకము విష్ణుపదము. పరమపదము.

శివుడు "దక్కినవిష్ణుభక్తి" కలవాడు. (184ప.2ఆ.)" వైష్ణవసార్వభౌముడు" (186ప.2 ఆ.)" విధికంఠేకాలముఖ్యులు విష్ణువుచేత నిత్యస్ఫూర్తిసనాథులు". (93ప.4ఆ.) శివనారద సంవాదములోని పుండరీకుడు" వైష్ణవరత్నము." (65ప.4ఆ.) వైష్ణవుడు అనవధిదురిత ప్రవర్తి అయ్యును అత్యుగ్రనారకవ్యథచేత పొనుగుపడి జడియువాడు చెవులకు వినబడదు. కన్నులకు కనబడదు. (121ప.4ఆ.) శ్రీవైష్ణవులు తృష్ణారహితులు. విష్ణుపదనిష్ణాతలు. నిత్యసత్యనిరతులు. వారిని కొలువవలయును. (205ప.4ఆ.) సుశీల "మానసమునందుఁ బరమవైష్ణవధర్మపాటవంబు" నెలకొల్పెను. (259ప.4ఆ.) సుశీల కుమారులు"గర్భవైష్ణవాగ్రేసరులు." (261ప.4ఆ.) "విష్ణుసేవ గావింపక గలుగదు గతి." (276ప.4ఆ.) విష్ణుభక్తి నిరసించు దురాత్ముల. మోక్షలక్ష్మి చేపడుటకుఁ గాని హీనుల" పాండురంగక్షేత్రములోని కాలభైరవుడు తఱిమివేయును. (289ప.4ఆ.) "పాపావిలదృక్కులకు శ్రీవైష్ణవవరులె దిక్కు (43ప.5ఆ.) యుధిష్ఠిరుడు "పరమవైష్ణవధర్మపరత మెలగు"ను. (44ప.5ఆ.) వైష్ణవులకు మోక్ష మొసగు మంత్రము కలదు. (116ప.5ఆ.) అది :

"స్పర్శాద్యం సత్యనామాద్యం షష్ఠషష్ఠం సదీర్ఘకం,
షష్ఠం షష్ఠాది నత్యంతం సమారం తం విదు ర్బుధాః" 115శ్లో.5ఆ.

స్పర్శాద్యం = మొదటి స్పర్శాక్షరము. కకారము. సత్యనామాద్యం = సత్యము = ఋతములోని మొదటి అక్షరము ఋకారము. క + ఋ = కృ. షష్ఠషష్ఠం = ఆఱవ వర్గములోని ఆఱవ అక్షరము. షకారము. సదీర్ఘకం = ఆ 'ష' దీర్ఘముతో కూడినది. షా. ణకారద్విత్వము ఊహ్యము. ష్ణా. షష్ఠంషష్ఠాది. ఆఱవవర్గము మొదటి అక్షరము య. నత్యంతం = నమః చివఱ గలది. "కృష్ణాయ నమః" ఇది సమారం = సమానములగు దళములు కలది. గరుడవాహనవిష్ణువు దేవతగా కలది. స్వాధిష్ఠానచక్రము కలది. తం = ఆ మంత్రమును, బుధాః = పండితులు, విదుః = తెలిసికొందురు. "కృష్ణాయ నమః" అను మంత్రము మోక్షప్రదము.

విష్ణుభక్తులు భవము గడుచు వారు. (319ప.5ఆ.) "ఆదిమవైష్ణవోత్తములు దుర్దయ భవసాగరోత్తరణ ం ఎకులు." (321ప.5ఆ.) ఇది శిథిలశైవము కాదు. అద్వైతమును 151

కాదు. వైష్ణవమే. ఇందలి తిరువారాధనము నందలి తిరుశబ్దము. తోమాలియ (21ప.2 ఆ.) ఆళ్వారుల. ఆచార్యుల వైష్ణవమును తలపించును. కాని విశిష్టాద్వైతసిద్ధాం తము కానరాదు. శేషశేషిభావము లేదు. శరీరశరీరిభావము లేదు. పులియోర. దధ్యోద నము. చక్కెఱపొంగలిలేవు.

విష్ణువు కృష్ణుడుగ. కృష్ణుడు పరబ్రహ్మముగ. సచ్చిదానందస్వరూపుడుగ. పురుషోత్తముడు జీవపురుషుడు మాయావృత్తులుగ (విదురమైత్రేయసంవాదము) చతుర్విధమోక్షములు భాగవతవైష్ణవమునందు కలవు. భాగవతములోని మాయ శాంకరాద్వైతములోని మాయావాదము కాదు. మాయాశక్తి. వైష్ణవమాయ. రాసలీల భాగవతహేల. (దశమస్కంధము).

రాసలీల తోపాటు రాధాకృష్ణతత్త్వము వల్లభాచార్యుల వైష్ణవమువందు కలదు. వల్లభాచార్యులు తెలుగువాడు. (తైలాంగబ్రాహ్మణుడు). శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు స్మార్తపండితులను ఓడించెను.[152] కాలము ౧౪౭౯౧౫౩౧. ఒక గోపిక కేశపాశము వీడ. నీవి జాఱ కృష్ణుని పాదములుమదినంట" అట్లే ఉండుట పాండురంగమాహాత్మ్యమునందు మాత్రమేగాక. పౌండరీకక్షేత్రమునందును కలదు.(128-132ప.2ఆ.) వల్లభాచార్యుల వైష్ణవమునందు బాలకృష్ణుని పూజకు ప్రాధాన్యము కలదు.[153] పాండురంగవిట్ఠలనాథుడు బాలకృష్ణుడే. "పంచాబ్దంబుల"వాడు. (77వచ.4ఆ;56ప.5ఆ.) దిగంబరుడు కూడ. (34,47ప.2ఆ.) అంతేకాదు. పాండురంగమాహాత్మ్యములోని కృష్ణచరిత్రము బాలకృష్ణచరిత్రమే. వల్లభాచార్యుల వైష్ణవమునకు ప్రమాణములు[154] వేదములు. ఉపనిషత్తులు. భగవద్గీత. భాగవతము.

శంకరుని మాయావాదము. నాథసంప్రదాయము మహారాష్ట్రదేశములోని విట్ఠలసంప్రదాయమునందు కలదు.[155] అది కర్ణాటకదేశమునందు ఆవిర్భవించినను. జ్ఞానదేవ. నామదేవప్రభృతులచే మహారాష్ట్రదేశమునందు ప్రసిద్ధమైనది. జ్ఞానదేవుని అన్న నివృత్తినాథుడు. అతని గురువు గహినీనాథుడు. జ్ఞానదేవుని కృతులు జ్ఞానేశ్వరి. అభంగములును.[156] విట్ఠలసంప్రదాయమునందు బ్రహ్మము పురుషుడు. మాయ ప్రకృతి. శంకరాచార్యుల మాయావాదము మహారాష్ట్రదేశములోని మతప్రవక్త లందఱికిని సమ్మతము. విట్ఠలసంప్రదాయము వైష్ణవము. అది పాండురం గమాహాత్మ్యమునందు ఇతివృత్తోచితము. "తవణింతు నొక్క శ్రీభాగవతచరిత్రంబు" (18ప.1ఆ.) అని ఉపక్రమించి. రామకృష్ణుడు రచించిన పాండురంగమాహాత్మ్యము

శ్రీభాగవతచరిత్రమే. రామకృష్ణునిది వైష్ణవమే.

ఘటికాచలమాహాత్మ్యమునందు నూటయెనిమిది తిరుపతులు కలవు. అందు పౌండరీకక్షేత్రమును కలదు. పాండురంగవిఠ్ఠలనాథుని మూర్తి ప్రస్ఫుటము.

"చిప్ప కూఁకటి రేక నొప్పు నొాఁదల మీఁద
చలిది చిక్కము వింత చెలువుఁ గులుక
వ్రేతల వలపుఁ గొల్చెడు దిస్సమొల హత్తి
గచ్చకాయల తిత్తి అచ్చు సేయ
మువ్వంక మురువుతో మురళి యూదెడు నిండు
సొగసు గోముల చుక్క సొక్కఁ జేయఁ
జిఱుత నవ్వుల డాలు చేనున్న వలమురి
గల మురిపెమునకుఁ గళుకు నింప
భైమి దక్షిణదిక్తటప్రాంతభూమి
సకలదివిజులతోడసాక్షాత్కరించి
పుండరీకుని మనిచిన పాండురంగ
విఠ్ఠలాధీశుఁ గోటిరవిప్రకాశు." 66ప.1అ.

ఇతరక్షేత్రములందు శ్రీరంగము (29ప.) తంజాపురి (31ప.) కుంభఘోణము (35ప.) నాగపట్టణము (45ప.) చిత్రకూటము (46ప.) మన్నారు కోవెల, తిరుమల (50ప.) శ్రీవిల్లిపుత్తూరు (51ప.) కాంచి (57ప.) ఘటికాచలము (62ప.) పురుషోత్తమ స్థానము-పూరీ-(69ప.) ద్వారావతి, వారణాసి, అవంతి, మాయ, మధుర (71ప.) పంచవటి (72ప.1అ.) ప్రసిద్ధములు. నూటయెనిమిది తిరుపతులందును సుమారు నూరు తిరుపతులు తమిళనాడులోనివి. అవి తమిళులైన ఆళ్వారుల, ఆచార్యుల వైష్ణవమునకు ఆటపట్టులు, ఆయువుపట్టులును.

ఘటికాచలమాహాత్మ్యములోని గోవిందశర్మ "శ్రీవైష్ణవధర్మపారదృశ్వుఁ డన ర్చు"ను. (5ప.2అ.) అతనికి కౌండిన్యముని "వైష్ణవాగమకథామర్మార్థము"ను బోధించెను. కౌండిన్యమునియే తరళాహారిశర్మల తనయునికి "సుదర్శనశంఖచిహ్నములఁ బొత్తుఁ జేసి, మంత్రోపదేశంబు" సేసెను.

ఘటికాచలమాహాత్మ్యములోని దశావతారస్తోత్రమునందు, పాండురంగ మాహాత్మ్యములోని దశావతారస్తోత్రములందు వలె కృష్ణావతారము లేదు.

బౌద్ధావతారము కలదు. (253పం.2ఆ.) ఆముక్తమాల్యదలోని దశావతారస్తోత్రము నందు[157] బౌద్ధావతారము కలదు. అది వింత అని ఒక అభిప్రాయము కలదు. కారణము వైష్ణవమతము బౌద్ధమతమును ఖండించుట కావచ్చును. కాని బౌద్ధావతారపద్యములు బౌద్ధమతప్రశంసలు కావు. అంతేకాదు. అవతారబుద్ధుడు. గౌతమబుద్ధుడు భిన్నులనుటకు అమరకోశములోని శ్లోకద్వయము (14,15శ్లో.1కాం.) సాధకము." శ్రీకృష్ణుండు. పురుషుండు. సత్యుండు. నచ్యుతుండును బుద్ధుఁ డనఁ గ" అని ఘటికా చలమాహాత్మ్యమునందు కలదు. (38ప.3ఆ.)

ఘటికాచలక్షేత్రమునందు అర్చకులు వైఖానసులు. వారు వేదశాస్త్రార్థవిదులు. అఖిలమంత్రతంత్రార్థరహస్యవిదులు. (35ప.3ఆ.) పంచవిధబేరపూజాచుంచువులు. (36ప.3ఆ.) "ధ్రువకౌతుకస్నాపనోత్సవబల్యాదు(బల్యంబు?) లివి బేరపంచకంబు" ఆఱవ బేరమును కలదు. అది బాలాలయము. పాంచరాత్రాభిధము (38ప.3ఆ.)సంస్కృత బేరమునకు శరీరమని అర్థము. విగ్రహమని తాత్పర్యము. మూలవిగ్రహము ధ్రువబేర ము. డోలారోహణాదికవినోదములు సేయు విగ్రహము కౌతుకబేరము స్నానము చేయించు విగ్రహము స్నాపనబేరము. ఊరేగించు విగ్రహము ఉత్సవబేరము. బలిహోమాదులు సమర్పించు విగ్రహము బల్యాదిబేరము. మహాసంప్రోక్షణసమ యము నందు అర్చాదికము సేయు ప్రత్యామ్నాయవిగ్రహము 'బాలాయబేరము. పంచబేరార్చనము పాంచరాత్రాగమమునందు వలె వైఖానసాగమమునదును కలదని వ్యక్తమగును.[158] ఇందిరా నృసింహదేవుల నవదివసకల్యాణోత్సవము వైఖానసా చార్యకృతమే. (61ప.3ఆ.)

ఇట్లు ఘటికాచలమాహాత్మ్యమునందు దక్షిణభారతవైష్ణవము కలదు. ఇది కూడ క్షేత్రోచితమే. అనుపలబ్ధమైన హరిలీలాసమునందు ఏమి వైష్ణవము కలదో? నడిమి వైష్ణవునికి నామాలెక్కువ అన్నట్లు. నడిమి వైష్ణవుడైన రామకృష్ణునికి వైష్ణవభేదములెల్ల ఆత్మీయములే. తెనాలి రామ(లింగ)కృష్ణునికి "వికటకవి" అను విఖ్యాతి కలదు. తన్ని మిత్తము వివిధవైష్ణవవిమిశ్రణము కావచ్చును.

225

# పింగళి సూరన

న భూతో న భవిష్యతి అనిపించు నాన్యతోదర్శనీయుడైన మహాకవి పింగళి సూరన. సూరన సూరయ. సూరపరాజు అని వ్యవహృతుడు. పింగళి గృహనామము.

"తరము ల్నాల్గయి దెందునెందునగుఁ దత్తద్గ్రామనామంబులన్
బరఁగున్ వంశములెల్ల బూర్వపు నిజప్రఖ్యాతి మాయంగ-"

అని సూరన గ్రామములు గృహనామము లగుట ప్రథమతః గ్రంథస్థము చేసెను.

" జనము ల్మెచ్చఁగ ము న్రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబు న్మఱి
న్దెనుఁగుం గబ్బము లెన్నియేనియును మత్పిత్రాదివంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పంజాల వత్యంతమున్." 6ప.1ఆ.ప్ర.ప్ర.

అని రచించినది ప్రభావతీప్రద్యుమ్నము. గరుడపురాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, అనేకకృతులు, ప్రభావతీప్రద్యుమ్నము సూరనకృతులు. " సూరపరాజు గిరిజాకళ్యాణము" నుండి గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమునందు ఉదాహరించిన పద్యము కలదు. అది కళాపూర్ణోదయము తర్వాత రచించినకృతులలో ఒకటి కావచ్చును. గరుడపురాణము, గిరిజాకల్యాణము, అన్యకృతులును అనుపలబ్ధములు. ఉపలబ్ధములైన కృతులు మూడు. రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము. మూడు కృతులును మూడు విధములైన మూడు రత్నములు. అందు కళాపూర్ణోదయము మహారత్నము. అనన్యసామాన్యమైన, అత్యపూర్వమైన మహాకావ్యము.

## కాలము

రాఘవపాండవీయము ఆకువీటి పెదవేంకటాద్రి ఆరాధ్యదైవమైన పంపావిరూపాక్షస్వామికి అంకితము. ఆకువీడు తుంగభద్రానదీతీరము నందలిది. (118ప.2ఆ.) పెద వేంకటాద్రి తాత రాజమహేంద్రవరయుద్ధమునందు విజయము గావించినట్లు కలదు.

"రాజమహేంద్రవరాధిపు
రీజైత్రవిచిత్రములఁ బరిభ్రాజితుఁడై
యాజిఘనుం డా యిమ్మమ
హీజాని ప్రసిద్ధిం గాంచె నెంతయు మహిమన్." 25ప.పీ.

ఇమ్మమహీజాని రాజమహేంద్రవరాధిపురీజైత్రవిచిత్రములు శ్రీకృష్ణదేవరాయల రాజమహేంద్రవరయుద్ధవిజయవిశేషములు. రాయల రాజమహేంద్రవరయుద్ధవిజయకాలము 1516ప్రాంతమని పూర్వోక్తము. అప్పటి ఇమ్మరాజు ద్వితీయపుత్త్రుడు తిమ్మరాజు (27.1ఆ.) జ్యేష్ఠపుత్త్రుడు పెద వేంకటాద్రి (33ప.11ఆ.) 1550 ప్రాంతమునం దుండుట సంభవము. కాబట్టి రాఘవపాండవీయము రచనాకాలము 1550 ప్రాంతము కావచ్చును. తత్పూర్వము కాజాలదు.

కళాపూర్ణోదయము నంద్యాల కృష్ణమరాజునకు అంకితము. అతడు నారపరాజు మనుమడు. (62ప.1ఆ.) నరసింగరాజు కుమారుడు. (74ప.1ఆ.) నారపరాజు కొండవీటి కడ కుదుపనమల్కాను తల్లడిల్ల కొట్టెనని కలదు.

" వదలక యుత్కళేంద్రునిసవాయిబరీదు నడంచు దుర్జయున్
గుదుపనమల్కఁ దల్లడిలఁ గొట్టె మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండవీటికడ; నెవ్వరు సాటి విచిత్రశౌర్యసం
పద పస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్." 33ప.పీ.

ఇందలి కొండవీటి మహాద్భుతసంగరము కూడ శ్రీకృష్ణదేవరాయల కొండవీటి యుద్ధమే. శ్రీకృష్ణదేవరాయల యుద్ధములందు నంద్యాలవారు పాల్గొన్నట్లు కృష్ణరాయవిజయమునందు కలదు. (8ప.3ఆ.) శ్రీకృష్ణదేవరాయల కొండవీటియుద్ధవిజయకాలము1515 వ సంవత్సరమని పూర్వోక్తము. అప్పటి నారపరాజు జ్యేష్ఠపుత్త్రుడు నరసింగరాజు ద్వితీయభార్య పినకొండమాంబకు జన్మించిన నంద్యాల కృష్ణమరాజు 1560 ప్రాంతమునందుండుట సంభవము. ఇది స్థూలనిర్ణయము. ఇంతకంటె సూక్ష్మనిర్ణయమునకు శాసనప్రమాణములు కలవు.

i నంద్యాల నారపరాజుపల్లిపట్టు, గుండిపూడి అను రెండు గ్రామములను శ్రీవేంకటేశ్వరస్వామికి సమర్పించినట్లు తిరుపతిలోని శిలాశాసనమునందు కలదు.[159] శాసన కాలము శాలివాహనశకము 1470 అగు కీలకసంవత్సరమీనమాస బహుళపక్ష పంచమీసోమవారము. 18-3-1548వ తేదీ. కనుక నారపరాజు చరమకాల

ము 1550 ప్రాంతము కావచ్చును. అయిన కృష్ణమరాజు చరమకాలము 1600 ప్రాంతమగును.

ii నంద్యాల కృష్ణమరాజును వీరవేంకటరాయల కాలమునందు మట్ల అనంతభూపాలుడు జయించినట్లు సిద్ధవటము శిలాశాసనమునందు కలదు.[160]

" [శాలి]వాహననామశకవర్షములు వేయు
నేనూఁట యిరువదియేడు చనిన
విశ్వావసు వనంగ వెలయు వత్సరమున
సకలహిందూరాజ్యసార్వభౌమ
వీరవేంకటరాయవిభుఁడు చంద్ర[గిరీంద్ర]
సీమ సామ్రాజ్యంబు సేయుచుండ
జంబుల మడక భూసంగ్రామ జయశాలి
కటక పురీచూరకారహారి
నందేల కృష్ణమ నరనాథ భయదాన
దక్షదోర్దండ విచక్షణుండు
xxx xxx xxx
మట్లీ తిర్వెంగళమానవాధిపరత్న
రత్నాకరుఁ డనంత రాజశౌరి -"

శాసనకాలము 1527 + 78 = 1605 చనిన 1606 వ సంవత్సరము. కాని జమ్ముల మడక సంగ్రామము. నంద్యాల కృష్ణమరాజును జయించుట 1597-8 నాటి చారిత్రికసంఘటనము.[161] ఇది నంద్యాల కృష్ణమరాజు చరమకాలము 1600 ప్రాంతమగుటకు నిర్ధారకసాధనము. కావున కళాపూర్ణోదయము రచనాకాలము1565ప్రాంతము కావలయును.

సూరన రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము కాక రచించిన అనేకకృతుల రచనాకాలము 1550-1565, 1565-75 మధ్యకాలములు కావచ్చును. ప్రభావతీప్రద్యుమ్నము పింగళి సూరన తండ్రి అమరయ్యకు అంకితము. అందలి సూరన ఇష్టదేవతాస్తుతియందు ఉమామహేశ్వరులు, లక్ష్మీనారాయణులు, వాణీవిధాతలు అమరయ్యకు "తనరింతురుగాతఁ గీర్తులన్", "సత్కృప నిత్తురుగాక .సౌఖ్యముల్", "ఇత్తురు నిత్యసౌఖ్యముల్" అని కలదు. (11-3. 1అ.) అనగా 1580 వ

సంవత్సరము నాటికి అమరయ్య సజీవుడని అవగాహనమగును. కావున అమరయ్య జీవితకాలము స్థూలముగ1495-1580, సూరన జీవితకాలము స్థూలముగ 1515-1585 కావలయును.

పింగళి సూరన అల్లసాని పెద్దన మనుమరాలి భర్త అని ఒక ఐతిహ్యము కలదు.[162] కాలమునుబట్టి అల్లసాని పెద్దన మనుమరాలి భర్త కావచ్చును.

## రాఘవపాండవీయము

రాఘవపాండవీయము ద్వ్యర్థికావ్యము. రెండు కథల జోడుగుఱ్ఱముల రథము.

" రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహో! యనంజేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగు కబ్బం బద్భుతంబంద్రు ద
క్షుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్." 10ప.పీ.

అని పెద వేంకటాద్రి అన్నట్లు సూరన ద్వ్యర్థికావ్యస్వరూపకథనము. అంతేకాదు.

" భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గాన రటుండనిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్
నా మదిఁ దద్ద్వయార్థకృతినైపుణియుఁ గలదంచు నెంచెదన్." 11ప.పీ.

అని కూడ పెద వేంకటాద్రి అన్నట్లు సూరన ద్వ్యర్థికావ్యచరిత్రగ్రథనము. భీమన వేములవాడ భీమన. అతడు ద్వ్యర్థికావ్యము రచించినట్లు అన్యాధారము కానరాదు. పింగళి సూరన నాటికి పెద్దల మాట కలదు. కాని ఆ గ్రంథము జాడ కానరాదు. అంతేకాదు. అందులోని ఒక్కపద్యమును ఎవ్వరికిని తెలియదు. జనశ్రుతి మాత్రమే. కాని, సంస్కృతవాఙ్మయమునందు ద్వ్యర్థికావ్యములు భీమన కంటె పూర్వమే కలవు.[163] రాజశేఖరుని కంటె పూర్వుడైన ధనంజయుడు (దశరూపకకర్త కాడు. తత్పూర్వుడు.) రాఘవపాండవీయమును రచించినట్లు సూక్తిముక్తావళియందు కలదు. లభింపలేదు. కవిరాజు రచించిన రాఘవపాండవీయము కలదు. పదమూడు సర్గల ద్వ్యర్థికావ్యము. చిదంబరసుమతి రచించిన యాదవరాఘవపాండవీయమను త్ర్యర్థికావ్యమును కలదు. నలయాదవరాఘవపాండవీయమను చతురర్థికావ్యమును

శ్రుతచరము.

అయినను సంస్కృతమునందు ద్వ్యర్థికావ్యము రచించుట కంటె, తెనుగునందు ద్వ్యర్థికావ్యము రచించుట కష్టము. కారణము తన్నిమిత్తమైన శ్లేషకు సంస్కృతభాషయందున్న సావకాశము తెలుగు భాషయందు లేదు. రెండర్థముల పద్యమును రచించుటయే కష్టము. అట్టిది రెండర్థముల కావ్యమెల్ల రచించుట మహాకష్టము. అందును రెండు కథల కావ్యము రచించుట ఆశ్చర్యజనకమే. అద్భుతావహమే. రామభారతకథలు రెండును తెలుగు భాషయందు జోడించుటకు దక్షుడు అరుదే. పింగళి సూరన ద్వయార్థకృతినిపుణుడే. అతని ద్వ్యర్థికావ్యరచనాప్రణాళిక ఇది :

ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొక్కచోట.నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేషయొక్కొక్కచోటన
ర్థశ్లేషయొక్కొక్కతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేషఘటనయొక్కొక్కతఱి
నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతియొక్కొక్క
తఱి నివి యొక్కొక్కతఱిని రెండు
మూఁడు గూడుట యన సముజ్జ్వలము గాఁగ
నాకుఁ దోఁచిన గతిఁ బెక్కు పోక లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచు సుమతుల కేర్పడ నాచరింతు." 17ప.పీ.

ఇది తెలుగు ద్వ్యర్థికావ్యములకు సాధారణసూత్రము. సోదాహరణనిరూపణమిది: 164 I ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష: ఆంధ్రభాషగ ఒక అర్థము. సంస్కృతభాషగ మఱొక అర్థము.

" వినియతనిందనపైనిడు
కొని యేఁగినియమికిం దగని ఘోరార్తి యొన
ర్చినవాండ మీకు దండ్యుండ
నని తనుందెలుపుచును వారి కప్పన సేసెన్." 28.1అ.

ఇందు రామాయణార్థమున విని. అతనిన్. తనపైన్. ఇడుకొని. ఏఁగి. నియమికిన్. తగని అను పదచ్ఛేదము "నియమికిన్" వినా ఆంధ్రభాషాపరము. భారతార్థమున వినియతనిందన. పైన్. ఇడుకొని. ఏన్. కినియమికిన్. తగని అను పదచ్ఛేదము "వినియతనిందన" వినా ఆంధ్రభాషాపరము. రామాయణార్థములోని నియమికిన్. భారతార్థములోని వినియతనిందన సంస్కృతభాషాపరము.

ii శబ్దశ్లేష: ఇది త్రివిధము. ఆంధ్రశబ్దశ్లేష. సంస్కృతశబ్దశ్లేష. ఉభయభాషాశబ్దశ్లేష.

" ఏనుంగని కరమరయక
పూనితిఁ గా నిట్టియెడలఁ బొసఁగునె యేయన్
గానమె కాలనియమగతి
తో నావేఁటు మునియుగముఁ ద్రుంగించెఁ దుదిన్" 25ప.1ఆ.

ఇందు రామాయణార్థమున ఏనుంగు. అని. కరము. అరయక అను పదచ్ఛేదము. భారతార్థమున ఏనున్. కనికరము. అరయక అను పదచ్ఛేదమును ఆంధ్రభాషాసభంగశబ్దశ్లేష. రామాయణార్థమున కాల. నియమ. గతి అను పదచ్ఛేదము. భారతార్థమున కాలని. యమఁగతి అను పదచ్ఛేదము ఉభయభాషాసభంగశబ్దశ్లేష.

" అక్షుద్రప్రథమాన.దివ్యశరసంప్రాప్తిం బ్రకాశించు నా
కుక్షిద్వంశవతంసుఁ గన్గొని మహాగోదావరీతీరస
ద్రక్షోపాయపథంబు నేఁడు దొరకెన్ రండంచు సంరక్షణా
పేక్షం దద్వనభూమిదేవతలు సంప్రీతిం గడున్ మ్రూఁకలై." 66.3ఆ.

ఇందు రామాయణార్థమున మహా. గోదావరీ. తీర. సత్. రక్షా. ఉపాయపథంబు అను పదచ్ఛేదము. భారతార్థమున మహత్. అగః. దావ. రీ. రసత్. రక్ష. అపాయపథంబు అను పదచ్ఛేదము సంస్కృతభాషాసభంగశబ్దశ్లేష.

iii అర్థశ్లేష: ఇది ద్వివిధము. ఆంధ్రభాషార్థశ్లేష. సంస్కృతభాషార్థశ్లేష.

" అకళంకిత నిట్లనుఁ గొం
చక యేమీ మనము సమరసముదారక్రీ
డకు నొండొరు మార్కొనుట దొ
రకునని వచ్చితి నెఱుంగరావా కినుకల్." 84ప.2ఆ.

ఇందు మనము అను శబ్దమునకు రామాయణార్థమున ఇద్దఱము అని.

భారతార్థమున మనస్సు అని అర్థద్వయము. ఇది ఆంధ్రభాషార్థశ్లేష.

" ఘనవిగ్రహజృంభణమున
ననయము దనకట్లు దెగఁగ నవ్వాహినిఁ గ్రీ
డన గెలిచి వచ్చు నబ్బా
లుని గని వెఱఁగంది రాత్మలో నచటి జనుల్." 26ప. 2ఆ.

ఇందు రామాయణార్థమున విగ్రహజృంభణము యుద్ధవిజృంభణము. వాహిని సేన. భారతార్థమున విగ్రహజృంభణము ఒడలువిఱుచుకొనుట. వాహిని నది. ఇది సంస్కృతభాషార్థశ్లేష.

iv ముఖ్యగౌణవృత్తిశ్లేష: శబ్దము స్వతస్సిద్ధార్థమున ప్రయుక్తమైన ముఖ్యవృత్తి. సంకల్పితార్థమున ప్రయుక్తమైన గౌణవృత్తి. ఒక అర్థమునందు ముఖ్యవృత్తి, మఱొక అర్థమునందు గౌణవృత్తి సంఘటితమైనది ముఖ్యగౌణవృత్తిశ్లేష.

" విను పెక్కులేల విడువుము
జనసమ్మతమతివిదేహజననామయముం
దన యుదితకీర్తిఁ గులవ
ర్తనఁ బ్రజలను లక్ష్మిఁ బ్రోచు ప్రభువున కిది తగున్." 106ప.4ఆ.

ఇందు రామాయణార్థమున రావణునికి. "జనసమ్మతమతిని విదేహజను (సీతను) విడిచిపెట్టుము. ఇది అనామయమును. స్వీయప్రసిద్ధకీర్తిని. కులవర్తనమును. ప్రజలను. సంపదను (రాజ్యమును) కాపాడు రాజునకు తగును" అని విభీషణుని ఉపదేశము కలదు. భారతార్థమున ధృతరాష్ట్రునికి. "జనసమ్మతమతివి. దేహజననామయమైన కుమారుని (దుర్యోధనుని) ఖండితకీర్తి కలవానిని విడిచిపెట్టుము. ఇది కులవర్తనమును. ప్రజలను. సంపదను(రాజ్యమును) కాపాడు రాజునకు తగును." అని విదురుని ఉపదేశము కలదు. రామాయణార్థమున అనామయములోని ఆమయశబ్దమునకు రోగమని స్వతస్సిద్ధార్థము. భారతార్థమున ఆమయశబ్దమునకు రోగమువంటివాడని సంకల్పితార్థము. దుర్యోధనుడే దేహజనితమైన రోగము కాదు. దేహజనితరోగసదృశుడు. రామాయణార్థమునందు ముఖ్యవృత్తి భారతార్థమునందు గౌణవృత్తి కలదు గావున ముఖ్యగౌణవృత్తిశ్లేష.

v అర్థాన్వయము: శ్లేషరహితముగ అర్థము రెండు కథలకు అన్వయించునది అర్థాన్వయము.

" దివి మోఁ చియున్న యద్రిని ధర్మకార్యార్థ
మానతంబుగఁ జేసినట్టి ఘనుని" 55ప.3ఆ.

ఇందు అద్రి రామాయణార్థమున అగస్త్యునిపరముగ వింధ్యపర్వతము. భారతార్థమున శివపరముగ మేరుపర్వతము.

vi శబ్దాన్వయభేద సంగతి; శ్లేషరహితముగ శబ్దము రెండు కథలకు అన్వయించునది శబ్దాన్వయము.

" వ్యథలెల్లఁ దీఱ దేవరమహామహిమ వి
లోకింపఁ గంటి నస్తోకగుణతఁ - 38ప.4ఆ.

ఇందు రామాయణార్థమున దేవర మహామహిమన్. వ్యథలెల్లఁ దీఱ. విలోకింపగంటినని శబ్దాన్వయము. దేవర మహామహిమచేత వ్యథలెల్ల తీఱునట్లు విలోకింపగంటినని అర్థము. భారతార్థమున వ్యథలెల్లఁ దీఱ. దేవరమహామహిమ. విలోకింపగంటినని శబ్దాన్వయము. వ్యథలెల్ల తీఱుటకు దేవరమహామహిమను విలోకింపగంటినని అర్థము.

vii రెండు మూడు కూడుట:. పై ఆరు విధములందు రెండు లేక మూడు విధములు ఒకే పద్యమునందు కూడియుండుట. రెండు మూడు కూడుట

" వెలయు నఖిలభువనములలో నవారణ
నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మీ మిగులఁ బ్రబల నయోధ్య నా
రాజవినుతిఁ గనిన రాజధాని " 1 ప.1ఆ.

ఇందు రామాయణార్థమున అవారణ. నగరిపు, రమ. తల్లి నాన్ అని. భారతార్థమున వారణనగరి. పురమతల్లి నాన్ అని .సంస్కృతాంధ్రభాషాసభంగశబ్దశ్లేష కలదు.. రామాయణార్థమున రాజ్యలక్ష్మీ. మిగులన్. ప్రబలన్. అయోధ్య నాన్ అని. భారతార్థమున రాజ్యలక్ష్మీ. అయోధ్య నాన్. మిగులన్ ప్రబలన్ అని శబ్దాన్వయభేదసంగతి కలదు. పూర్వార్థమున సంస్కృతాంధ్రభాషాసభంగశబ్దశ్లేష. ఉత్తరార్థమునందు శబ్దాన్వయభేదసంగతి కలదు గావున రెండు కూడినవి.

ఇట్లు పంపావిరూపాక్షుని ప్రేరణమున ఉద్దీపించిన వాగ్వైభవము వలన "రామభారతకథాశ్లేషప్రబంధము" ప్రభవించినదని పింగళిసూరన ప్రశ్రయపూర్వ కప్రకటనము. (262ప.4అ.) కథైకశ్లేషప్రబంధము శ్లేషకావ్యము. కథాద్వయశ్లేషప్రబంధము ద్వ్యర్థికావ్యము. కథాత్రయశ్లేషప్రబంధము త్ర్యర్థికావ్యము. కథాచతుష్కశ్లేష ప్రబంధము చతురర్థికావ్యము. కథాసంఖ్యను బట్టి కావ్యవిశేషణము. త్ర్యర్థికావ్యాదులకు ద్వ్యర్థికావ్యము ఉపలక్షణము ద్వ్యర్థికావ్యము"ఉత్తమకావ్యద్వయమన వగు"నని ఒక అభిప్రాయము కలదు.[165] అందుకు హేతువులివి:

i కథాద్వయార్థములు శబ్దార్థశక్తిమూలకధ్వనులు. ii వీరశృంగారాదిరసములు. iii వర్ణనలు.

ద్వ్యర్థికావ్యములందు శబ్దశక్తిమూలకధ్వని సమృద్ధిప్రాయము. అర్థశక్తిమూలక ధ్వని సకృన్మాత్రము. శబ్దశక్తిమూలకధ్వని శ్లేషకీలకము. శ్లేషకావ్యము చిత్రకావ్యమని ఆలంకారికపరిగణనము. వీరశృంగారాదిరసములు విరళము. ప్రధానకథాంశముల శరవేగమే కాని రసపోషణము త్రసరేణువు. వర్ణనలు పేలవములు. ముందు కథలు తెలిసిన గాని ద్వ్యర్థికావ్యము సహృదయునికి అర్థముకాదు. రెండు కథలకును అర్థము సరిపుచ్చుకొనుటతోనే పుణ్యకాలము గడిచిపోవును. ఒక కథను గ్రహించునెడ మఱొక కథ మనస్సున మసలును. అందుకే పింగళి సూరన తెలిపిన ముందు జాగరూకత ఇది :

" ఒక కథ వినియెడి తఱి వే
ఱొక కథపై దృష్టి యిడిన నొక యర్థము దో
పకపోవుఁ గాన నేకా
ర్థకావ్యమెట్లట్ల వినఁ గఁ దగు నొకటొకటిన్." 18ప.1అ.

ఎంత జాగరూకత వహించినను, వినునపుడే కాదు, చదువునపుడును రెండవ కథ రెపరెపలాడును. "రామ" అనిన స్త్రీ అని భారతము, "కృష్ణ" అనిన నీలమని రామాయణము ఝుటితిస్ఫూర్తి వహింపవు. ద్వ్యర్థికావ్యము చిత్రకావ్యము. వాగ్వైభవము మెదడునకు మేత. అంతవరకు శ్లాఘనీయము. పింగళి సూరన రాఘవ పాండవీయము "నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవము." (ఆశ్వాసాంతగద్య.)

ద్వ్యర్థికావ్యజాతికి పింగళి సూరన మార్గదర్శి.

# కళాపూర్ణోదయము

కళాపూర్ణోదయము కవితాకళాపూర్ణోదయము. కళాపూర్ణోదయము వలన పింగళి సూరన న భూతో న భవిష్యతి అనిపించు నాన్యతోదర్శనీయుడైన మహాకవి. కళాపూర్ణోదయము నాన్యతోదర్శనీయమైన మహాకావ్యము. కేవలము స్వతంత్రకావ్య మే కాదు. కథామూలమును లేని సర్వతంత్రస్వతంత్రమహాకావ్యము. తెలుగు సాహిత్యము మొత్తము మీద ఏకైకమౌలికమహాకావ్యము.

# మూలాభాసము

కళాపూర్ణోదయమునకు బాణభట్టు కాదంబరి. కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము. మార్కండేయపురాణము. మహాభారతము. లింగపురాణము. శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి. పారిజాతాపహరణము. మనుచరిత్రము. ఆముక్తమాల్యద శ్రీకాళహస్తిమాహాత్మ్యము మూలములను అభిప్రాయములు కలవు.[166] కళాపూర్ణోదయమునకు మూలములు అనగా కళాపూర్ణోదయములోని కథాంశములకు, కాదంబరి మొదలైన గ్రంథములలోని కథాంశములు మూలములని అర్థము.

కాదంబరి మూడు జన్మల వృత్తాంతము. అందు శాపవృత్తాంతములు కలవు. కళాపూర్ణోదయము మూడు జన్మల వృత్తాంతము. అందు శాపవృత్తాంతములు కలవు. కాని, కాదంబరి మూడు జన్మల వృత్తాంతమునకు, అందలి శాపవృత్తాంతములకు, కళాపూర్ణోదయము మూడు జన్మల వృత్తాంతమునకు అందలి శాపవృత్తాంతములకు అణుమాత్రము సంబంధము లేదు. సాదృశ్యమును లేదు. అంతేకాదు మూడు జన్మల వృత్తాంతము కథాసరిత్సాగరమునందు కలదు. అదే బాణభట్టు కాదంబరికి మూలము. శాపవృత్తాంతములు సర్వత్ర కలవు. కావున కళాపూర్ణోదయమునకు బాణభట్టు కాదంబరి మూలము కాదు. మూలాభాసమే.

ప్రబోధచంద్రోదయములోని కథాంశములకు. కళాపూర్ణోదయములోని కథాంశములకు సంబంధము లేదు. సాదృశ్యమును లేదు. ప్రబోధచంద్రోదయములోని పాత్రలు వ్యక్తులు కారు. మూర్తములైన భావములు. కళాపూర్ణోదయములోని పాత్రలు వ్యక్తులు. ప్రబోధచంద్రోదయము వేదాంతవిషయము. అద్వైతసిద్ధాంతగతము. కళాపూర్ణోదయము కథాప్రపంచము. విశిష్టాద్వైతపరము. కావున కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము కళాపూర్ణోదయమునకు మూలము కాదు.

మార్కండేయపురాణమునందు మదాలసావృత్తాంతము కలదు. కళాపూర్ణోదయమునందు మధురలాలసావృత్తాంతము కలదు. రెండింటికిని సంబంధము లేదు. సాదృశ్యము లేదు. అందును, ఇందును రాక్షసుడు కలడు. రాక్షసుడు లేని పురాణము లేదు. కథ లేదు. కావున మార్కండేయపురాణము కళాపూర్ణోదయమునకు మూలము కాదు.

సంస్కృతభారతములోని ఆరణ్యపర్వమునందు స్వాహాదేవి ఋషిపత్నీరూపములు ధరించుట కలదు. కళాపూర్ణోదయములోని కలభాషిణి రంభ రూపమును ధరించుట కలదు. రూపాంతరము చెందుట రేఖామాత్రమైన సాదృశ్యమేగాని, స్వాహాదేవి వృత్తాంతమునకు కలభాషిణి వృత్తాంతమునకు సంబంధము లేదు. మహాభారతములోని ఉద్యోగ పర్వము నందు శిఖండి పురుష డగుట, స్థూలకర్ణుడు స్త్రీ అగుట కలదు. అనుశాసనికపర్వమునందుభంగాస్వనుడు స్త్రీ అగుట కలదు. కళాపూర్ణోదయమునందు భార్యాభర్తలైన సుముఖాసత్తిమణిస్తంభులు మణిస్తంభసుముఖాసత్తులగుట కలదు. అంతమాత్రమే సాదృశ్యము. ఆ వృత్తాంతములకు, ఈ వృత్తాంతమునకు సంబంధము వీసమెత్తు లేదు. కావున మహాభారతము కళాపూర్ణోదయమునకు మూలము కాదు. మూలాభాసము మాత్రమే.

లింగపురాణమునందు నారదతుంబురుసంవాదము కలదు. కళాపూర్ణోదయమునందును నారదతుంబురు సంవాదము కలదు. అంతేకాదు. కళాపూర్ణోదయములోని నారదతుంబురుసంవాదమునకు లింగపురాణములోని నారదతుంబురుసంవాదము మూలమువలెనే కలదు. కాని, లింగపురాణము శివసంబంధి. నారదతుంబురుసంవాదము విష్ణుసంబంధి. అంతేకాదు. లింగపురాణము స్వరూపమిది.[167] : "లింగపురాణమునందు రెండు భాగములు కలవు. పూర్వభాగము. ఉత్తరభాగము. పూర్వభాగమునందు నూటయెనిమిది అధ్యాయములు. ఉత్తరభాగమునందు ఏబదియైదు అధ్యాయములు కలవు. పూర్వభాగములోని ఎనిమిదవ అధ్యాయమునందు లింగపురాణవిషయానుక్రమణిక కలదు. అందు ఉత్తరభాగములోని విషయ మొక్కటి కూడ లేదు. కాబట్టి పూర్వభాగమే అసలు లింగపురాణము. ఉత్తరభాగము ఆగమప్రాయము. అందును తొమ్మిది నుండి ఇరువదియేడు వఱకు అధ్యాయములు ఒకసారి, ఇరువదియెనిమిది నుండి ఏబదియైదు వఱకు అధ్యాయములు మఱొకసారి, ఒకటి నుండి ఎనిమిది వఱకు అధ్యాయములు ఇంకొకసారి ఆగమప్రాయములు. అసలు పురాణమైన పూర్వభాగము పదొకండు, పండ్రెండు శతాబ్దుల కంటె అనంతరగ్రంథము కాదు." ఉత్తరభాగములోని ప్రథమాధ్యాయమునందు

నారాయణమాహాత్మ్యము. ద్వితీయాధ్యాయమునందు విష్ణుప్రభావము. తృతీయాధ్యాయమునందు నారదసంగీతవిజయము. చతుర్థాధ్యాయ మునందు విష్ణుభక్తుని విశిష్టత. పంచమాధ్యాయమునందు అంబరీషుని తనయ శ్రీమతి వృత్తాంతము. షష్ఠాధ్యాయమునందు అలక్ష్మివృత్తాంతము. సప్తమాధ్యాయ మునందు ద్వాదశాక్షరీమంత్రప్రభావము. అష్టమాధ్యాయమునందు అష్టాక్షరీమంత్ర ప్రభావము కలవు. ఇవియెల్ల వైష్ణవము ముదిరిన కాలమునందు లింగపురాణమున ప్రక్షిప్తము లగును. ఆ కాలము పదునాలుగవశతాబ్ది కంటె పూర్వము కాదు. పరము కావచ్చును. పూర్వభాగము చిట్టచివఱి నూటయెనిమిదవ అధ్యాయములోని పాశుపతవ్రతమాహాత్మ్యమునకు. ఉత్తరభాగము తొమ్మిదవ అధ్యాయములోని పాశుపతవ్రతమాహాత్మ్యమునకు అనుబంధము కలదుగాని. తన్మధ్యస్థమైన నారాయణమాహాత్మ్యము మొదలు అష్టాక్షరీమంత్రప్రభావము వఱకు సంబంధము లేదు. అందలి నారదతుంబురుసంవాదము కళాపూర్ణోదయములోని నారదతుంబురుసంవాదమునకు మూలము గాక. కళాపూర్ణోదయములోని నారదతుంబురసంవాదమే లింగపురాణములోని నారదతుంబురుసంవాదమునకు మూలమగును. కాబట్టి కళాపూర్ణోదయములోని నారదతుంబురుసంవాదమునకు లింగపురాణము మూలము కాదు.

శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి అను నాటకమునందు మాయారూపధారణము కలదు. కళాపూర్ణోదయమునందును మాయారూపధారణము కలదు. కాని. బిల్హణుని కర్ణసుందరి అను నాటకమునందును మాయారూపధారణము కలదు. అంతేకాదు"పర్షియాదేశపు పగటివినోదకథలు" అను గ్రంథమునందును మాయారూపధారణము కలదు. మాయారూపధారణము కథావాఙ్మయమునందు సాధారణముగ కలదు. అయినను"తొల్లియు నొక్క యసురజంత జనకనందనకు రామునకును నెడసేయం గడంగి వచ్చుట వినఁబడుచునుండు" అని మొదటి రంభ అన్నట్లు కళాపూర్ణోదయమునందు కలదు.(187ప.3అ.) కావున ఆశ్చర్యచూడామణి కళాపూర్ణోదయమునకు నిమిత్తము కావచ్చును. మూలము కాదు. మూలాభాసమే.

పారిజాతాపహరణమునందు కృష్ణచరిత్రము కలదు. కళాపూర్ణోదయము నందును కృష్ణచరిత్రము కలదు. కాని రెండును భిన్నములు. మనుచరిత్రములోని వరూథినీ మాయాప్రవరవృత్తాంతమునందు మాయారూపధారణము. మనోరమావృత్తాంతమునందు రాక్షసవిజృంభణము కలవు. కళాపూర్ణోదయమునందు మాయారూపధారణము. రాక్షసవిజృంభణము కలవు. కాని. అవి. ఇవి భిన్నములు.

ఆముక్తమాల్యదయందు విశిష్టాద్వైతసిద్ధాంతము కలదు. కళాపూర్ణోదయమునందును విశిష్టాద్వైతసిద్ధాంతముకలదు. కాని అనుసరణము కాదు. శ్రీకాళహస్తిమాహాత్మ్యము నందు సరస్వతీచతుర్ముఖుల శృంగారము కలదు. కళాపూర్ణోదయమునందు సరస్వతీ చతుర్ముఖుల శృంగారము కలదు. కాని, రెండును భిన్నములు. కావున పారిజాతాప హరణము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, శ్రీకాళహస్తిమాహాత్మ్యము కూడ కళాపూర్ణోదయమునకు మూలములు కావు.

పారిజాతాపహరణాదులందు కంటె రాజశేఖరచరిత్రమునందు అసామాన్యమైన నామసాదృశ్యములు కలవు. అవి కథానాయక, కథారంగముల నామములు. "ఆ కళాపూర్ణిమాచంద్రుడు." (97ప.3ఆ.) "ప్రోలనియెడు కాసారములో" (178ప.3ఆ.) కళాపూర్ణోదయము కథానాయకుడు కళాపూర్ణిమాచంద్రుడే. కథారంగము కాసార సంజ్ఞతోడ భాసిల్లు పట్టణమే. కాని రాజశేఖరచరిత్రము కళాపూర్ణోదయములోని కథానాయక కథారంగముల నామములకు మూలము కాదు. అసామాన్యములైనను యాదృచ్ఛికసాదృశ్యములే.

రాజశేఖరచరిత్రమునకు కథా మూలము విక్రమార్కచరిత్రము. విక్రమార్కచరిత్రమునకు కథామూలము కథాసరిత్సాగరము. కథాసరిత్సాగరమునకు కారణము పార్వతీపరమేశ్వరుల ఏకాంతగోష్ఠి. కళాపూర్ణోదయమునకు కారణము సరస్వతీచతుర్ముఖుల ఏకాంతగోష్ఠి. అందును, ఇందును శాపవృత్తాంతములు, కలవు. కాని పార్వతీపరమేశ్వరుల ఏకాంతగోష్ఠికి, అందలి శాపవృత్తాంతములకు కళాపూర్ణోదయములోని సరస్వతీచతుర్ముఖుల ఏకాంతగోష్ఠికి, అందలి శాపవృత్తాంతములకు సంబంధము లేదు. అంతేకాదు, పార్వతీపరమేశ్వరుల ఏకాంతగోష్ఠి కథాసరిత్సాగరకథావిర్భావమునకు కారణమే గాని, తజ్జన్యము కాదు. సరస్వతీచతుర్ముఖుల ఏకాంతగోష్ఠి కళాపూర్ణోదయకథావిర్భావమునకు కారణమే గాక, తజ్జన్యము. తర్వాత జగత్తునందు జరిగినది. కావున కథాసరిత్సాగరము ను కళాపూర్ణోదయమునకు మూలము కాదు. మూలాభాసమే.

కథాసరిత్సాగరమునందు శ్రీదత్తుడు గంగానదిలో ఉఱుకును. కళాపూర్ణోదయమునందు శాలీనుడు శతతాళదఘ్నహ్రదమున ఉఱుకును. శ్రీదత్తుడు ఖడ్గము పడయును శాలీనుడు వయస్స్తంభనమణి, ఖడ్గము, సింహవాహనము పడయును. అందుకు, ఇందుకు నిమిత్తములు, ప్రయోజనములు, పర్యవసానములు భిన్నములు. కథాసరిత్సాగరమునందు వైశ్యకుమారుడు దైవికముగ రాజగును.

కళాపూర్ణోదయమునందు సత్వదాత్ముఁడు దైవికముగ రాజగును. కాని కథలు భిన్నములు. కావున శాలీనుని వృత్తాంతమునకు, సత్వదాత్ముని వృత్తాంతమునకు కథాసరిత్సాగరము మూలము కాదు. మూలాభాసమే.

ముఖస్థమైన కథావాఙ్మయము, గ్రంథస్థమైన కథావాఙ్మయము పింగళి సూరనకు అపరిచితము కాదు. అయినను కళాపూర్ణోదయము అనుసృష్టి కాదు. అపూర్వసృష్టి.

# కృతిసమీక్ష

"నీ చే నొక్క మహాప్రబంధముఁ గడున్ నిర్ణిద్రసారస్యలీ
లాచిత్రంబగు దాని నో యనఘ, వాలాయంబుఁ జేయించుకో
మా చిత్తంబున వేడ్కయుండు, నది నీ మాధుర్యధుర్యోక్తిరువా
గ్వైచిత్రిన్ సఫలంబు సేయుము సుధీవర్ణంబు లోహో! యనన్." 13ప.పీ.

అని కృతిభర్త ఆదేశము. కృతిభర్త "సంకల్పసిద్ధుఁ డను నమ్మికచేన్" (15ప.పీ.)

" -అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయంబును
శృంగారరసప్రాయంబును, బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును
నగు కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు నిర్మింపం గడంగితిని."

అనికృతికర్త ఆచరణము. అంతేకాదు.

" భవ్యత నెల్లదేశములఁ బ్రస్తుతి కెక్కుచు మీఁ ఱుమ్మహా
కావ్యము సుప్రసిద్ధమగుఁ గావుత నిత్యము సర్వలోకసం
స్తవ్యనిజస్మృతిన్ వెలయు తాండవకృష్ణు కృపన్ పవిత్రతా
స్రవ్యసనాతిధన్యమగు సజ్జనకోటి యనుగ్రహంబునన్." 264ప.8ఆ.

అని పింగళి సూరన ఆశయము. కళాపూర్ణోదయము అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయమే. శృంగారరసప్రాయమే. పుణ్యవస్తువర్ణనాకర్ణనీయమే. అంతేకాదు. సర్వదేశసంస్తవనీయమైన మహాకావ్యమే. కళాపూర్ణోదయము వంటి మహాకావ్యము ప్రపంచవాఙ్మయమునందు మృగ్యము. పూర్వోదాహృతమైన "ప్రౌఢదీర్ఘసమాసపదముల" అను చాటుపద్యమునందు, "ఊహించి తెలియరాకుండ

సూరపరాజు క్రమఁ గళాపూర్ణోదయము రచించె" అని కలదు. అది ప్రౌఢదీర్ఘసమాసములును అర్థము కాని ఒకానొక రామకృష్ణకవి అభిప్రాయము. అట్టి"కుకవులుపేక్షామాత్రదండ్యులు" అని ముందే పింగళి సూరన అభిప్రాయము. (9వచ.పీ.) "కుకవు లొక నిమిత్తంబునం బ్రార్థనీయులు" అని కూడ పింగళి సూరన అభిప్రాయమే.(6వచ.పీ.రా.పాం.) కుకవులన కువిమర్శకులు. సువిమర్శకులకు కళాపూర్ణోదయము సుమహాకావ్యము. అంతేకాదు ఆధునికాంధ్రసాహిత్యవిమర్శకు ఆద్యప్రకృతి కల్పించినది పింగళి సూరనకళాపూర్ణోదయమే.[168]

"అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయము" అనగా అపూర్వకథచేత మహత్తరమైనది. "అపూర్వకథాసంవిధానముచేత మహత్తరమైనది, అపూర్వకథా సంవిధాన వైచిత్రి చేత మహత్తరమైనది అని అర్థము. అపూర్వమనగా పూర్వము లేనిది.అని మాత్రమేగాక, మనోహరమైనది అనికూడ అర్థము.

## అపూర్వకథ

కళాపూర్ణోదయమునకు హృదయము సరస్వతీచతుర్ముఖుల శృంగారఘట్టము. సరస్వతీచతుర్ముఖులు సత్యలోకములోని రాణివాసమునందలి భవనారామమునందు, నవనానాఖేలనము లొనర్చుచు, కృతకమరాళములతో, నడిమి మానికపుకంబముతో, పసిడి సోపానములతో ఒప్పు ఒక్క సరసి తూర్పుదరిని తలిరుపాన్పున సరసికి ఎదురుగ చతుర్ముఖుడు పవ్వళించును. సరస్వతి పాదము లొత్తును. చతుర్ముఖుడు మన్మథుని దుష్టభావమున, సరస్వతీమధురాధరామృతాస్వాదనమునకు తన నాలుగుముఖములు తత్తఱపడ, సరస్వతి ముఖమును తన వైపు త్రిప్పుకొనుచు పాన్పునకు చేర్చెను.

"ఆ లీలలకు నవ్వి మేలు మే లెంతయు
నీ వింత లన్యాయ మింత గలదె!
మీ మొగంబులు నాల్గు నీ మాడ్కి నువ్విళు
లూరిన నేకాస్య నొకతె నేను
చాలుదునే ! యివి చాలించెదరో మఱి
యేమైనఁ గలదొ? " 18ప.5ఆ.

అని సరస్వతి అధరమునకు పాణి అడ్డమిడుచు,, వదనమును దూరము చేసి, మొలకనవ్వు, కోపము, చెలువు చిలుకు తళుకుజూపులు, చూపులో తర్జనములు,

వక్రితభ్రూలతాతాండవము సిరులు ప్రకటించి చతుర్ముఖుని కెరలించును.చతుర్ముఖుడు సరస్వతి ముఖమును బలిమి కొలది వంచి, అడ్డమిడిన చేయి వైదొలగించి, దంతక్షతము చేయును. సరస్వతికి కళాభిదురమై కంఠసీమను ఇంపొనరింప మోహనమైన మధురాంచితశబ్దము వెలువడును. కళామర్మభేదమును కప్పిపుచ్చుకొనుటకు సరస్వతి అధరపీడనమును సహింపలేమిని అభినయించి, అలుక వహించి, అవ్వలిమొగమై పొరలెను. చతుర్ముఖుడు విరహదశావికలితధైర్యుడైనను, గుండెలోని గుట్టు బయల్పడకుండ, ఎదురుగా చెట్టుకొమ్మకు వ్రేలాడుచున్న రత్నపంజరములోని చిలుకను జూచి "ఓ చిలుక చెలువ! యుబుసుపోదు. కథయొక్కటిచెప్పవుగా! " అనును. చిలుక "ఓ దేవ! దేవరముందటనెట్టి కథయుఁ జెప్ప నేను భాజనంబనే? మీరు చెప్పితిరేని వినియెదను" అనెను. "అట్లేని వినుము చెప్పెదను" అని చతుర్ముఖుడు కథ చెప్పసాగును.

" కాసారసంజ్ఞతోడను
భాసిలుచున్నట్టి యొక్క పట్టణమున ల
క్ష్మీ సంపద నొప్పును సువి
లాసుడురాజొక్కరుఁ డుకళాపూర్ణుఁ డనన్." 215ప.5అ.

కళాపూర్ణుని గుణగణములు, సరస్వతి "సభ్రూవిలాసలోలలోచనాంచలకషితకర్ణిక" అగుచు, విని, ఇంచుక నవ్వుచు, చిలుకను జూచి " ఆ కళాపూర్ణుండు మఱియేమియయ్యె? నతనికిఁ దల్లిదండ్రు లెవ్వ రడుగుము" అనును. చతుర్ముఖుడు,

" అభినవకౌముది యను కాంతచే నంత
వరియింపఁ బడియె నవ్వరవిలాసుఁ
డాతనికిని సుముఖాసత్తి యనునది
తండ్రియు మఱి మణిస్తంభుఁ డనెడి
వాఁడు తల్లియు" 28ప.5అ.

అనును. సరస్వతి హాసముతో చతుర్ముఖుని గ్రక్కున గ్రమ్మఱి కౌఁగిలించి ఇట్లనును.

"ఇంతలోననయౌర యెన్ని తబ్బిబ్బులు!
దద్దఱిల్లకుఁ డు" 28ప.5అ.

ఇట్లని "ధవునివీఁ పుచఱిచి"

" ఎట్టెటు! లా రాజు జనని మగది

యును జనకుఁ డాఁడువాఁడునా! " 28ప.5ఆ.
అనుచు "మఱియు మిగుల నవ్వుచు"
"చెప్పుఁ డా మీఁదు ప్రాణ
రమణ మఱియేమియయ్యె నా రాజు" 28ప.5ఆ.

అనును. చతుర్ముఖుడు ఇంకను కథ చెప్పుట కొనసాగించును. అది విని సరస్వతి,

" అటు దలఁ దౌర యెంతటి మహాత్ములు మీరలు!నాదు మీఁదనా
కటకట మీ వచోరచనకౌశల మో భువనప్రపంచసం
ఘటనధురీణ! " 44ప.5ఆ.

అనిన చతుర్ముఖుడు నవ్వి,

" కామిని యిందిపుడేమి కాంచి యీ
కీలుకు గడించి పల్కె దెఱిగింపుము కల్గిన నాకు " 44ప.5ఆ.

అనును. సరస్వతి ఇట్లనును.

" చెల్లఁ బో మీ సేవ సేయుచు నింత మా
త్రము నెఱుగఁ గలేన ప్రాణనాథ!
యీ దంటమాటల నిట్టి భావంబుల
విధము నే నిచ్చిన విద్యల కద !
యిప్పటి మన వృత్త మీ కథ సర్వంబు
తుదముట్టి నేమి సెప్పెదరొ యనుచు
నూర్థక యిందాఁక నుంటి నంతయుఁ జెప్పె
దను నది వినవలసిన వినుండు
కొలకు కాసారపురముగాఁ బలికి యందుఁ
బొలుచు నా మోము నీడ సంపూర్ణశశియు
నను తలంపునఁ బలికితి రపుడు దానిఁ
బ్రకటముగఁ గళాపూర్ణుఁ డన్ రాజు గాఁ గ" 44ప.5ఆ.

అని కళాపూర్ణుడను రాజు కథ వివరించును. అదియెల్ల సరస్వతీచతుర్ముఖుల శృంగారఘట్టమును బట్టి చతుర్ముఖుడు కల్పించినదియే. అంతేకాదు. అట్లు జరుగక తప్పదని బ్రహ్మవాక్కు. సరస్వతీచతుర్ముఖుల "సరసపు కథ" వినిన చిలుక

మణితవిశేషమును అభ్యాసము చేయుట. సరస్వతిని కొలుచుటకు వచ్చిన రంభ ఆలకించి. చిలుకను

" . . . . . . . . . ఈ సొంపు మిగులఁ
జిత్ర మిది యయ్యవారి సంసేవవేళ
యమ్మవా రుగ్గడించిరో" 52ప.5అ.

అని అడుగును. చిలుక స్వరోదయమైన తీరు చెప్పును. రంభ చిలుకచేత సరస్వతి కులుకుపలుకు రెండు మూడు సార్లు చెప్పించుకొనును. అంతలో సరస్వతి అచటికి వచ్చును. కనుబొమలు ముడుచుచు సరస్వతి చిలుకను శపించును.

" తలఁ కక యోసి యేమిటి కతల్ తలపెట్టిన దాన విచ్చటున్
తెలియము గాని నీవు పెను ద్రిమ్మరి కూఁతల దానవే కదే!
బళి బళి యీ వికారములు బ్రాఁతె యవిఘ్నతఁ జాగి లంజవై
యిలపయిఁ బుట్టుమంచు శపియించె మనంబున నల్కా హెచ్చఁ గన్."

సరస్వతి కోపమునకు రంభ రత్నమయోరుస్తంభము మఱుగున ఒదిగిపోవును. బ్రహ్మ వచ్చి చిలుకను ఓదార్చి. తదనంతరజన్మమునందు కళాపూర్ణుడను రాజునకు భార్యవు కమ్మని అనుగ్రహించును. సరస్వతి "దేవరకు నిప్పుడు నవియె కలవరింతలై యున్నవియె" అనును. బ్రహ్మ" కళాపుర్ణుండను రాజుపుట్టఁ గలఁ డతనికిది పత్నియఁ గాఁ గలదు. " అనును.సరస్వతి"ఆ రాజునకు సుముఖాసత్తి యనునది తండ్రి మఱి మణిస్తంభుఁ డనెడు వాఁడు దల్లియు నయ్యెదరే"అనిన. బ్రహ్మ" అందేమి సందియంబదియు నీ చేష్టావిశేషంబు చేతన కాఁ గలదు అనును. సరస్వతి బ్రహ్మను కళాపూర్ణుని కథను "మీరెక్కడం దడవకుండుఁడు" అని ప్రార్థించి. "నుడువ" ననిపించుకొని. రంభను ఎదుటికి రప్పించి "నీ వీ కథ యెక్కడం దడవిన నా లాగెఱుంగుదుగద" అని బెదిరించును. కళాపూర్ణుని కథ వెల్లడి కాకుండ సరస్వతి కట్టుదిట్టముచేయును. అయినను వెల్లడి అగును. ఇదియెల్ల మహత్తరమైన అపూర్వకథ యే. కథారిత్సాగరమునందు పార్వతీ పరమేశ్వరుల ఏకాంతగోష్ఠి కథాసరిత్సాగరకథా ప్రపంచము కాదు. కళాపూర్ణోదయములోని సరస్వతీచతుర్ముఖుల ఏకాంతగోష్ఠియే కళాపూర్ణుని కథ. పూర్వము లేనిది. మనోహరమైనది. అంతేకాదు. కళాపూర్ణుని కథకు ఆనుషంగికములైన కలభాషిణీవృత్తాంతము. రంభానలకూబరద్వయవృత్తాంతము. సుముఖాసత్తీమణిస్తంభుల వృత్తాంతము. సుగాత్రీశాలీనుల వృత్తాంతము. అలఘువ్రతుని వృత్తాంతము. స్వభావసిద్ధుని వృత్తాంతము. అభినవకౌమ

దీవృత్తాంతము. పురోహితుల వృత్తాంతము. మధురలాలసావృత్తాంతము. సత్వదాత్ముని (సుగ్రహుని) వృత్తాంతము సర్వమును పూర్వము లేనివి. మనోహరము లైనవి. మహత్తరములైనవి. కళాపూర్ణోదయము అపూర్వకథాకళాపూర్ణోదయమే. మహనీయమే.

# అపూర్వకథాసంవిధానము

కథాసంవిధానమన కథాప్రణాళికను సంఘటనల సంయోజనము. సంయోజనమన కూర్పు. కథాప్రణాళికను సంఘటనల కూర్పు అనగా కథాకథనవిధానము. కథాకథనసమ్యగ్విధానమే కథాసంవిధానము. కథాకథనకౌశలము శిల్పము. శిల్పనిగూఢమార్మికత చిత్రిక పట్టిన కథాకథనకౌశలము పూర్వము లేనిది. మనోహరమైనది అపూర్వకథాసంవిధానము. అది కళాపూర్ణోదయమునందు బహువిధభాసమానము.

ప్రతికథకు ప్రాథమికలక్షణము ఉత్కంఠాపాదనము. అందుకు సందిగ్ధత ( Surpense) ఆశ్చర్యకత (Surprise) అత్యంతావశ్యకము. కళాపూర్ణోదయమహాకావ్యమునకు ప్రధానకథ కళాపూర్ణుని కథ. అందువలననే కావ్యనామము కళాపూర్ణోదయము. కాని కావ్యారంభము కళాపూర్ణుని కథ కాదు. కలభాషిణీవృత్తాంతము. అందు కలభాషిణి నారదునితో.

" వినుఁ డది యర్థేశుతనయుఁ " డో యబల! య
న్నారదు మాటలు నడుమ వేఱ
పొడమె నేమయ్యె నల కళాపూర్ణు సుద్ది
కడమ చెపు"మన్న రంభ "యప్పుడ తెలుపనె?
నీకు మఱి చెప్పరాకుంట? యీ కథయును
నీకు నాతోడు సుమ్ముబ్బ నీకు"మనియె. 88
ఏ నెఱుఁ గ వేడ్కపడుచున్నదాన నో త
పోధనోత్తమ! యా కళాపూర్ణుఁ డనఁ గ
నెవ్వఁ డాతని సుద్ది మున్నేమి చెప్పె?
నెద్ది చెప్పఁ౦దనియె నా యిగురుఁ బోడి." 89ప.1ఆ.

అని ప్రథమతః కళాపూర్ణుని ప్రసక్తి తెచ్చును. నారదుడు,

"వెఱఁగంది" యిది యంతయుఁ గడు నపూర్వంబు దీనిం
దెలిసెదఁగాక యని కొంతదవ్వు నిశ్చలుం డగుచు విశ్వప్రపంచం
బునఁ గల భూతభవిష్యద్వర్తమానవర్తనంబు లన్నియు విమర్శించి
తత్త్కారంబుఁ గాంచి కలభాషిణిఁ జూచి "యా రంభ ప్రియునకుఁ
జెప్పరాదనిన కథ యత్యపూర్వంబు. నాకునుం జెప్పదగదు" 90వచ.1ఆ.

అని పలుకును. పలికిన కలభాషిణి.

" అనఘ చెప్పరాని కథాంశ మట్లయుండ
నిమ్ము నలకూబరునకు నయ్యింతి యేమి
కారణమ్మున నీ ప్రసంగము వచించెఁ దెలుపుఁడు" 91ప.1ఆ.

అని కోరును. అది మాత్రము నారదుడు తెలుపును. (92ప- 96వచ.1ఆ.) కాని అందు"కళాపూర్ణు సుద్ది" లేదు. అందుకు హేతువు రంభ నలకూబరునికి చెప్పును.

అది నారదుడు కలభాషిణికి తెలుపును. రంభ "ఏతత్ప్రసంగమునం గళాపూర్ణు కథలు వచ్చునొ యనియెడు తలంపుచే దాఁచితి నటంచు" 97ప.1ఆ.

" పలికి " యో పౌరుషాభరణ! తత్కథలు వ
చ్చిన నేమి యంటేని వినుము తెలియ
నా కథ లిఁకఁ జెప్పినట్టి వారును విని
నట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్ర ప్రపౌత్రా దిబహుసంతతిని దన
ర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతు
రను మాట యున్నది యాదియంద
యేను నీ కిది చెప్పిన వాని కొఱకు
నవనిఁ బుట్టంగ వలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ!యని తావకాంగసంగ
సౌఖ్యమునఁ బేర్చు నాకు నిష్టంబు లగునె? 98ప.1ఆ.

ఇది రంభ మాట కాదు. కవి మాట కాదు. బ్రహ్మవాక్కు. తిరుగు లేనిది. "ఆదియంద" కలది.

"ఈ కథ యిఁకఁ జెప్పినట్టి వారును వినినట్టి వారును ధాత్రి
యందుఁ బుత్త్ర_పౌత్త్ర_ప్రపౌత్త్రా_దిబహుసంతతిం దనర్చుచుఁ జిర
కాలంబు ప్రచురసంపదభివృద్ధిశోభితశుభసౌఖ్యంబులు గాంతు
రిది యంతయు నావశ్యకంబుగ మదీయాశీర్వాదంబు" 70వచ.5ఆ.

అని బ్రహ్మ వాక్కు. అది రంభ విన్నది. నారదుడు కనుగొన్నది. ఇద్దఱు కళాపూర్ణుని కథ చెప్పిన భూలోకమునందు మానవులై పుట్టి బహుకాలము సుఖసంసారము చేయవలసివచ్చును. కనుక చెప్పలేదు. కాని కలభాషిణి మానవస్త్రీ. ఆమెకు బహుకాలసుఖసంసారము వరప్రసాదమే. ఆమెకే కాదు. కళాపూర్ణోదయ కథావక్తృశ్రోతలకును మహావరప్రసాదమే. కాని తదవకాశము కానరాదు. కాబట్టి ఉత్కంఠాపాదమునకు బీజప్రాయము. అంతేకాదు. బ్రహ్మ వాక్కు గ్రంథఫలశ్రుతి. ఇతరగ్రంథములందు గ్రంథాంతమునందు గ్రంథకర్తృకృతగ్రంథఫలశ్రుతి లాంఛనప్రాయము. కళాపూర్ణోదయమునందు గ్రంథఫలశ్రుతి కావ్యాదిని. కావ్యమధ్యమునందు కలదు.లాంఛనప్రాయము కాదు. కథాప్రయోజనాత్మకము. ఇది కూడ పింగళి సూరన కావ్యనిర్మాణమార్మికతా విశేషము.

ఇట్లు ప్రథమాశ్వాసమునందు కళాపూర్ణుని కథ పరిచయము చేయబడినది. ద్వితీయాశ్వాసమునందు కళాపూర్ణుని ప్రసక్తి లేదు. తృతీయాశ్వాసము తుదిని అసలు రంభ అసలు నలకూబరుని గుర్తించుటకు అసలు నలకూబరుని. మాయానలకూబరుని విడివిడిగా పిలిచి. ఒకడు వినకుండ ఒకనితో.

"మనకుఁ దొల్లి కళాపూర్ణుఁ డను వాని ప్రసంగం బెచ్చట గలిగెఁ
దత్తకారం బేమి నీవు వింటివి " 282వచ.3ఆ.

అని కళాపూర్ణుని ప్రసక్తి తెచ్చును. బీజప్రాయమైనది అంకురదశ నందినది. ఉత్కంఠ ఉజ్జీవితమగును. మఱల చతుర్థాశ్వాసము తుదిని కలభాషిణి. మణికంధరుని శాపగతికి వగపు చెంది. మణికంధరునితో.

"మును కళాపూర్ణు కథ నీవు వినవె? ధనదు
పట్టిచే నంత యట్లేల తిట్టు వడితి? " 173ప.4ఆ.

అని కళాపూర్ణుని కథ ప్రసక్తి తెచ్చును. అంతేకాదు. "ఔ నవు నీ వెడగాఁగఁ బో యియుంటివి తత్ప్రసంగము ఘటిల్లినయ ప్డనిపల్కి" (175ప.4ఆ.) కళాపూర్ణ ని కథకు

సంబంధించి తనకు తెలిసినదంతయు చెప్పును. (175ప.4ఆ.) అప్పుడు మలయాళబ్రాహ్మణు డొకడు అలఘువ్రతనామధేయుడు అచటికి వచ్చి.

"విని"యా కళాపూర్ణుఁ డన నెట్టిఘనుఁ డొ? త
త్కథయంతయునువినఁ గలుగుటెపుడొ?
సంపదర్థంబుగ జపము చేసిన నయ్యి
పూర్వపుఁ గథ విను పుణ్యమబ్బి
దది వినునట్టి భాగ్యంబు సాధించినఁ
దన్మహాత్మ్యంబుచేతను సమస్త
భోగవైభవమాత్రములు గాక దీర్ఘాయు
వును బుత్త్రపౌత్త్రాదిఘనవిభవము
గలుగునఁట! కడు మంచి మార్గంబు దొరకెఁ
దత్కథాశ్రవణార్థ మీ తల్లి వేఁ బ్ర
సన్నఁ గావింతు" ననుచుఁ దాఁ జలుపఁ దొడగె
మహితమగు భువనేశ్వరీమంత్రజపము." 178ప.4ఆ.

అలఘువ్రతుడు కళాపూర్ణకథాశ్రవణార్థము భువనేశ్వరీమంత్రజపము చేసిన తల్లి మృగేంద్రవాహన అను శక్తి. అంకురదశనందినది ఫలోన్ముఖదశకు వచ్చినది. ఉత్కంఠ ఉజ్జృంభించుచు.

అలఘువ్రతుడు భువనేశ్వరీమంత్రజపమును రెండు సంవత్సరములు పరిపూర్ణముగా జేయ వంతట మృగేంద్రవాహన "ఓ బ్రాహ్మణుండ! నీ యభీష్టంబు వేఱొకచోట సిద్ధించు"నని పల్కెను. ఆ పలుకులు అతని వీనుల పడినంతనే, అతడు ఆకస్మికోద్ధూతతీవ్రవాతనిహతుడయి. ఒక పురము నడుమ రాజాస్థానమునందు పడును. రాజు ముందు పసిడి ఉయ్యెలలయందు పొత్తులలో ఉన్న రెండేండ్ల పసిబాలిక సరస్వతీచతుర్ముఖశృంగారఘట్టమును చెప్పిన తర్వాత, ఆ రాజు "నేను కళాపూర్ణుడను" అని చెప్పును. (83ప.5ఆ.) అది సరస్వతీచతుర్ముఖుల శృంగారఘట్టములోని కళాపూర్ణుని కథ జగత్తునందు జరుగుటకు, జగద్విదితమగుటకు ఆరంభము.

కళాపూర్ణోదయము ఎనిమిదాశ్వాసముల కావ్యము. నాలుగాశ్వాసములందు కళాపూర్ణుని కథకు సందిగ్ధత (Surpense) కలదు. అయిదవ ఆశ్వాసమునందు సరస్వతీచతుర్ముఖుల శృంగారఘట్టములోని కళాపూర్ణుని కథ చెప్పిన తర్వాత, అచటి రాజే కళాపూర్ణుడనని తెలుపుటయందు ఆశ్చర్యకత (Surprise) కలదు. అది.

ఇది ఉత్కంఠ కలిగించును. ఇంత ఉత్తంతాపాదకమైన కథాసంవిధానము పూర్వము లేనిది. మనోహరమైనది. మహత్తరమైనది. ఇట్లు ప్రధానకథను మాత్రమేగాక, ప్రతి-ఆనుషంగికవృత్తాంతమునకు ఉత్కంఠాపాదకముగ రచించుట పింగళి సూరన అపూర్వకథాసంవిధానములోని ఒక మహావిశేషము.

ఉత్తమకథకు ఉండవలసిన లక్షణము నాటకీయధ్వని. అది సూచ్యార్థసూచనము. భావ్యర్థసూచనము అని వ్యవహరించునది. అంతేకాదు. సంస్కృతనాటకములందలి గండమను సంధ్యంగమును సంవదించునది. సంధ్యంగములు కావ్యశరీరమైన ఇతివృత్తమునకు అనగా కథకు సంబంధించినవి. నాటకీయధ్వని కూడ నాటకవస్తువునకు సంబంధించినదే. కళాపూర్ణోదయములోని నాటకీయధ్వనుల కళాకాంతులు పూర్వము లేనివి. మనోహరములైనవి. మహత్తరములైనవి. కావ్యాదిని ద్వారకాపురవర్ణనమునందే నాటకీయధ్వని కలదు. కథాప్రారంభమునందే నాటకీయధ్వని కలదు. ఉద్యానవనమునందు కలభాషిణి చెలికత్తెలతో డోలావిహారము సేయుచుండగా, ఆకాశమార్గమున నారదుడు, మణికంధరుడు వచ్చుచుందురు. ఆ వెంటనే విమానమునందు రంభానలకూబరులు కలరు. మణికంధరుడు డోలావిహారము సేయు మహిళల ప్రగల్భతాగరిమకు ఆశ్చర్యపడుచు నారదునితో ఇట్లనును.

" తమిఁ బూఁదీఁ గెల తూఁ గుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁ గు నా
కొమరుంబ్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్ సక్కఁ గాఁ జాఁ గి మిం
టిమొగంబై చనుదెంచు ఠీవిఁ గనుగొం టే దివ్యమౌనీంద్ర! నా
కమృగీనేత్రల మీఁ దఁ గయ్యమునకుం గాల్సాఁ చు లా గొప్పెడున్."

మణికంధరుడు ఇట్లనిన, నారదుడు ఇట్లనును.

"బళిరా సత్కవివౌదు నిక్కమ తగన్ భావించి నీ వన్న యా
యెలప్రాయంపు మిటారికత్తెల బెడం గే నెందునుంగాన వా
రల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రివిష్టపస్త్రీల యౌ
దలఁ దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి యొప్పె యగున్."

ఇందు మణికంధరుని వర్ణన ప్రస్తుతవిషయము. అందు "నాకమృగీనేత్రల మీఁదఁ గయ్యమునకుం గాల్సాఁచులాగొప్పెడున్" అనుట ప్రశంస. కాని అనంతరకథలో మానవస్త్రీ అయిన కలభాషిణి అప్సరఃస్త్రీ అయిన రంభతో కయ్యము

నకు దిగును. అది ధ్వన్యర్థము. నారదుని వర్ణన కూడ ప్రస్తుతవిషయము. అందు "వారల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యౌదలఁ దన్నుం జనునట్లు మించుననిన్నం దప్పేమి యొప్పే యగున్" అనుట ప్రశంస. అనంతరకథలో కలభాషిణి రంభను తలదన్నునట్లు మించిపోవునని, తత్పర్యవసానము తప్పు గాక ఒప్పే అగునని కూడ ధ్వన్యర్థము. అంతేకాదు. " ఆ యెలప్రాయంపు మిటారికత్తెల బెడం గే నెందునుం గాన" అనుట ప్రశంస. నారదుడు త్రిలోకసంచారి. అతడు "ఏ నెందునుం గాన" ననుట త్రిలోకములందును చూడలేదని అనుట. నారదుడు త్రిలోకములందును చూడని అందగత్తెలలో కలభాషిణి అగ్రేసర. అనంతరకథలో కలభాషిణి అంత అందగత్తె కానిచో, మణిస్తంభుడు మృగేంద్రవాహనాలయమునకు తీసికొని వెళ్లుట జరుగదు. అది కూడ ధ్వన్యర్థమే. ఉపరి, నారదుడు మణికంధరుని "బళిరా సత్కవి వౌదు" అనుట కరపత్రము. అనంతరకథలో మణికంధరుడు సత్కవి అని నిరూపితమగును. అదియును ధ్వన్యర్థమే. ఇదియెల్ల నాటకీయధ్వని.

ఇట రెండు విశేషములు కలవు. 1. నారదుడు గురువు. మణికంధరుడు శిష్యుడు. దారిని పోవుచు కనిపించిన స్త్రీలను శిష్యుడు వర్ణించి గురువునకు చెప్పును. గురువు అట్లు వర్ణించుట తప్పు అనక, తానును వర్ణించి తప్పు కాదన్నట్లు శిష్యునికి చెప్పును. ఎట్లు?- "గుణాద్భుతంబైన పదార్థంబు వర్ణింపకునికి యసహ్యాశల్యంబైన వాగ్జన్మవైఫల్యంబు" అను దమయంతి అభిప్రాయమే(32శ్లో.8స.నై.చ;12వచ.4ఆ.శృం.నై.) సమాధానము. 2. మణికంధరుడు సత్కవి. నారదుడు విద్వత్కవి- త్రైవిష్టపస్త్రీల తలదన్నుట యందు ఖగోళశాస్త్రపరిజ్ఞానము కలదు.

కలభాషిణి రంభయై నలకూబరుని కూడదలచినదని యెఱిగి, అపేక్షితమైన అంగన రూపము ధరించు సామర్థ్య మొదవుటకు వరమిచ్చి, నారదుడు ఆశీర్వదించిన విధమిది:

" కొమ్మ మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి
కాంతు రంభామనోహరాకారుఁ డగుచు
మెఱయు వానిని గూడి రమింపఁ గలవు
నమ్ము పొమ్మిక నీ భవనమున కనియె." 48ప.2ఆ.

ఇట "మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి కాంతుడు" అనగా ఇంతకు ముందు కలభాషిణి ఆత్మలో కోరిన ప్రియుడు. "రంభామనోహరాకారుండగుచుమెఱయు వానిని గూడిరమింపఁగలవు" అనగా రంభకు మనోహరమైన ఆకారము కలిగి

ప్రకాశించు నలకూబరుని కూడి రమింపగలవు అని అర్థము. అనంతరకథలో కలభాషిణిరంభ రూపము ధరించి, ఇంతకుముందు ఆత్మలో కోరిన ప్రియుడైన నలకూబరుని కూడి రమించినది.కాని వాడు నలకూబరుడు కాడు. మాయానల కూబరుడు. మణికంధరుడు.అ ు"మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి కాంతుడు" అనగా మొట్టమొదట కలభాషిణి ఆత్మలో కోరిన ప్రియుడు. అతడు మణికంధరుడే. " రంభామనోహరాకారుఁడగుచు మెఱయువానిని గూడి రమింపఁగలవు" అనగా రంభకు మనోహరుడైన నలకూబరుని ఆకారము కలిగి ప్రకాశించు మణికంధరుని కూడి రమింపగలవు అని ధ్వన్యర్థము. శబ్దశక్తిమూలకధ్వని. నాటకీయధ్వని.

కలభాషిణి నలకూబరుని కలిసికొనుటకు మణిస్తంభుని సింహము మీద వెళ్లుచు, దారిలో రంభాసఖులు నలకూబరునే కలియుట చెప్పుకొన విని, చిన్నవోవుట చూచి,

" సిద్ధుఁడు నవ్వి " యో చెలువ చింతిలఁగా వల దిప్పుడెంతయున్
బుద్ధిఁ దిరంబుగాఁగ ధృతిఁ బూను మొకించుక సేపులోన నే
శుద్ధము గాఁగ నీ మనము శోకము సర్వముఁ బుచ్చివైచెదన్
సిద్ధము నాదు పల్కనియెఁ జెల్వయు మోము వికాసమందఁగన్ 81
"ఏ రీతి నింత మిక్కిలి
చేరికగా నాడి"తనియె సిద్ధుడు చూడం
గా రాదె కుడువఁ బోవుచుఁ
గూరల చవి యడుగనేల? కోమలి! యనియెన్. 82ప.3ఆ.

ఇట సిద్ధుడు కలభాషిణికి నలకూబరుని కలియుటకు అవకాశము కల్పించునని, అందువలన ఆమె శోకము సర్వము తొలగిపోవునని అర్థము. అనంతరకథలో సిద్ధుడు కలభాషిణిని మృగేంద్రవాహనకు బలియిచ్చుటకు సిద్ధమగును. అందువలన- బలియిచ్చిన చనిపోవును గాన- ఆమె మనస్సులోని శోకము సర్వము తొలగిపోవును. ఇది ధ్వన్యర్థము. నాటకీయధ్వని.

కథాసంవిధానమునందు కథనకౌశలమును ముఖ్యము. కథనపద్ధతులు రెండు కలవు.[169] 1. కాలసరణి. 2. కారణసరణి. కథ జరిగిన క్రమమును బట్టి కాలక్రమానుసారముగా చెప్పు పద్ధతి కాలసరణి. అది సర్వవాఙ్మయసాధారణము. అట్లు గాక, కార్యమును ముందు కారణమును తర్వాత చెప్పు పద్ధతి కారణసరణి. తర్కసరణి. "ఫ్లేష్ బేక్ టెక్నిక్" అని ప్రసిద్ధము. అది ప్రాకృతవాఙ్మయమునందు- కథాసరిత్సాగ

రమునకు మూలమైన- గుణాఢ్యుని బృహత్కథయందు కలదు. అది కథాసరిత్సాగరమునందు అవతరించినది. సంస్కృతసారస్వతమునందు బాణభట్టు కాదంబరియందు కలదు. తెలుగు సాహిత్యమునందు కళాపూర్ణోదయమునందు కలదు. కళాపూర్ణోదయము మూడు జన్మల కథ. మూడు జన్మ లెత్తినది చిలుక. మొదటి జన్మమునందు సరస్వతి చిలుక. రెండవ జన్మమునందు కలభాషిణి. మూడవ జన్మమునందు మధురలాలస. కాలసరణిని అవలంబించిన కళాపూర్ణోదయమునందు ముందు సరస్వతీచతుర్ముఖశృంగారఘట్టము. తర్వాత కలభాషిణీవృత్తాంతము. ఆ తర్వాత మధురలాలసావృత్తాంతమును ఉండవలయును. కాని అట్లు లేదు. కలభాషిణీ వృత్తాంతము ముందు. సరస్వతీచతుర్ముఖశృంగారఘట్టము తర్వాత. మధురలాలసావృత్తాంతము ఆ తర్వాత కలవు. ఇది కారణసరణి. అంతేకాదు. అలఘువ్రతుని. మదాశయుని. పురోహితుల. సత్వదాత్ముని (సుగ్రహ) పూర్వవృత్తాంతములు తర్వాత కలవు. అవి కూడ కారణసరణిని అవలంబించినవియే. కాలసరణి సాధారణమైనది. కారణసరణి అసాధారణమైనది. కాలసరణి కంటె కారణసరణి ఉత్కంఠ కలిగించునది. అందును సందిగ్ధత. ఆశ్చర్యకత ఉండును. కారణసరణికథనము కథాసంవిధానమునందు శిల్పవిశే[illegible]ము.

## అపూర్వకథాసంవిధానవైచిత్రి

అపూర్వకథయొక్క. అపూర్వకథాసంవిధానముయొక్క వైచిత్రి అపూర్వకథాసంవిధాన వైచిత్రి. వైచిత్రి అన విచిత్రభావము. శబ్దమునకు సంబంధించిన వైచిత్రి శబ్దవైచిత్రి. ఉక్తికి సంబంధించిన వైచిత్రి ఉక్తివైచిత్రి. కథకు సంబంధించిన వైచిత్రి కథావైచిత్రి. కథాసంవిధానమునకు సంబంధించిన వైచిత్రి కథాసంవిధానవైచిత్రి.

కళాపూర్ణోదయకథ ప్రసిద్ధకథ కాదు. మిశ్రకథ కాదు. కల్పితకథయే. అయినను ప్రసిద్ధకథ అనిపించుటకు పౌరాణికప్రతిపత్తి కలదు. కల్పితకథయే అనిపించుటకు కాల్పనికప్రతిపత్తి కలదు. మిశ్రకథ అనిపించుటకు మిశ్రణప్రతిపత్తి కలదు. నారదుడు. రంభానలకూబరులు. తుంబురుడు. రుక్మిణీసత్యభామాజాంబవతీశ్రీకృష్ణులు. మృగేంద్రవాహన. సరస్వతీచతుర్ముఖులు. ఇంద్రుడు. దత్తాత్రేయుడు. శల్యాసురుడు పురాణపురుషులు. పౌరాణికప్రతిపత్తికి ప్రతినిధులు. కలభాషిణీమణికంధరులు. సుగాత్రీశాలీనులు. సుముఖాసత్తీమణిస్తంభులు. అలఘువ్రతుడు (యజ్ఞశర్మ). అభినవకౌముదీమధురలాలసాకళాపూర్ణులు. రూపానుభూతీమదాశయులు. ప్రథమాగమద్వితీయా-

లీనులు. సుముఖాసత్తిమణిస్తంభులు. అలఘువ్రతుడు (యజ్ఞశర్మ). అభినవకౌముదీమ ధురలాలసాకళాపూర్ణులు. రూపానుభూతీమదాళయులు. ప్రథమాగమద్వితీయా గమ,తృతీయాగమతురీయాగములు. స్వభావసిద్ధుడు. సత్వదాత్ముడు. (సుగ్రహుడు). మధురాపురబ్రాహ్మణదంపతులు కల్పితవ్యక్తులు. కాల్పనికప్రతిపత్తికి ప్రతినిధులు. అందఱు కలిసి మిశ్రణప్రతిపత్తికి ప్రతినిధులు. అంతేకాదు. కళాపూర్ణోదయమునందు విష్ణులోకము. సత్యలోకము మాత్రమేగాక భూలోకము కలదు. ఆసేతుహిమాచలము భారతావని కలదు. ద్వారక. మధుర. పురుషోత్తమము. శ్రీకూర్మము. సింహాచలము. అహోబలము. తిరుపతి. కాంచి. శ్రీరంగము. కుంభకోణము. అనంతశయనము. శ్రీశైలము. గోదావరీతీరధర్మపురి. ఆంధ్ర. చోళ. పాండ్య (ఉరగపట్టణము. నాగపట్ట ణము?) తమిళ. కేరళ. అంగ. గౌడ. ఉత్కళ. ఘూర్జర. మాళవ. బర్బర. హూణ. కాశీ. ప్రాగ్జ్యోతిష. కోసల. మగధ మహారాష్ట్రదేశములు కలవు. అందు తీర్థయాత్రలు. దండయాత్రలు. మాత్రమేగాక. కథారంగములును కలవు. ఇంత కథారంగబాహుళ్యము. పాత్రద్వైవిధ్యము. వైవిధ్యము ఇతరకథలందు మృగ్యము. ఇది అపూర్వకథావైచిత్రి. కళాపూర్ణోదయమునందు కవి కథను చెప్పు సందర్భములు తక్కువ. పాత్రలే కథలు చెప్పు సందర్భములు ఎక్కువ. కళాపూర్ణుని ప్రసక్తి తెచ్చినది రంభ. కళాపూర్ణుని కథ మొదట చెప్పినది బ్రహ్మ. తర్వాత చెప్పినది రెండేండ్ల పసిబాలిక. కళాపూర్ణుని కథతోపాటు వ్యత్యస్త సుముఖాసత్తిమణిస్తంభుల. స్వభావసిద్ధుని. అభినవకౌముది. శల్యాసురుని. యజ్ఞశర్మ. కథలు చెప్పినది కూడ రెండేండ్ల పసిబాలికయే. మణికం ధరుని తపోభంగకథను చెప్పినది మణిస్తంభుడు. మణిస్తంభుని కథను చెప్పినది సుముఖాసత్తి. రంభానలకూబరద్వయకథ చెప్పినది కలభాషిణీమణికంధరులు. ఇది కథాసంవిధానమునందు ఒక వైచిత్రి. ఇందు రెండేండ్ల పసిబాలిక "విచిత్రకథల తల్లి" అగుట (77ప. 6అ.) మహావైచిత్రి. అందుకు హేతువు మణిహారము.

మణిహారవృత్తాంతము కళాపూర్ణోదయమునందు మకుటాయమానమైనది. అది మొదట మణికంధరుని కంఠమునందు కనిపించును. అతడు రచించిన దండకమునకు మెచ్చి శ్రీకృష్ణుడు బహూకరించును. కలభాషిణి "శ్రీకామినీకామితాకారా ......... నమస్తే నమస్తే నమః"

> " అని యీ వైఖరి నంతయుం జదివి దద్దైత్యారాతి యీ దండకం
> బునకున్ మెచ్చుచు నిచ్చినట్టిదిగదా భూరిద్యుతిన్ నీదు శి
> ష్యుని కంఠంబున నొప్పు నా విమల రత్నోదారహారంబు స
> న్మునిలోకోత్తమ! ... ... ... ... " 81ప.1అ.

అని నారదునికి చూపించును. మఱల నారదుని సంగీతవిద్యాసాధనము. మణికంధరుని తీర్థయాత్రలు. తపోభంగము తర్వాత మణికంధరుడు.

" బంధురవీణాసహిత
స్కంధముతో రత్నమాలికాఘటితజటా
బంధముతో .... .... " 115ప.3ఆ.

మృగేంద్రవాహనాలయమునకు వచ్చినట్లు మణిహారమును కవి గుర్తు సేయును. మణికంధరుడు మాయారూపమునకు సద్యఃఫలముగా శాపము తెచ్చి కొనుట తెలిపి,

" ఎల్ల మాయలుం జాలించి నా వీణెయు రత్నమాలికయుఁ
బుచ్చుకొని యిచ్చటి మహిమలు తొల్లి యెఱింగినవాఁడనై యిందేమి
విశేషంబులు గొరకునో యని వచ్చితిని" 144వచ.4ఆ.

అని మణిహారమును జ్ఞాపకము సేయును. సుగాత్రీశాలీనుల వృత్తాంతము. తత్పర్యవసానము ప్రసక్తమైన తర్వాత మణికంధరుడు.

" శాపానుభవకాలంబుఁ బ్రతీక్షించుచు గృహదత్తంబైన రత్న
మాలిక యచ్చటజపపరుండైయున్న యలఘువ్రతునకుఁ గృష్ణా
ర్పణబుద్ధిని సమర్పించి" 191వచ.4ఆ.

శ్రీశైలమునకు పోవును. అలఘువ్రతుడు రాజాస్థానమునందు పడినపుడు"మణికంధరదత్తమైన మణిహారమును" ఆశీర్వాదముగ రాజునకు కానుకగా ఇచ్చును. రాజు "ఇప్పటి కానుక లెవ్వియైనను దీని సొమ్ముల" అని పసిడిఉయ్యెలలోని పసిబాలికకు అలంకరింపజేయును. అది చూచి నవ్వి పసిబాలిక ఇట్లనును.

" తిరుగఁగ రెండేండ్లకు నా
సురుచిరహారోత్తమంబుఁ జూడఁగ నాకున్
దొరకెఁ గనుంగవ చేసి న
యురుపుణ్యము నేఁడు వెండియును ఫలియించెన్." 55ప.5ఆ.

రెండేండ్ల పసిబాలిక పలుకులకు అచటి వారెల్ల ఆశ్చర్యచకితులగుదురు. రాజు పసిబాలికను "నీ పూర్వజన్మవర్తనంబు లెట్టివి? యేమి కారణంబున నిచ్చటఁ

బుట్టితి? వెతిగింపవలయు నని ప్రార్థించిన" పసిబాలిక విచిత్రకథల తల్లి అగును. అంతేకాదు. సరస్వతి చెప్పని, చతుర్ముఖుడు చెప్పననిన, తెలిసిన రంభ. నారదుడు చెప్పుటకు లేని. ప్రసిద్ధము కాగల కళాపూర్ణుని కథను పసిబాలిక చెప్పును. అట్టి కళాపూర్ణుని కథను. పెక్కు అనుషంగికవృత్తాంతములను చెప్పిన పసిబాలిక సత్వదాత్ముడు తన వృత్తాంతమడిగిన చెప్పలేకపోవును. ఆకలికి పసిబాలిక వలెనే ఏడ్చును. కారణ మెవ్వరికిని తెలియదు. కళాపూర్ణుని కథ చెప్పిన పసిబాలిక పెరిగి పెద్దదై, మధురలాలస పేరున కళాపూర్ణమహారాజు భార్య అగును. మధురలాల సాకళాపూర్ణుల వివాహమైన మఱికొంతకాలమునకు. కళాపూర్ణమహారాజు సకలదిగ్దేశాధీశుల జయించును. క్రముకకంఠోత్తరమహాపురమున ప్రవేశించును. మధురలాలసకు బిరుదునూపురములు చేయింప నియమించును. అందుకు మధుర లాలస ఆనందించి. అత్యపూర్వములైన ఆభరణములు ధరించును. ప్రసంగవశమున చెలికత్తెల వలన పసిబాలికగ పడసిన మణిహారము సంగతి విని. ఆ మణిహారమును తెప్పించి.

" నిజహృదయస్థలలంబియగుటకుఁ దగినట్లుగా నిరుగడలఁ
గొన్ని మణులు నిలిపి నూతన సూత్రంబునం గ్రుచ్చి ధరియించి
యంచితవిలాసంబు పరిఢవిల్ల సురఁటిగొని వరుని కడ
కరిగి పరిచర్య సేయు"ను. 147వచ.8ఆ.

అప్పుడు సత్వదాత్ముడు బిరుదందెలు పట్టుకొని వచ్చి. మధురలాలసకు ధరింపుమని ఇచ్చి. సాష్టాంగదండప్రణామము సేయును. మధురలాలస "వలదు వలదు నాకు వందనార్హుఁడవు. మేనమామవు." అని సత్వదాత్మునికి మ్రొక్కును. అప్పుడు కళాపూర్ణమహారాజు నవ్వి. పసిబాలికగ చెప్పలేకపోయిన సత్వదాత్ముని వృత్తాంతము చెప్పించును. అది సుగ్రహుని వృత్తాంతము. అందుమణిహారము మర్మము కలదు.

సుగ్రహుడు మహారాష్ట్రదేశ మేలెడు రాజు. రాజ్యమును కోల్పోయి. తిరిగి సంపాదించుటకు సర్వజ్ఞత్వము కొఱకు బాలకృష్ణుని గుఱించి తపస్సు చేయును. బాలకృష్ణుడు ప్రత్యక్షమై. తన మెడనున్న రత్నహారము తీసి. సర్వజ్ఞత్వము సకలవాక్పటుత్వము కలుగు పద్ధతి తెలిపి ఇచ్చును. "అమ్మహనీయహారమును బడసి" సుగ్రహుడు వచ్చుచు. వనములోని దేవాలయమునందలి ఒక ద్వారప్రతిమను చూచి మెచ్చుకొనును. అంతలో ఒక యతీశ్వరుడును అచటికి వచ్చి. ఆ ప్రతిమను చూచి.

"బళిర శిల్పికులేంద్ర! బ్రహ్మను మీఱి తే
పగిదిఁ జేసితిర యీ ప్రతిమను? -" 171ప.8ఆ.

అని మెచ్చి, ఆశ్చర్యపడి, సంకోచము చెంది, అదేపనిగ చూచి ఆ సౌందర్యమునకు తమకముపట్టలేక ఆ ప్రతిమను అమాంతము కౌగిలించుకొనును. అది చూచి సుగ్రహుడు నవ్వును. ఆ నవ్వు విని, విననట్లు యతీశ్వరుడు ప్రతిమాలింగనము యదృచ్ఛాచేష్టావిశేషముగా కప్పిపుచ్చుటకు దేవాలయములోని దౌవారికాదిప్రతిమ లన్నిటిని కౌగిలించుకొనును. అతని కపటచేష్టకు సుగ్రహుడు "ఇట్లెంత చేసిన నీ పూర్వంపుఁ జేత నే నెఱుంగుదును గదా! యది మఱువను" అనును. యతీశ్వరుడు అలిగి "ఇది తుదగా నీ మొదలి యెఱుక యెంతగల దంతయు విహతంబయ్యెడు"మని శపించును. శాపగ్రస్తుడైన సుగ్రహుడు ఒక "శుచిస్థలి నిడిన" మణిహారమును మఱచిపోవును. అది మధురాపురనివాసి అయిన ఒక బ్రాహ్మణునికి దొరకును. అతడు ఇంటికి పట్టుకొనిపోయి దైవము వలె మణిహారమును బహుసంవత్సరములు భక్తితో పూజించి, ద్వారవతి కేగి కృష్ణునికి సమర్పించును.

కృష్ణుడు మణికంధరునికి బహూకరించును. మణికంధరుడు ధరించును. అది అలఘువ్రతుని ద్వారా పసిబాలిక మెడను అలంకరించును. కృష్ణుడు తన మెడలోని హారమును తీసియిచ్చినపుడు సుగ్రహునికి చెప్పిన విషయమిది :

" దీని నాయకరత్నం బెవ్వరి హృదయస్థలంబున నెంత తడవు
సోఁకియుండు వారికి నంత తడవును సర్వజ్ఞత్వంబును సకలవా
క్పటుత్వంబునుగలిగియుండు." 167వచ.8ఆ.

పసిబాలిక మెడను అలంకరించినపుడు నాయకమణి హృదయస్థలమును సోకినది. సర్వజ్ఞత్వము, సకలవాక్పటుత్వము కలిగినది. పసిబాలిక పూర్వజన్మము నందు కలభాషిణి- కృష్ణుడు మణిహారమును మణికంధరునికి బహూకరించుట, మణికంధరుడు ధరించుట, అలఘువ్రతునికి ఇచ్చుట కూడ ఎఱుఁగును. అందుకు "తిరుగఁ గ రెండేండ్లకు ....." అని పలికినది. రాజు ప్రశ్నలకు పసిబాలిక "విచిత్రకథల తల్లి" అయినది. సత్వదాత్ముడు తన వృత్తాంతమును అడుగుసరికి అటునిటు కదలినది. మణిహారము నాయకమణి హృదయస్థలమునుండి ప్రక్కకు జాఱినది. సర్వజ్ఞత్వము, సకలవాక్పటుత్వము పోయినది. సత్వదాత్ముని వృత్తాంతము చెప్పలేకపోయినది. ఆకలికి పసిబాలికవలెనే ఏడ్చినది. పసిబాలిక మధురలాలస.

పెరిగి, పెద్దదై కళాపూర్ణమహారాజు భార్య అయినది. మహారాజు ప్రతిజ్ఞానుసారము బిరుదందెలు చేయించుట వలన ప్రసంగమున విన్న మణిహారమును తీసి పెద్దది చేసి ధరించినది. నాయకమణి హృదయస్థలమును సోకినది. సర్వజ్ఞత్వము, సకలవాక్పటుత్వము కలిగినది. సత్వదాత్ముని పూర్వవృత్తాంతమును (సుగ్రహుని వృత్తాంతము) తెలిపినది. మణిహారము మహిమ బహిర్గతమైనది. కథాసంవిధానమునకు విచిత్రసంధానమైనది.

ఇట్టి కథాసంవిధానవిచిత్రసంధానము పూర్వము లేదు. మనోహరమైనది. మహత్తరమైనది. కాబట్టి కళాపూర్ణోదయము అపూర్వకథామహనీయము. అపూర్వకథాసంవిధానమహనీయము మాత్రమేగాక అపూర్వకథాసంవిధాన వైచిత్రీమహనీయము కూడ.

ఇంత అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయతాప్రధానకారణమైన మణిహారవృత్తాంతముపై ఆక్షేపములు కలవు. వానికి సమాధానములును కలవు.

ఆక్షేపాంశములివి:[170]

i. సుగ్రహుడు సర్వజ్ఞత్వ సకలవాక్పటుత్వఫలసిద్ధి లేకుండ శాపగ్రస్తుడగుట.

ii. బ్రాహ్మణుడు, అతని భార్య కూడ మణిహారమును ధరింపకపోవుట.

iii. బ్రాహ్మణుడు మణిహారమును సమర్పించినది షోడశసహస్రమహిషీ సహితుడైన శ్రీకృష్ణునికి. ఆ శ్రీకృష్ణుడు బహూకరించిన మణిహారము, మణికంధరుని మెడను "బాలతఁ గనుపట్టు"ట సమంజసము కాదు.

iv కళాపూర్ణుడు వేసిన మణిహారము, నాయకమణి పసిబాలిక హృదయస్థలమును సోకునట్లు పడుట.

v. సత్వదాత్ముడు తన వృత్తాంతమును అడుగుసరికి పసిబాలిక అటునిటు కదలుట.

vi. మధురలాలస విరహవేదనకాలమున, వివాహకాలమున, మణిహారమును ధరింపకపోవుట.

vii. మధురలాలస మణిహారమును నాయకమణి హృదయస్థలమును సోకునట్లు

పెద్దది చేసి ధరించుట.

సమాధానములోని సారాంశములివి:[171]

i. సుగ్రహుడు మణిహారమును ధరించు ప్రయత్నమే చేయలేదు. సర్వజ్ఞత్వమును సంపాదించు ప్రయత్నములో ఉన్న కించిద్జ్ఞత్వమును ఊడిపోయినది. (అతడు శాపగ్రస్తుడగుట స్వయంకృతాపరాధము. మణిహారమును ఇచ్చినపుడు కృష్ణుడు"బ్రాహ్మణమనోవ్యథం గావించువారియొద్ద నిదియుండదనియు నానతిచ్చెను." అయినను సుగ్రహుడు యతీశ్వరునికి మనోవ్యథ కలిగించెను.)

ii. మధురాపురి బ్రాహ్మణుడు భక్తుడు. అతని భార్య పెద్ద ముత్తైదువ. మణిహారము దేవాలయమునందు లభించినది. దేవాలయమునందు దొరికిన మణిహారమును ఆ నాటి బ్రాహ్మణదంపతులు దేవతాద్రవ్యముగ పూజించుట, ధరించకపోవుట సహజము.

iii. మధురాపురి బ్రాహ్మణుడు మణిహారమును సమర్పించినది షోడశసహస్రమహిషీసహితుడైన శ్రీకృష్ణునికే. కాని ఆ మణిహారము బాలకృష్ణుడు తన మెడనుండి తీసి సుగ్రహునికి ఇచ్చినది. చిన్నహారము. కాబట్టి శ్రీకృష్ణుడు బహూకరించినను చిన్నహారమైన మణిహారము మణికంధరుని మెడను "బాలతఁ గనుపట్టుట" అసమంజసము కాదు. సమంజసము.

iv. ఎవరు ఏ సమయమున ఏ శిశువు మెడలో ఏ హారమును వైచినను దానిని చక్కదిద్ది, దాని నాయకమణి హృదయస్థలమునకు వచ్చునట్లు వేయుట లోకసహజము.

v. శిశువులు కొంతసేపటికైన కదలకుండ ప్రాణాయామము పట్టినట్లు బిఱ్ఱబిగిసికొనియుండరు. అటునిటు కదలుట అతిసహజము. కదలినపుడు మణిహారము నాయకమణి హృదయస్థలమునుండి ప్రక్కకు జాఱుట సంభవము.

vi. విరహవేదనా సమయమున భూషణాదులపై విరక్తి గలిగి, ఉన్న భూషణములు గూడ నూడఁబెఱికిపాఱవైచుట సహజము. వివాహసమయమున కన్నియకు చెలికత్తియ లెవరో ముచ్చటకయి ముస్తాబు చేయుదురేగాని, కన్యక స్వయముగా నలంకరించుకొనుట మిక్కిలి యరుదు. సఖులు ధరింపఁజేసిన నాటి భూషణములలో ఈ మణిహారము కూడ కలిసియున్నను. ఈ హారము బాల్యమున

పతి యొసఁగినదనునంతటి వివరముగా ప్రసంగములు సాగుట కవకాశము గాని, దానిని పెద్దదిగఁ జేయించు యత్నమునకు తగిన సావధానత గాని లభింపవు.

vii. (ప్రతిజ్ఞానుసారము) భర్త యొసంగదలఁచిన అనర్ఘమైన అనితరవనితాలభ్యమైన బిరుదందెలు అందుకొనుటకై మహోల్లాసముతో మధురలాలస భర్తృసన్నిధి కేఁగునపుడు ప్రసంగవశమున మణిహారము ప్రసక్తి వచ్చుట, అది కూడ ధరించి భర్తృసన్నిధి కేఁగవలయునను కుతూహలము మధురలాలసకు కలుగుట సహజము. ఆ ధరించుటలోను మణికంధరుని మాదిరిగ మగవాని కంఠమాల వలె ఉన్నదానిని ఉన్నటులే మెడకు తగుల్చుకొనుట గాక, మణికొన్ని మణులు గ్రుచ్చి, అందమయిన హారముగ తయారు చేసికొని ధరించి, ప్రియుని కగపడు ముచ్చట పొడముట సముచితము. సమంజసము. సకారణము.

పయి ఆక్షేపాంశములకు "పదే పదే వలసినచోట్ల నెల్లఁ గాకతాళీయన్యాయముల నాశ్రయించుట కల్పనకు మిక్కిలి కొఱంత" అను మాట ఆధారము. అది యథార్థమే కాని, కళాపూర్ణోదయమునందు కాకతాళీయన్యాయములుగ కనిపించునవి కారణరహిత ములు కావు. సరస్వతీచతుర్ముఖుల శృంగారఘట్టమును బట్టి చతుర్ముఖుడు కల్పించిన కళాపూర్ణుని కథ అట్లే జరుగవలసినది. అందు సత్వదాత్ముడు సరస్వతి ఆత్మ. సమీచీనత్వదాత్ముడు సత్వదాత్ముడని అందే కలదు. (46వచ.5అ.) ఒక వ్యక్తి ఆత్మకు పూర్వవృత్తాంతము తెలియదు. సత్వదాత్మునికి పూర్వవృత్తాంతము తెలియరాదు. అందుకు శాపగ్రస్తుడగుట ఆవశ్యకము. అంతేకాదు. కళాపూర్ణోదయము మిశ్రకథ అనిపించు కల్పితకథ. వాస్తవకథకు కాకతాళీయన్యాయములను ఆశ్రయిం చుట మిక్కిలి కొఱంతయే. కల్పితకథకు కాదు. కాబట్టి కళాపూర్ణోదయము నిష్కళంకము.

పింగళి సూరన "అపూర్వకథాసంవిధానవైచిత్రియందు కవి, పాత్రలు కాక పుస్తకమే కథ చెప్పుట ఒక అపూర్వవిశేషము. మణికంధరుడు కాశ్మీరదేశములోని శారదాపీఠమునకు ఏగినపుడు, బ్రహ్మచారులకు వేదము చెప్పు ఒక వేదగురువును సందర్శించును. వేదగురువు శిష్టాధ్యయనము ప్రకటించి మణికంధరునితో మాటాడునెడ ఒక శిష్యుడు వచ్చును. వేదగురువు "ఓరి యేమిర కడు నాలసించితివి" అనిన, శిష్యుడు "నే నాలసించుటకు నిమిత్తము చాలఁ గలదు. మీ కేమియు వినఁ బడదుగావలయు! వినిపించెద వినుండు" అని, శాలీనుడు సుగాత్రి శతతాళదఘ్నహ్రదమున ఉఱుకుట, అచటి వారు వలలు వేసి గాలించినను కనబడక

పోవుట తెలిపి, అంతకు ముందు లతాగృహమునందు శాలీనుడు కొమ్మపై పెట్టి, చూపించిన పుస్తకము పట్టుకొనివచ్చి నట్లు తెలుపును. అది విని మణికంధరుడు వేదగురువును "ఆ శాలీనుడు ఎవరు? సుగాత్రి ఎవరు?" అని అడుగును. "ఆ యనఘుల చరితము గాదే యీ పుస్తకములోనిది" అని పుస్తకము పుచ్చుకొని, తలదాల్చి, కన్నుల కద్దుకొని, మణికంధరునికి ఇచ్చి చదువుమనును. మణికంధరుడు చదువును. అది సుగాత్రీశాలీనుల వృత్తాంతము. ఇట్లు పుస్తకము ద్వారా కథాసంవిధానము చేయుటయందు వైచిత్రి కలదు. అంతేకాదు. ఔచిత్యమును కలదు. సుగాత్రీశాలీనుల వృత్తాంతము శృంగారమయము. వేదగురువు చెప్పునది కాదు. ఇతరులకు తెలియునది కాదు. అది సరస్వతి రచించిన సుగాత్రీశాలీనుల జీవితచరిత్రమైన పుస్తకమునందు కలదు. ఏవంవిధమైన కథాసంవిధానవైచిత్రి పూర్వము లేనిది. మనోహరమైనది. మహత్తరమైనది. ఔచిత్యవిలసితమైనది.

ఇది ఆధునికసాహిత్యమునందు 'డైరీల' ద్వారా కథలను, నవలలను రచించు శిల్పవిధానమునకు ఆద్యప్రకృతి.

ఇట్లు కళాపూర్ణోదయము ఆద్యంతము "అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయ"మైన మహాకావ్యము. మౌలికమైన ఏకైకమహాకావ్యము.

## శృంగారరసప్రాయము

శృంగారరసప్రాయమన శృంగారరసమయము కాదు. శృంగారరసతుల్యము. అది ఏకవిధము కాదు. బహువిధము. "సూరనార్యునికి శృంగారరసాధిదేవత నర్తకి వలె బహురూపములసాక్షాత్కరించెను." అని ఒక అభిప్రాయము కలదు.[172] అన్వర్థము. సాధారణముగ శృంగారరసము సంస్కృతాంధ్రకావ్యములందు సర్వసమానము. అలంకారశాస్త్రలక్షణములను ఒకే మూసను కరిగించి పోతపోసిన విగ్రహము. కళాపూర్ణోదయమునందు ప్రజ్ఞాపాటవములను పెక్కు రీతుల ప్రదర్శించి దిద్ది తీర్చిన సజీవశిల్పము. కలభాషిణీమణికంధరుల, రంభానలకూబరుల, సుగాత్రీశాలీనుల, సరస్వతీచతుర్ముఖుల, సుముఖాసత్తీమణిస్తంభుల, మధురలాలసాకళాపూర్ణుల శృంగారము వైవిధ్యవిలసితము. మనస్తత్త్వవికసితము.

కలభాషిణి వేశ్య. మణికంధరుడు గంధర్వుడు. కలభాషిణీమణికంధరులు పూర్వపరిచితులు. నారదుని శిష్యులు. సబ్రహ్మచారులు. (క్లాస్‌మేట్స్) పరిచితులయిన తర్వాత, సబ్రహ్మచారులు కాక పూర్వము కలభాషిణి నలకూబరుని కూడ గోరినది.

సబ్రహ్మచారులయిన కాలమునందు మణికంధరుని వలచినది. క్రమశిక్షణకు భయపడి వ్యక్తము చేయలేదు. శాపభయమున మణికంధరునిపై కోరికను నలకూబరునిపై మఱలించినది. సప్రయత్నముగ, సాహసోపేతముగ నలకూబరుని కూడినది. కాని, ఆ నలకూబరుడు అసలు నలకూబరుడు కాడు. మాయానలకూబరుడు. మణికంధరుడే. కలభాషిణి మనస్తత్త్వమునందు ద్వంద్వప్రవృత్తి కలదు. అది వేశ్యోచితము.

రంభ దేవవేశ్య. నలకూబరుడు కుబేరుని కుమారుడు. ఉభయుల ప్రేమ ఉద్దండలీల. రంభ ప్రేమరాణి నలకూబరుడు ప్రేమలెంక. వీరి శృంగారము విమానమునందును విజృంభించును. రంభ "నవీనమార్తాండు దండ శుభ్రఘనరేఖ వర్తిల్లఁ జూచి నగుచు బ్రహ్మతోనున్న శారదామణిఁ బోల్చిన" (91ప.1అ.). నలకూబరుడు రంభ"మోవి దంతశిఖ నొత్తె"ను. దంతక్షతమునకు రంభ కంఠమునందు మణితస్వరము వెలువడెను. అది నలకూబరునికి ఆశ్చర్యము కలిగించి, "ఏది యేదీ! యిదిచాలఁ గ్రొత్త బళి! యింకొకమాఱిఁక నొక్కమాఱు" అని రంభను వేడెను. రంభ " కొంత కొంత తత్ప్రార్థనంబు సఫలంబు చే"సెను."నాచేత నింకఁ గాదిది యో చెలువుఁడ" అని రంభ అనగా, "కాకయున్నన్ విడనే నో చెలువ" అని నలకూబరుడు అనగా "వచనాగోచరసల్లాపరసము"ను కొంతసేపు సాగెను. అంతయు విమానమునందే. అంతేకాదు. రంభ మణికంధరునికి తపోభంగము చేసి, అతనిని కూడి,"నలకూబర! విడువిడురా యలసితి"ననెను. నలకూబరుడు మణికంధరుని తపోవనమునకు దగ్గఱి మామిడితోపులో ఉండెను. రంభ మాయానలకూబరుని గుర్తించి, "నీ వెవ్వండ? వెవ్విధంబుననిట్టి రూపంబు ధరియించి నన్ను వంచించితివి?" అని అడిగిన నలకూబరుడు "ఇది కాకదంతపరీక్ష సుమ్మి నా మన్మథార్తి యెన్నఁగవలదే చాలు రారమ్మటంచు నా రంభ నపుడు వేడ్కతో, మోముదామర వికసింప తోడ్కొని చనియెను." (283ప.3అ.) రంభ మణికంధరుని కూడుట విధినిర్వహణము. మణికంధరుని కూడి నలకూబర అని స్మరించుట నిర్భరప్రేమలక్షణము. రంభ మనస్తత్త్వము. మన్మథార్తి నలకూబరుని మనస్తత్త్వము. అది దేవవేశ్యకు, దేవవేశ్యాప్రియునికి ఉచితము.

సుగాత్రి పూజరి బ్రాహ్మణుని పుత్త్రి. సరస్వతి భక్తురాలు. శాలీనుడు ఇల్లటపుటల్లుడు. సరస్వతి భక్తుడే. ఇద్దఱు దంపతులు.శాలీనుడు శోభనపు గదిలో తొలిరేయి సుగాత్రి విభూషణాదిమహిమకు జంకి. ఆమెను పట్టుకొనుటకు సంకోచించును. సుగాత్రి వేచి వేచి తిరిగిపోవును. రెండు మూడు రోజులు అట్లే

జరుగును. ఆలుమగలుల పోరుము క్షేమియు కానరాక, సుగాత్రి చెలికత్తెలు చొఱవ తీసికొన్నదాని ఉపదేశింతురు. కాబట్టి సుగాత్రి "మాకును మంగళసూత్రం తీపాటి శుభస్థితి నుండుటయే పదివేలు" అని, భర్తకు ఆయురభివృద్ధికరములని ఎప్పుడును ఏమఱక వివిధాలంకారములు ధరించును. తల్లి అతనిని ఏమియు అనకుండ ప్రార్థించును. అయినను సుగాత్రి తల్లి "వట్టిగొడ్డు తాకట్టు" వ్యాపారమని, పూలతోట వ్యవసాయమునకు పంపును. అతడు తోటపనులనన్నియును చేయును. 'తాను నచ్చోటి కరిగి తోడుపడియెద'నని సుగాత్రి తలచునుగాని సిగ్గుచేత వెళ్లలేకపోవును. గాలివాన వచ్చును. భర్తకు ప్రమాదము వాటిల్లకుండ సుగాత్రి సరస్వతిని ప్రార్థించును. తల్లికి తెలియకుండ పూలతోటకు వెళ్లును. నిక్షేపముగ ఉన్న భర్తను చూచి, సరస్వతికి కృతజ్ఞత ప్రకటించి, ఇంటికి వచ్చి, ఏమియు ఎఱుగనట్లు ఉండును. కొన్నాళ్లకు పతిభక్తి కొలది, ఎప్పటి వలె వివిధాభరణములు ధరించి పూలతోటకు వెళ్లును. ఒంటిమీది నగలన్నియు తీసి, మూట కట్టి, చాటున పెట్టి తోటపనులు చేయును. అప్పటి సుగాత్రిని చూచిన శాలీనునికి మనస్సులో అనురాగము విజృంభించును. "నీకు తోటపనులకు ఎంత దూర మకటా!" అని ఉత్తరీయము కొంగుతో సుగాత్రి చెక్కిళ్ల చెమటబిందువులు తుడుచును. సుగాత్రి బడలిక చూడలేక జాలిపడుచు తమకము కొలది కౌగిలించుకొనును. పొదరింటికి తార్చి సుగాత్రిని "మదనమహారాజ్యభోగమహిమను" తేర్చును. అది గ్రహించి సుగాత్రి తల్లి ఆనందించును. సుగాత్రి చెలికత్తెలు కుతూహలము కొలది ఎప్పటి కంటె ఎక్కువ నగలు దిగవేసి, అలంకరించి సుగాత్రిని పడకగదికి పంపుదురు. శాలీనుడు "తద్విలేపనపటాభరణాదుల వైభవోన్నతులు ఱెప్పలు విచ్చి చూడక, చలింపనియట్టి పరాకుచేత నెప్పటియట్ల యుండును." సుగాత్రి తలుపు కడన ఉండును. చాలసేపటికి భర్తను సమీపించి, "కడుఁ ద్రిమ్మటచే శ్రమమొందినారు గాఁ బోలును! బోదునా? నిదురవోయెదరే?" అని చెవిలో అనును. "ఏ కోర్కిని వచ్చితివి?" అని శాలీనుడు ప్రశ్నించును."లోకమువారలు పతికడ కే క్కోర్కిని వత్తురు/" అని సుగాత్రి ఎదురు ప్రశ్న వేయును. అంతేకాదు.

'ఓ నాయక యితరంబులు
పో నిమ్మాపాటియైన బుద్ధి గలిగి నా
మానసములోని కోర్కుల
పూనిక యడిగితెరి లోకపూజితచరిత్రా.115
అకటా! యేమని దూఱుదాన మిము నాథా! వేగుజామయ్యెఁ బో౦

దదికగాఁ బాదములొత్త రమ్మనుట గానీ, యొంటియేమో కదా
నికటుక్షోణికి నేఁగుఁ దెమ్మనుట గానీ, కొంత నెయ్యంపుఁ బూ
నికతోఁ గన్నులు విచ్చి చూచుటయ కానీ లేద యొక్కింతయున్. 166
నేఁ దలతోఁటలో నపుడు నిబ్బరమైన మదీయభాగ్యపుం
బోఁడిమి యేమి పాకమునఁ బొందెనొ? మీ కృప యట్లు గాంచి పె
న్వాఁడిఁ దనర్చు నా చనవునన్ మిము నిమ్మొయి నంటిఁ గాని యే
నాఁడును బుణ్యసాధ్వికి గుణంబిదిగామి యెఱుంగుదున్ మదిన్."

"అని పలికి యంతరంగంబున నంతకంతకుం బ్రబలు కంతు సంతాపంబున వంతనొందుచుఁ గొంత చింతించి".

"రాయైనఁ గొంత మేల్ నా
రాయణ మీ మనసుకంటె! రహి నిఁక నెపుడున్
మిః యంతఁ దడవెదరె?" యని
యా యంగన యతని పాదముల్లనఁ బట్టెన్." 119ప.4ఆ.

సుగాత్రి ఎంతసేపు పాదసంవాహనము చేసినను, ఏమి సంవాదము సలిపినను శాలీనుడు బెల్లము కొట్టిన రాయివలెనే ఉండును. తెల్లవాఱిపోవును. సుగాత్రి పూలతోటకు పోయి పనులు చేయుచు పతి మన్ననలు పడయును. అప్పుడు సుగాత్రికి అర్థమగును శాలీనుని "మతికి నట్టి సొంపులే కాని భూషణా లింపుగామి." - ఇది శాలీనుని మనస్తత్వము. విలక్షణము. తన్నిమిత్తము "జానపదత్వముగ్ధత్వదోషము" (144వచ..4ఆ.) అంతేకాదు శాలీనుడు సార్థకనామధేయుడు. సుగాత్రిని అలంకారములు తొలగించుమని సూచింపడు. సిగ్గు కలవాడు. శాలీనశబ్దార్థమది. సిగ్గు తోపాటు పరాకు. పతిభక్తి సుగాత్రి మనస్తత్త్వము. సలక్షణము. శాలీనుని మనస్తత్త్వము వంటి మనస్తత్త్వము కల పాత్ర ఇతరత్ర కనిపించదు. మానవుడును అంతే. సుగాత్రీశాలీనుల శృంగారము అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయమైన శృంగారరసభృంగారము.

సుగాత్రీశాలీనులే సుముఖాసత్తీమణిస్తంభులు. సుగాత్రి సలక్షణమైన మనస్తత్త్వము సుముఖాసత్తియందు వికసించినది. శాలీనుని విలక్షణమైన మనస్తత్త్వము మణిస్తంభునియందు విపరిణమించినది. మణిస్తంభుడు మృగేంద్రవాహన అను శక్తికి బలి యిచ్చుటకు దూరదర్శనదూరశ్రవణశక్తుల ద్వారా లోకోత్తరసుందరి, లోకోత్తరగాయని అయిన వారయువతి కలభాషిణి అని కనిపెట్టి, కలభాషిణి ఇంట వసించి, కలభాషిణిని తన సింహవాహనము మీద వెనుక కూర్చుండబెట్టుకొని

గగనమార్గమునపయనించి. వాహనము దిగి కొంతదూరము కలిసి నడచి కూడ కామవికారము నందలేదు. కనీసము కలభాషిణిని తాక లేదు. కాని మృగేంద్రవాహన ప్రభావమున పొదరింటిలో పడినపుడు కామవికారము కలిగినది. కత్తి దూసి చంపబోయిన మణిస్తంభుడు పొదరింటిలో పడగానే కలభాషిణిని కౌగిలించుకొనును. (166ఉ.3ఆ.) పొదరిల్లు శాలీనునికి పడకిల్లు. మణిస్తంభునికిని పడకిల్లే అనిపించినది. అంతేకాదు మణిస్తంభుడు సుముఖాసత్తితో "ఓ యతివ! నీవు పురుషుడవు గమ్ము. నాతీత్వము భజింతు నేను" అని విపరీతరతేచ్ఛను పలుకును. పలికిన సుముఖాసత్తి "స్త్రీత్వము నీ పొందుము. పురుషత్వము నేఁ దాల్చెద" అని పలుకును. పలుకుటయే కాదు. మణిస్తంభుడు సుముఖాసత్తి అగును. సుముఖాసత్తి మణిస్తంభుడు అగును. సుముఖాసత్తి అయిన మణిస్తంభుడు.

" అదియునుగాక యంగనల కంగజసంగరకేళికావిశే
షదశలయందు నెక్కుడగు సౌఖ్యగతుల్ మగవారి కంటె! నా
కిదియు నెఱింగికో నిపు డభీష్టము. గావున నిట్లయుండఁ గో
రెద నొక కొన్నినాళ్లు. విహరింపుము నీవును బూరుషాకృతిన్" 1066ప.5ఆ.

అని కోరును. అట్లు కొన్నాళ్లు ఉందురు. అందుకు చెప్పిన హేతువు(పద్యపూర్వార్ధము) భారతములోని భంగాస్వనుని వృత్తాంతమునందును కలదు.

" సురతంబునఁ గడు నెక్కుడు
పురుషుల కంటెను సుఖంబు పొలఁతులకు సురే
శ్వర యట్లగుటను నా కీ
వెరవున రమియించి నిలువ వేడుక గలిగెన్." 307ప.1ఆ.అను.ప.

ఇది భంగాస్వనుడు ఒక సరస్సులోని నీరు త్రాగి, స్త్రీ అయి, ఒక తపస్విని వివాహమాడి, వందమంది పురుషసంతానమును కని, ఇంద్రుడు పురుషత్వమును ఇచ్చెదననిన వలదని చెప్పిన హేతువు. భంగాస్వనుని, మణిస్తంభుని హేతువులు సమానమైనను ఫలితములు భిన్నము. భంగాస్వనుడు స్త్రీగా ఉండిపోవుట భారతములోని ఫలితాంశము. సుముఖాసత్తి మణిస్తంభుడగుట, మణిస్తంభుడు సుముఖాసత్తి అగుట. వ్యత్యస్తసుముఖాసత్తీమణిస్తంభులు సంసారము చేయుట కళాపూర్ణోదయములోని ఫలితాంశము. భార్యాభర్తలుగాను, భర్తృభార్యలుగాను సుముఖాసత్తీమణిస్తంభుల శృంగారము విలక్షణము.

సరస్వతి జగన్మాత. చతుర్ముఖుడు జగత్పిత. జగన్మాతృపితల సరసమే సరస్వతీచతుర్ముఖుల శృంగారము. చతుర్ముఖుడు సరస్వతీమధురాధరామృతాస్వాదనమునకు నాలుగు ముఖములు వేగిరింప, సరస్వతి ముఖమును తనవైపు త్రిప్పుకొని పొమ్మనకు చేర్చును. "ఇంతకంటె అన్యాయము కలదా? ఏకాస్యను. ఇది చాలించెదరా? ఇంకేమైన కలదా? అని సరస్వతి మెడ బిగించి. అధరమునకు వేయి అడ్డు పెట్టి. మోము దూరము సేసి. చిఱునవ్వు చిఱుకోపము చిఱువిలాసము చిందులాడ తళుకు చూపుల. చూపు శర్వనముల బొమముడిపాటు సిరుల. బ్రహ్మను కెరలించును. బ్రహ్మ సరస్వతి మోము బలవంతముగా వంచి. అధరక్షతము సేయును. దంతక్షతమునకు సరస్వతి కంఠమున మణితస్వరము వెలువడును. కళామర్మభేదమును కప్పిపుచ్చుకొనుటకు సరస్వతి లేని అలుక కల్పించుకొని అవ్వలిమొగముగా పొరలును. అదియెల్ల కళాపూర్ణుని కథగ బ్రహ్మ చెప్పును కళాపూర్ణునికి సుముఖాసత్తి అనునది తండ్రి. మణిస్తంభుడు అనువాడు తల్లి అనగానే. సరస్వతి హాస్యముతో అభిముఖముగ తిరిగి. అకస్మాత్తుగ బ్రహ్మను కౌగిలించుకొనును. "ఇంతలోననె యోరి యెన్ని తప్పిబ్బులు దద్దఱిల్లకుడు" అని ధవుని వీపు చఱిచి. "ఆ రాజు జనని మగది. జనకుడు ఆడువాడునా?" అని ఇంకను నవ్వును. ఆ నర్మలీలకు బ్రహ్మ అధికసంభృతానందుడై. సరస్వతి మెడ కౌగిలించుకొని. ముక్కున కొలది నాలుగు ముఖములకు అధరపానమహోత్సవము కలిగించును. సరస్వతి అధరపీడ కలిగి. కొలది యెఱుగరని కోపము సూపుచు. కౌగిలి విడిపించుకొని. మోము దూరమగునట్లు రెండు చేతులతోను పట్టుకొనును. అప్పటి సరస్వతి కుచవిజృంభణము. లేగౌను బెడంగు కొంతసేపు చూచి బ్రహ్మ మోవితీపానును. ఇది సరస్వతీచతుర్ముఖుల సరసము. జగన్మాతృపితరులపరముగ సముచితము. అనిదంపూర్వమైన. అత్యంతమనోజ్ఞమైన. సముచితమైన. సరసమే సరస్వతీచతుర్ముఖుల శృంగారము.

అభినవకౌముది అప్సరఃకన్య. కళాపూర్ణుడు సద్యోయౌవనుడైన మహారాజు. అభినవకౌముది శల్యాసురుని "మడియించిన వానిని దక్క మఱొకరిని వరింప"నని ప్రతిజ్ఞ సేయును. అట్టివాని కొఱకు అన్వేషించును. మృగేంద్రవాహన ఆదేశానుసారమున మణికంధరునిచే శల్యాసురుని మడియించును. మణికంధరుడును మడియును.కాని. కళాపూర్ణునిగ సద్యోయౌవనుడై జన్మించును. అభినవకౌముది కళాపూర్ణుని సందర్శించి పూర్వవృత్తాంతము తెలుపును. యావజ్జీవము కళాపూర్ణునితో ఉండుటకు సమ్మతించును ఉభయులకు గాంధర్వవివాహము

జరుగును. అన్యోన్యదంపతు లగుదురు. అయినను. అభినవకౌముదీకళాపూర్ణుల శృంగారము లేదు.

మధురలాలస వరశిశువు. రాకుమారి. కళాపూర్ణుడు వరపుత్త్రుడు. మహారాజు. మధురలాలస యౌవనారంభదశను కళాపూర్ణుని పాణిగ్రహణమును అభిలషించును. విరహావస్థనందును. అది మఱపించుటకు ఆమె చెలికత్తెలు ఉద్యానవనమునకు తీసికొనిపోవుదురు. అచటికి వేగను వేటాడుచు కళాపూర్ణుడు వచ్చును. ఒకరి నొకరు చూచుకొందురు. మధురలాలస విరహము అతిశయించును. కళాపూర్ణునికి ప్రేమ అంకురించును. నర్మసచివుని ప్రమేయమున, అభినవకౌముది ఆమోదమున, మధురలాలసాకళాపూర్ణుల వివాహము జరుగును. అంతేకాదు. మధురలాల సాకళాపూర్ణుల శృంగారము కలదు. విప్రలంభశృంగారము తోపాటు సంభోగశృంగార మును కలదు. అది కావ్యరాజమార్గము.

కళాపూర్ణోదయమునందు కలభాషిణీమణికంధరుల (మాయారంభామాయా నలకూబరుల) సంభోగము కలదు. రంభానలకూబరుల సంభోగము కలదు. రంభామణికంధరుల సంభోగము కలదు. సుగాత్రీశాలీనుల సంభోగము కలదు. సుముఖాసత్త్రీమణిస్తంభుల సంభోగము కలదు వ్యత్యస్తసుముఖాసత్త్రీమణిస్తంభుల సంభోగము కలదు. కాని సంభోగవర్ణనము లేదు. ప్రసంగమే కలదు. అట్టిది మధురలాలసాకళాపూర్ణుల సంభోగవర్ణనము కలదు. కారణము కళాపూర్ణోద యమహాకావ్యమునకు మధురలాలసాకళాపూర్ణులే నాయికానాయకుల. నాయికానాయ కులు సంభోగవర్ణనమైనను. అశ్లీలతకు అసభ్యతకు ఆటపట్టు కాదు. సుశీలతకు. **సుసభ్యతకు ఆయువుపట్టు. అదే ఆధునికవిమర్శకు గుఱియైననది.**[173]

"వధూవరు లేకాంతము గోరుచున్నారు. చెలికత్తెలు గొంచెమును వదలరు. కవియన్ననో యీ సమయమునఁ బ్రాణముఁ బోయినను వారిని వదలఁ బోఁడు! ........ (మధురలాలస "మెడికల్ కాలేజ్ ప్రొఫెసర్ల" రీతిని పురుషుని శరీరభాగముల వర్ణించుచున్నది. చాలీచాలని దానికి తన పరువేర్పడునట్లు బాగుగ విడదీసి యాడెడు మాట వినుండు!
" ఆ లలితచరణము లొత్తు కేలు గేలు
కోర్కిఁ దద్వక్షమునఁ జేర్చు కుచము కుచము
దివుటఁ దద్రహఃకథ విను చెవులు చెవులు
పలుకులేలఁ దద్రతిఁ గన్న బ్రదుకు బ్రదుకు."

పోతనామాత్యుని "కమలాక్షు నర్చించు కరములు కరములు" అను మహోత్తరపద్యమునకుఁ బట్టిన గ్రహచారమా యీ అనుగమనము! ......... కల్పనాశక్తి యే దిక్కునఁ బోయెనో! సంభాషణచాతుర్యమెందు గ్రుంకెనో! ప్రతిభ యెటు మటుయమాయెనో! అలంకారాదిశాస్త్రములయందలి మూఢభక్తి పటుతమము!"

ఇది కాలదోషమే. అలంకారశాస్త్రముల, సంస్కృతాంధ్రకావ్యముల అనుసరణమే.

# పుణ్యవస్తువర్ణనము

పుణ్యవస్తువన పుణ్యప్రదమైన వస్తువు. వస్తువన ఇతివృత్తము. పుణ్యప్రదమైన ఇతివృత్తము పుణ్యవస్తువు. కళాపూర్ణోదయమునందు నారదతుంబురుసంవాదములోని శ్రీకృష్ణుని వృత్తాంతము, మణికంధరుని తీర్థయాత్రలు, స్వభావసిద్ధుని శ్రీశైలయాత్ర, లక్ష్మీనారాయణసంవాదకథ ప్రధానమైన పుణ్యవస్తువులు. పుణ్యవస్తువులకు సంబంధించిన అంశముల వర్ణనములెల్ల పుణ్యవస్తువర్ణనము.

శ్రీకృష్ణుని వృత్తాంతమునందు నారదాగమనము విని, శ్రీకృష్ణుడు వాకిటి హజారమునకు వచ్చిన విధానము శ్రవోలంకారమే గాక, మనోమోహనము.

" **తూఁగుటుయ్యెలఁ దూఁగుచోఁ గొంత చెదరిన**
**యరవిరి వన్నె బా గల్లుయుండ**
నడపంబు తొయ్యలి మడిఁచి యిచ్చిన తెల
నాకుఁ జీలిక చేతియంద యుండ
నట్టిటు తొడిగిన యంఘ్రుల రత్నంబు
సమ్మాళిగలు సారెఁ జాఱుచుండ
రాణివాసపుఁ జామరగ్రాహిణులు గూడ
నరుగుదెంచి తమంత మరలుచుండఁ
దనకుఁ గైదండ యొసఁగిన తరుణి కేలు
వదల నెఱుఁగమి నది తోన వచ్చుచుండఁ
గనిన వారెల్ల నొదుఁగుచుఁ గలఁగుచుండ

[illegible] 172.2ఆ.

మణికంధరుని తీర్థయాత్రలందు తిరుపతి వేంకటేశ్వరుని దర్శన విధము

" [illegible]
మన్దహాసము [illegible]
మణిమేఖలయు బొడ్డు [illegible] వళులును బైఁ
[illegible] నూఁగారు [illegible] సిరియు
వరదహస్తము [illegible] కేలు శం
ఖము జక్రమును దాల్చు కరయుగంబుఁ
దారహారంబులుఁ జారుకంఠంబు ని
ద్దపుఁ జెక్కులును నవ్వుదళుకు పసలు
మకరకుండలములును దామరలఁ దెగడు
కన్నులు మనోజ్ఞనాసయుఁ గలికి బొమలు
నుదుటి యొప్పు నామమును రత్నమకుటవరము
నెసఁగఁ గనుపట్టు శ్రీవేంకటేశుఁ జూచె" 132ప.2ఆ.

ఇట్లు చూచి భావించి భావించి మణికంధరుడు తెల్పిన అనుభూతి స్వానుభవైకవేద్యము.

" పదపద్మములఁ జిక్కి పాయదు నా దృష్టి
కనకాంబరమున కే కరణి దెత్తుఁ
గనకాంబరమునఁ గీల్కొనినఁ జలింప దే
నుదరబంధమున నెట్లొనరఁ గూర్తు
నుదరబంధమున నింపొంది భేదిల్లదు
శ్రీవత్సమున కెట్లు చేరఁ దిగుతు
శ్రీవత్సమునఁ దారసిలిన రానేరదు
కేలుఁ దామరల కే క్రియ మరల్తుఁ
గేలుఁ దామరలను గళశ్రీల మోవి
మకరకుండలముల గండమండలముల
నాసఁ గనుఁగవ బొమలఁ గుంతలములందు
నెందుఁ బర్విన విడఁ జాల దేమి చెప్ప!" 136ప.2ఆ.

స్వభావసిద్ధుని శ్రీశైలయాత్రాసందర్భమునందు సూరన పాతాళగంగావర్ణనము

మహనీయదీప్తిసంపదలఁ బొదలి
వేదప్రసిద్ధమై వెలయు నద్భుతరత్న
మయసహస్రస్తంభమంటపమున
మహితవిభూతియుగ్మవిచిత్రరూపమై
ధర్మాదిసూరిపాదములతోడఁ
జెలువొందు మాణిక్యసింహాసనమున స
హస్రదళాబ్జమధ్యంబునందు
శేషతల్పాదిదిరూఢుఁడై సిరియు ధరయు
నీళయునుభజియింపంగ లీల నుండుఁ.
గేవలబ్రూవిలాసానుభావవి
తాఖిలాజాండవర్తనుం డచ్యుతుండు." 2330ప.8ఆ.

ఇంకను శేష. గ... వి.విష్వక్సేన. కుముద. పంచాయుధవర్ణనములు కలవు. (233ప.8ఆ.) మధురగతిరగడయందు మఱల విష్ణువర్ణనము కలదు. (234ప.8ఆ.) మణికంధరుని దండకమునందు (80ప.1ఆ.) శ్రీకృష్ణవర్ణనము కలదు. తురగవల్గనరగడయందు(159ప.2ఆ.) రామాయణ కథాసారము కలదు.

" దశరథావనీశవిమలతరతపఃఫలావతార
నిశితశరలఘుప్రయోగనిహతతాటకావిహార
కపటపటుసుబాహుదళనఘటితగాధిసూనుయాగ
అపరిమేయగౌతమాంగనాఘదమనపదపరాగ
కోమలేక్షుదళనసదృశఘోరశంభుచాపభంగ
భూమిజావివాహవిభవపూర్ణసమ్మదాంతరంగ

....... ........ ..... ... .........

పర్వతౌఘరచితసేతుబంధసుతరసింధుకాండ
గర్విపంక్తికంఠకంఠఖండనప్రచండకాండ
సకలదివిజనుతచరిత్ర సాధుభవలతాలవిత్ర
సకరుణాంతరంగనేత్ర జానకీమనోజ్ఞగాత్ర
యతిజపార్థపుణ్యనామ యతివితీర్ణభక్తకామ
సతతసితయశోభిరామ సర్వలోకపూర్ణధామ
అహితవిదళనాతిరౌద్ర యార్తపాలనావినిద్ర
మహితనిఖిలగుణసముద్ర మమ్ముఁబ్రోవురామభద్ర." 159ప.2ఆ.

ఇట్లు కళాపూర్ణోదయము ప్రతిపదసార్థకముగ ప్రత్యంశప్రశం సార్హముగ "అపూర్వ...సంవిధానవైచిత్రీమనో...నీయంబును శృంగారరసప్రాయంబును బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును నగు" మౌలికమైన మహాకావ్యము.

# వర్ణనావైశిష్ట్యము

కళాపూర్ణోదయము ద్వివిధము. కథాప్రారంభము నుండి (1ప.1ఆ.) మధురలాలస బాల్యవృత్తాంతము వఱకు (201ప.6ఆ.) ఒక విధము. మధురలాలస యౌవనారంభము నుండి(202ప.6ఆ.) కళాపూర్ణుని కథాంతము వఱకు (262ప.8ఆ.) మఱొక విధము. మొదటి విధము -ఇంచుమించు మొదటి ఆరు ఆశ్వాసములు- కథాప్రధానము. రెండవ విధము-చివఱి రెండు ఆశ్వాసములు పైగా- వర్ణనప్రధానము. కథాప్రధానమైన కావ్యభాగమునందు కథానుగతమైన, కథాప్రయోజనము కల కతిపయవర్ణనములు కలవు. వర్ణనప్రధానమైన కావ్యభాగమునందు అలంకారశాస్త్రములలోని అష్టాదశవర్ణనలను అనుసరించిన అనేకవర్ణనలు కలవు. కథాప్రధానమైన కావ్యభాగము నవ్యమార్గము. వర్ణనప్రధానమైన కావ్యభాగము పూర్వమార్గము.

కథాప్రారంభమునందు పురవర్ణనము (1-22ప.1ఆ.9వచ.1ఆ.) నాయికావర్ణనము(23-33ప.2ఆ.) కథామధ్యమునందు వర్షావర్ణనము (866-88ప.4ఆ.) కలవు. పురవర్ణనము ద్వారకానగరవర్ణనము. అది కథకు ఆధారము. నాయికావర్ణనము కలభాషిణి వర్ణనము. అది కథకు ఆవశ్యకము. వర్షావర్ణనము కథాప్రయోజనము కలది. సముద్రవర్ణనము కథాప్రేరణము కలది. ఈ మూడు వర్ణనలును ఇట్లు కథానుగతములు.

తెనుగు కావ్యములలో కథాప్రారంభమునందు పురవర్ణనము తిక్కన ఉత్తరరామాయణము నుండి ప్రారంభమైనది. ఆ పురవర్ణనములు సర్వపురసాధారణములు, ఏ పురమునకైనను వర్తించునవి. ...వి భీమేశ్వరపురాణములోని దక్షారామపురవర్ణనము. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదములోని శ్రీవిల్లిపుత్తూరు పురవర్ణనము. మధురాపురవర్ణనము. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని మధురాపురవర్ణనము సర్వపురసాధారణములు కావు. ఆపురములకే వర్తించునవి. అట్లు పింగళి సూరన కళాపూర్ణోదయము లోని సగము పద్యములు (1-8; 20-23) ఆ పురమునకే వర్తించునవి. అంతేకాదు. ఒక

పద్యమునందు నాటకీయధ్వని కూడ కలదు.

" సురుచిరవస్తుసంపదల సొంపునఁ బెంపు వహించుచున్న యఁ
వ్వరపురి యాత్మసామ్యపువివాదముఁ దీర్చుకొనంగఁ బిల్చుని
ర్జరనగరిన్ సువర్ణమయసౌధకరప్రసరంబు చేత నం
బరము గ్రహించి భూరితరపౌరజనారవగౌరవంబుచేన్." 3ప.1ఆ.

ఇందలి వరపురి ద్వారక. నిర్జరనగరి అమరావతి. ద్వారకానాథుడు శ్రీకృష్ణుడు. విష్ణువు అవతారము. విష్ణువు ఉపేంద్రుడు. అమరావతీవల్లభుడు ఇంద్రుడు. ఇంద్రోపేంద్రుల పురములకు ఆత్మసామ్యపు వివాదము సహజము. అది తీర్చుకొనుటకు ద్వారక సువర్ణమయసౌధముల కిరణావళి చేత ఆకాశమును తాకి, పురజనుల కోలాహలము మిషను అమరావతితో కలహమాడునని పురవర్ణనము. కావ్యమునందు రంభాద్వయము కలదు. ఒకతె అసలు రంభ. మఱొకతె మాయారంభ. ఇద్దఱికిని ఆత్మసామ్యపువివాదము కలదు. ఒక రంభ చేతులు సాచి మఱొక రంభ వస్త్రము పట్టుకొని కలహమాడునని అర్థాంతరము. కరశబ్దమునకు కిరణము, చేయి అని, అంబరశబ్దమునకు ఆకాశము, వస్త్రము అని అర్థద్వయము. ఇది పురవర్ణనములోని నాటకీయధ్వని.

కథాప్రారంభమునందు పురవర్ణనము వలె, పురవర్ణనమునందు వేశ్యావర్ణనము సర్వకావ్యసాధారణము. కళాపూర్ణోదయములోని ద్వారకానగరవర్ణనమునందును వేశ్యావర్ణనముకలదు. కాని తిక్కన అయోధ్యానగరవర్ణనమునందలి వేశ్యావర్ణనము వంటిది కాదు. లాంఛనప్రాయమును కాదు. కథానుబంధము కలదు. కథానాయిక కలభాషిణి వేశ్యయే. వేశ్య నాయిక అగుట విమర్శకు గుఱి అగును. అందుకు ద్వారకా"పట్టణమున నున్నయట్టి ప్రజలే జాతిం బుట్టిన వారలు వంద్యులు" అని ముందే సూరన జాగరూకత వహించెను. (22ప.)ద్వారకలోని "ఒక నటముఖ్యుని ప్రియనందన" (23ప.) కలభాషిణి.

కలభాషిణి వర్ణన ఎనిమిది పద్యములందు కలదు. ఆమె చూపు, రూపు, జవ్వనము విటులను అవస్థపెట్టుట ఆరు పద్యములందు కలవు. (26-29;32-33ప.-) అవి కలభాషిణి సౌందర్యమును అభివ్యక్తము సేయును. ఒక పద్యమునందు కలభాషిణి చక్కదనము, వన్నెలాడిదనము, కలికితనముల ప్రశంస కలదు. (30ప.) ఒక్క పద్యమునందు మాత్రమే తన్వంగవర్ణనము కలదు. ప్రత్యంగవర్ణనఘట్టము లేదు. కలభాషిణి సౌందర్యమును అభివర్ణనము సేయుట కంటె అభివ్యక్తము సేయుట

సూరన పద్ధతి.

కలభాషిణి చెలికత్తెలతో డోలావిహారము సేయునెడ. "నాకమృగీనేత్రల మీఁదఁ గయ్యమునకుం గాల్సాచు లా గొప్పెడున్" అని కవికుమారుడైన మణికంధరుడు కతపత్రమిడుట. (43ప.1ఆ.) "త్రైవిష్టపస్త్రీల యొఁదలఁ దన్నుం జనునట్లు మించెననినం దప్పేమి యొప్పె యగున్" అని త్రిలోకసంచారి అయిన నారదుడు ధ్రువపత్ర మిచ్చుట (45ప.1ఆ.) వారి మనస్సులలోని కలభాషిణి లోకోత్తరసౌందర్యమును వ్యక్తము సేయును. అంతేకాదు.

" పదిలముగ నిర్విపక్షా
భ్యుదయమహారాజ్యలక్ష్మి పొందున్ వశతన్
సదలమలరూపసుగానా
స్పదవారవధూటి నిచటు బలిగా నిడినన్." 119పప.33ఆ.

అను మృగేంద్రవాహనాలయములోని శిలాస్తంభశాసనపద్యమును చదివి. మణిస్తంభుడు

" ఆ కోరికకై" కలదొకో
లోకోత్తరగానయుతయు లోకోత్తరర
మ్యాకృతియు నొకతె వార
స్త్రీకులమున" ననుచు దూరదృష్టిన్ వెదకున్ 108.
తానును గిన్నర యొకటి మ
హానందత మీటుచుండు ననిశంబును ద
ద్గానరసజ్ఞత నిలఁ గల
గానము దూరశ్రవణముకతమున నరయున్" 109పప.3ఆ.

అతడు దూరదర్శన. దూరశ్రవణశక్తుల అన్వేషణమున గుర్తించి కలభాషిణి గృహమునకు వచ్చి. నమ్మకము పుట్టించి. మృగేంద్రవాహనాలయమునకు కొనిపోవును. ఇది కలభాషిణి లోకోత్తరసుందరి. లోకోత్తరగాయని అని సువ్యక్తము సేయును.

మణిస్తంభుడు తన వాహనమైన సింహము మీద కలభాషిణిని ఎక్కించుకొని. ఆకాశయానముసేయునెడ. ఎదురైన రంభాసఖులు.

"ఎక్కడ దొరకెనొకో యీ
చొక్కపు గుబ్బెత బెడంగు బోగికి? నహహా
యిక్కలికిఁ గుత్తగొనుఁ బో
తక్కక దివి నిమిషమున్న దైవతవిటులన్.78.

"అని చెప్పికొనిరి. (79వచ.3.) కలభాషిణి స్వర్గమునందు ఒక్క నిమిషమున్న చో. అచటిదేవతావిటులను గుత్తగొనుట తథ్యమని దేవతావిటీమణుల నిర్ణయము. ఇది కలభాషిణి భూలోకోత్తరసుందరియే కాదు. స్వర్లోకోత్తరసుందరి అని భంగ్యంతర ముగ అభివ్యక్తము సేయును. ఈవిధమైన సౌందర్యాభివ్యక్తీకరణము ఇతరకవులందు మృగ్యము. ముదుసలి అయిన సుముఖాసత్తి జవరాలైన సుగాత్రి అగుట కళాపూర్ణోద యమునందు ఒక అద్భుతసంఘటన. అచట ముదుసలి వర్ణనము. జవరాలి వర్ణనము ముచ్చట గొలుపునవి.

" పసిమిపో నెండిన కసవుబుట్టయుఁ బోలె
నరవెండ్రుకలు పర్వు శిరము వలన
నులిగొన్న చెలఁది పూర్వుల నూలివళ్లు నా
నమరెడు ముడుత కన్బొమల వలనఁ
గడుఁ జిట్లినట్టి బంగరుపూఁత పొక్కిళ్ల
వడుపు సూపెడి మేని వళుల వలనఁ
దునిపి వ్రేలెడు మ్రాఁకుతునుకలఁ దలపించు
బాహావక్షోజలంబనము వలన
ఘూకరవముల చాడ్పున ఘోరవృత్తిఁ
దనరు ఘనకాసకుహికుహిధ్వనుల వలన
భావజుఁడు వెళ్లిపోయిన పాడుమేడ
పగిదిఁ గాన్పించు ముదుసలి పడఁతి యొకతె." 90ప.3ఆ.

ఇందలి "భావజుఁడు వెళ్లిపోయిన పాడుమేడ పగిదిొ" అను సాదృశ్యకల్పనము ఆధునికభావకవిత్వమునకు అధ్యాపకవాణి వలె కలదు.

" నిండు చందురు నవ్వు నెమ్మోము సిరి తోడ
విరులు గ్రమ్మెడు వేణిభరము తోడ
నాకర్ణలోలంబులగు నేత్రముల తోడఁ
దళుకొత్తు చెక్కుటద్దముల తోడ

మిగుల మిటారించు బిగిచనుంగవ తోడ
లలితంపు బాహువల్లరుల తోడ
నతికృశత్వమున జవ్వాడు మధ్యముతోడ
నభినవంబైన నూఁగారు తోడ
వలువ మీఁదికిఁ దొలఁకు సువర్ణపులిన
గురునితంబప్రభాపరంపరల తోడ
మహితసర్వాంగలావణ్యమహిమ తోడ
నమరు ప్రాయంపు రూపు చిత్రముగఁ దాల్చె." 130.3ఆ.

సుగాత్రీశాలీనుల వృత్తాంతమునందు వర్షావర్ణనము మూడు పద్యములందు కలదు. మొదటి పద్యము బలువాన. అనగా జడివాన. రెండవపద్యము ఉద్ధతవృష్టి. అనగా పెద్దవాన. మూడవ పద్యము బెడిదంపువాన. అనగా భయంకరమైన వాన. ఉద్ధతవృష్టి వర్ణన ఉద్దండలీల.

" మిగుల జగంబు బెగ్గడిల మించెఁ దదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘసముదగ్రనిరర్గళఘర్ఘరార్భటీ
లగనఘనోచ్చలజ్జలఝుళంఝుళనిర్ఝరజర్ఝరీభవ
న్నగవిగళచ్ఛిలాగణఘణంఘణఘోషణభీషణంబుగన్." 87ప.4ఆ.

ఇట్టి వర్షావర్ణనము అష్టాదశవర్ణనములలోని ఋతువర్ణనమునకుఉద్దిష్టము కాదు. కథాగతికి కారణము.ఇంత భయంకరమైన వర్షము లేనిచో సుగాత్రి, తోటలోనున్న శాలీనుని కలియుట తటస్థించునది కాదు. కలియనిచో సుగాత్రీశాలీనుల దాంపత్యజీవితము సాగునది కాదు. కనుకవర్షావర్ణనము కథాప్రయోజనము కలది.

సుగాత్రీశాలీనులే సుముఖాసత్తీమణిస్తంభులు. వారు సింహవాహనము మీద దేశాంతర మేగునెడ సముద్రము కంటబడును. సముద్రము తీరు మణిస్తంభునికి కౌతుకము కలిగించును. సుముఖాసత్తికి సముద్రమును వర్ణించి తెలుపును. సముద్రవర్ణనమది ఆరుపద్యములందు కలదు. ఆరవ పద్యమిది:

" ఉదకముఁ గ్రోల వ్రేలెడు పయోదము పౌరుషకేళిసంభ్రమా
భ్యుదయగళద్రమాకబరి పోలిక నొప్పఁ దటిద్విలాసముల్
తదభివృతాంగకస్ఫురణలం దలపింపఁగ నీ పయోధి యు
ప్పిదము శయించినట్టి మురభేది తెఱంగు వహించెఁ జూచితే." 203ప.4ఆ.

మణిస్తంభునిది తొలినుండి విలక్షణమైన మనస్తత్త్వము. ఇట పయోధిపై(=సముద్రముమీద) పయోదము (=మబ్బు)వ్రాలిన దృశ్యము. మణిస్తంభునికి పురుషాయితకేళిగ భాసించినది. ఇట్టి విలక్షణమైన మనస్తత్వ్వము మణిస్తంభునికి లేనిచో. కళాపూర్ణుని జననము సంభవము కాదు. కళాపూర్ణుని తండ్రి "సుముఖాసత్తియనునది. "తల్లి" మణిస్తంభుఁడనెడి వాఁడు" అని ఆదిలోనే బ్రహ్మవాక్కు. (28.5ఆ.)

సుముఖాసత్తి అనగా సుగాత్రికి గర్భము గాకుండ.మణిస్తంభునికి అనగా శాలీనునికి వారి కూటమివలననే కొడుకు పుట్టునని వాణి వాక్యము. (105ప.5ఆ.) విలక్షణమైన మనస్తత్వ్వము కల మణిస్తంభుడు "ఓ యతివ! నీవు పురుషుండవు గమ్ము నారీత్వము భజింతు నేను" అని పలికిన. సుముఖాసత్తి "స్త్రీత్వము నీవొందుము పురుషత్వము నేఁ దాల్తు"ననెను. (95,96ప.5ఆ.) ఫలితముగ మణిస్తంభుడు స్త్రీ. సుముఖాసత్తి పురుషుడు. సుముఖాసత్తీమణిస్తంభులు వ్యత్యస్తులగుట వలన. సుముఖాసత్తి తండ్రిగ. మణిస్తంభుడు తల్లిగ కళాపూర్ణుడు జన్మించును. సుముఖాసత్తి అనగా సుగాత్రికి గర్భము గాకుండ. మణిస్తంభునికి అనగా శాలీనునికి గర్భము వచ్చి కళాపూర్ణుడు జన్మించును. ఇట్లు బ్రహ్మవాక్కు. వాణివాక్యము అవితథమగుటకు మణిస్తంభుని విలక్షణమైన మనస్తత్వమే ఆధారము. అది సముద్ర వర్ణన వ్యాజమున ఆవిష్కృతమైనది. కనుక సముద్రవర్ణనము కథా ప్రేరణము కలది.

ఇక ఆరవ ఆశ్వాసముచివఱినుండి నాయికావర్ణన (195-207ప.6ఆ.) నాయికా విరహవర్ణన (209-221; 241-271ప.6ఆ.)వనవర్ణన (224వచ.66ఆ.) జలకేళివర్ణన (225-233ప.6ఆ.) నాయకవిరహవర్ణన(3,4,6,-21ప.7ఆ.) వివాహవర్ణన (58-97ప.7ఆ.) రతివర్ణన (101-171ప.7ఆ.) ఋతువర్ణన(174-187ప.7ఆ.) మంత్రవర్ణన (241-270ప.7ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతవర్ణన(7-27ప.8ఆ.) ప్రయాణవర్ణన (29-33; 40-46ప.8ఆ.) సూర్యోదయవర్ణన (33ప.8ఆ.) యుద్ధవర్ణన (47-131వచ.8ఆ.) పౌరాంగనావిలోకనవర్ణన (139-144ప.8ఆ.) అలంకారశాస్త్రములలోని అష్టాదశవర్ణనలను అనుసరించినవి.

" మెఱుఁగెక్కి బిగువులై మీఱిన నవియు న
ట్లింపొందు గుబ్బపాలిండ్ల తోడఁ
గడుఁ గృశత్వంబునఁ బిడికిటి లోపల
నడఁగెడు బడుగు నెన్నడుము తోడఁ
జిఱునవ్వు తెలినిగ్గు చిలుకుచుఁ దనరారు
తళుకులేఁ జెక్కుటద్దములతోడ

జగతు నెందును లేని చక్కఁదనాన సొం
పగు చిన్ని ముద్దు నెమ్మొగము తోడఁ
గరము విలసిల్లు సకలాంగకముల తోడ
రహిఁ దనర్చు నలంకారమహిమ తోడ" 168ప.8ఆ.

కలదను పింగళిసూరన ప్రతిమావర్ణన అప్రతిమానము.

# శ్రీకృష్ణదేవరాయలు -కళాపూర్ణమహారాజు

సంఘమునకు సాహిత్యమునకు బింబప్రతిబింబసంబంధము సహజసిద్ధము. కథాకాలము నాటి సంఘము తోపాటు కవికాలము నాటి సంఘమును కావ్యమునందు నీడ కట్టును."రాయల నాటి రసికత"[174] రాయల నాటి పారిజాతాపహరణము. మనుచరిత్రము. ఆముక్తమాల్యదలందు ప్రతిఫలించినది. అంతేకాదు. కవులు ఉపజ్ఞతో కల్పించు కావ్యమునకు సమాజమే మూలప్రకృతి. పాత్రలకు వ్యక్తులే మార్గదర్శకులు. కళాపూర్ణోదయములోని కళాపూర్ణమహారాజు పాత్రకు మార్గదర్శి శ్రీకృష్ణదేవరాయలు. అతడు పింగళి సూరనకు అవ్యవహితపూర్వుడు. అంతేకాదు. సూరనకు శ్రుతపూర్వుడు. సూరన అల్లసాని పెద్దన మనుమరాలి భర్త అయిన. దృష్టపూర్వుడు. శ్రీకృష్ణదేవరాయల చరిత్ర జగజ్జేగీయమానము.

శ్రీకృష్ణదేవరాయమహారాయల జీవితమునందు రెండు దశలు కలవు. ఒకటి పట్టాభిషేకమునకు ముందు దశ. అది పూర్వదశ. రెండు పట్టాభిషేకము తర్వాతి దశ. ఇది ఉత్తరదశ. కళాపూర్ణమహారాజు వృత్తాంతమునందు రెండు జన్మలు కలవు. ఒకటి మణికంధరుని జన్మ. అది పూర్వజన్మ. రెండు కళాపూర్ణమహారాజు జన్మ. ఇది ఉత్తరజన్మ.శ్రీకృష్ణదేవరాయలు పూర్వదశలో కృష్ణరాయలు. కళాపూర్ణమహారాజు పూర్వజన్మలో మణికంధరుడు. కృష్ణరాయలు తిమ్మరుసు శిక్షణము కలవాడు. మణికంధరుడు నారదుని శిక్షణము కలవాడు. కృష్ణరాయలు కవి. మణికంధరుడు కవి. కృష్ణరాయల కవిత్వము విష్ణుపరము. మణికంధరుని కవిత్వము విష్ణుపరము. దండకములోని. శ్రీకృష్ణుడు శ్రీకామినీకామితాకారుడు. గోవర్ధనధారి మాత్రమే గాక. కూర్మవరాహావతారములు ఉపలక్షణములుగ దశావతారధారి. అనగా విష్ణువు. కృష్ణరాయల ఇష్టదైవము తిరుపతి వేంకటపతి. మణికంధరుని అభీష్టదైవము తిరుపతి వేంకటేశ్వరుడు. కృష్ణరాయలు అజ్ఞాతవాసి. మణికంధరుడు ఆశ్రమవాసి. అంతేకాదు. కృష్ణరాయలు చిన్నమతో ప్రణయము కలవాడు. మణికంధరుడు కలభాషిణితో

ప్రణయము కలవాడు. చిన్నమ వేశ్య. కలభాషిణి వేశ్య. కృష్ణరాయలు జీవితము వేశ్యతోనే ప్రారంభమగును. మణికంధరుని జీవితము మాత్రమే గాక, కళాపూర్ణోదయ మహాకావ్యమును వేశ్యతోనే ప్రారంభమగును. కళాపూర్ణోదయము పూర్వభాగమునందు కలభాషిణియే నాయిక. వేశ్య నాయిక అయిన తెలుగుకావ్యము కళాపూర్ణోదయము. సంస్కృతములోని మృచ్ఛకటికమను రూపకమునందు నాయిక వేశ్యయే గాని, వేశ్య అయిన వసంతసేనతో మృచ్ఛకటికము ప్రారంభము కాదు. బ్రాహ్మణుడైన చారుదత్తుని తోనే ప్రారంభమగునను. కళాపూర్ణోదయము వేశ్య అయిన కలభాషిణితోనే ప్రారంభమగును. కృష్ణరాయలు వీణావాదనకళాప్రవీణుడు. మణికంధరుడు వీణావాదనకళాప్రవీణుడు. ఇట్లు శ్రీకృష్ణదేవరాయల పూర్వదశ కళాపూర్ణమహారాజు పూర్వజన్మను పొడకట్టును.

కృష్ణరాయలు ఉత్తరదశ సద్యోవైభవము. మణికంధరునని ఉత్తరజన్మ సద్యోయౌవనము. శ్రీకృష్ణదేవరాయలు శ్రీకృష్ణావతారమని పారిజాతాపహరణ మునందు కలదు. (19ప.1ఆ.) శ్రీకృష్ణదేవరాయల కొలువుకూటము మహాజనసమ్మర్ద మని మనుచరిత్రమునందు కలదు.

" ఎకరాలన్ మందువాసాహిణములఁ గల భద్రేభసందోహవాహ
ప్రకరంబుం గొంచుఁ దత్తద్భువులు వనుపన్ రాయబారుల్ విలోకో
త్సుకులై నిత్యంబు శ్రీకృష్ణుని యవసరముల్ చూతు రందంద కొల్వం
దక యాప్రత్యూష మాసంధ్యము పనివడి తన్మందిరాళిందభూమినన్."

ఇట్లు విష్ణువు కొలువుకూటము మహాజనసమ్మర్దముగ కళాపూర్ణోదయము నందు కలదు. విష్ణువు ఒడ్డోలగంబై కూర్చుండిన సమయమునందు నారదుడు, తుంబురుడు, విశ్వావసుడు మొదలైన వీణాధరులు వచ్చి విష్ణుసేవకు అనుమతి కోరుదురు. దేవమునిసంఘములును వచ్చి అనుమతి కోరుదురు."విష్వక్సేనుండు వేత్రహస్తుండగుచు నందకి నెడగలుగ జడియుచు బరాబరి యొనరిం"చును. అంతలో శృంగారవనము నుండి లక్ష్మి అరుదెంచును. ఆమె కనిపించినదో లేదో అనేకులు బద్ధలవారు వచ్చి వారిని మోదుదురు. అందఱు కకావికలై పాఱిపోవుదురు. బ్రహ్మదేవుడు కూడ అతిదూరము పోవును. నారదుని సంగతి చెప్పనక్కఱలేదు. వేత్రహస్తులు తుంబురుని మాత్రము లోనికి తోడ్కొని పోవుదురు. నారదాదులు కనిపెట్టుకొని యుందురు." (68-81వచ.2ఆ.) కళాపూర్ణమహారాజు కొలువుకూటమును దేవేంద్రవైభవోపేతము. (2వచ.5ఆ.)

శ్రీకృష్ణదేవరాయలు సాహితీసమరాంగణసర్వభౌముడు. కళాపూర్ణమహారాజు సాహితీసమరాంగణ.సార్వభౌముడు. శ్రీకృష్ణదేవరాయల భువనవిజయసభను నవరత్నకవులు. అష్టదిగ్గజకవులు కలరు. కళాపూర్ణమహారాజు రాజాస్థానమునందు చతురాగమవిద్వత్కవులు కలరు. అంతేకాదు. కవుల రాజాస్థాన ప్రవేశమునకు కొందఱు అవరోధములు కల్పించుట ప్రసిద్ధము. శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన ప్రవేశమునకు ప్రయత్నించిన సంకుసాల నృసింహకవికి అవరోధము కల్పించినట్లు ఐతిహ్యము కలదు. మదాశయుని ఆస్థానప్రవేశమునకు ప్రయత్నించిన వారికిని అవరోధము కల్పించుట కలదు. అందుకు చతురాగమవిద్వత్కవులు మామిడిపండ్ల బుట్టలు మోయు పరిచారకుల వలె పోయి. మదాశయుని సన్నిధిని పండ్లబుట్టలు పెట్టుదురు. మదాశయుడు క్షేమసమాచారము లడిగిన. వారు ఆశువుగ చెప్పిన పద్యమిది:

" మాయమ్మానసునీవే
రాయలవై కావ దేవరా జే జే జే!
మాయాతుమ లానిన యది
పాయక సంతోసమున్న పలమిల సామీ!" 161ప.6ఆ.

ఇది తెలుగు పద్యము. సంస్కృతశ్లోకము కూడ. "దేవరా! జేజేజే_ ఇల సామీ- నీవే- రాయలవై- కావ- ఉన్న-పలము- సంతోసము- పాయక- మాయాతుమలు (మా ఆత్మలు)- ఆనిన- యది- మాయమ్మ- ఆన- సూ" అని తెలుగు అన్వయము. "మా- ఆయమ్- మాన- సునీవే- రాః- అలవా- ఏకా- ఆవత్- ఏవ- రాజే- అజేజే- మా- ఆయాతు- మలాని- న- యది- పాయక- సంతః- అసముత్- న- పల- మిల- సా- అమీ" అని సంస్కృతాన్వయము. ఇది గ్రహించి మదాశయుడు వారిని ఆస్థానకవులను చేయును. వారు కళాపూర్ణమహారాజు ఆస్థానకవులయిరి. పయి పద్యములోని "ఆంధ్రగీర్వాణభాషాశ్లేషవైచిత్రి చిత్తంబునం బాఱఁ గళాపూర్ణుండు వారలంజూచి 'యిట్టి విచిత్రకవిత మీ మతులకు నిపుడుఁ దోఁచునొకో?' అని కుతూహలము కొలఁది అడిగిన ప్రథమాగముడు ఆశువుగానే చెప్పిన పద్యమిది:

" తా వినువారికి సరవిగ
భావనతో నాను నతివిభావిసుతేజా
దేవరగౌరవమహిమన
మా వలసినకవిత మరిగి మాకు నధీశా!" 172ప.6ఆ.

ఇందు ఆంధ్రగీర్వాణభాషాశ్లేషవైచిత్రి పద్యమునందు వలెగాక, అను లోమవిలోమక్రమమునందు కలదు. తెలుగుపద్యమును తిరుగ చదివిన సంస్కృతశ్లోకము.

" శాఢీనకు మాగిరినుత
వికనసిలవమానమహిమవరగౌరవదే
జాతే సువిభావితి నను
నాతో నవభా గవిరసకిరివానువితా."

'శాఢి- ఇన- కుమ్- అగిరి- మత-వికనసి- లవమాన- మహిమవరగౌరవదే- సువిధౌ- ఇతి జాతే నను- నా- అతః- నవభాః- రసకిరి- గవి- అను- వి- తా- వా." అని పదవిభాగము. ఆది నుండి అంతమునకు తెలుగు పద్యము. అంతము నుండి ఆదికి సంస్కృతశ్లోకము. ఇది చిత్రకవిత్వమునకు శిఖరాగ్రము. ఇట్టి అనులోమవిలోమచిత్రకవిత్వము సూరనకు పూర్వము మృగ్యము.తర్వాత ఆది నుండి అంతమునకు, అంతమునుండి ఆదికి ఒక్కవిధమైన నలువదిశ్లోకముల దైవజ్ఞసూర్యపండితుని రామకృష్ణానులోమవిలోమద్వ్యర్థికావ్యము[175] కలదు. కళాపూర్ణోదయములోని అనులోమవిలోమాతుచిత్రకవిత్వము వంటి చిత్రకవిత్వము శ్రీకృష్ణదేవరాయల కొలువునందున్నట్లు కానరాదుగాని, ఆశుకవిత అగ్రేసరము.

శ్రీకృష్ణదేవరాయల దేవేరులు చిన్నాదేవి, తిరుమలదేవి. కళాపూర్ణమహారాజు దేవేరులు అభినవకౌముది, మధురలాలస. చిన్నమయే చిన్నాదేవి వేశ్య. అభినవకౌముది దేవవేశ్య. తిరుమలదేవి రాకుమారి. మధురలాలస రాకుమారి. చిన్నాదేవీశ్రీకృష్ణదేవరాయల వివాహమునకు పూర్వరంగము కలదు. అభినవకౌముదీకళాపూర్ణమహారాజులవివాహమునకు పూర్వరంగము కలదు. చిన్నాదేవి సద్యోవైభవుడైన శ్రీకృష్ణదేవరాయలను వివాహమాడెను. అభినవకౌముది సద్యోయౌవనుడైన కళాపూర్ణమహారాజును వివాహమాడెను. అది ప్రణయశపథపూర్వకము.ఇది సాహసశపథపూర్వకము. శ్రీకృష్ణదేవరాయల దేవేరులందు చిన్నాదేవికి ప్రథమస్థానము. తిరుమలదేవికి ద్వితీయస్థానము. అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు శ్రీకృష్ణదేవరాయల అనేకశాసనములందు అట్లు కలదు. కళాపూర్ణమహారాజు దేవేరులందు అభినవకౌముదికి ప్రథమస్థానము. మధురలాలసకు ద్వితీయస్థానము. కళాపూర్ణోదయమునందు ఇట్లు కలదు. తిరుమలదేవీశ్రీకృష్ణదేవరాయల వివాహము చిన్నాదేవికి సమ్మతము. మధుర

లాలసాకళాపూర్ణమహారాజుల వివాహము అభినవకౌముదికి సమ్మతము. చిన్నాదేవీ తిరుమలదేవులు అన్యోన్యత కల వారు. అభినవకౌముదీమధురలాలసలు అన్యోన్యత కల వారు. చిన్నాదేవి ఆజన్మసిద్ధసంగీతకళాప్రవీణ. అభినవకౌముది ఆజన్మసిద్ధసంగీతకళాప్రవీణ. తిరుమలదేవి అభ్యస్తసంగీతకళాప్రవీణ. మధురలాలస అభ్యస్తసంగీతకళాప్రవీణ.

శ్రీకృష్ణదేవరాయల ఉత్కళదేశదండయాత్రలకు తిరుమలదేవి కారణముగ ఒక ఐతిహ్యము కలదు. కళాపూర్ణమహారాజు సకలదేశదండయాత్రలకు మధురలాలస కారణముగ కళాపూర్ణోదయమునందు కలదు. శ్రీకృష్ణదేవరాయల దండయాత్రలకు ఫలితము దిగ్విజయపరంపర. కళాపూర్ణమహారాజు దండయాత్రలకు ఫలితము దిగ్విజయపరంపర. కాళిదాసు రఘువంశమునందు రఘుమహారాజు సకలదేశదిగ్విజయములు కలవు. వామనభట్టు వేమభూపాలచరితమునందు పెదకోమటి వేమారెడ్డి సకలదేశదిగ్విజయములు కలవు. కళాపూర్ణోదయములోనికళాపూర్ణమహారాజు సకలదేశదిగ్విజయములు తావన్మాత్రములు కావు. శ్రీకృష్ణదేవరాయల కళింగోత్కళదేశదిగ్విజయములు ప్రతిఫలించినవి. శ్రీకృష్ణదేవరాయలు ఉత్తరభారత దేశమును జయించినట్లు గయశాసనము కలదు. అది యుద్ధశాసనమని, శ్రాద్ధశాసనమని అభిప్రాయభేదములు కలవు.[176] కాని మనుచరిత్రమునందు,

" ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమా
రతకుఁ గ్రౌంచాచలరాజమయ్యె
నావాడపతిశకంధరసింధురాధ్యక్షు
లరిగాఁపు లెవ్వాని ఖరతరాసి
కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని
కసివాఱుగా నేఁగునట్టి బయలు." 11ప.1ఆ.

"అట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుండు" అని కలదు. ఇందు ఉదయగిరి కళింగదేశదండయాత్రలకు ఉపలక్షణము. అందుకు శాసనప్రమాణములు కలవు. కడమ వానికి శాసనప్రమాణములు మృగ్యము. కనుక అతిశయోక్తు లనుట చరిత్రకారులకు పరిపాటి. అతిశయోక్తులైనను అబద్ధములు కావు. పరమాణువంత నిజమునకు పర్వతమంత కల్పనమే అతిశయోక్తి. నిజమే అతిశయోక్తికి నిమిత్తము. శ్రీకృష్ణదేవరాయలకు గౌడదేశము "అసివాఱుగా నేఁగు నట్టి బయలు" కావచ్చును. అది కళాపూర్ణమహారాజు జయించినట్లు కళాపూర్ణోదయమునందు కలదు. అందు,

గౌడపతి పలాయము నొందిన. వెన్నంటి కళాపూర్ణుడు కోటలో ప్రవేశించునెడ. గౌడపతి కోట రక్షకులు "గవకుల మూయించి దంచనంబులఁ ఫిరంగులు జబురుజంగులుం దుపాకులు మొదలైన సాధనంబుల ముమ్మరమ్ముతోఁ గ్రమ్ముకొని"న. "సత్వదాత్ముండను కళాపూర్ణుడని ప్రెగ్గడ దమ మొగ్గరంబు నగ్గలిక మెఱయ లగ్గలకు డగ్గఱించి"నట్లు కలదు. (7వచ.8ఆ.) ఇందలి దంచనములు. ఫిరంగులు. జబురుజంగులు (ఫిరంగివిశేషము) తుపాకులు కళాపూర్ణమహారాజు నాటివికావు. దంచనములు పెదకోమటి వేమారెడ్డి నాటికి కలవు. ఫిరంగులు. జబురుజంగులు. తుపాకులు శ్రీకృష్ణదేవరాయల నాటివే. అంతేకాదు. కళాపూర్ణుని ప్రెగ్గడ సత్వదాత్ముడు మొగ్గరమునగ్గలిక మెఱయ లగ్గలకు డగ్గఱించుట శ్రీకృష్ణదేవరాయల మహామంత్రి తిమ్మరుసు మొగ్గరము నగ్గలిక మెఱయ లగ్గలకు డగ్గఱించుటను మూదలించును.

శ్రీకృష్ణదేవరాయలు కొండవీటియుద్ధమునందు ప్రతాపరుద్రగజపతి కుమారుడు వీరభద్రగజపతిని జీవగ్రాహముగా పట్టుకొని. విజయనగరము తీసికొనిపోయి. క్షమించి. దుర్గాధిపతిని చేసినట్లు శాసనప్రమాణము. వాఙ్మయాధారమును కలవు. కళాపూర్ణమహారాజు ఉత్కళనృపాలుని జీవగ్రాహముగా పట్టుకొని. క్షమించి. విడిచిపెట్టినట్లు కళాపూర్ణోదయమునందు కలదు.

"ప్రాణముతోడ నుత్కళనృపాలకు నమ్మెయిఁ బట్టి తెచ్చి సం
ప్రీణునిఁ జేసి తా విడిచె "నెన్నఁడు ని ట్లసమానయుద్ధపా
రీణులతోడ నింక నెదిరింపకుమీ" యని బుద్ధి చెప్పి క
ల్యాణగుణాఢ్యుఁ డంగవసుధాధిపుఁ డీప్సితరత్నహారియై." 92పప.8ఆ.

శ్రీకృష్ణదేవ రాయలకు కళింగతమిళకర్ణాటపాలకులు పరాజితులు. కళాపూర్ణ మహారాజునకు "కళింగద్రవిళచోళపాండ్యాదిభూపతులు వశవర్తులు." (92ప.8ఆ.) శ్రీకృష్ణదేవరాయల విజయదశమిమహోత్సవమునకు విచ్చేసిన.పరాజితు డైన. వీరభద్రగజపతి మల్లయుద్ధమునకు పందెము సఱచును. కళాపూర్ణమహారాజు విజయ లక్ష్మీస్వయంవరోత్సవమునకు విచ్చేసిన. పరాజితుడగు కేరళమహీపాలుడు "ఎక్కటియుద్ధమునకు పందెము సఱచును. (100వచ.8ఆ.) వీరభద్రగజపతి ఆత్మహత్య చేసికొనును. కేరళమహీపాలుడు పాదాక్రాంతుడగును.(108వచ.8ఆ.)

శ్రీకృష్ణదేవరాయలు శ్రీకృష్ణుని అవతారమని పారిజాతాపహరణమునందు కలదు. కళాపూర్ణమహారాజు "రుక్మిణీకాంతుఁ డు శౌరిచన్న వెనుకన్ మఱి దక్షుఁ డు"

అని కళాపూర్ణోదయమునందు కలదు. (116పప.8ఆ.)

గండపెండారము వీరభూషణము. "డాకాలి గండపెండారంబు దాపున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల" అల్లాడ వీరభద్రారెడ్డి నిండు కొలువుండెనని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. (4ప.1ఆ.) గండపెండారమునందు వ్రేలాడు బొమ్మలు ఓడిపోయిన శత్రురాజుల బొమ్మలు. వీరభూషణమైన గండపెండారమును కవిభూషణముగ చేసినది శ్రీకృష్ణదేవరాయలు. "బిరుదైన కవిగండపెండారమువ కీవ తగుదని నాదుపాదమున౯ దొడిగె "నని అల్లసాని పెద్దన చాటుపద్యమునందు కలదు. వీరగండపెండారమునందు ఓడిపోయిన శత్రురాజుల బొమ్మల వలె, కవిగండపెండారమునందు ఓడిపోయిన కవిరాజుల బొమ్మలు వ్రేలాడును. కవిగండపెండారమును కాంతాగండపెండారమును చేసినది కళాపూర్ణమహారాజు. కాంతాగండపెండారమునందు ఓడిపోయిన శత్రురాజుల బొమ్మల బదులు, ఓడిపోయిన శత్రురాజుల భార్యల శిరోరత్నములు పొదిగించెను. కళాపూర్ణమహారాజు గౌడ, ఉత్కళ, కళింగ, ద్రవిడ, చోళ, పాండ్య, కేరళ, ఘూర్జర, మాళవ,బర్బర, హూణ, ప్రాగ్జ్యోతిష, కోసల, మగధదేశాధిపతులను ఓడించి, వారి ప్రియాంగనల శిరోరత్నములతో మధురలాలసకు నూపురములు చేయించెను. అవి బిరుదునూపురములు. శ్రీకృష్ణదేవరాయల కవిగండపెండారము వలె, కళాపూర్ణమహారాజు కాంతాగండపెండారము!

శ్రీకృష్ణదేవరాయల కాలమునందు సాహిత్యము, సంగీతము మాత్రమేగాక, శిల్పకళ సహితము శిఖరాధిరోహణము చేసినది. కళాపూర్ణమహారాజు కాలమునందు సాహిత్యము, సంగీతము మాత్రమేగాక, శిల్పకళ సహితము శిఖరాధిరోహణము చేసినది. విజయనగరమునందు వలె బృందావనమునందు శిల్పములు సజీవసుందరములు.

" మెఱుఁగెక్కి బిగువులై మీటిన నవియు న
ట్లింపొందు గుబ్బపాలిండ్ల తోడఁ
గడుఁ గృశత్వంబున బిడికిటి లోపల
నడఁగెడు బడుగు నెన్నడుము తోడఁ
జిఱునవ్వు తెలినిగ్గు చిలుకుచుఁ దనరారు
తళుకులేఁ జెక్కుటద్దముల తోడ
జగతి నెందును లేని చక్కఁదనాన సొం

పగు చిన్ని ముద్దు నెమ్మొగము తోడఁ
గరము విలసిల్లు సకలాంగకముల తోడ
రహిఁ దనర్చు నలంకారమహిమ తోడ
ద్వారశాఖల దండ నింపారుచున్న
ప్రతిమ నొక్కటి చూచె భూపాల చంద్ర!" 168ప.8ఆ.

స్వగ్రహుడు చూచి "మనంబునమెచ్చుచు" నుండ. యతీశ్వరుడు వచ్చి. చూచి

" బళిర శిల్పికులేంద్ర! బ్రహ్మను మీఱి తే
పగిదిఁ జేసితిర యీ ప్రతిమ?" ననుచుఁ
దనమదిఁ గడు మెచ్చి తల యూఁచుచును "నిట్టి
పడఁతులు గలరొకో పుడమి!" ననుచు
"నిట్టిది సన్న్యాసి కీక్షింపఁ దగ"దని
మార్మోము వెట్టుచు మఱియు మఱియు
నిచ్చఁ గ్రమ్మఱఁ జూచు నేమిచెప్పు!
నతను వికృతికి లోనయ్యె" 171ప.8ఆ.

అతనువికృతికి లోనగుటయే కాదు. "నెమ్మనమునఁ బట్టలేక ప్రతిమన్ బిగియారఁ గవుంగలించె"ను. (173ప.8ఆ.) శిల్పసుందరి అంత సజీవసుందరి! విజయనగరమునందు సహస్రస్తంభమంటపము కలదు. వైకుంఠము నందు"అద్భుతరత్నమయసహస్రస్తంభమంటపము" కలదు. (230ప.8ఆ.) శ్రీకృష్ణదేవ రాయలు ఆముక్తమాల్యదయందు ప్రతిపాదించినది విశిష్టాద్వైతసిద్ధాంతము. కళాపూర్ణమహారాజు లక్ష్మీనారాయణసంవాదకథను ప్రతిపాదించినది విశిష్టాద్వైతసిద్ధాంతము. ఇట్లు శ్రీకృష్ణదేవరాయలు కళాపూర్ణమహారాజు పాత్రసృష్టికి మార్గదర్శి. అయినను.

"బళిర కవికులేంద్ర! బ్రహ్మను మీఱి తే
పగిదిఁ జేసితిర యీ పరమసుకృతి"

అనిపించు మహాకావ్యము కళాపూర్ణోదయము.

# ప్రభావతీప్రద్యుమ్నము

ఇది అపూర్వకథ కాదు. అపూర్వసంవిధానము లేదు. అపూర్వసంవిధానవైచిత్రి అంతకంటె లేదు. శృంగారరసప్రాయము కాదు. శృంగారమయము.కళాపూర్ణోదయము మేరుగిరి. ప్రభావతీప్రద్యుమ్నము మేరుపూస. కళాపూర్ణోదయములోని కలభాషిణి. రంభ. సుగాత్రి. సుముఖాసత్తి. రూపానుభూతి. అభినవకౌముది. మధురలాలస మొదలైన స్త్రీపాత్రలెల్ల శృంగారమూర్తులు. ప్రభావతీప్రద్యుమ్నములోని ప్రభావతి కూడ మహాశృంగారమూర్తి. మధురలాలస చెల్లెలు కాదు. అక్కయే. స్త్రీలు శృంగారమూర్తులే కారు. ప్రజ్ఞానిధులు కూడ అని ప్రతిపాదించుటకు ప్రభావతీప్రద్యుమ్నము రచించుట సంభవము. శుచిముఖి పాత్ర తన్నిమిత్తము. కళాపూర్ణోదయము కల్పితకథ అను సమకాలికుల అధిక్షేపమునకు సమాధానముగ ప్రసిద్ధకథను గ్రహించి ప్రభావతీప్రద్యుమ్నము రచించుట కూడ సంభావ్యము. ప్రభావతీప్రద్యుమ్నము పింగళి సూరన తండ్రి అమరయ్యకు అంకితము. తండ్రికి అంకితమిచ్చిన కృతులందు ప్రభావతీప్రద్యుమ్నమే ప్రథమగణ్యము.

## మూలము

ప్రభావతీప్రద్యుమ్నము "అఘహరణహరివంశకథాశ్రయంబు" అని (221ఉ. ఆ.) గ్రంథాంతమునందు కవివచనము. కాని. ఎఱ్ఱన హరివంశమునందుగాని. నాచనసోమనాథుని హరివంశమునందుగాని ప్రభావతీప్రద్యుమ్నకథ లేదు. అయినను సంస్కృతహరివంశమునందు కలదు. అంతేకాదు. ప్రభావతీప్రద్యుమ్నకథను గైకొని పండ్రెండవశతాబ్దిని తిరువనంతపురమును పాలించిన రవివర్మభూపుడు ప్రద్యుమ్నాభ్యుదయమను సంస్కృతనాటకమును సంతరించెను. తన్మూలము సంస్కృతహరివంశమే. హరివంశము తోపాటు ప్రద్యుమ్నాభ్యుదయమును పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నప్రబంధమునకు మూలభూతమే 177 హరివంశమునందు. ప్రద్యుమ్నాభ్యుదయమునందు. ప్రభావతీప్రద్యుమ్నమునందు వజ్రనాభుని వృత్తాంతము సమానము. ప్రద్యుమ్నాభ్యుదయమునందు. ప్రభావతీప్రద్యుమ్నమునందు హరివంశమునందు లేని చిత్రపటవృత్తాంతము కలదు. భేదమును కలదు. హరివంశమునందు శుచిముఖి కలదుగాని. సామాన్యశృంగారదూతిక మాత్రమే. ప్రద్యుమ్నాభ్యుదయమునందు శుచిముఖి పాత్రయే లేదు. ప్రభావతీప్రద్యుమ్నమునందు శుచిముఖి పాత్రయే ప్రాణము. ప్రాణము పోసినది పింగళి సూరనయే. సూరన పాత్రచిత్రణమున శుచిముఖి

ప్రజ్ఞానిధి. ధీమాన్యమంత్రాంగదూతిక. సజీవపాత్ర. ప్రభావతీప్రద్యుమ్నము స్వతంత్రకావ్యము.

# శుచిముఖి

ఇంద్రుడు పార్వతీవరప్రసాదిని అయిన ప్రభావతికి, రుక్మిణీశ్రీకృష్ణుల సుతుడైన ప్రద్యుమ్నుని యెడల అనురాగము కలుగునట్లు చేయుడని హంసలను నియోగించినట్లు హరివంశమునందు కలదు. అందు శుచిముఖి ప్రసక్తి లేదు. ప్రభావతీప్రద్యుమ్నము నందే శుచిముఖి పాత్రకలదు. పాత్రపరిచయమే ప్రతిభావంతము. పాత్ర స్వరూపసామస్త్యమునకు ప్రాతిపదిక. ఇంద్రుడు హంసలను వజ్రనాభునిపురమునకు -వజ్రపురికి- రాకపోకలు సాగించి, అచటి విశేషములు తెలుపుడనగా,

> " పులోమజా వల్లభునకు శుచిముఖీవల్లభుండను మరాళ
> తల్లజుం డుల్లసితవదనుం డగుచు నెదుర నిలిచి ......" 117వచ.1ఆ.

పులోమజావల్లభుని పేరు ఇంద్రుడు. శుచిముఖీవల్లభుని పేరు లేదు. శుచిముఖీవల్లభుడనియే వ్యవహారము. అతడు మఱి అనామకుడు కాడు. అసమర్థుడును కాడు. మరాళతల్లజుడు. అయినను తల్లిదండ్రులు పెట్టిన పేరు మఱుగున పడినది. శుచిముఖీవల్లభుడను పేరు వెలుగుననకు వచ్చినది. అచటి హంసలలో ఇంద్రుని ఎదుట నిలిచి మాటాడినది అతడే. అంతటివాడు శుచిముఖీవల్లభుడని వ్యవహారప్రసిద్ధుడైన, శుచిముఖి ఎంతటివ్యక్తియో వ్యక్తమగును.

శుచిముఖీవల్లభుడు వజ్రపురి సమాచారము తెలిపి, "కించిదూనంబుగా వాని(వజ్రనాభుని) రాజ్యసంపదయుఁ దుదకువచ్చినది యిది మదీయజాయ వలన వినంబడియె" నని (117వచ.) తెలుపును. అది శుచిముఖీవల్లభుని బుద్ధికి అందలేదు. శుచిముఖీవల్లభుడు,

> " తద్విశేషంబును దానిచేత విన్నపంబు చేయించెదనని తన
> చెలువం బిలిపించి బలరిపుం గనిపించి నీవు నాకు వినిపించిన
> వజ్రనాభు రాజ్యావసానసామీప్యంబు స్వామికి నేమియుం గొఱంత
> పెట్టక విన్నవింపు"117వచ.1ఆ.

మనును. శుచిముఖి "అహమస్మి" అని ముందునకు రాలేదు. తానై చెప్పలేదు.

భర్త పిలిపించిన ముందునకు వచ్చినది. భర్త విన్నవింపుమనిన విన్నవించినది. ప్రభువిధేయత. భర్తృవిధేయత తోపాటు ఉదాత్తత కలది శుచిముఖి.

వజ్రపురి శత్రునగరము. అచటికి హంసలు రాకపోకలు సాగించుట ఇంద్రునికి కోపకారణము కావచ్చును. అయినను భయసంకోచములు లేకుండ మరాళతల్లజుడు ఇంద్రునికి విన్నవించును. అది వివేకములేని విన్నపము. శుచిముఖి వివేకముతో ఇట్లు విన్నవించును.

" తడవులఁ బట్టి యేము సతతంబును బోదుము వాని వీటికిన్
గడు మతి చాలమిం గడుపుగక్కురితి న్సురలోకనాథ మా
యెడఁ గలయట్టి తప్పిది సహింపుము పక్షులమాట నొక్కవెం
బడి నిది చెల్లెఁ గాక రిపుప్రాంతము చేరెడు వార లాప్తులే."119ప.1ఆ.

ఇట్లు విన్నవించుటవలన ఇంద్రునికి కోపము వచ్చినను ఉపశమనము కలుగును. ఇంకను స్వర్గంగలోను. మానససరోవరములోను. బిందుసరములోను. సౌగంధికసరస్సులోను తమకు ఆహారమైన తామరతూడు లేకుండ వజ్రనాభుడు చేయుట హేతువుగ చెప్పును. వజ్రపురి జలాశయములందు విహరించుటవలన వజ్రనాభుని రాజ్యావసాన సామీప్యము తెలిసిన రీతిని వివరించును. అందుకు హేతువు ప్రభావతి స్వప్న వృత్తాంతము. ప్రభావతి స్వప్నమునందు పార్వతి ఒక చిత్రఫలకమునందు"కౌమరుంబ్రాయపువాని" వ్రాసి."ఇతండ నీ వల్లభుండు. ప్రద్యుమ్నుఁ డనియెడు ప్రభుకుమారుండు. ..." అని ప్రభావతికి ఇచ్చును. కల కరిగిపోయినను చిత్రఫలకము మిగులును. ప్రభావతి నెచ్చెలికి చెప్పిన స్వప్నవృత్తాంతమును విని. శుచిముఖి వజ్రనాభుని రాజ్యావసానసామీప్యమును గ్రహింపవచ్చునని ఇంద్రునికి సూచించి. తాను గ్రహించిన తీరు ఇట్లు విన్నవించును.

" ఆ యింతిఁ బ్రద్యుమ్ను జాయగాఁ బలికిన
గౌరి మాటకు బొంకు గలుగదనుము
దనుజవిరోధి పుత్త్రునకు నా దుష్టదై
త్యుఁడు తనంతఁ దనూజ నొసఁగఁ డనుము
ప్రద్యుమ్నుఁడట్లు ప్రభావతీపతియైన
దానవునకుఁ బోరు తప్పదనుము
వజ్రపురము ప్రభావతికొడు కేలుట
యసురకు జయమైనఁ బొసఁగ దనుము

చిత్రఫలకంబు ప్రత్యక్షసిద్ధమగుటఁ
జేసి యీ కల యధికవిశ్వాసయోగ్య
మదియు వేకుఁ గావున నచిరభావి
ఫలము దేవేంద్ర నీ వెంచి తెలిసికొనుము."125ప.1ఆ.

ఇది శుచిముఖి బుద్ధికుశలత. ఇంకను శుచిముఖి "అకించిదంచిత సహజమాధురీధురీణవాణీరామణీయకంబు కార్కశ్యకమనీయకంబున నినుమడించి బిడౌజు నిబిడౌజుం జేయుచు"(129వచ.1ఆ.) ప్రభావతి చిత్రఫలకమును నెచ్చెలికిచూపించి పొందిన అనుభూతిని పూసగ్రుచ్చినట్లు చెప్పును.

" కలకల నవ్వినట్ల తెలికన్నుల నిక్కము చూచినట్లతోఁ
బలుకఁ గడంగినట్ల కడు భావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁ దనర్చు జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెనుఁ దాను బోటియున్.138
చిత్తరువన్న నిశ్చయముచే నెదురుండి మొగంబు చూడ మో
మెత్తను సత్యపుం భ్రమసమృద్ధిని గ్రమ్మఱుఁ దత్క్షణంబ లో
నొత్తుచుఁ దత్తఱంబుఁ ద్రపయున్ మగుడంగ నిరీక్షణేచ్ఛఁ బో
మెత్తును భర్త చూపు దను మోచుట దోఁచిన నోసరిల్లుచున్.139
వెఱయుఁ ద్రపయు లోనుగఁ గలవిఘ్నసమితిఁ
గడుఁ గలంగిపోక యుండఁ దా నడుమనడఁచి
యేచి చిత్రతానిశ్చయ మెచ్చరింప
నింతి క్రమమునఁ బ్రియుని రూపెల్లఁ జూచు."140ప.1ఆ.

ఇట్లు ప్రభావతి ప్రణయమును వివరించి, ఆమె ప్రద్యుమ్నుని రప్పించు ప్రయత్నము చేయునని, అది దేవకార్యమునకు ఉపకారము వలె తోచుచున్నదని ఇంద్రునికి విన్నవించును

ఇందు శుచిముఖి వినయము, వివేకము, బుద్ధికుశలత, అవగాహనము, ఆలోచనము మొదలైన అనేకసుగుణములు కలవు. అందువలన ఇంద్రుడు స్వకార్యప్రయోజనము కంటె, శుచిముఖి "వచనరచనావిలక్షణత్వంబు" నకు(2వచ.2ఆ.) మెచ్చి, "వాగ్దేవతవో కాక యాకె దిద్దిన కవివో" అని విస్మయము ప్రకటించును. (4ప2ఆ.) శుచిముఖి సరస్వతి దిద్దిన కవియే. సరస్వతి పెంపకమున పెరిగి, శిక్షణమున సమస్తవిద్యలు నేర్చినది. ఇంద్రుడు శుచిముఖినని, ప్రభావతికి ప్రద్యుమ్నునియెడల

ప్రేమ పెరుగునట్లు ప్రద్యుమ్నుని గుణములను అభివర్ణించి శీఘ్రసంగమము సంఘటింపుమని నియోగించును. శుచిముఖి అష్టమహిషీసపర్యలు అందుచున్న శ్రీకృష్ణుని సందర్శించి, ప్రద్యుమ్నుడు వజ్రనాభుని మీదికి వెళ్లుట, రుక్మిణికి సమ్మతమగునో కాదో అని సంశయించి, "ఏకాంతపు మాట కలదు" అని వివేకముతో పలుకును. ఏకాంతమిచ్చిన తర్వాత అంతవఱకు జరిగినది శ్రీకృష్ణునికి తెలియజే యును. కృష్ణుడు ప్రద్యుమ్నుడు వజ్రనాభుని వధించుట నిశ్చయమని, అందుకు భద్రనటునిపై వజ్రనాభునికి ఆకర్షణ కలుగునట్లు చేయుమని ఆదేశించును.

> " దీన నుపయోగింపఁ దగిన యవాంతరకృత్యంబులుఁ
> దత్తదుపాయంబులు నీవ యెఱుంగుదు. పొమ్ము. సురకార్యంబు
> నిర్వహింపుము."(28వచ.2ఆ.)

అని కృష్ణుని నిర్దేశము. ప్రద్యుమ్నుని యెడల ప్రభావతికి బద్ధానురాగము కలిగించుట భద్రనటునిపై వజ్రనాభునికి ఆకర్షణ కలిగించుట సురకార్యనిర్వ హణమునకు శుచిముఖి కర్తవ్యములు. కర్తవ్యనిర్వహణములు శుచిముఖి ప్రజ్ఞాపాటవములే.

కృష్ణుని వీడ్కొని శుచిముఖి ఆకాశవీథిని అరుగుచు, ద్వారకానగరబాహ్య ప్రదేశ మున వాహ్యాళివిహారము సేయు ప్రద్యుమ్నుని చూచి, తోడి హంసలతో

> " .... ..... ..... అల్ల యతఁ డితండ
> కావలయు నవశ్య మీ వరపురుషుతో
> మాటలాడి చనుట మనకు మేలు."39వ.2ఆ.

అని ప్రద్యుమ్నునికి వినబడునట్లు పలికి, భూమిమీదికి దిగి, ప్రద్యుమ్నుని సమీపించును. "అల్లయతఁ డితండ కావలయును" అనిన మాటను వినిన ప్రద్యు మ్నుడు తన ప్రసంగము వచ్చుటకు కారణమడుగును. శుచిముఖి చూపులతో ఏకాంత మును కోరును. ఏకాంతమిచ్చిన ప్రద్యుమ్నునికి వజ్రనాభుని విషయము సంగ్రహము గ తెలిపి, ప్రభావతి సౌందర్యమును విస్తరముగ వర్ణించును. అంతేకాదు. తనకు సరస్వతి శబ్దసంస్కారపూతమని శుచిముఖి అను పేరు పెట్టినట్లు, ఆమె ప్రోది చిలుకను మించి కవిత్వము చెప్పినందున "ఉపమాతిశయోక్తికామధేనువు" అను బిరుద మిచ్చినట్లు చెప్పి, బిరుదము చెక్కిన నూపురమును చూపి, అంత "అతివాఙ్మహిమాఢ్య" నయినను, ప్రభావతిసౌందదర్యము కోటితమాంశమునైనను వచింపలేనని, చిత్రఫలకవిషయమును తెలిపి వెడలిపోవును. ప్రభావతికి ప్రద్యుమ్నుని

యెడల అనురాగము కలుగుట అంతకుముందే శుచిముఖికి తెలియును. ప్రద్యు మ్నునికి ప్రభావతియెడల అనురాగము కలుగుటకు అవకాశము లేదు. అందుకు శుచిముఖి స్వబుద్ధిని చేసినది. పార్వతి కారణముగ ప్రభావతి, శుచిముఖి కారణముగ ప్రద్యుమ్నుడు పరస్పరానురక్తులు. ఇది వజ్రనాభుని వధకు బీజావాపనము.

శుచిముఖి వజ్రపురమునకు వచ్చి, కన్యాంతఃపురసరోవిహారమయముల దనుజకన్యాంతఃపురకాంతలకు చేరిక అగును. ఒకనాడు ప్రభావతి, ఆమె చెలికత్తె రాగవల్లరి చిత్రఫలకమును చూచి, అట్టి మనోహరుడు కలడో లేడో అని మథనపడునెడ, శుచిముఖి చిత్రఫలకమును "సవిమర్శదృష్టినిం బలుమఱు మరలి మరలి" వీక్షించును. అది గమనించి ప్రభావతి రాగవల్లరితో "కఱందులపులుఁగిదితా నేమెఱుంగునొకో తిరిగి తిరిగి యీ ఫలకమ్ముపైం బఱపెడుఁ జూడ్కులను" అనగా చేష్టల ద్వారా సందర్భమును కల్పించుకొన్న శుచిముఖి.

" మున్నొకచోట నొక్క పురుషుం జూచి తత్సమానరూపుని
మఱియెందునుం గానక యిప్పుడిందు నతని కైవడి దోఁచిన నిది
తదీయరూపం బెఱింగి వ్రాసిన తెఱంగో యటుగాక యట్టివాఁడె
వేఱొక్కఁ డెక్కడనైనఁ గలిగెనో యని యించుక పమర్శించి వీక్షించితిని."

అని చెప్పను. అది విని ప్రభావతి అద్భుతప్రమోదసందేశములంది ఇట్లనును.

" ఏమేమీ యిఁ క నొక్కమాటు చెపుమా యీ వున్నరూ పిట్లయో
యేమైనం గలదో విభేద మిట రమ్మీక్షింపు మింకన్ వచ
స్సామర్థ్యం బరయన్ మహాత్మవని యస్మద్బుద్ధికిం దోఁచె దా
హో మా భావము గాన లేవె మదిలో హంసీ భయం బేటికిన్."49ప.3ఆ.

శుచిముఖి "పిలువక యే వెఱ్ఱినె చేర నిరువు రేకత మాడన్ " అనిన ప్రభావతీరాగమంజరులు ఆశ్చర్యచకితలై "ఇట్టి వాఁడెందును లేఁడు కలఁడను వివాదంబునం బన్నిదంబు చఱిచినవారము" అని పలుకుదురు.

పందెమునకైన, మఱెందులకైన, వినిపింతువని శుచిముఖి,

" సవిమర్శదృష్టి నాలిత
కవిధాన మొకింత నడపి కడుఁ బదిలముగా

వివరింప నతని రూపమ
యవు నౌ నది యిందు సందియము లేదనియెన్."55ప.3ఆ.

రాగవల్లరి పందెమునందు తాను గెలిచినట్లు ప్రకటించును. ప్రభావతి "అతని లక్షణము లీ చిత్రమూర్తి యందు నేమైనఁ గలవేమొ యడుగవలయును." అనును. శుచిముఖి

" అరయ నింక నేమడిగె దల్లవె యాతఁడు శంబరుం డ్రిలో
కారిని డ్రుంచునప్పుటి ప్రహారకిణంబు లురంబునందు నా
హా రతికంకణాంకములు నల్లవిగో మెడయందు వీరశృం
గారకళాఢ్య్య నిట్లతని గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో.61
ఈ లక్షణకథనంబు చేత నతని నామజాత్యాదు లత్యంతప్రసి
ద్ధంబులు. మీరు మీయంతనె యెఱింగెదరు గావలయు
నంతఃపురవాసినులు గావున నెఱుంగరో యని యెఱింగించెద నంటినేని
ఎనయఁ గ నెవ్వరెంత మనసిచ్చి వచించిరి తాను వారితోఁ
బనుపడ నంతమాత్ర ప్రతిభాషణ మాడుట యుక్తమండ్రు మీ
కొనరఁ గఁ బన్నిదంపు గెలుపోటలు దీర్పఁ గ నిప్పు డేను జె
ప్పినదియ చాలు నింకఁ దలపెట్టుట చెల్లద యెక్కు డేమియున్."63ప.3ఆ.

అని "పోయివత్తును" అనును. ప్రభావతి రెండు చేతుల శుచిముఖిని పట్టుకొని చెలిమి సేయుమని కోరును. రాగవల్లరి వంత పాడును. శుచిముఖి ప్రద్యుమ్నుని సమాచారము తెలుపును. రాగవల్లరి ప్రభావతి విరహావస్థను తెలిపి, "ఇంక నీచేత నున్న దీ యింతి బ్రదుకు "అని, ప్రద్యుమ్నునికి ప్రభావతి సౌందర్యాదులు వివరించి, ఆమె మనోరథమును ఈడేర్పవలయుననని కోరును. శుచిముఖి ప్రభావతి ప్రేమను పరీక్షించి అంగీకరించును. అంతేకాదు, ప్రభావతీప్రద్యుమ్నుల పరిణయము తథ్యమని, తన్నిమిత్తమైన దైవనియమమును వివరించును. ప్రద్యుమ్నుని తీసికొనివత్తునని ప్రకటించును.ఇది ప్రభావతికి ప్రద్యుమ్నునియందు అనురాగము ప్రవృద్ధమగునట్లు శుచిముఖి నిర్వహించిన ఇంద్రకార్యము. బిందుస్థితికల్పనము.

ప్రద్యుమ్నుడు శుచిముఖికి చిలుకచేత ప్రభావతి అనుమతిని వేడుమని లేఖ పంపును. ఆ చిలుక వలన శుచిముఖి, వజ్రనాభుని సోదరుడు సునాభుని తనయలు చంద్రవతీగుణవతులు గదసాంబులను ప్రేమించుట తెలిసికొని, ధ్రువపఱిచికొని, ప్రభావతిచేత వజ్రనాభునికి శుచిముఖి సరసకథాకథనప్రవీణ, సకలవిద్యాధురీణ అని

చెప్పించి. వజ్రనాభుడు సమ్ముఖమునకు పిలుచునట్లు చేసికొనును. వజ్రనాభుని సన్నిధిని.

" కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెం గడుఁ బూర్వపక్షముల జోకం బెంచుచు న్బెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దుదన్ సిద్ధాంతము ల్నిల్పుచున్. 61

స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నే వేళ న
ద్ది మతం బిప్పుడు వానివానికి నుపాధిగ్రస్తతావ్యాప్తిభం
గముఖానేకసుదూషణంబులు వెసం గల్పించు దా నన్యశా
స్త్రమతస్థాపనవేళ నవ్విహగి దైత్యశ్రేష్ఠుఁ డోహో యనన్." 62ప.4ఆ.

ఇంకను కావ్యనాటకాలంకారగానకామశాస్త్రపాండిత్యములు ప్రదర్శించి. వజ్రనాభుని మెప్పించును. అతడు "నీవును నాదిగంతసంచారిణివి నీ కనిన యద్భుతంబు లేమేనియుం గలిగిన నెఱింగింపు"మనిన. శుచిముఖి "అతివిచిత్రమై తోఁచినయది" అని భద్రనటుని అత్యద్భుతనాట్యపటిమను తెలుపును. భద్రనటుని గుఱించి విని యున్న వజ్రనాభుడు శుచిముఖిని భద్రనటుని రప్పింపుమని అడుగును. శుచిముఖి ద్వారకానగరమున కేగి"భద్రనామధేయనటునిఁ దోడ్కొని తెచ్చుటకు వజ్రనాభునిచేత నియుక్త అగుట. నారదుడు సునాభుని తనయలు గదసాంబుల భార్య లగుదురనుట కృష్ణునికి తెలియజేయును. ఇది అన్యప్రవేశదుర్లభమైన వజ్రపురమునకు కృష్ణుడు ప్రద్యుమ్నుని భద్రనటునిగా. గదుని పారిపార్శ్వకునిగా. సాంబుని విదూషకునిగా పంపుటకు శుచిముఖి నిర్వహించిన కృష్ణకార్యము. పతాకస్థాయిప్రతిష్ఠాపనము.

"అయం ముహూర్త స్సుముహూర్తోస్తు" అని ప్రభావతీప్రద్యుమ్నుల. చంద్రవతీగదుల. గుణవతీసాంబుల గాంధర్వవివాహములు జరిపించి. వజ్రనాభుని వధకు ప్రధానసాధనమైనది శుచిముఖియే. వజ్రపురము దేవమానవప్రవేశ దుర్గమమగుట వలన శుచిముఖి హంస. సుగమమయిన సుదతియే. పేరునకు హంస. తీరునకు స్త్రీవతంస.

## కవితాలక్షణము

పింగళి సూరన తన కవితాలక్షణము తెలుప లేదు. కాని ఉత్తమకవితా లక్షణమును పాత్రల ముఖమున ప్రతిపాదించెను. కళాపూర్ణోదయమునందు

మణికంధరుడు రచించిన దండకమును నారదునికి అప్పగించి కలభాషిణి ఇట్లనును.

" పొసఁగ ముత్తెపుసరు లొప్పహాళించిన లీలఁ
దమలోన దొరయు శబ్దములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేధంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి
యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగని వారు గలరె?82
చలువ గల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁబలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జగముల మిగులఁ బెంపెసఁగు
మలయపవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి కలదనఁగ వచ్చుఁ గదు
వెలయఁగల యీ సుకవి పలుకులకు నెంచన్."83ప.1ఆ.

ఇందు సీసపద్యములోని కవితాలక్షణమెల్ల అలంకారశాస్త్రానుగుణము. అందు తమలోన దొరయు శబ్దములను ముత్తెపుసరులు ఒకదాని కొకటి పొసగునట్లు పోహాళింపవలయుననుట సూరన అభిప్రాయము. పోహాళించుట అనగా కూర్చుటయే. ఇక లయవిభాతిపద్యములోని కవితాలక్షణమెల్ల అనుభూతిపరము. చల్లదనము కల వెన్నెలకు సౌరభము కలిగిన, చల్లదనము, సౌరభము కల కప్పురపుపలుకులకు మార్దవము తనరిన,చల్లదనము, సౌరభము, మార్దవము కల మలయమారుతమునకు మాధుర్యము అలవడిన సుకవిత్వమునకు సదృశము. చల్లదనము, సౌరభము, మార్దవము, మాధుర్యము కలిసి ఉత్తమకవితాలక్షణమని సూరన ఉద్దేశము.

ప్రభావతీప్రద్యుమ్నమునందు శుచిముఖివచనరచనావిచక్షణత్వమునకు విస్మితుడైన ఇంద్రుడు ఇట్లనును.

"శబ్దసంస్కార మెచ్చటను జాఱఁ గనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁ పెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ
నొకటిఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె."3ప.2ఆ.

ఇందు శబ్దార్థగుణదోషవిషయములు అలంకారశాస్త్రానుగుణములు.శాఖా చంక్రమణము వలదనుట. ప్రకృతార్థభావము పాదుకొనునట్లు అదుకవలయు ననుట. ఉపపత్తి అత్యూర్జితముగ ఉండవలయుననుట. పూర్వోత్తరవిరోధము పొసగరాదనుట. ఆ యా అవయవవాక్యముల తాత్పర్యములు అవయవియైన మహాకావ్యము తాత్పర్యమునకు సుసంగతములు కావలయుననుట అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయశిల్పమర్మములు. అవిప్రత్యేకముగసూరన కవితాధర్మములు. పూర్వోక్తమైన అపూర్వకథాసంవిధాన వైచిత్రీవిశేషములు. శుచిముఖి పాత్రచిత్రణపాటవమును ఉదాహరణములే.

## శైలి

సూరన శైలి సరళాతిసరళము. ప్రతిశబ్దము ప్రసిద్ధము. అర్థము ఝటితిస్ఫూర్తిని అవగతమగును. సంస్కృతభూయిష్ఠరచన సకృత్తు. అది కూడ వర్ణనములందు అక్కడక్కడ కలదు. తేటతెనుగు సమృద్ధి. అది కూడ సంభాషణములందు అగ్రగణ్యము. భాష వ్యాకరణయుక్తమైనను వ్యావహారికభాషాసన్నిహితము. వ్యర్థపదము మృగ్యము. ఇందుకు పూర్వోదాహృతపద్యములెల్ల ఉదాహరణములే.

# పద్ధతి

సూరన రచన నాటకీయపద్ధతి. అది తిక్కన నాటకీయపద్ధతి కంటె అభ్యధికము. కథాసంవిధానము. పాత్రముఖకథనము. నాటకీయధ్వనిసంవిధానము. సందిగ్ధతాశ్చర్యైకతాసమ్మేళనము. సన్నివేశదృశ్యకల్పనము నాటకీయపద్ధతికి జీవనాడులు. అపూర్వకథాసంవిధానవైచిత్రియెల్ల నాటకీయపద్ధతియే. అందు అత్యపూర్వమైనది సన్నివేశదృశ్యకల్పనము.

కళాపూర్ణోదయమునందు ప్రథమసన్నివేశమే భూమ్యాకాశములను మేళవించు సువిశాలసుందరదృశ్యము. ద్వారకానగరపురోపవనమునందు కలభాషిణి చెలికత్తెల తో చేటికలతో పూలతీగల తూగుటుయ్యాల లూగునెడ. ఆకాశమార్గమున నారదమ ణికంధరుల ఆగమనము. రంభానలకూబరుల దివ్యవిమానవిహారము. కలభాషిణి అనుసరణము. కలభాషిణీమణికంధరనారదుల సమావేశము దృశ్యమనోజ్ఞమైన సన్నివేశము. వైకుంఠమునందు విష్ణువు పేరోలగముండి అప్సరోనృత్యములు తిలకించుట. విష్ణుసందర్శనమునకు దేవతలు మునులు వేచియుండుట. వేత్రహస్తులు బరాబరిసేయుట. లక్ష్మీదేవి ఆగమనము. వేత్రహస్తులు అందఱిని తఱిమివేయుట. తుంబురుని లోనికి తోడ్కొనిపోవుట. నారదుడు ఆందోళన చెందుట కుతూహలము కలిగించు కొలువు దృశ్యము. కలభాషిణిని వెనుకకూర్చుండబెట్టుకొని మణిస్తంభుడు ఆకాశయానము చేయునెడ. మణికంధరుని తపోవనమునుండి మగిడిపోవు అప్సరస లు గుసగుసలాడుకొనుట ఆశ్చర్యకరమైన ఆకాశదృశ్యము. మృగేంద్రవాహన గుడి. మంటపము. అచట ముదుసలి పడతి. కలభాషిణి రాక. మణిస్తంభునిపోక. మంటపా గ్రభాగమునందు ఏకాక్షరపంక్తిచిహ్నితశిలాస్తంభమున వ్రేలాడగట్టిన శస్త్రయుగ్మము. గంధపుష్పాద్యర్చితములైన సురియ. గండకత్తెర. శిలాస్తంభము మీది శాసనము దివ్యభవ్యగంభీరదృశ్యము.

మణిస్తంభుడు "కలభాషిణి వేనలి యొకకేలఁ బట్టి. వేఱొక్కకేల నొఱఁగత్తి వెఱికి" బలివేయునెడ. కలభాషిణి మెడకు సుముఖాసత్తి తన మెడ అడ్డము పెట్టుట. మణిస్తంభుడు సుముఖాసత్తి మెడను ఖండించుట. కలభాషిణి తోపాటు మణిస్తంభుడు అతిదూరమున పడుట. సుముఖాసత్తి మృగేంద్రవాహనాశక్తి గురువుగ యోగాభ్యాసము సేయునెడ. అచటికి కలభాషిణి. మణికంధరుడు. మణిస్తంభుడు వచ్చుట. తమ వృత్తాంతములు చెప్పుట సంభ్రమాశ్చర్యకరమైన సన్నివేశదృశ్యము.

సత్యలోకమునందు బ్రహ్మ రాణివాసము. అందు భవనారామము. చెంత నడిమి మానికపు స్తంభము కల సరస్సు. సరస్సు తూర్పు దరిని సంతానకల్పవృక్షము క్రింద సరస్వతి పాదములొత్త చతుర్ముఖుడు తలిరుపాన్పున పవ్వళించుట. తరుశాఖను వ్రేలాడు రత్నపంజరమునందు చిలుక రమణీయదృశ్యము. యజ్ఞశర్మ నౌకావ్యాపారమున అతని నలుగురు భార్యలు సముద్రములోనికి ఉఱుకునపుడు. నీటితోపాటు పెద్దచేప నోటిలోనికి పోవుట. తన్మూర్ధరంధ్రము ద్వారా బయటకు వచ్చుట. ఒక విమానము మీద పడుట. అందు దివ్యమిథునము పాచికలాడుట. యజ్ఞశర్మ భార్యలు నలుగురిని గోదావరీనదీతీరమునందలిధర్మ పురిలోనిమహోన్నతసౌధమునందుడించుట భూమ్యాకాశసముద్రములను మేళవించు విచిత్రవిస్మయకరసన్నివేశదృశ్యము.

ఇట్లు కళాపూర్ణోదయము బహుసన్నివేశదృశ్యబంధురము.

ప్రభావతీప్రద్యుమ్నమునందు ద్వారకానగరమున ఆలయోపవనసరస్తీరమంటపమునందు అష్టమహిషీసమేతుడైన కృష్ణుని శుచిముఖి సందర్శించుట ఒక సుందరదృశ్యము.

" తొడలు తలాడగా నిడి రుక్మిణి భజింపఁ
బదము లొత్తుచు సత్యభామ కొలువ
సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప
విరిచామరము మిత్రవింద యిడఁగఁ
గాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప జాం
బవతి తములపాకు మడిచి యొసఁగ
గొడుగు పావలు కేలఁగొని నాగ్నజితి యుండ
జలముల్గిండి లక్షణ వహింప
గ్రొమ్మెఱుంగులతోడి కార్మొగులు వోలె
నొప్పు కృష్ణుని చేరువ నొప్పె హంసి
నిండు నెల రీతి ద్వారకాన్వితనభంబు
పొలుపుఁ దెలిపెడి నెత్తమ్మికొలని కెలన."15ప.2ఆ.

ప్రద్యుమ్నుని వాహ్యాళివిహారము విచిత్రక్రీడాదృశ్యము. పాశ్చాత్యక్రీడను పరిథవించునది.

" తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంతనే
పనుపడ నిల్పి ముందఱకుఁ బాఱి కెలంకులకుందొలంగిదా
వెనుకకు నేగుదెంచి కడు వేడ్క యొనర్పఁగ బంతి యాడ నె
మ్మిని గనకంపుఁ గోల నడిమింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్."29
" ఎగురఁగ వైచి కొట్టుటది యెంత భరంబని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడమిం బడనీకయె దాని మీఱి చి
త్రగతి హయంబుఁ దోలుచును గ్రమ్మఱఁ మీఁదికిఁ గొట్టి యాడె నిం
తగఁ దన చేతి రత్నమయదండము కాంతులు గాడి పాఱఁ గన్."32ప.2ఆ.

ఇది భూనభోంతరక్రీడాదృశ్యము. దృశ్యప్రధానమైన నాటకప్రదర్శనదృశ్యమును కలదు.

" ఆ వనజాక్షనందనుఁడు నంతట నాంది దగం బఠించి యిం
పావహిలం బ్రరోచనయు నాముఖముం దనరార నొప్పఁ బ్ర
స్తావనతో ముఖాదులగు సంధులు సొంగతఁ బెంపు మీఱ గం
గావతరాదినాటకము లాడె ననేకము లద్భుతంబుగన్. 100
ఆ నాటకప్రయోగావసరముల భ
గీరథాద్యాకారధారణమును
గంగాదినిమ్నగాగతియుఁ గైలాసాది
నగకల్పనమును నానావనప్ర
పంచనంబును బహుపక్షిమృగాదిజం
తువిశేషరూపప్రవృత్తులును మఱియు
నెచటి కెయ్యది యోగ్య మచటఁ దత్తద్వస్తు
సృష్టి పన్నిదము వేసియును గృతక
మగుట నిశ్చయింపఁగ లేక యబ్రపడుచుఁ
జూచి సామాజికుల తమ సొమ్ము లెల్ల
నొసఁగులుగ వైవ నడుపుచు నొప్పు మీఱె
రుక్మిణీసుతుండు మాయానిరూఢి మెఱయ."101ప.4ఆ.

ఇందు ప్రద్యుమ్నుడు "గంగావతరాదినాటకములు" ప్రదర్శించినట్లు కలదు. కాని సంస్కృతహరివంశమునందు రామాయణము, రంభాకౌబేరాభిసారము ప్రదర్శించినట్లు కలదు. రామాయణమునందు రాక్షససంహారము కలదు. రంభాకౌబేరా

భిసారమునందు దేవతల శృంగారము కలదు. ఈ రెండును సామాజికులైన రాక్షసులకు. అందును రాక్షసరాజైన వజ్రనాభునికిని అనిష్టము లగును. అందుకు రాక్షసప్రమేయము లేని గంగావతరాదినాటకములు ప్రదర్శించినట్లు సూరన మార్చుట సముచితము. పయి సీస పద్యమునందు రంగాలంకరణము దృశ్యస్ఫోరకము. ఇట్లు ప్రభావతీప్రద్యుమ్నమును కతిపయదృశ్యసంకలితము. దృశ్యకల్పనము నాటకీయపద్ధతికి జీవనాడి.

## ఆత్మీయత

పింగళి సూరనకు "ఓ లలాటేక్షణభక్తిశీల" అను సంబుద్ధి ఆకువీటి వేంకటాద్రిపరముగ కలదు. (13ప.1ఆ.రా.పాం.) కాబట్టి పింగళి సూరన శివభక్తిశీలుడు సూరన తండ్రి అమరయ్య కూడ "శివభక్తిఁ బ్రసిద్ధతముఁడై మించె"నని "శివభక్తిశోభితాచారుఁ "డని,"శ్రీమద్భక్తివిశేషస్థేమావిశ్రాంతవిహితశివతత్త్వకథామీమాంసుఁడు" అని సూరన గ్రథనమే.(31,47ప.1ఆ; 1ప.3ఆ.ప్ర.ప్ర.) అంతేకాదు. అమరయ్య "సారతరవైదికసమాదారుఁడు"."శ్రౌతస్మార్తపథానువర్తను"డు. "ఆత్మతత్త్వకోవిదుఁడు" అని కూడ(147ప.1ఆ;113ప.2ఆ.ప్ర.ప్ర) సూరన ప్రకటనమే. తండ్రి శివభక్తుడు, అద్వైతి. తాను శివభక్తుడు అయినను సూరనకృతులు శివపరములు కావు. అద్వైతపరములును కావు. రాఘవపాండవీయము రామకృష్ణపరము. ప్రభావతీప్రద్యుమ్నము కృష్ణపరము. కనుక విష్ణుపరములు. కళాపూర్ణోదయమునందు విశిష్టాద్వైతసిద్ధాంతము విశిష్టముగ కలదు. రాఘవపాండవీయమునందు సూరన శివభక్తిశీలము, శివకేశవాభేదభావము ప్రతిఫలించినది.

అర్జునుడు పాశుపతాస్త్రము కొఱకు శివుని గుఱించి తపస్సు చేయుట భారతమునందు కలదు. అది రాఘవపాండవీయమునందును కలదు. అందు పంచాక్షరీ మంత్రము. (36ప.3ఆ.) శివవర్ణనము (55,56ప.3ఆ.) శివస్తోత్రము (59,62ప.3ఆ.) కలవు. అవి సూరన శివభక్తి శీలమునకు సూచికలు. శివస్తుతియందు విష్ణుస్తుతి కలదు.

> " నిశితప్రజ్ఞతఁ జూడ నే వికృతియు న్లేదండ్రు నీయందు నీ
> దశరూపాశ్రయణంబొనర్చుట మదిం దర్కింప లోకంబులం
> దశుభప్రక్షయమున్ శుభోదయము నుద్యద్భక్తవాత్సల్యతా
> తిశయాయత్తతఁ జేయు నింతియ గుణాతీతా ప్రసన్నాత్మకా." 60ప.3ఆ.

ఇందు "ఈ దశన్, రూపాశ్రయణంబు" అను పదచ్ఛేదమున శివస్తుతి. "నీ,

దశరూపాశ్రయణంబు" అను పదచ్ఛేదమున విష్ణుస్తుతి.

" అతివాఙ్మనసాస్పద యీ
నుతి కొగ్గిన సాహసమ్మునను సహింపు దయన్
మతి నాకు నేన లజ్జిం
చితినో యచ్యుత యనంతశివగుణరాశీ!" 62ప.3ఆ.

ఇందు అచ్యుతుడు= స్థిరుడు. అనంతుడు= అంతము లేని వాడు. శివుడు. గుణరాశి అని శివపరవ . అచ్యుతుడు. అనంతుడు. శివగుణరాశి అని విష్ణుపరము. శివగుణరాశి అన శుభగుణరాశి.

కళాపూర్ణోదయమునందు విశిష్టాద్వైతసిద్ధాంతమును స్థాపించినను. తదనంతరకృతి అయిన ప్రభావతీ ప్రద్యుమ్నమునందు పింగళి సూరన ఇష్టదేవతాస్తుతియందు ఉమామహేశ్వరులకే ప్రథమస్థానము కలదు.

" శ్రీమదుమామహేశు లతిచిత్రవిలాసులు దారు మున్ వియో
గామితచింత నొండొరులకై సగమౌటలు నిచ్చఁ దెల్పు కాం
క్షామహిమంబుచేఁ జెఱుసగంబుగ నొక్కయొడ ల్ధరించు స
త్ప్రేమపు దంపతు ల్కృతిపతిం దనరింతురు గాతఁ గీర్తులన్." 1ప.1ఆ.

ప్రభావతీప్రద్యుమ్నము శివపరమైన కావ్యము కాదు. విష్ణుపరమైన కావ్యము. అయినను సూరన అర్ధనారీశ్వరస్తుతి చేయుట అతని లలాటేక్షణభక్తిశీలలక్షణమే.

# భట్టుమూర్తి

భట్టుమూర్తి రామరాజభూషణబిరుదాంకితుడు. రామరాజన అళియరామ రాయలు. అళియరామరాయల ఆస్థానమునకు ఆభరణమైన కవి రామరాజభూషణుడు. కృష్ణరాయభూషణుడు, వేంకటరాయభూషణుడు వలె రామరాజభూషణుడు. మూర్తి ప్రణీతముగ కావ్యాలంకారసంగ్రహము, రామరాజభూషణప్రణీతములుగ వసుచరిత్రము, హరిశ్చంద్రనలోపాఖ్యానము కలవు.

కావ్యాలంకారసంగ్రహములోని అవతారికయందు ఇట్లు కలదు.

" శతలేఖినిపద్యసంధానధౌరేయు
ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని
రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య
సాధితవ్యస్తాక్షరీధురీణు
నేకసంథోదితశ్లోకభాషాకృత్యు
చతురు నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
నమితయమకాశునిధిఁ బ్రబంధాంకసింగ
రాజసుతతిమ్మరాజపుత్త్రప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్త్రు
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు." 13ప.1ఆ.

ఆశ్వాసాంతగద్య ఇట్లు కలదు.

"ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసార, సారస్వతాలంకార, నిరంకుశప్రతిభా బంధుర, ప్రబంధపఠనరచనాధురంధర, ప్రబంధాంకవేంకటరాయభూషణసుపుత్త్ర, తిమ్మరాజపౌత్త్ర, సకల భాషావిశేషనిరుపమావధానశారదామూర్తి, మూర్తిప్రణీతంబైన కావ్యాలంకారసంగ్రహంబను మహాప్రబంధంబునందు-"

వసుచరిత్రములోని అవతారికయందు ఇట్లు కలదు.

" నను శ్రీరామపదారవిందభజనానందున్ జగత్త్రాణనం

దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసం
జనితైకైకదినప్రబంధఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెం గృపన్." 16ప.1అ.

ఆశ్వాసాంతగద్య ఇట్లు కలదు.

" ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకష చతుర్విధకవితానిర్వాహక సాహిత్యరస పోషణ రామరాజభూషణప్రణీతంబయిన వసుచరిత్రంబునందు- "

హరిశ్చంద్రనలోపాఖ్యానములోని అవతారికయందు ఇట్లు కలదు.

" వనధిలంఘనకృపావర్ధితోభయకవి
తాకళారత్నరత్నాకరుండ
సకలకర్ణాటరక్షాధురంధరరామ
విభుదత్తశుభచిహ్నవిభవయుతుఁడ
వసుచరిత్రాదికావ్యప్రీతబహునృప
ప్రాపితానేకరత్నాప్లవుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహా
నిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ
శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ
తిమ్మరాజప్రియతనూజధీరసూర
పాత్మజుఁడ రామనృపభూషణాఖ్యసుకవి
నంకితమొనర్తు నీ కావ్య మనఘభక్తి." 53ప.పీ.

ఆశ్వాసాంతగద్య ఇట్లు కలదు.

" ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందనపవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకష చతుర్విధకవితానిర్వాహక సాహిత్యరస పోషణ రామరాజభూషణప్రణీతంబైన హరిశ్చంద్రనలోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు- "

ఇందు కావ్యాలంకారసంగ్రహకర్త మూర్తి అని. వసుచరిత్రహరిశ్చంద్రనలోపాఖ్యానముల కర్త రామరాజభూషణుడని కలదు. అంతేకాదు. మూర్తి వేంకట రాయ

భూషణపుత్త్రుడని, రామరాజభూషణుడు సూరపాత్మజుడని కలదు. కనుక మూర్తి, రామరాజభూషణుడు భిన్నులని పూర్వపక్షము కలదు[178]. అభిన్నులని సిద్ధాంతము కలదు[179]. మూర్తి వ్యక్తినామము. రామరాజభూషణాఖ్య బిరుదనామము. వేంకటరాయభూషణాఖ్య బిరుదనామము. సూరప వ్యక్తినామము. సూరప్పయే వేంకటరాయ భూషణబిరుదాంకితుడు. కావ్యాలంకారసంగ్రహరచనాకాలము నాటికి రామరాజ భూషణబిరుదము లేదని హరిశ్చంద్రనలోపాఖ్యాన రచనాకాలము నాటికి వేంకటరాయభూషణబిరుదము వెనుకబడినదని అనుమేయము. కావ్యాలంకారసంగ్రహములోని మూర్తి కవితావిశేషములెల్ల, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములలోని రామరాజభూషణుని చతుర్విధకవితానిర్వాహకవిశేషణమునందు గతార్థములు.వసుచరిత్రములోని సంగీతకళారహస్యనిధివిశేషణము కావ్యాలంకారసంగ్రహ, హరిశ్చంద్రనలోపాఖ్యానములందు లేదు. సంగీతకళారహస్యనిధిత్వము వసుచరిత్రమునందు కలదు. కావ్యాలంకారసంగ్రహరచనాకాలము నాటికి హనుమద్భక్తి కలదు. వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానరచనాకాలముల నాటికి రామభక్తి, హనుమద్భక్తి రెండును కలవు. కావ్యాలంకారసంగ్రహరచనాకాలము ప్రారంభదశ, వసుచరిత్రరచనాకాలము పరిణామదశ, హరిశ్చంద్రనలోపాఖ్యానరచనాకాలము చరమదశ కావచ్చును. మూడు కృతులందును కవితాసామ్యము కలదు[180].

" గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోక కావించి త
ర్ధాంగీకార" మనం "బురంధ్రి! నిను వామాంగంబునం దాల్ప నే
శృంగారోన్నతిఁ జూడు" మంచు గిరిజన్ శిరాపగాబింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్."

"ఆ మందాకిని మౌళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసి తా
నౌ మేల్మేలని యార్య యల్గఁ బ్రణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయున్ మొరయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు గృతిస్వామిం గృపం బ్రోవుతన్."

"ఒక చాయ ననపాయపికగేయసముదాయ
మొక సీమ నానామయూరనినద
మొక వంక నకలంకమకరాంకహయహేష
లొక క్రేవ వనదేవయువతిగీత
మొక చెంత సురకాంతల కరాంతతతనాద

మొక దారి నవశారికోదితంబు
లొక యోరఁ బటుచారణకుమారఫణితంబు
లొక దండ నలిమండలికలగాన
మొక్క మొగి మ్రోయఁ గదళీగృహోపపన్న
కిన్నరీబృందబృందసంగీతరీతి
నమరు నతివేలకోలాహలముల కలిమి
నధిప యీ యద్రి కోలాహలాఖ్యమొక్కొ." 7ప.2ఆ.వ.చ.

"ఒక చోట మఖవాటహుతహవ్యగంధంబు
లొక చాయ ననపాయహోమవహ్ను
లొకయిక్కభృతదిక్కటకసామగానంబు
లొక మూల శుభమూలసుకృతగాథ
లొక చెంత నిగమాంతయుక్తిసంతతిచింత
లొక సీమ సురధామయోగ్యసేవ
లొక వంక నకలంకయోగివర్యసపర్య
లొక దండ నఘదండనోచితవిధు
లరసి యీదృశధర్మసంభరణధరణి
కాంతనిగ్రహ మెట్లు కావింతు ననుచు
దీపితాత్మానుకంపుఁడై ద్వాపరాప్తి
కలితుఁడై నిజసమయవాక్యములు తలఁచి" 7ప.3ఆ.హ.న.

ఇట్లు బాహిరమైన సాక్ష్యము, ఆంతరంగికసాక్ష్యము మూర్తి రామరాజభూష ణబిరుదాంకితుడని, కావ్యాలంకారసంగ్రహ, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములు ఏకకవికృతములని నిర్ధరించును. ఇంకను నిర్ధారకకసాధనములు కాకపోయినను, ఉపబలకసాధనములు కలవు[181].

i. వసుచరిత్రమునకు వ్యాఖ్యానము, రచించిన సోమనాథకవి పీఠికను ఇట్లు కలదు.

" కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁ డయి పొల్పు వహించెడు భట్టుమూర్తిచే
నీరితమై సుభార్థపదహీనపదాస్పదమైన యీ వసు
క్ష్మారమణప్రవృత్తము సుసాధము కాదు తలంచిచూడఁ గన్."

ఇందు వసుచరిత్రము భట్టుమూర్తికృతమని ఇదమిత్థముగ కలదు.

ii. అప్పకవి పేర్కొన్న (5వచ.1ఆ.) "లక్షణదీపికలో ౧౦౬వ పద్యము తరువాత "మంజీరశబ్దమునకు భట్టుమూర్తి వసుచరిత్ర మొదటి పద్యము ప్రథమచరణమున హల్లునకుఁ బ్రయోగము" అని వ్రాయబడి. "శా. శ్రీభూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వ-" ఇత్యాదివసుచరిత్రపద్య ముదాహరింపఁ బడియున్నది. "

ఇందును వసుచరిత్రము భట్టుమూర్తికృతమని ఇదమిత్థముగ కలదు.

iii. మండ లక్ష్మీనరసింహాచార్యుల ఆంధ్రకౌముదియందు ఇట్లు కలదు.

"ముప్రత్యయాభావస్య- అల్లసాని పెద్దనార్యశిష్యేణ భట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే-

సీ. రాజహంసలు గాని రాజహంసలు గారు
సరసకళాసారసారరుచుల "

ఇందు కూడ వసుచరిత్రము భట్టుమూర్తికృతమని ఇదమిత్థముగ కలదు.

కావ్యాలంకారసంగ్రహములోని ప్రబంధాంకము మూర్తియే భట్టుమూర్తి. ప్రబంధాంకము ఇంటి పేరు. భట్టు కులవాచకము. భట్టుమూర్తియే రామరాజభూషణుడు.

తిరుమలరాయలు (13ప.1ఆ.) పేరోలగమున నుండి (15ప.1ఆ.) శ్రీరామపదారవిందభజనానందుడైన రామరాజభూషణుని.

"శ్రీరామక్షితిపున్ మదగ్రజు జయశ్రీలోలు నానాకలా
పారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాదిస
త్కారం బందితి రామభూషణకవీ ధన్యుండ వీ వన్నిటన్" 17ప.1ఆ.

అన్నట్లు కలదు. రామక్షితిపుడు అళియరామరాయలు. రామభూషణకవి రామరాజభూషణకవి.

## కాలము

కావ్యాలంకారసంగ్రహము అళియరామరాయల మేనల్లుడు నరసరాజునకు

అంకితము.(74,75,89,91 ఉ.1ఆ.) నరసభూపాలీయమను నామాంతరమును కలదు. అళియరామరాయల ప్రాభవకాలము వేంకటపతిదేవరాయలు. సదాశివదేవరాయలు విజయనగరసింహాసనాధిష్ఠితులైన కాలము. వారు నామకరాజులు. పాలకరాజు అళియ రామరాయలే. ఆ కాలము [182] 1542-1565. కావ్యాలంకారసంగ్రహము రచనాకాలము తన్మధ్యకాలము. వసుచరిత్రరచనాకాలమును బట్టి. కావ్యాలంకారసంగ్రహము రచనాకాలము 1560 ప్రాంతము.

వసుచరిత్రము అళియరామరాయల అనుజుడు తిరుమలదేవరాయలకు అంకితము. సదాశివదేవరాయలు సజీవుడైనను తిరుమలదేవరాయలు విజయనగరసామ్రాజ్యాధిపతి. రాజ్యకాలము [183] 1570-72. లేదా 1571-72. [184]. కాబట్టి వసుచరిత్రరచనాకాలము ఖచితముగ 1571 వ సంవత్సరము.

హరిశ్చంద్రనలోపాఖ్యానము నరాంకితము కాదు. దైవాంకితము. రఘు రామునకు అంకితము. అందు వసుచరిత్రము ప్రసక్తమైనది. ఆ పద్యము పూర్వో దాహృతము. కాబట్టి హరిశ్చంద్రనలోపాఖ్యానము రచనాకాలము 1575 ప్రాంతము కావచ్చును. కావ్యాలంకారసంగ్రహము 1560. వసుచరిత్రము 1571 కావున 1580 కూడ కావచ్చును.

# కావ్యాలంకారసంగ్రహము

ఇది అలంకారశాస్త్రగ్రంథము. శాస్త్రవాఙ్మయచరిత్రకు విషయము. భట్టుమూర్తి కావ్యాలంకారసంగ్రహమును లక్షణగ్రంథముగాను. వసుచరిత్రమును లక్ష్యగ్రంథముగాను రచించెనని ఒక అభిప్రాయము కలదు [185] కావ్యాలంకారసంగ్రహమునందు కావ్యము దోషరహితము. గుణసహితము. అలంకారభావోపలక్షితమునైన శబ్దార్థములని కలదు. శబ్దార్థములు కావ్యశరీరము. ధ్వని జీవము. అలంకారములు అలంకారములు. గుణములు గుణములు. వృత్తులు వృత్తులు అని కలదు. అంతేకాదు. కావ్యము ఉత్తమ మధ్యమాధమభేదమున త్రివిధమని కలదు. వ్యంగ్యము ప్రధానమైనది ఉత్తమ కావ్యము. అప్రధానమైనది మధ్యమకావ్యము. అస్ఫుటమైనది అధమకావ్యమని. మొదటిది ధ్వనికావ్యమని. రెండవది గుణీభూతవ్యంగ్యకావ్యమని. మూడవది చిత్రకావ్యమని కలదు. అష్టాదశవర్ణనాత్మకమైనది మహాకావ్యమని కలదు. ఇవి కావ్య సామాన్యలక్షణములే. అయినను సర్వలక్షణలక్షితమైనది వసుచరిత్రము.

# వసుచరిత్రము

వసుచరిత్రము వాగ్దేవతాసమగ్రస్వరూపము.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాతమధుర మన్యదాలోచనామృతమ్"

అని ఒక ప్రసిద్ధమైన ఆభాణకము కలదు. అది భట్టుమూర్తి సరస్వతీస్తవమును సంవదించునది.

" సకలామోదకతాళవృత్తగతులన్ సంగీతసాహిత్యనా
మకవిద్యాయుగళంబు పల్కఁ జెలికిం బాలిండ్లజోడై సిరుల్
ప్రకటింపన్ నఖరేఖలందు నలఘుప్రస్తారముల్ సేయు స
ర్వకలాకాంతుఁడు ప్రోచుఁ దిర్మలమహారాయక్షమావల్లభున్. 3ప.1ఆ.

సరస్వతీదేవికి స్తనద్వయమైన సంగీతసాహిత్యనామకవిద్యాయుగళస్వరూపము వసుచరిత్రము. సర్వకావ్యములు సాహిత్యవిద్యాసనాథములు. వసుచరిత్రము సంగీతసాహిత్యవిద్యాద్వయసనాథము. వసుచరిత్రపద్యములను వీణపై పలికించుట వర్తమానశతాబ్ది పూర్వార్థమునందును కలదు. ఇది భట్టుమూర్తి సూచించినదియే. అది కూడ సరస్వతీస్తవమే.

" రమణీయాక్షసరాకృతిం బొలుచు వర్ణశ్రేణి వీణానులా
పముచేతం గరఁగించి యందు నిజబింబం బొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దద్వర్ణాళియందెల్లఁ బూ
ర్ణము గావించిన వాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్చుం గృపన్." 4ప.1ఆ.

సరస్వతి అక్షమాల, వీణ ధరించును. అక్షమాల అకారాదిక్షకారపర్యంత వర్ణసమామ్నాయమునకు ప్రతీక. అది సరస్వతి వీణావాదనముచేత కరగి, అందు సరస్వతి ప్రతిబింబము శాశ్వతత్వము, ఆత్మతత్త్వమును (బ్రహ్మతత్త్వమును) ప్రతిపాదించునని తాత్పర్యము. వసుచరిత్రములోని వర్ణసమామ్నాయము వీణావాదనము చేత కరగి భట్టుమూర్తి ప్రతిబింబము శాశ్వతత్వము, ఆత్మతత్త్వమును(భట్టుమూర్తితత్త్వమును) ప్రతిపాదించునని అంతర్యము. వీణావాదమునకు అనుగుణముగ వసుచరిత్రపద్యరచనము కలదు. ప్రతిపద్యము ప్రబలనిదర్శనమైనను, ప్రసిద్ధ నిదర్శనమిది:

" లలనాజనాపాంగవలనావసదనంగ
తులనాధికాభంగదోఃప్రసంగ

మలసానిలవిలోలదళసానవరసాల
ఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీక
మలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంత
రతికాంతరణతాంతసుతనుకాంత
మకృతకామోదకురవకావికలవకుల
ముకులసకలవనాంతప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠకాకలీవి
భాసురము వొల్చు మధుమాసవాసరంబు." 125ప.1ఆ.

ఇట్లు సంగీతసాహిత్యవిద్యాద్వయసనాథమైన కావ్యము, ఇతర భాషలయందు మృగ్యము. వసుచరిత్రము సంగీతసాహిత్యవిద్యాయుగళమే గాక సుకుమారశ్లేషబహుళము. ఏవంవిధగుణగరిష్ఠమైన వసుచరిత్రమునకు ఇంచుమించు సమకాలమునందే సంస్కృతతమిళానువాదములు వెలసినవి. అర్వాచీనకాలమునందు ఏకదేశమైన ఆంగ్లానువాదమును అమరినది. వసుచరిత్రము సంస్కృతనాటకముగను, తెలుగు యక్షగానముగను రూపొందినది. సంక్షిప్తీకరణము జరిగినది. అనుకరణము పెరిగినది. ఇంత ప్రాచుర్యమునందిన తెలుగు ప్రబంధము మఱొకటి లేదు. ఇదియెల్ల వసుచరిత్ర వైభవమునకు వైజయంతి.

అప్పయ్యదీక్షితుల (1560-1610) శిష్యుడు కాళహస్తికవి సంస్కృతానువాదము కావించెను[186]. రచనాకాలము 1600 ప్రాంతము కావచ్చును. అంబలత్తాడుమయ్యన్ అను తమిళకవి తమిళానువాదమును కావించెను[187]. తద్రచనాకాలము ను 1600 ప్రాంతము కావచ్చును. పేరుసూరి అను దాక్షిణాత్యుడైన తెలుగుకవి వసుమంగళమను సంస్కృతనాటకమును రచించెను[188] లింగము వేంకటరాయమంత్రి 1876లో గిరికా పరిణయమను తెలుగు యక్షగానమును రచించెను[189]. 1829 వ సంవత్సరమునందు కావలి వేంకటరామస్వామి కృత్యాదిపద్యములు, గిరికావసురాజసంగమము ఆంగ్లభాషలోనికి అనువాదము చేసి ప్రకటించెను[190]. రామాయణమునకు బాల రామాయణము వలె, సిద్ధాంతకౌముదికి లఘుసిద్ధాంతకౌముది వలె భట్టుమూర్తి వసు చరిత్రమునకు పిల్ల వసుచరిత్రమని ఒక ఏకాశ్వాసప్రబంధము కలదు[191]. అది 883 పద్యముల ఆరాశ్వాసముల వసుచరిత్రమునకు 287 పద్యముల ఏకాశ్వాసముగ సం క్షిప్తీకరణము. సుమారు అరువందల పద్యములు హారతికర్పూరము వలె ఆవిరియైనవి.

అనంతరకాలములోని వసుచరిత్రమునకు అనుకరణములైన కనుపర్తి అబ్బయా మాత్యుని పురూరవశ్చరిత్రమునకు, అడిదము సూరకవి కవిజనమనోరంజనమునకు, కృష్ణకవి శకుంతలాపరిణయమునకు, కూచిమంచి తిమ్మకవి రసికజనమనోభిరా మము మొదలగు కృతులకు పిల్ల వసుచరిత్రములను పిదప బిరుదములు కలవు. భట్టు మూర్తి వసుచరిత్రమునకు ప్రతిబింబప్రాయమైన సురభిమాధవరాయకవి చంద్రి కాపరిణయము పెద్ద వసుచరిత్రమే.

## ఇతివృత్తప్రపంచీకరణము

కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టు రత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్." 19ప.1ఆ.

అని తిరుమలదేవరాయలు అన్నట్లు భట్టుమూర్తి ప్రకటనము. అది భట్టుమూర్తి అభిప్రాయమే. ఒక్క భట్టుమూర్తి అభిప్రాయమే కాదు. అప్పటి కవులు అందఱి అభి ప్రాయమును అదే. ఒక్క పింగళి సూరన వినా. అందువలన పయి పద్యము కళాపూర్ణో దయముపై పరోక్షవిమర్శ అని ఒక అభిప్రాయము కలదు. ప్రసిద్ధము. కాని కళాపూర్ణో దయము కేవలకల్పనాకథ కాదు. మిశ్రకథ అనిపించు కల్పితకథ అని పూర్వోక్తము.

" ప్రఖ్యాతోత్పాద్యమిశ్రత్వభేదా త్త్రిధాపి తత్త్రిధా
ప్రఖ్యాత మితిహాసాదే రుత్పాద్యం కవికల్పితమ్
మిశ్రం చ సంకరా త్తాభ్యాం దివ్యమర్త్యాదిభేదతః"

అని దశరూపకమునందు కలదు. నాటకవస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని త్రివిధము. ఇతిహాసాదికము ప్రఖ్యాతము. కవికల్పితము ఉత్పాద్యము. తత్సాంకర్యము మిశ్రము. మహాభారతమునందు ఉపరిచరవసుమహారాజు వృత్తాం తము కలదు. అది ప్రఖ్యాతము. వసుచరిత్రమునందు మహాభారతమునందు లేని కవికల్పితమును కలదు. ఇదిఉత్పాద్యము. ఉభయకుశలమైన వసుచరిత్రము మిశ్రకథ.

ఉపరిచరవసుమహారాజు వృత్తాంతము సంస్కృతభారతమునందు కలదు. అది నన్నయ భారతమునందును కలదు. రెండు పద్యములు, రెండు వచనములు మాత్రమే.(23ప-26వచ.2ఆ.ఆ.ప.) అది 770 పద్యగద్యముల వసుచరిత్రకథాభాగము.

భారతకథ ఇది :

చేదిదేశపు రాజు వసువు మృగయావినోదార్థము అడవికి వెడలి, నిర్వేదము నంది మునిజనాశ్రమమునందు తపస్సు చేయును. అతని పాలికి అమరగణములతో ఇంద్రుడు వచ్చి ప్రశంసించి, తనతో చెలిమి సేయుచు తనయొద్దకు వచ్చుచు పోవుచు, రాజ్యము సేయుమని దేవత్వమును, కనకరత్నమయమైన దివ్యవిమానమును, ఆయుధములను వమ్ముసేయు వాడని ఇంద్రమాల అను కమలమాలిక, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనక్షమమైన వేణుయష్టి ఇచ్చును. వసురాజు అట్లు చేయును. విమానా రూఢుడై ఉపరిలోకములందు సంచరించుట వలన ఉపరిచరవసువను పేరు గాంచు ను. ఇంద్రమాల చిహ్నముగ, వేణుయష్టికి ఏటేట ఇంద్రోత్సవము సేయును అందుకు సంతుష్టుడైన ఇంద్రుని వరమున అయిదుగురు కుమారులు కలుగుదురు. వారిని పెక్కుదేశములకు అభిషిక్తులను జేయును. వసురాజు రాజర్షియై రాజ్యము సేయుచు రాజధానికి సమీపమునందలి శుక్తిమతి అను మహానదిని, కోలాహలుడను పర్వ తము కామించి అడ్డుపెట్టినే, పాదముతో తొలగించును. నదీనగసమాగమమున వసు పదుడను కుమారుడు, గిరిక అనుకూతురు జన్మింతురు. శుక్తిమతి వారిని ఉపరిచర వసుమహారాజునకు ఉపద ఇచ్చును. అతడు వసుపదుని సేనాపతిగ చేసికొని గిరి కను వివాహమాడును.

వసుచరిత్రకథ ఇది :

వసురాజు చేదిదేశపు రాజు. అతని రాజధాని అధిష్ఠానపురము. ఉద్యాన పాలకులు ఫలపుష్పాదులు కానుకలిచ్చి వసంతర్తువైభవమును వర్ణింతురు. వసురాజు ఉద్యానవనవిహారము సేయును. ఒక కిన్నరమిథునము కల్యాణము ప్రాప్తించునని విన్నవించును.

వసురాజు నర్మసఖునితో క్రీడాశైలమైన కోలాహలమునకు ఏగి, విహరించునెడ ఒక మధురమైన నాదము వినిపించును ఆ సంగీత మెవ్వరిదో తెలిసికొని రమ్మని న ర్మసఖుని పంపును. అతడు వెడలి ఒక కోనలోని దివ్యభవనమునందు సఖీసమేతయై వీణ వాయించు త్రిలోకసుందరిని చూచి, తిరిగి వచ్చి, ఆమె సౌందర్యమును అభివర్ణిం చి, ఆమె సంగీతమని తెలుపును. కిన్నరమిథునము చెప్పినది జ్ఞప్తికి వచ్చి, వసురాజు నర్మసఖునితో ఆ కోనకు ఏగి, ఆ కన్యారత్నమును చూచి, ఆనందాశ్చర్యము లంది, ఆమె వృత్తాంతము తెలిసికొని రమ్మని నర్మసఖుని నియోగించును. నర్మసఖుడు

యతివేషమును ధరించి. అచటి కేగి ఆమె వృత్తాంతమును అడుగ. ఆమె చెలికత్తె మంజువాణి వివరించును. అది శుక్తిమతీకోలాహలవృత్తాంతము. ఆమె గిరిక. ఆ వృత్తాంతమును ఆలకించిన కపటయతి. మిథ్యాధ్యానము చేసి. "ఈ కన్యను వసురాజు పరిగ్రహించును" అని చెప్పును. "అతడు ఎప్పుడు వచ్చును? ఏల వచ్చును? ఎట్లు వచ్చును?" అని చెలికత్తెలు అడుగ "మంత్రశక్తిని రప్పింతు"నని యతివేషధారి మాయాజపము చేసి "మజ్ఝా" అనగా లతాంతరితగాత్రుడైన వసురాజు వచ్చును. గిరికావసురాజుల పరస్పర వీక్షణములు ప్రసరించును. మంజువాణీ ప్రభృతి సఖీజనము సరసప్రసంగములు సాగును. యతివేషధారి గిరికావసురాజులను ఆశీర్వదించి. దవ్వుగ పోయి. యతివేషము విడిచి నర్మసఖునిగ వచ్చును. కలహంసి అను పరిచారిక వచ్చి. శుక్తిమతి రమ్మన్నదని గిరికను తీసికొనిపోవును. నర్మసఖుడు వసురాజును నగరమునకు తీసికొనిపోవును. వసురాజునకు విరహము విజృంభించును. గిరికకును విరహము విజృంభించును. మంజువాణి రాయబారము సేయును. గిరిక హారమును వసురాజు కంఠమున కైసేయును. వసురాజు అంగుళీయకమును గిరికకు సమర్పించును. గిరికావసురాజుల ప్రణయమునకు శుక్తిమతీకోలాహలులు సంతసింతురు. ఇంద్రుడు సంబంధము నిశ్చయించును. కమలమాల ఇచ్చును. గిరికావసురాజుల వివాహము జరుగును. దేవతలు వరములు ప్రసాదింతురు. ఇంద్రుడు దుష్టశిక్షణశిష్టరక్షణక్షమమైన వేణుయష్టిని ఇచ్చును. శుక్తిమతీకోలాహలులు అప్పగింతలు చెప్పి. గిరికావసురాజులను అధిష్ఠానపురమునకు పంపుదురు. అధిష్ఠానపురపుంరంధ్రులు ఆనందింతురు. గృహప్రవేశము జరుగును. సమాగమమహోత్సవము సాగును.

ఇందు భారతములోని శుక్తిమతీకోలాహలవ్యవహారము. వసుచరిత్రమునందు శుక్తిమతీకోలాహలవృత్తాంతమైనది. ఇంద్రుడు వసురాజు తపస్సునకు మెచ్చి దివ్యవిమానము. ఇంద్రమాల. వేణుయష్టి ఇచ్చినట్లు భారతమునందు కలదు. కోలాహల పర్వతమును ఎగమీటినందుకు దివ్యవిమానము. పెండ్లికానుకగ వేణుయష్టి ఇచ్చినట్లు వసుచరిత్రమునందు కలదు. ఇది అలతిభేదము. భారతములోని శుక్తిమతీకోలాహల వ్యవహారమునకు. వసుచరిత్రములోని శుక్తిమతీకోలాహలవృత్తాంతము ప్రపంచీకరణము. భారతములోని గిరికావసురాజుల వివాహప్రసక్తికి. వసుచరిత్రములోని గిరికావసురాజులవృత్తాంతమెల్ల స్వతంత్రకల్పనము. కాబట్టి వసుచరిత్రము స్వతంత్రకావ్యము. కళాపూర్ణోదయమువలె సర్వతంత్ర స్వతంత్ర కావ్యము కాదుగాని. మనుచరిత్రాదులకంటె మహాస్వతంత్రకావ్యము.

# అనుసరణము

వసుచరిత్రములోని స్వతంత్రకల్పనములందు అనుసరణము సొనపట్టిన సరణిని కలదు. నాయికానాయకుల ప్రథమసమావేశమునకు నాదానుసంధానము శ్రీహర్షుని నాగానందనాటకమునకు అనుసరణము. నాగానందమునందు వీణానాదమును విని జీమూతవాహనుడు మలయవతిని సమీపించును. వసుచరిత్రమునందును వీణా నాదమును విని వసురాజు గిరికను సమీపించును. నాయిక జన్మవృత్తాంతమును ప్రియసఖి చెప్పుట కాళిదాసు అభిజ్ఞానశాకుంతలనాటకమునకు అనుసరణము. అభిజ్ఞానశాకుంతలమునందు శకుంతల ప్రియసఖులైన అనసూయాప్రియంవదలు శకుంతల జన్మవృత్తాంతమును చెప్పుటకు ఉపక్రమింతురు. వసుచరిత్రమునందు గిరిక ప్రియసఖి అయిన మంజువాణి గిరిక జన్మవృత్తాంతమును వివరించును. నాయికానాయకుల విప్రలంభసంభోగశృంగారవర్ణనము శ్రీహర్షుని నైషధీయచరితమునకు అనుసరణము. నలదమయంతుల విప్రలంభసంభోగశృంగారవర్ణనము విస్తరముగ హర్షనైషధమునందు కలదు. సంగ్రహముగ శ్రీనాథుని శృంగారనైషధమునందు కలదు. గిరికావసురాజుల విప్రలంభసంభోగశృంగారవర్ణనము విరివిగ వసుచరిత్రమునందు కలదు. నలదమయంతుల వివాహవర్ణనము వివరముగ సంస్కృతాంధ్రనైషధములందు కలదు. గిరికావసురాజుల వివాహవర్ణనము వివరముగ వసుచరిత్రమునందు కలదు. అభిజ్ఞానశాకుంతలము నిమిత్తముగ దమయంతిని అత్తవారింటికి పంపించు కరుణరసఘట్టము సంస్కృతాంధ్రనైషధములందు కలదు. గిరికను అత్తవారింటికి పంపించు కరుణరసఘట్టము వసుచరిత్రమునందు కలదు. మొత్తము మీద వసుచరిత్రమునందు సంస్కృతాంధ్రనైషధానుసరణము సమధికము.

శృంగారనైషధానుసరణము వలె మనుచరిత్రానుసరణమును వసుచరిత్రమునందు కలదు. ప్రవరుడు ఒక కోనలోని భవనప్రాంగణమునందు వీణ వాయించు వరూథినిని చూచినట్లు మనుచరిత్రమునందు కలదు. నర్మసఖుడు ఒక కోనలోని కేళీనివాసమునందు వీణ వాయించు గిరికను చూచినట్లు వసుచరిత్రమునందు కలదు. ప్రవరుని నిరాకరణమునకు వరూథిని అతనిని కౌగిలించినట్లు మనుచరిత్రమునందు కలదు. శుక్తిమతి నిరాకరణమునకు కోలాహలుడు ఆమెను అడ్డగించినట్లు వసుచరిత్రమునందు కలదు. వరూథిని పరాశరాదులను పరామర్శించినట్లు మనుచరిత్రమునందు కలదు. కోలాహలుడు శివాదులను పరామర్శించినట్లు వసుచరిత్రమునందు కలదు. అంతేకాదు. మనుచరిత్రములోని పద్యములను సొనపట్టిన పద్యములు

వసుచరిత్రమునందు కలవు.

మనుచరిత్రమునందు ప్రవరుడు చూచిన వరూథిని వర్ణనమిది:

" అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁ బోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీశిరోరత్నమున్." 25ప.2ఆ.

వసుచరిత్రమునందు నర్మసఖుడు చూచిన గిరిక వర్ణనమిది:

" తరువుల పొంతఁ బొంచి వసుధావరమిత్త్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాల నొక దన్విఁ దరంగవళిం దలోదరిన్." 25ప.2ఆ.

పెద్దన పద్యమునందు పదవిన్యాసవక్రత కలదు. భట్టుమూర్తి పద్యమునందు వృత్త్యనుప్రాసాలంకారము కలదు.

మనుచరిత్రమునందు కోడికూత వర్ణనమిట్లు కలదు.

" సకలాశాగతినర్మకోపవిరతిక్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశబ్దజ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంతం గొందపై పల్లెఁ గ్రు
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్."

వసుచరిత్రమునందు కోడికూత వర్ణనమిట్లు కలదు.

" ఒకనాఁ డింద్రుని యంతవేలుపు మదీయోక్తిన్ పదంబించి తా
నొక కాలం బెఱిఁగింపవచ్చి మునిశాపోద్భూతి పాలయ్యె మా
మకశబ్దం బిది యల్పమే త్రిమునిసంభావ్యత్రికాలీవిదో
ధకమన్ రీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడౌఘముల్.".

పెద్దన పద్యమునందు త్రిభంగి త్రివర్గవిషయము భట్టుమూర్తి పద్యమునందు త్రిభంగి త్రిమునివిషయము. మునిత్రయకృతమైన వ్యాకరణములోని హ్రస్వ దీర్ఘప్లుతకాలవిషయము

మనుచరిత్రమునందు వరూథిని గంధవాహుని నిందించుట ఇట్లు కలదు.

" అక్కట గంధవాహ తగవా హరిణాంకునిఁ గూడి పాంథులం
బొక్కఁగఁ జేయఁ బావకుని పొందొనరించి జగమ్ము లేర్చు నీ
యక్కొఱగామి మాన వదియట్టిద చుల్కని వృత్తి దుర్జనుం
డొక్కనిఁ జొచ్చి క్రిందుపడు నొండ్లకుఁ గీడొనరింపఁ గల్గినన్." 5ఉ.3ఆ.

వసుచరిత్రమునందు గిరిక మన్మథుని నిందించుట ఇట్లు కలదు.

" శంబరవైరి పీవు పటుశంబరపోషణశాలి యాతఁ డ
బ్జాంబకధారిపీవు మథితాబ్జుఁ డతండు నిశాటఘాటద
ర్పం బడఁగించు బల్లిదుని పట్టివి నీవు నిశాటుఁ డాతఁ డో
యంబుచరాంక నీకుఁ దగునా హరిణాంకుని తోడి కూటముల్." 39ప.4ఆ.

పెద్దన పద్యమునందు గంధవాహునికి హరిణాంకునికి కూటమి. భట్టుమూర్తి పద్యమునందు మన్మథునికి హరిణాంకునికి కూటమి. పెద్దన పద్యమునందు అర్థాంతరన్యాసాలంకారము కలదు. భట్టుమూర్తి పద్యమునందు శ్లేషాలంకారము కలదు.

## శ్లేషాశ్లేషము

వసుచరిత్రము శ్లేషకావ్యమని, ధ్వనికావ్యమని, గుణీభూతవ్యంగ్యకావ్యమని అభిప్రాయభేదములు కలవు. అసలు శ్లేష అలంకారము. అది సందర్భమునకు ఆవశ్యకమైనను, కథకు ప్రయోజనకరమైనను కావ్యగౌరవము పెరుగును. ఆవశ్యకము కాకపోయినను, ప్రయోజనకరము కాకపోయినను కావ్యగౌరవము తఱుగును. శ్లేషార్థములు వాచ్యార్థములైనచో శ్లేషాలంకారము. ఒకటి వాచ్యార్థము, మఱొకటి వ్యంగ్యార్థమును అయి, వ్యంగ్యార్థము ప్రధానమైనచో ధ్వని. శబ్దశక్తిమూలకధ్వని. వ్యంగ్యార్థము ప్రధానము కానిచో గుణీభూతవ్యంగ్యము. మూడు విధముల వసుచరిత్రము శబ్దశక్తిమూలకము.

హర్షనైషధమునందు పంచనైషధీఘట్టము శ్లేషమయము. అది సందర్భమునకు ఆవశ్యకము. కథకు ప్రయోజనకరము. ఇంద్రాగ్ని యమ వరుణుల నలరూపధారణమున దమయంతి స్వయంవరసభలోని పంచకముల నలపంచకము కలదు. వానిని దమయంతికి వాగీశ్వరి పరిచయము చేయునెడ శ్రీహర్షుని శ్లేషకవిత్వము విజ్ఞం

ధించినది. "సాక్షాత్కృతాఖిలజగజ్జనతాచరిత్రయైనను. సరస్వతి అతడు నలుడు. వీరు నలరూపధారులు అని చెప్పగూడదు. చెప్పకుండను ఉండగూడదు. అందుకు శ్లేషను ఆశ్రయించినది. నలరూపధారియైన ఇంద్రుని పరిచయము సేయునెడ నలుడని. ఇంద్రుడని అర్థములు వచ్చునట్లు అయిదు శ్లోకములు (3-7). నలరూపధారియైన అగ్నిని పరిచయము సేయునెడ నలుడని. అగ్ని అని అర్థములు వచ్చునట్లు నాలుగు శ్లోకములు (10-13). నలరూపధారియైన యముని పరిచయము సేయునెడ నలుడని. యముడని అర్థములు వచ్చునట్లు నాలుగు శ్లోకములు (16-19) నలరూపధారియైన వరుణుని పరిచయము సేయునెడ నలుడని. వరుణుడని అర్థములు వచ్చునట్లు నాలుగు శ్లోకములు (22=25) కలవు. అంతేకాదు. నలుని పరిచయము సేయునెడ నలుడని ఇంద్రుడని. నలుడని అగ్ని అని. నలుడని యముడని. నలుడని వరుణుడని అర్థములు వచ్చునట్లు నాలుగు శ్లోకములు(28-31శ్లో.13స.) కలవు. ఇట్లు పరిచయముచేసి. అయిదుగురిలోను ఒకరిని వరింపుమని అయిదుగురు పరముగను అర్థములు వచ్చునట్లు సరస్వతి వర్ణించిన శ్లోకము మఱొకటి కలదు. (34శ్లో.13స.) అన్ని శ్లోకముల అర్థములును వాచ్యార్థములే. కాబట్టి శ్లేషాలంకారమే. పంచనైషధిశ్లేష చాలవఱకు ఆంధ్రభాషకు అందని ఫలము. సంస్కృతభాషకు మాత్రమే సాధ్యము. అనృతదోషము కలుగని రహస్యగోపనము సందర్భమునకు ఆవశ్యకము. అది కావ్యగౌరవాపాదకము.

పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నమునందు ప్రద్యుమ్నుడు భద్రనటునిగా వజ్రనాభుని స్తుతించిన పద్యత్రయమునందు శ్లేష కలదు. (105-107ప.4ఆ.) అందు వజ్రనాభస్తుతి వాచ్యార్థము. ప్రభావతికి ప్రణయసంకేతము వ్యంగ్యార్థము. వజ్రనాభుని సన్నిధిని ప్రభావతికి ప్రణయసంకేతము వాచ్యమైన ప్రాణసంకటము. అందుకు శ్లేష ఆవశ్యకము. అంతేకాదు. అనంతరకథకు ప్రయోజనకరము. వజ్రనాభస్తుతిలోని అర్థాంతరము. భద్రనటుడు ప్రద్యుమ్నుడుగానే కనిపించిన ప్రభావతికి. భద్రనటుడు ప్రద్యుమ్నుడని తెలిసిన శుచిముఖికి మాత్రమే ప్రతీయమానమగును. అదే ప్రధానము. కనుక శ్లేషాలంకారము కాదు. శబ్దశక్తిమూలకధ్వని. వసుచరిత్రములోని శుక్తిమతీ కోలాహలవృత్తాంతము శబ్ద శక్తిమూలక ధ్వని గర్భితము. భారతకథను "శుక్తిమతి అను మహానదిని. కోలాహలుడను పర్వతము కామించి అడ్డు పెట్టిన. నదీనగసమాగమము వలన శుక్తిమతికి వసుపదుడను కుమారుడు. గిరిక అను కూతురు జన్మిం"చిరని కలదు. పర్వతము కామించుట ప్రకృతివిరుద్ధము. నదీనగములు జడములు. జడపదార్థములకు జనసం

తానము కలుగుట జగద్విరుద్ధము. ఇట్టి సంఘటనలు ఇతిహాసములందు స్తుతి పాత్రములు. పురాణములందు పూజనీయములు. కావ్యములందు భావ్యములు కావు. అంతేకాదు. జడగతమైన శృంగారము రసము కాదు. రసాభాసము. జనగతమైన శృంగారము రసము. వసుచరిత్రమునందు శుక్తిమతీకోలాహలుల వృత్తాంతము నదీనగ పరముగ రసాభాసమైనను. నాయికానాయికపరముగ రసవత్తరము. అందుకు శ్లేష ఆలంబనయష్టి. నదీనగపరమైన అర్థము వాచ్యార్థము. నాయికానాయకపరమైన అర్థము వ్యంగ్యార్థము. అది కావ్యమునకు ఆవశ్యకము. అంతేకాదు. మానవసంతానప్రాప్తికి ప్రయోజనకరము. అది ప్రధానము. కాబట్టి శుక్తిమతీకోలాహలవృత్తాంతము ధ్వనికావ్యము.

" జీవనమెల్ల సత్కవినిషేవిత మాశయమెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల పెట్టు ప్రచారములెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫలదేశికముల్ నవకంబులెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము లా నది పెంపు నుతింప శక్యమే." 104ప.2ఆ.

ఇది శుక్తిమతి పరిచయము. అది నది అని వాచ్యముగ కలదు. నదీపరమైన అర్థమెల్ల వాచ్యార్థము. నీరెల్ల నీటి పక్షులచేత మిక్కిలి సేవింపబడినది. మడుగెల్ల స్వచ్ఛతకు, పవిత్రతకు, గంభీరతకు నెలవు. ప్రవాహములెల్ల సమస్తభూమండలమునకు ముక్కాఱు పంటలు పండించునవి. క్రొత్త శంఖములెల్ల ముత్యాల పుట్టురేఖలు కలవి. అని నదీపరమైన అర్థము. వాచ్యార్థము. అది కథకు ఆవశ్యకము బ్రదుకెల్ల సత్కవులచేత మిక్కిలి కొనియాడబడినది. మనసెల్ల స్వచ్ఛతకు, పవిత్రతకు, గంభీరతకు నిలయము. ప్రవర్తనములెల్ల సమస్తభూజనులకు భూతభవిష్యద్వర్తమానఫలములను బోధించునవి. చక్కదనములెల్ల ముక్తులకును మోహము కలిగించునవి. అని నాయిక పరమైన అర్థము. వ్యంగ్యార్థము. ఇది కావ్యమునకు ప్రయోజనకరము. రసప్రధానము. కనుక శబ్దశక్తిమూలకధ్వని.

" సుమనోధివాసభాసురశిఖోన్నతి వాఁడు
ఘనసారతిలకవాసనల వాఁడు
ఘనసంకుమదసాంద్రగండభాగము వాఁడు
నవపద్మరాగదంతముల వాఁడు
కలితోపకంఠనక్షత్రమాలిక వాఁడు
హరిచందనచ్ఛాయ నమరు వాఁడు

కమనీయమేఖలాధాళధళ్యము వాఁడు
మణిపాదవలయధామంబు వాఁడ
నర్ఘరత్నావళీవిచిత్రాంబరాభి
రామశృంగారముల వాఁడు హైమగర్భ
గేహమున కేఁగువాఁడు కోలాహలాఖ్యుఁ
డొక ధరాధీశుఁ డెదురయ్యె నువిద కపుడు." 107ప.2ఆ.

ఇది కోలాహలపర్వతరాజు ప్రవేశము. ఇందు పర్వతపరమైన అర్థము వాచ్యార్థము. రాజుపరమైన అర్థము వ్యంగ్యార్థము. దేవతల నివాసముతో ప్రకాశించు ఉన్నతమైన శిఖరము కలది. కర్పూరకదళి. నువ్వుపువ్వుల పరిమళము కలది. జవ్వాది దట్టమైన గండశిలాభాగము కలది. పద్మరాగమణిమయములైన సానువులు కలది. సమీపమునందు నక్షత్రసమూహము కలది. కల్పవృక్షము నీడ కలది. బంగారు నడిమిభాగము కలది. రత్నమయమైన ప్రత్యంతప్రదేశము కలది. అనర్ఘములైన రత్నముల కాంతులు ఆకాశమునందు ప్రసరించునది పర్వతము. అది కథకు ఆవశ్యకము. పూలసంస్కారముచేత ప్రకాశించు పెద్ద సిగముడి కలవాడు. శ్రేష్ఠమైన కర్పూరసువాసనలు కలవాడు. జవ్వాది పూసిన చెక్కిలి కలవాడు. పద్మరాగమణుల వంటి దంతములు కలవాడు. కంఠమునందు నక్షత్రమాల (హారము) కలవాడు. పచ్చనిగంధము కాంతి కలవాడు. మణిగండపెండారము కలవాడు. రత్నాంబరములు ధరించినవాడు రాజు. ఇది కావ్యమునకు ప్రయోజనకరము. రసప్రధానము. కనుక శబ్దశక్తిమూలకధ్వని.

" వేణి చలింపఁ గంపితనవీనమృణాలభుజాగ్రకంకణ
శ్రేణి నటింప లోలశఫరీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణము సూప హంసకగణక్వణనంబును మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభితయై కడు సంభ్రమించినన్." 137ప.2ఆ.

ఇది పర్వతము అడ్డుపెట్టిన నది స్థితి. ఇందు నాయకుడు పట్టుకొన్న నాయిక స్థితి కలదు. నదీపరమైన అర్థము వాచ్యార్థము. నాయికాపరమైన అర్థము వ్యంగ్యార్థము. పర్వతము అడ్డుపెట్టిన నది తత్తఱపడినది. ప్రవాహము చలించినది. భుజముల వంటివణికిన లేత తామరతూడుల కొసల నీటికణములు తొణికిసలాడినవి. దట్టమైన కటాక్షముల కాంతి వంటి ఎగసిపడు చేపల సమూహము మిసమిసలాడినది. హంసల రొదలు అతిశయించినవి. నితంబము వంటి ఇసుకతిన్నె కల నది. త్రిప్పుకొన్న ముఖ

ము వంటి పద్మముచేత ప్రకాశించినది. అని నదీపరమైన అర్థము. అది కథకు ఆవశ్యకము. నాయకుడు పట్టుకొన్న నాయిక తత్తఱపడినది. వాలుజడ ఊగిసలాడినది. లేత తామరతూడుల వంటి వణికిన భుజముల చివఱ గాజులు గలగలలాడినవి. ఎగసిపడు చేపల సమూహము వంటి దట్టమైన కటాక్షముల కాంతి ఎంత సోయగము చూపినది. కాలి అందెలు ఘల్లుఘల్లుమన్నవి. ఇసుకతిన్నె వంటి నితంబము కల నాయిక. త్రిప్పికొన్న పద్మము వంటి ముఖముచేత ప్రకాశించినది. అని నాయికాపరమైన అర్థము. ఇది కావ్యమునకు ప్రయోజనకరము. రసప్రధానము. కనుక శబ్దశక్తిమూలకధ్వని.

ఇది చిత్రకళకు, శిల్పకళకు అందని కవిత్వకళ అని ప్రశస్తము.

ఇట్లు శుక్తిమతీకోలాహలవృత్తాంతము శబ్దశక్తిమూలకధ్వనిగర్భితము. గిరికావసురాజుల వృత్తాంతము గుణీభూతవ్యంగ్యవిలసితము.

" స్వైరవిహారధీరలగు సారసలోచన లున్న చోటికిన్
దోరన లాతివారు చొరఁ బూనినచో రసభంగమంచు నేఁ
జేరక పువ్వుఁదీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్ ' 54ప.2ఆ.

ఇది గిరికను చూచి వచ్చి నర్మసఖుడు వసురాజునకు చెప్పినది. ఇందు శ్లేషార్థములు, వ్యంగ్యార్థములు బహుళము.

విరిసిన పద్మముల వంటి కన్నులు కల వసురాజ! స్వేచ్ఛగా విహరించు ధైర్యము కల స్త్రీలు ఉన్నచోటికి హఠాత్తుగ అన్యులు ప్రవేశింపబోయిన రసభంగము కలుగును. సమీపించక, పూలతీగల దగ్గఱ నిలిచి గిరిక రూపము కన్నారచూచి నీకు తెల్పుటకు వచ్చితినని ప్రకృతార్థము.

స్వేచ్ఛగా విహరించు సారసలోచనలు ఉన్నచోటికి హఠాత్తుగ అన్యులు ప్రవేశింపబోయిన, సారసలోచనలను పదబంధములోని రసశబ్దమునకు భంగము కలిగి అనగా లోపించి సాలోచన లగుదురని అర్థాంతరము.

నవాంబురుహాంబక! అనగా విరిసిన పద్మముల వంటి కన్నులు కల కమలాక్ష! అని, క్రొత్తగా నీటియందు పుట్టిన అగ్ని నేత్రముగా కల త్ర్యంబక! అని. సరికొత్త పద్మము బాణముగా కల మన్మథ! అని అర్థాంతరములు. సారసలోచనలు

విష్ణుపరముగ లక్ష్మీసద్మశీలు. శివపరముగ పార్వతీసద్మశీలు. మన్మథపరముగ రతి సద్మశీలు. ఇవి కూడ శ్లేషచమత్కారములే.

లతాంగి రూపు అనగా లతాంగి రూపమేగాక, లతాంగి ధరించిన (రూపు) అను కన్యాభరణవిశేషము. అది కన్నార చూచుట వలన ఆమె కన్నె అని, వివాహయోగ్య అని వ్యంగ్యార్థము. "నీకుఁ దెల్పగ వచ్చితిన్" అనుటవలన గిరికకు తగిన భర్త వసురాజే అని కూడ వ్యంగ్యార్థము. పూవుదీవల చెంతనుండి చూచుటవలన గిరిక పూవుదీవ అగుట నిశ్చయమని. పూవుదీవ అనుటవలన సర్వాభరణభూషిత అని కూడ వ్యంగ్యార్థములు భాసించును. అవి సారస్యములు, ఆనుషంగికములు. కాని ప్రధానము కావు. కనుక గుణీభూతవ్యంగ్యమే."రసోచితచమత్క్రియాకల్పనాకల్పి భవ్యము." (12వచ.1ఆ.)

" అనుపమకాంతివైభవసమన్వితు నా వసురాజుఁ గాంచు ప
ద్మిని సరసాంతరంగమున మించె నినూతనరాగకందళం
బొనరె నఖండవాసనలు నుత్కలికల్ విలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁ జూపుతుమ్మెదల్." 48ప.3ఆ.

ఇందు ప్రకృతాప్రకృతశ్లేష కలదు. ప్రకృతార్థము వాచ్యార్థము. అప్రకృతార్థము వ్యంగ్యార్థము. సాటిలేని తేజస్సుతో కూడిన వసురాజును చూచు పద్మినీజాతిస్త్రీ అయిన గిరికయొక్క సరసమైన అంతరంగమునందు సరికొత్త అనురాగపు మొలక అతిశయించెను. రోమాంచాదిసాత్త్వికభావములు జనించెను. ఉత్కంఠాదిసంచారీభావములు ఉద్భవించెను. మెల్లమెల్లగా సంతోషముచేత చంచలములైన చూపులనెడు చంచరీకములు తమకము కొలది సంచరించెను. అని ప్రకృతార్థము. సాటిలేని తేజస్సుతో కూడిన సూర్యుని (వసువులన కిరణములు. కిరణాధిపతి వసురాజు.) చూచు తామరతీగ మూలదుంపయందు సరికొత్త ఎఱ్ఱనిమొలక అతిశయించెను. అఖండమైన సువాసనలు జనించెను. మొగ్గలు పొటమరించెను. మెల్లమెల్లగా చంచలములైన చంచరీకములు తమకము చూపుచు వ్రాలెను. అని అప్రకృతార్థము. శబ్దశక్తిమూలకధ్వన్యర్థము. వ్యంగ్యార్థము. కాని ప్రధానము కాదు. గౌణము. కనుక గుణీభూతవ్యంగ్యము.

ప్రకృతార్థమునందు రసప్రకరణము కలదు. వసురాజు ఆలంబనవిభావము. అతని తేజస్సు ఉద్దీపనవిభావము. సరసాంతరంగము సహృదయుని హృదయము. అఖండవాసనలు సాత్త్వికభావములు. ఉత్కళికలు సంచారీభావములు. చూపులు

అనుభావములు. రతి స్థాయిభావము. విభావానుభావ సాత్త్వికసంచారి భావములచేత, సహృదయులకు ఆస్వాద్యమానమగు స్థాయిభావము రసము.

" పతికృతధర్మకౌశలము పట్టునఁ దోడగు నారి నారి దాఁ
బితృశరణప్రచింత మదిఁ బెట్టక యీశనివేశితాత్మయౌ
సతి సతి రాశికెక్కి యినసత్కృతిఁ గైకొను కన్య కన్య శా
శ్వతమతి నిట్లుగా మనని వామయె వామ సుమమ్మ కోమలీ." 57ప.6ఆ.

పతి సేయు ధర్మకార్యము పట్టున సహకరించు భార్యయే భార్య అని అర్థము. పతి సేయు ధనుర్విద్యాకార్యము పట్టున సహకరించు అల్లెత్రాడే అల్లెత్రాడు అని అర్థాంతరము. తండ్రి ఇంటిమీద తలంపు పెట్టక భర్తయందే మనస్సు పెట్టు భార్యయే భార్య. దక్షుని సంరక్షణము కోరక, శివునియందు అర్థశరీరము చేర్చిన సతియే పార్వతి అని అర్థాంతరము. ప్రసిద్ధి గాంచి భర్త మన్నన పొందు భార్యయే భార్య అని అర్థము. ద్వాదశరాశులలో ఒక రాశియై, సూర్యసత్కారమును కాంచిన కన్యయే కన్యారాశి. అని అర్థాంతరము. స్థిరబుద్ధిని ఇట్లు బ్రదుకని భార్య వక్రస్వభావ అని అర్థము. ఇట "శాశ్వతమతి నిట్లుగా మనిన వామయె వామగదమ్మ" అను పాఠాంతరము కలదు. స్థిరబుద్ధిని ఇట్లు బ్రదికిన భార్యయే భార్య అని అర్థము. స్థిరబుద్ధిని ఇట్లు బ్రదికిన భార్యయే రమ్య అని అర్థాంతరము. అర్థాంతరములకు ఆవశ్యకము లేదు. ప్రయోజనకరము కాదు. అలంకారప్రాయము. కనుక శ్లేషాలంకారమే.

అతిసామాన్యమైన అచ్చికపదములతోను శ్లేష ఘటించుట భట్టుమూర్తి అసామాన్యమైన ప్రజ్ఞ. అంతేకాదు. సంస్కృతభాషకు మాత్రమే సాధ్యమైన శ్లేష ఆంధ్రభాషకు అందని ఫలమైనట్లు, భట్టుమూర్తి అచ్చికపదశ్లేష సంస్కృతభాషకు అందని ఫలము.

" ఆ తన్వంగి యనంగ ఝాంకరణవజ్జ్యాముక్తచూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్ములంచుఁ దటినీగర్భైకసంజాతకం
జాతవ్రాతము మాటుఁ జెంద నవి యేఁచన్ సాగె మున్మున్నుగా
'జ్ఞాతిశ్ఛేదనలేనకిమ్మనెడి వాచారూఢి సత్యంబుగన్." 101ప.3ఆ.

ఇందు "తమ్ములు" అను ఒక్క అచ్చికపదము శ్లిష్టము. సోదరులని ఒక అర్థము. పద్మములని మఱొక అర్థము పద్మములోని కల్పనమునకు అద్వయము

ప్రాణభూతము. దానికి "సారసజాతి" పదబంధమును. "కనిష్ఠ"శబ్దమును ప్రయోగించిన సంస్కృతీకరణములు కలవుగాని సద్యఃస్ఫూర్తి. సహజత్వము. సరసత్వము కలవి కావు.

ఇట్టి అచ్ఛికపదశ్లేష సాహిత్యపరముగానే గాక. సంగీతసాహిత్యద్వయపరము గాను భట్టుమూర్తి సంఘటించిన సందర్భములు కలవు. వసుచరిత్రములోని శ్లేష సంగీతసాహిత్యసమ్మేళనమునందును సమ్మాన్యము.

## సంగీతసాహిత్యసమ్మేళనము

వసుచరిత్రము "సంగీతసాహిత్యములు సంగమించిన వారణాసి." భట్టుమూర్తి సరస్వతీస్తవమునందు "సంగీతసాహిత్యనామకవిద్యాయుగళంబు" అని కలదు. స్వవిషయప్రకటనమునందు "సంగీతకళారహస్యనిధి" అని కలదు. వసుచరిత్రము సంగీతసాహిత్యనామకవిద్యాయుగళమే. సంగీతకళారహస్యనిధియే.

వసంతర్తువర్ణనములోని పద్యమిది:

" అరిగాఁ బంచమ మేవగించి నవలా లవ్వేళ హిందోళవై
ఖరి సూపం బికజాత మాత్మరవభంగవ్యాకులంబై వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్ దాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్.129ప.1ఆ.

స్త్రీలు పంచమస్వరమును శత్రువుగా అసహ్యించుకొని హిందోళరాగము పాడగా. కోకిలసమూహము తమ పంచమస్వరమునకు భంగము వాటిల్లెనని కలత చెందెనని ఒక అర్థము. అరి అను అచ్ఛికపదమునకు శత్రువని అర్థము. నఞ్+రి= అరి అను సంస్కృతపదమునకు "రి" లేనిదని మఱొక అర్థము. "రి" ఋషభస్వరము. "ప" పంచమస్వరము. స.రి.గ.మ.ప.ద.ని.సలలోని రి. ప లేని స.గ.మ.ద.ని.సలతోడి హిందోళరాగము పాడిరని పర్యవసానము. అందుకు కలత చెందిన కోకిల సమూహము పర్ణభక్షణమున తపస్సు చేయగా వసంతము కోకిలపంచమస్వరమును సంపూర్ణభావోన్నతిని గైకొనెనని ఒక అర్థము. సరి అను అచ్ఛికపదమునకు సమమని అర్థము. స+రి=సరి అను సంస్కృతపదమునకు రి తో కూడినదని మఱొక అర్థము. వసంతమునకు వసంతర్తువని ఒక అర్థము. వసంతరాగమని మఱొక అర్థము. పంచమస్వరము ప. ఋషభస్వరము రి కల వసంతరాగము సంపూర్ణభావోన్నతము 192
వసంతరాగము సంపూర్ణరాగము. శిశిరవసంతసంధిని హిందోళరాగము.

వసంతకాలమునందు వసంతరాగము పాడవలసినవి. శిశిరవసంతసంధిని హిందోళరాగము గానము చేయు స్త్రీలు వసంతరాగమును గానము చేయుట వలన వసంతాగమము సూచితము. అది సాహిత్యవిషయము. హిందోళవసంతరాగవైఖరులు సంగీతవిషయము. సంగీతసాహిత్యసమ్మేళనము పద్యము. అరి. సరి అను అతిసామాన్యశబ్దముల సంస్కృతాంధ్రభాషాభిశ్లేష సమ్మోహనకరము.

వసంతవర్ణనములోని "లలనాజనాపాంగ" అను సీసపద్యము వీణావాదనమునకు అనుగుణమైన రచనమని పూర్వోక్తము.

వీణావాదనము మనుచరిత్రమునందు కలదు. వసుచరిత్రమునందు కలదు. వ్యత్యాసము కలదు. మనుచరిత్రమునందు వీణ వాయించినది వరూథిని. అది విన్న ప్రవరునికి వీనుల విందు కాలేదు. వసుచరిత్రమునందు వీణవాయించినది గిరిక అది విన్న వసురాజునకు వీనుల విందే కాదు. అనందబ్రహ్మమైనది.

" వీనుల విందై యమృతపు
సోనల పొందై యమందసుమచలదళినీ
గానము క్రందై యా రవ
మానంద బ్రహ్మమయిన నధిపతి పల్కెన్." 14ప.2ఆ.

ఇది తాళలయాన్వితమైన పద్యము. ఆనందబ్రహ్మమయిన వసురాజు ఆనందబ్రహ్మజిజ్ఞాస కావించెను.

" నాదం బొక్కటి పిక్కటిల్లె దిశలన్ నవ్యామృతావ్యాహితా
స్వాదంబై విననయ్యెడిం బ్రియవయస్యా వింటివే షట్పదీ
నాదంబో కలకంఠనాదమో మరున్నారీమణీవల్లకీ
నాదంబో వివరింపరాదు పరమానందానుసంధానమై. 15
నానాగాయనగాయనీమణుల గానం బుర్వి నాలింపమో
నానాఁ టన్ నగభేది వీటఁ గల గంధర్వాప్సరోగీతవి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో యందైన నిందైన విం
దై నాదం బొనఁ గూర్చునే మదికి ని ట్లానందసందోహమున్." 16 ప.2ఆ.

గిరిక వీణాగానములోని నాదము అవ్యాహితము. అనగా అవిచ్ఛిన్నము. అఖండము. అంతేకాదు. అది మధురనాదము. భ్రమరనాదము. కోకిలనాదము. భూలోకములోని నానాగాయనగాయనీమణుల గానములోని నాదము. స్వర్లోకములోని

గంధర్వాప్సరోభామినీమణుల గానములోని నాదమును అఖండనాదము కాదు. వసురాజునకు సుధారినాదము కాదు. అఖండమైన సుధారినాదము శ్రావకనాదమని సంగీతసుధ అను సంగీతశాస్త్రమునందు కలదు.[193] సంగీతశాస్త్రరహస్య మీ ఆనంద బ్రహ్మజిజ్ఞాసయందు నిక్షిప్తము.

వసురాజు ఆనందబ్రహ్మజిజ్ఞాసకు నర్మసచివుని సమాధానమిది:

" అన విని కేళికాసచివుఁ డా స్వన మల్లన యాలకించి యో
జనవర వల్లకీరవము సంగతిఁ బాడెద రెవ్వరో వినూ
తనగతి నిమ్నహాద్రిపయిఁ దన్మృదుపంచమషడ్జశయ్య నో
య్యన నెలుఁగించె వింటె ప్రమదాకులకోకిలకేకిలోకముల్." 17ప.2ఆ.

ఇందు "మృదుపంచమషడ్జశయ్య" సంగీతకళారహస్యనిధానము ఆ రహస్యమిది[194]: సంగీతమునందు సప్తస్వరములు కలవు. ఏడు స్వరములకు ఇరువది రెండు శ్రుతులు కలవు. పదమూడవశతాబ్ది శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమునందు (1220)పందొమ్మిది శ్రుతులు కలవు. అందు మూడవ శ్రుతి చ్యుతషడ్జము. పదునాఱవ శ్రుతి చ్యుతపంచమము. అవి పదునేడవశతాబ్ది సోమనాథుని రాగవిబోధమునందు (1609) మృదుషడ్జమని, మృదుపంచమమని కలవు. ఈ వ్యవహారము పదునాఱ వశతాబ్ది ఉత్తరార్ధమునందే సంభవము. కాబట్టి భట్టుమూర్తి మృదుపంచమషడ్జశయ్య వట్టి మృదువైన పంచమషడ్జశయ్య కాదు. చ్యుతపంచమషడ్జశయ్య. గిరిక వీణాగానమునందలి చ్యుతపంచమషడ్జశ్రుతులకు, కోకిలలు శుద్ధపంచమస్వరమును, నెమళ్లు శుద్ధషడ్జస్వరమును ఎలిగించుట వలన చ్యుతపంచమషడ్జశయ్య శుద్ధపంచమషడ్జశయ్య అగును. ఇట్లు చ్యుతపంచమషడ్జశ్రుతులకు శుద్ధగానములోని నాదమునకు, కోకిలలు, నెమళ్లు ప్రతినాదములు చేయుచున్నవని పద్యతాత్పర్యము. పద్యము సంగీతసాహిత్యసమ్మేళనము.

గిరికను తల్లి శుక్తిమతి "వాణిఁ దాల్చు సుకవిస్తోమంబు రక్షించి తద్ఘన విద్యామహిమల్ కరామలకముల్ గావించె"ను. (32ప.3ఆ.) తండ్రి కోలాహలుడు "కిన్నర మీటు వీణం బలికింపఁగ గీతములుం బ్రబంధముల్ వన్నియఁ బాడఁ, జెప్ప, కిన్నరకోటులన్ నిలిపి గేయవిశారదఁ జేసె"ను.(33ప.3ఆ.) సాహిత్యవిద్యాప్రవీణ, సంగీతకళాప్రవీణ అయి, వీణ వాయించు గిరిక, నర్మసఖునికి చూడఁగానే "తన పాండిమము నవ్వులనె యుంచి గాంధర్వ మవనికిఁ దెచ్చిన హంసయాన" అనిపించినది. (27ప.2ఆ.) హంసయాన సరస్వతి. తన వన్నె అయిన తెల్లదనము నవ్వులందే

ఉంచి. సంగీతమును భూలోకమునకు తెచ్చిన సరస్వతి గిరిక. అట్టి గిరిక సౌందర్యము వసురాజునకు నర్మసఖుడు అభివర్ణించిన భట్టుమూర్తి పద్యము సంగీతసాహిత్యోభయసామ్రాజ్యము.

" పదమెత్తం గలహంసలీల యధరస్పందంబు సేయన్ శుభా
స్పదమౌ రాగకదంబకంబు శ్రుతి చూపన్ శ్రీవిలాసంబు కే
ల్గదలింపన్ సుకుమారపల్లవనవైలాలక్ష్మి వీక్షింప ష
ట్పదియుం బొల్పుఁ దరంబె కన్యఁ గొనియాడన్ గేయవాక్ప్రౌఢిమన్."

పదము (అడుగు) ఎత్తగానే రాజహంస నడక. అధరస్పందము సేయగానే శుభాస్పదమైన అరుణకాంతిసమూహము. చెవి చూపగానే శ్రీవర్ణలిపిస్ఫురూపము. కేలు కదలింపగానే సుకుమారమైన పల్లవములు కల లేత ఏలాలత సంపద. చూడగానే ఆడుతుమ్మెద స్ఫురించు గిరికను గేయవాక్ప్రౌఢిమచేతను కొనియాడ తరము కాదని ఒక అర్థము. ఇది సాహిత్యము.

పదము (మాతువు) ఎత్తగానే కలహంసప్రబంధము. అధరస్పందము సేయగానే మంగళాశ్రయమైన రాగకదంబకప్రబంధము. శ్రుతి సవరింపగానే శ్రీవిలాసప్రబంధము. కేలు కదలింపగానే సుకుమారపల్లవహస్తముతో గూడిన ఏలాప్రబంధము. సాభినయముగ చూడగానే షట్పదీప్రబంధము స్ఫురించు గిరిక గేయవాక్ప్రౌఢిమను కొనియాడ తరముకాదని మఱొక అర్థము.[195]

కలహంస, రాగకదంబక, శ్రీవిలాస, ఏలా, షట్పదీప్రబంధముల సరణిని ఈ పద్యమును గానము చేయుట వర్తమానశతాబ్ది ఉత్తరార్థమునందును కలదు

రాగకదంబకము రాగమాలిక. శ్రీవిలాసము శ్రీరాగము కావచ్చును గాని, కలహంసరాగము, ఏలారాగము, షట్పదీరాగము లేవు. కలహంసప్రబంధము, రాగకదంబకప్రబంధము, శ్రీవిలాసప్రబంధము, ఏలాప్రబంధము, షట్పదీప్రబంధము కలవు. అవి భట్టుమూర్తి సమకాలికుడైన రామయామాత్యుని స్వరమేళకళానిధి అను సంగీతశాస్త్రమునందు కలవు.[196]

సంగీతమన కేవలము గానము కాదు. నాట్యము కూడ. ప్రబంధములు పాడునవియే కావు. ఆడునవి కూడ. శ్రీనాథుని కాశీఖండమునందు ఇట్లు కలదు.

"వల్లకి చక్కి కాహళము వంశము డక్క హుడుక్క ఝర్ఝరుల్

ఝల్లరి యాదిగాఁ గలుగు శబ్దపరంపర తాళబద్ధమై
యుల్లసితప్రబంధముల కొప్పుగ నాడుదు రగ్రవేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ బంటమహీశులు పూజ సేయఁ గన్.56ప.1ఆ.

పయి వసుచరిత్రపద్యములోని సుకుమారపల్లవవిశేషణము. వీక్షణవిధానము నృత్యవిషయములే. నృత్యవాద్యగీతత్రయము తౌర్యత్రికము. అది పయి వసుచరిత్ర పద్యమునందు కలదు. ఇది సంగీతము.

ఇందు గిరిక "తన పాండిమము నవ్వులనె యుంచి గాంధర్వ మవనికిఁ దెచ్చిన హంసయాన"యే. అంతేకాదు భట్టుమూర్తి తన పాండిత్యమును కవిత్వముననె నించి సంగీతమును సాహిత్యమునకు తెచ్చిన పుంభావసంపూర్ణసరస్వతి.

కవులు స్త్రీల ఏడుపునందు సంగీతమును కాంచుట కలదు. దమయంతి ఏడుపు "మృదులపరివేదనాక్షరోన్మిశ్రమధురకంఠవికారకాకలిక యలర" కలదని(87ప.4ఆ. శృం.నై.). సుశీల ఏడుపు "కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చిన భంగి" కలదని (167ప.5ఆ. కా. ఖం.) శ్రీనాథుని శ్రుతిపాదనము. సత్యభామ ఏడుపు "బాలపల్లవగ్రాస కషాయకంఠకలకంఠవధూకులకాకలీధ్వనిన్" కలదని (133ప.1ఆ.పారి.) నంది తిమ్మన ప్రపంచీకరణము. వరూథిని ఏడుపు "కలస్వనంబుతో" కలదని (70ప.2ఆ.మ.చ.) పెద్దన సూచనము. మఱి "గాంధర్వ మవనికిఁ దెచ్చిన హంసయాన" అయిన గిరిక ఏడుపు సంగీతసభగానే భట్టుమూర్తి వివరణము.

" ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్." 52ప.4ఆ.

గిరిక విరహతాపము భరింపలేక చల్లని వెన్నెల వెల్లువయందు మునుగుటకు బయలు దేరినది. ఇష్టసఖులు వారించిరి. విరహతాపమును ఉపశమింపజేయునది లేక గిరిక శోకము అతిశయించినది. ఆ చల్లని వెన్నెలవెల్లువలు సమీపించుటకు లేక పోయినది. కాని ఆమె ముఖము చంద్రసదృశము. ముఖచంద్రకాంతిప్రవాహములును విరహతాపమును అతిశయింపజేయునవి. ముఖమునందు చీర చెంగు గట్టిగా కప్పినది. ఆమె ముఖము పద్మము కూడ. అసలు వెన్నెలవెల్లువ ముంచుకొని వచ్చిన ముఖ పద్మము ముడిచికొని పోవును. గిరిక మందిరములోనికి గవాక్షముల ద్వారా చంద్రికా

విహారము కలదు. (26ప.4ఆ.) అది ముఖపద్మమునకు ప్రమాదకరము. ఇంట బయట కూడ ప్రమాదమే. అందుకు గిరిక ఎలుగెత్తి ఏడ్చినది. ఆ ఏడుపు కిన్నరాంగనల అందమైన కరాంభోజములలోని కాంభోజీమేళవిపంచికల అవిచ్ఛిన్నమైన రావము వలె కలదు. వీణకు విపంచికి భేదము కలదు. వీణానాదము కంటె విపంచీరవము విచ్ఛిత్తి లేకుండ విజృంభించునది. అందును కిన్నరాంగనల విపంచీరవము మఱింత అవిచ్ఛిన్నము. గిరిక అంత ఏకధాటిగా ఏడ్చినదని ధ్వని. ఇది సాహిత్యము.

సమయము శరత్కాలము. సందర్భము విరహము. కరుణరసగర్భిత విప్రలంభశృంగారము. అందుకు కాంభోజీమేళము. కాంభోజీమేళము నుండి పుట్టినది కాంభోజీరాగమని స్వరమేళకళానిధియందు కలదు. కాంభోజీరాగము గ్రామరాగమగు కకుభరాగమునకు సంబంధించిన భాషారాగమని సంగీతరత్నాకరమునందు కలదు. కకుభరాగము శరత్కాలమునందు. కరుణరసమునందును పాడఁదగినదని సంగీతసుధయందు కలదు. కకుభరాగమునకు సంబంధించిన కాంభోజీరాగమునకు మూలమైన కాంభోజీమేళము సమయసందర్భోచితము. ఇది సంగీతము.[197]

ఇట్లు సంగీతసాహిత్యసమ్మేళనము భట్టుమూర్తి సంగీతకళారహస్యనిధిత్వము

గిరికావసురాజుల వివాహమునందు పుణ్యస్త్రీలు లక్ష్మి(నారాయణ) పరిణయ గీతములు పాడినట్లు వసుచరిత్రమునందు కలదు. వివాహములందు ముత్తైదువలు పేరఁటాండ్రు లక్ష్మీనారాయణపరిణయగీతములు పాడుట ప్రసిద్ధమే. అట్లు మనుచరిత్రమునందును కలదు. అది పూర్వోక్తము. మనుచరిత్రములోని విషయము సామాన్యము. వసుచరిత్రములోని విషయము సంగీతసాహిత్యసమ్మేళనము.

" అకుటిలసౌమ్యమాననిలయస్ఫురణంబును నాతిమాత్రతా
రకపరివర్తనంబు శుభరాగమిళత్పదపల్లవాంకము
ద్రికయును బెంపు మీఱ నిజదృష్టులఁ బోలిన సింధుకన్యకా
ప్రకటవివాహగీతికలు పాడిరి పుణ్యపురంధ్రికామణుల్." 71ప.5ఆ

పుణ్యపురంధ్రికామణులు నిజదృష్టులఁ బోలిన సింధుకన్యకాప్రకటవివాహగీతికలు పాడిరి. సింధుకన్యక లక్ష్మి. సింధుకన్యకాప్రకటవివాహగీతికలు ప్రసిద్ధలక్ష్మీనారాయణపరిణయగీతములు. చూపులకు. గీతికలకు సాదృశ్యకల్పనము. చూపులు స్వచ్ఛ. సౌమ్య. అభిమాననిలయములుగ స్ఫురణము కలవి. అతి అలతిగ కనీనికల కదలికలు కలవి. మంచి అరుణిమతో కూడిన ఆకుల వంటి పాదములందు

గుర్తుల ముద్రలు కలవి. (తలవంచుకొని స్త్రీలు పాదముల వంక చూచుకొనుచు పాడుచున్నారని తాత్పర్యము.) గీతికలు సరళ, లలిత, ప్రమాణసహిత, నిషాద, లయల స్ఫురణము కలవి. అలతి అలతిగ తారస్థాయిని సంచారము కలవి. శుభప్రదములైన రాగములతో కూడిన పదములు, పల్లవులు, అంకముద్రికలు కలవి. ఉపమేయము సంగీతము. ఉపమానము సాహిత్యము. ఉపమానోపమేయభావము సంగీత సాహిత్యసమ్మేళనము.

అల్లసాని పెద్దన వీణ వాయించు వరూథినిని వర్ణించిన "తతనితంబాభోగ "పద్యమునందు రూపసౌందర్యవిలాసము కలదు. భట్టుమూర్తి వీణ వాయించు గిరిక ను వర్ణించిన పద్యమునందు (30ప.2ఆ.)వీణావాదనవిధానము కలదు.

> " మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
> న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
> మహులై సోముఁడు భాస్కరుఁడు వెలయింపన్ సొంపు వాటించ నీ
> బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్." 10ప.1ఆ.

అని భట్టుమూర్తి రచించినది వసుచరిత్రము. నన్నయ సృష్టికర్త, తిక్కన సృష్టిధూర్వహుడు. శ్రీనాథుడు సృష్టిసంరక్షకుడు నాచన సోమన, హుళక్కిభాస్కరుడు సృష్టిప్రకాశకులు. వీరు నాలుగు యుగములకు ప్రతినిధులు అవి నన్నయయుగము, తిక్కనయుగము, ఎఱ్ఱనయుగము, శ్రీనాథయుగము, తర్వాత రాయలయుగము. అందు పింగళి సూరన కళాపూర్ణోదయము తర్వాత భట్టుమూర్తి వసుచరిత్రము. శివకవుల కృతులు వినా, నన్నయభారతము మొదలు సూరన కళాపూర్ణోదయము వఱకు గల ఆంధ్రసాహిత్యప్రాగల్భ్యము భట్టుమూర్తి భావించినది. అంతకంటె అభ్యధికమైనది, భట్టుమూర్తి ఉపజ్ఞమైనది సంగీతసాహిత్యసమ్మేళనప్రాగల్భ్యము.

ఇంత సంగీతకళారహస్యనిధి అయిన భట్టుమూర్తి అల్పిష్ఠమైన ఒక సంగీత సారస్యమునందు అయ్యలరాజు రామభద్రునికి ఓడిపోయినట్లు ఒకానొక ఐతిహ్యము కలదు.[198] అసూయాగ్రస్తుల ఆపాదనము. అది కాకునూరి అప్పకవి గ్రంథస్థము చేయుట గతానుగతికము.

## వర్ణనావైదగ్ధి

వసుచరిత్రమునందు బహువర్ణనములు కలవు. అవి : పురవర్ణనము (93-113ప.

1ఆ.) నాయకవర్ణనము (114-124ప.1ఆ.) వసంతర్తువర్ణనము (125-133ప.1ఆ.) ఉద్యాన వనవర్ణనము (134-139ప.1ఆ.) ఉద్యానవనవిహారవర్ణనము (141-158ప.1ఆ.) నాయికా వర్ణనము (32-50ప.2ఆ.) నాయకవిరహవర్ణనము (62-75ప.3ఆ; 75-86ప.4ఆ.) నాయికావి రహవర్ణనము (99-185ప.3ఆ.; 26-52ప.4ఆ.) సూర్యాస్తమయవర్ణనము (4-8ప.4ఆ.) సంధ్యావర్ణనము (9ప.4ఆ.) అంధకారవర్ణనము (10-14ప.4ఆ.) నక్షత్రవర్ణనము (15,16 ప.4ఆ.) చంద్రోదయవర్ణనము (17-22ప.4ఆ; 4ప.6ఆ.) చంద్రికావిహారవర్ణనము (18-23 ప.4ఆ.) ప్రభాతవర్ణనము (125,126ప.4ఆ.) సూర్యోదయవర్ణనము (130-137ప.4ఆ; 4,41ప.6ఆ.) వివాహవర్ణనము (22-106ప.5ఆ; 10-35, 42-64ప.6ఆ.) నాయికానాయక సమాగమాదికవర్ణనము(72-97ప.6ఆ.) ఇవి ప్రాధాన్యవివక్షను నాయికానాయకా శ్రితములు.

కవుల వర్ణనములకు కల్పన ప్రధానము. భట్టుమూర్తి వర్ణనలకు కల్పన తోపాటు సంగీతము, శ్లేష కూడ ప్రధానము. వసంతర్తువర్ణనములోని పూర్వోదాహృతమైన "అరిగాఁ బంచమ మేవగించి' అను పద్యమునందు కల్పన, సంగీతము, శ్లేష మూడును కలవు. నాయికావర్ణనము ప్రత్యంగవర్ణనము అందు నాసికావర్ణనము అత్యంతప్రసిద్ధము.

" నానాసూనవితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాఁకం దపంబంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్." 46ప.2ఆ.

సమస్తపుష్పసమూహముల సువాసనలను ఆనందించు తుమ్మెద సంపెగపువ్వు సువాసన ఆనందింపలేదు. అందుకు సంపెగ మహాకోపముతో -మహాతాపముతో- తపస్సు చేసి గిరిక నాసిక అయినది. నాసిక అగుట వలన స్వపరిమళ ము నకు మాత్రమేగాక, సర్వపుష్పముల సౌరభ్యములకు నిలయమైనది. నాసిక సంపెగ పరిమళమును ఆనందించును. అంతేకాదు. చూపుల చాలు అనెడు తుమ్మెదల బారును ఇరువంకల వహించెను. నాసిక ఇరువంకల కన్నులుండును. కంటి చూపులు నాసిక ఇరువంకల ప్రసరించును. అవి తుమ్మెదల బారులు. తన సువాసనలను ఆనందించలేని తుమ్మెదలను సంపెగ నాసిక అయి, ఆనందించునట్లు చేసికొనెను. అంతేకాదు, ఇరువంకల తుమ్మెద బారులు అంగరక్షకులు. నాసికను సంపెగతో పోల్చుట, సంపెగ వాసన తుమ్మెద భరింపలేదనుట, కంటి చూపులు తుమ్మెద బారు

లనుట కవిసమయములు. అవి నిమిత్తములుగ సంపెగ తపస్సు చేయుట. నాసిక అగుట. ఇరువంకలను తుమ్మెదల బాఱులను తీర్చుట కల్పన. "బల్కాఁకందపం బంది" అనుచో శ్లేష కలదు. బల్కాఁక మహాకోపము. మహాతాపమును. తపము తపస్సు. గ్రీష్మము. సంపెగలు గ్రీష్మమునందు వికసించును. సంపెగ నాసిక అగుట వలన స్వపరిమళమునకు మాత్రమేగాక సకలపుష్పసుగంధములకు సంవాసస్థానమైనది. అదియెల్ల తపఃఫలము. ఇదియెల్ల చమత్కారావహము.

ఒక పుష్పము తపస్సు చేసి నాయిక అవయవమగుట శ్రీహర్షుని నైషధీయచరితమునందు కలదు.[199]

" శ్రితపుణ్యసరస్సరిత్కథం న సమాధిక్షపితాఖిలక్షపం
జలజం గతి మేతు మంజులాం దమయంతీపదనామ్ని జన్మని" 40శ్లో2స.

ఇది శ్రీనాథుడు తెనుగు సేయలేదు. ఇందు పద్మము తపస్సు చేసి దమయంతి పాదమైనట్లు కలదు. ఇది నిమిత్తముగ అగస్త్యుని నలకీర్తికౌముదియందు ఇట్లు కలదు.[200]

" భృంగా నవాప్తిప్రతిపన్నఖేదా కృత్వా వనే గంధఫలీ తపో౽లమ్.
తన్నాసికా౽భూ దనుభూతగంధా స్వపార్శ్వనేత్రీకృతభృంగసేవ్యా"

ఇందు తుమ్మెద తన గంధమును అనుభవించుట లేదని. గంధఫలి వనమునందు తపస్సు చేసి. దమయంతి నాసిక అయి. తన పార్శ్వములందు నేత్రములుగా చేసికొన్న తుమ్మెదలచేత సేవింపబడినదయి. గంధము అనుభవింపబడినదయినదని కలదు. అగస్త్యుని శ్లోకము పుండరీకముకుళము. భట్టుమూర్తి పద్యము సంఫుల్ల సరసీరుహము.

"నానాసూనవితానవాసనల" అను పద్యమును నంది తిమ్మన రచించెనని. అది భట్టుమూర్తి క్రయము చేసెనని జనశ్రుతి కలదు. అది కూడ. అసూయాగ్రస్తుల అపాదనమే. భట్టుమూర్తి పద్యము అగస్త్యుని శ్లోకమునకు స్వతంత్రాంధ్రీకరణము.

నాయికా విరహవర్ణనమునందు రసము తోపాటు రసవాదము కలదు

" ప్రసవశరాఖ్యయోగి బహుధంగుల భావన లిచ్చి మర్దనం
బెసఁగఁగ ధాతు వేర్చి బలియించి రసంబు నిశాంతమంతయు
న్వసువుగఁ జేయ మైమఱచి నాతి గలన్మణిభూష లెన్న దా

ప్తసఖులు చేరి పల్కినను బల్కడు చూచియుఁ జూడదెంతయున్." 106ప.3ఆ.

ప్రసవశరాఖ్యయోగి అనగా మన్మథుడనెడి యోగి. పద్యమునందు మన్మథపర ముగ శృంగారరసము. యోగిపరముగ రసవాదము కలదు.

మన్మథుడు పెక్కువిధములుగ శృంగారభావనలు కలిగించి, విరహపీడనము వృద్ధి చేసి, దశవిధావస్థలలోని మూర్ఛావస్థను సమకూర్చి, శృంగారరసమును అతి శయింపజేసి, ఇల్లంతయు వసురాజమయము చేయగా, గిరిక ఒడలు తెలియక, జాఱి పోవుచున్న రత్నాభరణములు పట్టించుకొనదు. ఆప్తసఖులు పల్కరించినను పల్కదు. చూచి కూడ చూడదు. ఇందు భావనలు, పీడనలు, దశవిధావస్థలు, స్థాయిభావము రసవిషయము. అంతేకాదు. మైమఱచుట, జాఱిపోవుచున్న రత్నాభరణములను పట్టిం చుకొనకపోవుట, ఆప్తసఖులు పల్కరించినను పల్కకపోవుట, చూచి కూడ చూడక పోవుట విప్రలంభశృంగారరసతన్మయమే.

యోగి -నాథయోగి- పెక్కు విధముల పసరులచేత భావనలు చేసి, కల్కములందు నూఱి, అభ్రకాదిధాతువులను చేర్చి, పాదరసమును దట్టించి ఇల్లంతయు బంగా రుమయము చేయగా, స్త్రీకి మదముచేత ఒడలు తెలియదు. నిర్లక్ష్యముగ జాఱి పోవుచున్న రత్నాభరణములు పట్టించుకొనదు. గర్వముతో ఆప్తసఖులు పల్కరించి నను మాఱు పల్కి ఆదరింపదు. పొగరెక్కి చూచి కూడ చూడదు. అని రసవాదవిష యము.

ఇది ప్రకృతాప్రకృతశ్లేష. ప్రకృతార్థము ఉపమేయముగ, అప్రకృతార్థము ఉపమానముగ ఉపమానోపమేయభావము సమన్వయము.

" హరిదంభోరుహలోచనల్ గగనరంగాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్." 17ప.4ఆ.

ఇది చంద్రోదయవర్ణనము. ఇందు ఆనాటి నాట్యప్రదర్శనవిధానము కలదు. చంద్రుడు ఉదయించునపుడు మొదట నెలవంకగ, తర్వాత అర్ధేందుబింబముగ, ఆమీద పూర్ణేందుబింబముగ కనిపించును.ఆనాటి నాట్యప్రదర్శనవిధానమునందు రంగస్థలము మీద స్త్రీలు నల్లతెర పట్టుకొనెడువారు. నల్లతెర వెనుక నర్తకి నిలిచియుం డెడిది. నాట్యము ప్రారంభమగునెడ స్త్రీలు పట్టుకొన్న తెరను మెల్లమెల్లగ క్రిందికి దిం

చెడివారు. అప్పుడు మొదట నర్తకి శిరసు మీది ముత్యాలపట్టము. తర్వాత నర్తకి లలాటము. ఆమీద నర్తకి ముఖము సామాజికులకు క్రమముగ కనిపించెడివి. ఆకాశ మనెడు రంగస్థలము మీద. దిక్కు లనెడు స్త్రీలు పట్టుకొన్న చీకటి అనెడు తెరను మెల్లమెల్లగ క్రిందికి దించునపుడు. మొదట రాత్రి అనెడు నర్తకి శిరసు మీది ముత్యాల పట్టము అనునట్లు నెలవంక అయి. తర్వాత రాత్రి అనెడు నర్తకి లలాటము అను నట్లు అర్ధబింబమయి. ఆమీద రాత్రి అనెడు నర్తకి ముఖము అనునట్లు పూర్ణబింబ మయి చంద్రుడు తూర్పుదిశను తోచెనని భట్టుమూర్తి కల్పన. సంభావనమైనను సహ జసుందరము.

వివాహవర్ణనములోని పూర్వోదాహృతమైన "అకుటిలసౌమ్యమున" అను పద్యమునందు సంగీతము. శ్లేష కలదు.

సంభోగవర్ణనమునందు సాహిత్యతత్త్వము. అద్వైతతత్త్వము కలదు.

"సతి సాహిత్యరహస్య మీశువలనన్ సాధించి తోడ్తోన త
త్పతికిం బ్రత్యుపదేశమిచ్చె నతులప్రౌఢిన్ ధ్వనివ్యక్తిఁ ద
చ్ఛ్రుతికిం జొన్పుచు లోచనాంజనరసప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచుఁ బ్రత్యలంకరణమౌఖర్యంబు దీపింపఁ గన్." 94ప.6ఆ.

పార్వతి సాహిత్యవిద్యామర్మమును పరమేశ్వరుని వలన తెలిసికొని. వెన్వెంటనే- ప్రత్యలంకారధ్వని ప్రకాశించునట్లు. ధ్వన్యర్థగాంభీర్యము శ్రుతిహితమగునట్లు. వ్యంజనావ్యాపారముయొక్క శృంగారాదిరసాతిశయములు కంఠస్థమగునట్లు పరమేశ్వరునికి తిరిగి ఉపదేశించెనని అర్థాంతరము. ఇది ధ్వనిసిద్ధాంతము. సాహిత్యతత్త్వము.

" భూనాథాగ్రణికిన్ వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పె ననవద్యంబై యవేద్యాంతరం
బై నిర్లేపకలాపమై క్రమవిముక్తానేకబంధానుసం
ధానంబై యపునర్భవప్రభవభేదంబై విజృంభించుచున్.95ప.6ఆ.

బ్రహ్మానందము కొదువ లేనిది. తెలిసికొనదగిన మఱొకటి లేనిది. సంసర్గము లేనిది. క్రమముగ తొలగుట వలన అనేకకర్మబంధముల అనుసంధానము లేనిది. పునర్భవము వలన పుట్టు భేదము లేనిది. అని అర్థాంతరము. ఇది వేదాంతసిద్ధాంతము. అద్వైతతత్త్వము.

ఇట్లు భట్టుమూర్తి వర్ణనావైదగ్ధి బహుముఖీనము.

# హరిశ్చంద్రనలోపాఖ్యానము

హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్యము. ఉపలబ్ధములైన ద్వ్యర్థికావ్యములందు రెండవది. మొదటిది పింగళి సూరన రాఘవపాండవీయము. అది రామ భారతకథల జోడింపు. ఇది హరిశ్చంద్రనలోపాఖ్యానముల జోడింపు.

బృహదశ్వుడు ధర్మరాజునకు నలోపాఖ్యానము చెప్పినట్లు సంస్కృతాంధ్రభారతములందు కలదు. నలోపాఖ్యానము తర్వాత హరిశ్చంద్రోపాఖ్యానమును చెప్పినట్లు సంస్కృతభారతప్రత్యంతరములందు కలదు. రెండు ఉపాఖ్యానములను ద్వైతవనమునందు మార్కండేయుడు ధర్మరాజునకు చెప్పినట్లు భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు కలదు. భట్టుమూర్తికి శతాబ్దిపూర్వుడైన గౌరన హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు హరిశ్చంద్రుని కథ మార్కండేయుడు ద్వైతవనమునందు ధర్మరాజునకు చెప్పినట్లు కలదు. మార్కండేయపురాణము గాక మహాభారతప్రత్యంతరము గౌరనకు మూలమగును. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములోని హరిశ్చంద్రుని కథ భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానములోని హరిశ్చంద్రుని కథ సర్వసమానము. నలోపాఖ్యానమునకు నన్నయ భారతము, హరిశ్చంద్రోపాఖ్యానమునకు గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము భట్టుమూర్తికి సంస్కృతమూలముల తోపాటు తెలుగు మూలములు కావచ్చును.

మహాభారతప్రత్యంతరములందు నలోపాఖ్యానము తర్వాతనే హరిశ్చంద్రోపాఖ్యానము సంగ్రహముగాను, సవిస్తరముగాను కలదు. అంతేకాదు. "అల్పాచ్తరం పూర్వమ్" అని వ్యాకరణసూత్రము కలదు. ద్వంద్వసమాసమునందు తక్కువ అచ్చులు కల శబ్దము ముందుండవలయునని అర్థము- కనుక గ్రంథనామము నలహరిశ్చంద్రోపాఖ్యానము కావలయును. కాని "అభ్యర్హితం చ పూర్వమ్" అని కూడ వ్యాకరణసూత్రము కలదు. ద్వంద్వసమాసమునందు మిక్కిలి అర్హత నందిన శబ్దము ముందుండవలయునని అర్థము. సత్యవ్రతమును బట్టి హరిశ్చంద్రశబ్దము మిక్కిలి అర్హతనందినది. అంతేకాదు నలుని కంటె హరిశ్చంద్రుడు పూర్వుడు.

> " హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవాః
> సగరకార్తవీర్యశ్చ షడైతే చక్రవర్తినః "

అని షట్చక్రవర్తుల క్రమపరిగణనము. కనుక గ్రంథనామము హరిశ్చంద్రన

లోపాఖ్యానమే కావలయును.

కథాగ్రహణము ద్వ్యర్థికావ్యములందు కష్టము. క్లిష్టము. అందుకు పింగళి సూరన ఒక కథను గ్రహించునపుడు రెండవ కథ మీద దృష్టి పెట్టవలదనెను. ఆ పద్యము పూర్వోదాహృతము. రెండు కథలును ఒక్కసారే గ్రహింపవలయునని భట్టుమూర్తి నిర్దేశము.

" వారి చరిత్రము ల్భువనవర్ణ్యము లైనవి వేఱ పేర్కొన
న్నారె జపార్చనాసమయసంగతి తప్పెడుఁ గాన నిప్పుడో
భూరివివేక! యా నృపుల పుణ్యకథ ల్పదశక్తి నొండుగాఁ
గూరిచి తెల్పెద న్దెలిసికొమ్మని నేర్పు దలిర్ప నిట్లనున్." 5ప.1ఆ.

ఇందు ధర్మరాజునకు "భూరివివేక!" అను సంబుద్ధి కలదు. ధర్మరాజు శ్రోత. ఎంత భూరివివేకులైన శ్రోతలకైన. పాఠకులకైన రెండు కథలును ఒక్కసారే ఏకకాలము నందు- గ్రహించుట సాధ్యము కాదు. రెండు కథల అర్థములను సావకాశముగ గ్రహించుట మాత్రమే సాధ్యము. ద్వ్యర్థికావ్యప్రయోజనము కథాగ్రహణము కాదు. కథాద్వయార్థగ్రహణము. అది కూడ శ్రోతలకు కాదు. పాఠకులకు మాత్రమే.

కథాద్వయార్థసంఘటనప్రణాళిక పింగళి సూరన రాఘవపాండవీయమునందు ప్రకటించిన ప్రణాళికయే. ఆ ప్రణాళికలోని ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష. శబ్దశ్లేష. అర్థశ్లేష. గౌణవృత్తిశ్లేష. అర్థాన్వయశ్లేష. శబ్దాన్వయభేదశ్లేష మొదలైనవి హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును కలవు.

రాఘవపాండవీయమునందు వలె హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు రెండు కథల జోడింపు మాత్రమేగాక. నలోపాఖ్యానమునకు సంబంధించి. శ్రీహర్షుని నైషధీయచరితమునందు వలె సూత్రప్రాయముగ పంచనైషధఘట్టము కలదు. హర్షనైషధములోని పంచనైషధ ఘట్టమునందు అయిదుగురే కలరు. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు ఆరుగురు కలరు. ఇంద్రాగ్నియమవరుణనలమహారాజుల తోపాటు హరిశ్చంద్రమహారాజు కలడు.

" ఎన్న నేరికిఁ దరంబే గురుసంగర
విజయైకనిధులయి వెలయు నీన
లవసుమతీశ్వరులయరీణగుణము లను
లనుచు సారెకుఁ బదీయంబులైన

నానావిపక్షఖండనధుర్యచాతుర్య
ములు మరున్మిత్రతాస్ఫురణములు మ
హార్యమతనయభావానుభావంబులు
భువనసంభరణవైభవములును బ్ర
కామఘనసత్కరణధామతామహత్త్వ
విలసనంబులు నొక్కటఁ దెలియఁ బలికెఁ
గౌశికానుగగీర్వాణగణము మదికి
సంభ్రమసమాకులత్వంబు సంభవింప." 111ప.2ఆ.

"గురుసంగరవిజయైకనిధులయి వెలయు నలవసుమతీశ్వరు లయరీణ గుణమణులు ఎన్న నేరికిఁ దరంబే? " అను పదచ్ఛేదమున. క్రమాన్వయమున -గురువైన వసిష్ఠుని ప్రతిజ్ఞ నెగ్గుటకు ఏకనిధులయి ఒప్పు. ఈ నల = తృణప్రాయమైన వసుమతికి (రాజ్యము తృణప్రాయమైన) ప్రభువు యొక్క నాశరహితమైన (లయ = నాశము. రీణ = జాఱిన) సద్గుణములు కొనియాడుట ఎవ్వరికిని తరమే? అని హరిశ్చంద్ర పరము. "ఎన్న నేరికిఁ దరంబు ఏగురు సంగరవిజయైకనిధులయి వెలయు ఈ నలవసుమతీశ్వరుల అరీణగుణమణులు అను పదచ్ఛేదమున అయిదుగురు స్వయంవరమునందు నెగ్గుటకు ఏకనిధులయి. ఒప్పు ఈ నలమహారాజుల అనశ్వరసద్గుణములు కొనియాడుట ఎవ్వరికి తరము? అని ఇంద్రాగ్నియమవరుణనల పరము. వారి గుణములు:

"నానా + విపక్షఖండనధుర్యచాతుర్యములు" అను పదచ్ఛేదమున సమస్తశత్రుఖండనసమర్థచాతుర్యములని హరిశ్చంద్రపరము. నలపరము."నానా + అవి + పక్షఖండనధుర్యచాతుర్యములు" అను పదచ్ఛేదమున సమస్తపర్వతముల ఱెక్కలను ఖండించుటయందు సమర్థమైన చాతుర్యములని ఇంద్రపరము.

"మరున్మిత్రతాస్ఫురణములు" దేవతామైత్రిస్ఫురణములని హరిశ్చంద్రపరము. నలపరము. పవనమైత్రిస్ఫురణములని అగ్నిపరము.

"మహత్ + ఆర్య + మత + నయభావ + అనుభావములు అను పదచ్ఛేదమున శ్రేష్ఠులైన పెద్దలకు సమ్మతమైన నీతిభావముయొక్క అతిశయములని హరిశ్చంద్రపరము. నలపరము. మహా + ఆర్యమ + తనయ + భావ + అనుభావములు అను పదచ్ఛేదమున గొప్పవాడైన సూర్యుని తనయుడను భావముయొక్క ప్రభావములని యమపరము.

"భువనసంభరణవైభవములు" లోకసంభరణవైభవములని హరిశ్చంద్రపరము. నలపరము. ఉదకసంభరణవైభవములని వరుణపరము.

"ప్ర + కామ + ఘన + సత్కరణ ధామత" అను పదచ్ఛేదమున ప్రకృష్టమైన కోరికల అధికమైన సత్కారములకు నిలయమగుట అని హరిశ్చంద్ర పరము."ప్ర + కామ + ఘన + సత్ + కరణ + ధామత" అను పదచ్ఛేదమున ప్రకృష్టమైన మన్మథునియొక్క అధికమైన మంచి దేహకాంతి కలుగుట అని నలపరము. "ప్రకామఘన + సత్కరణ ధామత" అను పదచ్ఛేదమున మిక్కిలి అమితములైన మంచి ఇంద్రియములయొక్క నిలయమగుట అని ఇంద్రపరము. అదే పదచ్ఛేదమున మిక్కిలి గొప్పవైన యజ్ఞాదిసత్కార్యములకు ఆధారమగుట అని అగ్నిపరము "ప్రకామ + ఘన + సత్ + కరణ + ధామత" అను పదచ్ఛేదమున మిక్కిలి మేఘము వలె మంచి శరీరకాంతి కలుగుట అని యమపరము."ప్రకామ + ఘన + సత్కరణ ధామత" అను పదచ్ఛేదమున మిక్కిలి మేఘముయొక్క సత్కారము కల గృహము కలుగుట అని వరుణపరము.

"కౌశికానుగగీర్వాణగణము" విశ్వామిత్రునకు సహచరులైన మునుల సమూహ మని హరిశ్చంద్రపరము. ఇంద్రునికి సహచరులైన దేవతల సమూహమని నలపరము. ఇంద్రాగ్నియమవరుణులకు సంతోషము కలుగునట్లు సరస్వతి పలికెనని తాత్పర్యము. అది నలునికి అంత సంతోషకరము కాదు. కనుక నలప్రసక్తి లేదు.

ఇట్లు పంచనైషధిసూత్రమును పట్టుకొన్న భట్టుమూర్తి శ్లేషచక్రవర్తి.

ఎంత శ్లేషచక్రవర్తి అయినను భట్టుమూర్తి సంగీతకళారహస్యనిధి. అది కూడ హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు ప్రకాశించినది.

" పొలుపొంద నలగుణంబులపై శ్రుతు ల్గూర్చి
సారెం దన్మేళ ప్రకార మరసి
యుచితరాగవ్యాప్తి నొనరించి యుజ్జ్వల
స్థాయిసంచారిసాంద్రత భజించి
శీతలాలంకారజాతము ల్సవరించి
నిరుపమస్వరకంపగరిమ నెఱసి
ప్రకటితపంచమవికృతకాకల్యంత
రములచే నలఘుమూర్ఛనలు పూని

క్రమమునఁ దదంకరూపకగ్రహవిచిత్ర
విరచనంబుల మెచ్చులు విస్తరించి
వాఙ్మనోదూరగతిఁ గాంచు వల్లకీని
నాదదశలెల్ల వినిపించి రాదరమున." 68ప.2ఆ.

తంత్రుల మీద శ్రుతులు కూర్చి. శ్రుతుల మేళప్రకారము చూచి. సముచితముగ రాగములు ప్రస్తరించి. స్థాయితానము సంచారితానము సంఘటించి ధ్రువాద్యలంకారములు సవరించి. పంచమస్వరము ప్రకటించి. నిషాదాదిస్వరములచేత షడ్జాదిగ్రామమూర్ఛనలు పూని. తాళగ్రహములతోడి మార్గరీతుల బిరుదప్రబంధములు విస్తరించి. వీణానినాదము వివిధభేదములు వినిపించిరని హరిశ్చంద్రపరమైన అర్థము. ఇది వీణావాదనవిధానము. గాత్రవాద్యసంగీతము.

హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు వర్ణనాతిశయమును కలదు. ఆ వర్ణనములివి: పురవర్ణనము (6-13ప.1ఆ; 43ప.2ఆ.; 6,7ప.3ఆ; 35ప.4ఆ.) నాయకవర్ణనము (15-23ప.1ఆ.) వసంతర్తువర్ణనము (32ప.1ఆ; 3-9ప.2ఆ.) వనవిహారవర్ణనము(17-29ప.3ఆ.) ఆశ్రమవర్ణనము (30ప.1ఆ.) స్త్రీవర్ణనము (7ప.2ఆ.) అరణ్యవర్ణనము (20ప.3ఆ; 32వచ.3ఆ: 44ప.3ఆ; 18ప.5ఆ.) ఎండకు వాడిన స్త్రీవర్ణనము (34-37ప.3ఆ.) సూర్యాస్తమయవర్ణనము (41ప.3ఆ; 3-5ప.4ఆ.) వాన వర్ణనము (46ప.3ఆ.) వానకు తడిసిన స్త్రీవర్ణనము (48ప.3ఆ.) సాయంకాలవర్ణనము (6-9ప.4ఆ.) అంధకారవర్ణనము (10-13ప.4ఆ.) చంద్రోదయవర్ణనము (14-17ప.4ఆ.) చంద్రికావర్ణనము (18-21ప.4ఆ.) రాత్రివర్ణనము (22,23ప.4ఆ.) చంద్రాస్తమయవర్ణనము (24-ప.4ఆ.) ప్రభాతవర్ణనము (25,26ప.4ఆ.) సూర్యోదయవర్ణనము (27 = 33ప.4ఆ.) శిఖనఖపర్యంత స్త్రీవర్ణనము (43-54ప.4ఆ.).

హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు సమకాలికసమాచారమును కలదు. వసుచరిత్రమునందు కృతిభర్త తిరుమలదేవరాయల గురించి ఇట్లు కలదు.

" జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నె
వ్వాని లోకేశ్వరత్వము పొసంగుఁ
జటులశార్వరమగ్నసర్వవర్ణోద్ధార
పటిమ నెవ్వని రాజభావ మెసఁగు
నతఁడు ............... తిరుమలరాయశౌరి." 13ప.1ఆ.

జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి అన తాళికోట లేక రక్కసి తంగడి యుద్ధమునందు విధ్వంసమైన విజయనగరసామ్రాజ్యపునర్నిర్మాణము. చటులశార్వరమగ్నసర్వ వర్ణోద్ధారమన క్రూరులైన ఘాతుకులయందు మునిగిపోయిన సర్వవర్ణముల సముద్ధరణము. సర్వవర్ణములు బ్రాహ్మణమతమునకు సంబంధించినవి. సర్వవర్ణసముద్ధరణము బ్రాహ్మణమతసముద్ధరణము. ఇది చారిత్రికసత్యము. అది హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు ప్రతిఫలించినది.

" పూని మహావనీవలయపోషణభార మపారవిక్రమ
శ్రీనిధి మాధవుం డవతరించిన నేయెడ జాతిసంకరం
బూనక పూర్ణకామమయి యొప్పె జగంబు సదాసవానుసం
ధానపరాయణద్విజగణంబుల కబ్బె నభీప్సితార్థముల్." 4ప.2ఆ.

మహాభూవలయమును పోషించు భారము వహించి. అపారమైన పరాక్రమసంపదకు నిధియైన వసంతుడు అవతరించిన. ఎక్కడను జాజిపువ్వుల సాంకర్యము లేకుండ. పరిపూర్ణుడైన మన్మథుడు కలదై జగత్తు విరాజిల్లెను. సదా+ఆసవ+అనుసంధాన=నిత్యము మకరందపానమునందు పరాయణమైన తుమ్మెద కదుపులకు కోరిన మకరందము లభించెనని ప్రకృతార్థము. ఇది వసంతర్తువర్ణనము. సువిశాలమైన భూవలయమును పోషించు భారము వహించి. అపారమైన పరాక్రమసంపదకు నిధి అయిన తిరుమలదేవరాయలు అవతరించిన. ఎక్కడను జాతుల సాంకర్యము లేకుండ. పరిపూర్ణమైన కోరికలు కలదై విజయనగరసామ్రాజ్యము విలసిల్లెను. సదా+సవ+అనుసంధాన= నిత్యము యజ్ఞసమాచారములందు పరాయణమైన బ్రాహ్మణసంఘములకు కోరిన ప్రయోజనములు సిద్ధించెనని అప్రకృతార్థము. విజయనగర సామ్రాజ్యమును పునర్నిర్మాణము కావించి. తిరుమల దేవరాయలు జాతిసాంకర్యము లేకుండ యజ్ఞయాగాదిక్రతువులు చేయించి బ్రాహ్మణమతపునరుద్ధరణము చేసెనని సమకాలికసమాచారము.

" అపు డాశాంతనిశాంతసామజసమాజాధారదోస్సారుఁడై
విపులావల్లభుఁ డాత్మవంశనగరీవిఖ్యాతసామ్రాజ్యభ
ద్రపదశ్రీ నిరవొంది యాప్తజనచేతశ్చాతకప్రీతిదా
నపయోదానఘమూర్తియై వెలసె భూనాథాగ్రణుల్గొల్వఁగన్. 69
అతనుపావకదీపితాభితాపము డిందె
నక్షామహర్షసామగ్రిఁ జెందె

వనచూళిదురాప(?)వప్రకంపము జాఱె
నిష్టలీలాస్ఫూర్తి లింపు మీఱె
ఖరరాజకరజాతకాతరత్వ మడంగె
గరిమఁ జెలంగి యంగములు పొంగె
మదమత్తపరభృతస్మయచయంబు శమించె
నాకల్పసద్వీథు లతిశయించె
నమరనుతవైభవుని వివేకాబ్జభవుని
ధవునిఁ దేజోరవిందబాంధవునిఁ బాసి
యెట్టకేలకుఁ గ్రమ్మఱ నెనసి వసుమ
తీమహారాజ్యలక్ష్మి సుస్థిరత నిలువ." 70ప.5ఆ.

ఇందు విజయనగరవిఖ్యాతసామ్రాజ్యభద్రశ్రీ ఇమిడియున్నది. అది మఱల సుస్థిరమయి గృహదహనములు లేక. క్షామము తొలగి. వప్రకంపము వదలి. స్వేచ్ఛ కలిగి. క్రూరరాజకృతభయానకస్థితి పోయి. చతురంగబలములు ప్రబలి. మదమత్త పరాధీనుల గర్వము లణగి. రత్నాలు రాశులు పోసిన విజయనగరవీథులు ప్రకాశ మానము లని ప్రతీయమానము.

## శైలి

కావ్యాలంకారసంగ్రహమునందు కృతిభర్త నరసభూపాలుడు కృతికర్త భట్టుమూర్తిని సంభావించిన పద్యమునందు శైలీవిషయము కలదు. ఆ పద్యమిది:

"బాణు వేగంబును. భవభూతి సుకుమార
తయు. మాఘు శైత్యంబు. దండి సమత
యల మయూరు సువర్ణకలన. చోరుని యర్థ
సంగ్రహమ్ము. మురారి శయ్య నేర్పు
సోము ప్రసాదంబు సోమయాజుల నియ
మంబు. భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్రముఖదృష్టి
నీక కల దటుగాన ననేకవదన
సదనసంచారఖేదంబు సడలు పఱిచి
భారతీదేవి నీ జిహ్వఁ బాదుకొనియె

మూర్తికవిచంద్ర! విఖ్యాతకీర్తిసాంద్ర!" 15ప.1ఆ.

ఇందు బాణుని వేగము, భవభూతి సౌకుమార్యము, మాఘుని శైత్యము, దండి సమత, మయూరుని సువర్ణకలన, మురారి శయ్యానేర్పు సంస్కృతకవుల శైలీవిశేషములు. అవియెల్ల శ్రీనాథుని పదప్రసిద్ధధారాశుద్ధియందు కలవు. భట్టుమూర్తి శైలి కూడ పదప్రసిద్ధధారాశుద్ధియే. కాని శ్రీనాథుని ధారాశుద్ధి పొంగి పొరలు నిరాఘాటస్ఫురణనిర్ఝరిణి. భట్టుమూర్తి ధారాశుద్ధి సుడులు తిరుగు సంగీతభంగీరసతరంగిణి.

" నాళీకాకరతీరసారకదళీనారంగపూగావళీ
పాళీవాసితమైన కోనఁ గని యా బల్కోనలో గానలో
లాళీ ప్రేరకరత్నకోరకమయూఖాళీసమాలీఢమౌ
కేళీధామముఁ గంటి భూరమణ యా కేళీనివాసంబునన్." 29ప.2ఆ.వ.చ

ఇందు వేగము, సౌకుమార్యము, శయ్యానైపుణి మాత్రమేగాక, దీర్ఘాక్షరాంతమైన విఱుపులు కలవు. అవి తాళలయానుగుణములు.

"శతపత్రేక్షణ వెంట నంటిన వసుక్ష్మాపాలకాలోకముం
బ్రతిరోధింపఁగఁ జాలదయ్యె భవనప్రాంతోరుకాంతారవే
ల్లితవల్లీవలయంబు తచ్చికురపాళీనీరదాళీమిళ
న్నృతికేళీరతకేకిలోకగరుదున్మీలన్మరుల్లోలమై." 75ప.3ఆ.వ.చ.

ఇందును విఱుపులు కలవు. ఇవి కూడ తాళలయానుగుణములే. పూర్వోదాహృతమైన"లలనాజనాపాంగ", "అతన్వంగి", "పీనులవిందై", "నానాగాయన" 'ఆ జాబిల్లి' మొదలైన పద్యములును సంగీతభంగీరసతరంగములే.

ద్వ్యర్థికావ్యమైన హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును ధారాశుద్ధి ధారాళము.

" మంగళదేవతాప్రభవమందిరముంచుఁ దలంచి యంబకా
సంగతిఁ గూర్పఁడయ్యె వరుస న్వనకుంభినిసీధువాసనా
రంగము సారెసారె నల రాజశిఖామణి తత్పరిగ్రహో
ద్భంగసముద్భటాళిరవభంగులకున్ మది సంభ్రమించుచున్." 26ప.2ఆ.హ.న.

"వారిచెంతట రాజశేఖరుఁడు విశ్వక్ష్మాభృతిస్ఫారకే
యూరబ్రాజితబాహుఁడున్న నెల వన్యూనస్థిరామోదధా

మారామద్రుమమంజరీమధురుఝరీప్రౌఢోర్మికాశీతలం
బా రమ్యస్థలరాజ మొందెదము నిర్వ్యాజప్రయాణంబునన్." 62ప.3ఆ.హ.న.

ఇందు శ్లేష ఇమిడియున్నను ధార కుంటు వడలేదు. పూర్వోదాహృతమైన "ఒక చోట మఖవాట-" అను పద్యమును ధారాశుద్ధికి ఉదాహరణమే. ఇందలి "మందా రద్రుమ మంజరీమధురుఝరీ" సమాసము శ్రీనాథవిలాసమే. (92ప.5ఆ.శృం.నై.)

భట్టుమూర్తి శైలి కేవలము సంస్కృతప్రౌఢి పరిఢవిల్లునది కాదు. తేటతెనుగు తేజరిల్లునది కూడ.

" చెన్నగు నన్నదీపులినసీమల దాఁగిలిమూఁత లాడుచున్
వెన్నెల రేలఁ గప్పురపు విప్పుటనంటుల నీడ నీఁగు రా
కన్నెల రోయు నన్నులకుఁ గన్నులు మూయుఁ దదీయవాసనల్
మన్ననఁ గాంచి కప్రపుదుమారము రేఁచు సమీరడింభముల్."

ఇందు"పులినసీమల. తదీయవాసనల్. సమీరడింభముల్" అను మూఁడు పద బంధములు వినా కడమ పదములెల్ల తేటతెనుగు మాటలే. మాటలే కాదు దాఁగుడు మూతలు అను తెలుగు ఆటలును కలవు.

" కన్నె మరునకుఁ బూఁదూపు లెన్ని లేవు
కన్నె గేదంగిఏరి కెనగావు గాక
సూనబాణాభియాతికి దీని గాలి
సోఁకినను గాదు తలయేఱు సోఁకు నెపుడు." 145ప.3ఆ.వ.చ.

ఇందు "సూనబాణాభియాతి" అను స్వల్పసమాసము వినా సంస్కృతశబ్దము లేదు.

" మొలక మెఱుంగుఁ గెంపుమొనముక్కుల నిక్కు కిరీటి పచ్చఱా
చిలుకల కోళ్లతోఁ జికిలి చెంద్రికపన్నియ పట్టు పట్టెతోఁ
దొలఁకు పసిండి వ్రాఁత తెరతో నెఱతావుల మేలు కట్టుతోఁ
జలువలు చిందు ముత్తియపుఁ జప్పరమంచము పై మహోన్నతిన్."

ఇందు "కిరీటి" అను సంస్కృతశబ్దము. "మహోన్నతిన్" అను సంస్కృత పదబంధము వినా కడమ మాటలెల్ల తేటతెనుగు మాటలే. అంతేకాదు 'మొలకమె ఱుంగుఁ గెంపుమొనముక్కులు' "చిలికిచెంద్రికపన్నియపట్టుపట్టె" పొడుగు. సమాస

ములు. అల్లసాని పెద్దన "కటికచీఁకటితిండికరములగిలిగింత" అను సమాసము వలె అచ్చికదీర్ఘసమాసములు.

" చిగురు మెఱుంగు సంజలును జిక్కని క్రొన్నన చుక్క గుంపు లిం
పగు పువురెమ్మ క్రొన్నెలలు నచ్చపుఁ టుప్పొడి చిన్నివెన్నెల
ల్గగనతలంబు గప్ప నఖిలక్షణదాభ్యుదయంబులయ్యె నే
వగఁ బగ లూనెనో సురభివైభవముల్ పథికాంగనాళికిన్." 9ప.2ఆ.హ.న.

ఇందు పూర్వార్ధము పూర్తిగ తేటతెనుగు. ఉత్తరార్థమునందు సగము సంస్కృతము.

" పులుఁగులు సాలు గట్టుకొని పోఁ దొడగెన్ ముడిఁగెన్ బయోజముల్
దొలినుడి మానికంపు గని దోరగిలె న్సొగిలెన్ రథాంగముల్
జిలిబిలి మైల నల్దెసలఁ జీకొనియెన్ జనియెన్ మరీచికల్
గలువల వింత నవ్వు మొలకల్ దొరసెన్ విరిసెన్ బ్రకాశముల్."

ఇందు పాదమునకు ఒక్క సంస్కృతపదము. "పయోజముల్, రథాంగముల్, మరీచికల్, ప్రకాశముల్"- నాలుగు పాదాంతపదములు మాత్రము సంస్కృతిసమములు. కడమ పదములెల్ల తెలుగు మాటలు.

ఇట్లు భట్టుమూర్తి శైలి సంస్కృతప్రౌఢి, తెనుగు నుడికారము కల కర్దరసాయనము.

## పద్ధతి

వసుచరిత్రమునందు గిరికావసురాజుల ప్రథమసమావేశము, మంజువాణి రాయబారము నాటకీయపద్ధతిని కలవు.

నాయకుడైన వసురాజు నర్మసఖునితో ఉద్యానవనమునకు విచ్చేయును. నర్మసఖుడు సంస్కృతనాటకపాత్ర. నర్మసఖునితో నాయకుడు ఉద్యానవనమునకు విచ్చేయుట అభిజ్ఞానశాకుంతల, విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రనాటకములందు కలదు. వసురాజునకు కిన్నరద్వయము "అనన్యదురాసదమైన యొక్క యాసన్న శుభంబుఁ దె"ల్పును. ఇది భావ్యర్థసూచనము. గిరికావసురాజుల పరిణయమును సూచించు నాటకీయధ్వని. వసురాజు నర్మసఖునితో ఉద్యానవనమునందు విహరిం

చునెడ వీణాగానము వినిపించును. అది గిరికావసురాజుల ప్రథమసమావేశమునకు నిమిత్తము. ఇది నాగానందనాటకసరణి. ఆ సంగీత మెవ్వరిదో చూచి రమ్మని వసు రాజు నర్మసఖుని పంపించును. నర్మసఖుడు వీణ వాయించు గిరికను చూచి వచ్చి, ఆమె సౌందర్యమును వర్ణించి అచటకు తీసికొనిపోవును. ఇది నర్మసఖుని కృత్యమే. వసురాజు తీగల మాటున డాగి, నర్మసఖుని సఖీసమేతయైన గిరిక సన్నిధికి పంపించును. నర్మసఖునిగ కాదు; యతివేషధారిగ.

నర్మసఖుడు పసిడిపన్నె తీగలు జడలుగ, పుప్పొడి విభూతిగ, గట్టి కొమ్మ దం డముగ, కెంజిగురాకుల సమూహము కాషాయవస్త్రములుగ, చెట్టు బెరడు యోగపట్ట ముగ, మొగ్గల సముదాయము జపమాలగ, పూలరసము కమండలుజలముగ, కేస రముల చాలు మౌంజీబంధముగ అప్పటికప్పుడు వేషము ధరించును.

" గంధగజయాన గీతప్రబంధకలన
నలరి యతిలియ్యమై వచ్చు నరిది మగువ
లార కనుఁగొంటిరే యను నాళి వాక్య
మొకటి విననైన నిదె వేళ యనుచు" 80ప.2ఆ.

నర్మసఖుడు "యతి వచ్చు జాడ యే లీల నెఱిఁగితమ్మ" అని (81ప.2ఆ.) వారిని సమీపించును."ఆళివాక్యము"లోని "యతి" గీతప్రబంధమునకు సంబంధించిన యతి. నర్మసఖుని వాక్యములోని "యతి" తాను ధరించిన వేషము. ఇట్టి పాత్రప్రవేశము సం స్కృతనాటకప్రస్తావనలోని కథోద్ఘాతము. ముద్రారాక్షసము మూదల. అంతేకాదు. కపటయతిప్రవేశము కళాపూర్ణోదయములోని మణిస్తంభు డనెడు సిద్ధుని ప్రవేశము నకు స్ఫోరకము. శాలీనుడు మణిస్తంభునిగ. మృగేంద్రవాహనకు బలియిచ్చుటకు లోకోత్తరసుందరి, లోకోత్తరగాయని అయిన కలభాషిణి కొఱకు ఆమె గృహారా మమునకు వచ్చును. నర్మసఖుడు కపటయతిగ, వసురాజునకు సమకూర్చుటకు లోకోత్తరసుందరి, లోకోత్తరగాయని అయిన గిరిక మణిమందిరమునకు వచ్చును. మణిస్తంభుడు తాను వచ్చుట. "ఏను మదిరేక్షణ మీ చెంతకు వచ్చుట చెవులకు వింత చెలువు గులుకు పాట వినుటకె సుమ్మీ" అని తెల్పును.(3ప.3ఆ.) మాయాయతి తాను వచ్చుట.

" సరసదరీఝరీవికచసారససౌరభసారపూరితాం
బరమగు నిమ్మహానగము పజ్జనె యా నవపద్మినీమనో
హరుఁ డు వెలుంగ నాయన కుపాయన మిచ్చుటఁ గూర్చువాఁ డనై

యరయుదుఁ బద్మినీసముదయంబని వచ్చితినమ్మ నెచ్చెలీ." 94 ప.2ఆ.

అని తెల్పును. మణిస్తంభుడు తెల్పిన కారణము. మాయాయతి వాచ్యార్థమున తెల్పిన కారణము రెండును అబద్ధములే. మాయాయతి వ్యంగ్యార్థమున తెల్పిన కారణము సుబద్ధము. సూర్యునికి కానుకగ ఇచ్చుటకు తామరతీగలను వెదకుచు వచ్చితినని వాచ్యార్థము. పద్మినీజాతిస్త్రీని వెదకుచు వచ్చితినని వ్యంగ్యార్థము. శ్లేషవైభవము.

కథాసంవిధానము కాలక్రమమున గాక కారణక్రమమున కావించుట కళాపూర్ణోదయమునందు ప్రముఖనాటకీయపద్ధతి. అంతేకాదు. కవి తానై కథ చెప్పక పాత్రచేత కథ నాటకీయముగ చెప్పించుట ప్రత్యేకనాటకీయపద్ధతి. వసుచరిత్రమునందు శుక్తిమతీకోలాహలవృత్తాంతము కాలక్రమమున లేదు. కారణక్రమమున కలదు. భట్టుమూర్తి చెప్పలేదు. మంజువాణి చెప్పినది కారణము నర్మసఖుడు గిరిక పావనకులగోత్రభూతి తెల్పుమని కోరుట.

" అనుపమభాగ్యలక్షణసమన్విత యీ రమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన యనం గననయ్యెడి నీ లతాంగి పా
వనకులగోత్రభూతి చెలువా చెలువారఁగఁ దెల్పవే యనన్." 96ప.2ఆ.

ఇదొక విధమైన ప్రశ్నోత్తరపద్యము. గిరిక పావనకులగోత్రభూతి ప్రశ్న. "సింధునందన." "అచలేంద్రనందన" సమాధానము. ప్రశ్నలోని సింధునందన లక్ష్మి అచలేంద్రనందన పార్వతి. సమాధానములోని సింధునందన నదీతనయ. అచలేంద్రనందన పర్వతపుత్రి. గిరిక నదీతనయ. పర్వతపుత్రి. అందుకు మంజువాణి "పేర్కొని యును గ్రమ్మరఁ దెలియఁగోరుట కూరిమి వెంపునం గదా" అని (97ప.2ఆ.) శుక్తిమతీకోలాహలవృత్తాంతము చెప్పి. "ఆ నగజాత యీ తరుణి" అని (35ప.3ఆ.) సందిగ్ధత విడిపోవునట్లు గిరికను నిర్దేశించును. అంతేకాదు. మంజువాణి చెప్పిన శుక్తిమతీకోలాహలవృత్తాంతమునందు వసురాజు పూర్వవృత్తాంతము కలదు. అది విస్మయము కలిగించును. ఇది కళాపూర్ణోదయములోని సరస్వతీచతుర్ముఖవృత్తాంతమునందు కళాపూర్ణమహారాజు పూర్వవృత్తాంతమును తలపించును.

గిరిక జన్మవృత్తాంతము విని కపటయతి ధ్యానసమాధి నటించి. గిరికావసురాజులు పూవు. తావి వలె ఒకట్టై వెలయుదురని దీవించును. (40ప.3ఆ.) వసురాజు

ఎప్పుడు వచ్చును? గిరికను ఎప్పుడు చూచును? ఎప్పుడు గారవించును? అని మంజువాణి సంశయము ప్రకటించును.)(42ప.3ఆ.) మాయాయతి మంత్రప్రౌఢిని రప్పింతునని మాయాజపము చేసి "మజ్ఝా" అని బిగ్గఱగా పలుకును (44ప.3ఆ.) అంతే.

" ఇది సంధింపఁగ వేళ యంచు వసురాజేంద్రుండు నీరంధ్రనీ
రదవారప్రతిసీర వెల్వడిన తారాధర్తలీలన్ లతా
చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మదభృంగీరుతి వందిమాగధకథామాధుర్యముం దెల్పఁ గన్." 45.ప.3ఆ.

ఇట్లు హఠాత్తుగ వసురాజు ప్రత్యక్షమగుట గిరికాదులకు అనూహ్యసంఘటన. అందఱు లేచి అమితవినయము, సంభ్రమము తోప నిలుతురు. (46ప.3ఆ.) మాయాయతి వసురాజును" చింతితకల్యాణసమృద్ధిరస్తు" అని ఆశీర్వదించును.(47ప. 3ఆ.) గిరిక ప్రియసఖులు సమర్పించిన స్వర్ణపీఠము మీద వసురాజు ఆసీనుడగును. (47ప.3ఆ.0 గిరిక చూపులు వసురాజుపై ప్రసరించును. (48-51ప.3ఆ.) వసురాజు చూపులు గిరికపై ప్రసరించును. నాయికానాయకుల ప్రథమసమావేశ పరస్పరావలోకనము నాటకీయముగ సంఘటితమైనది.

ఇట్లు పూర్వరంగము రసోత్తరంగ మయినది. కపటయతి గిరికావసురాజులను "అమూల్య కల్యాణకౌతుకసమృద్ధియుం గావలయునని దీవించ"ును. మణిమందిరము విడిచిపెట్టి కొంతదూరము పోయి, మందారవృక్షముల మాటున, యతివేషము తీసివైచును. యథాపూర్వవేషమున వసురాజును వెదకుచు వచ్చినట్లు మణిమందిరమునకు వచ్చును.(62వచ.3ఆ.) గిరిక చెలికత్తెలు వసురాజు నర్మసఖుని యతివేషమున పంపించినట్లు గ్రహింతురు. (64ప.3ఆ.) గిరికను ఆట పట్టింతురు. (65ప.3ఆ.)గిరిక తెరచాటునకు పోవును.(67ప.3ఆ.) వసురాజు తనివితీరనట్లు చూచి (68ప.3ఆ.), గిరిక యవనికాభ్యంతరమునకు ఏలపోయెనని అడుగును. (69ప.3ఆ.) మంజువాణి గిరికను సమీపించి పరిణయస్ఫూర్తి కలిగెనని పలుకును. (70ప.3ఆ.) గిరిక మంజువాణిని అదలించు తల్లి చెలికత్తె "కలహంసి రాదొకో" అని తలపోయు నెడ (71ప.3ఆ.) ఆ కలహంసి వచ్చును. తల్లి రమ్మన్నదని చెప్పును. (72ప.3ఆ.) కల హంసి వెంట గిరిక వెనుకకు తిరిగి చూచుచు నిష్క్రమించును.(75-78ఉ.3ఆ.) కలహంసి ప్రవేశము, గిరిక నిష్క్రమణము నాటకీయమే. గిరిక నిష్క్రమణము శకుంత లానిష్క్రమణమునకు అనుసరణము.

గిరిక నిష్క్రమించిన అనంతరము వసురాజు విరహవిహారము కలదు. (79-99ప.3ఆ.) అది విక్రమోర్వశీయనాటకములోని చతుర్థాంకమును జ్ఞప్తికి తెచ్చును. తదనంతరము గిరిక విరహము కలదు. (99-185ప.3ఆ.; 26-52ప.4ఆ.) అది ఆఖ్యానపద్ధతి. ప్రథమాశ్వాసములోని వసురాజు ఉద్యానవనప్రవేశము మొదలు తృతీయాశ్వాసములోని వసురాజు విరహవిహారము తుదివఱకు వసుచరిత్రమునందు నాటకీయపద్ధతి కలదు.

మంజువాణి రాయబారము కూడ కాలక్రమమున లేదు. కారణక్రమమున కలదు. అంతేకాదు. అది భట్టుమూర్తి చెప్పినది కాదు. మంజువాణియే చెప్పినది. మహాభారతమునందు మూడు రాయబారములు కలవు. 1. ద్రుపదపురోహితుని రాయబారము. 2.సంజయుని రాయబారము. 3. శ్రీకృష్ణుని రాయబారము. శృంగారనైషధమునందు రెండు రాయబారములు కలవు. 1. హంస రాయబారము. 2. నలుని రాయబారము. అయిదు రాయబారములును కవిప్రోక్తములు. ఒక్కటి కూడ పాత్రోదితము లేదు. వసుచరిత్రములోని మంజువాణి రాయబారము మాత్రము కవిప్రోక్తము కాదు. పాత్రోదితము. కళాపూర్ణోదయము ప్రభావమే.

విరహాతిశయమున భోరున విలపించు గిరికను ఓదార్చు చెలికత్తెలు "అయో మన మంజువాణియుం జని తడవయ్యె నేమిటికి జాగొనరించెనో" అని తలపోయునెడ రాయబారము సఫలము చేసికొని మంజువాణి వచ్చును. (52-56ప.4ఆ.) రాగానే వసురాజు ఇచ్చిన అంగుళీయకమును గిరిక ఎదుట పెట్టును. (57ప.4ఆ.) చెలికత్తెలు అడిగిన మీదట రాయబారము నిర్వహించిన విధము సవివరముగ తెల్పును. తెల్పిన విధము ఆత్మపరమైనను అందు నాటకీయత అంతర్గతముగ కలదు. మంజువాణి వసురాజు సమీపభూమిని చేరును.(74ప.4ఆ.) మాధవి, హేమలత అను రాజపరిచారికల సంభాషణమున "భూపాలుఁడా రామక్షోణికిఁ జన్న నాఁటఁ గోలె నిద్రాసౌఖ్యముల్ మానినాఁడు" అను వాక్యమును బట్టి వసురాజు విరహావస్థను గ్రహించును. మెల్లగా రాజసౌధములోని అభ్యంతరమందిరమునందు ప్రవేశించును. చప్పరమంచముపై కన్నులు ఎఱుపెక్కి, కపోలములు పాలిపోయి, హారములు చిక్కులుపడి, పలుచని తెల్లటి దుప్పటి పఱచిన పఱుపుమీద- ఒత్తగిల్లి, మోము తలాడపై మోపి, పాదములు బటువుబిళ్ల మీద చేర్చి, చిత్రఫలక మీక్షించు వసురాజును చూచును. (78-79ప.4ఆ.) విరహావస్థ విశదమయి, విరహకారణము గిరికయో, మఱొకతెయో తెలిసికొనుటకు గంధతైలభాజనప్రదీపికల చాటున పొంచియుండును. (80ప.4ఆ.) వసురాజు విరహవేదనప్రకటనమునందు,

" గురుని గుణ ముఱోజగిరులు గాంచినఁ గాంచుఁ
గాక నీమనంబుఁ గాంచనేల
తల్లి కుటిలవృత్తి తగుఁ గాక కురులకు
నింత నీదు చెయ్వు లెనయ నేల?" 85ప.4ఆ.

అనుటను బట్టి విరహకారణము గిరిక అని నిర్ధారణ చేసికొనును. క్రమముగ వసురాజు మంచమును సమీపించి. ఒప్పుచున్న కీలుబొమ్మలలో ఒక రత్నపాంచాలిక వలె నిలుచును. గిరిక నేరముగ వసురాజు వచించినది వసురాజు నేరముగ వ్యాఖ్యానించి

" మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైకకా
ర్యాయత్తుల్ సమయానుకూలహృదయవ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవార లాపయి మహీపాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు సెప్పనేల మగవారిన్ నమ్మఁ గా వచ్చునే" 90ప.4ఆ.

అని సమర్థించును. వసురాజు గుండె ఝల్లుమని ఎవరు మాటాడునది పెక్కు విధముల తలచి. కడకు "మంజువాణి యేతెరఁ గఁ బోలు"నని ఊహించును. (92ప. 4ఆ.) గిరిక యెడల సానుభూతి ప్రకటించును. (93-94ప.4ఆ.) మంజువాణి రత్నపుత్రిక వలె. తెచ్చిన గిరిక హారమును వసురాజు కంఠసీమను నిలుపును. (95ప. 4ఆ.) వసురాజు హారమును చూచి. ఆశ్చర్యపడి. గిరిక హారమును గుర్తించి. క్షేమసమాచార పూర్వకముగ హారమును స్తోత్రపారాయణము చేయును. (96-106ప.4ఆ.) హారము నిల్పిన రత్నపుత్రికను పల్కుమని కోరును. (107ప.4ఆ.) అప్పుడు మంజువాణి రత్నపుబొమ్మగతి మాని. మంజువాణి వలె వసురాజునకు వందన మాచరించి. గిరిక విరహావస్థను నివేదించును. (108-111ప.4ఆ.) వసురాజు తన హృదయమును విశదీకరించును. (112-115ప.4ఆ.)

" శ్రీవాణీధరణీముఖాంగనలపైఁ జిత్తంబు లేకున్కి కే
మీ వేమాఱును దూఱ నిత్యగుణలక్ష్మిన్ సంతతావక్రవృ
త్తావిర్భావ నఖండరూపనిధిఁ గన్యం గోరువాఁ డేల సం
భావించున్ సిరి పెంపు వాగ్విలసనప్రౌఢిన్ మహీభోగముస్." 115ప.4ఆ.

లక్ష్మి చంచల. గిరిక అచంచలలక్ష్మి. వాణి సంతతవక్రవృత్తసహిత. గిరిక సంతతావక్రవృత్తావిర్భావ. భూదేవి ఖండరూపనిధి. గిరిక అఖండరూపనిధి. అందువలన

లక్ష్మిని, సరస్వతిని, భూదేవిని గాక గిరికనే వరింతునని, కన్యను కోరువాడు సంపదను, చమత్కారమును, భూమిని కోరడని వసురాజు ప్రకటనము.

" నా విని చతురాస్యుఁడ వరు
దే వచనప్రౌఢి నీకుఁ దెఱవ యిఁక వియో
గావృత్తి కోర్వ దేఁ చెద
వో వెసఁ బ్రోచెదవొ తెలుపు ముల్లం బనినన్." 116ప.4ఆ.

మంజువాణికి వసురాజు సంబంధము నిశ్చయించుటకు ఇంద్రుడు వచ్చునని శుభవార్తను గిరికకు చెప్పి ఊరడిల్లగ జేయుమని తన మహితాంగుళీయకమును ఇచ్చును. (117-121ప.4ఆ.) అంగుళీయకము మీద వసురాజు నామాక్షరములు కలవు. (123ప.4ఆ.) అవి చూచి గిరిక విరహతాపము ఉపశమించును. ఇది మంజువాణి రాయబారము. ప్రయోజనమును. ఆద్యంతము నాటకీయపద్ధతి అంతర్గతము.

## ఆత్మీయత

భట్టుమూర్తి కావ్యాలంకారసంగ్రహమునందు ఎవరి భక్తుడో చెప్పుకొనలేదు. వసుచరిత్రమునందు "నను శ్రీరామపదారవిందభజనానందున్" అని చెప్పుకొనెను. (16ప.1ఆ.) అనగా రామభక్తుడు. అట్లు హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు చెప్పుకొనలేదు గాని, అంతకంటె ఎక్కువ రామభక్తుడుగ కలదు. భట్టుమూర్తి ఇష్టదేవతాస్తుతియందు ప్రథమతః కావ్యాలంకారసంగ్రహమునందు విష్ణుస్తుతి. వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములందు రామస్తుతి కలదు. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు రామస్తుతి మాత్రమేకాదు. భరతస్తుతి, లక్ష్మణస్తుతి, శత్రుఘ్నస్తుతి కూడ కలవు. ఇతఃపూర్వము రామలక్ష్మణభరతశత్రుఘ్నుల నలుగురి స్తుతి ఇతరత్ర మృగ్యము. మూడు కృతులందును ఆంజనేయస్తుతి కలదు. కావ్యాలంకారసంగ్ర హములోని ఆశ్వాసాంతగద్యను హనుమత్ప్రసాదలబ్ధకవితాసార" అని, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములలోని ఆశ్వాసాంతగద్యలను "రామచంద్రచరణారవిందవందనప్రసాదసమాసాదిత......" అని భట్టుమూర్తికి విశేషణములు కలవు. అంతేకాదు.' హరిశ్చంద్రనలకథాయుగపదనుసంధానబంధురరసానుబంధంబగు చిత్రప్రబంధంబు నిర్మింపంబూని యున్న సమయమున" భట్టుమూర్తి స్వప్నమునందు ఆంజనేయుడు సాక్షాత్కరించి "అంకితమొనర్పు రఘుభర్తకు" అని చెప్పినట్లు కలదు. (10-14ప.పీ.) మొత్తము మీద మొదటినుంచీ భట్టుమూర్తి రామభక్తుడు హనుమదుపాసకుడును అగును.

రామభక్తుడైన భట్టుమూర్తి వసుచరిత్రమునందు రామనామస్మరణము కలదు.

" ఆదరణీయరామకథనాంకశుకోక్తులతోడఁ దీవము
త్తైదువచాలు శోభనపు టారతులెత్తె సదాగతిన్ గిరి
క్షోదవినోదికిం జిగురుజొంపపుఁ గెంపుల పళ్లెరంబులం
బ్రోదిఁ దనర్చు నగ్గలపు మొగ్గలు ముత్తెపు ముగ్గు లీనఁ గన్." 151ప.1ఆ.

వసురాజునకు తీగలనెడి ముత్తైదువలు ఆదరణీయమైన రామచిలుకల పలుకులతో మంగళహారతు లిచ్చిరని ప్రకృతార్థము. స్త్రీలు మనోహరమైన రామకథల చిలుక పలుకులతో మంగళహారతులు పాడిరని అప్రకృతార్థము. ఇది భట్టుమూర్తి నాటి స్త్రీల రామాయణము పాటలకు స్ఫూర్తిచంద్రిక.

"అంత ననంతవేగభుజగాంతకుఁ డమ్మహికాంతుఁ డాశ్రిత
స్వాంతము సంతసిల్ల సురచారణసన్నుతి పర్వ నవ్వనా
భ్యంతరరోధకంబగు మహాద్రి నఖంబున మీటె నభ్రవి
భ్రాంతము గాఁ గ దుందుభికబంధము మీటిన రాము కైవడిన్." 152ప.2ఆ.

కొలది లేని వేగమునందు గరుత్మంతుని వంటివాడైన వసురాజు. ఆశ్రయించిన శుక్తిమతి మనస్సు సంతసింప. ఏటినీటికి అడ్డుకట్టు అయిన కోలాహలపర్వతమును; కొలది లేని వేగము కల గరుత్మంతుడు వాహనమైన- గరుడవాహనుడైన విష్ణువు అవతారమైన రాముడు. ఆశ్రయించిన సుగ్రీవుని మనస్సు సంతసింప. అరణ్యమధ్యమునందు అడ్డుకట్టు అయిన దుందుభి అను రాక్షసుని మొండెమును కాలిగోటితో మీటెనని అర్థము. శ్లిష్టోపమ.

" అనిలకుమారకుండు మరుదధ్వనిరోధి పలాశిమండలీ
ఘనవనరాశిలోఁ బుడమికానుపు పద్మిని చిక్కి స్రుక్కఁ గా
నినకరముద్రఁ జూపి వెలయించి తదంబుజరాగపాళిఁ గై
కొనుచుఁ బ్రవాలతేజమునఁ గూరిచెఁ గంటె పలాశవీథులన్." 139ప.3ఆ.

పిల్లగాలి ఖేచరమార్గమును అడ్డగించు పలాశవృక్షసమూహములతో గొప్పవైన ఉద్యానవనముల గుంపులో మెట్టతామర తీగ చిక్కుకొని వాడిపోవగా. సూర్యకిరణముల ప్రసరణములు కలిగించి. మెట్టతామర పుప్పొడి రాశిని గైకొనుచు. పలాశవృక్ష వాటికలను చిగురుటాకుల కాంతిని కూర్చెనని ప్రకృతార్థము. వసంతర్తువర్ణనము. హనుమంతుడు దేవతామార్గమును అడ్డగించు రాక్షసమండల మనెడు కెద్దసముద్ర

ములో భూపుత్రి, పద్మినీజాతిస్త్రీ అయిన సీత చిక్కువడి బాధపడగా, రాముని అంగుళీయకమును చూపించి, సంతసింపజేసి, సీతాదేవి పద్మరాగమణిపాళి శిరోరత్నమును గైకొనుచు, రాక్షసగృహవీథులను ప్రకృష్టమైన వాలము నందలి అగ్నితో కూర్చెనని అప్రకృతార్థము, రామాయణార్థము. ఇది భట్టుమూర్తి రామభక్తికి మాత్రమే గాక హనుమద్భక్తికిని రత్నదర్పణము.

" సమయమ్మృగహృతరవి రఘూత్తముని సతిఁ బ్ర
భామయిఁ దమోనిశాటుండు పఱవకుండ
ననలధామంబులోఁ డాఁచి యమరు లిడిన
వంచనాగౌరగాత్రి నా వఱలె సంధ్య." 7ప.4ఆ.

కాలమనెడు మాయలేడి లాగుకొనిపోయిన, రవి అనెడు రాముని సతి అయిన, ప్రభామయి అయిన సీతను, చీకటి అనెడు రావణుడు అపహరింపకుండ, అగ్నితేజస్సునందు దాచి, దేవతలు ఎదుట నిలిపిన పసుపుచాయ మాయాసీత అనునట్లు సంధ్య ప్రకాశించెనని అర్థము. సాయంకాలము రవి అస్తమించెనని, రవిప్రభ తొలగెనని, చీకటి వ్యాపించకుండ అగ్నికాంతి హెచ్చెనని సంధ్యావర్ణనము. మాయలేడి వలన రాముని సతి అయిన సీతను రావణుడు అపహరింపకుండ, అసలు సీతను అగ్నితేజస్సున దాచి మాయాసీతను పర్ణశాలలో దేవతలు నిలిపిరని రామాయణార్థము. ఇట్లు వాల్మీకి రామాయణమునందు లేదు. రాముడే ఇట్లు చేసెనని అధ్యాత్మరామాయణమునందు కలదు. అది నిమిత్తముగ భట్టుమూర్తి రామకథా సుధారసపానము.

" అన విని రఘునందనుని సన్నిధిఁ బ్రభూత
చైతన్యయై నిల్చి చట్టుపోలఁ గ
కరణి రత్నపుబొమ్మ గతి మాని ధృతి పూని
క్షితిజానికి జోహారు చేసి నిలిచి-" 108ప.4ఆ.

వసురాజు "నీకుం బ్రతిమాపదేశ మిఁక నేలే పల్కవే" అనిన మంజువాణి, రత్నపు బొమ్మ వలె చైతన్యరహితముగ ఉండుట మాని చైతన్యసహితముగ, మంజువాణి అగుట, శిలారూపస్త్రీ అయిన అహల్య రాముని పాదస్పర్శ సోకి చైతన్యసహితయైన అహల్య అగుట వలె కలదని అర్థము. ఇది కూడ అధ్యాత్మరామాయణానుసరణమే.

ఎంత రామభక్తుడైనను భట్టుమూర్తి హరవిద్వేషి కాడు. వసుచరిత్రమునందు శివపరమైన కల్పనలును కావించెను.అందు నటరాజభావనీరాజనము అధికము.

" నటదీశానశరస్తటత్రుటితరత్నచ్ఛాయఁ గల్లోలినీ
విటమధ్యంబున వ్రాలె నభ్రమణి తద్వేగాభిపాతోన్నమ
త్పటుపాథోలవధారఁ దార లెగసెం దద్బిందుసందానితో
త్కటసంధ్యానలధూమకందళములై కన్పట్టెఁ గ్రొంజీఁకటుల్." 10ప.4ఆ.

అభ్రమణి సంధ్యాతాండవము సేయు నటరాజు శిరసుమీది రత్నము వలె సముద్రమునందుపడిన. ఆ మహావేగపాతమునకు పైకెగసిన సముద్రజలబిందువుల వలె నక్షత్రములు. ఆ జలబిందువులతో కూడిన సంధ్యారాగమనెడి అగ్ని నుండి పుట్టిన పొగమొలకల వలె చీకటులు కనిపించెనట.

అన్యదైవసహనము కల రామభక్తి భట్టుమూర్తి ఆత్మీయత.

# ఇతర కవులు

**మాడయ** : ఈతని కృతులు రెండు. 1. దేవేంద్రవిజయము- ద్విపదకావ్యము. 2. మైరావణచరిత్రము. దేవేంద్రవిజయము ద్విపదకావ్యమని, ఎఱ్ఱమంత్రికి అంకితమని మైరావణచరిత్రమునందు కలదు. (23ప.1ఆ.) కాని గ్రంథము లభింపలేదు. మైరావణచరిత్రము వే (రే)జెర్ల గోపమంత్రికి అంకితము. అందు గోపమంత్రికి సంబంధించిన చరిత్రాంశము లేదు. మాడయకు సంబంధించిన చరిత్రాంశములు కలవు.

" మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాట
నరనాయకుని వీరనారసింహు
ధట్టించినాఁడవు తస్కరకవిరాజు
కోటసింగనమంత్రి కొలువులోనఁ
గాంచినాఁడవు కనత్కాంచనాభరణంబు
లేపార వందాపురీశుచేత
నందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును
గిమిడెభూమండలరమణుచేత
నవమతిస్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల
కావ్యలక్షణలక్ష్యసాగరము నెరయ
నిన్ను వేర్వేర నింక వర్ణింపనేల
ప్రోడ వన్నింటఁ సర్వయ మాడసుకవి." 18ప.1ఆ.

ఇందు "నరనాయకుని వీరనారసింహు" అను పంక్తి "నరసనాయకు వీరనారసింహు" అని ఉండవలయునని ఒక అభిప్రాయము కలదు.[201] ఉండకపోయినను అర్థమదే. నరపతి. విజయనగరసామ్రాజ్యాధిపతి. విఖ్యాతుడైన వీరనరసింహరాయలు నరసనాయకుని తనయుడు. శ్రీకృష్ణదేవరాయల అగ్రజుడును అయిన తుళువవీరనరసింహరాయలే. అతని రాజ్యకాలము[202] 1506-1509. ఆ కాలమునందు నందాపురీశులు, కిమిడెభూమండలరమణులు కలరు. నందాపురి ఇప్పటి ఒరిస్సా రాష్ట్రములోని జయపూర్. కిమిడె ఇప్పటి గంజాము జిల్లాలోని కిమిడి. అప్పటి

నందాపురీశుడు విజయచంద్రుడు (1476-1510), కిమిడెభూమండలరమణుడు చంద్ర మౌళిగజపతి(1495-1520) కావచ్చును.[203] కోట సింగనమంత్రి ద్వాత్రింశన్మంత్రుల పట్టికలోని వాడు.[204]

"పుట్టినపు వీరభద్రుని ప్రేమచేఁ
జెన్నొందె శ్రీ కోట సింగరాజు"

ఇతని గుఱించి పెక్కు చాటుపద్యములు కలవు.[205] ఒక్క చరిత్రాంశము కూడ కాలమును నిర్దేశించునది లేదు. మాడయ ధట్టించిన తస్కరకవిరాజు సంగతి తెలియదు. వీరనరసింహరాయలను మెప్పించిన మాడయ మైరావణచరిత్రము రచనాకాలము స్థూలముగ 1508 వ సంవత్సరము కావచ్చును.

మైరావణచరిత్రము రామాయణకథ. కాని వాల్మీకి రామాయణములోని కథ కాదు."విచిత్రాదిరామాయణములలో నెద్దానియందో యిక్కథ కల్పింపఁబడి యుండవచ్చును." అని ఒక అభిప్రాయము కలదు.[206] ఆదిశబ్దముచేత అద్భుత రామాయణమును గ్రహింపవచ్చును. అద్భుతరామాయణము సంస్కృతగ్రంథము. విచిత్రరామాయణము ఒరియాగ్రంథము. వాని సమాచారమిది[207] : పదునైదవశతాబ్ది ఒరియాకవి సారళాదాసు మహాభారతము కంటె పూర్వము సిద్ధేశ్వరదాసు అను పేరుతో విచిత్రరామాయణమును రచించెను. అతని మహాభారతము వ్యాసుని మహాభారతమునకు అనువాదము కాదు. అతిస్వతంత్రమైన చిత్రవిచిత్రకథా సంభరితమైన విచిత్రగ్రంథము. రామాయణము పేరే విచిత్రరామాయణము. విచిత్రగ్రంథము. అద్భుతరామాయణమునకు, విచిత్రరామాయణమునకు పోలికలు కలవు. మాడయకు ఒరిస్సారాష్ట్రములోనికి రాకపోకలు కలవు. నందాపురము, కిమిడి. కనుక ఒరియా భాషలోని విచిత్రరామాయణము కారణముగ సంస్కృతభాషలోని అద్భుత రామాయణము మాడయ మైరావణచరిత్రమునకు మూలము కావచ్చును. "విచిత్రచరిత్రంబుఁ దెనుఁగు బాసఁ జెప్ప" అని కలదు. (14వచ.1ఆ.)

ఆంజనేయుని అద్భుతకార్యమే మైరావణచరిత్రము. అది రామరావణయుద్ధ కాలమునందు జరిగినట్లు, రామరాజ్యకాలమునందు అగస్త్యుడు రామునికి చెప్పినట్లు మైరావణచరిత్రమునందు కలదు. అర్వాచీనులు ద్విపదకావ్యములుగ, ఆధునికులు నాటకములుగ రచించుటవలన కథ ప్రసిద్ధమైనది. రామరావణయుద్ధరంగమునందు రామలక్ష్మణుల శిబిరమునకు, ఆంజనేయుడు తన వాలముతో కోట కట్టి కావలియుండుట, విభీషణుని వలె వచ్చి, మోసగించి మైరావణుడు రామలక్ష్మణులను

అపహరించి, కాళికాదేవికి బలి వేయనున్న, ఆజన్మబ్రహ్మచారి అయినను పుత్త్రుడైన మత్స్యవల్లభుని సహాయమున, మైరావణుని సోదరి దుర్దండి సహాయమున రక్షించుట, ఒక గుహలోని గుండురాయియందలి ఏడు తుమ్మెదలను ఒక్కసారి చంపుట ద్వారా మైరావణుని సంహరించుట ఆంజనేయుని అద్భుతకార్యము. విచిత్రవిషయము. మైరావణుని మరణరహస్యము బాలనాగమ్మకథలోని మాయలఫకీరు మరణ రహస్యమునకు మార్గదర్శకము వలె కలదు.

ఆంజనేయుని రామభక్తి మైరావణచరిత్రమునకు ఆత్మసదృశమైనను, కావ్యము వీరరసప్రధానము. అంతేకాదు. కథాప్రధానము. వర్ణనాభూయిష్ఠము కాదు. కవిత్వము సరళము. సరసము.

" రసములు తొమ్మిదిం గలుగు రమ్యనవార్థసుశబ్దమాధురీ
విసరము లుల్లసిల్ల నతివిస్ఫుటలక్షణరూఢిఁ బ్రౌఢిమన్
రసికుల నెమ్మనంబులను రాగము నొందఁ దెనుంగు బాస నిం
పెసఁగఁగఁ జెప్ప నేర్తు సరియెవ్వరు నీకును మాడధీమణీ!" 22ప.1ఆ.

అని కృతిభర్త అన్నట్లు సుశబ్దసుందరమేగాక, అపశబ్దబంధురము కూడ.

" కావునను మొఱఁగి దశరథ
భూవరతనయులను నాదు పూనిక దక్కన్
ఈ వేళఁ దెచ్చి కాళిక
కే వొప్పన చేతుఁ దలఁక కిమ్ములఁ దరుణీ." 141ప.1ఆ.

ఇందు "వొప్పన" ప్రాసఘటితము. నిర్ధారకప్రయోగము. పదాదిని వొకారము కలదు. అది శబ్దగతము కాదు. వ్యవహారగతము. అపశబ్దము. ఒప్పన సుశబ్దము.

" త్రుళ్లిన రావణాసురునిఁ ద్రుంపక సంతతశోకమగ్నయై
తల్లడ మందుచున్న వసుధాసుతఁ గానక వీరధర్మమున్
బొల్లుగఁ జేసి రాఘవులు వోయిన యప్పుడె మేనుఁ బ్రాణము
ల్వల్లను నంగదుం గొనుచు వారిధి మెల్లనె దాటుఁ డిందఱున్." 60ప.2ఆ.

ఇందు "వల్లను" యతిమైత్రిఘటితము. నిర్ధారకప్రయోగము. " వ్యతిరేకంబున వలచున కొల్ల విభాష నగు" అని చిన్నయసూరి సూత్రము. (107సూ.క్రి.ప.) కనుక "ఒల్లను" కావలయును. కానిచో "వలవను" కావలయును. కాని"వల్లను" కాదు. ఒల్లను

సుశబ్దము. వల్లను అపశబ్దము. వ్యాకరణవిరుద్ధమైన ప్రయోగములును కలవు. "మెచ్చితింక" (148ప.2ఆ.) "పెనుచుక" (13ప.3ఆ.) మొదలైనవి. అవి వదలిన కావ్యము కథాప్రధానము. రసప్రధానము అనావశ్యకవర్ణనారహితము.

మైరావణుని భార్య మాతంగి. వాల్మీకి రామాయణములోని మండోదరి కంటె ఉత్తమపాత్ర. రామలక్ష్మణులను కాళికి బలిచేయుదునని మైరావణుడు చెప్పగానే. కీలుబొమ్మ వలె పడిపోయి. మూర్ఛనొంది. సేదదేఱి మైరావణునికి హితబోధ సేయును.

" కటకట యేటికయ్య యపకారము పుట్టెఁగదయ్య ప్రాణసం
కటమగు పూన్కికిం దగవు గాదన కిట్లు సహింతురయ్య నీ
పటుతరబుద్ధి యేల భువిపాలుగఁ జేసితివయ్య నేఁడు నా
కిటువలెఁ జేటువార్త విననేటికిఁ జెప్పితివయ్య వల్లభా!" 143ప.1ఆ.

అనుటయేగాక; మత్స్య. కూర్మ. వరాహ. నరసింహ. వామన. పరుశురామావతారపురుషుడు "రాముడుగా నెఱుంగుమీ" అని. రావణసంహారము కొఱకు విష్ణువు రామునిగా అవతరించెనని వివరించును. (144-151ప.1ఆ.)

మైరావణుడు ఆంజనేయునితో యుద్ధము సేయుటకు సిద్ధమైనప్పుడును.

" మది మది నుండి చెప్పినను మానక రాజులఁ దెచ్చి యెన్నఁడున్
ఉదరని యిప్పురంబునకు నొప్పమిఁ దెచ్చితి వింకనైన దు
ర్మదము దొఱంగి నీవు హనుమంతుని దివ్యపదాబ్జయుగ్మముల్
మదమునఁ గాంచు దానవసమూహముఁ గాచును నాతఁ డింతయున్
50ప.3ఆ.

అని హితబోధ చేయును. అయినను మైరావణుడు యుద్ధము చేసి మరణించినపుడు.

శ్రుతినుతిపాదపంకజుఁడు శూరుఁడు విష్ణుఁడు రాఘవుండు నీ
కతనిని గెల్వ నేమిటికి నప్పుడ చెప్పనె కాక వెండియుం
బతిహితశీలభూషణుఁ బ్రభంజను నెదుర్పఁబోక యు
న్నతమతిఁ బోయి కాంచి శరణం బొగి వేఁడుమటంచుఁ జెప్పనే."

అని విచారించును. "తెక్కలి రావణబాంధవ మెక్కడఁ బోదయ్యొ నీకు

హృదయేశ్వర" అని కూడ (153ప.3ఆ.) "ఎలుగెత్తి రాళ్లు గరంగ నేడ్చును."(154వచ.3ఆ.)

కావ్యనామము మైరావణచరిత్రమైనను. కథానాయకుడు హనుమంతుడు. హనుమంతుని రామభక్తి. సంగ్రామశక్తి మైరావణచరిత్రమునందు నిస్సపత్నము. మైరావణుని రసాతలములోని లంకలో ప్రవేశించుటకు మత్స్యవల్లభునితోను. ప్రవేశించిన తర్వాత కోటానుకోట్ల రాక్షసులతోను. మైరావణునితోను హనుమంతుడు చేసిన యుద్ధములు వీరబీభత్సరౌద్రభయానకరసబంధురములు. యుద్ధవిజయమునంది. మైరావణుని మేనల్లుడు నీలమేఘునికి రసాతలములోని లంకారాజ్యమునకు పట్టాభిషేకము చేసి. రాజువిధులు తెలిపి. రామనామమహిమ వివరించి. (160-166ప.3ఆ.) హనుమంతుడు.

" కావున రాఘవనామము
భావంబునఁ బదిలపఱిచి బాంధవగురుదీ
నావలి దుర్దండిని మై
రావణసతి మనిచి మనుము రాక్షసనాథా!" 167ప.3ఆ
అని ఆదేశించుట మహోదాత్తము.

రాముడు "మన్నామము ప్రాణముం దగఁ బునర్భవ ముద్ధరించితి"వని (179ప.3ఆ.). కౌసల్య వడ్డింప హనుమంతుని "పొత్తున భుజియింపఁగా వలయు"నని సిద్ధము చేయ(187-189ప..3ఆ.) హనుమంతుడు "పళ్ళెరం బెత్తుకొని లేచి వెల్వడి శ్రీరామచంద్రు దివ్యప్రసాదంబునకు రారో" అని పిలిచి. సుగ్రీవాదులకు ప్రసాదము పంచిపెట్టి. అధికసమ్మర్దమయిన. అగస్త్యవృక్షమెక్కి పంచిపెట్టుట. రాముడు కపిసేనలోనికి వచ్చుట(190వచ.191ప.) భక్తిభావము తోపాటు హాస్యరసము చిలుకును. ఇది స్త్రీలపాటలయందు కలదు.

రసాతలములోని లంకారాజ్యమొక విచిత్రము. అది పంచాశద్యోజనవిస్తీర్ణము. అష్టాశీతియోజనాయితము. ఏడుకోట్ల శివాలయములు. మూడు లక్షల వీథులు. ఇనుపకోట. ఉక్కుకోట. వెండికోట. కోట కోటకు ఎనిమిదేసి గవనులు. రక్షకులు. రెండు కోట్ల ఏనుగులు. నాలుగు కోట్లు అశ్వములు. ఎనిమిది కోట్లు సైనికులు కలదట (12వచ.2ఆ.) మైరావణుని మరణరహస్యము మహావిచిత్రము. కరచరణకంఠఖండితుడయి చచ్చినను బ్రదుకును. పురములోని మహాబిలము. మహాబిలములోని గుహ. గుహలోని గుండు. ఏడుబిలములందు ఏడు తుమ్మెదలు. అవి ఒక్కసారి చచ్చిన మైరావణుడు మఱి బ్రదుకకుండ మరణించును. మైరావణుడు

రామలక్ష్మణులను అపహరించుట మొదలు మరణించువఱకు విచిత్రచరిత్రమే.

**చరిగొండ ధర్మన**: ఈతని కృతి చిత్రభారతము. ఎనుమలపల్లి పెద్దనకు అంకితము. అతడు చితాబుఖాను మంత్రి. (4-7;56ప.1ఆ.) చితాబుఖాను అసలు పేరు సీతాపతి. ఖాను పెట్టుపేరు. ఓరుగల్లు రాజ్యాధిపతి. రాజ్యకాలము[208] 1503-1512. చిత్రభారతము రచనాకాలము స్థూలముగ1510 వ సంవత్సరము.

కృతికర్త ధర్మన గురువు భట్టపరాశరప్రభురంగడు. (9ప.1ఆ.) తెనాలి రామ కృష్ణప్రభృతుల గురువు భట్టరు చిక్కాచార్యుల కాలము 1520-1590 అని పూర్వోక్తము. ఉభయులు తండ్రి కొడుకులని ఒక అభిప్రాయము కలదు.[209] ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

కృతిభర్త పెద్దన తండ్రికి. పెదతండ్రికి గురువు కందాళప్ప. (24ప.౩ఆ.) పాండురంగమాహాత్మ్యకృతిభర్త విరూరి వేదాద్రిమంత్రి. అతని శాసనములు1540-1545 ప్రాంతమునందు కలవని పూర్వోక్తము. అతడు, ఇతడు తాత మనుమలని ఒక అభిప్రాయము కలదు.[210] కావచ్చును.

ధర్మనశతలేఖిన్యవధానపద్యరచనాసంధాసురత్రాణబిహ్నితనా"ముడు.(10ప.1 ఆ.) "సకలవిద్యాపారీ"ణుడు. "శతఘంటసురత్రా"ణుడు. (ఆశ్వాసాంతగద్య) కృతిభర్త.

" కావున విచిత్రగతి నలంకారసరణి
మీఱ రసములు చిప్పిల మెప్పు లొసఁగఁ
దెనుఁగు గావింపు నా పేర ననఘసుకవి
ధీరు లరుదందఁ గాఁ జిత్రభారతంబు" 11ప.1ఆ.)

అని కృతికర్తకు ఆనతిచ్చినట్లు కలదు. తెనుగు కావించుట అనగా ఆంధ్రీ కరించుట. కనుక చిత్రభారతము ఆంధ్రీకరణము కావలయును. కాని సంస్కృత చిత్రభారతకావ్యము జాడ కానరాదు. అయినను క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చయందు ఆతడే రచించిన చిత్రభారతనాటకమునుండి ఉదాహరించిన శ్లోకము కలదు.

" యథా మమ చిత్రభారతే నాటకే-
" నదీబృన్దోద్దామప్రసరసలిలాపూరితతనుః
స్ఫురత్ప్రోతజ్వాలానిబిడబడబాగ్నిక్షతజలః

న దర్పం నో దైన్యం స్పృశతి బహుసత్త్వోపతిరపా
మవస్థానాం భేదాద్భవతి వికృతిర్నైవ మహతాం."

ఇట "అత్ర పయోదవ్యపదేశేన యుధిష్ఠిరస్య సత్త్వోత్కర్షే ధీయమానే" అని క్షేమేంద్రుని స్వీయవ్యాఖ్యానము. ధర్మరాజు సత్కృతిని దర్పము నందలేదని. వికృతిని దైన్యము నందలేదని తాత్పర్యము. ఇది చిత్రభారతములోని ధర్మరాజునకు సంగతమగును. క్షేమేంద్రుని చిత్రభారతనాటకమునకు మూలము సంస్కృతచిత్రభారతమగును. అందు బ్రహ్మాండపురాణప్రసక్తి అవకాశము. అది ధర్మన చిత్రభారతమునందు కలదు. (75ప.1ఆ.) అంతేకాదు."అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన చిత్రభారతంబను మహాపురాణంబునకుఁ బ్రారంభమెట్టిదనిన" అని ధర్మన కథాప్రారంభము.(65వచ.1ఆ.) "చిత్రభారతంబను పురాణకథ" అని ఆశ్వాసాంతగద్యను కలదు. చిత్రభారతకథ బ్రహ్మాండపురాణకథ కాకపోయినను అట్లు సంస్కృతచిత్రభారతమునందు ఉండుట సంభవము. కావున ధర్మన చిత్రభారతము సంస్కృతచిత్రభారతమునకు ఆంధ్రీకరణమే కావలయును. అది స్వతంత్రాంధ్రీకరణమో. అస్వతంత్రాంధ్రీకరణమో. స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణమో అనిశ్చేయము.

చిత్రభారతపురాణకథ ప్రసిద్ధమైన గయోపాఖ్యానకథకు సమానము. అలతి భేదములు కలవు. 1. గయోపాఖ్యానమునందు గయుడు గంధర్వుడు. అతనికి గగనయానము గగనము కాదు. చిత్రభారతమునందు గయుని బదులు చతుర్థనుడు రాజు. గగనయానము గగనము. కనుక రంభాశాపవృత్తాంతము కలదు. 2. గయోపాఖ్యానమునందు గయుని ఉష్ఠీవనము. అర్ఘ్యమిచ్చు కృష్ణుని అంజలియందు పడును. చిత్రభారతమునందు చతుర్థనుని అశ్వఫేనము. అర్ఘ్యమిచ్చు కృష్ణుని అంజలియందు పడును. 3. గయోపాఖ్యానమునందు వేగవంతుని. అక్రూర సుభద్రల రాయబారములు కలవు. చిత్రభారతమునందు అక్రూర.సహదేవుల రాయబారములు కలవు. 4. గయోపాఖ్యానములోని యుద్ధమునందు అర్జునుడు వినా పాండవులు అందఱు మరణింతురు. చిత్రభారతములోని యుద్ధమునందు ధర్మరాజు వినా పాండవులు అందఱు మరణింతురు. 5. గయోపాఖ్యానమునందు శివుని ప్రమేయము కలదు. చిత్రభారతమునందు శివుని ప్రమేయము లేదు. ఇవి ప్రధానములైన భేదములు. ప్రధానకథ రెండిట సమానము.

చిత్రభారతమునందు పారిజాతాపహరణవృత్తాంతము కలదు. అందు నంది

తిమ్మన పారిజాతాపహరణప్రబంధములోని పాదతాడనఘట్టము లేదు.

చిత్రభారతమునందు ఉషాపరిణయవృత్తాంతమును కలదు. ఇదే చిత్రభారతములోని శృంగారఘట్టము. ఈ రెండు వృత్తాంతములు ప్రధానకథకు పరిపోషకములు కావు. ప్రసక్తానుప్రసక్తములు.

చిత్రభారతమునందు వర్ణనములు బహుళము. అవి : నైమిశారణ్యవర్ణనము (67వచ.68ప.1ఆ.) పాతాళలోకవర్ణనము (85-90ప.1ఆ.) పురవర్ణనము (91వచ.1ఆ; 52-56,61-62,71,78-79,82ప.4ఆ.) గ్రీష్మాదివసంతపర్యంతఋతువర్ణనము(3-9,13-22 ,94-104ప.2ఆ.; 25-32ప.3ఆ.) వనకేళీవర్ణనము (115-154ప.2ఆ.) సరోవర్ణనము (3-8ప.3ఆ.) జలకేళీవర్ణనము (10-23ప.3ఆ.) స్త్రీవర్ణనము(64-71,82-85ప.2ఆ;41-71ప.3ఆ.) రాజవర్ణనము (110,111ప.3ఆ;3-14ప.4ఆ.) మృగయావర్ణనము (112-151ప. 3ఆ.) అశ్వవర్ణనము (157-158ప.3ఆ.) నదీవర్ణనము (88,90ప.1ఆ.;41-43,91ప.4ఆ.) నగవర్ణనము116ప.4ఆ.) సభామందిరవర్ణనము (58-59,68,93-95ప.4ఆ.) విరహవర్ణనము (110-118ప.5ఆ.) రతివర్ణనము (143-147ప.5ఆ.) దౌహృదవర్ణనము (149ప.5ఆ.) మంత్రాంగవర్ణనము (2-28వచ.6ఆ.) దూత్యవర్ణనము(49-86,96-102,124-168పప.6ఆ.) సూర్యాస్తమయవర్ణనము (103ప.6ఆ.) సాంధ్యరాగవర్ణనము (104-105ప.6ఆ.) నక్షత్రవర్ణనము (106ప.6ఆ.) అంధకారవర్ణనము (107ప.6ఆ.) చంద్రోదయవర్ణనము (108-111.6ఆ.) చంద్రికావర్ణనము (112-113ప.6ఆ.) సూర్యోదయవర్ణనము (118-121ప.6ఆ.) ప్రయాణవర్ణనము (29-40ప.6ఆ.;2-9,15-19ప.7ఆ.) యుద్ధవర్ణనము (30,45,47-155ప.7ఆ.; 3-83ప.8ఆ.) అష్టాదశాదివర్ణనములివి సంస్కృతమహాకావ్య లక్షణములు. సంస్కృతచిత్రభారతములోని వర్ణనములు ధర్మన చిత్రభారతమునందు ఆంధ్రీకరణములు కావచ్చును. హర్షనైషధములోని వర్ణనములు శృంగారనైషధము నందు వలె. అనుపలబ్ధమైనంతమాత్రమున సంస్కృతచిత్రభారతము ప్రాగభావము కాజాలదు.

చిత్రభారతమునందు చిత్రమైన పద్యములు కలవు.

> " ఘనరావంబు చెలంగ భృంగి వినుతుల్ గావించి పాడంగఁ గా
> ననమం దెచ్చటఁ నీలకంఠవిలసన్నాట్యంబు రంజిల్లెఁ దా
> ఘనరావంబు చెలంగ భృంగి వినుతుల్ గావించి పాడంగఁ గా
> ననమం దెచ్చట నీలకంఠవిలసన్నాట్యంబు రంజిల్లదే." 119ప.2ఆ.

అది వర్షాగమము. మేఘము గర్జింపగా, ఆడు తుమ్మెద ప్రశంసలు సేసి పాడగా, అడవియం దంతట నెమలి విలాసనాట్యము రంజిల్లినదని పూర్వార్ధమునకు అర్థము. ఢమరుకము మ్రోగగా, భృంగి అను ప్రమథుడు నమస్కారములు సేసి పాడగా, (కైలాసగిరిమీది) అడవియందంతట శివుని విలాసనాట్యము రాజిల్లదా? అని ఉత్తరార్ధమునకు అర్థము. మొదటి అర్థము విశేషము. రెండవ అర్థము సామాన్యము. సామాన్యవిశేషములందు సమానశబ్దములు కలవు. కాని భిన్నార్థములు కలవు. సామాన్యమునందు శ్లేష లేదు. విశేషమునందును శ్లేష లేదు. సామాన్యవిశేషోభయ మునందు శ్లేష కలదు. ఇది చిత్రము.

" కూరిమితోడఁ జేరి నలకూబరు నంతటివాఁడు మత్పదాం
భోరుహలాక్ష కుంకుమము బొట్టుగఁ గైకొని యెల్లవేళలం
గారబ మెచ్చరింపఁ దన కౌఁగిటిలోపల నిద్రఁ బొల్పుగాఁ
గూరుకుచుండు నాకు వెడగుఱ్ఱపు రూపము వచ్చె దైవమా" 95ప.ఆ.

తుల్యముని తపోభంగము సేయుటకు వచ్చిన రంభను గుఱ్ఱము కమ్మని శపించును. దారుణమైన శాపమునకు గుఱియైనను రంభకు దంభము తగ్గలేదు. కుబేరుని కుమారుడైన నలకూబరుడు ప్రియుడు. రంభ ప్రేయసి. ఈ ప్రేయసీప్రియుల ప్రేమ భావకవుల భావనాశక్తికి అందనిది. రంభ పాదములందలి లత్తుకను నలకూబరుడు నొసట కుంకుమతిలకముగ దిద్దుకొనునట! అది నిజమే కావచ్చు. అశ్వమగుచును రంభ అతిశయమును మానలేదు. చిత్రమే.

" శూరులు కొంద ఱుద్దవిడిఁ జొచ్చి నిలింపవధూగృహంబులం
జేరిన సోమయాజులను జిందఱ వందఱగా నదల్చినం
దొరపుఁ గయ్యమైన యెడ దూఱి రసజ్ఞులు కొందఱచ్చటన్
ధీరత నీల్చి యా తగవు దీర్పఁగఁ జూచె విభుండు నచ్చటన్." 53ప.4ఆ.

సోమయాగఫలము స్వర్గసుఖము. వీరమరణఫలమును స్వర్గసుఖమే. సోమయాగములు చేసి అప్సరసల కవుగిళ్ల సుఖించు సోమయాజులను, వీరమరణము చెంది అందుకే వచ్చిన శూరులు బెదరించిన కయ్యమై, కొందఱు రసజ్ఞులు తగవు దీర్చుట చిత్రము. హాసజనకము. ఒక ఆధునికప్రహసనమునకు ఆద్యప్రకృతి వలె కలదు.

" సారథి కుంటియంట రథచక్ర మొకండఁట పాముపిండు దు
ర్వారపు రజ్జుసంఘమఁట వాహము లెన్నఁగ బేసియంట సం

చారతలంబు రిత్తయఁట సర్వము పొందుగఁ గూర్చి యెప్పుడున్
మేరువు చుట్టివారునఁట మిత్రచరిత్రము చిత్రమెంతయున్." 103ప.4ఆ.

సూర్యుని సారథి అనూరుడు. కుంటివాడు. సూర్యుని రథమునకు చక్ర మొకటే. తేరి పగ్గములు పాములు. గుఱ్ఱములు ఏడు. బేసి సంఖ్య. మార్గము శూన్యము. అన్నియును విలక్షణములే. అయినను సలక్షణముగ కూర్చి మేరుపర్వతము చుట్టును ప్రదక్షిణము చేయును. ఇట్టి మిత్ర (సూర్య) చరిత్రము మహాచిత్రమని పద్యమునందే కలదు.

ఉష విరహసరణియందు ఒక ఉజ్వలమణి:

"హారము భారమై మణిగణాకరబంధురసౌధరంగసం
చారము దూరమై తనువు సంగతి నొప్పెడు చందనాదిశృం
గారము క్రూరమై చెలియకైవడి నెమ్మి యొనర్చునట్టి రా
కీరము వైరమై నిగిడెఁ గేసరిమధ్యకు నొక్కపెట్టునన్." 116ప.6ఆ.

సహదేవుని రాయబారము సముదాత్తముగ సాగినది.

"మనమునఁ గోపగించకుము మాధవ చిత్తమునం దలంపుమీ
మనుజవిభుండు క్రొవ్వి యవమానముఁ జేసినవాఁడు కాఁడు మ
న్నన యొనరింపు దైవికమునం దురగాననఫేనమింత జా
ఱినఁ దెగనేల సర్వము నెఱింగిన దేవుఁడ వీ వెఱుంగవే."128ప.6ఆ.

అని ధర్మరాజు చెప్పుమన్నట్లు సహదేవుడు కృష్ణునికి సవినయముగ పలికెను. ఇంకను సహదేవుడు సవినయముగా నే పలుకును. కాని.

"నా సహాయంబు లేకున్న నరుఁడు నరుఁడు
నా సహాయంబు గలిగిన నరుఁడు హరుఁడు
ఇత్తెఱంగెల్ల భీష్మాదు లెఱిఁగి యెఱిఁగి
యేల చేసిరి యుప్పని బేల లగుచు." 145ప.6ఆ.

అని చక్రపాణి సీరపాణితో అనగానే, సహదేవుడు అదరిపడి " ఇట్లు పలుకును.

"ద్రోణుని పంపున ద్రుపదుఁ దెచ్చిన యప్పు
డబ్జాక్ష నీ సహాయంబు గొనెనొ
దారుణ మత్స్యయంత్రం బేయఁగా నప్పు

దబ్జాక్ష నీ సహాయంబు గానెనో
పాంచాలికై మహీపతుల గెల్చిన యప్పు
డబ్జాక్ష నీ సహాయంబు గానెనో
సింధుదేశాధీశు సైంధవుఁ గెల్చునాఁ
డబ్జాక్ష నీ సహాయంబు గానెనో
యేల యీ మాట లాడంగ నింద్రసూతి
యొక సహాయంబు గోరునే యుగ్రమైన
గాండివంబును గవదొనల్ పాండురాశ్వ
విమలరథమును దేవదత్తమును దక్క." 146 ప.6ఆ.

అర్జునుడు ద్రుపదమహారాజును పట్టి బంధించి తెచ్చినప్పుడు, మత్స్యయంత్రమును పడగొట్టి నప్పుడు, పాంచాలి కొఱకు మహీపతులను గెల్చినప్పుడు, అరణ్యవాసమునందు సైంధవుని గెల్చినప్పుడు, కృష్ణుని సహాయము లేనిమాట యథార్థమే. అవినయము కాదు. తదుపరి సహదేవుడు తమ పక్షములోని మహా వీరవరులను వర్ణించిన విధానమును పరనిందాపరాయణము కాదు. అయినను "సహదేవుపల్కులుముల్కులచందంబునఁ కృష్ణుని " కర్ణరంధ్రంబులు సోఁకిన"వి.

"తోఁకఁ ద్రొక్కిన భుజగేంద్రు వీఁక, నటులు
గుదిచి పెఱికిన సింగంబు కొదమ మాడ్కి
దండతాడన కుపితోగ్ర పుండరీక
భంగిఁ గృష్ణుండు రోషించి పలికె నిట్లు. 166.
వినవోయి మున్నొక చతు
ర్థనుఁ జంపెద నంటినిపుడు ధర్మతనయు నొ
క్కని డించి సంగరస్థల
మున నందఱఁ ద్రుంతుఁ జక్రమునఁ జిత్రగతిన్."167ప.6ఆ.

అని ప్రతిజ్ఞ సేయును. ఇది కృష్ణార్జునయుద్ధకారణము. కృష్ణుడు అర్జునుని చక్రమున త్రుంచుట చిత్రమే. కాబట్టి చిత్రభారతము.

మొత్తము మీద ధర్మన చిత్రభారతము మోదావహమగు కావ్యము.

**నాగలూటి శేషానాథార్యుడు**: ఈతని కృతి శ్రీపర్వతపురాణము క్షేత్రమాహాత్మ్యము. శ్రీశైలమల్లికార్జునస్వామికి అంకితము.

"శివజన్ముఁడ శివగోత్రుఁడ
శివలింగధ్యానపరుఁడ శీలవ్రతుఁడన్
శివపూజాపరతంత్రుఁడ
శివయోగసుధానుభవుఁడ శేషాహ్వయుఁడన్" పుట2.

"మల్లికార్జునగురుస్వామిన్ బ్రశంసించెదన్" (పుట3) అని మాత్రమే తెలిపెను. ఈతని ప్రసక్తి భద్రకవి లింగన పూర్వకవిస్తుతియందు కలదు. ఆతని కృతుల కాలములు 1525, 1530 ప్రాంతము. కాబట్టి శ్రీపర్వతపురాణము రచనాకాలము1510 ప్రాంతము కావచ్చును.

శ్రీపర్వతపురాణము శ్రీశైలక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకము."స్కాందపురాణసంహితలలోని పంచాదశాఖ్యానమునందు శ్రీగిరిమాహాత్మ్యము", "ముప్పదిరెండధ్యాయంబులందును పండ్రెండు వేయున్నూట గ్రంథంబును సనత్కుమారుండు వేదవ్యాసునకుం జెప్పిన శ్రీపర్వతమాహాత్మ్యంబు" అని గ్రంథమునందు కలదు. (పుట8.) శ్రీశైలక్షేత్రమునకు, కామధేనువునకు సాదృశ్యకల్పనము కలదు.

"పురుషార్థంబులు పాదముల్ శుభము తత్పుచ్ఛంబు తచ్ఛృంగముల్
గిరిశృంగంబులు రోమరాజి తరువుల్ గ్రేపుల్ దిదృక్షాపరుల్
వరపుణ్యంబులు దుగ్ధధారలు చతుర్ద్వారస్థలింగంబు లు
ద్ధురవక్షోజము లీ నగంబు నుతులొందున్ గామధేనుక్రియన్." పుట19.

పురాణమునందు పర్వతవృత్తాంతము, చంద్రవతీవృత్తాంతము;శిఖర, తీర్థ,లింగ,నదీ,సరోవర,ద్వార,వృక్షాదుల మహిమలు, ఫలములు; బిల్వవనప్రశంసలు; దండకములు, నిరోష్ఠ్యగద్య, అక్షరగద్య, రగడలు, సీసమాలిక మొదలైన స్తోత్రములు కలవు.

కవి శైలి ప్రౌఢమేకాని, కావ్యత్వసిద్ధి క్వచిన్మాత్రము.

"జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవికాసి తెనుం గభిరమ్య మంతకున్
గనుగొనఁ జూతబీజమున కంటెను గోమలపత్రపుష్పశో
భనవపల్లవాభినవబాలరసాలము సొంపు నింపదే." పుట4.

అను శేషనాథార్యుని ఆశయము ప్రశంసాపాత్రము.

**హరిభట్టు**: ఈతని కృతులు వరాహపురాణము. మత్స్యపురాణము. భాగవత షష్ఠైకాదశద్వాదశస్కంధములు. నారసింహపురాణము-ఉత్తరభాగము. సంస్కృత రతిరహస్యము.

వరాహపురాణము కంటముమెట్టు కరణము కొలిపాక ఎఱ్ఱయకు అంకితము. నరాంకితమైనను వరాహపురాణమునందు చరిత్రాంశము లేదు మత్స్యపురాణము శ్రీరంగనాథాంకితము. దైవాంకితము. భాగవతషష్ఠస్కంధము జగన్నాథాంకితము దైవాంకితము. ఏకాదశద్వాదసస్కంధద్వయము హనుమదంకితము. దైవాంకితము. ఉత్తరనారసింహపురాణమును హరిభట్టు కుమారుడు రాఘవమనీషి. హోవళి చిన ఓబళరాజు (నంద్యాల చినఓబళరాజు) మంత్రి ప్రోలుగంటి రంగయకు అంకితము చేసినట్లు కలదు. (51ప.1ఆ.) హోవళి చిన ఓబళరాజు శాసనములు 1547వ సంవత్సరమునందు ఎనిమిది. 1548 వ సంవత్సరమునందు ఒకటి మొత్తము తొమ్మిది కలవు.[211] కనుక ఉత్తరనారసింహపురాణకృతిసమర్పణకాలము1550 ప్రాంతము కావచ్చును. అది హరిభట్టు తదనంతర కాలము. కాబట్టి హరిభట్టు ప్రాభవకాలము పదునాఱవ శతాబ్ది పూర్వార్థమగును.

వరాహపురాణములోని అవతారికను హరిభట్టు తండ్రి రాఘవార్యుడని (16ప.1ఆ.) ఆశ్వాసాంతగద్యను "చంద్రనామాంకరామవిద్వన్మణి" అని కలదు. రామచంద్రుడగును. శ్రీకృష్ణదేవరాయలకాలమునందు 1513 వ సంవత్సరమున. "శ్రీమద్రఘుపతినాయకాచార్యులైన శ్రీవీరరామనాయకుల వారు శ్రీ భరద్వాజగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన శ్రీరామచంద్రభట్టోపాధ్యాయుల పుత్రులైన హరిభట్టోపాధ్యాయులకు" చిన్నపల్లె అను గ్రామమును దానము చేసినట్లు తామ్రశాసనము కలదు.[212] హరిభట్టు భరద్వాజసగోత్రుడు. ఆపస్తంబసూత్రుడు. యజుశ్శాఖాధ్యాయుడు. (16ప.1ఆ.వ.పు;1ఆ.ఉ.నా.పు.) కనుక ప్రతిగ్రహీత హరిభట్టోపాధ్యాయులు కవి హరిభట్టు కావచ్చును. కాబట్టి వరాహపురాణము రచనాకాలము స్థూలముగ 1515 వ సంవత్సరము కావచ్చును.

నంది మల్లయ. ఘంటసింగనల వరాహపురాణము. హరిభట్టు వరాహపురాణమును ఒకటి కాదు. రెండును భిన్నములు. అందు వరాహదేవుడు వక్త. భూదేవి శ్రోత. ఇందు రోమశముని వక్త. మార్కండేయముని శ్రోత. ఇది వరాహపురాణములోని పూర్వభాగము. కైవల్యఖండము. ఇందు వరాహ.నృసింహ.మత్స్య.కూర్మ. వామన.పరశురామ.శ్రీరామ.బుద్ధ.కల్క్యవతారకథలు కలవు. వరాహావతారకథ

సవిస్తరముగ, నృసింహావతారకథ నాతివిస్తరముగ, ఇతరావతారకథలు అతిసంగ్రహముగ కలవు. ఋశ్రవుని వృత్తాంతము. చోరోపాఖ్యానము. విష్ణువర్ధనోపాఖ్యానము. శివశర్మోపాఖ్యానము. మయూరధ్వజోపాఖ్యానమును కలవు. పూజావిధానములు. మాహాత్మ్యములు. స్తుతులు. ధర్మములు. రాజనీతులు. కర్మజ్ఞానధ్యానయోగములు. సృష్టిప్రళయములు. సూర్యచంద్రవంశములు. స్వర్గనరకములు మొదలైన పురాణసాధారణవిషయములు పుష్కలముగ కలవు. కతిపయవర్ణనములు కలవు. అవి: నదీవర్ణనము (2ప.1ఆ.) ఆశ్రమ వర్ణనము(3వచ.1ఆ.) వనవర్ణనము (7-10ప.1ఆ.) తపోవర్ణనము (18-21ప.2ఆ.) పాతాళ లోకవర్ణనము (46-49పప.2ఆ.) భూలోకవర్ణనము(51ప.2ఆ.) పర్వతవర్ణనము (52-55ప. 2ఆ.) లక్ష్మీవర్ణనము (136ప.2ఆ.) జగన్మోహినీవర్ణనము (143,144ప.2ఆ.) సూర్యాస్తమయవర్ణనము(148ప.2;195ప.5ఆ.) సంధ్యావర్ణనము (149ప.2ఆ.) అంధకారవర్ణనము (150ప.2ఆ;196ప.5ఆ.) నక్షత్రవర్ణనము (197ప.5ఆ.) చంద్రోదయవర్ణనము (152ప.2ఆ; 198ప.5ఆ.) ప్రభాతవర్ణనము (154,155ప.2ఆ.) యుద్ధవర్ణనము (160-176ప.2ఆ; 191-120ప.2ఆ.) యజ్ఞవరాహవర్ణనము(202ప.2ఆ.)

"శృంగారరసమునఁ జిలుమువోఁ గడిగిన
లలితసువర్ణశలాక యనఁగ
నమృతాంశుమండలంబున సానపట్టిన
కమనీయనవరత్నకళిక యనఁగ
ఘనసారమృగనాభికర్దమంబున దోహ
లంబొనర్చిన తటిల్లతిక యనఁగఁ
బటుసుధాజలమునఁ బదనిచ్చి చికిలిసే
యించిన వలరాజు హేతి యనఁగ
మథ్యమానపయోరాశిమధ్యమమున
నిందిరాదేవి పొడమె. యానంద మొదవ
విశ్వనిర్మాణపరు నరవిందనాభుఁ
దనర వరియించి లోకైకజనని యయ్యె." 136ప.2ఆ.

ఈదృశమైన కవిత్వము విరళము. వరాహపురాణము పురాణమే.

మత్స్యపురాణము హరిభట్టు రంగపతిని స్తుతించి, "దేవతాంతరనమస్కారంబు పరిత్యజించి" రచించినది. (4,7ప.కృత్యాది.వరాహపురాణము.అనుబంధము-2)

పేరునకు పురాణము. తీరునకు శాస్త్రము. మత్స్యపురాణము మొత్తము కాదు. మత్స్య పురాణఖండమైన విష్ణుధర్మోత్తరము.

"లలితమనోజ్ఞవర్ణసదలంకృతమై సరసాంతహృద్యమై
దళగణతుల్యమై శ్రవణధారణవాంఛితమై నవీనమై
నలఁ కువ నొంద నచ్యుతగుణప్రకరంబులతోడ యుక్తమై
పొలుపగు కావ్యపుష్పతతిఁ బూజ యొనర్చెద రంగభర్తకున్." 4ప.1ఆ.

అని హరిభట్టు తెలిపినను. నారాయణముని చెప్పినట్లు విష్ణుధర్మోత్తర విషయమిది :

"జగదుదయావ్యయంబులును సంసృతిలక్షణ మాత్మయోగమున్
భగవదుపాసనావిధియు భక్తివినోదము గర్మమార్గమున్
సగుణవిశేషముం దెలిపె నారదమౌనికిఁ బద్మజాక్షుఁ డ
ప్పగిదిని నీకుఁ దత్కథలు ఖ్యాతిగ నే వినిపింతు వేడుకన్." 36ప.1ఆ.

దేవలోపాఖ్యానము (45-112వచ.3ఆ.). పుండరీకోపాఖ్యానము (10-151వచ.4ఆ.) విష్ణుదత్తోపాఖ్యానము (172-175ప.4ఆ;2-44వచ.5ఆ.) కలవుగాని కావ్యపుష్పములు కావు. పురాణముకుళములే.

నారసింహపురాణము-ఉత్తరభాగము హరిభట్టుకృతమే కాని. అవతారిక ఆతని కొడుకు రాఘవమనీషికృతము. హరిభట్టు అంకితము చేయకపోవుట. రాఘవమనీషి ప్రోలుగంటి రంగయకు అంకితమిచ్చుట తన్నిమిత్తము.

" వినురాఘవమనీషిహనుమత్కృపారస
లబ్ధకవిత్వవిలాసమహిమఁ
దనరియేకాదశద్వాదశస్కంధము
లైనిఁగించె మీ తండ్రి ధీయుతుండు
హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుండు
రాజమాన్యుఁ డు కవిరాజనుతుఁ డు
నారసింహపురాణపౌరస్త్యభాగంబుఁ
జెదలువాడెఁ ఇన మొదలు సేయఁ
బ్రతిభ దటుకొత్త నుత్తరభాగ మిప్పు

డంధ్రభాషను వచనకావ్యం బొనర్చి
నా ప్రబంధంబు నా పేర నంకితముగ
నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య." 15ప.1ఆ

వచనకావ్యమన గద్యకావ్యము కాదు. పద్యగద్యకావ్యమే. వరాహపురాణము కూడ వచన కావ్యమనియే హరిభట్టు వ్యవహారము. (8వచ.1ఆ.వ.పు.) కానివద్యగద్య కావ్యము. నారసింహపురాణము-ఉత్తరభాగమును పద్యగద్యకావ్యమే. ఇది ఎఱ్ఱన నృసింహపురాణమునకు శేషగ్రంథముగ ఇందు కలదు. కాని కాదు. ఎఱ్ఱన నృసింహ పురాణమునందు ప్రహ్లాదుని బాల్యచరిత్రము కలదుగాని. అది అహోబల క్షేత్రమునకు ముడిపడినది. ఇందు ప్రహ్లాదుని యౌవనచరిత్రము కలదుగాని. ఏ క్షేత్రమునకు ముడిపడినది కాదు. అష్టాదశపురాణములలోని నృసింహపురాణమునందు ప్రహ్లాదుని యౌవనచరిత్రము కలదుగానిదానికి దీనికి సంబంధము లేదు. అందును. ఇందును ప్రహ్లాదుడు విష్ణువు మీదికి యుద్ధమునకు బయలుదేరునుగాని. అందుకు హేతువు అందు దేవతలు. ఇందు రాక్షసులు. వామనాసురుడు రాక్షసులచేత ప్రహ్లాదునికి సౌభాగ్యధన్యలైన కన్యలను సమర్పింపజేయును. బాల్యమునందు మహాభక్తుడైన ప్రహ్లాదుడు యౌవనమునందు మహారక్తుడగును.(90-162వచ.2ఆ.)

"హరిరూపదర్శనాయత్తంబులగు కన్ను
లతివల కుచములందంటి నిలిచె
విష్ణుకీర్తనములు విని చొక్కు వీనులు
తరుణుల గీతామృతముల నానెఁ
బురుషోత్తముని వేడ్కఁ బొగడుచుండెడు జిహ్వ
సమదాంగనాధరాస్వాద మెఱిఁగె
జలజాక్షు పదభక్తిఁ బులకించు నెమ్మేను
ప్రమదల పరిరంభణములఁ బొదలె
నిట్లు ప్రహ్లాదవిభుని సర్వేంద్రియములు
మాధవారాధనక్రియోద్బోధ ముడిగి
నిత్యయౌవనపూర్ణలౌ దైత్యదత్త
కన్యకలయందె యాసక్తిఁ గడలుకొనియె." 92ప.2ఆ.

కామపరవశుడైన ప్రహ్లాదుడు వామనాసురుని దుర్బోధను (3-139ప.3ఆ.) దేవతల మీద విరోధము వహించి. దండయాత్రకు బయలుదేరును. అంగరాజును.

ఇంద్రుని జయించి వైకుంఠముపై దాడి వెడలును. విష్ణుమాయను చీకటి తోచును. గాడ్పు వీచును.

" దూరోత్సారితవామనత్వముగ రోదోరంధ్రనీరంధ్రమై
యా రూపంబున నంధకార మధికంబై పర్వఁ దోడ్తోన గం
భీరధ్వానముతోడఁ బెల్లు విసరెం బెన్గాడ్పు భూమీరజో
ధారాసారపరంపరాస్థగితభూతవ్రాతదృక్పాతమై." 64ప.5ఆ.

విరించి ప్రయోగించిన బాణమునకు చీకటి మాయమై. గాడ్పు అదృశ్యమై; సూర్యుడు. చంద్రుడు. నక్షత్రములు కనిపించును. ప్రహ్లాదుడు శాంతుడై వాసుదేవ మహిమ తలంచి పశ్చాత్తాపమునొందును. (63-84ప.5ఆ.) విష్ణువు ప్రత్యక్షమగును. ప్రహ్లాదుడు పలుమాఱు ప్రణమిల్లి నుతించును. "హస్తివరదుండు హస్తమస్తక సంయోగము" సేయ. ప్రహ్లాదుడు గాఢభక్తుడగును. (85-89ప.5ఆ.) విష్ణువు ప్రహ్లాదునికి హరివాసరమహి..ు చెప్పును. (122-196ప.5ఆ.) "ప్రహ్లాదుం గౌఁగిలించుకొని మర్యాదోల్లంఘనంబు చేయకు విశృంఖలవృత్తి మత్తిల్లకు శాంతస్వభావంబున నభ్రాంతుడవై మహీమండలంబుఁ బాలింపుమని" పంపించును. (201వచ.5ఆ.).

ఎఱ్ఱన నృసింహపురాణములోని హిరణ్యకశిపుని మధుపానగోష్ఠి వలె. ఇందు ప్రహ్లాదుని మధుపానగోష్ఠి కలదు. (152-160వచ.2ఆ.) ఇంకను పురవర్ణనము (20-33వచ.2ఆ.) ఋతువర్ణనము (34-49ప.2ఆ.) సూర్యాస్తమయాదివర్ణనము (135-151వచ.2ఆ.) వర్షాకాలవర్ణనము (3-12ప.4ఆ.) యుద్ధవర్ణనము(171-194వచ.1ఆ; 151-182, 184వచ.3ఆ; 13-104ప.4ఆ;59ప.5ఆ.) కలవు. సూర్యోదయవర్ణనము విలక్షణము.

" రజనీపన్నగదష్టమూర్ఛితజగద్రక్షార్థమై పూని పం
కజమిత్రుండను తుండికుండు దశదిగ్భాగాంతరానోకహ
ద్విజకోలాహలమంత్రము ల్నుడువుచు న్వేగంబ మంత్రింప ని
ల్చె జలేశాంతరపూర్వభూధరమహాశృంగాగ్రపీఠంబునన్." 183ప.ఆ.

రాత్రి పాముగ. సూర్యుడు పాములవానిగ. పక్షుల కిలకిలధ్వనులు మంత్రములుగ రూపకము.

హరిభట్టు మత్స్యపురాణము కంటె మాత్రమేగాక. వరాహపురాణము కంటెను. నారసింహపురాణము-ఉత్తరభాగము- ఎఱ్ఱన నృసింహపురాణము వలె-

రీతిసుభగమైన, రసబంధురమైన స్వతంత్రకావ్యము.

**కూచిరాజు ఎఱ్ఱన:** ఈతని కృతులు మూడు. 1. కొక్కోకము. 2. పురాణ సారము. 3. సకలనీతికథానిధానము. మొదటిది కామశాస్త్రము. రెండవది పురాణము. అనుపలబ్ధము. మూడవది కథాకావ్యము. కొక్కోకము కుంటముక్కల మల్లమంత్రికి అంకితము. పురాణసారము కుంటముక్కల మల్లమంత్రి అన్న కొడుకు పినభైరవునికి అంకితమని సకలనీతికథానిధానమునందు కలదు. సకలనీతికథానిధానము పినభైరవుని ప్రేరణమున తిరుపతి వేంకటేశ్వరునికి అంకితము.

కుంటముక్కల మల్లమంత్రి గుఱించి సకలకథానిధానమునందు ఇట్లు కలదు.

" హరిపదధ్యానతత్పరుఁ డు చందలమహా
లక్ష్మీప్రసాదైకలబ్ధవరుఁ డు
రహి గజపతిమహారాయ లిచ్చిన సమం
చితమహాపాత్రప్రసిద్ధయశుడు
ఆజమాఖానరాయనిచేత నొడయఁ డై
వినుకొండదుర్గ మేలిన ఘనుఁడు
కృతివననిక్షేపపృథుతటాకాలయ
తనయాదిసప్తసంతానఘనుఁడు
మునిపరాశరగోత్రసంజనితుఁ డార్య
సేవ్యతిరువేంగళాచార్యశిష్యుఁ డనఘ
మంత్రి పెరుమాళ్లకొమ్మయ మనుమ యొబ
మంత్రి తెలగయ భైరవ మల్లమంత్రి." 18ప.1ఆ.

ఇందు "వినుకొండ"కు, "ఘనమన్నె" అను పాఠాంతరము కలదు. అనావశ్యకము. నాల్గవ సీసపాదములోని " కృతివననిక్షేపపృథుతటాకాలయ"కు, 'గుడి చెర్వు వర్ధిల్లు వడి వననిక్షేప", "గుడి చెర్వు నల్లిల్లు కృతివననిక్షేప" అను పాఠాంతరములు కలవు. మొదటి పాఠాంతరమునందు వర్ధిల్లు నల్లిల్లు కావచ్చును. కాని "వడి" అర్థరహితము. అంతేకాదు. సమాసము దుష్టము. రెండవ పాఠాంతరమునందు యతిమైత్రిభంగము కలదు. "తనయాది"లోని ఆదిశబ్దము వ్యర్థము. అంతేకాదు.. సమాసదుష్టము. కూడ. పయి పాఠమునందు లేని నల్లిల్లు ఆదిశబ్దముచేత గ్రాహ్యము. ఇంతకు కుంటముక్కల మల్లమంత్రి గజపతిరాజు మహాపాత్రుడు. ఆజమాఖానువలన వినుకొండ దుర్గమును ఏలిన వాడు. సప్తసంతానములు పడసిన వాడు. ఈ

కుంటముక్కల మల్లమంత్రి గుఱించి ఇంకను సకలనీతికథానిధానమునందు కలదు.

" మహమందు సురతాని మన్నింప నొడయఁడై
లీలతో దుర్గంబు లేలినాఁడు
గజపతిరాయల కరుణచే బెహరామ
హాపాత్రవిభవంబు లందినాఁడు
కర్ణాటభూపతి కప్పంబు వెట్టంగ
నయమతి రాజ్యంబు నడిపినాఁడు
మహిమతో నిట్టి సామంతరాయల రాజ్య
భారధౌరేయుఁడై ప్రబలినాఁడు
సన్నుతావాసజగదంబ చందలాంబ
తనకు నిలవేల్పుగా భువిఁ దనరినాఁడు
మంత్రిమాత్రుండె నీతినిర్మాణదేవ
మంత్రి- యా కుంటముక్కల మల్లమంత్రి."

ఇందలి " మహమందు సురతాని" బహమనీసుల్తాను రెండవ మహమ్మదుషా (1463-1482) అతడు వినుకొండ దుర్గమును జయించిన కాలము 1482 వ సంవత్సరము. అది 1484 వ సంవత్సరమునందు పురుషోత్తమగజపతి (1468-1497) అధీనమైనది. రెండవ మహమ్మదుషా ప్రతినిధి ఆజిమ్‌ఖాను.[213] అతడే ఆజాముఖాను. అతని వలన కుంటముక్కల మల్లమంత్రి వినుకొండ దుర్గమును ఏలిన కాలము 1482-1484. మల్లమంత్రికి మహాపాత్ర. బెహరామహాపాత్రవిభవము లిచ్చిన గజపతిరాజు. పురుషోత్తమగజపతి కావచ్చును. ప్రతాపరుద్రగజపతి (1497-1538) కూడ కావచ్చును. ప్రతాపరుద్రగజపతి అధీనమునందు వినుకొండదుర్గము 1514 వ సంవత్సరము వఱకు మాత్రమే కలదు. 1514 వ సంవత్సరమునందే వినుకొండదుర్గము విజయనగరసామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణదేవరాయలకు స్వాధీనమైనది. పయి పద్యమునందు మల్లమంత్రి"కర్ణాటభూపతి కప్పంబువెట్టంగ" రాజ్యము చేసినట్లు కలదు. కర్ణాటభూపతి అనగా విజయనగరసామ్రాజ్యాధిపతి. ఏ విజయనగరసామ్రాజ్యాధిపతియును. ఏ దుర్గాధిపతికిని కప్పము చెల్లింపవలసిన ఆవశ్యకము లేదు. కాని దుర్గాధిపతికి సామ్రాజ్యాధిపతికి కప్పము చెల్లింపవలసిన ఆవశ్యకము కలదు. కనుక"కప్పంబు వెట్టంగ" అనగా కప్పము విధింపగా అని కవిహృదయము కావలయును. మల్లమంత్రికి కప్పము విధించిన కర్ణాటభూపతి శ్రీకృష్ణదేవరాయలే అగును. కావున మల్లమంత్రి ప్రాభవకాలము స్థూలముగ1482-1515 కావలయును. అయిన

మల్లమంత్రి అన్నకొడుకు పినభైరవుని ప్రాభవకాలము స్థూలముగ 1502-1535 అగును.

పినభైరవునిగుఱించి సకలనీతికథానిధానమునందు ఇట్లు కలదు.

" ఇటువంటి కొండపల్లీ
పుటభేదనమంత్రిమకుటభూషణ మరిరా
ట్కటకవిభేదనఘటనో
ద్భటుండు కుంటముకుల పినభైరవుఁ డొప్పున్."

కొండపల్లి ఎటువంటిదో ముందొక సీసపద్యమునందు కలదు. అటువంటి "కొండపల్లీపుటభేదనమంత్రిమకుటభూషణ" మనగా కొండపల్లి దుర్గాధిపతి గాని, కొండపల్లి దుర్గాధిపతికి ముఖ్యుడైన సేనాధిపతి గాని అగును."అరిరాట్కటకవిభేదన "ము ప్రతాపరుద్రగజపతి అధీనములోని కొండపల్లి ముట్టడి అగును. అది 1516 వ సంవత్సరమునందు శ్రీకృష్ణదేవరాయలకు స్వాధీనమైనది. ఇది ప్రసక్తమైన సకలనీతికథానిధానము రచనాకాలము తదనంతరమగుట తథ్యము. కాబట్టి కూచిరాజు ఎఱ్ఱన కొక్కోకము రచనాకాలము 1510ప్రాంతము, పురాణసారము రచనా కాలము 1515 ప్రాంతము, సకలనీతికథానిధానము రచనాకాలము 1520 ప్రాంతము కావలయును.

సకలనీతికథానిధాన మనగా సమస్తనీతికథలకు నిధానమని అర్థము. కేతన దశకుమారచరిత్రము, మంచన కేయూరబాహుచరిత్రము, అనంతామాత్యుని భోజరాజీయము, జక్కన విక్రమార్కచరిత్రము, వెన్నెలకంటి అన్నయ షోడశకుమారచరిత్రము, పంచతంత్రము, భేతాళపంచవింశతి, కథాసరిత్సాగరము మొదలైన సంస్కృతాంధ్ర కథాకావ్యములలోని నీతికథలు సకలనీతికథానిధానమునందు కలవు. అంతేకాదు, కేతన దశకుమారచరిత్రములోని నూటపాతిక నీతిపద్యములు కలవు. బద్దెన నీతిశాస్త్ర ముక్తావళిలోని, వేములవాడ భీమన సుమతిశతకములోని నీతిపద్యములకు రూపాంతరములు కలవు.

" వాన సమస్తజీవుల కవశ్యము, ప్రాణము ప్రాణమైన య
వ్వానయుఁ బల్మఱుం గురియ వచ్చినఁ దిట్టుదు రెల్లవారలున్
హీనమనస్కులై యొరుల యిండ్లకుఁ బల్మఱుఁ బోవునేనియున్
మానిని కట్ల వచ్చు నవమానము నూనము మానభంగమున్." -నీ.శా.ము.

" ప్రాణంబు సకలజనులకు
వానయ యవ్వాన తఱుచు వచ్చినఁ దిట్టం
బూనుదురు గాన పరిచయ
మే నరునకునైన మానహీనతఁ జేయున్." 102ప.4ఆ.స.నీ.క.ని.
" తల నుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁక నుండు వృశ్చికమునకున్
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ"
" తేలునకు తోఁక విషమగు
వ్యాలమునకుఁ బండ్ల విషము వనమక్షికకున్
బోలంగ శిరము విషమగు
కాలిన ఖలునకు విషము కాయం బెల్లన్." 77ప.4ఆ.స.నీ.క.ని.
" కమలములు నీటఁ బాసినఁ
గమలాప్తుని రశ్మి సోకి కమలిన భంగిన్
దమ తమ నెలవులు దప్పినఁ
దమ మిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ"
" తమవారిఁ బాసినను ను
త్తమమిత్రుండైన మిగులఁ దాపము సేయున్
గమలంబు నీటఁ బాసిన
గమలాప్తుని వేఁడిచేతఁ గమలిన భంగిన్." 133ప.4ఆ.స.నీ.క.ని.

ఇందు బద్దెన. భీమనల పద్యముల సారళ్యము కూచిరాజు ఎఱ్ఱన పద్యములందు లేకపోవుట స్పష్టము. అనుకరణము వలని అనర్థకము.

కూచిరాజు ఎఱ్ఱనకు "నవఘంటాసుత్రామ, అవధానకవీశ్వర"బిరుదములుకలవు. (10ప.1ఆ.కా.)

**నాదిండ్ల గోపమంత్రి** : ఈతని కృతి కృష్ణార్జునసంవాదము. ద్విపద కావ్యము. కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు చంద్రిక అను వ్యాఖ్యానమును రచించెను. కృష్ణార్జునసంవాదము కొండవీడులోని రాఘవేంద్రస్వామికి అంకితము. దైవాంకితము. గోపమంత్రి తిమ్మరుసు మేనల్లుడు- అప్పమంత్రి అనుజుడు. కొండవీటి దుర్గాధిపతి. దుర్గాధిపత్యకాలము 1515-1533 అని కలదుగాని, 1531 వ

సంవత్సరమునందు రాయసం అయ్యపరుసు కొండవీటి సింహాసనాధ్యాసిగ శాసనప్రమాణము కలదు. ఇది పూర్వోక్తము. కాబట్టి గోపమంత్రి కొండవీటి దుర్గాధి పత్యకాలము 1515-1530 అగును. కృష్ణార్జునసంవాదమునందు గోపమంత్రి,

" .............................. కొండ
వీటికాభ్యంతరవిలసితయజ్ఞ
వాటికారాఘవేశ్వరునకు వరుసఁ
బ్రాకారగోపురప్రాసాదతతులు
ప్రాకటశిలఁ జూపట్టఁ గట్టించి
నలువుతోఁ జిత్రవర్ణములు గావించి
బలితంపు హేమకుంభంబు లెత్తించి
యలఘుధరశ్రీల కాస్పదం బగుచు
నలరి మయిదనవోలను పురోత్తమము
వినుతమహోత్సవవిగ్రహంబులను
బెనుపొంద వేడ్క నర్పించి ........"

కృతి రచించినట్లు కలదు. ఈ ధర్మకార్యములు 1520, 1522 వ సంవత్సర ములందు నిర్వహించినట్లు శాసనప్రమాణములు కలవు.[214] కావున గోపమంత్రి కృష్ణార్జునసంవాదము రచనాకాలము 1522 వ సంవత్సరము కావలయును.

కృష్ణార్జునసంవాదము కథకు సూత్రధారి సూతుడు. శ్రోతలు శౌనకాదిమహాము నులు. కాని మహాభారతములోని కథ కాదు. చిత్రభారతములోని కథ సదృశమే కాని, మూలము కాదు. మూలము మృగ్యము. చిత్రభారతకథకు, కృష్ణార్జునసంవాదకథకు భేదములు పూర్వోక్తము. కృష్ణార్జునుల ప్రతిజ్ఞలు, అక్రూరుని రాయబారము, యుద్ధము సమానము.

కృష్ణార్జునసంవాదము ద్విపదకావ్యము. అది కూడ లఘుకావ్యము. కథా భాగము 701 ద్విపదలందు కలదు. కావ్యము కథాప్రధానము. ద్వారకాపురవర్ణనము, రాత్రివర్ణనము, సుభద్రవర్ణనము యుద్ధవర్ణనము వినా వర్ణనములు లేవు. రాత్రివర్ణనము సంగ్రహముగ; నూతనసరణిని కలదు.

" కరమొప్ప నల శీతకరు రాకఁ గోరి
తరణి యన్ భేరి మోదమున చాటించి

పనివడి యపరదిగ్భామ మ్రోయించె
ననఁ బశ్చిమాంబుధి నర్కుండు గ్రుంకె
ఆ రాజు రాకకు యామినీరమణి
కోరి యంబర మను కొలువుకూటమున
గట్టిగాఁ గెంబట్టు గట్టిన మేలు
కట్టన నెఱసంజ గనుపట్టె నట్టి
వనజాసనుని దిశావళి నిండినట్టి
వనజాక్షగుణమణుల్ వాసించుటకును
గలియంగఁ జల్లిన కస్తూరి యనఁ గ
నలమె భూతలమెల్ల నంధకారంబు
హరికీర్తిదుగ్ధాబ్ధి దడరు తుంపురుల
వరుసను దార లంబరమున నింకె
బంధురాంబరసతీపాణిపంకేజ
గంధోత్తమాపూర్ణకమనీయపద్మ
రాగహారం బన రమణమై యుదయ
రాగంబుతో నుడురా జుదయించె." 82-90ద్వి.

వేగవంతుని రాయబారము ప్రభుసమ్మితముగ కలదు. అక్రూరుని రాయబారము సుహృత్సమ్మితముగ కలదు. సుభద్ర రాయబారము కాంతాసమ్మితము.

"ప్రాణప్రదంబైన పద్మాక్షు విడిచి
ప్రాణేశ! గయునిఁ జేపట్టిన మేలె?
బెదరి మీఁ దెఱుఁగక పేరోడ విడిచి
పదరు బట్టిన నెట్టి పడుదయ్య చూడ?
ఎందునుఁ బెరటి చె ట్టెవ్వరికైన
మందు గాదను మాట మఱి నిజం బయ్యె
ఎన్నండు నెచ్చోట నే పని పట్ల
నిన్ను నేమఱఁ డు కంటికి ఱెప్ప పగిది
చుట్టఱికం బెల్లఁ జూరఁ బో విడిచి
పట్టి పాలార్చెదు ప్రతిన సారెకును
కటకటా! మన కేడుగడయు కృష్ణుండు
ఎటువలె వచ్చె నేఁ డిటు బుద్ధి నీకు" 379-346ద్వి.

అని సుభద్ర పలికి "గయునిం బుత్తెమ్ము" అని ముగించును.

కృష్ణార్జునసంవాదమన కృష్ణార్జునయుద్ధము. కృష్ణార్జునుల పరస్పరాధిక్షేపము కాదు. ఒక్క సుయోధనుడు మాత్రమే ఇందు కృష్ణుని అధిక్షేపించును.

" కోపింప గోపాలకుల మూఁక గాదు
చూపట్టు ప్రతిభటస్తోమంబు గాని
విన గోపికాగీతవినతులు గావు
తనరిన హయహేషితంబులు గాని
సరి నెక్కఁ కేలికాచలములు గావు
సరభసమత్తకుంజరములు గాని
మెట్టఁ గాళియఫణి మే నిది కాదు
దట్టంపు రథసముత్కరములుగాని
మలయ బృందావనమార్గంబు గాదు
బలువైన సంగ్రామపద్ధతి గాని
గోపాల నీకేల ఘోరయుద్ధంబు
భూపాలుఁ డవు గావు పొమ్మని యేసె" 514-519ద్వి.

ఇది దుర్యోధనునికి పాత్రోచితము. పాండవులకు పాత్రోచితము కాదు. ప్రత్యధిక్షేపము కృష్ణునికిని పాత్రోచితము కాదు. పాత్రౌచిత్యము, పౌరాణికప్రతిపత్తి కల గోప మంత్రి కృష్ణార్జునసంవాదము లఘుకృతి అయినను అలఘుద్యుతి.

**చింతలపూడి ఎల్లన** : ఈతని కృతులు రాధామాధవము, తారకబ్రహ్మ రాజీయము, విష్ణుమాయానాటకము.

రాధామాధవము కృష్ణాంకితము. అవతారికను శ్రీకృష్ణదేవరాయల ప్రసక్తి కలదు.

" రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రృప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవనామ మందిన జగత్ప్రఖ్యాతచారిత్రుఁ డన్." 30ప.1ఆ.

ఎల్లన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి కాదు. అష్టదిగ్గజకవులలో ఒకడని

జనశ్రుతి అయినను లేదు. బహుశః ఎల్లన శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము తుదిని. శ్రీకృష్ణదేవరాయలకు రాధామాధవము వినిపించి. భూషణశ్రేణితో రాధామాధవ నామము నందియుండును. కావున రాధామాధవము రచనాకాలము1524 వ సంవత్సరము కావచ్చును.

తారకబ్రహ్మరాజీయము రామాంకితము. అవతారికను అచ్యుతదేవరాయల ప్రశంస కలదు.

" తిరువళి గెల్చి పాండ్యనరదేవునిఁ బట్టము గట్టి యుత్కళే
శ్వరుఁ గరుణించి మ్రొక్కిన సవాయికిఁ దా నభయం బొసంగి పెం
పరుదుగఁ గీర్తి చేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
తిరముగనున్న నంజవిభుతిమ్మరుసుం దగుఁ బ్రస్తుతింపఁ గన్." 17ప.1ఆ.

అచ్యుతదేవరాయలు 1530 లో ఉత్కళేశ్వరుడు ప్రతాపరుద్రగజపతిని. గోలకొండ సులతాను కులీకుతుబ్‌షాను ఓడించి. తదుపరి తామ్రపర్ణీనదీతటమునం దలి తిరువడి యందు విజయస్తంభమును. పాండ్యరాజును ప్రతిష్ఠించెను.[215] కావున తారకబ్రహ్మ రాజీయము రచనాకాలము1532 వ సంవత్సరము కావచ్చును.

విష్ణుమాయానాటకము కృష్ణాంకితము. అవతారిక లేదు. ఆశ్వాసాదిపద్యములు రాధామాధవములోనివే కలవు. ద్వితీయ. చతుర్థాశ్వాసాదిపద్యములు సమానము. తృతీయ. పంచమాశ్వాసాదిపద్యములు వ్యత్యస్తము. ఆశ్వాసాంతపద్యములు భిన్నము. ఆశ్వాసాంతగద్య రాధామాధవమునందు వలెనే కలదు. తారకబ్రహ్మరా జీయమునందు అలతి మార్పు కలదు. "సుకవివర్య" అను చోట "శుద్ధసారస్వతవిభవ" అని కలదు. "ఎల్లనార్య" అని లేదు. కడమ సమానము. విష్ణుమాయానాటకమునకు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు రెండు కాగితపు ప్రతులు కలవు. రెండును సమగ్రములు. రెండిట అయిదు ఆశ్వాసములందును ఆశ్వాసాంతగద్య సమానము. ఎల్లన పరము. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందు తాళపత్రప్రతి కలదు. అసమగ్రము. తొంబది తాళపత్రములకు నలుబది తాళపత్రములు లేవు. ఉన్న ద్వితీయాశ్వాసాంతగద్యను కర్తృవిషయము కానరాదు. పంచమాశ్వాసాం తగద్య ఇట్లు కలదు.

" ఇది శ్రీమదనగోపాలవరప్రసాదలబ్ధకవితావిలాస భరద్వాజ-
గోత్రపవిత్ర అయ్యలామాత్యపుత్త్ర అనంతయనామధేయప్రణీతం

బైన విష్ణుమాయానాటకంబను మహాప్రబంధంబునందు-"

ఇది నిమిత్తముగ విష్ణుమాయానాటకము చింతలపూడి ఎల్లన కృతము కాదని. మడికి అనంతయకృతమని ఒక అభిప్రాయము కలదు.[216] శ్రీనాథకృతమని మఱొక అభిప్రాయము కలదు.[217] ఎల్లనకృతమని మఱొక అభిప్రాయము కలదు.[218] మడికి అనంతయ భరద్వాజగోత్రపవిత్రుడే. అయ్యలామాత్యపుత్త్రుడే. మడికి సింగన అనుజుడు. అతడు "కవి" అని మడికి సింగన కృతులందు లేదు. పయి ఆశ్వాసాంత గద్యను "మడికి" అని లేదు. మఱొక భరద్వాజగోత్రపవిత్రుడైన. అయ్యలామాత్య పుత్త్రుడైన అనంతయ కూడ విష్ణుమాయానాటకము రచించిన. పయి ఆశ్వాసాంతగద్య లేఖకప్రమాదము కావచ్చును. అంతేకాదు. రాధామాధవములోని పద్యములు విష్ణుమాయానాటకమునందు కలవు.

" మానవారాకరోన్మాథిమందరంబు
ధైర్యకందళనిశితకుద్దాలధార
మాంద్యకంచుకకర్తరిమహితబోధ
వనజచంద్రిక యీ యింతి వాలుఁజూపు. 225
లలితనీలమణిశలాక నారను పేర
నిలిపెఁగాక నలువ నిలుపఁడేని
గురునితంబబింబ కుచకుంభభరమున
వెలఁది యసదు నడుము విఱుగకున్నె." 226ప.4ఆ.రా.మా.
" లలితనీలమణిశలాకయో నూఁగారు
నిలిపెఁ గాక నలువ నిలుపకున్న
గురునితంబబింబ కుచకుంభభరమున
వెలఁది యసదు నడుము విఱుగకున్నె. 179.
మాననీరాకరోన్మాథిమందరంబు.
ధైర్యకందనిశాతకుద్దాలధార.
మర్మకంచుకకర్తరి. మహితబోధ
వనజచంద్రిక. యీ యింతి వాలుఁజూపు." 180ప.5ఆ.వి.మా.నా.
" అమృతాంశుఁ డెంత దానముఁ దా నొనర్చెనో
పొలఁతి నెమ్మోముతోఁ బోల్పఁ బడియె
నళు లెట్టి పుణ్యాటవుల నిష్ఠ మెలఁగెనో
యింతి పెన్నెరులకు నీడు వడసెఁ

దమ్ము లెన్నెన్ని తీర్థమ్ములఁ దోఁగెనో
సతి క్రాలుఁ గన్నుల సాటి నొందె
గజము లే క్షేత్రమార్గముల వర్తించెనో
చెలువ నడకు సరిచెప్ప నొప్పెఁ
గాంచనము భూమి నేమి సత్కర్మములకు
వచ్చెనో చామ మైచాయ వన్నె కెక్కెఁ
జిలుక లే సత్యవాక్యముల్ పలికె ననియొ
యబల మధురోక్తులకు సవతయ్యె నిపుడు." 310ప.4ఆ.రా.మా.
" అమృతాంశుఁ డెంత దానము లా నొనర్చెనో
పొలఁతి నెమ్మోముతోఁ బోల్పఁ బడియె
నళు లెట్టి పుణ్యాటవుల నిష్ఠ మెలఁగెనో
యింతి పెన్నెఱులకు నీడు వచ్చెఁ
దమ్ము లెన్నెన్ని తీర్థంబులఁ దోఁగెనో
సతి క్రాలుఁ గన్నుల సాటి నొందె
గజము లే క్షేత్రమార్గముల వర్తించెనో
చెలి నడకకు సరి చెప్పవలసెఁ
గాంచనము భూమి నేమేమి కర్మములకు
వచ్చెనో చాన మైచాయ వన్నె కెక్కెఁ
జిలుక లే సత్యవాక్యముల్ పలికినవియొ
యబల మధురోక్తులకు సవతయ్యె నిపుడు." 181ప.5ఆ.వి.మా.నా.

ఇవి -తిక్కన ఉత్తరరామాయణములోని పద్యములు మహాభారతమునందు; శ్రీనాథుని హరవిలాసములోని పద్యము భీమేశ్వరపురాణమునందు, కాశీఖండములోని పద్యము శివరాత్రిమాహాత్మ్యమునందు వలె, ఎల్లన రాధామాధవములోని పద్యములు విష్ణుమాయానాటకమునందు అవృత్తములైనవి. కాబట్టి విష్ణుమాయానాటకము చింతలపూడి ఎల్లనకృతమే.

రాధామాధవము రచనాకాలము1524 వ సంవత్సరము. తారకబ్రహ్మరాజీయము రచనాకాలము 1532 వ సంవత్సరము కావచ్చును గాన, విష్ణుమాయానాటకము రచనాకాలము 1540 వ సంవత్సరము కావచ్చును.

రాధామాధవమునందు ఎల్లన వాల్మీకిని, వ్యాసుని (8,9ప.1ఆ.) స్తుతించిన

అనంతరము. కాళిదాసుని(11ప.1ఆ.) స్తుతించుటకు పూర్వము జయదేవుని స్తుతించెను.

" నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పిన విద్యా
చతురానను నీలాచల
పతిహితు జయదేవసుకవిపంచప్రదరున్." 10ప.1ఆ.

ఇందు విద్యాచతురాననుడు. నీలాచలపతిహితుడు. సుకవిపంచప్రదరుడును అయిన జయదేవుడు రాధామాధవము రచించినట్లు ఇదమిత్థముగ కలదు. అంతేకాదు. ఎల్లన "ఒక్క ప్రబంధము రచియింపం గోరి వితర్కించుచున్న సమయంబున(17వచ.1ఆ.) రాధతోపాటు ప్రత్యక్షమైన ప్రసన్నమదనగోపాలమూర్తి.

" మదీయలీలారూపకేళివిహారణలక్షణక్షమంబును
సరసహృదయంగమంబును నగు రాధామాధవం బస్మన్మనో
హరంబగు శృంగారకావ్యం బది మదంకితంబుగాఁ జెప్పుము"

అన్నట్లు కలదు. (2వచ.1ఆ.) ఇందలి రాధామాధవము జయదేవుని రాధామాధవమే అగును. పద్మావతీచరణచారణచక్రవర్తి అయిన జయదేవుడు విద్యాచతురాననుడే. నీలాచలపతిహితుడే. సుకవిపంచప్రదరుడే.(సుకవిమన్మథుడు) అతని గీతగోవిందము రాధామాధవలీలారూపకేళివిహారణలక్షణక్షమమే. సరసహృదయంగమమే. శృంగారకావ్యమే. కాని ఎల్లన రాధామాధవము తదనుసారి కాదు. మఱొక జయదేవుని శృంగారమాధవీయచంపువు. ఎల్లన పేర్కొన్న రాధామాధవమగునేమో? అన్వేషణీయము.

ఎల్లన రాధామాధవములోని ప్రధానకథాక్రమము శ్రీనాథుని శృంగార నైషధమునకు. పోతన భాగవతములోని రుక్మిణీకల్యాణమునకు అనుకరణము వలె కలదు. అది జయదేవుని రాధామాధవమునందు రుక్మిణీకల్యాణమునకు అనుకరణము కావచ్చును. భాగవతమునకు వక్త శుకమహర్షి. శ్రోత పరీక్షిన్మహారాజు. ఎల్లన రాధామాధవమునకును వక్త శుకమహర్షి. శ్రోత పరీక్షిన్మహారాజు. కాని. భాగవతమునందు రాధ ప్రసక్తి లేదు. రాధామాధవములోని రాధామాధవుల ప్రేమ నలదమయంతుల ప్రేమ వలె వినుకలి. నలదమయంతుల నడుమ హంస రాయబారము నడిపినది. రాధామాధవుల మధ్య నారదుడు. మధురవాణి పేర

సరస్వతి రాయబారములు నడిపిరి. నలదమయంతుల విప్రలంభశృంగారము వలె రాధామాధవుల విప్రలంభశృంగారము కలదు. దమయంతీస్వయంవరము వలె రాధాస్వయంవరము కలదు. స్వయంవరసమాగతరాజకుమారులను దమయంతికి సరస్వతి పరిచయము చేసినది. రాధకు సరస్వతిపెంపుడు చిలుక పరిచయము చేసినది. నలదమయంతుల వివాహము వలె రాధామాధవుల వివాహము కలదు. నలదమయంతుల సంభోగశృంగారము వలె రాధామాధవుల సంభోగశృంగారము కలదు. రుక్మిణీకల్యాణమునందు విప్రుని రాయబారము వలె రాధామాధవమునందు ముకుందిని రాయబారము కలదు. రుక్మిణి సోదరుడు వలె రాధ సోదరుడు భద్రకుడు కలడు. అట రుక్మి. ఇట భద్రకుడు కృష్ణునిచేత పరాభవింపబడుదురు. ఇట్లు రాధామాధవములోని ప్రధానకథాక్రమము నైషధమునకు. భాగవతమునకు ప్రతి బింబప్రాయము.

రాధామాధవమునందు రాధ స్వీయ. సహస్రగోపుని తనయ. సహస్ర గోపుడు "వీరమాహేశ్వరాచారపారీణుడు." (137ప.1ఆ.) మహావీరశైవుడు. (52వచ.3ఆ.) శివుని ప్రమేయము వలన లక్ష్మి సహస్రగోపుని తనయ రాధగ అవతరించును.(88వచ. 115ప.1ఆ.) నారదుడు కావించిన రాధావర్ణనము (147-166ప.1ఆ.) ఆపాదమస్తకముగ కలదు. అది దేవతాస్త్రీసూచకము. ఇట్టి రాధ అర్వాచీనాంధ్రకృతులందు పరకీయ! రాధామాధవమునందు రాధ మనోభిప్రాయమిది:

> " సందడిఁ బర్వు కోరికలు సారెకు సారెకు నభ్రవీచికా
> బృందములట్లు డెందమునఁ బెల్లయి యుబ్బఁ గ బాల్యవృత్తిమై
> నందని మ్రానిపండులకు నఱ్ఱులు సాపఁ గఁ బోవు భంగి నో
> యిందునిభాస్య! శౌరి వరియించు తలంపుననున్న దాన నేన్. 87ప.2ఆ.

మాధవుని మనోవ్యథ ఇది:

> " ఎప్పుగిదిన్ వరింతుఁ దరళేక్షణ; నే గతిఁ బెండ్లియాడుదున్
> గప్పురగంధి; నే కరణిఁ గంజనిభాననఁ జెట్టవట్టుదున్.
> నిప్పులువోని దర్పకుని నిష్ఠురశాతశిలీముఖావళుల్
> గుప్పునఁ గూర చొచ్చెఁ గలగుండువడె న్మది యింక నెట్లొకో"21ప.2ఆ.

రాధ మాధవుని స్వయంవరమున వరించినది. మాధవుడు వివాహమాడెను. రాధామాధవములోని రాధామాధవశృంగారము దాంపత్యశృంగారము.

శృంగారరసము తోపాటు వీరరసము. హాస్యరసము రాధామాధవమునందు కలవు. కృష్ణుడు హలగ్రీవుడను రాక్షసునితోను. మత్సరగ్రస్తులైన రాజులతోను చేసిన యుద్ధము వీరరసబద్ధము. కృష్ణుడు భద్రకునికి చేసిన పరాభవము హాస్యరసలాస్యము. కృష్ణుడు వికటనారీగర్భమను బాణము నేసిన. భద్రకుడు-

" ఎక దిగఁ బాఱిన చన్నులు
బికిబికి వెండ్రుకల కొప్పు చిఱుతపిఱుందుల్
వికటపు మోగుం గలిగిన
కొకిబికి యంగమున నొక్క గోతై నిలిచెన్. 108.
కన్నులార్పుచుఁ గొన్ని సన్నలు గావించుఁ
దీఁగె నవ్వులు నవ్వి దిస్స వాఱుఁ
బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
నఱుతఁ బేరులు చక్క నలవరించు
గాజుల చప్పుళ్లు ఘలఘల మనఁ జేయుఁ
గొనగోళ్ల నందంద కురులు దిద్దు
నేలపాటల నెల్ల సించుకించుక పాడుఁ
దగవు మాటల జాణతనము లాడు
సిగ్గువడు దిట్టతనముల చేగ చూపుఁ
బాయుఁ గడు డాయు మఱియును బహువిధములఁ
జేష్ట లొనరించు నా యింతి సేన నడుమ
హాస్యరస మొక్క రూపమైనట్టి భంగి." 112ప.5ఆ.

మొత్తము మీద రాధామాధవము రసవత్తరమైన కావ్యము. వర్ణనాభూయిష్ఠము. సముద్రవర్ణనము (61-64వచ.1ఆ.) పురవర్ణనము(65-76ప. 1ఆ; 75-101వచ.3ఆ.)భవన వర్ణనము (78వచ.1ఆ; 52వచ.2ఆ.) విష్ణువర్ణనము (79-80ప.1ఆ.) శివవర్ణనము(82ప.1ఆ. 56-58,59ప.3ఆ.)నాయకవర్ణనము (99-101ప.1ఆ;102-113,134ప.3ఆ.) నాయికావర్ణనము (119-121,136-138,146-166ప.1ఆ.;55-61,1(4ప.2ఆ.) నాయికావిరహవర్ణనము (4-21ప.2ఆ.) సరస్వతీవర్ణనము (24,50ప.2ఆ.) వసంతవర్ణనము (117ప.2ఆ.) వనకేళీవర్ణనము (118148ప.2ఆ;136-144వచ.5ఆ.) శిశిరోపచారవర్ణనము (149-178 ప.2ఆ.) మన్మథోపాలంభవర్ణనము(181-185ప.2ఆ.) చంద్రోపాలంభవర్ణనము (188-193ప.2ఆ.) దూత్యవర్ణనము(136-157వచ.3ఆ.)స్వయంవరవర్ణనము (3-73వచ., 141-340ప.4ఆ.) జారచోరమధుపానసమేతముగ సూర్యాస్తమయాదిసూర్యోదయ

పర్యంతవర్ణనము(74-140ఉ.4ఆ.) యుద్ధవర్ణనము (5-114ప.5ఆ.) సంభోగవర్ణనము (147-186ప.5ఆ.) జలకేళీవర్ణనము (187-201,222-258ప.5ఆ.) వసంతోత్సవవర్ణనము (202-221ప.5ఆ.) మొదలైన వర్ణనములు కలవు. అందు విలక్షణములైన వర్ణనములు కలవు.

" అబల వేనలిలోని యర్ధభాగము గాదె
పరఁగఁ జూచిన కృష్ణపక్షతమము
హరిమధ్యగతిలోని యష్టభాగము గాదె
తక్కినయైరావతంపునడక
సుదతి ఫాలములోని షోడశాంశము గాదె
హరుమౌళి శశిఖండ మరసి చూడ
లోలాక్షి చూపులలోని వేయవపాలు
గాదె శంకింపంగఁ గమలదళము
కోకములు పాటలాధరగురుకుచములు
వియ్యములు గావె వెడవిల్తు వింటినారి
కామినీమణి నూగారుఁ గవలు గావె
యెట్లు వర్ణింపవచ్చు నీ యిందుముఖిని." 58ప.2ఆ.
"ఉడుగని వేఁడి నిట్టూర్పులు వడగాలిఁ
గదిసి కయ్యమునకుఁ గాలు ద్రవ్వ
నదరు కంపంబున నంగవల్లిక మేఘ
సమయతటిల్లతఁ జౌకళింపఁ
జేకొన్న పాండిమఁ జెక్కుటద్దంబులు
శారదశశిలక్ష్మి జాఱఁ ద్రొక్కఁ
బుంఖానుపుంఖమై పొడమెడు గరుపాటు
మించి హేమంతర్తు మేలు కొలుప
మలయు చెమ్మట నెమ్మోము మంచువడ్డ
తమ్మి నెలయింప దృగ్రాగతరళదీప్తి
పల్లవంబులు మధువేళఁ బరిహసింపఁ
జూడరే యింతి వెడరూపు చూపె నేఁడు."196ప.2ఆ.

ఇందు నాయిక విరహావస్థలకు గ్రీష్మాదివసంతపర్యంతము ఆఱు ఋతువుల ధర్మములు ఆరోపితములైనవి. హేమంతర్తువునకు హేమంతర్తు అను ప్రయోగము

వ్యాకరణవిరుద్ధము. అనేకవ్యాకరణవిరుద్ధప్రయోగములు ఎల్లన కృతులందు కలవు. అందు క్త్వార్థకేకారసంధులు అధికము.

రాధామాధవమునందు శ్రీనాథ,పోతనల కవితాప్రభావము కలదు.

"కొందఱు తరుణి వరింపం
గొందఱు బలిమిని హరింపఁ గొందఱు సూడన్
గొందఱు భూషింపను నృప
నందను లేతెంచి రుబ్బునన్ మహామునకున్. 122ప.4ఆ.శృం.నై.
"కొందఱు మన్మథాతురతఁ గొందఱు విభ్రమరేఖఁ జూపఁగాఁ
గొందఱు వైభవంబునకుఁ గొందఱు బల్మి సతిన్ హరింపఁ గాఁ
గొందఱు పోరు గల్గునని కోరుచు వచ్చిరి సంభ్రమంబునన్."
"పూరించెన్ హరి పాంచజన్యము కృపాంభోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్
సారోదారసితప్రభాచకిత పర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్." 116ప.8స్కం.భాగ
పూరించెన్ హరి పాంచజన్యము జగత్పూర్ణప్రభాధన్యమున్
ధీరధ్వానకుఠారలూనదనుజస్త్రీస్మారముద్వన్యమున్
దూరీభూతసురేంద్రముఖ్యసురచేతోజాతదుర్దైన్యమున్
దారాధీశసహస్రమండలమహోద్యత్కాంతిసన్మాన్యమున్32ప.4ఆ.రా.మా.

ఎల్లన కవితాప్రభావము పింగళి సూరన కృతులందు కలదు.

"జలజాయతాక్షు వక్షస్థలిఁ జేర్పని
కుచములు కుచములే కోమలాంగి
నందజు సౌందర్యకందళుల్ చూడని
కన్నులు కన్నులే కలువకంటి
పద్మనాభుని పాదపద్మముల్ సోఁకని
కరములు కరములే కంబుకంఠి
దేవకీసుతుని వాతెఱ చవి చూడని
నాలుక నాలుకే నాగయాన
యచ్యుతున కెప్పుడును గొల్లలాడ నీని
జవ్వనము జవ్వనమె పూర్ణచంద్రవదన!

గోపకులసార్వభౌముని గోష్ఠిఁ గనని
పడఁతి జన్మంబు జన్మమే పల్లవోష్ఠి."755ప.2ఆ.రా.మా.

"ఆ లలితచరణము లొత్తు కేలు గేలు
కోర్కిఁ దద్వక్షమునఁ జేర్చు కుచము కుచము
దివుటఁ దద్రహఃకథ విను చెవులు చెవులు
పలుకులేలఁ దద్రతిఁ గన్న బ్రదుకు బ్రదుకు" 115ప.7ఆ.క.పూ.

"వాలిక చూపులు గల యా
బాలిక కన్నులు దనర్చు బలువడి మ్రింగం
జాలక పుక్కిటి వెన్నెల
లాలితగతి నుమియు వెన్నెలపులుఁగుల గతిన్." 164ప.1ఆ.రా.మా.

"ఎప్పుడు భక్తభావమున నింపడరన్ ద్విజరాజుపాదముల్
దప్పక సేనచేయు సుకృతంబునఁ గాంచెఁ జకోరయుగ్మ మీ
యొప్పన నొప్పుఁ గన్నులవి యోలిన క్రోలిన తేట వెన్నెలల్
చిప్పిలినట్లు మించు సతి తేనగవుల్ వెలి నిగ్గుఁ జూపులున్." 73ప.2ఆ.ప్ర.ప్ర.

ఇట్లు పూర్వకవితానైపథ్యము కలిగి, అనంతరకవితామార్గదర్శకమైనది ఎల్లన రాధామాధవము.

తారకబ్రహ్మరాజీయము ప్రయాగక్షేత్రవాసి నారాయణాశ్రమి రచించిన తారకబ్రహ్మరాజీయమునకు తెనుగుసేత. (12వచ.20,21ప.1ఆ.) సంస్కృతగ్రంథము లభింపలేదు. మూలానుసారమే అగును. తారకమన తరింపజేయునది. తారకబ్రహ్మ మన బ్రహ్మస్వరూపమైన తారకమంత్రము. తారకబ్రహ్మరాజమన తారకమంత్రము లందు శ్రేష్ఠమైనది. తారకబ్రహ్మరాజమాహాత్మ్యమును ప్రతిపాదించు గ్రంథము తారక బ్రహ్మరాజీయము. వక్త పరాశరుడు. శ్రోత వసిష్ఠుని శిష్యుడైన వామదేవుడు. అవాంతరవక్త అగస్త్యుడు. అవాంతరశ్రోతలు వాలఖిల్యులు. తారకబ్రహ్మరాజము శ్రీరామ మంత్రము.

"దురితసంసారంబు తరియింపఁజేయగా
బ్రహ్మస్వరూపమై పరగు కతనఁ
దారకబ్రహ్మాభిధానమై శ్రీరామ
మంత్రోత్తమం బాగమముల వెలయు" 136ప.1ఆ.

అసలు కాశీక్షేత్రము వైష్ణవక్షేత్రమని (3ప.2ఆ.) శివుడు కైలాసమునందు నాట్యము సేయునెడ మణికర్ణిక పడుట వలన కాశికి వచ్చెనని (13-15h.2ఆ..) విష్ణువు శివునికి తారకబ్రహ్మాదివ్యమంత్ర మొసగెనని (21ప.2ఆ.) అదే శివుడు అచట మరణించువారికి కుడిచెవియందు చెప్పునని (32ప.2ఆ.) ఇందు కలదు.

తారకబ్రహ్మమంత్రము నిత్యము జపించి, ప్రాణనిష్క్రమణవేళ స్మరించిన మోక్షము సిద్ధించునట (52ప.2ఆ.) తన్మంత్రోపాసనహీనుడు నీచుడైనను రామ నామము వినుచు ప్రాణము విడిచిన మోక్షము లభించుననుటకు (53ప.2ఆ.) ఒక "ఇతిహాసము" కలదు. అందు చిలుక మనుజుని పలుకులు పలుకుటకు కారణముగ శ్రీరామజననము మొదలు శ్రీరామపట్టాభిషేకము వఱకు రామకథ కలదు. ఈ రెండును తారకబ్రహ్మరాజీయమునకు కావ్యత్వసిద్ధి కలిగించునవి. ఇంతవఱకే గ్రంథము లభించినది. (24వచ.5ఆ.)

"ఇతిహాసము" తైర్థికుడైన భూసురుని వృత్తాంతము. అతడు బోయతేని కూర్మి కళత్రమును కూడి, మద్యమాంసములు మరిగి, బోయతేడు చంపునెడ-చిలుక పలికిన శ్రీరామప్రభావము విని, రామనామోచ్చారణము చేయుటవలన బోయవనితతోపాటు ముక్తుడగును. వారిని చంపిన బోయతేడును రాజభటులు వధించునెడ చిలుకయు, జనులు రామనామోచ్చారణము చేయుటవలన ముక్తుడగును. ఇందు రామనామ ప్రభావము కంటె, తైర్థికభూసురుని పరదారాగమనసమర్థనము (61-63ప.2ఆ.) సమధికము.

"అమరాధీశుఁడు స్వర్గమేలఁడె యహల్యాజారుఁ డయ్యున్ శుచి
త్వముతోడం బరదారసంగమము విద్వాంసుల్ నివారించుటల్
తమ భార్యల్ నియమస్థులైన తము లీలాహీనులం బాయ దో
సమటంచున్ వచియింత్రు నే నెఱుఁగనే సందేహ మిందేటికిన్." 63ప.2ఆ.

ఇది శేషము వేంకటపతి శశాంకవిజయములోని "లోకములోని కొంద ఱబలుల్ అను ప్రసిద్ధపద్యమునకు దారి చూపినది. ప్రకృతివర్ణనమునందు ప్రశస్తమైన పద్యమిది:

"అపుడు నీరెండ పసుపునీరాడి పసిఁడి
తమ్మి నునుఁజాయ కెంబట్టు తనరఁ గట్టి
కచభరంబునఁ బ్రొద్దు చెంగల్వకుచ్చు

చెలువు మీరంగ దినముఖస్త్రీ దనర్చె." 115ప.2ఆ.

రామకథ రామాయణమే కాని, అవాల్మీకవృత్తాంతములే గాక అనౌచిత్య వృత్తాంతములు కలవు. చిత్రకూటమునందు సీత ఒక్కతె కలదని రాముడు పలుకుతోడు వలయునని తలంప, వనదేవత ఒక చిలుకను మణిపంజరమున తెచ్చి సీతకు ఇచ్చుట. సీత చిలుకకు రామనామము నేర్పుట. చిలుక నేర్చుట పాడుట. అది మొదలు అన్ని చిలుకలు రామపూర్వకముగ మాటలాడుట (28-39ప.3ఆ.) అవాల్మీకవృత్తాంతము. చిలుక రామమనోహరగీతికలు విని మునులు సీతారాముల ఏకాంతకేళిని చూచి, రాముని మోహించుట (43-53వచ.3ఆ.) అనౌచిత్యవృత్తాంతము. మునులు శ్రీమదన గోపాలావతారమునందు గోపికలై జన్మించునపుడు వారికి రాముడు అభిమతము నొసగుదుననుట (54-56వచ.3ఆ.) అవాల్మీకవృత్తాంతము. పంచవటమునందు సీతా రాములు పండ్రెండు సంవత్సరములు పరమానందమున క్రీడించుట అవాల్మీక వృత్తాంతము. అనౌచిత్యవృత్తాంతము కూడ. అందు,

"భామ పూగుత్తులఁ బట్టి కోయంగఁ దాఁ
గుచములు పట్టుఁ బూగుత్తు లనుచుఁ
దెలివ పూఁ గొమ్మపైఁ దేంట్ల నొడియఁగఁ దా
నలకజాలము తేఁటు లనుచు నొడియుఁ
గొమ్మ పూఁ దేనియఁ గ్రోలంగఁ దాఁ బువ్వుఁ
దేనియ యని మోవి తేనె గ్రోలు
నతివ పూఁ దావికి నలరుచునుండఁ దా
నతివ మైతావికి నలరుచుండు
భ్రాంతినో ప్రేమనో రామభద్రనృపతి
కాంచు విభ్రాంతి ప్రేమచేఁ గాని తత్ప
దార్థము లోవల వా సీత యవయవముల
నవ్విభుండును సర్వజ్ఞుఁ డరసి చూడ." 84ప.3ఆ.

రాముడు "బ్రహ్మము", "హరి" (45ప.3ఆ.) సీత "ఆదిలక్ష్మి" (46ప.3ఆ.) అని సీతా రాముల శృంగారమును ఇట్లు వర్ణించుట మిక్కిలి అనుచితము. రాముడు "మదనాయత్తాత్ముఁడై మత్తుఁడై" రావణవధ తలపెట్టడని, బృహస్పతి లక్ష్మిదేవిని స్తుతించుట. స్వర్గమునందు సంచరించు శూర్పణఖను దండకారణ్యమునకు పంపుట (3-46ప.4ఆ.) అవాల్మీకవృత్తాంతమే.

విష్ణుమాయానాటకము నాటకము కాదు. చంపూకావ్యము. విష్ణుమాయ నాటకము వంటిది. కనుక విష్ణుమాయానాటకమని గ్రంథనామము. అవతారిక లేకపోవుట వలన మూలనిర్దేశము కలదో లేదో తెలియని స్థితి. వక్త శుకమహర్షి. శ్రోత పరీక్షిన్మహారాజు. అవాంతరవక్త గోవిందశర్మ. అవాంతరశ్రోతలు ధర్మరాజు, మునులు. "భాగవత సత్కథాపరబ్రహ్మవిద్య నెలమి వినుచు" పరీక్షిన్మహారాజు శుకమహర్షిని ప్రశ్నించినట్లు (1ప.1ఆ.) కలదుగాని, విష్ణుమాయానాటకవిషయము భాగవతమునందు లేదు. గోవిందశర్మ అపూర్వపాత్ర. ధర్మరాజు సభకు ద్వారక నుండి "హాటకపుస్తక హస్తుఁడై" వచ్చును. (108ప.1ఆ.) "కృష్ణుని యంతఃపురస్త్రీలగు రుక్మిణ్యాదులకు నుబుసుపోవం గథలు సెప్పు" వాడు. (111వచ.1ఆ.) "ఈ వటుచక్రవర్తి హరి కిష్ట సఖుఁడు" అని నారదుని పరిచయము. (125ప.1ఆ.) రామకృష్ణుల గురువైన సాందీపని "అగ్రపుత్త్రుఁడను" అని గోవిందశర్మ స్వవచనము. (132ప.1ఆ.) "వీఁ డఖిలశాస్త్రవేది యత్యాశ్రమవిశ్రుతకీర్తి గోవిందశర్ముండు గోవిందమిత్రుండు" అని ఆకాశవాణి ప్రకాశనము. (132ప.1ఆ.) కాని పురాణప్రసిద్ధుడు కాడు. అయినను,

"శ్రీయుతమై విష్ణుమహా
మాయానాటకము నాఁగ మహి వెలసె మహీ
నాయక! తత్కథలన్నియు
నాయతగతి నొక ప్రబంధమై నాచేతన్." 7ప.2ఆ.

అని గోవిందశర్మ ప్రకటనము! ఒకానొక గోవిందశర్మకృతవిష్ణుమాయానాటక ప్రబంధము కలదో? కల్పితమో?-

విష్ణుమాయానాటకమునందు విష్ణుమాయాస్వరూపమును నిరూపించు ప్రధాన కథలు అయిదు కలవు. 1. సత్యభామాగర్వభంగము. 2. ఆదిలక్ష్మీగర్వభంగము. 3. బ్రహ్మగర్వభంగము. 4. శివగర్వభంగము. 5. నారదగర్వభంగము. ఆదిలక్ష్మీ గర్వభంగకథలోని పుండరీకుని కథ, నారదగర్వ భంగకథలోనిచండదమనుని కథ విష్ణుమాయాస్వరూపమును నిరూపించు అవాంతరకథలు. అన్ని కథలకు ఆంతర ధర్మము విష్ణుమాయాతిశయము. విష్ణుమాయానాటకము కథల సంపుటియే గాని ఏకకథ కాదు. భిన్న కథల అంతస్సూత్రము విష్ణుమాయ.

కృష్ణునితో క్రీడించు సత్యభామ సగర్వముగ పారిజాతపుష్పములు రుక్మిణికి, కడమ సవతులకు పంపించును. కృష్ణునితో వినోదించు రుక్మిణి కూడ పారిజాతపుష్పములు సత్యభామకు పంపించును. కడమ సవతులును అట్లు కావింతురు. సత్య

భామ దుఃఖించును. ప్రతిమందిరపారిజాతవిలసనము. శ్రీకృష్ణుని బహురూపకత్వము విష్ణుమాయ. ఆదిలక్ష్మి స్వాతిశయముగ వైకుంఠవిలాసమును హరించును. విష్ణువు ప్రతిలక్ష్మిని సృష్టించి. వైకుంఠవిలాసము నిలుపును. ఆదిలక్ష్మి తేజస్సును మాయా లక్ష్మి హరించును. మాయాలక్ష్మి వృత్తాంతమును విని ఆదిలక్ష్మి విచారించి తపస్సు చేయును. విష్ణువు మాయాలక్ష్మిని మాయము చేయును. ఆదిలక్ష్మి ఎప్పటివలె వైకుంఠ మునందు ఉండును. ఇది విష్ణుమాయ. బ్రహ్మ దురహంకారముతో తానే పర బ్రహ్మమని తపస్సు చేయును. విష్ణువు కల్పించిన మాయాసరస్వతి మోహింప జేయును. అనేకసంవత్సరముల అనంతరము మాయాసరస్వతి మాయమగును. మార్కండేయుని ప్రబోధమున బ్రహ్మకు జ్ఞానోదయమగును. ఇదియును విష్ణుమాయ. జగన్మోహినికథ విని విష్ణుమాయకు లోబడ ననిన శివుడు. విష్ణువుని కోరి జగన్మోహినిరూపమును చూచి మహామోహితుడయి కడకు పరబ్రహ్మబోధ నందును. ఇది కూడ విష్ణుమాయ. విష్ణుమాయకు పడనివాడనని విఱ్ఱవీగిన నారదుడు. స్త్రీ అయి. చంద్రకేతుని భార్య అయి. నూరుగురు కొడుకులను కని. పెనిమిటిని కొడుకులను కోలుపోయి మఱల నారదుడగును. ఇది సహితము విష్ణుమాయ. పుండరీకుడు ఒక సంసారము మాయకాదని. వేఱొక సంసారస్థితి మాయ అని తలంచి. బోయవనిత తోడి మాయాసంసారము చేసి విష్ణుమాయను విశ్వసించును. చండదమను డను ముని రాజ్యసుఖము కోరి ఉగ్రతపము సేయ. అది విష్ణుమాయావికారమని సనత్కుమారుడు బోధింప. విష్ణుమాయను తిరస్కరించి. రాజ్యకాంక్షను వదలి. మోక్షాపేక్షను తపస్సు చేయును. ఇందు బ్రహ్మ. శివుడు కూడ విష్ణుమాయకు లోనగుటవలన విష్ణ్వాధిక్యము విష్ణుమాయానాటకమునందు విశేషము.

ఎల్లన తారకబ్రహ్మరాజీయమునందు సర్పవరక్షేత్రము ప్రసిద్ధవైష్ణవక్షేత్రముగ కలదు. (143వచ.1ఆ.) అది తూర్పుగోదావరిమండలములోనిది. ఎల్లన విష్ణుమాయా నాటకమునందు గోదావరీతీర. సర్పవరక్షేత్రప్రశంసలు కలవు.(193,194ప. 3ఆ;36,40,41,43ప.5ఆ.)

"ఏ త్రోవఁ జూచిన నే ప్రొద్దు సలిలాన్న
సత్రశాలాజనసంభ్రమంబు
లే యూరఁ జూచిన నెల్ల ధాన్యంబులు
కొరు వెట్టుడు ప్రజాఘోషణంబు
లే యిండ్లఁ జూచిన నిందిరాకరసంత

తోత్సవతోరణాభ్యుదయరేఖ
లెవ్వరిఁ జూచిన నివ్వటిల్లెడు దయా
దానసౌజన్యవిద్యానిరూఢి
యెచటఁ జూచిన కనుపండు విందువదన!
నారికేళామ్రపనసపున్నాగముఖ్య
ఫలితశృంగారవనపరంపరలచేతఁ
గోరికల ముంచు గౌతమీతీరభూమి. 193.
వారిజానన! గౌతమీతీరవసతి
భోగమోక్షంబులకు జన్మభూమి సువ్వె
జన్మసంస్కారఫలవిశేషంబుగలుగు
వారలకుఁ గాని కలుగ దవ్వసతిసుఖము." 194ప.3ఆ.వి.మా.నా.
"చిత్రంబుగ శేషాహి ప
విత్రతపోనిష్ఠ మున్ను వెలసిన ముక్తి
క్షేత్రము సర్పవరము - 36.
నేదిష్ఠదక్షిణాశా
ప్రాదుర్భూతార్ధతుల్యభాగాజలజా
మోదభరభరితమారుత
మా దైత్యారాతిహృదయ మలరఁగఁ జేసెన్. 40.
సవిధప్రాచీనమహా
లవణజలధిఘుమఘుమితకలధ్వని కెనయై
సవనాస్త్రశౌషణ్ముఖ
వివిధరవం బా వనమున వీనులఁ దనిపెన్." 41ప.5ఆ.వి.మా.నా.

కాశీగయాప్రయాగాదుల కంటె "సన్నుతక్షేత్రరాజ మా సర్పవరము." (43ప.5ఆ.వి.మా.నా.) ఇది ఎల్లన స్థలజ్ఞతకు, వసతిసుఖమునకు నిదర్శనము.

సంకుసాల నృసింహకవి : ఈతని కృతి కవికర్ణరసాయనము. శ్రీరంగ నాథాంకితము. దైవాంకితము. కవికర్ణరసాయనమునందు నరసింహనామధేయము కలదు. సంకుసాలగృహనామము లేదు. లక్షణగ్రంథములందు సుంకసాల నరసింహ[illegible] అని కలదు. ప్రబంధరత్నాకరమునందు సుంకెసాల సింగయ (58ప.1ఆ.) సుంకసాల సింగయ (73ప.1ఆ.) సుంకుసాల సింగయ్య (197ప.1ఆ.) సంకుసాల సింగయ్య (256ప.1ఆ.) సుంకెసాల సింగన్న (8ప.2ఆ.) సుంకిసాల సింగయ(157ప.3ఆ.) అని

బహువిధములుగ కలదు. అందు "సుంకసాల" అధికము. ముద్రితగ్రంథములందు సంకుసాల నృసింహకవి అని కలదు. ఇది రూఢమైనది.

శ్రీకృష్ణదేవరాయల కూతురు మోహనాంగి మారీచీపరిణయము రచించినట్లు ఒక జనశ్రుతి కలదు.[219] ముద్రితగ్రంథము ప్రకటించిన కవి కూటసృష్టి.[220] అంతే కాదు. వ్రాతప్రతియందు ఆ కవియే రచించినట్లు కలదు.[221] శ్రీకృష్ణ దేవరాయలకు మోహనాంగి అను కూతురు కలదనుటకు చారిత్రికాధారము లేదు. అయినను. అల్లసాని పెద్దన అసూయాగ్రస్తుడై సంకుసాల నృసింహకవికి ఆస్థానప్రవేశము కలుగనీయలేదని. కవికర్ణరసాయనములోని "ఒత్తుకొనివచ్చు" అను పద్యమును. (25ప.2ఆ.) మోహనాంగి కొని. చదరంగ మాడునెడ శ్రీకృష్ణదేవరాయలకు వినిపించెనని. పద్యమును మెచ్చుకొని శ్రీకృష్ణదేవరాయలు సంకుసాల నృసింహకవి కొఱకు ప్రయత్నము చేసెనని. కాని సంకుసాల నృసింహకవి అప్పటికే విజయనగరము విడిచిపెట్టి వెళ్లిపోయెనని ఒక ఐతిహ్యము కలదు.[222] అల్లసాని పెద్దన అసూయాగ్రస్తుడైనను. ఆస్థానప్రవేశము కల్పించుటకు నంది తిమ్మన కలడు. అరణపుకవి కవుల ఆదరణమును తెలుపు చాటుపద్యము పూర్వోదాహృతము. ఆ జనశ్రుతి. ఈ ఐతిహ్యము యథార్థములు కాజాలవు. కాని. కవికర్ణరసాయనములోని అవతారికను రాజనింద అధికముగ కలదు.(24,26,27ప.పీ.) అది కవి ఆశాభంగమును సూచించును. శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము (1509-1524) తర్వాత (1524-30) సంకుసాల నృసింహకవి ఆస్థానప్రవేశమునకు ప్రయత్నించిన విఫలుడగుట సహజము. కారణము శ్రీకృష్ణదేవరాయల విరక్తస్థితి. పట్టాభిషేకముచేసిన ఆరేళ్ల కుమారుడు తిరుమలరాయలు విషప్రయోగము వలన మరణించుట మొదలైన విషమపరిస్థితి. అట్టి స్థితియందు సంకుసాల నృసింహకవి ఆశాభంగము చెందినట్లు కవికర్ణరసాయనమునందు ఆంతరంగికసాక్ష్యము కలదు.

"చరమధరాధరాగ్రమున జాఱెడు వేళఁ బతంగుఁ డంగజ
త్వరితమనస్కుఁడై నిలిచి తన్నుఁ గనుంగొను సౌధశేఖరో
పరితరుణీజనంబు ముఖపద్మములన్ వికసింపఁ జేసె స
త్పురుషులు తారు దుర్దశలఁ బోవుచునైనను బ్రోతు రాశ్రితున్." 67ప.4ఆ.

ఇది సంకుసాల నృసింహకవి స్వీయకవిత్వము. ఇందు స్వీయచరిత్రాంశమును ఇమిడియున్నట్లు భాసించును. అది దుర్దశల పాలైన శ్రీకృష్ణదేవరాయలు ఆశ్రయించిన నృసింహకవిని ఆదరింపకపోవుటను ఎత్తిపొడిచినట్లు కలదు. కావున కవికర్ణరసాయ

నము రచనాకాలము 1525 ప్రాంతము కావచ్చును.

అవతారికయందు నృసింహకవి భట్టుపరాశరుని శిష్యుడని కలదు.

"గురువరభట్టుపరాశర
చరణసరోరుహసముల్లసన్మానసుఁ డన్
నరసింహనామధేయుఁ డఁ
బరిచితసత్కృతిరసానుభవహేతుకుఁ డన్.7ప.పీ.

చరిగొండ ధర్మన గురువు భట్టుపరాశరప్రభునిరంగడని చిత్రభారతమునందు కలదు.(9ప.1ఆ.) భట్టుపరాశరప్రభుని కుమారుడు రంగడని అర్థము వచ్చును -1536 నాటి శాసనమునందు పరాశరభట్టాచార్యగురువు కలదు. 1510 నాటికే ధర్మన గురువైన. రంగని తండ్రి భట్టుపరాశరప్రభువు పరాశరభట్టాచార్యులు కాకపోవచ్చును. పరాశరభట్టాచార్యుల కంటె భట్టుపరాశరప్రభువే నృసింహకవి గురువరుడు కావచ్చును.

నాయకుని పేర లేదా నాయికానాయకుల పేర కావ్యమునకు నామకరణము చేయుట నలిగిన బాట. కవులను అధికరించి కావ్యనామము కైసేయుట క్రొత్తపుంత- కవులన కావ్యకర్తలే కారు; కావ్యశ్రోతలు (కావ్యపాఠకులు) కూడ. కవుల కర్ణములకు రసాయనము కవికర్ణరసాయనము. నృసింహకవి కావ్యనామకరణము తర్వాతి కవులకు మార్గదర్శకమైనది. కావ్యనామకరణమే కాదు; ఇష్టదేవతాస్తుతియందే కావ్యస్వరూపమును సూచించుట నృసింహకవి ప్రత్యేకత. "విశ్వతోముఖు"డైన విరించి తన కావ్యమునకు "విశ్వజనాభిముఖ్యము"ను. "జాయఁ బాయక లీలాపరుఁ డైన శంకరుడు "శబ్దార్థదాంపత్యము"ను "ఇచ్చుఁ గావుత"మని."భాషాదేవి కృతియుక్తాలంక్రియాహంక్రియన్" తన "ప్రౌఢజిహ్వాసింహాసన మూనుఁ గాత" మని (2,3,5ప.పీ.) నృసింహకవి ఇష్టదేవతాప్రార్థనము. విశ్వజనహితము గాక విశ్వజనాభి ముఖ్యము కోరుట విశేషము. కారణము.

"ఆకులనె యుండు కవితా
పాకములనె మొదలు చెడినఁ బ్రాఁ బల్కులుగా
లోకము జిహ్వాంచలములే
యాకులుగా నుండు నెవ్వి యవిపో కవితల్." 14ప.పీ.

అను కవి ఆత్మవిశ్వాసము. శబ్దార్థదాంపత్యము శబ్దార్థసమప్రాధాన్యము.

"పురాతనకవీశ్వరు లేఁగని వీథి లేదు" అని తెలిసి. (18ప.పీ.) కావ్యరచనకు పూనుకొన్న కవి నృసింహకవి. అంతేకాదు.

"యతి విటుఁడు గాకపోవు టెట్లస్మదీయ
కావ్యశృంగారవర్ణనాకర్ణనమున?
విటుఁడు యతికాకపోరాదు వెస మదీయ
కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున" 22ప.పీ.

అని "అన్వర్థనామంబుఁగాఁ గవికర్ణరసాయనంబను నొక్క కావ్యంబు రచియింప నున్మ్ముఖు"డైన కవి. యతి విటుడగుటకు కావలసిన శృంగారవర్ణనము. విటుడు యతి అగుటకు కావలసిన వైరాగ్యవర్ణనము కల కావ్యము కవికర్ణరసాయనము- భట్టుమూర్తి వసుచరిత్రమునందు కంటె పూర్వమే. సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమునందు మిశ్రకావ్యమునకు ప్రశంసాపత్రము కలదు.

"కావ్య ముత్పాద్యమే నసత్కావ్య మింక
నుక్తకావ్యంబయేఁ బునరుక్తిఁ దెచ్చుఁ
గానఁ గవితాభిముఖుఁడైన కవివరునకు
మిశ్రకావ్యంబె కావ్యమై మెఱుఁగుఁ దెచ్చు." 10ప.పీ.

కవితాభిముఖుడైన నృసింహకవి కవికర్ణరసాయనము మిశ్రకావ్యమే. అంతేకాదు. అవతారికలోని శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును మిశ్రకథయే. విభీషణుడు శ్రీరంగధామమును అయోధ్యనుండి లంకకు తీసికొనివెళ్లుచు చంద్రపుష్కరిణీనదీతటమునందు నిల్పును. చోళరాజు కొంతకాలము నిల్పుమని కోరి. నవాహోత్సవము సేయును. అది శ్రీరంగశాయికి స్థిరనివాసమగును. ఇది చరిత్ర. పురాణమిశ్రకథ.

కవికర్ణరసాయనము కథ మాంధాతృచరిత్రము. జన్మవృత్తాంతము. యుద్ధ వృత్తాంతము. వివాహవృత్తాంతము. విరాగవృత్తాంతము కలవు. జన్మవృత్తాంతము నకు మూలము విష్ణుపురాణము. కాని యువనాశ్వుని శాపవృత్తాంతము స్వతంత్ర కల్పనము. వివాహప్రసక్తి విష్ణుపురాణమునందు కలదు. వృత్తాంతము లేదు. అంతే కాదు. అందు మాంధాత భార్య శశిబిందుతనయ బిందుమతి. ఇందు కుంతలేశ్వరుని కూతురు విమలాంగి. విమలాంగీమాంధాతల వివాహవృత్తాంతమెల్ల స్వతంత్రకల్ప నము. మాంధాతృరావణుల యుద్ధవృత్తాంతమునకు మూలము రామాయణోత్త

రకాండము. అందు సంధిసంధాత పులస్త్యబ్రహ్మ. ఇందు శివుడు. మాంధాతృవిరాగ వృత్తాంతమెల్ల స్వతంత్రకల్పనము. కాబట్టి మిశ్రకావ్యము.

విమలాంగిమాంధాతల వివాహవృత్తాంతము శృంగారవర్ణనాభూయిష్ఠము. మాంధాతృవిరాగవృత్తాంతము వైరాగ్యవర్ణనాభూయిష్ఠము. అది యతిని విటుని. ఇది విటుని యతిని చేయునని కవి ఆశయము.

కవికర్ణరసాయనము కథాప్రధానము కాదు. వర్ణనావైభవోపేతము. కావ్యము మూడువంతులు పైగా వర్ణనములే. అవి : పురవర్ణనము (2-27ప.1ఆ.) రాజనీతి వర్ణనము (3-53ప.2ఆ.) శరదృతువర్ణనము (58-63ప.2ఆ.) నాయకవర్ణనము (54-64ప.1ఆ ;56-57ప.2ఆ.59-62ప.3ఆ.) ప్రయాణవర్ణనము(64-89ప.2ఆ;144-152ప.2ఆ.) యుద్ధవర్ణనము (90-110,153-201, 205-222ప.2ఆ.) దూత్యవర్ణనము (111-143ప.2ఆ; 52-54ప. 3ఆ.:144-147వచ.3ఆ.) సంధ్యావర్ణనము(202,203ప.2ఆ.) అంధకారవర్ణనము (204ప.2ఆ.) పర్వతవర్ణనము(230-231వచ.2ఆ.) నాయికావర్ణనము (6-50ప.3ఆ.) నాయికావిరహవర్ణనము(76-142ప.3ఆ.) వివాహవర్ణనము (148-195ప.3ఆ.) రతి వర్ణనము (197-230ప.3ఆ.) వసంతర్తువర్ణనము (2-15ప.4ఆ.) వనవిహారవర్ణనము (16-36ప.4ఆ.) జలకేళీవర్ణనము (37-61ప.4ఆ.)సూర్యాస్తమయవర్ణనము (62-75ప.4ఆ.) సంధ్యావర్ణనము (76-82ప.4ఆ.) నక్షత్రవర్ణనము (87ప.4ఆ.) అంధకారవర్ణనము (84-93ప.4ఆ.) విటవిటీవర్ణనము (94-121,141-156,166-181ప.4ఆ.) చంద్రోదయవర్ణనము (122-139ప.4ఆ.) మధుపానవర్ణనము (157-165ప.4ఆ.) ప్రభాతవర్ణనము (182-192ప.4ఆ.) సూర్యోదయవర్ణనము (193-198ప.4ఆ.) వేదాంత వర్ణనము (28-157ప.5ఆ.) గ్రీష్మర్తువర్ణనము (4-9ప.6ఆ.) వర్షర్తువర్ణనము (10-25ప.6ఆ.) హేమంతర్తువర్ణనము (26-31ప.6ఆ.) రంభాదుల ప్రయాణవర్ణనము (59-68,70-79 ప.6ఆ.) అభ్రగంగవర్ణనము (69ప.6ఆ.) రంభాదుల శృంగారక్రీడల వర్ణనము (81-90వచ.6ఆ.) క్షీరాబ్ధివర్ణనము(108-118వచ.6ఆ.) వైకుంఠవర్ణనము (119-123ప.6ఆ.) శ్రీమన్నారాయణదివ్యమంగళవిగ్రహవర్ణనము (124-163వచ.6ఆ.)

రసహీనమైన రాజనీతివర్ణనమునందు రసాత్మకపద్యము:

" కాకేమి తన్నుఁ దిట్టెనె?
కోకిల తనకేమి ధనము కోకొమ్మనెనే?
లోకము పగయగుఁ బరుసని
వాకునఁ జుట్టమగు మధురవాక్యము వలనన్." 8ప.2ఆ.

ఇది "లోకము జిహ్వాంచలములే యాకులుగా నుం"డిన పద్యములలో ఒకటి.

శరదృతువర్ణనమునందు అపూర్వరమణీయమైన పద్యము:

" కైరవబంధుబింబము ముఖప్రతిబింబము, తద్గతస్మితాం
కూరము శీతలాతపము, కుండలసూచితమౌక్తికావళుల్
తారలుగా, శరత్సమయలక్ష్మి కనుంగొను రత్నదర్పణా
కారమునన్ నభస్స్థలము గన్నుల పండువుఁ జేసె రాత్రులన్." 63ప.2ఆ.

ఆకాశము రత్నదర్పణము. అందు చంద్రబింబము శరత్సమయలక్ష్మి ముఖప్రతిబింబము. చంద్రికాప్రసారము శరల్లక్ష్మిస్మితాంకూరము. నక్షత్రములు శరల్లక్ష్మి కుండలములలోని ముత్యములు. శరత్కృతి, లక్ష్మిప్రతికృతి, కన్నుల పండుగ.

నాయికావర్ణనమునందు నవనవలాడిన పద్యము:

" ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోయె
నుండెనేనియుఁ గనఁబడకున్నె యహహ!
యుద్ధతుల మధ్యమునఁ బేద కుండఁ దరమె?" 25ప.3ఆ.

ఇది మోహనాంగి జనశ్రుతిని మనోమోహనమైనది. "ఉద్ధతుల మధ్యమునఁ బేదకుండఁ దరమె?" అను సామాన్యము లోకమాన్యము. విశేషములోని హేతుకల్పనము ధీమాన్యము. ఇది కూడ "లోకము జిహ్వాంచలములే యాకులుగా నుం"డిన పద్యము.

కవిసమయముల మీద చమత్కారకల్పనము కల పద్యము :

" అవనిపై నుండుగా కనఁటి కంబము లెట్లు
లనఁటి కంబములపై నవని నిలిచె?
గగనంబు గిరులపైఁ గనుపట్టుగా కెట్లు
గగనంబుపై గిరుల్ గాననయ్యె?
జలధరంబుల మీఁద శశియుండుఁ గాకెట్లు
శశిమీఁద నున్నది జలధరంబు?
నాళంబుపై గాక నలినకోశం బెట్లు
నలినకోశంబుపై నాళమున్న

దనుచుఁ జూపఱులకు విస్మయంబు గొలుపుఁ
దొడలుఁ గటిమండలంబును నడుముఁ జన్ను
లాననము గొప్పు నాభియు నారు నన<గ
నలరె విమలాంగి నవయౌవనాగమమున." 26ప.3ఆ.

వ్యాకరణకార్యము సార్థకమైన పద్యము:

" ప్రోడవు గాన నీ పలుకు పోలదు కా దనరాదు గాక యీ
వీడని తాపవేదనల వేఁగెడు చెన్నటి మేనఁ బ్రాణముల్
గూడి వసింపనోర్వ విదిగో చనుచున్నవి యేల వ్రీడయుం
గ్రీడయు నాకు హారమును గీరముఁ జూతము గీతముం జెలీ!" 112ప.3ఆ.

ఇది చెలికత్తె పాలిక. "వ్రీడ వాటింప వలదె? హారము చిక్కు దీయవలదె? చూత మునకు నీరు వోయవలదె?" అనిన, విరహతాపమున ప్రాణములు నిలువజాలని విమలాంగి వ్రీడను, హారమును, చూతమును, నిందించిన దను పద్యము. "నిందయం దామ్రేడితంబు నాద్యక్షరంబులకు హ్రస్వదీర్ఘంబులకు గిగీలగు" అని బాలవ్యాకరణసూత్రము. (22సూ.ప్ర.ప.) కుంభకర్ణుడు, గింభకర్ణుడు, రావణుడు గివణుడు. ఇందు గింభకర్ణుడు, గివణుడు అను ఆమ్రేడితములు అర్థవంతములు గావు. కావలసిన ఆవశ్యకము లేదు. అయినను పద్యమునందు "వ్రీడయుం గ్రీడయు"లోని క్రీడ, "హారముఁ గీరము" లోని కీరము, "చూతము గీతము"లోని గీతము అర్థవంత ములు కూడ. ఆమ్రేడితములను నిందయందు అర్థవంతములు చేసిన అపూర్వ పద్యము.

రతివర్ణనమునందు మితిమీఱిన పద్యము :

" ముగ్ధయగుఁ గాక యేమింత ముగ్ధ గలదె?
బాల జఘనాంశుకం బింక నేల పెనఁగ?
రాజవరున కురోజదుర్గములు రెండుఁ
జేపడియెనట్టె యిఁకఁ గ్రింది సీమ యెంత!" 17ప.3ఆ.

కవికర్ణరసాయనములోని జారశృంగారము నృసింహకవి అపారప్రాకృత సాహిత్యవిహారఫలమే.[223]

" కోటలు బొమ్మరిండ్లు మఱి కొండలు తాపలు దివ్యదృష్టికిన్

గాటుక లంధకారములుగాఁ జని కందువపట్లఁ బాంసులా
పాటలగంధు లొంది రుపభర్తలతో మణితాదులైన జం
జాటము లేని కూటముల సాహసకల్పలతాఫలంబులన్." 163ప.4ఆ.

ఇది శృంగగ్రాహిక. పారదారికశృంగారప్రవణములైన ప్రాకృతగాథలను తల పించు పద్యములు కలవు.[224] (11,117,119,167-172ప.4ఆ.) అందొక పద్యము :

" యువతిఁ దివియనీక యున్న పయ్యెదతోన
లీలఁ దిగిచి కౌఁగిలించె విటుఁడు
తత్క్షణించి వాని దర్పకుం డౌరతోన
విసరి యడిద మెత్త వ్రేయకున్నె?" 168ప.4ఆ.

ప్రకృతివర్ణనములందును నృసింహకవి ప్రత్యేకత కనిపించును.

"పొన్నలు నవ్వెఁ గ్రొన్ననలఁ, బుష్పరసంబునఁ గేసరంబు లు
త్పన్నజుగుప్సమై నుమిసెఁ, బాటలముల్ కుసుమోదయంబుచేఁ
గన్నెఱఁ జేసెఁ, దిట్టెఁ గలకంఠరుతంబులఁ జూతముల్ వృథా
మున్నుగ నన్నిటం గడచి మోదుగు పువ్వులు విఱ్ఱవీఁగినన్." 7వ.4ఆ.

వసంతఋతువునందు పొన్నలు, పొగడలు, పాటలములు, చూతములు, మోదుగులు పూచుట సహజము. ముందుగా పూచిన మోదుగు పువ్వులు విఱ్ఱవీగుట వలన పొన్నలు క్రొన్ననల నవ్వెనని, పొగడలు జుగుప్స కలిగి పుష్పరసమును ఉమిసెనని, కలిగొట్టులు ఎఱ్ఱని పూలతో కన్నెఱ్ఱ చేసెనని, మామిడులు కోయిల కూతలతో తిట్టెనని కల్పనము. మోదుగు పువ్వులను మించి, పొన్నపువ్వులు, కలిగొట్టుపువ్వులు, మామిడిపువ్వులు కలవని అర్థము.

"కరఁచి చిప్పలఁ బట్టు కత లెఱుంగము గాక
వ్రాయంగ నిది మషీరసము గాదె
యిది గుణంబులు సేయు నిర వెఱుంగము గాక
నీలాల సరులుగా నింపరాదె
కరపటంబులఁ బెట్టు వెర వెఱుంగము గాక
వనితల కిది నవాంజనము గాదె
కడవలఁ గొని మించు గతి యెఱుంగము గాక
చేలల కిది మంచి నీలి గాదె

పోవఁ డేనిది రవినైనఁ బొదువుఁ గాదె
యంకమను పేర నురముపై నచ్చు దాల్చుఁ
గాక శశినైన దిగ్రమింగు గాదె యనఁ గఁ
బ్రబలమై గాఢతమతమఃపటలి పర్వె." 91ప.4ఆ.

కటికి చీకటి దట్టముగా అలముకొనునెడ. చిప్పలలో పట్టుకొనరాని మషీరసముగాను. సరులుగా చేసికొనలేని ఇంద్రనీలములు గాను. బరిణెలలో పెట్టుకొనరాని కాటుకగాను. కడవలతో ముంచుకొనలేని నీలిమందుగాను కలదని సాదృశ్య కల్పనము. అంతేకాదు. అస్తమింపకున్న సూర్యుని ఆహరించునని. అంక మనెడు ముద్ర వైచినను చంద్రుని మింగునని సంభావనము.

"ఇంచుకించుక శశి యుదయించునపుడు
తఱచు చీఁకట్లు భీతిమైఁ దఱిసి దాఁగె
ముకుళితాంబుజపుటకుటీమూలముననొ
సభయమూర్ఛితవిరహిణీస్వాంతములనొ" 130ప.4ఆ.

ఇది ఆధునికభావకవితాసరణికి ఆద్యప్రకృతి వలె కలదు.

"తాపతప్తజంతుతతుల విశ్వంభర
గర్భమున భరింపఁ గరుణఁ దలఁచి
తెఱపి యిచ్చె ననఁ గఁ దీవ్రాతపాహతి
నేల నెల్ల గాడి నెఱియ లొదవె." 5ప.6ఆ.

మండుటెండలకు నేల నెఱియలు తీయుటకు హేతుకల్పనము సహజ సుందరము.

కథాపరముగ మాంధాత హిమాలయము మీద విజయస్తంభమును ప్రతిష్ఠించుట(233ప.2ఆ.) సమకాలికసమాచారము. విమలాంగి చిత్రపటమును చూచిన విధానము చమత్కారకల్పనము

"కచభారరుచులఁ జీఁకటిగొన్న యపరాధ
మాననేందుద్యుతి నపనయించుఁ
గ్రూరకటాక్షముల్ గొన్నఁ బైకొను మూర్ఛ
నధరసుధారసం బాని తెలియుఁ

గుచ్ఛశైలతటుల డిగ్గుచుఁ గొన్న కంపంబుఁ
ద్రివళిసోపాన మూఁది విడఁ గాంచు
మధ్యకార్శ్యముఁ జూడ మదిఁ గొన్న కరుణంబుఁ
గటిబింబసంపదఁ గాంచి మఱచు
నూరుయుగలక్ష్మిఁ బాసి రా నొదవు తాప
మడఁచు బదపల్లవంబులయందుఁ బొరలి
రాజవరు దృష్టి కుంతలరాజకన్య
సుందరాకారముత్కంఠఁజూచునపుడు." 35ప.3ఆ.

మాంధాతకు తపోభంగము కలిగించుటకు ఇంద్రుడు రంభాదుల నియోగించునెడ రంభ ప్రగల్భములు :

"పంచాగ్ని శిఖలచేఁ బరితపింపని వారి
విరహాగ్ని శిఖలచే నేఁచి విడుతు
వర్షాంబుధారల వడిఁ గలంగని వారి
మోహాద్భుగ్ధారల ముంచి కలఁతు
సతతోపవాసులై చవులు డించిన వారిఁ
దవిలింతు నధరామృతంబు చవుల
మంచు చిల్కులకు రోమాంచ మొందని వాని
నునువు పుట్టింతు లేనవ్వు చిలికి
కాదు లక్ష్యంబు నాకు లోకత్రయంబు
పలుకనేటికి బడుగు తాపసుల కథలు?
నన్నుఁ జూడక, నా పేరు విన్నమాత్ర
పల్లవింపవె రాతిరూపంబులైన?" 50ప.6ఆ.

రాతిరూపములైనను, రంభను చూడకుండనే, పేరు విన్నంతనే పల్లవించును. కాని రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ, ఘృతాచి, మంజుఘోష, ప్రమ్లోచ, తార మొదలైన అప్సరోంగనల శృంగారక్రీడలకు మాంధాత చలింపలేదు సరికదా, రంభా దులు పరిచారికలయిరి!

"విటుకచాకృష్టికి విసువు నొక్క లతాంగి
వేలిమి కట్టియల్ విఱిచి తెచ్చు
నధిపుమై ముద్రింప నలయు వేఱొక రామ

సుదగోళ్లఁ గుసుమముల్ చిదిమి తెచ్చుఁ
బతి యున్న యెడ కేఁగ బడలు బాలిక యోర్తు
పరవనంబుల కేఁగి పండ్లు దెచ్చు
నెయ్యుఁగు పన్నీట నింప లావఱు నొక్క
నెలఁత తీవెల కెల్ల నీరు నించు
ననుపుఁ బల్లవులకు నర్మోపచారముల్
సేయ సేద నూఁదు చిగురుఁబోండ్లు
చిత్రలీలఁ దపసి శిష్యలై పరిచర్య
సూపుచుండి రాత్మశుద్ధి గలిగి." 95ప.6ఆ.

ఇది వీరశృంగారరసవిజృంభణమైన కవికర్ణరసాయనమునందు హాస్య రసప్రసరణము.

ఇక వైరాగ్యవర్ణనమెల్ల వైష్ణవమతానుసారము. చిదచిద్విశిష్టత (44ప.5ఆ.) శేష శేషిభావము (48ప.5ఆ.) విష్ణుమాయ (54ప.5ఆ.) విష్ణ్వాధిక్యము (73ప.5ఆ.) భక్తియోగము (94-99ప.5ఆ.) మోక్షము (147ప.5ఆ.) అష్టాక్షరీమంత్రము (157వచ.5ఆ.) మొదలైన విశిష్టాద్వైతసిద్ధాంతవిశేషములు సవిస్తరములు.

అష్టాదశాదివర్ణనము లకే అగ్రతాంబులము. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఉపలబ్ధమైనంతవఱకు, తొంబది తొమ్మిది పద్యములు సంకలనము చేయబడినవి. ప్రబంధరత్నాకరము వర్ణనపద్యసంకలనము. అందు నృసింహకవి వర్ణనల ఆధిక్యము కవికర్ణరసాయనము వర్ణనావైభవమునకు కతపత్రము.

**వెన్నెలకంటి సూరన**: ఈతని కృతి విష్ణుపురాణము. ఎఱ్ఱనయుగములోని పశుపతినాగనాథుడు రచించిన విష్ణుపురాణము లభింపలేదు.[225] ఎఱ్ఱన స్థలములోని వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము లభించినది. ఇది నీలకంఠేశ్వరస్థానమైన గుడ్లూరు రాజధానిగా పరిపాలించిన రావూరిపురవరాధీశ్వరుడు బసవయ రాఘవరెడ్డికి అంకితము. (15,16,20ప.పీ.) వెన్నెలకంటి సూరన "వెలుగోటి తిమ్మ భూవిభునిచేఁ గొనియెఁ దా నాందోళికాచ్ఛత్రమగు పదవిని" అని వెన్నెలకంటి వెంక టాచలము కృష్ణవిలాసమునందు కలదు.[226] రావూరి రాఘవరెడ్డి శాసనము 1526వ సంవత్సరమునందు. రావూరి రాఘవరెడ్డి వెలుగోటితిమ్మానాయుడు కలిసి వేయించిన శాసనము 1528 వ సంవత్సరమునందు కలవు.[227] కావున వెన్నెలకంటి

సూరన విష్ణుపురాణము రచనాకాలము 1528 ప్రాంతము కావలయును.

విష్ణుపురాణము అష్టాదశపురాణములలో ఒకటి. దూర్వాసశ్శాపవృత్తాంతము, మారిషజన్మవృత్తాంతము, తారాశశాంకవృత్తాంతము, కేశిధ్వజఖాండిక్యవృత్తాంతము వినా కడమ వృత్తాంతములెల్ల భాగవతమునందు కలవు. దూర్వాసశ్శాపవృత్తాంతము శ్రీనాథుని హరవిలాసములోని దూర్వాసశ్శాపవృత్తాంతమునకు మూలము. కేశిధ్వజఖాండిక్యవృత్తాంతము శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమునకు మూలము. తారాశశాంకవృత్తాంతము శేషము వేంకటపతి శశాంకవిజయమునకు మూలము.

మారిష జన్మవృత్తాంతము శృంగారజీవితమునకు పరాకాష్ఠ. కంధు డను ముని తపస్సునకు విఘ్నము కలిగించుటకు, ఇంద్రుడు ప్రమ్లోచను పంపించును. ప్రమ్లోచ కంధుని మదనాతురుని సేయును. శృంగారజీవితమును గడుపుదురు. నూరు సంవత్సరముల తర్వాత ప్రమ్లోచ ఇంద్రుని కొలువునకు పోవుదుననును. "నీవు వచ్చి యించుక దడవు లేదు" అని కంధుడు వారించును. మఱొక నూరు సంవత్సరముల తర్వాత అదేస్థితి. మఱొక ఇన్నూరు సంవత్సరముల తర్వాత కూడ అదేస్థితి. పెక్కు కాలము తర్వాత ఒకనాడు కంధుడు అపరసంధ్యానుష్ఠానములకు బయలుదేరును. ప్రమ్లోచ "ఎన్నడు లేనిది ఇప్పుడేల?" అనిన, కంధుడు "నేఁటి రేపకడ నీవు వచ్చితివి. మాపటి సంధ్య యొనర్పఁ బోవ, ఏల నవ్వితివి? నా కెఱింగింపు" మనును. ప్రమ్లోచ తాను వచ్చిన రేపకడకు, కంధుడు సంధ్యానుష్ఠానములకు బయలుదేరినమాపటికి మధ్య "తొమ్మనూటిపై నచ్చుగ నేఁడు మీఁద నెల లాఱు దినం బులు మూఁడు" గతించినవని చెప్పును. ప్రమ్లోచాకంధుల శృంగారజీవితకాలము 907 సం "7నె "3దినములు. కాని శృంగారరసము పొంగిపొరలలేదు. సభ్యతాసీమలను అతిక్రమింపలేదు.

"మలయక్ష్మాధరకూటదంతురశిలామార్గంబులన్ డస్సి త
ద్విలసన్నిర్ఝరవారిదీర్ఘికలలో విశ్రాంతిఁ గావించి పు
ష్పలతామంజులకుంజపుంజముల నిచ్ఛావృత్తి వర్తించుచున్
బొలసెన్ దక్షిణవాతపోతములు సంపూర్ణప్రమోదంబునన్." 212ప.2ఆ.

అను ఒక్క పద్యమే ఉద్దీపనవిభావము.

"తన శరీరము కమ్మతావి మూర్కొనునట్లు
గా వినోదమునఁ బైగాలిఁ బొలయుఁ
దన మోహనాకృతిఁ గనుఁగొనునట్లుగా
ముందర బిబ్బోకముగ నటించుఁ
దన కంఠములు వినవచ్చునట్లుగాఁ
బరివాదినులు మీటి పాడుచుండుఁ
దన మోవిరుచికిఁ బైకొని వచ్చునట్లుగాఁ
దియ్యని ఫలములు దెచ్చి యిచ్చుఁ
దన కరాలింగనమునకుఁ దగులునట్లు
గా శరీరంబు మోవంగఁ గదిసి మ్రొక్కు
నిత్తెఱంగున నమ్మని చిత్తవృత్తిఁ
గలఁచి మదనాతురునిఁ జేసెఁ గమలనయన." 214ప.2ఆ.

అను ఒక్క పద్యమే ప్రమ్లోచ శృంగారచేష్టలు. అంతేకాదు. నాలుగువందల సంవత్సరముల తర్వాత పోవుదునన్న ప్రమ్లోచతో కంధుడు పల్కిన విషయమిది:

"మొల్లసుగంధి నా మనసు మోహము నాఱడి వెట్టి నీవు న
న్నొల్లక వీడనాడెద వయో తగవా మగవారి చిత్తముల్
పుల్లసిలంగఁ జేయఁ బొరపొచ్చెము లాడఁగ నాఁడువారికే
చెల్లును జెల్లఁ బో వ్రతము చెడ్డ సుఖంబును దక్కదయ్యెఁ గా." 234ప.2ఆ.

చివరకు కంధుడు మదనభూతావేశము మాని విష్ణుపు గుఱించి తపస్సు చేయును.

ఇందు మందానిలవర్ణనము, శృంగారచేష్టలు, కంధుని శృంగార పారవశ్యము సూరన స్వతంత్రకల్పనములే. అంతేకాదు. తారాశశాంకవృత్తాంతమునందు తార విలాసము (15ప.6ఆ.) చంద్రుని వికారము (18ప.6ఆ.) తార ప్రవర్తనము 16ప.6ఆ. చంద్రుని వాంఛాప్రకటనము (22ప.6ఆ.) తార తమకము(24ప.6ఆ.) సూరన స్వతంత్రకల్పనములే. ధ్రువ,వేను,పృథు,ప్రహ్లాద,జడభరత,బలరామ,శ్రీరామ,శ్రీ కృష్ణచరిత్రములు విష్ణుపురాణమునందు సంగ్రహములు కథాప్రధానములు. భాగవతమునందు సవిస్తరములు. రసప్రధానములు. అందును పోతన భాగవతమునందు రసోల్బణములు. పోతన భాగవతము పూర్ణేందుబింబము. సూరన

విష్ణుపురాణము రేఖేందుబింబము. కాని సూరన విష్ణుపురాణాంధ్రీకరణము స్వతంత్రాంధ్రీకరణమే. అయినను సూరనకు వర్ణనావ్యామోహము లేదు. ఒక్క శరత్కాలవర్ణనము ఎనిమిది పద్యములందు కలదు. ఎనిమిది పద్యము లందును ప్రకృతికి, మానవప్రకృతికి సాదృశ్యకల్పనము సహజముగ సముజ్జ్వలముగ కలదు.

"అడవులలోన ముదంబులు
విడిచి మయూరములు మౌనవృత్తుల నుండెన్
గడు నొప్పని సంసారము
లుడిగిన యోగీంద్రు లూరకుండిన భంగిన్." 217
భానుదీప్తుల వేఁడిచేఁ బల్వలంబు
లెండి పిండలి వండుగా నింకిపోయె
దారుణంబైన సంసారతాపములను
నలఁగి చిక్కిన దుర్గృహస్థుల విధమున. 218.
సూర్యదీప్తివల్ల శోషించుచున్న ప
ద్మాకరంబులెల్ల నతిశయిల్లెఁ
బెక్కులంపటములఁ జిక్కిమమత్వముల్
మానకున్న జనుల మనసులట్లు. 220ప.7ఆ.

అసాధారణమైన వర్ణన. ధారాశుద్ధి ధారాళమైన శైలి. శ్రీనాథుని జ్ఞప్తికి తెచ్చు ప్రౌఢి. కల వెన్నెలకంటి సూరన ప్రౌఢకవియే కాని. విష్ణుపురాణము పురాణమే. కావ్యత్వసిద్ధి క్వాచిత్కము. "కావ్యములలోనఁ గావ్యంబు" అనుట "వేదంబులందెల్ల వేదంబు" అనుట వంటిదే. (30ప.1ఆ.)

**భానయ**: ఈతని కృతి పంచతంత్రి."శ్రీకృష్ణదేవరాయభూపాలకార్యభార ధౌరేయు"డైన లక్ష్మీనారాయణునికి అంకితము.(13ప.1ఆ..) అతడు మంత్రి నూత్న భరతాచార్యాంకుడు. ఈ విశేషణము ఆశ్వాసాంతపద్యమునందు (350ప.1ఆ.) మాత్రమేగాక గ్రంథమధ్యమునందును పలుతావులందు కలదు.(61,181,184,318ప.1ఆ. ;70,72,103ప.2ఆ.;49,120ప.3ఆ;28ప.5ఆ.) "సతతప్రాభవకృష్ణరాయధరణీచక్రేశకారుణ్యా వర్ధితలక్ష్మీవిలసన్నిశాంతుడు.(80ప.4ఆ.) శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు నాట్య సంగీతవిద్యాచార్యుడై, సంగీతసూర్యోదయమను సంగీతశాస్త్రగ్రంథమును రచించిన భండారు లక్ష్మీనారాయణుడే[228] ఈ లక్ష్మీనారాయణుడు.

[228] పరిపంథిగర్వ విభాళన. శ్రీకృష్ణ

రాయభూధవభుజారక్షచేత
రమ్యమైయున్న విద్యాపురమ్మునందు
నిమ్మహాకృతి భానుకవీశ్వరుండు
తెనుఁగు బాస నొనర్చెను వినుతి కెక్క." 51ప.5ఆ.

అని పంచతంత్రియందు కలదు. బహుశః శ్రీకృష్ణదేవరాయల రాజ్యావసాన కాలమునందు భానయ పంచతంత్రిని భండారు లక్ష్మీనారాయణునికి అంకితమిచ్చుట సంభవము. కాబట్టి పంచతంత్రి రచనాకాలము 1530 ప్రాంతము కావచ్చును.

పంచతంత్రి అన పంచతంత్రమే. శ్రీనాథయుగమునందు ఒక పంచతంత్రము కలదు.[229] అది దూబగుంట నారాయణుని పంచతంత్రము. అందలి పద్యములు నాలుగు భానయ పంచతంత్రియందు కలవు.[230] అందు మూడు పద్యములకు భానయ మకుటములు కలవు. అవి లక్ష్మీసచివవరేణ్యా, నూత్నభరతాచార్యా, విఠ్ఠయ లక్ష్మా, కరణికలక్ష్మా, విఠ్ఠయలక్ష్మధీమణీ, విఠ్ఠయక్ష్మాధీర, లక్ష్మమంత్రి, లక్ష్మ మంత్రీశ్వరా, విఠ్ఠయప్రభుని లక్ష్మ, లక్ష్మమంత్రివరేణ్యామాత్యమణీ, లక్ష్మా,సూక్ష్మలిఖితాచార్యా విఠ్ఠయలక్ష్మధీనిధీ, విఠ్ఠయ లక్ష్మణా, విఠ్ఠయలక్ష్మచంద్ర మొదలైనవి. నారాయణుని పంచతంత్రములోని మూడు పద్యములకు (108,109,110ప.2ఆ.) మూడు మకుటములు కలవు. (70,71,72ప.2ఆ.) అందొకటి-

" పరదేశమె నిజదేశము
పరులే బాంధవులు ద్రవ్యపరిపాలునకున్
ధరణి నసాధ్యం బెయ్యది
పరమార్థము ధనము సూవె ప్రజలకు నెల్లన్." 108ప.2ఆ.

పరదేశమె నిజదేశము
పరులే బాంధవులు ద్రవ్యపరిపాలునకున్
ధరణి నసాధ్యం బెయ్యది!
పరమార్థం బిదియె నూత్నభరతాచార్యా!" 70ప.2ఆ.

నారాయణుని పంచతంత్రమునందు వలె భానయ పంచతంత్రియందు కతిపయ వర్ణనములు కలవు. పూర్వకవితాచర్వణమును కలదు. శ్రీనాథుడు ప్రయోగించిన వ్యామగ్రాహ్యపదబంధమును భానయ ప్రయోగించెను.

" వ్యామగ్రాహ్యపయోధరభారమ్మువలన మధ్యం బసియాడ" 145వచ.1ఆ.

నంది తిమ్మన పారిజాతాపహరణములోని "తన మణి పడిపోవ ధరణీతలంబున నెమకంగ వచ్చిన నింగి యనఁగ" అను పాదమును 34ప.2ఆ.) అనుసరించి భానయ రచించిన పద్యము :

" తన మణి పోవ నంబరము ధారుణిలో వెదుకంగవచ్చెనో!
యనఁ దగె నంధకారనివహమ్ము, సరోజభవాండపేటికన్
దనరఁగ నిడ్డ కస్తురి విధంబున, జారుల మానసమ్ములన్
ఘనముగఁ గైరవమ్ములు వికాసము నొందె ననంతరమ్మునన్." 134ప.1ఆ.

పురవర్ణనము (58ప.1ఆ.) సూర్యాస్తమయవర్ణనము (133ప.1ఆ.)అంధకారవర్ణనము (134ప.1ఆ.) చంద్రోదయవర్ణనము (135ప.1ఆ.) వారాంగనావర్ణనము (145ప.1ఆ.330ప.1ఆ.) సూర్యోదయవర్ణనము (148ప.1ఆ.) గ్రీష్మవర్ణనము (254ప.1ఆ.) వర్షావర్ణనము (275ప.1ఆ.) శీతవర్ణనము(281,282ప.1ఆ.) ప్రభాతవర్ణనము (303ప.1ఆ.) వృక్షవర్ణనము(254ప.2ఆ;5ప.3ఆ.6ప.4ఆ.) రతివర్ణనము (100ప.3ఆ.) సముద్రవర్ణనము (5ప.4ఆ.) కలవుగాని వర్ణనావ్యామోహము లేదు.

ఇతరపంచతంత్రములందు లేని కథ యొకటి భానయ పంచతంత్రియందు కలదు. అది కైతవమునకు కైతవమే పొంది పొసగునని తెలుపు వేశ్యారాజకీరముల కథ. ఇది శుకసప్తతియందు కలదు. భానయ రచనము సరసము. (320-348ఉ.1ఆ.) మొత్తము మీద భానయ పంచతంత్రి, దూబగుంట నారాయణుని పంచతంత్రము వలె సరళము. నీతిచంద్రిక ముందు నీరసము.

**తాళ్లపాక పెదతిరుమలాచార్యులు** : ఇతడు తాళ్లపాక అన్నమాచార్యుల చిన్నభార్య అక్కమాంబ తనయుడు. పెద తిరుమలయ్య, పెద తిరుమలయ్యంగార్, అన్నయ తిరుమలార్యుడు, అన్నయ తిమ్మనార్యుడు, పెరియ తిరుమలయ్యంగార్, తిమ్మనార్యుడు, తిరుమల, తిరుమలాచార్యులు, తిరుమలగురువు, తిరుమలార్య[231] దేశికుడు, తిరుమలయ్యంగార్, తాళ్లపాక తిరుమలయ్య అని కూడ వ్యవహృతుడు. ఈతని కృతులు 1. నీతిశతకము. 2. శృంగారశతకము.3. శృంగారదండకము. 4. చక్రవాకమంజరి. 5. మేలుకొలుపు ద్విపద. 6.సుదర్శనరగడ. 7. వేంకటేశోదాహరణము. 8. వైరాగ్యవచనమాలికాగీతములు.(వేంకటేశ్వరవచనములు) 9. ఆంధ్రవేదాంతము (భగవద్గీతటీక) 10. హరివంశము.11. శృంగారసంకీర్తనములు. 12. అధ్యాత్మసం

కీర్తనములు. 13. రేఫఱకారములు. ఈతని శాసనములు 1517 నుండి1546 వఱకు కలవు.[232] కాలము 1460-1546 అని పూర్వోక్తము.[233] కాబట్టి కృతుల రచనాకాలము స్థూలముగ1501-1545 కావచ్చును.

నీతిశతకములోని శతకాంతపద్యమునందు "తాళ్లపాక 1యన్నయాచార్యసుత తిమ్మయాహ్వాయుండ బ్రణుతి చేసితిఁ జేకొమ్ము పద్యశతము" అని కలదు. వేంకటేశ్వరాంకితము. సరిగా నూరు పద్యములు కలవు. అన్నియు సీసపద్యములు. మకుటము సమానము. "కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ విమలరవికోటిసంకాశ వేంకటేశ" అని సగము తేటగీతి. లోకనీతులు, రాజనీతులు, తత్త్వనీతులు కలవు. వేమన ప్రభావము[234] విశేషము.

" భక్తి చేసిన చోట ఫలమిచ్చు దైవంబు
మనసు నిల్పిన చోట మలయు సుఖము" 2.
" పాపకర్మున కేల పరపురుషార్థంబు
ధనలోభి కేల బాంధవము చింత" 3.
" కులము వారల కియ్యకోలైన దిల్లాలు
xxx xxx xxx
మోక్షమార్గము చూపు ముఖ్యుండె యాచార్యుఁడు" 6.
" అసలు విడిచిన నలమటలే లేవు
xxxx xxx xxx
మగువల రోసిన మరుబాధ లడరవు" 11.
" కాంతలు పెక్కైనఁ గడు వేసటై తోఁచు
నెంత సంపద గల్గె నంత చింత" 16.
" బడి సంతబసివి యెవ్వరిది గాదు" 20.
" ధరణి దారిద్ర్యంబు దైన్యంబు నొందించు" 23.
" పేదకు నర్థంబు పిలిచి తానిచ్చుట
కడలేని యార్తుని గాచికొనుట
శరణు సొచ్చిన వానిఁ జనవిచ్చి మనుచుట
యెదుటఁ బడ్డ యనాథు నేలుకొనుట
చంపఁ దెచ్చిన వాని చావు మాన్పించుట
యగతికుండగు రోగి నాదుకొనుట
లింత కంటెను బుణ్యంబు లెందుఁ గలవు" 31.

" పతికి మాఱాడక పలుమాఱు నేడ్వక
యలుగక మిగుల గయ్యాళి గాక
xxx xxx xxx
అదువ దాఁపక మర్మ మవ్వలఁ జెప్పక
బొంకక నిద్దురపోతు గాక
కాఁపురము సేయు కామిని గలిగెనేనిఁ
బలుకు లేటికిఁ ఋరుమని భాగ్యమహిమ." 32.
" నరనాథు పొరుగిల్లు నమ్మరాదు" 36.
" సాలీని పోఁగులా సంసారపాశంబు
లల్లమా బ్రహ్మాండ మరసి తెలియ" 40.
" ఇంక నేరికి సతములౌ నెల్లసిరులు
దా నొనర్చిన ధర్మంబె దక్కుఁ గాక" 41.
" చెలులు సంగడినున్నఁ జిత్తంబు చలియించుఁ
గనకముఁ బొడఁగన్నఁ గడఁగు నాస" 52
" పదుగురాడిన మాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁడాడినమాటయెక్కదెందు
నుఱక యుండిన వాని కూరెల్ల నోపదు
నిజము ముందఱఁ గల్ల నిలువ దెపుడు" 63
" తిట్టిన తిట్టులు దీవన ల్గా విని
యల శత్రు మిత్రుగా నాత్మఁ దలఁచి" 72.
" గాడిద యెఱుఁగదు గంధంబు వాసన" 74.
" అపవాది యగువాని నటు చంపవలవదు
తానాడు కల్లలే తన్నుఁ జెఱుచు 77.
" చేసిన కర్మంబు చెందక మానదు
xxx xxxx xxx
దైవసంకల్పంబు తప్ప దెందైనను" 87
" కాశికిఁ బోవచ్చుఁ గ్రమ్మఱ రావచ్చుఁ
దెలిసి సుషుమ్న భేదింపరాదు
మౌని గావచ్చు నేమములు చూపఁగవచ్చుఁ
బాఱెడు మనసు నిల్పఁగరాదు
నేర్పు లే గతి నెవ్వరు నేర్చి రైన

సరవితో బ్రహ్మవేత్తల సరికి రారు." 98.

ఇట్లు బహునీతిబంధురమైనను, ఇతరనీతిశతకముల వలె, ఇది లోకుల నాలుకలే ఆకులుగ వెలయకపోవుటకు హేతువు సీసపద్యము లగుట కావచ్చును.

శృంగారశతకము వృత్తపద్యముల శతకము. నూట మూడు పద్యములు కలవు. శార్దూలముల కంటె మత్తేభములు, మత్తేభముల కంటె చంపకమాలలు, చంపకమాలల కంటె ఉత్పలమాలలు అధికముగ కలవు. చంపకోత్పలమాలలందు "వేంకటేశ్వరా" అని మకుటము. మత్తేభశార్దూలములందు "వేంకటాద్రీశ్వరా" అని మకుటము. కవి మధురభక్తినివేదనమే ఆత్మీయత. కవి నాయిక వలె వేంకటేశ్వరునికి నాయకునికి వలె భక్తివలపు విన్నపము చేయును. భక్తి అంతర్గతము, వలపు బాహిరము కావున శృంగారశతకము.

" నెపముల్ చెప్పుచు రాక యాకె తగులై నెందొంటి నా యింటికిం
గపురుల్ చూపుచు వచ్చి క్రుచ్చెదవు నన్ గాందారి మాందారి పొ
ద్దపుడే కౌఁగిట లోఁగిటన్ మృదులశయ్యం జెందు నాయందు నే
రుపులీ నిద్దురపొద్దు వద్దెసఁగు దూరుల్ వేంకటాద్రీశ్వరా! 11ప.
" దండము వెట్టెదన్ వలపుతండము తండముగాఁ దొడంగె ను
ద్దండపు మాటలాడ కిటు దండనె యుండఁగ నీవు నన్నుఁ గై
దండ యొనర్చి నేఁడు విరిదండ యొసంగితి విట్లు నాకు వే
దండము నెక్కి నంతటి ముదంబటు గల్గెను వేంకటేశ్వరా! 29ప.
"వెలఁదులతోడ నవ్వు పదివేవురఁ బెండిలియాడు నిన్ను నే
వలదన దిట్టి వెల్ల మగవానికి సాజము లౌట దానికిం
గలిగిన దొక్క సిగ్గు ననుఁ గౌఁగిటఁ గూడుచు నన్యకాంతలం
తలఁ తురె నీకు మ్రొక్కెద వెతం బొరలించకు వేంకటేశ్వరా! 52ప.

ఇట్లు ప్రతిపద్యమునందు అన్యనాయికాసక్తుడైన నాయకుని కొఱకు ఒక నాయిక వియోగపరివేదనము సంయోగనివేదనము సేయుట కలదు. అది మధురభక్తి.

శృంగారదండకము స్తోత్రము కాదు. దండకరూపమైన ఇతివృత్తము. వేంకటేశ్వరుని గుఱించి విని "ఒక్కబింబోష్ఠి మోహించును. సఖులు చూచి, నేర్పులు పచారించి, ఉద్యానవనమునకు తోడ్కొనిపోయి, క్రీడాసరస్సునందు జలక్రీడ లాడింతురు. సరోవరపాలికలు వేంకటేశ్వరునికి బింబోష్ఠి గుఱించి విన్నవింతురు. వేంకటేశ్వరుడు

సౌధము నెక్కి బింబోష్ఠిని చూచి కామించును. జలక్రీడ చాలించినబింబోష్ఠి బిట్టుల్కిపడి కాంతుని కాంచును. వేంకటేశ్వరుడు ప్రేమలేఖ పంపించును. సఖులు వనవిహారము చేయింతురు. బింబోష్ఠి విరహావస్థనందును.సఖులు శీతలోపచారములు చేయుదురు. రాయబారము నడుపుదురు. వేంకటేశ్వరుడు ఉద్యానవనమునకు వచ్చి, బింబోష్ఠిని లాలించి, పక్షీంద్రుపై నెక్కించుకొని నిజధామమున కేగును. ఇది శృంగారదండక ములోని ఇతివృత్తము. దండకాంతమునందు కృతికర్తృవిషయము, కృతిభర్తృవిషయము తెలుపు పద్యము కలదు.

"సన్నుతిఁ దాళ్లపాకపురశాసనుఁ డన్నయతిమ్మనార్యుఁ డ
త్యున్నతిఁ జెప్పె దండకము దుగ్ధపయోనిధికన్యకారతి
స్విన్నమృగీమదాంకునకు వేంకటభర్తకు నిత్యభోగసం
పన్నన కారవీందుకులపర్వతతారకమై చెలంగఁ గాన్"

అన్నయ తిమ్మనార్యుడు పెదతిరుమలాచార్యులు. కృతికర్త. వేంకటపతి కృతిభర్త. అనగా పెదతిరుమలాచార్యుల శృంగారదండకము వేంకటేశ్వరునికి అంకితము.

ఇది అన్నమాచార్యుల శృంగారమంజరి వంటిదే. అది మంజరీద్విపద. ఇది దండకము.

చక్రవాళమంజరి మంజరీద్విపద. నూట పదమూడు ద్విపదలు కలవు. "రవి కోటితేజోవిరాజితు పేరఁ బేరగు జవరాలి పెనిమిటి పేర", "అన్నయవర్యతనయ నయశాలి తిమ్మయ నవచతురతలఁ దలఁచి మంజరి చెప్పె"నని తుది ద్విపదలందు కలదు. రవికోటితేజోవిరాజితుడు వేంకటేశ్వరుడు. కనుక వేంకటేశ్వరాంకితము. మంజరియందు చక్రవాళమంజరి అని లేదు. చక్రవాళము కావ్యభేదము. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు లక్షణము కలదు. అందు"వరుస నాది మధ్యాంతవర్ణయుగళ మంత్యవాక్యాదిమాక్షరయమళకముగ నిడి" అని కలదు. (35ప.4ఆ.) ఇందు పాదాంతవర్ణసంపుటి తర్వాతి పాదాదివర్ణసంపుటిగ కలదు.

"శ్రీలలనాధారుఁ జిన్మయాకారుఁ
గారుణ్యావర్తి వేంకటగిరిమూర్తి"
"గుడిగొని వనముఁ గ్రక్కునఁ జొచ్చినపుడ
పుడమి వసంతంబు పొడమె నందంద"

"ఆడఁ జరించు రాయంచల నలమి
యల మీనములఁ బట్టి యట బోరవలను."

ఇతివృత్తము ఇంచుమించు శృంగారదండకేతివృత్తమే. అందు "ఒక్కబింబోష్ఠి ఇందు "కొందుక కొమ్మ". ఈమె "మరుని చొక్కపు రూపు వ్రాసి" పూజించి. వరములు వేడుట అదనము. అందు సఖీవరపాలికలు. ఇందు వనరక్షకులు. అది విస్తరము. ఇది సంగ్రహము. దండకరచన ధాటీగతి. ద్విపదరచన మందగతి.

అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యులు ఇట్టి రచనలు చేయుటకు హేతువు. స్వామి నిత్యకల్యాణము. పచ్చతోరణము కావచ్చును. ఇదొక భక్తివిశేషము.

మేలుకొలుపు ద్విపద వేంకటేశ్వరప్రభాతస్తవము. అరువది మూడు ద్విపదల లఘుకృతి. ప్రతిద్విపద చివఱ "మేల్కనుము అని కలదు.

"వసుదేవదేవకీవరగర్భజాత
కిసలయాధర రామకృష్ణ!మేల్కనుము"

ఇందు శ్రీకృష్ణచరితము కలదు. అయినను శ్రీవేంకటేశ్వరస్వామికి మేలుకొలుపు.

సుదర్శనరగడ స్తోత్రము. విష్ణువు పంచాయుధములలో ఒకటి మాత్రమేగాక. ప్రధానాయుధమైన సుదర్శనచక్రము స్తుతి. రగడ ఛందస్సునందు కలదు. నూటయెనిమిది పాదములు కలవు. ప్రతిపాదమునందు నాలుగు మాత్రల గణములు నాలుగు లేవు. పదాఱు మాత్రలు కలవు. మధురగతిరగడ అగును. ప్రాస కలదు. ప్రతిపాదాంతమునందు "చక్రము" కలదు. స్తోత్రము శ్రీకారముతోగాక ఓంకారముతో ప్రారంభమైనది.

"ఓంకారాక్షరయుక్తము చక్రము
సాంకమధ్యవలయాంతరచక్రము"
"నేత్రత్రయవర్ణితగురుచక్రము
రాత్రించరవిద్రావణచక్రము"
"వేయు విధంబుల వెలసిన చక్రము
వేయంచులు గల విశ్వపుఁ జక్రము
భావించు సుజనపాలనచక్రము

శ్రీవేంకటపతి చేతిది చక్రము."

వేంకటేశోదాహరణము ఉదాహరణప్రక్రియ. వేంకటేశ్వరస్తుతి. ఇందు అష్టవిభక్తులందును వృత్తములు. కళికలు. ఉత్కళికలు కలవు. సార్వవిభక్తికపద్యము కలదు. కృతికర్తృకృతిభర్తృవిషయకపద్యము కలదు. అష్టవిభక్తులందును వృత్తములు ఉత్పలమాలలు. ప్రథమావిభక్తి కళిక వృషభగతిరగడ. ద్వితీయావిభక్తి కళిక ద్విరదగతిరగడ. తృతీయావిభక్తి కళిక తురగవల్గనరగడ. చతుర్థీవిభక్తి కళిక హరిణగతిరగడ. పంచమీవిభక్తి కళిక ద్విరదగతిరగడ. షష్ఠీవిభక్తి కళిక విజయమంగళరగడ. సప్తమీ విభక్తి కళిక మధురగతిరగడ. సంబోధనాప్రథమాంతవిభక్తి కళిక ద్విరదగతిరగడ. నవ విధరగడలందు ఆరు రగడలు కలవు. సార్వవిభక్తికవృత్తము శార్దూలము.

"నీ పీఠుండవు నిన్నుఁ గొల్తు వరముల్ నీచేతఁ గైకొందు నేఁ
గైవారం బొనరింతు నీ కొఱకు సంకల్పింప నీడేఱె మ
త్సేవల్ నీ వలనన్ మహాయశము నిల్చెన్ నీకు నీయందు ల
క్ష్మీవాల్లభ్యముఁ గంటి భక్తవరదా శ్రీవేంకటేశ్వరా." 25.

ప్రక్రియాంతపద్యము :

"ఆరవితారకంబుగ నుదాహరణంబు రచించె భక్తివి
స్తారతఁ దాళ్లపాకపురశాసనుఁ డన్నయతిమ్మనార్యుఁ డిం
పారఁగఁ జక్రనందనగదాంబుజధారికి శ్రీవధూమనో
హారికి వేంకటాచలవిహారికి శౌరికి నంకితంబుగాన్." 26.

పెద తిరుమలాచార్యులు భక్తివిస్తారతను రచించిన వేంకటేశోదాహరణము వేంకటేశ్వరాంకితము.

వైరాగ్యవచనమాలికాగీతములు వచనములు. నలుబదియేడు వచనములు కలవు. వేంకటేశ్వరవచనములని వ్యవహారప్రసిద్ధము. వచనవాఙ్మయప్రథమా చార్యులు కృష్ణమాచార్యుల సింహగిరినరహరివచనములకంటె, వచనవాఙ్మయద్వి తీయాచార్యులు పెదతిరుమలాచార్యుల వైరాగ్యవచనమాలికాగీతములు సంగీతవైభవోపేతములు. ప్రతివచనము గీతము. రాగతాళనిర్దేశము కలదు. పెద తిరుమలాచార్యుల వైరాగ్యము పరాకాష్ఠదశ నందినది. అందువలన వైరాగ్యవచన మాలికాగీతములను గ్రంథనామమే అన్వర్థము. అంతేకాదు. గీతిప్రాధాన్యము తోపాటు రీతిప్రాముఖ్యము. కవితాప్రాగల్భ్యము కల గ్రంథమిది. వేంకటేశ్వరునికి నమస్కారము

చేయుటకు పెద తిరుమలాచార్యులు చెప్పిన హేతువు స్వార్థమే కాదు; పరార్థము కూడ.

"నీ పాదంబులకు సాష్టాంగనమస్కారంబునుం జేసెద।
నేమి నిమిత్తంబు సేసెద నంటివా, నాలుగు యుగముల
ధర్మంబులు, సకలజంతువుల పరిణామములు।
కమలాసనాదిదేవతల బ్రతుకులు నీ మూలము గావున
నీవు శుభమున నుండుటే మేలు శ్రీవేంకటేశ్వరా మఱియును-॥ 2.

భక్తిప్రాధాన్యము నిట్లు ప్రతిపాదించెను.

"పురుషోత్తమా వేదంబులు రత్నాకరంబుల వంటివి।
తమలోపలి యర్థంబులు బయలుపడనీవు।
పురాణంబులు దంటవేటకాండ్ర వంటివి।
నానార్థంబులు చాటి చెప్పి భ్రమియించుఁ గాని
నొకటు నిశ్చయంబుఁ దేటపడనీవు।
భాట్టప్రాభాకరాదిశాస్త్రంబు లన్యోన్యశత్రువుల వంటివి।
నొక్కొక్కమతంబువేఱొకమతమునుఖండించుంగాని
నీ మీఁది భక్తి బోధింపవు।
దానంబు లింద్రజాలంబుల వంటివి।
నొకటి పదియౌతై యనుభవింపఁ జేయుంగాని ముక్తికిం
దెరువు చూపనేరవు।
ఇతరకర్మంబులు చేనిపంటల వంటివి।
జన్మపరంపరలకు హేతువులై దేహంబులు మొలపించుం
గాని వైరాగ్యంబులు వొడమనీవు।
వీని చందంబు లిట్టివి యేమిటం దెగు సంశయంబు
నిక్షేపంబు పెట్టిన వాఁడే చూపక కానంబడదు।
నీవు సర్వజ్ఞుండవు నాకు నిశ్చితార్థం బిట్టిదని
తెలుపంగదె శ్రీవేంకటేశ్వరా మఱియును ॥ 7.

భక్తివైరాగ్యములేగాక వైరాగ్యవచనమాలికాగీతములందు ఉక్తివైచిత్రి ఉజ్జ్వలము.

"శ్రీవేంకటగిరిదేవా నా దేహంబు నీ వుండెడి నిత్యనివాసంబు।

నా జ్ఞానవిజ్ఞానంబులు నీ యుభయపార్శ్వంబుల జీవంబులు।
నా ముకుఁజెఱమల యూర్పులు నీ యిరుదెసలం బట్టెడి యాలవట్టంబులు।
నా మనోరాగంబు నీకుం జంద్రకావి వలువ।
నీకు మ్రొక్క నెత్తిన చేతులు రెండును మకరతోరణంబులు।
నా భక్తియే నీకు సింహాసనంబు।
నా మేనం బొడమిన పులకలు నీకు గుదులు గ్రుచ్చి యర్పించిన పూదండలు।

నే మిమ్ము నుతించిన నుతుల యక్షరరవంబుల
భేరీభాంకారఘంటానినాదంబులు।
నా పుణ్యపరిపాకఫలంబులు నీకు నైవేద్యతాంబూలాదులు।
మదీయనిత్యసేవాసమయనిరీక్షణంబులు నీ సర్వాంగంబుల
నలందిన తట్టు పునుంగు।
నా సాత్త్వికగుణంబు నీకు ధూపపరిమళంబు
నీవు దేవదేవుండు నే నర్చకుండను।
ఈ రీతి నిత్యోత్సవంబు నాయందు నవధరింప శ్రీవేంకటేశ్వ.
రా మఱియును॥" 1.
"సర్వేశ్వరా యవధారు జగంబు నీ నాటకశాల।
నే నెత్తిన తొలు జన్మంబుల యాకారంబులు
నీ ముందర నాడెడు బహురూపములు।.
దారసుతబంధుజనులు మేళగాండ్రు।
నిన్ను నుతియించు వేదశాస్త్రపురాణములు తూర్యత్రయంబు।
మా పాదప్రచారంబు నాట్యంబు।
చేయు చేఁతలు నాడెడు మాటలు క్రియాభాషాంగములు।
మా భోగవస్తువులు నీవు మెచ్చిన యీవులు।
యీ రీతి నెంత కాలంబు నీకు వేడుక యంత గాలంబు నాడెదము।
కొలువు నర్తకులమైన వారము నీకు వినోదంబు సేసికొని బ్రతుక
వలయుఁగాని నెమ్మది మోక్షంబున నుండెద మనుట యే సంగతి।
నీవే దయ దలంచి కృపసేసినపు డయ్యెడుగాక యెఱుక గల
యేలికను గొలిచిన వారికి నడుగ నేమిపని నీవు నన్ను
నన్నిటా మన్నించితివి శ్రీవేంకటేశ్వరా॥" 30.

ఇట్లు వైరాగ్యవచనమాలికాగీతములు గీతిప్రాధాన్యము. రీతిప్రాముఖ్యము. కవితాప్రాగల్భ్యము కల మేలి రచనము. మేటి వచనము.

పెదతిరుమలాచార్యులు "వేదాంతవిద్యాప్రవీణుఁడై యాంధ్రవేదాంత మొన రించె"నని తాళ్లపాక చిన్నన్న అష్టమహిషీకల్యాణమునందు కలదు.(89-90పం.) అది భగవద్గీత టీక. గ్రంథాంతమునందు "-తిరుమలయ్య వాచాప్రౌఢిన్। వెరవున భగ వద్గీతల। పరమార్థము ఆంధ్రభాష పరఁగ రచించెన్" అని కలదు. ఇది వేదాంత గ్రంథము.

పెద తిరుమాలాచార్యులు "ద్విపదరూపమున। హరివంశకావ్య మాయత రసస్ఫూర్తి। హరివంశ మిగురొత్త ననువొందఁ జేసి"నట్లు తాళ్లపాక చిన్నన్న అష్టమ హిషీకల్యాణమునందు కలదు. (90-92పం.) కనుక ద్విపదకావ్యము. అనుపలబ్ధము.

సంకీర్తనములు "శాలివాహనశకవరుషంబులు అగు నేఁటి దుందుభి సంవత్స రఫాల్గుణ బ॥ 1 మొదలుగాను. తాళ్లపాక అన్నమాచార్యులుంగారు తమ కొమా రుఁడు తిరుమలాచార్యులను దినమొక సంకీర్తన శ్రీవేంకటేశ్వరునకు అంకి తము చేసి చెప్పు మనఁగాను విన్నపములు సేసిన సంకీర్తనలు"

అని రాగిరేకు మీద కలదు. అన్నమాచార్యుల సంకీర్తనముల వలె పెద తిరు మలాచార్యుల సంకీర్తనములును ద్వివిధము. 1. శృంగారసంకీర్తనములు. 2.ఆధ్యాత్మ సంకీర్తనములు. రెండును అన్నమాచార్యుల సంకీర్తనములను అనుసరించినవియే. పెద తిరుమలాచార్యుల సంకీర్తనములు వేంకటేశ్వరాంకితములే. వేంకటేశ్వరుని కడప రాయడు. చేఁగలమఱ్ఱి చెన్నుఁడు. విజయనగర కోనేటివేంకటేశుడు. శ్రీరంగ నాథుడు. చిందనూరు కనకరాయుడు. మండెము రాయడు. పండరంగి విట్ఠలుడు. శ్రీకృష్ణుడు. చొక్కనాథుడు. ఓబళేశుడు. తిరుపతి గోవిందరాజులు అని కూడ ఆరోపిం చెను. శృంగారసంకీర్తనలు 544 కలవు.

"ఏమి సేతు నా భాగ్యము యెఱిఁగీ నెఱుఁగనీదు
నా మోహమే మిక్కుటమై నన్నుఁ దడఁబరచెను ॥పల్లవి॥
భావించి నిన్నుఁ జూచితే పరవశ మౌదుఁగాని
ఆవేళ నీతో సరసమాడ మఱతు
చేవ మీఱఁ దలఁచితే చిత్తము గరఁగుగాని
వోవరిలో గుబ్బల నిన్నొత్తిపట్ట మఱతు ॥ఏమి॥

గక్కన నీ వెదురైతే కడు సిగ్గు రేఁ గుఁ గాని
పెక్కు వుపచారాల మెప్పించ మఱతు
తక్కక నీ వంటితేను తమకమే విందుఁ గాని
చొక్కించి నాచేఁ తలు చూపంగ మఱతు ॥ఏమి॥
జట్టిగా నిన్నుఁ గూడితే సంతోసమే నిండుఁ గాని
గుట్టున నీమోవి చవి గొన మఱతు
యిట్టె శ్రీవేంకటేశ యే నలమేల్మంగను
నెట్టన నీ గుణాలు వర్ణించ మఱతు ॥ఏమి॥ 245.

అధ్యాత్మసంకీర్తనములు 450 కలవు. ఇందు విశిష్టాద్వైతసిద్ధాంతము విస్తృతముగ కలదు. అంతేకాదు. ఒక సంకీర్తనమునందు వీరవైష్ణవుని లక్షణములు వివరింపబడినవి. వీరవైష్ణవశబ్దము ఆచార్యప్రోక్తమే.

"కన్నవారి కెల్లా నేల కలుగు వైష్ణవము
వెన్ననిని నమ్మఁగ వలె వీరవైష్ణవునకు॥పల్లవి॥
పరగఁ బాపముఁ గంటే భయము నొందఁగవలె
నరయ సంసారమందు నరుచి పుట్టఁగవలె
విరివి భోగములందు వెనటు పుట్టఁగవలె
విరతి గలుగవలె వీరవైష్ణవునకు ॥కన్న॥
తలపోసి సుజ్ఞానము ధనమని వుండవలె
పొలసి తన నేరా లెప్పుడుఁ దలఁచఁగవలె
కలకాల మాచార్యుఁ డే గతియని యుండవలె
వెలిఁ గోరకుండవలె వీరవైష్ణవునకు ॥కన్న॥
ఘనమోక్షమార్గమందు కడు రుచి గల్గవలె
పెనఁగి భాగవతుల ప్రేమ గలుగఁగవలె
తనర శ్రీవేంకటేశుదాసుఁడై బ్రదుకవలె
వినయము గల్గవలె వీరవైష్ణవునకు" ॥కన్న॥ 328.

రేఫఱకారములు శబ్దశాస్త్రము. వేంకటేశ్వరాంకితము. (1ప.) రేఫముతోడి శబ్దముల పట్టిక ఏబది మూడు పద్యములందు. శకటరేఫము తోడి శబ్దముల పట్టిక ఏబది రెండు పద్యములందు మొత్తము నూట అయిదు పద్యములందు కలవు. తుది పద్యము కర్తృవిషయము.

"క్షీరనీరవిభేదంబు చేసినట్లు
ధరణి రేఫఱకారముల్ తాళ్లపాక
తిరుమలార్యుండు వేర్వేఱఁ దేటపఱచె
నుచితమిది గాదె పరమహంసోత్తమునకు 55-53 = 108ప.

ఇట్లు తాళ్లపాక పెద తిరుమలాచార్యులు బహుగ్రంథకర్త అయినను;నీతిశతకము, శృంగారదండకము, చక్రవాళమంజరి, వైరాగ్యవచనమాలికాగీతములు వైభవోపేతములు.

**తాళ్లపాక చిన తిరుమలాచార్యులు** : ఇతడు పెదతిరుమలాచార్యుల పెద్దకొడుకు. చిన్న తిమ్మయ్య, చినతిమ్మాదీక్షితులు, చిన తిరుమలయ్య, చిన తిరుమలదీక్షితులు, చిన తిమ్మ, తాళ్లపాకం చిన తిరుమలయ్య, చిన్న తిమ్మన్న, చిన్న తిరుమలయ్యంగార్, శిఱు తిరుమలై అయ్యంగార్, తిరుమల అని కూడ వ్యవహృతుడు.[235] ఈతని కృతులు సంకీర్తనలక్షణము, అష్టభాషాదండకము, శృంగారసంకీర్తనములు, అధ్యాత్మసంకీర్తనములు. అష్టభాషాదండకమునందు "హేమళంబిసంవత్సరమార్గశిరశు ౫ బుధవారము" నాడు ఆనతిచ్చినట్లు కలదు అది 7.11.1539వతేదీ.[236] పెద తిరుమలాచార్యుల కాలము స్థూలముగ 1460-1546 కావున, ఆతని పెద్దకొడుకు చిన తిరుమలాచార్యుల కాలము స్థూలముగ 1485-1550 కావచ్చును. కృతుల రచనాకాలము 1520-1550 కావచ్చును.

సంకీర్తనలక్షణము అతని తాత అన్నమాచార్యుల సంస్కృతగ్రంథమునకు తెనుగుసేత. (15-17ప.) లక్షణగ్రంథము. వృత్తపదములు, నిబంధనపదములు, గొబ్బిళ్లపదములు, చందమామ పదములు, దరువులు, చంద్రపదములు, చూర్ణపదములు, ఏలపదములు, యక్షగానపదములు మొదలైన పదకవితాప్రభేదముల లక్షణములు కలవు. అంతేకాదు, అన్నమాచార్యుల పదములగుఱించి పది పద్యములు కలవు. తండ్రిగుఱించి తనయుడు, తాత గుఱించి మనుమడు రచించినవి అతిశయోక్తివిలసితములైనను సహజోక్తివికసితములును అగుట సహజము. చిన తిరుమలాచార్యుల పది పద్యములలోని ఒక పద్యమిది :

"శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులై

నుతులై తాళుల (ళ?) పాక యన్నయవచోనూత్నక్రియల్ చెన్నగున్." 12ప.

అన్నమాచార్యుల సంకీర్తనములు వేదములు, శాస్త్రములు, పురాణములు, ఆగమములు అనుట అతియోక్తి. సుజ్ఞానసారములు, మంత్రార్థములు, నీతులు, కృతులు, వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యములు. నుతులు అనుట సహజోక్తి.

అష్టభాషాదండకము వేంకటేశ్వరస్తుతి. అష్టభాషలందు కలదు. ఆ భాషలివి:సంస్కృతము, ప్రాకృతము (మహారాష్ట్రి), శౌరసేని, మాగధి, పైశాచి, ప్రాచి, అవంతి సర్వదేశి. నందమపూడి శాసనమునందు పైశాచీభాషాప్రసక్తి కలదు. అష్టభాషాదండకమునందు పైశాచీభాషాపంక్తులు కలవు.

"అచ్ఛి నిజేసో పిపాసేస సంసెవ్వ గోలీ స భూసాయమాణం ఘి
జాతాపగా నీరసాళప్పహో యే విసాళ త్తణేణం యరచ్చాచయేసుం
సరిచ్చప్పవాహిం యళీళాఘురేహిం విరాయంతరణ్ణేహి వాతాయణా
యాతబ్భయాసీ ' సౌరబ్భసంపత్తిసుద్ధతయోహిం య కప్పూరకద్దూరి
కమ్హారగోరోచనానేయ సప్పుప్ఫసవ్వాసనా- "

దండకాదిని ఇష్టదేవతాస్తుతి (1,2శ్లో.) దండకాంతమునందు కర్తృవిషయమును సంస్కృతశ్లోకములందు కలదు. ప్రాకృతభేదములు సంస్కృతతభాషాసంబంధులు. కాబట్టి అష్టభాషాదండకము సంస్కృతగ్రంథము వలె కలదు.

శృంగారసంకీర్తనములు 119 కలవు. వేంకటేశ్వరాంకితములే వేంకటేశ్వరుని కదిరి నరసింహస్వామి, కడప వేంకటేశ్వరుడు, ఒగునూతల నరసింహస్వామి, కోనచెన్నరాయడు, కోవెలకుంట్ల పండరంగి విట్ఠలుడు, గోపాలకృష్ణుడు, మండెము నరసింహస్వామి, వావిలపాడు రామచంద్రుడు, కోసువానిపల్లె వెంకటనాథుడు, చెల్లపిళ్లరాయుడు గాను ఆరోపించెను.

"ఒక్కరి నౌనన నేల నొకరిఁ గాదన నేల
చెక్కునొక్కిప్రియములే చెప్పించుకోరాదా॥పల్లవి॥
మేలురా నాతోనీవు మితిమీరి మాటాడేవు
బొలే నాతోడి వాదు కాపో నీవో
యేలరా నీపాలిటికి నిద్దరము సమమే
మేలమాడి సారె సారె మెప్పించుకో రాదా ॥ఒక్కరి॥
ఇప్పుడు నీవె వాసు లెక్కించుకవచ్చేవు

అప్పటి నాతోడి సవతాపో నీవో
అప్పనమై యిద్దరము నాండ్ల మింతే నీకు
ముప్పిరి దేవర వలె మొక్కించుకో రాదా ॥ఒక్కరి॥
కన్నుల జంకెనలతో గరిసించి యడిగేవు
అన్ని వోట్లకు గురి యాపో నీవో
నన్ను నిట్టె శ్రీవెంకటనాథుండ నీవె కూడితి
వెన్నండూ నిద్దరి నిట్టె యేలుకొనరాదా ॥ఒక్కరి॥. 78.

అధ్యాత్మసంకీర్తనములు 60 కలవు. ఒక సంకీర్తనమునందు వేంకటేశ్వరుని కదిరి నరసింహస్వామిగ ఆరోపించెను. (37సం.) మూడు సంకీర్తనములందు అన్నమాచార్యుల ప్రశంస కలదు. (23,39,46సం.)

"అప్పని వరప్రసాది అన్నమయ్యా
అప్పసము మాకె కలఁ డన్నమయ్యా ॥పల్లవి॥
అంతటికి నేలికైన ఆదినారాయణుఁ దన
యంతరంగాన నిలిపీ నన్నమయ్యా
సంతసానఁ జెలువొందె సనకసనందనాదు
లంతటి వాఁడు తాళ్లపాకన్నమయ్యా ॥అప్ప॥
బిరుదుటెక్కెములుగాంచెబెక్కుసంకీర్తనములు
హరి మీఁద విన్నవించె నన్నమయ్యా
విరివి గలిగినట్టి వేదముల యర్థమెల్లా
అరసి తెలిసి నాఁడు అన్నమయ్యా ॥అప్ప॥
అందమైన రామానుజాచార్యమతమున
అందుకొని నిలిచినాఁ డన్నమయ్యా
విందువలె మాకును శ్రీవెంకటనాథుని నిచ్చె
అందరిలోఁ దాళ్లపాకన్నమయ్యా." ॥అప్ప" 23.

చిన తిరుమాలాచార్యులకు బ్రహ్మోపదేశము చేసిన గురువు తాత అన్నమాచార్యులు. (39సం.) దైవము కూడ అన్నమాచార్యులే. (39సం.) "నీవు గలిగినఁ జాలు నిక్కము అన్నీఁ గలవు" అని (46సం.) "శ్రీవెంకటనాథు నా తలఁపులో నమ్మఁ జేసి "న దాత కూడ (39సం.) అన్నమాచార్యులే అని చిన తిరుమలాచార్యుల ఆత్మ విశ్వాసము.

"మాయలో మునుఁగ నేల ఘమత లేల
చేయరా దేవుఁ డీపాటి సేయనోపండా ॥పల్లవి॥
వెలయ రాజులను దీవించే ప్రాణులాల
కల శ్రీవెంకటనాథుఁ గానఁగ రాదా"

అను సంకీర్తనము (42సం.) చిన తిరుమలాచార్యుల ఆధ్యాత్మికదృష్టికి మాత్రమేగాక. తాళ్లపాకకవుల రాజాస్థానవైముఖ్యమునకు చిహ్నాపతాక.

**తాళ్లపాక చిన్నన్న** : ఇతడు పెద తిరుమలాచార్యుల నాల్గవ కొడుకు. చిన తిరుమలాచార్యుల మూడవ తమ్ముడు. చిన్న తిరువెంగళయ. చిన్న తిరువెంగళనాథుడు. తిరువేణాధర్. తిరువేణాధయ్యర్. తిరువెంగళనాథుడు. తిరువెంగళనాథయ్యంగారు. తిరువెంకటనాథర్. వెంగళార్యుడు అని కూడ వ్యవహృతుడు.[237] ఈతని కృతులు పరమయోగివిలాసము. అష్టమహిషీకల్యాణము. ఉషాకల్యాణము. అన్నమాచార్యచరిత్రము. ఈతని శాసనములు 1546 నుండి 1554 వఱకు కలవు.[238] అష్టమహిషీకల్యాణము 1545లోను. పరమయోగివిలాసము 1546లోను. ఉషాకల్యాణము 1547లోను రచించినట్లు ఒక అభిప్రాయము కలదు.[239] చిన్నన్న ఏడాది కొక కావ్యము రచింపగల సమర్థుడేకాని. తత్పూర్వాపరములందు కృతులు రచింపలేదనుట సంగతము కాదు. పెద తిరుమలాచార్యుల కాలము 1460-1556, చిన తిరుమలాచార్యుల కాలము 1485-1560 కావున. చిన్నన్న కాలము స్థూలముగ 1495-1565 కావచ్చును. చిన్నన్న "కావ్యంబుఁ జెప్పి। యెనలేని శ్రీవెంకటేశు మెప్పించి। సకలంబు నెఱుఁగ నసాధారణాంకమకరకుండలము లిమ్మహిఁ గొన్నవాఁడ"నని అష్టమహిషీకల్యాణమునందు చెప్పుకొనెను. (119-122పం.) అష్టమహిషీకల్యాణము అలమేలుమంగకు అంకితము.(97-103పం.) ఉషాకల్యాణము మఱల అలమేలుమంగకు అంకితము. వేంకటేశు మెప్పించిన కావ్యము పరమయోగివిలాసమే అగును. కనుక పరమయోగివిలాసము. అష్టమహిషీ కల్యాణము. ఉషాకల్యాణము. అన్నమార్యచరిత్రము చిన్నన్నకృతుల పౌర్వాపర్యము కావచ్చును. పరమయోగివిలాసము రచనాకాలము 1550 ప్రాంతము కావచ్చును.

చిన్నన్న నాలుగు కృతులును ద్విపదకావ్యములే.

"చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నుగఁ బెద తిరుమలయ్య పదమున కెఱఁగున్

మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్."

అని ప్రసిద్ధమైన చాటుపద్యము కలదు. ఇందలి నరసింగన్న అన్నమాచార్యుల పెద్ద భార్య తిమ్మాంబ కొడుకు నరసింహుడని, అతడు సంకుసాల నృసింహకవి అని ఒక అభిప్రాయము కలదు.[240] అన్నమాచార్యుల కొడుకు నరసింహుడు కవి అనుటకు ఆధారము లేదు. "ధీశాలి ప్రతివాదిదైత్యనరసింహుఁ డనఁ గల్గె నరసింహగురుఁడు" అని మాత్రమే చిన్నన్న అష్టమహిషీకల్యాణమునందు కలదు. (71,72 పం.1అ.) అతడు కవి అయినచో, తండ్రి పెదతిరుమలాచార్యులు ఆంధ్రవేదాంతము, హరివంశకావ్యము, చక్రవాళమంజరి, రేఫఱకారములు రచించినట్లు (89-90పం.) తాత అన్నమాచార్యులు పదములు రచించినట్లు (59,60పం.) చెప్పిన చిన్నన్న పెదతండ్రి నరసింహుని కృతులను చెప్పును. కాని చెప్పలేదు. అంతేకాదు. చిన్నన్న అన్నమాచార్యచరిత్రమునందు అతడు "నరసయాచార్యులు" అని కలదు.(1068-1070పం.) తాళ్లపాక నరసింహాచార్యులు సంకుసాల నృసింహకవి కాడు. చాటుపద్యములోని నరసింగన్న సంకుసాలనృసింహకవియే అగును. కవికర్ణరసాయనము పద్యగద్య శ్రేణీవిలసితమే. చాటుపద్యకర్త చిన్నన్న ద్విపదకావ్యములు. పెదతిరుమలాచార్యుల అధ్యాత్మ.శృంగారసంకీర్తనములు. సంకుసాలనృసింహకవి కవికర్ణరసాయనము నచ్చి పద్యము చెప్పవచ్చును. అది కుటుంబకవుల ప్రశంస కాక, సమకాలికకవుల ప్రశంస కావచ్చును. కుటుంబకవుల ప్రశంస అయినచో, అన్నమాచార్యుల పదములను కాదని పెద తిరుమలాచార్యుల పదములను ప్రశంసించుట సంగతము కాదు. తాళ్లపాక పెద తిరుమలాచార్యులు, తాళ్లపాక చిన్నన్న, సంకుసాల నృసింహకవి సమకాలికులు. సమకాలికచాటుపద్యమును బట్టి సంకుసాల నృసింహకవిని తాళ్లపాక నరసయాచార్యులను చేయుట విపరీతము.

పరమయోగివిలాసము పన్నిద్దఱాళ్వారుల, ముగ్గురు ఆచార్యుల వృత్తాంతములు కల గ్రంథము. ఆళ్వారులు వైష్ణవమతప్రవక్తలు. పరమయోగులు. ఆచార్యులు వైష్ణవమతప్రవర్తకులు. ప్రాధాన్యవివక్షను పరమయోగుల వృత్తాంతములు కలది పరమయోగివిలాసము. మూలము:

"మోదించి నారదముని చెప్పినట్టి
యాదవశైలమాహాత్మ్యంబునందు
గారవంబున "కలౌ ఖలు భవిష్యంతి

నారాయణపరాయణా" యని పలుకు
కలిహరంబగు భాగవతంబునందుఁ
గలిగి పూర్వాచార్యకథితమై వెలసి
మఱియును వృద్ధపాద్మంబునఁ బద్మ
తెఱఁగొప్ప సూత్రవతికిఁ జెప్పినదియుఁ
గావునఁ దత్కథాక్రమమొప్పనేను
గావింతుఁ గృతి దాని క్రమమెట్టిదనిన" 105-114పం.

అని చిన్నన్న అనుక్రమణిక. భాగవత. వృద్ధపద్మపురాణములు విష్ణుతత్త్వము నకు. యాదవశైలమాహాత్మ్యము పన్నిద్దఱాళ్వారుల. ముగ్గురాచార్యుల వృత్తాంతములకు మూలములు కావచ్చును. గురుపరంపరాప్రభావము పన్నిద్దరాళ్వారుల వృత్తాంతమే.

పన్నిద్దరాళ్వారులు: 1.సరోయోగి. పొయిగైఆళ్వార్. జన్మస్థలము కంచి. కాలము తెలియదు. 2. భూతనాథయోగి. భూతత్తాళ్వార్. జన్మస్థలము మల్లాపురము. కాలము తెలియదు. 3. మహాయోగి. పేయాళ్వార్. జన్మస్థలము మయూరపురము. కాలము తెలియదు. 4. భక్తిసారయోగి తిరుమళిశైఆళ్వార్. కాలము 720. 5. వేదయోగి. నమ్మాళ్వార్. శఠకోపముని. జన్మస్థలము కురుకాపురము. కాలము తెలియదు. 6.మధురకవియోగి. మధురకవి ఆళ్వార్. జన్మస్థలము తిరుక్కోళూరు. కాలము 797. 7. కులశేఖరయోగి. కులశేఖరాళ్వార్. జన్మస్థలము కొల్లి.కాలము767. 8.తిరుపాణయోగి. తిరుప్పాణ్ ఆళ్వార్. మునివాహనుడు. జన్మస్థలము లేదు. కాలము 841. 9.విప్రనారాయణయోగి. తొండరడిప్పొడిఆళ్వార్. జన్మస్థలము మండంగుడి అగ్రహారము కాలము 787. 10.విష్ణుచిత్తయోగి. పెరియాళ్వార్. జన్మస్థలము శ్రీవిలిపుత్తూరు. కాలము 735. 11.గోదాదేవి. శూడిక్కుడుత్తనాచ్చియార్. ఆండాళ్. జన్మస్థలము శ్రీవిల్లిపుత్తూరు. కాలము 776. ఇది పరమయోగి విలాస వృత్తాంతక్రమము.

ముగ్గురాచార్యులు: 1.నాథముని. జన్మస్థలము వీరనారాయణగ్రామము. కాలము 823. 2. యామునాచార్యులు. ఆళవందారు. జన్మస్థలము వీరనారాయణగ్రామము. కాలము 918-1037. యామునాచార్యుల శిష్యుడు తిరుమలైనంబి. జన్మస్థలము లేదు. కాలము యామునాచార్యుల కాలమే. 3. రామానుజాచార్యులు. జన్మస్థలము పెరుంబుదూరు. కాలము 1017-1137. రామానుజాచార్యుల శిష్యుడు భట్టుపరాశరుడు. జన్మస్థలము తెలియదు. కాలము

1063.

ఇందలి కాలములు చరిత్రాధారములు కలవి.[241]

పరమయోగివిలాసములోని ఆళ్వారుల వృత్తాంతములు మహిమాన్వితములు. భక్తిసారయోగి (తిరుమళిశై ఆళ్వార్) వృత్తాంతమునందు కొంకణసిద్ధుడు కక్షపుటిలోని పారదదివ్యఘుటిక చూపించి. "ఇది సోఁకినంత కోటిలోహము మంచికుందనం బగును" అని చెప్పను. (1667-68పం.2ఆ.)భక్తిసారయోగి" నిజపాదరాజీవరేణు పరాగంబుఁ దిగిచి" (1672పం.2ఆ.)" ఇది లోహపాషాణకోటికోటులు గావించు కుందనంబుగను" (1681-82పం.2ఆ.) అని " ప్రతి చూడుమని" (1669పం.2ఆ.) ఇచ్చును. కొంకణసిద్ధుడు దానిని చిత్రకూటాద్రిపై వేయగా అది కనకాద్రి అగును. ఇది నవనాథ చరిత్రమునందు నాగార్జునసిద్ధుడు శ్రీశైలమును సువర్ణమయము చేయుటను స్ఫురింపజేయును. అది విష్ణువు అంతర్ధానము సేయును. ఇది కొంకణసిద్ధుడే అం తర్ధానము సేయును. కొంకణసిద్ధుని పాదరసఘుటిక కంటె భక్తిసారయోగి పాదర జోఘుటిక మహిమాన్వితము. నాథశైవము కంటె వైష్ణవము గొప్పదని నిరూపిం చును. ఇందు పరమతనిరసనము లేదుగాని. పరకాలయోగి (తిరుమంగై ఆళ్వార్) వృ త్తాంతమునందు పరమతనిరసనము కలదు; పరమతవిధ్వంసనమును కలదు. పరకాలుడు శ్రీరంగనాథాలయమునకు మూడవ ప్రాసాదము కట్టించుటకు. నాగ పట్టణములోని అభేద్యమైన జినాలయమును వంచనతో ధ్వంసము చేసి. పసిడి జినవి గ్రహమును అపహరించును. పసిడి జినవిగ్రహమును తరలించిన విధమిది :

"బలువైన యా జైనధర్మరూపంబు
బలువిడి నా గుడిపై నొయ్య డించి
పట్టెమంచపుఁ బెను పల్లకి మీఁదఁ
బెట్టి ముసుంగిడి పెద్దయు వగచి
శవముఁ గైకొని పోవు సరవి నా మంచ
మవిరలబలవంతులగు వారు మోవఁ
దలలు వీడఁగఁ గొందఱు రెండు గడలఁ
బలుదెఱంగులఁ బాడి పాడి శోకింపఁ
గొందఱు కాష్ఠము ల్గొని యేగుచుండఁ
గొంద ఱింగలము గైకొని చనుచుండ
నీ రీతి భృత్యులా హేమబింబంబు

దూరంబు గొనిపోవ ... ... " 16445-56పం.7ఆ.

ఇట్లు కృష్ణపురి చేర్చి, రాత్రి ఒక రొంపి మడియందు పసిడి జినవిగ్రహమును పదిలపఱిచి పరకాలుడు కావలియుండును. కర్షకుడు దున్నుటకు వచ్చిన పసిడి జినవిగ్రహము బైటపడునని, ఆ మడి తన మాన్యమని, తగవుపెట్టి, దొంగప్రమాణము చేసి దున్నకుండ చేయును. శ్రీరంగమునకు తీసికొని వచ్చి,

"కొన వ్రేలి మాత్రంబు గొట్టించి డాఁచి
ఘనమైన కాంచనగాత్రమంతయును
నఱకించి కరఁగించి నాణెంబు సేసి
కొఱదీర మూఁడవ కోటఁ గట్టిం (చె.)" 10617-20పం.7ఆ.

ఇందు జైనశబ్దమునకు పర్యాయపదముగ బౌద్ధశబ్దము కలదు.(10407పం.7ఆ.) జైనవసతి బౌద్ధవసతి అని కలదు. (10315పం.7ఆ.) సౌగతశబ్దమును జైనపర్యాయ పదముగ కలదు. (10317,10499పం.7ఆ.) కారణము పదియాఱవశతాబ్దికి జైన, బౌద్ధ భేదము తెలియని స్థితి కావచ్చును.

విష్ణుచిత్తయోగి (పెరియాళ్వార్) వృత్తాంతము, గోదాదేవి(శూడిక్కుడుత్త నాచ్చియార్) వృత్తాంతము, యామునాచార్యుల (ఆళవందార్) వృత్తాంతము శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందు ముందే కలవు. అందు కవిత్వము ప్రధానము. ఇందు కథ ప్రధానము. విప్రనారాయణయోగి(తొండరడిప్పొడి ఆళ్వార్) వృత్తాంతము తర్వాత కావ్యములు, యక్షగానములును అయినవి. అర్వాచీనరచనలకు పరమయోగివిలాసము మార్గదర్శకము. గోదాదేవి వృత్తాంతమునందు ద్రవిడప్రబంధములోని పదిగాథల (పద్యముల) తెనుగుసేత కలదు. అవి శ్రీ రంగశాయి మేల్కొలుపులు దశమగాథ:

"తమ్ములు వికసించెఁ దరణియుం బొడమెఁ
గొమ్మలు పసుపాడి కోరి నీరాడి
కట్టిరి పుట్టముల్ కావేరి నడుమఁ
బుట్టక పుట్టిన పూసెజ్జ నున్న
నీలనీరదవర్ణ! నీ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి!మేల్కొనవె" 8651-56పం.5ఆ.

పరమయోగివిలాసమునందు వర్ణనములును కలవు. అవి: వైకుంఠవర్ణనము

(123-260పం.1ఆ.) కాంచీపురవర్ణనము (599-710పం.1ఆ.) కొల్లిపురవర్ణనము(3539 -3630పం.3ఆ.) శ్రీవిల్లిపుత్తూరువర్ణనము (6900-6913పం.5ఆ.) శ్రీరంగవర్ణనము (8337-8376పం.5ఆ.) వైకుంఠనాథవర్ణనము (261-400పం.1ఆ.) శ్రీవేంకటేశ్వరవర్ణనము (1835-1859పం.2ఆ;7892-7918పం.5ఆ;10141-10161పం.7ఆ; 12481-12,500పం. 7ఆ.)వేంకటేశ్వరాలయవర్ణనము(12441-12480పం.7ఆ.)నదీవర్ణనము (589-598పం.1ఆ.) వనవర్ణనము(5229-5270పం;5506-5523పం.4ఆ.) సాయంకాలవర్ణనము (5490-6014 పం.4ఆ.) రతివర్ణనము (6223-6240పం.4ఆ.) వివాహవర్ణనము (8475-8577పం.5ఆ.) పురయాత్రావర్ణనము (8705-8744పం.5ఆ.) యుద్ధవర్ణనము(9157-9306పం.6ఆ.) సురకామినీవర్ణనము (1049-1146పం.2ఆ.) గర్భవతీవర్ణనము(2904-2919పం.3ఆ.) నగరకామినీవర్ణనము (3597-3619పం.3ఆ.) మొదలైనవి. నగరకామినీవర్ణనమునందు శైలీనర్తనము కలదు.

"కప్పులై యొప్పులై కళుకులై తేఁటి
చొప్పులై గొప్పలై సొగయు గొప్పులును
గళుకులై బెళుకులై కలువపూసోగ
ములుకులై తళుకులై మొనయు కన్నులును
సోగలై బాగులై సొలపులై సిరుల
ప్రోగులై వాగులై పొలుచు మోములును
గావులైతావులైకండచక్కెరల
ప్రోవులై ఠీవులై పొలుచు మోవులును
గట్టులై గుట్టులై కాముని పసిఁడి
జెట్టులై చెట్టులై చెలఁగు పాలిండ్లు
జినుగులై చినుగులై సింహమధ్యముల
కనుఁగులై పెనగులైనట్టి కౌనులును
గెంపులై సొంపులై కెందమ్మి చాయ
సింపులై యింపులై సిగుడు హస్తములు
నినుపులై నునుపులై నెఱయు దిబ్బలకు
ననుపులై పెనుపులై యనువొందు కటులు
ననుకులై మినుకులై యపరంజి పసల
కునుకులై మనుకులై యొప్పు నూరువులుఁ
బొలుపులై సొలపులై పూవిల్తు వాలు

మెలుపులై వలపులై మించు పాదములఁ
గలిగి మున్నెన్నఁడు గడివోకయున్న
జలజాస్త్రు మోహనాస్త్రంబులో యనఁగ
నలవి మీఱిన యట్టి యంగనామణులు"

ఇది "చిన్నన్న ద్విపద కెరఁగును" అను కతపత్రమును ధ్రువీకరించునది.

అష్టమహిషీకల్యాణము అలమేలుమంగకు అంకితము. ఇందు చిన్నన్న స్వాతిశయము కలదు.

"దినములోననె వేయి ద్విపద లింపొంద
వినుతవర్ణనలతోడ విరచించువాఁడఁ
గవిశిరఃకంపయోగ్యప్రతిద్విపద
నవబిరుదాంకుండ ... ..." 123-26పం.1ఆ.

కవిశిరఃకంపయోగ్యప్రతిద్విపదనవబిరుదాంకము పరమయోగివిలాసమువలన లభించునది. అష్టమహిషీకల్యాణాదుల వలన కాదు. చిన్నన్న కవిత్వలక్షణమిది.:

"..... ..... అలఘుశబ్దార్థ
సారసరీతిరసప్రభావముగఁ
గులికి కస్తురిపేటెఁ గోసిన కరణిఁ
దెలికప్పురపుఁ గ్రోవి దెఱచిన సరణి
విరవాది పొట్లంబు విడిచిన మాడ్కిఁ
బరిమళించుచుఁ గవుల్ బళిబళి యనఁ గఁ
గవిత చెప్పిన సులక్షణుసిఁ గవీంద్రుఁ
డవునందురు ... ... ..." 173-80పం.1ఆ.

పయివిధముగ పరిమళించునట్లు కవిత చెప్పిన కవీంద్రుడే. అట్టి కవిత పరమ యోగివిలాసమునందు సమృద్ధిగ కలదు. అష్టమహిషీకల్యాణమునందు సకృత్తుగ కలదు.

అష్టమహిషీకల్యాణము శ్రీకృష్ణుని అష్టమహిషీకల్యాణములు మాత్రమే కాదు. బాల్యవృత్తాంతమును కలదు. మొదటి మూడు ఆశ్వాసములును అదే. నాలుగైదు ఆశ్వాసములందు మాత్రమే అష్టమహిషీకల్యాణములు కలవు. మొత్తము పోతన

భాగవతమునకు ద్విపదపోత. భాగవతరామాయణమును కలదు.(1431-1523పం.1ఆ.) పోతన పెట్టిన ఊరుగాయలే (496ప10స్కం.పూ.భా. గోపకుల"వల్లయెడ నూరగాయలు". (1300పం.2ఆ.)"వ్రతనిష్ఠలైయుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతి దప్పి" అనునదియే (840ప.10స్కం.పూ.భా. "చేలలు సడలించి చిరతర పుణ్యశీలలు జలకేళి సేయంగఁ దగునె" (1879-80పం.2ఆ.) అను గోపికావస్త్రాపహ రణకారణము. "నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు" అను పోతన ప్రసిద్ధపద్యమే. (1010ప.10స్కం.పూ.భా.

"ముకురకపోలాగ్రముల దువాడించు
మకరకుండలకాంతిమండలి వాని
అలకలఁ జూడ నొయ్యారంపు సిరుల
బెళుకఁ జుట్టిన నెమ్మిపింఛంబు వానిఁ
గొదమనవ్వుల చాదుకొని వీను సిరులఁ
గఁ సిన నిడువాల్గు గన్నుల వాని ........" 2591-2610పం.2ఆ.

అని తీగ సాగినది. "భ్రమరా దుర్జనమిత్ర ముట్టకుము" అను పోతన భ్రమరగీత పద్యమే (1455ప.10స్కం.పూ.భా.

"మధుప యో కితవాప్త మా యంఘ్రు లంటు
విధమెట్లు తొలఁగు నీ విధ మెఱుంగుదుము
నగరకామినుల చన్గవకుంకుమముల
జిగి మించు విభుఁడు దాల్చిన తమ్మిదండఁ
దొఱఁగు పుప్పొడిఁ దొప్పదోగిన నిన్ను" 3989-3993పం.3ఆ.

రుక్మిణి "అప్పుఁ డగు బ్రాహ్మణు నొక్కని", "కొన్ని రహస్యంబులు సెప్పి" కృష్ణునియొద్దకు పంపినట్లు భాగవతమునందు కలదు.(1696-98వచ.10స్కం.పూ.భా. భాగవతమునందు లేని రుక్మిణి విరహము(4571-4671పం.4ఆ.), చెలికత్తెల ప్రమేయ మున "కులపురోహితసుతుని పంపినట్లు చిన్నన్న స్వతంత్రకల్పనములు. రుక్మిణి చెప్పిన రహస్యములు భాగవతమునందు లేవు. అష్టమహిషీకల్యాణమునందు కలవు. (4711-4760పం.4ఆ.) విరహఘట్టము సమకాలికప్రభావమే.

కాళిందీమిత్రవిందానాగ్నజితీ(సత్యకీర్తి)భద్రా.లక్షణాకల్యాణములు పోతనభాగవ తమునందు రేఖామాత్రముగ కలవు. అష్టమహిషీకల్యాణమునందు సవివరముగ కల వు. అష్టమహిషీకల్యాణమునందు లక్షణ వర్ణన సుదీర్ఘము.(6676-6756పం.5ఆ.)

నాయికావర్ణనము, నాయికావిరహవర్ణనము, నాయకవర్ణనము మాత్రమేగాక, అష్టమహిషీకల్యాణమునందు అనేకవర్ణనములు కలవు. అవి : క్షీరాబ్ధివర్ణనము (241-270పం.1ఆ.) శ్వేతద్వీపవర్ణనము (271-277పం.1ఆ.) విష్ణువర్ణనము (277-295పం.1ఆ.) గర్భవతివర్ణనము (418-429పం.1ఆ.) కుమారోదయవర్ణనము (430-443పం.1ఆ.) వనవిహారవర్ణనము(1068-1168పం.1ఆ;6163-6220పం.5ఆ.) వర్షా(కాల)వర్ణనము(1714-1748పం.2ఆ;2127-2141,2150-2173పం.5ఆ.) శరత్కాలవర్ణనము(1749-1757పం.2ఆ.) నదీవర్ణనము (1789-1827పం.2ఆ.) పురవర్ణనము(3413-3470,4260-4380పం.3ఆ.) యుద్ధవర్ణనము(5068-5165,5207-5260పం.4ఆ;6711-6773పం.5ఆ.) వివాహవర్ణనము (5427-5515,5902-6081,6775-6884పం.5ఆ.). జలకేళివర్ణనము (6221-6257పం.5ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతవర్ణనము (5694-5724పం.5ఆ.) భోజనవర్ణనము (6265-6318పం.5ఆ.) మొదలైనవి.

రుక్మిణీకల్యాణములోని కర్ణాట,తమిళ,కాళింగవీరులకు కర్ణాట,తమిళ,కాళింగభాషలు ప్రయుక్తములైనవి.

> కర్ణాటభాష : "బాశై యలో తమ్మబందను కృష్ణ
> తారొయా హరిగె సాధన మాడబేకు" 4998-5000పం.4ఆ.
>
> తమిళభాష: "అయిత్తమాఘు వందలి మున్నిబన్ని
> ఆయుధం గొండు నియంగెవా ..." 5003-5004"
>
> కాళింగభాష: "ఆసొ ఆడే ఆగె హరిజగన్నాథ
> దాసు హే బలు ఖండదారురే ... "5007-5008"

ఇది పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రకు ప్రతిద్వంద్విప్రాయమైన కల్పనము.

ఉషాకల్యాణము కథ హరివంశమునందు కలదు. భాగవతమునందు కలదు. పద్మపురాణమునందును కలదు. చిన్నన్న ఉషాకల్యాణమునందు,

> "... ... ... నా యొనర్చు
> హరివంశమార్గోక్తమగు నుషాకన్య
> కరమొప్పఁ బరిణయక్రమ మెట్టిదనిన" 45-47పం.

అని కలదు. కావున చిన్నన్న ఉషాకల్యాణమునకు మూలము హరివంశము

కావలయును. కాని సంస్కృతహరివంశములోని కథాంశములెల్ల చిన్నన్న ఉషాకల్యాణమునందు లేవు. అంతమాత్రమున హరివంశమూలకత శంకనీయము కాదు. సంస్కృతహరివంశమునకు స్వతంత్రాంధ్రీకరణము ఎఱ్ఱన హరివంశము కలదు. అతిస్వతంత్రాంధ్రీకరణము నాచనసోమనాథుని ఉత్తరహరివంశము కలదు. అంతేకాదు. చిన్నన్న తండ్రి పెద తిరుమలాచార్యులు "ద్విపదరూపమున। హరివంశకావ్య మాయతర నస్ఫూర్తి హరి వంశ మిగురొత్త ననువొందఁ జేసి"నట్లు చిన్నన్న అష్టమహిషీకల్యాణమునందు కలదు. అది పరమస్వతంత్రాంధ్రీకరణమగును. ఎఱ్ఱన హరివంశములోని. నాచన సోమనాథుని ఉత్తరహరివంశములోని అంశములు మాత్రమేగాక; భాగవత. పద్మపురాణములలోని అంశములును పెదతిరుమలాచార్యుల హరివంశద్విపద కావ్యమునందు ప్రవేశించుట సంభవము. "హరి వంశ మిగురొత్త ననువొందఁ జేసి"న తండ్రి హరివంశద్విపదకావ్యము, తనయుడు చిన్నన్న తన వంశ మిగురొత్త ననువొందజేసిన ఉషాకల్యాణమునకు మూలమగుట సంభావ్యము. ఉషాకల్యాణములోని ఉషాకన్య భర్తృనిర్దేశము (389-394పం.) మనఃఖేదము (435-450పం.) విరహము (491-570పం.) చిత్రలేఖ చిత్రపటరచనము(581-591పం.) చిత్రపటప్రదర్శనము (601-702పం.) అనిరుద్ధానయనము(711-810పం.) ఉషానిరుద్ధసమాగమము (822-865పం.) అంతఃపురరహస్యప్రకాశనము (866-881పం.) ఉషానిరుద్ధకారాగార బంధనము(882-1019పం.) బలరామకృష్ణబాణాసురయుద్ధము (1135-1780పం.) ఉషానిరుద్ధపరిణయము (1791-1959పం.) మొదలైన ప్రధానకథాంశములు సంస్కృతహరివంశమును సంవదించునవియే.

ద్వారకానగరవర్ణనము (52-110పం.) ఉషాసౌందర్యవర్ణనము(206-210;1891-1907పం.) వనకేళివర్ణనము (242-316పం.) జలకేళివర్ణనము(318-367పం.) అనిరుద్ధవర్ణనము (458-464పం.) ఉషావిరహవర్ణనము(513-570పం.) సంధ్యావర్ణనము (1091-1100పం.) యుద్ధవర్ణనము(911-982;1135-1780పం.) మొదలైనవి సర్వకావ్యసామాన్యములు. ఉషాకన్య వీణావాదనము, చిత్రలేఖ చిత్రలేఖనము చిన్నన్న ప్రత్యేకతలు.

"వలకేలఁ గీలించి (కిన్న ర)వలుదజక్కవల
బలుమారు దెగడు గుబ్బల మీఁద మోపి
మొనవ్రేళ్ల శ్రుతి తంత్రి మ్రుట్టి జీవాళి
పనుపడ జీఱనఁ బలుకంగఁ బెట్టి
సరిగమ పధనిస సనిధపమగరి

సరిగమ రిగమప సనిధప మనుచు
బహువిధాలంకృతు ల్వాదుకొనంగ
రహిమించి వాయించి గ్రామసంతతుల
మేళము ల్సేసి సమ్మేళము ల్గాఁగ
యాలాపమార్గంబు లలరఁ జూపుచును
సంకీర్తనము చిందు జక్కిణి గీత
మంకించి శుద్ధంబు లలర మీటుచును" 415-426పం.

"కొలఁదిగా వన్నియల్ గూర్చి బంగారు
చిప్పలలో నుంచి చెలువొందుచున్న
కొప్పున ముంగురు ల్గాఢ దువ్వుచును
డాకేలు వజ్రపట్టంబుపై నూఁది
తూకొని వలకేల తూలికఁ దార్చి
వంచి ముఖ్యము దోయ వలనొప్పు చిప్ప
యంచున దీఁడి చయ్యన దిట్ట వెట్టి
రూపరేఖలు వ్రాసి రుచిరభావములు
దీపింప నొరపులు దీర్చె నూహింప ..." 571-579పం.

ఉషాకల్యాణము. అష్టమహిషీకల్యాణము. పరమయోగివిలాసము మూడును "చిన్నన్న ద్విపద కెఱఁగును" అను చాటూక్తిని సమర్థించునవి.

అన్నమాచార్యచరిత్రము తిరువేంగళనాథవిరచితసద్భక్తివిభవాన్నమార్యచరితంబు." అన్నమాచార్యచరిత్రము. మనుమడు రచించిన జీవితచరిత్ర. సమకాలమునందు కాకపోయినను, సమీపకాలమునందు రచించిన తొలి కవిజీవితచరిత్ర. అన్నమాచార్యులు కవిమాత్రమే కాదు; మహాభక్తుడు కూడ. మహాభక్తుల చరిత్రలు మహిమలతో కూడియుండును. మనుమడు రచించిన తాత చరిత్రమునందు అతిశయోక్తులును ఉండును. ఈ రెండును అన్నమాచార్యచరిత్రమునందు లేకపోలేదు. కాని చారిత్రికసత్యములును కలవు.

"-ఉగ్గు పెట్టఁబోయినను। పనిఁబూని తిరుమలప్పని ప్రసాదంబు। గొనుమని యనకలోఁగొనఁడు" మొదలైనవి అతిశయోక్తులు. (221-232పం.) "పిన్నప్రాయంబునందు ..... ఆడిన మాటెల్ల నమృతకావ్యముగ। పాడిన పాటెల్లఁ బరమగానముగ। .....। వేంకటపతి మీఁద వింతవింతలుగ సంకీర్తనంబులు సవరించు"ట కూడ అంతే.

(243-252పం.) బాల్యమునందే భక్తుడగుట సంభవము. పదియాఱవయేటనుండి సంకీర్తనములు సవరించుట సత్యము. "కనవుగోయఁ గఁ బోయి కడవ్రేలు సోఁకి పడియు నెత్తురు సూచి" విరక్తుడగుట (263-280పం.) విపరీతము కాదు. తిరుపతి కొండ మీద రాతిపై శయనించిన అన్నమయకు అలమేలు మంగ ప్రత్యక్షమగుట (347-367పం.) మహిమ. "అలమేలు మంగకు నాశుమార్గమున సలలితముగ నొక్క శతకంబు" చెప్పుట (413-414పం.) సత్యము కావచ్చును. స్వామిని సందర్శించి "వితతవృత్తంబుల వేంకటపతికి శతకంబు కుతుకంబు సమకూర" చేయుట కూడ సత్యము కావచ్చును. "వేంకటశతకంబు వివరించుటయు। గాలంపుఁ జిక్కులు గదియించునట్టి తాళముల్ వీడియుఁ దను దానె పడిన। అల తలుపులు పెళపెళన తెఱచుట" (573-580పం.) విశ్వాసమునకు సంబంధించిన విషయము. మహిమయే. అన్నమయకు వైష్ణవయతి పంచసంస్కారములు కావించుట. అన్నమయ నిండు యౌవనమునందు ఒకేసారి తిరుమలమ్మను, అక్కలమ్మను వివాహమాడుట జీవితవిశేషము. (623-694పం.) అన్నమయపెండ్లికి"పరమేశుఁ డగు నహోబలనృసింహుండు। గురుభావమునఁ జేరుకొని త్రిదండంబు। నా నరసింహు చక్రాదిమంత్రములు। తానె ప్రత్యక్షంబు దయసే"యుట (695-698పం.) విశ్వాసమునకు సంబంధించిన విషయమే. మహిమయే.

అన్నమయ "వాల్మీకి రామాయణమెల్ల। రాగంబుతో ననురాగంబుతోడ। బాగుగా గంధర్వు బాగుగాఁ జదివి। పాటలన్నియుఁ దన పాట పిమ్మటను। పాటపాటన పాటపాడి" (708-718పం.) సర్వజనుల ప్రశంస లందుట సంభవమే. "ఆ వార్త విని విని యట్టి మహానుభావునిఁ గన బాళిఁ బడుచు డెందమున। నా చేర్వ టంగుటూరను పురం బేలు। సాళువ నరసింహరాయలు అన్నమాచార్యులను సందర్శించుట. సంకీర్తనములు పాడించుకొనుట. "పచ్చల కడియాలు బంగారుప్రాఁతి పచ్చడంబులునుఁ గెంబట్టు కుళ్లాయి" మొదలైన రాజలాంఛనము లొసగి సత్కరించుట (719-800పం.) చారిత్రికసత్యములగును. సాళువ నరసింహరాయలు అన్నమాచార్యులను పిలిపించుకొని, మఱల పాటలు పాడించుకొని,"తలయూచి యిది కవిత్వంబని మెచ్చి", తనపై ఒక పదము చెప్పుమనుట, అన్నమాచార్యులు "హరిముకుందునిఁ గొనియాడు నా జిహ్వ। నిను గొనియాడంగ నేరదెంతయును" అని నిరాకరించుట సంభవమే. (803-852పం.) అందుకు సాళువ నరసింహరాయలు అన్నమాచార్యులకు "మూరురాయరగండ సంకెల" వేయించి, మొగసాలలో నిలుపుట కూడ సంభావ్యమే. (853-870పం.) అన్నమాచార్యులు వేంకటేశ్వరునిపై ఒక సంకీర్తనము చెప్పిన

శృంఖల ఘల్లున వీడుట. సాళువ నరసింహరాయలు మఱల సంకెల వేయించిన. అన్నమాచార్యులు మఱల అదే సంకీర్తనము పాడిన "కాలి సంకెల చిటికనవ్రేలి పలుము। చీలలు వీడి చెచ్చెఱ నూడిప"డుట మహామహిమ. (874-808పం.) ఇట్టి అన్నమయ్య మహిమలు ఇంకను కలవు. (889-1033) సాళువ నరసింహరాయలను వీడ్కొని అన్నమాచార్యులు శృంగారమంజరి రచించుట సత్యము. (961-964పం.)

పురందరదాసు అన్నమయ్యను విని, కని, విష్ణువుగా భావించి కీర్తించి సన్నుతిసేయ. అన్నమాచార్యులు పురందరదాసును విఠలునిగా దలచి సంభావించుట సంశయాస్పదము. (1035-1052పం.) కారణము పురందరదాసు కాలము[242] 1484-1565. వెనుకకు లాగుటకు వెసులుబాటు కలదుగాని ప్రమాణము లేదు.

అన్నమాచార్యులు "యోగమార్గంబున నొకకొన్ని బుధులు। రాగిల్ల శృంగార రసరీతిఁ గొన్ని। వైరాగ్యరచనతో వాసింపఁ గొన్ని। సారసనేత్రుపై సంకీర్తనములు। సరసత్వమునఁ దాళసముఖముల్ గాఁగ। పరమతంత్రములు ముప్పదిరెండువేలు। ప్రవిమలద్విపదప్రబంధరూపమున। నవముగా రామాయణము. దివ్యభాష। నా వేంక టాద్రిమాహాత్మ్యమంతయును। గావించి. రుచుల శృంగారమంజరియు। శతకముల్ పదిరెండు సకలభాషలను । ప్రతిలేని నానాప్రబంధముల్" రచించుట యథార్థము. (1055-1066పం.)

అన్నమాచార్యుల కుమారులు నరసయాచార్యులు, తిరుమలాచార్యులు అని కలదు. (1068-1070పం.) అతిశయోక్తులు, మహిమలు కాక చరిత్రాంశములును కలది అన్నమాచార్యచరిత్రము.

**భద్రకవి లింగన** : ఈతని కృతులు సానందచరిత్రము, దేవాంగ పురాణమును.[243] రెండును ద్విపదకావ్యములు. సానందచరిత్రము అరుణాచల మునకు ఉత్తరమునందున్న అరుణాద్రిమంగళపురవాస్తవ్యుడు వీరభద్రయ్య అను జంగమదేవరకు అంకితము. దేవాంగపురాణము ద్రావిడమధ్యదేశమునందలి పడవీడు అను పురికి అధీశ్వరుడైన కాళహస్తీశ్వరుని ఆదేశమున, ముదునూరునందలి దైవము రామేశ్వరస్వామికి అంకితము. పడవీడు పాలకుడైన కాళహస్తీశ్వరనాయకుని శాసన ములు రెండు, ఉత్తరార్కాడుజిల్లాలోని దేవకీపురమునందు కలవు. శాసనకాలము 1530,1532 సంవత్సరములు. కనుక సానందచరిత్రము రచనాకాలము 1525 వ సంవ

త్సరము. దేవాంగపురాణమురచనాకాలము 1530 వ సంవత్సరము కావచ్చును.

"శివపంచాక్షరీమాహాత్మ్యమున సానందుడను ఋషి యమలోకవాసులకు నరక బాధల నుండి తప్పించిన కథ" సానందచరిత్రమునందు ఇతివృత్తము."మనుమహర్షి యీశ్వరునికి దేవాంగఋషిగా జన్మించి, దేవతావస్త్రనిర్మాణములను చేయుటయు, నాతఁడే విద్యాధర.పుష్పదంత.భేతాళ.వరురుచి, దివసాళి.దేవరదాసి యను నామము లతో నా అవతారముల నెత్తుటయు, దేవరదాసి యవతారము దేవాంగకుల మందగు టయు, నాతఁడు జైనమతమును ఖండించి శైవమతము నభివృద్ధి చేయుటయు మొదలుగాఁ గల కథలు దేవాంగ పురాణమునందు ఇతివృత్తము."

భద్రకవి లింగన కవిత్వము గుఱించి కల ద్విపదలివి:

"తెనుఁగుకు నెఱవాది ద్విపదకు రాజు
వినుతశబ్దబ్రహ్మవిద్యానిరూఢి
ఘనత మించిన భద్రకవిలింగవిభుఁడ
రమణీయశివకవిరాజన్యహృదయ
కమలమిత్రుఁడు భద్రకవిలింగవిభుడు
నెఱయ నాతని కంటె నేర్పరి కలఁడె."

ఇందు భద్రకవి లింగన "ద్విపదకు రాజు" అని కలదు. ఇది "చిన్నన్న ద్విపద కెరగును" అను చాటుపద్యపంక్తిని జ్ఞప్తికి తెచ్చును. లింగన ఎంత ద్విపదకు రాజు అయినను, సానందచరిత్రము పద్యకావ్యమైనది. అది కోటశివరామకృతమైన సానం దోపాఖ్యానము. దేవాంగపురాణము కులమతపరిమితము.

**ఎడపాటి ఎఱ్ఱన** : ఈతని కృతి మల్హణచరిత్రము. ఇందుండి మూడు పద్య ములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు పెదపాటి యెఱ్ఱాప్రెగడ మల్హణకథ అని 134ప.1ఆ.) ఎఱ్ఱాప్రెగ్గడ మల్హణకథ అని (169ప.1ఆ;170ప.2ఆ.) సం కలనము చేయబడినవి. అంతేకాదు. పెద్దపాటి యెఱ్ఱాప్రెగడ, పెదపాటి యెఱ్ఱాప్రెగడ, యెఱ్ఱాప్రెగడ కుమారనైషధమునుండి పదమూడు పద్యములు సంకలనము చేయబడి నవి.(102,167ప.1ఆ;4,39,98,104,153,155,184,203ప.2ఆ;110,193,210,214ప.3ఆ.)కనుక ఎడపాటి ఎఱ్ఱన పెదపాటి ఎఱ్ఱన ఏకవ్యక్తి అని ఒక అభిప్రాయము కలదు.[244] కాని మల్హణచరిత్రమునందు ఎడపాటి అనియేగాని(7ప.1ఆ;ఆశ్వాసాంతగద్య.) పెదపాటి అని లేదు. ఎఱ్ఱనార్య (7ప.1ఆ.) ఎఱ్ఱయ(ఆశ్వాసాంతగద్య) అనియేగాని ఎఱ్ఱాప్రెగ్గడ

అవి లేదు. కుమారనైషధము లభింపలేదు. ఏకవ్యక్తి కాకపోవచ్చును. భిన్నవ్యక్తులు కావచ్చును.

మల్హణచరిత్రము చుండి కాళయమంత్రికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి.

"ఇట్టి మహాప్రధానపరమేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి మేలు చుండిపురపాలక, కాళనమంత్రిచంద్ర. మున్
గట్టిగఁ గృష్ణరాయజనకాంతున కీయక డాఁచినట్టి యా
రట్టడి యైన యెఱ్ఱకవిరాజితమల్హణకావ్యకన్యకన్." 19ప.1ఆ.

అని మల్హణచరిత్రమునందు కలదు. కృష్ణరాయజనకాంతు డన కృష్ణరాయమహారాయలు. శ్రీకృష్ణదేవరాయలు. రాయల జీవితకాలము రచనాకాలమైనను. మల్హణచరిత్రము కృతిసమర్పణకాలము రాయల అనంతరకాలము. కావున మల్హణచరిత్రము కృతిసమర్పణకాలము స్థూలముగ1540 ప్రాంతము కావలయును.

మల్హణుడు సంస్కృతశైవకవి. మహాశివభక్తుడు. అతని కథ పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందు కలదు. (పుటలు 358-367) అందు మలహణుని కథకు ముందు శ్వేతుని కథ కలదు. (పుటలు 352-358) అది కూడ ఎఱ్ఱన మల్హణచరిత్రమునందు ఒక ఉదాహరణముగ కలదు. మల్హణచరిత్రములోని ఈ రెండు కథలకును ఆధారము పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమే.

పండితారాధ్యచరిత్రమునందు మలహణుడు విటపుంగవుడు. మల్హణచరిత్రమునందు మల్హణుడు ప్రేమహృదయుడు. అందు పేరు లేని వేశ్య వేశ్యావృత్తి కలది. ఇందు వేశ్య పేరు పుష్పగంధి. ఈమె ప్రేమహృదయిని. ఇద్దఱు సహవిద్యార్థులు. ఇప్పటి సహవిద్యార్థుల ప్రేమ వలె. అప్పటి పుష్పగంధీమల్హణుల ప్రేమ ఆదర్శప్రాయము.

"కులమును గుణమును రూపును
గలిగిన బాలికకు విద్య గలిగిన యేనిన్
తలఁపఁగఁ బసిఁడికి వాసన
కలిమియుఁ జెఱకునకుఁ బండుఁ గలుగుట గాదే" 73ప.1ఆ.

అని ఎఱ్ఱన ఆనాడే స్త్రీవిద్యను ప్రబోధించెను. విద్యానిధి అను గురువునొద్ద

పుష్పగంధీమల్హణులు చదువుచు. "కూడి సమ్మద మెలర్పఁ జింతనలు సేయుచుండ్రు నిశ్చింతతోడ." (75ప.1ఆ.) పుష్పగంధి.

"మలహణునిం దన యింటికిఁ
బిలిచియు కొనిపోయి రత్నపీఠిక మీఁదన్
నిలిపి తగఁ బుష్పగంధియు
నలరఁగ సద్భక్తిఁ జేయ ననుమోదించున్." 78ప.1ఆ.

పుష్పగంధి నాట్యవిద్య కూడ నేర్చును. ఇద్దఱు సంగీతసాహిత్యగోష్ఠులు సాగింతురు. (82ప.1ఆ.) ఇది బాల్యస్నేహము. ఇక నవయౌవనారంభమున-

"శారదచంద్రుండు చంద్రికయును బోలె
లలి నొక్క కృత్తికై వెలఁగి వెలఁగి
ప్రసవబాణుండును రతిదేవియును బోలె
భేద మించుక లేక బెరసి బెరసి
యమరచందనము విద్రుమవల్లియును బోలె
నన్యోన్యవైఖరి నడరి యడరి
వరవసంతుండును వనలక్ష్మియును బోలె
భావంబు లేకమై పరగి పరగి
తోడు నీడయుఁ బోలెను. దొరసి దొరసి
తనువుఁ బ్రాణంబు బోలెను దనరి తనరి
లీలఁ గలసైన నెడఁబాయఁ జాల రెందు
మలహణుఁడు పుష్పగంధియు మరగి యెపుడు." 88ప.1ఆ.

ఇది మల్హణుడు ధనవంతుడు కాడని పుష్పగంధి తల్లి మదనసేనకు ఇష్టము లేదు. మల్హణుడు ఇంటికి రాకుండ కట్టుదిట్టము సేయును. పండితారాధ్యచరిత్ర మునందు మలహణుడు వేశ్యాలోలుడై ఇంటనే ఉండును. సొమ్ము చెల్లించుట లేదని. సొమ్ములుచేయించుట లేదని. వేశ్యమాత మలహణుని వెడలగొట్టించి. కూతురిని మండలాధికారి పాలుసేయును. మదనసేన పుష్పగంధికి కన్నెఱికము వీడుకొలుపుటకు ధనదత్తుని సిద్ధము సేయును. ఆ సందర్భమునందలి పుష్పగంధి నాట్య ప్రదర్శనమునకు మల్హణుడు. ధనదత్తుడు వత్తురు. పుష్పగంధి శంభునెదుట పుష్పాంజలి ఘటించి. "మలహణుతోడి కూటమియే జన్మసహస్రంబులకుఁ కలుగఁ జేయుమని" ప్రార్థించి. (62వచ.2ఆ.) నాట్యము సేయును. నాట్యానంతరము రహస్య

ముగ ఆలయోద్యానవనసమీపమునందు మల్హణుడు, పుష్పగంధి కలిసికొందురు. పరస్పరప్రేమ ప్రకటించుకొందురు. ఇద్దఱి కూటమి జరుగును. అభ్యంతరగృహమునందు పుష్పగంధి ధనదత్తునికి అభ్యంతరము కలిగించును. శంభుని పదపద్మముల ప్రొద్దుబుచ్చును. మల్హణుడు, అతని మిత్రుడు సుశీలుడు గురువు విద్యానిధియొద్ద కేగుదురు. సుశీలుడు మల్హణపుష్పగంధుల ప్రేమబంధము తెల్పును. విద్యానిధి గురూచితముగ నీత్యుపదేశము సేయును. ఇంతవరకు సహజముగ, సముచితముగ ఎల్లన స్వతంత్రకల్పనము సాగినది. సరసమైన సాంఘికేతివృత్తము.

విద్యానిధి నీత్యుపదేశమునకు భద్రదత్తకూచిమారపాంచాలాదులను, విటవిదూషకప్రేష్యనాగరకాదులను గురుకులమునకు రప్పించి, కామశాస్త్రచర్చాగోష్ఠి సాగించుట అధికప్రసంగము. ఉదాహరణముగ శ్వేతుని కథ చెప్పించుట నిరుపయోగము. మల్హణునికి పుష్పగంధి యెడ ప్రాణనాయికాభావము కలదు. (100-105ప.3ఆ.) పుష్పగంధికి మల్హణునియెడ ప్రాణనాయకభావము కలదు. (116ప.3ఆ.)

" వెరవిఁక నేది నా కకట! వీఁడె మనోభవుఁ డేఁగుదెంచె వి
స్ఫురదళిశింజినీవికచసూనశిలీకధనుఃపికావళీ
వరకలకంఠకాహళరవస్ఫుటకంపితభూర్భువస్సువ
శ్చరుఁ డగుచున్ బ్రతాపమున సల్పెడి దేమిఁ కఁ బ్రాణనాయికా!" 105ప.3ఆ.

ఇది మల్హణుని ప్రాణనాయికావిరహము. ఇక పుష్పగంధి ప్రాణనాయక విరహము.

" ప్రేమతోఁ బ్రియుఁడు చెప్పిన గీతము ల్పాడి
యడరి డగ్గుత్తిక పడి నిలుచును
సోమార్ధధరు మీఁది చూర్ణికల్ చదువుచు
హా ప్రాణనాయక యని తలంచు
జంత్రంబు చూపుచు జాగులే వల్లభ
నినుఁ బోల నెవ్వరు నెనయరనుచుఁ
దానమానములకుఁ దలయూఁచి మలహణ
యెఱుఁగుదుగా నీవు నించుకనుచు
సుదతి ప్రాణేశు లో చూడ్కిఁ జూచి పొక్కి
బయలుఁ గౌఁగిట నిఱియించుఁ బరవశమున
నధరసుధఁ గ్రాఁగి పోవంగఁ గలఁగి కలఁగి

యెందు నున్నాఁడవో నన్ను నిచట నొంటి
డించఁ దగవౌనె ప్రాణేశ యంచు వగచు." 116ప.3ఆ.

తుది సంఘటన పండితారాధ్యచరిత్రమునందు వలెనే కలదుగాని,

" ఈ పుష్పగంధిఁ గూడుక
యే ప్రొద్దును ప్రమథవరుల నీక్షింపుచు నీ
శ్రీపాదపంకజంబుల
నేపారఁగఁ గొల్చు భాగ్య మీవే నాకున్" 164ప.3ఆ.

అని ప్రత్యక్షమైన శివుని మల్హణుడు ప్రార్థించుట ఎఱ్ఱన స్వతంత్రకల్పనము. ఇది శివుని మోక్షప్రదానమునకు హేతుకల్పనము.

మల్హణచరిత్రమునందు కతిపయవర్ణనములు కలవు. పురవర్ణనము వినా కడమ వర్ణనములు సుదీర్ఘములు కావు. పురవర్ణనము (33-47ప.1ఆ.) ఆశ్రమవర్ణనము (58-59 వచ.1ఆ.) నాయకవర్ణనము (68ప.1ఆ.) నాయికావర్ణనము (93-96ప.1ఆ.) వసంతర్తు వర్ణనము (24-27ప.2ఆ.) కాసారవర్ణనము (65ప.3ఆ.) సంధ్యావర్ణనము (62-64,66 ప.3ఆ.) చంద్రోదయవర్ణనము (67ప.3ఆ.) నాయకవిరహవర్ణనము (89-114ప.3ఆ.) నాయికావిరహవర్ణనము (116-120ప.3ఆ.) ప్రభాతవర్ణనము (144ప.3ఆ.) సూర్యోదయ వర్ణనము (145ప.3ఆ.) కథానుసారిగా పరిమితముగ కలవు.

ఎడపాటి ఎఱ్ఱన పూర్వకవిస్తుతిలోని "వేము"డు (9ప.1ఆ.) వేమనయే[245]. అంతే కాదు. మల్హణచరిత్రమునందు వేమన పదప్రయోగ, పద్యరచనావిధాన, తత్త్వప్రతిపాదనముల ప్రతిఫలనము కలదు.[246] పదప్రయోగములు:

" మొండితొత్తులమారి లండియో కంకుఁడు" 98ప.1ఆ.
" దేబెలఁ గనుగొన్న వాబల్మిఁ జూపుచు"
" మంకుతనంబున హేయపుఁ బంకములో" 22ప.3ఆ.

పద్యరచనావిధానము:

" ఊఱకె త్రెడ్డు నాకి యుపవాస మడిగిన
ట్లెల చిన్న పనికి నింత వినఁగ
హరుని నాల్గు జాము లర్పింపు మఖిలసౌ
ఖ్యములు దాన నీకు నబ్బఁ గలవు." 42ప.3ఆ.

"కుడువఁ గట్టు లేదు కొండిక తన వంక
వట్టి నింద పడఁగ వలసె నుఱక
చదువు దయ్యమెఱుఁగు జాలును పదివేలు
వచ్చి నతని పొందు వలదు మాకు." 77ప.3ఆ.

" వెజ్జ బమ్మరించు విధమున నాకును
బుద్ధి చెప్పి నీవు పొగులఁ దగునె

రూఢి వెజ్జ దిరిగె రోకలిఁ దలఁ జుట్టు

మనిన చందమయ్యె నంబుజాక్షి." 139ప.3ఆ.

తత్త్వప్రతిపాదనము:

సురభి పొదుగున దుగ్ధముల్ దొరుకుఁ గాక
తవిలి యున్నె యజాగళస్తనము లోడియ
నీశ్వరేశ్వరు కృపఁ గోర్కు లెసఁగుఁ గాక
యితరకృత్యంబులందెల్ల నేల కలుగు?" 57ప.1ఆ.

వేమన పద్యములందు స్త్రీనింద కలదు. ఎఱ్ఱన మల్హణచరిత్రమునందు స్త్రీ విద్యాప్రబోధము కలదు. ఆ పద్యము పూర్వోదాహృతము.

పండితారాధ్యచరిత్రములోని మలహణునికథ నిమిత్తమాత్రమైన ఆధారముగ ఎఱ్ఱన మల్హణచరిత్రము స్వతంత్రకావ్యము. ఎఱ్ఱనకు "సరసకవితాధుర్య" అను విశేషణము కలదు. (ఆశ్వాసాంతగద్య.) మల్హణచరిత్రము సరసకవితాధుర్యమాధుర్య వాక్సందర్భము.

**నారన సూరన** : ఈతని కృతులు వనమాలివిలాసము, ఉదయనోదయము. వనమాలివిలాసమునందు ఆద్యంతములు లేవు. ఆశ్వాసాద్యంతపద్యములను బట్టి కొండూరి అక్కప్రభువునకు అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఉదయనోదయము సూరన కొడుకు నారన (తాతపేరు) ముడియము భాస్కరామాత్యునికి అంకితము చేసెను. అతడు కొండవీటి దుర్గాధిపతి అయిన బయకారి రామయమంత్రి కుడిభుజము. (22వచ.58ప.1ఆ.) బయకారి రామయమంత్రి అచ్యుతదేవరాయల కాలమున స్వరమేళకళానిధి అను సంగీతశాస్త్రమును రచించెను.

అతని పినతండ్రి రామయభాస్కరమంత్రి శాసనములు 1534, 1537, 1547 సంవత్సరములందు కలవు.[247] ఇతని సోదరి చిన్నమ్మ శాసనము 1540 వ సంవత్సరమునందు కలదు.[248] అందు "కొండవీటిధరామండలేంద్రుఁడైన రామయభాస్కరామాత్యసోదరి" అని కలదు. బయకారి రామయమంత్రి శాసనములు 1539, 1544, 1556సంవత్సరములందు కలవు.[249]. అతడు రామయభాస్కరమంత్రి తర్వాత కొండవీటిదుర్గాధిపతి అగును. కావున ఉదయనోదయము కృతిసమర్పణకాలము స్థూలముగ 1550 వ సంవత్సరము. వనమాలివిలాసము రచనాకాలము స్థూలముగ 1540 వ సంవత్సరము కావచ్చును.

వనమాలివిలాసము ముద్రితగ్రంథము సంక్షిప్తము. ప్రథమాశ్వాసము తుదిభాగము నుండి పంచమాశ్వాసము తొలి భాగము వఱకు మాత్రమే కలదు. ప్రథమాశ్వాసము తుది భాగమునందు రుక్మిణి గుఱించి విని కృష్ణుడు ఆకృష్టుడగును. ఆ స్థితిలో నారదుడు వచ్చి మిత్రవింద గుఱించి వివరించుట మొదలు స్వయంవరము వఱకు ద్వితీయాశ్వాసము నుండి పంచమాశ్వాసము తొలి భాగము వఱకు కలదు. మిత్రవిందాకల్యాణము భాగవతమునందు సంగ్రహము. పరమయోగివిలాసమునందు విస్తరము. వనమాలివిలాసమునందు అతివిస్తరము. నారదుని వివరణ, మందారమాల దూత్యము నారన సూరన స్వతంత్రకల్పనములు. మిత్రవింద మందారమాలను ఇట్లు ప్రశంసించును.

"తొలఁకు సుధారసద్రవముతోడిభవత్కలవాక్కలాపముల్
కలుగమిఁ జేసి తొల్లి కలకంఠి శతక్రతుముఖ్యదేవతా
వలి యమృతార్థమట్లు దురవస్థలఁ గైకొనెఁ గాక కల్గినం
జెలఁగి పయోనిధిం దరువఁ జేతుల తీటయె లోలలోచనా." 136ప.3ఆ.

ఇట్లు కవితాప్రాగల్భ్యము కల పద్యములు వనమాలివిలాసమునందు విరళము.

ఉదయనోదయము కథాకావ్యము. కథాసరిత్సాగరములోని కథ. తన్మూలము గుణాఢ్యుని బృహత్కథ. ప్రథమశతాబ్ది పైశాచీభాషాగ్రంథము. ఉదయనుని కథ, పతంజలి మహాభాష్యమునందు, కౌటిల్యుని అర్థశాస్త్రమునందు ప్రసక్తము. బౌద్ధ, జైనవాఙ్మయములందు ఉదయనకథ కలదు. భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము, శ్రీహర్షుని ప్రియదర్శిక, రత్నావళి, అనంగహర్షాపరనామ మాతృరాజు తాపసవత్సరాజము, ధనికుడు ఉదాహరించిన ఉదయనచరితము అను సంస్కృతనాటకములు ఉదయనకథాసంబంధులే. కాళిదాసు మేఘసందేశమునందు

"ప్రాప్యావన్తీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్" (31శ్లో.1స.) "ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోzత్ర జహ్రే" (34శ్లో.1స.) అని కలదు. వత్సరాజు ఉదయనుడే. కాళిదాసు కాలము నాటికే. అవంతీదేశములోని గ్రామవృద్ధులు ఉదయనకథాకోవిదులైనను, ఆంధ్రదేశములోని గ్రామవృద్ధులు నారన సూరన కాలము నాటివఱకు, ఉదయనకథాకోవిదులైనట్లు కానరాదు. నారన సూరనయే ప్రథమతః ఉదయనోదయకథాకావ్యకర్త.

ఉదయనోదయము- కాళిదాసు కుమారసంభవము కుమారస్వామిజననము వఱకు మాత్రమేగాక తారకాసురసంహారము వఱకువలె-ఉదయమని జననము వఱకు మాత్రమేగాక వాసవదత్తాపరిణయము వఱకు కలదు. ఉదయనుడు మృగావతీసహస్రానీకుల కుమారుడు. అలంబుస అను అప్సరస బ్రహ్మశాపమువలన మృగావతిగ జన్మించును. కోసలదేశాధిపతి కృతవర్మ కూతురు. విధూముడను వసువు బ్రహ్మశాపము వలన సహస్రానీకునిగ జన్మించును. వత్సదేశాధిపతి శతానీకుని కుమారుడు. శతానీకుడు జనమేజయుని కుమారుడు. తిలోత్తమ శాపము వలన మృగావతీసహస్రానీకులకు పదునాలుగేండ్లు వియోగము కలుగును. వియోగకాలమునందు మృగావతికి జమదగ్ని ఆశ్రమమునందు ఉదయనుడు ఉదయించును. పదునాలుగేండ్ల తర్వాత సహస్రానీక నామాక్షరాంకితమైన కంకణము వలన మృగావతీసహస్రానీకులకు పునస్సమాగమము కలుగును. ఇది కథాసరిత్సాగరమునందు కలదు. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలములోని దుర్వాసశ్శాపవృత్తాంతమునకు, అంగుళీయకవృత్తాంతమునకు మార్గదర్శకము. పదునాలుగేండ్ల ఉదయనుడు జమదగ్ని ఆశ్రమమునందుండగానే, నాగరాజు సహాయమున నాగలోకమున కేగి నాగకన్య లలితను వివాహమాడును. ఆమె గర్భవతి కాగానే విద్యాధరి అయి దేవలోకమునకు పోవును. నాగరాజు వాడిపోని తాంబూలవల్లి, ఘోషవతి అను వీణను ఇచ్చి, ఉదయనుని జమదగ్ని ఆశ్రమమునకు చేర్చును. ఇది కథాసరిత్సాగరమునందు లేదు. ఉదయనచరితమునందు కలదేమో?- రాజ్యాధిపతియైన ఉదయనుడు వీణావాదనము ద్వారా ఏనుగులను పట్టుకొను అభ్యాసము కొలది వేటకు వెళ్లుట, అవంతీదేశాధిపతి ప్రద్యోతచండసేనుడు మాయాగజమును పన్ని వత్సరాజును పట్టి బంధించుట, కూతురు వాసవదత్తకు సంగీతగురువును చేయుట, వాసవదత్తావత్సరాజులు ప్రేమించుకొనుట, మంత్రి యౌగంధరాయణుడు మాయోపాయమున విడిపించుట, వాసవదత్తావత్సరాజుల వివాహము యథాకథాసరిత్సాగరమేగాక, ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకానుగుణము. విదూషకుడు చెప్పిన రూపిణికథ కథాసరిత్సాగరము నందు లేదు.

షోడశకుమారచరిత్రమునందు కలదు. అలతి భేదము కలదుగాని అదే కథ.

ఉదయనోదయము కథాకావ్యమైనను వర్ణనాభూయిష్ఠము. పురవర్ణనము (78-103ప.1ఆ;129-131ప.1ఆ;206ప.2ఆ;69ప.5ఆ.) నాయకవర్ణనము(105-112ప.1ఆ ;267-272ప.2ఆ;34-38ప.3ఆ.) నదీవర్ణనము (123-128ప.1ఆ.) వనవర్ణనము (134-142ప. 1ఆ.) నాయకవిరహవర్ణనము (165-189ప.1ఆ.) వసంతర్తువర్ణనము (26-33ప.2ఆ.) నాయికావర్ణనము (280,281ప.2ఆ;3-37ప.4ఆ.) నాయికావిరహవర్ణనము (35-39ప.2ఆ.) వనకేళీవర్ణనము (40-50ప.1ఆ.) సరోవరవర్ణనము (51వచ.2ఆ;238-240ప.2ఆ.) జలకేళీ వర్ణనము(52-56ప.2ఆ;242-251ప.2ఆ.) మదనారాధనవర్ణనము (58-63ప.2ఆ.) చైత్రాద్యారాధనవర్ణనము (65-73ప.2ఆ.) శిశిరోపచారవర్ణనము (75-109ప.2ఆ.) మన్మథోపాలంభవర్ణనము (124-126ప.2ఆ.) నానారాజవర్ణనము (130-190ఉ.2ఆ.) గర్భవతివర్ణనము (226-229ప.2ఆ.) సూర్యాస్తమయవర్ణనము(310-314ప.2ఆ;84ప.5ఆ.) అంధకారవర్ణనము (315-323ప.2ఆ;85-88ప.5ఆ.) నక్షత్రవర్ణనము (324ప.2ఆ.) చంద్రోదయవర్ణనము (325-331ప.2ఆ;84ప.5ఆ.) చంద్రికావర్ణనము (332-338వచ.2ఆ.) ప్రభాత వర్ణనము (341-348ప.2ఆ;90ప.5ఆ.) సూర్యోదయవర్ణనము (349-350ప.2ఆ.) గ్రీష్మర్తు వర్ణనము (39-44ప.3ఆ.) వేటవర్ణనము (61-92ప.3ఆ.) దూత్యవర్ణనము (104-121ప.3ఆ.) పురపురంధ్రీవిలోకనవర్ణనము (71-79ప.5ఆ.) వైతాళికగానవర్ణనము(92-99ప.5ఆ.) వివాహవర్ణనము (103-123ప.5ఆ.) కేళీగృహవర్ణనము(127-128ప.5ఆ.) రతివర్ణనము (134-143ప.5ఆ.) కలవు.

వసంతర్తువర్ణనమునందు నారన సూరన సూక్ష్మపరిశీలనము కల పద్యము:

" విరియు బొండుమల్లె విరులలో నెలదేంట్లు
వ్రాలి చూడ్కి కుత్సవం బొనర్చె
విషమశరుని రాజ్యవిభవంబు వనలక్ష్మి
కన్ను విచ్చి చూచుచున్న మాడ్కి." 32ప.2ఆ.

వనకేళివర్ణనమునందు వనితల పుష్పాపచయనైపుణి కల పద్యము:

" మొకరితుమ్మెద మూతిముట్టని నవకంపుఁ
గ్రొవ్విరుల్ మేలేర్చి కోసికొనుచు
గండుఁగోయిల నోరఁ గమిచి త్రుంపని మంచి
చెలువంపు లేఁ బొరల్ చిదిమికొనుచుఁ

బికకీరములు నాలిఁ బెనఁగి మూచూడని
తనిగమ్మ పండులు దరిగికొనుచు
నొలసి తెమ్మెరలు తావులు గమ్మరింపని
వఱలు పూఁదేనియల్ వడిచికొనుచు
భానుకిరణంబుచే నంటుపడని పుష్ప
కేసరంబులుఁ బుప్పొడికిసలయంపుఁ
బుట్టికలఁ బెట్టికొనుచు నింపులు దలిర్ప
సమదగజగామినులు కేలి సలిపి రపుడు." 40ప.2ఆ.

కవులు సాధారణముగా వర్ణింపని కాకుల అఱుపును సార్థకము చేసిన పద్యము:

" పాహి రమేశ పాహి మురభంజన పాహి ముకుంద యంచుఁ ద
న్మోహభరంబునం బలుకు ముఖ్యజనంబుల వాక్త్రియార్థసం
గ్రాహకశక్తి వోలెఁ బలుకం దొడఁగెం బలుమాఱు కాకసం
దోహము కావుకావుమని తొల్తొలి యల్లన నిండ్ల ముంగిటన్." 345ప.2ఆ.

వాసవదత్త వర్ణనమునందు " తోఁకచుక్కలఁ బోలు దృక్కోయజముల" (60ప.8ఆ.శ్రృంగై)" ప్రభావమున దుష్ఫలము సత్ఫలముగ చమత్కరించిన పద్యము:

" తోఁకచుక్కలె యౌనాను తోయజాక్షి
మించుఁ దెలిగన్నుఁగవ వివరించి చూడఁ
దత్సముద్భూతిఁ గాదె చందనసుగంధి
మధ్యదేశంబు మిగుల క్షామమున నొగిలె." 30ప.4ఆ..

తోకచుక్క పొడిచిన క్షామము సంభవించునని విశ్వాసము. అది దుష్ఫలము. కన్నుగవ తోకచుక్కలైన వాసవదత్త, నడుమునకు క్షామము సంభవించినది. అది సౌందర్యాపాదకము. కనుక సత్ఫలము.

వత్సరాజు వాసవదత్తకు గాత్రపాటవము నేర్పిన విధమును వర్ణించిన పద్యమునందు నారన సూరన సంగీతశాస్త్రపాండిత్యము ప్రతిఫలించినది.

" శ్రుతికి నుత్పత్తియు మూర్ఛ నాదస్థానంబు
లయకర్త మొనరించు నందములను

స్వరము లేడును యథాస్థలముల నవరించి
మోహనారోహావరోహసరణి
ముట్టెడు నేర్పులు మూర్ఛనావ్యంజనో
దారతలు విభిన్నతారమధ్య
మంద్రసమానముల్ మార్గముల్ మొదలి రా
గములు ముప్పదిరెంటి కదలికలును
వాని మిశ్రంబులును దేశవైఖరులును
నిర్విశేషంబుగా నేర్చె నృపతనూజ
పార్థివాగ్రణిచే గాత్రపాటవంబు
సిద్ధవిద్యాధరామరశ్రేణి వొగడ." 65ప.4ఆ.

వాసవదత్తవర్ణనమునందు నారన సూరన జ్యోతిశ్శాస్త్రపాండిత్యమును ప్రదర్శించిన పద్యము:

" ఒదవిన కింక సింహమున నుండి రయంబున మీనరాశితోఁ
గదిసిన యట్టి యత్రిముని గాదిలిపట్టి పయిం గమించు స
మ్మదమునఁ గుంభరాశి నడుమన్ నడుకొత్తిన రాహువో యనన్
మదవతి కా కుచద్వితయమధ్యము మూరు తనర్చెఁ జూడఁ గన్." 17ప.4ఆ.

కథాకావ్యములందు కవితాసంపద, పాండిత్యబలము కల ప్రౌఢకావ్యము నారన సూరన ఉదయనోదయము. జక్కన విక్రమార్కచరిత్రము తర్వాత నారన సూరన ఉదయనోదయము ప్రౌఢశృంగారకథాకావ్యము.

**పచ్చకప్పురపు తిరువేంగళరాజు** :- ఈతని కృతి చొక్కనాథచరిత్ర. ద్విపద కావ్యము."అచ్యుతదేవరాయప్రతాపదక్షిణబాహు"వైన గోళ్ల పెదరామనృపతికి అంకితము. అతని తమ్ముడు చిన రామనృపతి సంధాత. ఇద్దఱి శాసనము 31-12-1540వ తేదీని కలదు.[250] కనుక చొక్కనాథచరిత్ర రచనాకాలము 1540 వ సంవత్సరము కావచ్చును.

చొక్కనాథచరిత్రకు చొక్కనాథవిలాసము, చౌషష్టివిలాసము, మధురాపురాణము అను నామాంతరములు కలవు. మధురై లోని శివుడు చొక్కనాథుడు. చొక్కనాథుని చతుష్షష్టిలీలలు చొక్కనాథచరిత్ర. హాలాస్యమాహాత్మ్యము, మధురాఖండము అను పేరులు కల స్కాందపురాణఖండమునకు తెనుగుసేత. కాలక్రమమున పద్యకావ్యము

లు. వచనకావ్యము వెలసినవి. సంస్కృతకావ్యమును వెలసినది. అది నీలకంఠదీక్షితుల శివలీలార్ణవ మను కావ్యము.[251]

పచ్చకప్పురపు తిరువేంగళరాజు చొక్కనాథచరిత్ర ముద్రితగ్రంథమునందు చొక్కనాథుని చతుష్షష్టిలీలల పట్టిక కలదు. (పుటలు12-16) అందు ఏబది తొమ్మిది లీలలే కలవు. అందులోని తొమ్మిది లీలలు గ్రంథమునందు లేవు. అవి 3,4,8,9,18,22, 28,45,46.లీలలు. కాని గ్రంథమునందు అరువది నాలుగులీలలు కలవు. అందు పదునాలుగు లీలలు పట్టికయందు లేవు. అవి3,4,6,7,10,11,12,21,24,26,32,40,52,53. లీలలు. ఉన్నవి 59-9 = 50 + 14 = 64. గ్రంథములోని 64లీలలు సరిపెట్టినట్లు కలదు.

చొక్కనాథచరిత్రలోని ప్రతి లీల మధురై క్షేత్రదైవమైన చొక్కనాథుని-మీనాక్షిభర్త, సుందరేశ్వరుని-మహిమను ప్రతిపాదించును. గ్రంథములోని ఐదవలీల నుండి పాండ్యరాజుల ప్రమేయము కలదు. పాండ్యరాజులకు మధురై రాజధాని అగుట ఒక లీలయందు కలదు. (4) మధురైకు హాలాస్యపురమను పేరు వచ్చుట మఱొక లీలయందు కలదు. (23) చొక్కనాథుడు మలయకేతువను రాజునకు స్వప్నమునందు సాక్షాత్కరించి చెప్పుట వలన మధురై రాజధాని అయినది. పాండ్యరాజు జైనమతమును నాశనము చేసెనని జైనులు ప్రయోగింపజేసిన మహోగ్రసర్పమును చొక్కనాథుడు శాంతింపజేసి "నప్పుడు విషమంటు కతనఁ బొలుపొంద హాలాస్యపుర" మైనది. హాలాస్యక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునది హాలాస్యమాహాత్మ్యము మధురాక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునది మధురాఖండము.

చొక్కనాథచరిత్ర గ్రంథములోని 50,51,52,53,54 లీలలు నత్కీరునికి సంబంధించినవి. అందు 50,51,52. లీలలు ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని నత్కీరుని కథకు సంపదించునవి. సామ్యభేదములు కలవు. చొక్కనాథచరిత్రలోని చౌషష్టిలీలల పట్టికయందు నక్కీరశబ్దము కలదు. గ్రంథమునందు నత్కీర, నక్కీర శబ్దములు రెండును కలవు. నత్కీరశబ్దము నాలుగు స్థలములందు కలదు. నక్కీరశబ్దము పదునాలుగు స్థలములందు కలదు. అందు రెండు స్థలములు ప్రాసఘటితములు.

"నక్కీరుఁ డప్పు డానందమ్ము నొంది
చొక్కనాథుని గుడిఁ జొచ్చి యద్దేవు" పుట268.
"ముక్కంటి కృపచేత మున్నున్న యట్లు
నక్కీరదేవుఁ డెంతయు నుండె మఱియు" పుట269.

చొక్కనాథచరిత్రయందు దుర్భిక్షము లేదు. హరద్విజుడు లేడు. ధర్మి అను బ్రహ్మచారి వివాహమాడుటకు చొక్కనాథుని ప్రార్థించును. చొక్కనాథుడు అతనికి పత్రిక ఇచ్చి, ఇది మదీయశ్లోకము. రాజు ముందఱ చదివి ముడుపు తెచ్చుకొని వివాహము చేసికొమ్మని చెప్పును. ధర్మి చదివిన శ్లోకమునకు ధర్మసందేహము తీరిన పాండ్యరాజు వరహాల ముడుపు కొనిపొమ్మన్నప్పుడు, నత్కీరుడు చయ్యన వచ్చి, "ఈ శ్లోకమునకుఁ గల దొక తప్పు నీ కవి చెప్పినట్టి వారిఁ బిలువు" మనును అది బ్రహ్మచారి విన్నవించిన, చొక్కనాథుడు విద్వాంసుడై సంఘమంటపమునకు వచ్చి "కవిత్వము తప్పులన్న వారెవ్వరనుచు",

"శ్రుతులందు వినవె! యా రుద్రాణి పేరు
కౌతుకక సౌగంధికుంతల నాఁగ"

అని శ్రుతిప్రామాణ్యము చూపును. ఇది శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు లేదు. అంతేకాదు.

"మా కులక్రమమిది మఱి నీదు వృత్తి
గోత్రమ్ము నామము కులము శీలమ్ము
పాత్రమ్ము నెయ్యది! భావింప నాకు
నెఱుఁగఁ జెప్పు మటంచు నీశుతో మఱియుఁ
బరగ నీ చెప్పిన పద్య మర్థమ్ము
కురుల వాసన గాని కొమరొప్పు ముడుచు
విరుల వాసన గాదు వెలఁదికి నంటి.
దనర మస్తకమునఁ దైలమ్ము గూడ
కనుదినమ్మును స్నానమాడక మఱియుఁ
బరిమళామోదపుష్పమ్ములు నెపుడు
నొఱపుగా ముడువక యున్న నా చెమట
కంపువైచును గాక కమ్మని తావి
సొంపు నెఱులకు నేలఁ జొప్పడుఁ జెపుమ!"

అని నత్కీరుడు ప్రతిభటించును. అయినను చొక్కనాథుడు ఉపపత్తులు చూపును. అవి కూడ నత్కీరుడు ప్రతిఘటించును. "హరుభక్తి వలన"

"కలఁగక తలచుట్టు కన్నులైనాను
తప్పు తప్పగుగాక దారుణాకృతుల

నొప్పేల యగును?"

అని ప్రశ్నించును. సంఘఫలకమంటపమునకు సంబంధించిన కవు లందఱు.

"శంకర! యపరాధశతకంబు మీకుఁ
గింకరుఁడైన నక్కీరుండు సెప్పెఁ
గరుణించి యంగయకణ్ణమ్మ మీర
లిరువురు విచ్చేసి యిట దరి నుండి
వినవయ్య యని వారు విన్నవించినను"

అంగయకణ్ణమ్మ (మీనాక్షి) చొక్కనాథుడు "మనమున దయగల్గి మన్నించి"నట్లు కలదు. శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని శాపవృత్తాంతము లేదు. కాని చొక్కనాథుడు

"నెమ్మి నీ నక్కీరునికిఁ గావ్యలక్ష
ణమ్ముల రాక నెన్నఁగ నెట్టి పెద్ద
లైన విద్వాంసుల నట వారిఁ గన్న
కాన కెప్పుడు తిరస్కారము సేయు"

నని. అగస్త్యునికి "ద్రావిడకవిత్వమ్ము లక్షణయుక్తమ్ముగా" ఆనతిచ్చిన. అగస్త్యుడు "నక్కీరున కా లక్షణమ్ము లెంతయుం దెలియ సర్వేశు నానతిని విరచించి"నట్లు కలదు. (ఏబది మూడవ లీల) ఇది శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు నిరవకాశము.

తమిళశైవప్రవక్తలైన మాణిక్యవాచకర్, జ్ఞానసంబంధర్‌లకు సంబంధించిన కథలు చొక్కనాథచరిత్రయందుకలవు. గ్రంథములోని 56,57,58లీలలు మాణిక్యవాచకర్‌కు, 60వలీల జ్ఞానసంబంధర్‌కు సంబంధించినవి. అసలు మంత్రి అయిన మాణిక్యవాచకర్ మహాజ్ఞాని అగుట, పాండ్యరాజు గుఱ్ఱములనుకొని తెమ్మని ఇచ్చిన ధనమెల్ల తిరుపెరుందూరులో గుడిగోపురములు కట్టించుటకు, దైవకార్యములు నిర్వహించుటకు, మహేశ్వరార్చనలు సాగించుటకు, దానధర్మములు చేయుటకు వెచ్చించుట, పాండ్యరాజు మాణిక్యవాచకర్‌ను శిక్షించుట చరిత్రాంశములు కావచ్చును. మాణిక్యవాచకర్ ప్రార్థనమున గుఱ్ఱములు వచ్చుట, అవి నక్కలగుట చొక్కనాథుని మహిమాతిశయములు."శైవమ్ము విడిచి జైనుల మతము భావించు" పాండ్యరాజును, చోళభూమిలోని శియ్యకూరియందు జన్మించిన జ్ఞానసంబంధర్ మధురైకు వచ్చి, శైవుని చేయుట, జైనులను కొఱత వేయించుట చరిత్రాంశములు కావచ్చును. జైనులు మంత్రాగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లజేయుట, అవి

చల్లార్చి జ్ఞానసంబంధర్ పాండ్యరాజునకు తాపజ్వరమును కలిగించి. చొక్కనాథుని విభూతిచేత తగ్గించుట చొక్కనాథుని మహిమాతిశయములే.

వైష్ణవమతపరమైన పరమయోగివిలాసమునందు వలె, శైవమతపరమైన చొక్కనాథచరిత్రయందును బౌద్ధజైనభేదపరిగణనము లేదు. సమానపరిగణనమే కలదు. అంతేకాదు. పరమయోగివిలాసము పరమార్థము వైష్ణవమతప్రబోధము వలె, చొక్కనాథ చరిత్ర పరమార్థము శైవమతప్రబోధము. అది క్షేత్రస్థానమునుబట్టి నాథశైవసనాథమైన తమిళశైవము. నాథశైవమునకు జీవనాడి అయిన రసవాదమును చొక్కనాథ చరిత్రయందు కలదు. చొక్కనాథుడే సిద్ధుడై వచ్చి, జంగమార్చనసేయు జొన్నాయి అను వారవనితకు. ఇనుపములను ముద్ద సేయించి ఔషధము పూసి. "ఇడి యగ్నిపుటమున నీ ప్రొద్దె పెట్టు! పదియాఱు వన్నియ బంగారమగును" అని చెప్పెను. జొన్నాయి "వెసవేఁచి యినుమును వేఁగఁ జూచినను! బసగల యపరంజి బంగారమయ్యె"ను. "ఆవిధమంతయు నాయూరివారు! భావించి యాశ్చర్యపడి చూచిరంత" అనికూడ ముప్పదియైదవలీలయందు కలదు. ఇది రసవాదము.

ప్రతిలీలయందు ప్రకరణోచితముగ చొక్కనాథస్తుతి కలదు. శైవమ తప్రబోధమేగాని, శైవమతప్రచారము లేదు. మధురాక్షేత్రదైవమాహాత్మ్యప్రతిపాదనము ప్రధానము. చొక్కనాథచరిత్ర ద్విపదకావ్యముతోపాటు క్షేత్రమాహాత్మ్యకావ్యము.

**దోనూరి కోనేరునాథుడు** : ఈతని కృతులు పద్యబాలభాగవతము. ద్విపద బాలభాగవతము. పద్యబాలభాగవతము ఆరవీటి బుక్కరాజు మనుమడైన తిమ్మరాజునకు అంకితము. తిమ్మరాజు జ్యేష్ఠపుత్త్రుడు తిరుమలరాజు సంధాత. ద్విపదబాల భాగవతము తిరుమలరాజు రెండవ తమ్ముడైన చిన తిమ్మరాజునకు అంకితము. తిరుమలరాజే సంధాత. తండ్రికి. తమ్మునికి అంకితములు చేయించిన తిరుమలరాజు స్వయము కృతికర్త.

పద్యబాలభాగవతమునందు చరిత్రాంశము కల పద్యము కలదు.

"ఏపున ద్రోహిభావము వహించిన సల్కయతిమ్మరాజుఁ ద
త్పాపసహాయు సల్కయయుతంబుగ శౌర్యము మీఱఁ ద్రుంచి వి
ద్యాపురియందుఁ జాల ఘనుఁడయ్యె సదాశివరాయరాజ్యసం
స్థాపకుఁడై సిరంగవసుధావరు రామనరేంద్రుఁ డున్నతిన్." 37ప.అవ.

అళియరామరాయలు సల్కయతిమ్మరాజును సంహరించి, సదాశివరాయరాజ్య

సంస్థాపకుడైన కాలము 1542 వ సంవత్సరము.[252] కనుక పద్యబాలభాగవతము రచనాకాలము స్థూలముగ 1543 వ సంవత్సరము.

ద్విపదబాలభాగవతము తుదిని కాలనిర్దేశము కల పద్యము కలదు.

"అరుదుగ శాలివాహనశకాబ్దము లెన్న నిధానతర్కసా
గరశశిసంఖ్యచే వెలయఁ గల్గు ప్లవంగ మనంగ మించు వ
త్సరమునఁ బల్కెఁ దిమ్మవసుధాపతికిన్ గవిసార్వభౌముఁ డే
హరిహితబాలభాగవతహారిపదద్విపదప్రబంధమున్."

నిధానతర్కసాగరశశిసంఖ్య శాలివాహనశకాబ్దములు 1469 + 78 = 1547 వ సంవత్సరము. కనుక ద్విపదబాలభాగవతము రచనాకాలము 1547వ సంవత్సరము.

బాలభాగవతము రచించిన దోనూరి కోనయ్యకు. నంద్యాల నారసింహరాజు కమలాపురము తాలూకాలోని యర్రగుంట్ల గ్రామమును దానము చేసినట్లు శాసనము కలదు గాని శాసనకాలము లేదు.[253] కోనేరునాథుడు పద్యబాలభాగవతము రచించి కవిసార్వభౌమబిరుదము. ద్విపదబాలభాగవతము రచించి యర్రగుంట్లగ్రామము పొందియుండవచ్చును.

పద్యబాలభాగవతమే ద్విపదబాలభాగవతమైనట్లు కలదు.

"వచియించి తొననఁ బద్యకావ్యముగఁ
బ్రచురంబుగా బాలభాగవతంబు
వాసికి నెక్కి యివ్వసుధాతలమున
భాసిల్లు నా బాలభాగవతంబె
యరుదుగా నడచిన యన్ని మార్గములఁ
దిరముగా మా చినతిమ్మయ్య పేర
ద్విపదకావ్యంబుగా వెలయంగఁ జేయు
మిపుడు మాకెంతయు హితమిది యనుడు"

బాలభాగవతమన భాగవతసంగ్రహమని భావము. ద్వాదశస్కంధకథలు కలవు.

అట్టి భాగవతంబునం దలరుచున్న
ద్వాదశస్కంధకథలనువరుసఁ గూర్చి
కావ్య మొక్కటి బాలభాగవత మనఁ గఁ

జెప్పి లోకోపకారంబు సేయవలయు" 18ప.అవ.

"అట్టి భాగవతమునందలి ద్వాదశ
స్కంధకథలు నిందుఁ గలుగు కతన
వసుధ బాలభాగవతమన నిక్కావ్య
మలరుచుండు సుజను లభినుతింప." 3ప.1ఆ.

254

బాలభాగవతము భాగవతకథాసంగ్రహము మాత్రమేగాక, విశిష్టాద్వైతపరము. సంస్కృతాంధ్రభాగవతముల సరణి కలదు. స్వతంత్రకల్పనమును సకృ న్మాత్రము కలదు. వామనావతారకథయందు వామనుడు బలి సభకు వచ్చి, మునీశ్వరు లతో పాండిత్యగోష్ఠి సేయుట స్వతంత్రకల్పనమే.

"త్రయ్యంతి (ప్రౌఢతర) ప్రభాకరకుమా
రిలశాస్త్రచాతుర్యవిలసితములు
వేదాంతవాగర్థవిధులును గౌతమ
కణభోజిపాణినిగ్రంథరుచులు
కాపిలమతయుక్తిఘటనలు బహుపురా
ణేతిహాసగ్రాహ్యజాతకథలు
నాటకాలంకారనైపుణాభినయంబు
కావ్యప్రహేళికాకౌశలంబు
లాదిగాఁ గల విద్యారహస్యతతుల
ఘనతరోదారపటునిరాఘాటఫణితి
వహ్నిసన్నిభులగు మునీశ్వరులతోడ
గోష్ఠిఁ జేసె నవ్వటుఁ డటు కొంతతడవు." 161ప.4ఆ.

ఇది సందర్భమునకు పరమావశ్యకము కాదు. కవి స్వానుభవము కావచ్చును. పద్యబాలభాగవతము ప్రౌఢము. ద్విపదబాలభాగవతము సరళము. పద్యబాలభాగవతము నందు తేట తెనుగు విరళము. సంస్కృతభూయిష్ఠరచన బహుళము.

"చిఱుతగాలికిఁ బుట్టు కుఱుగడ లుయ్యలల్
గా నూఁగియాడు జక్కవల చేతఁ
దమ్మితూడులు ద్రుంచి కొమ్మల కందించి
పెంపొందు రాయంచ పిండు చేతఁ
బూదేనె పొత్తుల భోజనంబుల కర్థిఁ

గదుపులు గట్టు తుమ్మెదల చేతఁ
దరుల తీవెల పెదు ల్గురియ నెల్లపుడు పైఁ
బడి కప్పుకొన్న పుష్పాదుల చేత
గరుడపచ్చల చెలులతో పరిసపడఁగఁ
బదరు క్రొమ్మించు నాచు జొంపముల చేతఁ
జాల వేడుక లొనరింపఁ జాలు నొక్క
కొలనుఁ జేరె నయ్యెనుఁ గుకులముసామి."18ప.4ఆ.
"శీతప్రద్రాపితాశేషమందోష్ణాతి
శయసమూరూతయోషాస్తనంబు
పల్లవకాంక్షిత ప్రౌఢాంగనాపీన
కుచకుంభగాఢోపగూహనంబు
కుటకందసంప్లుతోత్కటకరీషానలో
ద్యద్ధూమసంబాధితాంబరంబు
జానుసంవ్యాజితశాతోదరీకృత
వ్యాయస్తదుర్బలవార్ధకంబు
జనవరస్వీకృతోరుహసంతికంబు
హావ్యవాహోజ్జ్వలసంశ్రితాహస్కరంబు
దీర్ఘదీర్ఘవిభావరీదీపితంబు
నయ్యె హేమంతవేళాసమాగమంబు." 126ప.5ఆ.

పద్యబాలభాగవతమే ద్విపదబాలభాగవతమైనను. పద్యబాలభాగవతమునందు లేని పోతన పద్యముల అనుకరణము. ద్విపదబాలభాగవతమునందు కలదు. ప్రసిద్ధమైన "ఇంతింతై వటుఁడింతయై" అను పోతన పద్యమును పోతపోసిన ద్విపదలివి:[255]

"ఇంతయై యింతయై యినమండలమున
కంతయై యంతయై యట చంద్రు దాటు
యింతింత యనరాక యెల్ల దిక్కులను
వింతగాఁ గప్పుచు పరివి గైకొనుచు
చిటుక వ్రేసిన యంత సేపులో శిరము
పటుపద్మజాండంబు పైఁ జిప్ప దాఁక
పెరిగి రెండడుగుల పృథివియు మిన్ను

సరభసంబుగఁ గప్పి సంప్రీతి నిలిచె."

పద్యబాలభాగవతమునందును పోతన పద్యానుకరణము కలదు.

"విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణీం దాస్యామి" యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁ గన్." 607ప.8స్కం.
"అమితబ్రహ్మరహస్యమార్గమనాయాసక్తిమచ్ఛేతసే
విమలాచారజుషే పదత్రయమితోర్వీం విష్ణురూపాయ తు
భ్యమహం సంప్రదదే నమో నమమ నిత్యప్రీతి రస్త్వం"చు ని
స్తముఁ డై గ్రక్కున ధారవోసె బలి యుత్సాహంబు సంధిల్లఁ గన్." 180ప.4ఆ.

దోనూరి కోనేరునాథుడు కవిసార్వభౌమ, సాహిత్యమార్గనిశ్శంక బిరుదాంకితుడు. అయినను పద్యబాలభాగవతము, ద్విపదబాలభాగవతము-పోతన భాగవతమువలె మందారమకరందమాధుర్యమయము కాదు. మందాకినీతరంగములు మాత్రమే.

**రామరాజు రంగపరాజు** : ఈతని కృతి సాంబోపాఖ్యానము. ఆరవీటి బుక్కరాజు కుమారుడైన రామరాజు వంశీయుడగుట వలన రామరాజు రంగరాజు అని వ్యపదేశము. సాంబోపాఖ్యానము శ్రీరంగనాథునికి అంకితము. దైవాంకితము. రంగపరాజు వంశవృక్షవర్ణనమునందు అళియరామరాయలు సజీవుడైనట్లు, అతని సోదరుడు తిరుమలరాయలు గుత్తిపాలకు డయినట్లు కలదు.

"శ్రీరంగరాజరామ
క్ష్మారమణుని కీర్తి జలధిజాలము దాఁటు
న్నేరిచియును నేరదు రిపు
నారీనయనాశ్రుపూరనదిఁ దరియింపన్."
"గుత్తెఱతిమ్మరాజు పరఁగున్ హరగాంగసితాబ్జకాంతులన్
గుత్త లొనర్చు కీర్తులఁ జకోరదృగాశయపుష్పధన్వుఁ డై
యత్తొగ విందు వంగడము నందలి భర్తకు సంభవించి రా
యెత్తున కెత్తు వచ్చు సిరి యింపుల శౌర్యధనంబు పెంపునన్."

గుత్తిని పాలించు ఎఱ్ఱని తిమ్మరాజు గుత్తెఱతిమ్మరాజు. తిమ్మరాజన తిరుమల

రాయలు. ఇతడు 1564-65 నుండి చంద్రగిరిపాలకుడు.[256] 1570నుండి72వఱకు విజయనగరసామ్రాజ్యాధిపతి. కావున గుత్తిపాలకుడగు కాలము 1564కు పూర్వమే కావలయును. కాబట్టి సాంబోపాఖ్యానము రచనాకాలము స్థూలముగ 1560 వ సంవత్సరము కావచ్చును.

రంగపరాజు గురువు తిరుమల శ్రీనివాసాచార్యులు. పింగళి సూరన కళాపూర్ణోదయమునకు కృతిభర్త అయిన నంద్యాల కృష్ణమరాజు గురువు కూడ తిరుమలశ్రీనివాసాచార్యులే. ఇది పదునాఱవశతాబ్ది ఉత్తరార్ధమునందే సంభవము.

సాంబోపాఖ్యానమునందు శ్రీకృష్ణుని బాల్యవృత్తాంతము, ప్రద్యుమ్నజనన వృత్తాంతము, స్యమంతకమణివృత్తాంతము, జాంబవతీపరిణయ వృత్తాంతము, సాంబ జననవృత్తాంతము మొదటి మూడు ఆశ్వాసములందు, నాల్గవ ఆశ్వాసమునందు 86వ పద్యము వఱకును కలదు. చతుర్థాశ్వాసములోని 114 పద్యగద్యములు, పంచమాశ్వాసములోని 364 పద్యగద్యములు మాత్రమే సాంబోపాఖ్యానము. జాంబవతీశ్రీకృష్ణుల పుత్రుడైన సాంబుడు, భానుమతీసుయోధనుల పుత్రికయైన లక్షణను ఎత్తుకొనిపోయి వివాహమాడుట సాంబోపాఖ్యాన విషయము. లక్షణాసాంబుల విరహాదికము సమకాలికశృంగారప్రబంధ సరణి. అంతేకాదు. లక్షణాసాంబుల వివాహమునకు సంధానకర్త అయిన సిద్ధాంత దర్పణ గురువు సమకాలికవైష్ణవగురువు. అతని చేతి దర్పణము విచిత్రమైనది. లక్షణకు అద్దములో ముల్లోకములు చూచుటకు దివ్యదృష్టి నొసగును. ఆమె గజగజ వణికిన, విష్ణుపాదతీర్థము చిలికించును. ఆమెను ధీరస్వాంతను చేసి, కర్కోటకాదినాగరాజులను, దేవతలను, ద్వారకలోని యాదవులను, వృష్ణులను, అంధకులను అద్దమునందు వరుసగా చూపించి, కడకు సాంబుని చూపించును. సాంబుని చూడగానే లక్షణ, ఆతనియందు మనస్సు నిల్పును. తర్వాత సిద్ధాంతదర్పణాచార్యుడు ద్వారకకు పోవును. ముకురములో చూచిన సాంబుని రూపవిలాససంపదకు లక్షణ విరహావస్థనందును. ద్వారకనుండి హస్తిపురమునకు తిరునాళ్లకు వచ్చిన సిద్ధాంతదర్పణగురువు, అతని చేతి దర్పణము లక్షణాసాంబుల వివాహమునకు మూలము. ఇది రంగపరాజు స్వతంత్రకల్పనము.

సాంబోపాఖ్యానములోని సాంబజననవృత్తాంతము నాచన సోమనాథుని ఉత్తరహరివంశములోని ప్రద్యుమ్నజననవృత్తాంతమునకు ప్రతికల్పనము. ఇతర వృత్తాంతములు భాగవతకథానుసారులు. ఇన్ని వృత్తాంతముల కలగలుపు రచించుటకు హేతువు కావ్యము నవరసభరితము కావలయునను ఆశయము కావచ్చును

అష్టాదశవర్ణనలును కలవు. అవి : పురవర్ణనము (133-175ప.1ఆ.) సముద్ర వర్ణనము (192-201ప.1ఆ.) నగవర్ణనము (115-134ప.2ఆ.) ఋతువర్ణనము (72-108ప.2ఆ.) సూర్యోదయవర్ణనము (343-351ప.5ఆ.) చంద్రోదయవర్ణనము (45-48ప.5ఆ.) సరో వర్ణనము (5-15ప.5ఆ.) వనవిహారవర్ణనము (200-227ప.4ఆ.) మధుపానవర్ణనము (147-161ప.2ఆ.) రతివర్ణనము (192ప.1ఆ;66-68ప.4ఆ. 318-336ప.5ఆ.) వివాహ వర్ణనము(113-145ప.3ఆ;247-285ప.5ఆ.) ప్రయాణవర్ణనము (117-125వచ.5ఆ.) యుద్ధ వర్ణనము (25-31వచ.3ఆ; 69-72ప.3ఆ; 126-233ప.5ఆ.) వేటవర్ణనము(3-24ప.3ఆ.) యాత్రావర్ణనము (109-114ప.2ఆ;53-65ప.3ఆ;186-188 ప.3ఆ.) దౌత్యవర్ణనము (69-92 వచ.2ఆ.) నాయకవర్ణనము (87-107వచ.5ఆ.) నాయికావర్ణనము (108-125ప.4ఆ.)

నాచన సోమనాథుని ఉత్తరహరివంశము ప్రభావము. రంగపరాజు సాంబో పాఖ్యానమునందున్నట్లు. సాంబోపాఖ్యానము ప్రభావము తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రమునందు కలదు.

**సిద్ధరాజు తిమ్మరాజు** : ఇతడు అళియరామరాయల మేనల్లుడు. ఈతని కృతి పరమయోగివిలాసము. పద్యకావ్యము. మంగళగిరి పానకాల నృసింహస్వామికి అంకితము. ఇతని శాసనములు 1548 నుండి 1564 వఱకు కలవు.[257] ఇతని స్వీయచరిత్రమునందు ఇట్లు కలదు.

"ఏ రాజు ముత్తాత భూరిసామ్రాజ్యల
క్ష్మీధురీణభుజుండు సిద్ధనృపతి
యే నరాధిపు తాత నానార్థిసంతాన
సంతానశాఖి యనంతశౌరి
యే గుణాఢ్యుని తండ్రి భోగవైభవనూత్న
సుత్రాముఁ డౌభళక్షోణిభర్త
యే విభుం డళిరామభూవరు తిరుమల
ప్రభువేంకటాద్రుల భాగినేయుఁ
డట్టి తిమ్మనృపుం డాజిహతతురుష్క
రక్తశోణనదీకృతప్రబలసలిల
వితతకృష్ణానదీయశోర్జితుఁ డు కోన
మాంబ పుత్త్రుండు రంగరాజానుజుండు. 7.
సకలశ్రీయుతకొండవీటినగరీసామ్రాజ్యధౌరేయతా

ధికతన్ మీఱుచు నొక్క నాఁ డచలభక్తిస్ఫూర్తి శ్రీవైష్ణవ
ప్రకరంబున్ భజియించుచున్ హరికథాప్రస్తావనన్ దివ్యయో
గికథల్ వించుఁ దదర్థకావ్యరచనాకేళీసమాసక్తుఁడై-"

ఇందు తిమ్మరాజు కొండవీటి దుర్గాధిపతి అని. యుద్ధమునందు వధించిన తురుష్కరక్తము చేత కృష్ణానదిని శోణనదిని చేసిన ఖ్యాతి గడించెననియును కలదు. ఇది 1557 వ సంవత్సరము నాటి చారిత్రకసంఘటన.[258] కాబట్టి పరమయోగివిలాసము రచనాకాలము స్థూలముగ 1560 వ సంవత్సరము కావచ్చును.

తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసమునకు సిద్ధరాజు తిమ్మరాజు పరమయోగివిలాసము పద్యకావ్యరూపాంతము. అందు వలె ఇందును పన్నిద్ధరాళ్వారుల, ముగ్గురాచార్యుల వృత్తాంతములు కలవు. అయినను రూపాంతరీకరణము స్వతంత్రము.

**తెనాలి అన్నయ** : ఇతడు తెనాలి రామ(లింగ)కృష్ణుని తమ్ముడు. ఈతని కృతి సుదక్షిణాపరిణయము. పులిజాల సోమనమంత్రికి అంకితము. అతని ఏలిక కోనేటి రామరాజు. ఇతడు సాంబోపాఖ్యానము రచించిన రంగపరాజునకు అగ్రజుడైన తిమ్మరాజు కొడుకు. తిమ్మరాజు ము-డవ తమ్ముడు రంగపరాజు. రంగపరాజు, కోనేటిరామరాజు సమవయస్కులు కాకపోయినను సమకాలికులగుదురు. సాంబోపాఖ్యానము, సుదక్షిణాపరిణయము సమకాలికగ్రంథములు కావచ్చును. కాబట్టి సుదక్షిణాపరిణయము రచనాకాలమును 1560ప్రాంతము కావచ్చును.[259]

తెనాలి రామ(లింగ)కృష్ణుని కాలము 1500-1580 అని పూర్వోక్తము. అతని తమ్ముడు అన్నయ కాలము 1505-1585 అగును. అయిన సుదక్షిణాపరిణయము రచనాకాలము 1560 ప్రాంతమగుట సంగతమే.

అన్నయ గురువు కందాళ భావనార్యుల నందనుడు శ్రీరంగగురుడు. ఇతని శాసనములు 1540 ప్రాంతమునందు కలవు.[260] ఇది కూడ అనుకూలమే.

అన్నయ పూర్వకవిస్తుతియందు "కాళిదాసాదిసంస్కృతకవులఁ దలఁచి", "నన్నపార్యాదులను బుద్ధి సన్నుతించి", "పాలగుమ్మి భీమగురుని సద్భక్తిఁ గొలుతు"నని కలదు. (9ప.1ఆ.) ప్రకరణమును బట్టి పాలగుమ్మి భీమగురువు అన్నయకు కవితాగురువు కావలయును. "సహజశైవాచారసంపన్న భీమదన్నయ" అని

ఆశ్వాసాంతగద్యను కలదు. సహజముగా శైవాచారసంపన్నుడు. శ్రీరంగగురు ప్రసాదమున వైష్ణవమతస్వీకృతుడు. అయినను శివసంబంధము కలది సుదక్షిణా పరిణయము.

సుదక్షిణాపరిణయమున సుదక్షిణాదిలీపుల వివాహము. దిలీపుని వృత్తాంతము కాళిదాసు రఘువంశమునందు కలదు. అందు పరిణయవృత్తాంతము లేదు. దాక్షిణ్యముచేత పేరు రూఢమైన మగధవంశజ సుదక్షిణ. అధ్వరమునకు దక్షిణ వలె దిలీపుని పత్ని అని మాత్రమే కలదు. (31శ్లో.1స.) అంతేకాదు. కాళిదాసు రఘువంశ మునందు దిలీపుడు క్షీరనిధియందు చంద్రుని వలె జన్మించెనని మాత్రమే కలదు. (12శ్లో.1స.) సుదక్షిణాపరిణయమునందు దిలీపుని తండ్రి అంశుమంతుని వృత్తాంతము కలదు. అది దిలీపుని జన్మవృత్తాంతము. సుదక్షిణాజన్మవృత్తాంతమును కలదు.

"రత్నచూడాఖ్యు నంశుమద్రాజసూతి
గెలిచె నే రీతిఁ దత్కథఁ దెలుపవలయు" 104ప.1ఆ.

అని రాముడు అడిగిన, అగస్త్యుడు చెప్పిన కథ సుదక్షిణాపరిణయము. అంశుమంతుని సంతానకాంక్ష, తపశ్చర్య. అతని తపస్సు మాన్పింపుమని దేవతలు శివుని కోరుట, శివపార్వతులు కపటవిప్రదంపతుల వేషమున కల్పితకథను అంశుమం తుని పరీక్షించుట. అంశుమంతుని వదాన్యతకు మెచ్చి, శివుడు సంతానప్రాప్తికి వరమిచ్చుట. దిలీపుడు జన్మించుట. పట్టాభిషిక్తుడగుట. ఇంద్రుని మొఱను రత్నచూడుడను రాక్షసుని పయి దండయాత్రకు సిద్ధపడుట. రత్నచూడుని పూర్వకథ. దిలీపుని మృగయావినోదము. రత్నమయసింహమైన హారిణి అను అప్సరస తన వృత్తాంతమును. నారదుడు ఇంద్రునికి తెలిపిన రత్నచూడవధోపా యమును చెప్పుట. దిలీపుని సచివుడైన సుదర్శనుడు తనకు శృంగారమాలిక అను అప్సరస తెలిపిన సురథుని వృత్తాంతము. సుదక్షిణావృత్తాంతము చెప్పుట. వినుకలి ప్రేమను దిలీపుని విరహము. దిలీపుడు రత్నచూడుని మంత్రిని చంపి పుష్పకవిమా నము గైకొనుట. వనదేవత దిలీపునికి సుదక్షిణ విరహవేదన తెలుపుట. సుదక్షిణా దిలీపుల పరిణయమును సుదక్షిణాపరిణయములోని ఇతివృత్తము. సుదక్షిణా పరిణయవృత్తాంతము సంక్షిప్తసంగ్రహము. రత్నచూడరాక్షససంహార వృత్తాంతము మిక్కిలి విస్తరము. కారణము బ్రహ్మ వాక్కు (41వచ.4ఆ.) వసిష్ఠ వాక్కును.

"బహుసుదక్షిణ లిచ్చి మఖస్ఫూర్తి వెలయఁ
గ్రతు వొనర్చిన ఫలమునఁ గలిగెఁ గాన

ధర సుదక్షిణ యను పేరఁ బరఁగు నీ కు
మారి యారూఢభుజవిక్రమార్కహరణ." 83ప.4ఆ.

ఆరూఢభుజవిక్రమార్క రత్న చూడుడు. బ్రహ్మవాక్కులోని కన్య సుదక్షిణ."కన్యకు వరుం డగు దిలీపభూవరుం డద్దానవేశ్వరభుజాసంపద నొంపంజాలు"నని బ్రహ్మ వాక్కు. ఏవంవిధమైన సుదక్షిణాపరిణయము తెనాలి అన్నయ స్వతంత్రకల్పనమో. అన్యమూలకమో అన్వేషణీయము.

అన్నయ అగస్త్యభ్రాత కాడు. సుదక్షిణాపరిణయము కవితాసుందరము. శైలి సరళము. కథాసంవిధానకౌశలము కలదు. వర్ణనావైదగ్ధియును కలదు.

అంశుమంతుడు హృదయపద్మమునందు శివుని తదేకధ్యానము చేయుట ఉక్తివైచిత్రివిలసితము.

"ఆఱు మోముల ముద్దు హవణించు క్రౌంచారి
కొడుకు మాటల వింత కొసరు మఱచి.
తలయేటి వెలిదమ్మి మొలకయో యని కరా
గ్రమునఁ జందురుఁ దార్చు కొమరు మఱచి.
ప్రాణంబు ప్రాణంబులై సదా తన యొద్దఁ
గదలని ప్రమథపుంగవుల మఱచి.
యూడిగంబుల కెల్ల నొదవి నల్లడలఁ బా
యకయుండు తపసి జోటికల మఱచి.
యెంత వేఁడురు గొనియెనో యిందుమౌళి
నాటుదేరని సచ్చిదానందలహరి
దలమగు మహీశు డెందంపుఁ దమ్మి గద్దె
కొలువుకూటంబు లోపలఁ గొలువు సేయు!" 129ప.1ఆ.

దిలీపుని యౌవనవర్ణనమునందు ఉయ్యాల లూగిన శైలీవిన్యాసము

"తేఁటులో నీలంపు పేటులో యురుల క
న్నాకులో యనఁ గురుల్ కుఱ్ఱ గవిసె;
తమ్ములో మరుని క్రొత్తమ్ములో సిరుల నె
త్తమ్ములో యనఁగ నేత్రములు దనరె;
వాటమో హేమకవాటమో జయలక్ష్మి

కూటమో యన మించె మేటి యురము;
చిందమో లావణ్యకందమో మోహనా
నందమో యన గ్రీవ నాణెమయ్యెఁ;
బలుకు కప్రంపుఁ బలుకులు పలుకు లయ్యె
సొలపు వలరాజు తూపులు చూపు లయ్యె
గంధగజరాజగమనంబు గమనమయ్యె
సరసయౌవనమహిమ రాజన్యునకును. 132ప.2ఆ.

బోయపల్లె వర్ణనము స్వభావోక్తిసుభగము. అందు కిరాతబాలికల వేటజాతర హృదయమును జలదరింపజేయును.

"మందుల కల్మిఁ మంత్రముల మా వనభూముల పాఁపమూఁక నా
నం దెరలించి నిల్పుచు ఫణాపటలంబుల నూడ్చి తెచ్చి దీ
ప్తిం దిలకించు రత్నముల దివ్వియ లెత్తుదు రిండ్ల ముంగిటం
గ్రందుగ వేఁటజాతరలఁ గాననవీథిఁ గిరాతబాలికల్." 143ప.3ఆ.

ఆకాశవీథిలోని రాకాచంద్రమండలము వ్యవసాయక్షేత్రములోని 'దిష్టి పిడత'

"నెలువ యను కాఁపు గగనంబు నల్లనేలఁ
దారకావారమను మేలి పైరు నించి
నిండి దిగిపొఱఁటయుఁ జూచి నించు దృష్టి
కుండయును బోలెఁ బూర్ణేందుమండలంబు." 139ప.4ఆ.

అక్షరగుణితక్రమమున అలతి చిత్రకవిత.

"సనకప్రస్తుత సారరూప సితహాసా సీరహస్తాప్త సు
స్వనవేదస్తుతపాద సూర్యనయనాబ్జా సేతుబంధక్రియా
జనితోత్సాహధురీణ సైంధవవిలాసా సోమకప్రాణభం
జన సౌజన్యవిలోల సంగరహితా సర్వప్రియంభావుకా." 69ప.5ఆ.

ఇందు సర్వశబ్దమున సః+వ అను పదచ్ఛేదమున అక్షరగుణితము సమగ్రము.

సుదక్షిణాపరిణయమునందు నత్తిమాటల పద్యము కలదు. అది మైరేయపానమహిమ.

"తతతతామరసాక్షి, తలపంతమాడకు
వివివివీణాకంఠ వీణ దెమ్మ,
పపపపాటలగంధి, పాటపాడు మొకింత;
కుకుకుకుందస్మిత, కురులు ముడుపు;
ససససారసహస్త, సరిదానవా నీవు;
ననననాతుక, నాలి నవ్వు లేల?
వవవవారిజముఖి, వలదు వాదులు చాలుఁ
గొకొకొకోమలి యేల కోపవేగ?"
మనుచుఁ దప్పుదప్పు లాడుచు నన్నుఁ గనిరి
మదననిర్ముక్తదుత్తారమార్గణాగ్ర
హతుల నలసిరొ యన ఖేచరాబ్జముఖులు;
భర్తఁ దేల్చిరి మైరేయపానకేలి." 104ప.3ఆ.

అన్నయ సహజశైవాచారసంపన్నుడైనను, అతని ఇష్టదేవతాస్తుతియందు వేంకటేశునికి ప్రప్రథమస్థానముకలదు. (1ప.1ఆ.) అంతేకాదు, అన్నయకు వేంకటేశ్వరభక్తి అధికమగుట వలన కాబోలు, దిలీపుడు కూడ శేషశైలమును చూచి వేంకటేశ్వరుని స్తుతించును. పై అక్షరగుణితక్రమపద్యము దిలీపుని వేంకటేశ్వరస్తుతియే. వేంకటభర్త వసించు కొండకు సాటియగు కొండ లేదని అన్నయ ప్రతిపాదనము.

"పిడికిటఁ బట్టి వంచెఁ బురభేది యొకానొక కొండ; మింటికిన్
గొడుగుగ నెత్తి దాల్చె యదుకుంజరుఁ డొండొక కొండ; వేల్మిడిన్
బుడమి నడంగఁ జేసె ఘటపుత్త్రుఁడు వేఱొక కొండ; నున్న యీ
వెడవెడ కొండ లీడగునె వేంకటభర్త వసించు కొండకున్." 64ప.5ఆ.

సుదక్షిణాపరిణయము కథాప్రధానమైనను, కథానుసారమైన వర్ణనలును కల[illegible] [illegible] పురవర్ణనము (63-83ప.1ఆ.) నగవర్ణనము (119-125ప.1ఆ;62-64ప.5ఆ.) [illegible]వర్ణనము (4[illegible]ప.2ఆ.) గర్భవతివర్ణనము (91-100ప.2ఆ.) కుమారోదయవర్ణనము (101-12[illegible]ప.2ఆ.) నాయకవర్ణనము (122-132ప.2ఆ.) రాజనీతివర్ణనము (1[illegible] [illegible]వర్ణనము (167-199ప.2ఆ.) ప్రయాణవర్ణనము (32,33ప.3ఆ.) [illegible] [illegible]49ప.3ఆ; 83-123ప.5ఆ.) వనకేళివర్ణనము (55-78ప.3ఆ.) [illegible] [illegible]3ఆ.) [illegible]వర్ణనము (93ప.3ఆ;131ప.4ఆ.) [illegible]

భైక్షపత్రపుటి కోపని జరద్వాచంయ
ములు బోనగావళ్లు మోసి మోసి
విసిఁగి యూడ్గిలఁ బడ మెడ ల్విఱుగ గ్రుద్ది
దిక్కు లేమికి నగుదురు రక్కసులు ని
జాశ్రమంబులఁ దిగు తుడు మాలకించి
దూరముగఁ గాలు గలవారు పాఱిపోవ." 185ప.4అం.

మొత్తము మీద భావనారాయణ విష్ణుపురాణము మూలవిధేయము.

**కందుకూరి రుద్రయ** : ఈతని కృతులు 1. నిరంకుశోపాఖ్యానము. కావ్యము 2.సుగ్రీవవిజయము. యక్షగానము. 3. జనార్దనాష్టకము. అష్టకము. ఇవి ముద్రితములు. నిస్సంశయములు. 4. సరసజనమనోరంజనము. కావ్యము. అముద్రితము. 5. బలవదరీశతకము. శతకము. అనుపలబ్ధము. కతిపయపద్యములు కలవు. 6.గువ్వలచెన్నా శతకము. శతకము. ముద్రితము.7. జనార్దనాష్టకస్తోత్రము. స్తోత్రము. అనుపలబ్ధము. ఒక్క పద్యము కలదు. ఇవి సంశయాస్పదములు. 8. స్మరదీపిక. సంస్కృతకామశాస్త్రము. అముద్రితము. రుద్రకవికృతమని కలదు. 9. రాష్ట్రౌఢమహాకావ్యము. సంస్కృతకావ్యము. ముద్రితము. "స్కందపురాన్వయేన కవినా రుద్రేణ సృష్టే" అని కలదు.[262]

కందుకూరి రుద్రయకు ఇబ్రహీం పాదుషా అనగా మల్కిభరాముడు రెంటచింతల అను గ్రామమును దానము చేసెను. శాసనకాలము 1558వ సంవత్సరము.[263] శృంగారజనార్దనాష్టకము రచనా కాలము 1560 ప్రాంతము. సుగ్రీవవిజయము రచనా కాలము 1565 ప్రాంతము కావచ్చును. సుగ్రీవవిజయము జనార్దనాంకితము. నిరంకుశోపాఖ్యానము శివాంకితము. రెండును దైవాంకితములే. నిరంకుశోపాఖ్యానము నందు,

"చేరి కన్నడభూమి చెఱపట్టు పాశ్చాత్య
నృపతికైన నొకింత కృప దలిర్ప".

అని కలదు. ఇది 1564-65 నాటి రక్కసితంగడి యుద్ధప్రభావము. కాబట్టి నిరంకుశోపాఖ్యానము రచనాకాలము 1570 ప్రాంతము కావలయును.

జనార్దనాష్టకము కందుకూరిలోని జనార్దనస్వామిపై చెప్పిన అష్టకము. ఎనిమిది ములు కలవు.[264] ప్రతిపద్యము శృంగారరసప్రవణము. పరమసుకుమార

శైలీసుందరము. "కందుకూరిజనార్దనా" అను మకుటము కలదు. తొలి పద్యమిది.:

"సిరులు మించిన పసిమి బంగరు జిలుగు దుప్పటి జారఁగా
చరణపద్మము మీద దేహము చంద్రకాంతులు చేరఁగా
మురువు చూపఁగ వచ్చినావో మోహనాకృతి మీరఁగా
గరుడవాహన దనుజమర్దన కందుకూరి జనార్దనా."

సుగ్రీవవిజయము యక్షగానము. ఇందు "సుగ్రీవవిజయం బను యక్షగానంబునకుం గథాక్రమం బెట్టిదనిన" అని (6వచ.) యక్షగానశబ్దము ప్రయుక్తము. యక్షగాన మొక ప్రక్రియాభేదము. యక్షగానశబ్దము ప్రథమతః శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు ప్రయుక్తము.

"కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగానసరణి" 65ప.3ఆ.

తాళ్లపాక అన్నమాచార్యుల "సంకీర్తనలక్షణము"నకు తెనుగు సేత అయిన. తాళ్లపాక చిన తిరుమలాచార్యులు "సంకీర్తనలక్షణము" నందు యక్షగానము పదకవితాప్రభేదము.

"యక్షగానపదంబులు నవ్విధమున
సముచితానేకవిధతాళసంగతులను
నవరసాలంక్రియాసవర్ణంబు లగుచు
నలరునని హరికీర్తనాచార్యుఁ డనియె." 66ప.

యక్షగానశబ్దము " జక్కులపాట" కు సంస్కృతీకరణము కావచ్చును. అథవా. యక్షగానశబ్దమునకు "జక్కులపాట" వికృతి కావచ్చును. యక్షులు ప్రకృతి. జక్కులు వికృతి. వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు జక్కుల పురంధ్రి పాడిన విధానము కలదు. అది వలపు పాట.

"కోణాగ్రసంఘర్షఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలుకొల్పిన కన్ను
కొడుపుచేఁ దాఁటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
జెవి బ్రాడు బిగియించు జీవగఱ్ఱ

గిల్లుగిల్లున మ్రోయు కింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగమున నుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కుల పురంధ్రి. 135ప.

వెల్లంకి తాతంభట్టు కవిచింతామణి అను లక్షణగ్రంథమునందు.

"లక్ష్మీకల్యాణములోని రేకులు-
నీరజోదరు రాణి నీలవేణికిని" 81ప.1అధి.

అని ఉదాహరింపబడినది. "రేకులు" యక్షగానములలోనివి. కావున లక్ష్మీక ల్యాణము యక్షగానము కావలయును. కవిచింతామణి రచనాకాలము 1500 ప్రాంతము.
265 కనుక లక్ష్మీకల్యాణము రచనాకాలము 1500 వ సంవత్సరము కంటె పూర్వము. కనీసము 1475 ప్రాంతము కావచ్చును. చరిత్రకు అందినంతవఱకు అజ్ఞాతకర్తృకమైన, అనుపలబ్ధమైన లక్ష్మీకల్యాణమే ప్రప్రథమయక్షగానము.

హరిభట్టు నారసింహపురాణమునకు (ఉత్తరభాగము) ఆతని కుమారుడు రాఘవమనీషి రచించిన అవతారికయందు, కృతిభర్త ప్రోలుగంటి రంగనకు పినతండ్రి అగు ప్రోలుగంటి చెన్నశౌరి నారసింహపురాణము, బాలభారతముతోపాటు,

"సౌభరిచరితంబు జక్కులకథ చెప్పె
లాలితనవరసాలంకృతముగ"

అని కలదు. జక్కుల కథ జక్కుల పాట కావచ్చును. "నవరసాలంకృతముగ" అను నిర్దేశము, సంకీర్తనలక్షణములోని యక్షగానపదలక్షణమునందలి "నవర సాలంక్రియా సవర్ణంబులగుచు" అను:నిర్దేశమునకు సంవదించునది. ప్రోలుగంటి రంగన హావళి చిన ఓబళరాజు మంత్రి అని, హావళి చిన ఓబళరాజు శాసనములు 1547, 1548 సం త్సరములందు కలవని, హరిభట్టు నారసింహపురాణము కృతిసమర్పణకాలము ంతమని పూర్వోక్తము. కావున రంగన పినతండ్రి చెన్నశౌరి సౌభరిచరితము 25 ప్రాంతము కావచ్చును. సౌభరిచరితము కూడ అనుపలబ్ధము. తీయయక్షగానమగును. అనుపలబ్ధము. ఉపలబ్ధమైన యక్ష ద్రయ యక్షగానమే ప్రప్రథమయక్షగానము.

సీతాన్వేషణమున రామలక్ష్మణులు ఋష్యమూకపర్వతము సమీపించుట మొదలు, వాలి తోడి యుద్ధమునందు జయము నంది, కిష్కింధకు ఏతెంచుట వఱకు గల రామాయణకథ సుగ్రీవవిజయములోని ఇతివృత్తము ఇది పాటగానే కలదు. శ్రీకారము మొదలు పెట్టినవఱి వఱకు పాడవచ్చును. "నా యెనర్పంబూనిన" అనునది మాత్రమే అనన్వితము. అది బహుశః "తా నొనర్పంబూనిన" అగును. సుగ్రీవవిజయమునందు పద్యములు వచనములు, అర్ధచంద్రికలు, త్రిపుటలు, ద్విపదలు, జంపెలు, కుఱుచజంపె, అటతాళములు, ఏకతాళము, ధవళము, ఏల, మంగళము కలవు. త్రిపుటలు తొమ్మిది కలవు. త్రిపుటలోని రెండు పాదముల సంపుటి ఆధునికమను ముత్యాలసరమునకు ఆద్యప్రకృతి వలె కలదు.

"అయ్య! మీరలు రాజసుతులో
యతులో తెలియఁగరాదు సందియ
మయ్యె ముని వేషములు నృపచి
హ్నములు గలుగన్"

ఇందు "కలుగన్" తర్వాత నాలుగు మాత్రలు కలవేని సరిగా ముత్యాలసరమే అగును.

నిరంకుశోపాఖ్యానము కావ్యము. ధర్మశీలు డను రాజు, తన కొలువునకు వచ్చిన పులహుడను మౌనిని,

"వ్యసనములలోనఁ బ్రథమ
వ్యసనము సంభోగకాంక్ష యది దోషములీ
మనమునఁగ నెందు నందుం
బ్రసరించినవాఁడు పాపబాహ్యుఁడు కలడే?" 36ప.1ఆ.

అని ప్రశ్నించిన, "దీని కొక్క యితిహాసంబు కలదు. వినుమని" పులహుడు చెప్పిన నిరంకుశుని వృత్తాంతము నిరంకుశోపాఖ్యానము. ఇది ఏ మహేతిహాసము లోని ఉపాఖ్యానము కాదు. కందుకూరి రుద్రయ స్వతంత్రకల్పనమే అగును.

నిరంకుశుడు గుణనిధికి, సుకుమారునికి, నిగమశర్మకు
కాదు. అంతకంటె ఘనుడు. వేశ్యమాత వెళ్లగొట్టిన
పాడుగుడిలో శివలింగముతో జూదమాడును. ఓడినవాడు
ఒసగ వలయునని పందెము. ఇద్దఱి ఆట నిరం...

**తాళ్లపాక తిరువేంగళనాథుడు** : ఈతని కృతి అమరుకశతకము. ఆంధ్రీకరణము. ఇతడు తాళ్లపాక చిన్నన్న తమ్ముడు వేంకటేశదీక్షితుని సుతుడు. తాళ్లపాక చిన్నన్న కాలము స్థూలముగ 1495-1565 అని పూర్వోక్తము. అతని తమ్ముడు వేంకటేశదీక్షితుని కాలము స్థూలముగ 1500-1570 అగును. ఇతని సుతుడు తిరువేంగళనాథుని కాలము స్థూలముగ 1530-1600 అగును. కనుక అమరుకశతక రచనాకాలము స్థూలముగ 1570 ప్రాంతమగును.

అమరుకశతకము సంస్కృతవాఙ్మయమునందు సుప్రసిద్ధము. సంస్కృతశతకములందు శైలీప్రౌఢిమకు మయూరుని సూర్యశతకము, అర్థగాంభీర్యమునకు అమరుకుని అమరుకశతకము ప్రథమగణ్యములు. అమరుకశతకమునకు పెద కోమటి వేమారెడ్డి రచించిన శృంగారదీపిక అను టీక కూడ ప్రసిద్ధమే. తిరువేంగళనాథుని ఆంధ్రీకృతి అంత ప్రసిద్ధము కాదు. ముద్రితమును కాదు. శ్లోకభావము ముందు వచనమునందు వ్రాసి తర్వాత పద్యము రచించెను. శ్లోకగద్యపద్యము లివి: 266

"ఆలోలామలకావళిం విలులితాం బిభ్రచ్చలత్కుండలం
కించిన్మృష్టవిశేషకం తనుతరై స్స్వేదాంభసాం జాలకైః
తన్వ్యా యత్సురతాంతతాంతనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ కిం హరిహరబ్రహ్మాదిభి ర్దైవతైః."

వ. శృంగారరసప్రధాన మమరుకకావ్యము. శృంగారము -సంభోగము, విప్రలంభము నని రెండు విధములు. అందులో సంభోగశృంగారము మొదలుగా నుద్యోగించి, శృంగారరసానకు ఆలంబనవిభావమైన నాయికా స్వరూపమునే దేవతగా భావించి తృతీయపురుషార్థమును గూర్చి ఆశీర్వదిస్తున్నాడు.

"చెదరి చలించు ముంగురులు, స్వేదకణంబుల నింత జాఱు బొ
ట్టొదవు రతాంతకాంతిమెయి నొయ్యన సోలెడు కన్నుఁదామరల్
కదిలెడు కుండలంబులును గల్గిన పౌరుషభాసమాననయో
ముదితముఖారవింద మతిమోదము మీకు నొసంగుఁ గావుతన్."

**శంకరకవి** : ఈతని కృతి హరిశ్చంద్రోపాఖ్యానము పద్యకావ్యము. ఈడూరి ఎల్లమంత్రికి అంకితము. అతని స్థానము "కార్కోలనుగోదావర్యుపాంతంబునన్" అని కలదు. (52ప.1ఆ.) అది కార్కోలను కాదు; కోర్కోలను. గ్రంథాంతమునందు సరిగా కలదు.

"అలఘుప్రతాపకుతుబన
మలకేంద్రకృపాసమగ్రమహిమాన్వితకో
ర్కొలనిగ్రామనికేతన
జలసీమారక్షణైకచాతుర్యనిధీ." 243ప.5ఆ.

గోదావర్యుపాంతమునందలి కోర్కొలను. పశ్చిమగోదావరీమండలములోని ఇప్పటి కోరుకొల్లు. జలసీమ కొల్లేటి సరస్సు ప్రాంతము. అది పశ్చిమగోదావరీమండలములోనిదే. కుతుబనమలక మహమ్మద్ కుతుబ్‌షా అని ఒక అభిప్రాయము కలదు.[267] కులీకుతుబ్‌షా అని మఱొక అభిప్రాయము కలదు.[268] కులీకుతుబ్‌షాకాలమునందు (1518-1543) గోల్కొండరాజ్యము బందరుపట్టణము వఱకు విస్తరించెను.[269] అది కృష్ణామండలము. ఉభయగోదావరీమండలములు ఇబ్రహీంకుతుబ్‌షాకాలమునందే (1550-1580) గోల్కొండరాజ్యమునందు చేరును. అది కూడ రక్షసితంగడి యుద్ధము (1564-65) తర్వాత. కాబట్టి హరిశ్చంద్రోపాఖ్యానము రచనాకాలము 1570 ప్రాంతము కావచ్చును.

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము ద్విపదకావ్యమునకు పద్యగద్యకావ్యరూపాంతరము. ద్విపదకావ్యమునకు సరళశైలి. పద్యగద్యకావ్యమునకు ప్రౌఢశైలి పరిపాటి. అది అందు. ఇది ఇందు కలదు. అతిప్రౌఢమైన పద్యము ప్రసిద్ధము.

"అకటా చేరెడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టితప
త్సకలద్వీపకలాపభూపముకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్ఘశిలిశిక్షత్కిరణకుంభత్పాదుఁడైనట్టి రా
జకుమారుండని యేడ్చెఁ గన్నుఁగవ నశ్రుల్ జాల్వాఱ పాఱఁగన్." 86ప.5ఆ.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములోని కాలకౌశికుని శిష్యుని వృత్తాంతము. కలహకంఠీకాలకౌశికకలహఘట్టము. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునందు లేవు. అది మోటుహాస్యమగుట వలన అనౌచిత్యపరిహారమే. వర్ణనములు శంకరకవి స్వతంత్రకల్పనములు. సర్వసాధారణములు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము కంటె పద్యగద్యగౌరవము కినా. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునందు ప్రత్యేకత పూజ్యము.

**పట్టమట్ట సోమనాథసోమయాజి** : ఈతని కృతులు సూతసంహిత.

బ్రహ్మోత్తరఖండము. రెండును పురాణములే. సూతసంహిత బిక్కనవోలు సంస్థానాధిపతి కామినేని కామారెడ్డికి. బ్రహ్మోత్తరఖండము అతని తమ్ముడు ఎల్లారెడ్డికి అంకితములు. ఎల్లారెడ్డి కృతిభర్త మాత్రమే కాదు; కృతికర్త కూడ. కృతులు అనుపలబ్ధములే కాదు; అవిజ్ఞాతములు. బ్రహ్మోత్తరఖండమునందు.

"కలరు బిక్కనవోలి శ్రీకామిరెడ్డి
భూమివిభు నాశ్రయించిన బుధులు నిజము
శాలివాహనశకవర్షసంఖ్య పదియు
నైదునూర్లైన వర్తమానాబ్దములను."

అని కలదు. "పదియునైదు" అనుచోట "వెలయునేడు" అని ముద్రితపాఠము. అర్థరహితము. శాలివాహనశకవర్షసంఖ్య పదియునైదునూర్లు 1500 + 78 = 1578. కనుక బ్రహ్మోత్తరఖండము రచనాకాలము 1578వ సంవత్సరము. సూతసంహితయందు సోమనాథుడు సోమయాజి అనిలేదు. సోమయాజి కాకపూర్వము రచించినది. కనుక సూతసంహితరచనాకాలము 1570 వ సంవత్సరము కావచ్చును.

కామిరెడ్డి లేదా కామారెడ్డి మఱొక తమ్ముడు మల్లారెడ్డి శివధర్మోత్తరము నందు।"మహమ్మదుపాదుషాహలబ్ధభూషణలలితపల్యంకికాతపత్రచామర సామ్రాజ్యభరితవిభవరమ్యగుణశాలి" అని కలదు. అతని రాజ్యకాలము 1580-1611. అతఃపూర్వము ఇబ్రహీంకుతుబ్‌షాకాలమునందును (1550-1580) కామారెడ్డి ఉండవచ్చును.[270]

**కామినేని మల్లారెడ్డి** : ఈతని కృతులు షట్చక్రవర్తిచరిత్రము, శివధర్మోత్తరము, పద్మపురాణము. శివధర్మోత్తరము, పద్మపురాణము రెండును పురాణములే. షట్చక్ర వర్తిచరిత్రము కావ్యము. కామినేని మల్లారెడ్డి, ఇబ్రహీంకుతుబ్‌షా, మహమ్మద్‌కుతుబ్‌షాల కాలములోని (1550-1611) కామినేని ఎల్లారెడ్డి తమ్ముడు కావున, ఇతని కాలము కూడ ఇంచుమించు అదే అగును. షట్చక్రవర్తిచరిత్రము రచనాకాలము 1575ప్రాంతము. శివధర్మోత్తరము రచనాకాలము 1580 ప్రాంతము. పద్మపురాణము రచనాకాలము 1585 ప్రాంతము కావచ్చును.

హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యుడు అను రాజులు షట్చక్రవర్తులు. వారి చరిత్రములు షట్చక్రవర్తిచరిత్రము.

**కొటికలపూడి సోమనాథుడు** : ఈతని కృతి విష్ణుమిత్రోపాఖ్యానము.

"ప్రబంధకల్పవల్లరి". అను పత్రికయందు ప్రకటితము. అది దుర్లభము. ఆంధ్రకవి తరంగిణిలోని సమాచారమే ఆధారము.

విష్ణుమిత్రోపాఖ్యానము గుంటుపల్లి తిప్పమంత్రికి అంకితము. తిప్పమంత్రి అన్నకొడుకు గుంటుపల్లి ముత్తమంత్రి. ప్రసిద్ధుడు. వదాన్యుడు. అతని గుఱించి అనేకచాటుపద్యములు కలవు. అతని దత్తత తండ్రి రామలింగభాస్కరుడు. పినతండ్రి గుంటుపల్లి తిప్పమంత్రి సమకాలికులు. రామలింగభాస్కరుడు వినుకొండ పరగణా పాలకుడు. గోల్కొండసుల్తాను ఇబ్రహీం కుతుబ్‌షా సామంతుడు ఇబ్రహీంకుతుబ్‌షా రాజ్యకాలము[271] 1550-1580. వినుకొండ పరగణా గోల్కొండరాజ్యమునందు విలీనమగు కాలము తాళికోటయుద్ధము (1564-65) తర్వాతనే సంభవము. రామలింగ భాస్కరుడు వినుకొండపరగణాపాలకుడగు కాలము 1566-1580. తిప్పమంత్రి ప్రాభవ కాలమును అదే. కాబట్టి విష్ణుమిత్రోపాఖ్యానము రచనాకాలము 1575 ప్రాంతము కావచ్చును. విష్ణుమిత్రోపాఖ్యానములోని అంకితవిషయమిది:

"సరసాగ్రేసర! కోటనార్యునితనూజా! సోమ! విద్వత్పురం
దర! నీ చాటువచోవిజృంభణము లుద్ఘాటించు నర్ధేందుశే
ఖరకోటీరకుటీరకోటరలురద్గంగోర్మిధారాశివం
కరఘుంఘుంఘుమచక్రచంక్రమచమత్కారప్రగల్భార్భటిన్.
కొటికెలపూఁడి సోమవిభు కోటయసోమ! సరస్వతీశిరః
కటకకిరీటరత్నఘటికామహనీయధగద్ధగప్రభా
పటలతిరస్క్రియాధిగతపాటవము ల్భవదీయవాక్యముల్
కుటిలవిరోధియోధకవిలోకకఠోరవసీకుఠారముల్.
కావున నీవిత్తెఱఁగునఁ
గావింప నుపక్రమించు కావ్యము నాకున్
గావింపు మంకితముగాఁ
బ్రావీణ్యము మెఱసి కవిసుపర్వవరేణ్యా"

విద్వత్పురందరుని. చమత్కారప్రాగల్భ్యము. వాక్యపాటవము. ప్రావీణ్యము మెఱసిన విష్ణుమిత్రోపాఖ్యానము విద్యుల్లతాధమగుట విచారకరము.

సోమనాథుడు పూర్వకవిస్తుతిలో కవిత్రయమును. నాచన సోమనాథుని మాత్రమే స్మరించెను. ఈతని తండ్రి కోటసచివుడు "ప్రతిభటవిద్వత్కవిసంహాతికరటి ఘటామృగేంద్ర"డు. ఇది "కింకవీంద్రఘటాపంచానన" బిరుదమునకు ఒరవడి.

విష్ణుమిత్రోపాఖ్యానము మహాప్రౌఢకావ్యము. ఇతివృత్తము పురాణగాథ(?). ఆశ్వాసము లయిదు. కథాభంగమునకు ప్రాధాన్యము. సందర్భోచితవర్ణనములు కలవు. శైలి శ్రీనాథుని శైలిని తలపించునది.

"ధరణీశాగ్రణి తారకాతరళముక్తారత్న చిత్రాతప
త్రరుచివ్రాతము దిగ్దరీవలదసూర్యంపశ్యగాఢాంధసు
స్మరమై సర్వశశాంకమండలసహస్రశ్రీసముల్లాసత
స్కరమై పర్వఁ గ నొప్పె సర్వజనదృగ్వ్యాపారపర్వంబుగన్. 1అ.
సమరట్టఘోట్టాణసంఘట్టితక్రోడ
ఖురపుటీపక్షసంక్షుభితమగుచు
పృథివీధరస్పర్ధిపృథురథప్రథితప్ర
దారాభిఘాతమేదస్వి యగుచు
పటుతరోద్భటవీరభటచక్రవాళని
ష్ఠురపదాస్ఫోటనస్ఫురితమగుచు
గాఢకంధరసద్వృక్షస్కంధగంధసిం
ధురకర్ణతాళవర్తులితమగుచుఁ
దరుణదాశరకంఠకందళకడార
మేదురాకారరణరంగమేదినీప
రాగనికురుంబకం బంబరమున కెగసి
యర్కుఁ గబళించె రాహుగ్రహంబుఁ బోలె. 2అ.
చందనశైలవాతకులిశక్షతిచే నతిచిత్రచైత్రసం
క్రందనుఁ డల్కమై నగ నగచ్ఛదగుచ్ఛము లుత్తరింప నం
దంద సముద్భవిల్లురుధిరావలిఁ బోలె వనంబులందు నా
నందము సంఘటించె నయనంబులకున్ దరుణప్రవాళముల్. 3అ.
చటులాస్ఫోటతరాట్టహాసలహరీఝుంపానిరాఘాటప
ర్యటనాడంబరభిన్నదిక్తటకటాహక్రోడవాటంబుగా
నటనక్రీడ యొనర్చు కాలగళు కంఠస్థూలకాకోలరు
ఘ్ఘుటికాజాలము బర్వినట్లు నిగిడెన్ ఘోరాంధకారచ్ఛటల్ 4అ.
తన మది విష్ణుగుప్తుఁ డు పదంపడి యచ్చెరువంద నందివా
హన. సరసీరుహాసన. బలాసురశాసన. పావకేననం
దన. దనుజాబ్ధినాయక. సదాగతి. వైశ్రవణాదిదేవతా

జనసహితంబుగా నసురశత్రుఁ డదృశ్యత నొందె నంతటన్. 5ఆ.

ఇంత సంస్కృతభూయిష్ఠరచన పరిఢవిల్లినను, ఎడనెడ అచ్చతెనుగు కూడ ముచ్చట లాడినది.

" జిగి మీఱు నడుగులేఁ జిగురు నిబ్బరపు డా
లెఱసంజకెంజాయ కెదురు సూప
క్రొక్కారు మెఱుఁ గునిగ్గులకుసిగ్గులుగుల్క
మెయితళుకులపరంజిమిసిమిఁ జిల్క
నవయవంబుల తావు లచ్చంపుఁ బచ్చక
ప్పురపు వాసనలకు బిరుదు గట్ట
సొలపు టల్లార్చు చూపుల దువాళములు చూ
పుల వింటిజోదు తూపుల నదల్ప
వివిధభూషణభూషణభవదగణ్య
పుణ్యలావణ్యరూపనైపుణ్య లగుచుఁ
గౌశికద్వారవేదికాంగణములందు
నిర్జరాంగన లేతెంచి నిలచిరపుడు."

ఇది నాచనసోమనాథుని వచనరచనావైఖరిని గుర్తునకు తెచ్చునది. ఇంత ప్రౌఢమైన కావ్యము ప్రకటితమైన "ప్రబంధకల్పవల్లరి" అను పత్రిక ప్రసిద్ధగ్రంథాలయములందు మృగ్యము. ఆ ప్రబంధకల్పవల్లరి అను పత్రికయందే కొటికలపూడి సోమనాథుని మఱొక కృతి కూడ ప్రకటితమైనదట. ఆ కృతి పేరైనను తెలియని స్థితి.

ప్రబంధవల్లరి అను పత్రిక గాని, తదాధారమైన తాళపత్రగ్రంథములు గాని లభించిన కొటికలపూడి సోమనాథుని కృతుల సమీక్ష సమగ్రమగును.

**అద్దంగి గంగాధరకవి** : ఈతని కృతి తపతీసంవరణము లేక తపతీసంవరణోపాఖ్యానము.గోల్కొండసుల్తాను-మల్కిభరాముడని ప్రసిద్ధి గాంచిన -ఇబ్రహీంకుతుబ్‌షాకు అంకితము. అతడు 1564-65 నాటి రక్కసి తంగడి యుద్ధమునందు మిత్రద్రోహమునకు పాల్పడి, అళియరామరాయలను చంపి, విజయనగరమును విధ్వంసము చేయించిన వ్యక్తి. ఇది తపతీసంవరణోపాఖ్యానములోని "సత్కృపారామ యక్షయప్రభవా! రాయపక్షిసాళువా!" అను సంబుద్ధిని (96ఉ.4ఆ.) కలదు. రాయలన అళియరామరాయలే. ఇంకను "హిందూరాయవిభాళ!" (103ప.2ఆ.) "తెలుంగుదళ

యనఁగ నెమ్మోగ మడఁచినఁ గనుఁగొనంగ
రాని దట్టంపుఁ జీఁకటి రాసి గవియ
నిరులు సరియయ్యె. వలతేని మరులు దలరెఁ
దమక మటు హెచ్చెఁ గడు జారదంపతులకు." 73ప.3.

తపతిని అరుంధతీవసిష్ఠులకు అప్పగించునెడ. సూర్యుడు"అంతర్గతబాష్పాకుల నేత్రయుగళుండై యిట్లనియె"నట.

" ఉన్నూరు విడిచి పడఁతుకఁ
గొన్నూరికి నియ్యలేక పొగిలెడిచో. నే
డన్నరలోకంబెక్కడి
నున్నతసురలోక మేడ యురవందుటకున్. 24.
బాలమిక్కిలిగోల; యీ పాల పాప
చెక్కు మీటిన పసవల్కు సెలవు లందుఁ :
గన్నియకుఁ జూడ నొవ్వక కనిన యట్టి
తల్లిదండ్రులు నుం దరుంధతియు మీరు." 25ప.5ఆ

ఇది శోకజనకము కంటె హాసజనకము. గంగాధరకవి "వాక్యపదగుంభనముల్"

" గంగాధరమౌళినట
ద్గంగాతటినీతరంగసంభీరంబుల్" 16ప.1ఆ

అయినను కాకపోయినను "భారతాఖ్యానమందు। గలుగు తాపత్యచరితంబు। వివిధశృంగారమహిమల విస్తరించి"నదియే (19ప.1ఆ.)

**పొన్నికంటి తెలగన్న** : ఈతని కృతి యయాతిచరిత్రము. అచ్చతెనుగు కావ్యము. మల్కిభరాముడని ప్రసిద్ధి గాంచిన గోల్కొండ సుల్తాను ఇబ్రహీంకుతుబ్‌షా ఉద్యోగి అమీర్‌ఖానుకు అంకితము. అమీరుఖాను రెండవ కుమారుడు ఫాజిల్‌ఖాను. శ్రీరంగరాయలను రాయబారమునకు తెచ్చిన చరిత్రాంశము యయాతిచరిత్రమునందు కలదు. (51ప.1ఆ.) అది 1576 నాటి చారిత్రికసంఘటన.[272] శ్రీరంగరాయల రాజ్యకాలము 1572-1585. కావున యయాతిచరిత్రము రచనాకాలము 1580 ప్రాంతము కావచ్చును.

ఇది మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యము. అచ్చతెనుగన సంస్కృతసమేతరమైన

ఆంధ్రభాష. ప్రాకృతసమములు. సంస్కృతప్రాకృతభవములు. దేశ్యములు. అన్యదేశ్యములును అచ్చతెనుగులే. కావ్యము మొత్తము మీద ఒకటి రెండు అచ్చతెనుగు పద్యములుండుట అపూర్వము కాదుగాని. కావ్యమంతట అచ్చతెనుగు పద్యములే ఉండుట అపూర్వమే. యయాతిచరిత్రమునందు శ్రీకారము మొదలు చిట్టచివఱివఱకు. ఆశ్వాసాద్యంతపద్యములు. షష్ఠ్యంతపద్యములు మొదలైన అన్ని పద్యములును అచ్చతెనుగు పద్యములే. కృత్యాది "సిరుల". ఆశ్వాసాది "సిరి". అభ్యుదయపరంపరాభివృద్ధి "సిరులుం గడు నమరు గొమరులుం గలిగి మనునట్లుగా" "కావ్యము" కబ్బము. ఆశ్వాసాంతగద్య అపవాదము. యయాతిచరిత్రము కృతిసమర్పణమునకు మధ్యవర్తి అయిన మఱింగంటి అప్పన నోట పొన్నికంటి తెలగన్న పలికించిన పద్యమిది.

"మున్నెవ్వరు నొడువని యీ
తెన్నిడి కడు మీఱి యచ్చతెనుఁ గుం గబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁ గలదె నెలతాల్పయినన్." 11ప.1ఆ.

తెలగన్న స్వయముగ తెలిపిన విషయమిది:

"తెనుఁగునను మాఱుపేళ్లిడి
పెనచిన విన. గూడదనుచు బిరుదులుం బేళ్లన్
మును వేల్పుబాస వెంబడి
ననిచెదఁ గాదనకుఁ డయ్య యుల్లము లందున్." 14ప.1ఆ.

అయినను మాఱుపేళ్లు అక్కడక్కడ కలవు.

చాతకపక్షులకు చిన్కుంగూటి పులుగులు. (79ప.1ఆ.) సింహాసనమునకు పచ్చసింగంపు గద్దె (98ప.1ఆ.) శివునికి బేసికంటిదొర (66ప.2ఆ.) నెలతాల్పుదేవర.(35ప.3ఆ.) సంభోగమునకు వలరాచపని (98ప.2ఆ.) వలరాచకలయిక (133ప.5ఆ.) విష్ణువునకు కఱిదేవర (108ప.2ఆ.) సీతకు నేలచూలి (20ప.3ఆ.) హనుమంతునికి గాలిబిడ్డఁడు (22ప.3ఆ.) ఉపనిషత్తులకు తొలిమినుకుల కడలు. (32ప.3ఆ.)వానరములకు కొమ్మ మెకములు (35ప.3ఆ.) అగ్నిపరీక్షకు సెకబాస. (38ప.3ఆ.)వాల్మీకికి కనువినుకలి నెలవు పుట్టువు (40పచ.3ఆ.) జలక్రీడకు నీరాట(73వచ.3ఆ.) ప్రాణస్నేహమునకు నెత్తురు పొత్తు (117ప.3ఆ.) సంజీవనీవిద్యకు బ్రదుకువిద్దె (144ప.3ఆ.)

పద్మరాగమునకు తమ్మికెంపు (124ప.4ఆ.)శిశిరోపచారములకు చలిపనులు (89వచ.5 ఆ.) చంద్రునికి సికవేల్పు (138ప.5ఆ.) మొదలైనవి.

యయాతిచరిత్రము మహాభారతములోనిది. అందు యయాతి దేవయానియందు యదుతుర్వసులను, శర్మిష్ఠయందు ద్రుహ్యవసుపూరువులను బడయువఱకు ఇందు కలదు. ఇంకను రామాయణసంగ్రహము కలదు. యయాతి వేట చాలించి జాబాలిని సందర్శించిన, అతఁడు యయాతికి వేట మంచిది కాదనుటకు రామాయణకథాసంగ్రహమును చెప్పెను. అది "కనువినుకలి నెలవు పుట్టుచే విరివిగాఁ జెప్పంబడి జగంబు లెఱింగిన దగుటంజేసి ... కొంచెముగాఁ జెప్పి"నది.(40వచ.3ఆ.) యయాతి కాలమునందు వాల్మీకి రామాయణము కలదా? కలదేని"జగంబు లెఱింగిన" వాల్మీకి రామాయణమును యయాతి ఎఱుఁగఁడా? అసలు వాల్మీకి రామాయణమునకు వేట మంచిది కాదనుట ప్రయోజనమా? అను ప్రశ్నలు ఆనాటి కవులకు పట్టవు. జాబిలి రామాయణకథను రామునితోఁగాక రావణునితో మొదలు పెట్టెను. అది శ్రీనాథుడు హరవిలాసమునందు కుమారసంభవకథను శివునితోను, పార్వతితోను గాక తారకాసురునితో మొదలు పెట్టుట వంటిది కాదు. ఆ ప్రారంభము హరవిలాసకావ్యానుగుణము. ఈ ప్రారంభము యయాతిచరిత్రకావ్యానుగుణము కాదు. రంభారావణుల వలరాచపనికి మాత్రమే ఉపయోగము. రామావతారమునకు కారణమని జాబిలి కథనము. కవివర్ణనము. (88-120ప.3ఆ.) యయాతిచరిత్రము యయాతితో ప్రారంభమగుట వలన, కచదేవయాని వృత్తాంతము శుక్రుడు వృషపర్వునికి చెప్పుట (106-160ప.3ఆ.) దేవయానీశర్మిష్ఠల వృత్తాంతము ఘూర్ణిక యయాతికి చెప్పుట (51-100ప.3ఆ.) యయాతిచరిత్రకావ్యానుగుణమేకాని; అందు అనౌచిత్యము కలదు.

"అక్కురు లా మొగంబుచెలు వా కనుదమ్ముల సోయగంబు నా
యక్కును జేతు లా నడుము నా పిఱుఁ దా తొడ లా యొయారపుం
బిక్కలు మెట్టుఁ దమ్ములును బ్రేముడి నా మదిఁ బాయకుండఁ గా
నక్కచు నెట్లుగా మఱతు నాఱడి దయ్యమ! యింత చేసితే" 127ప.3ఆ.

అని దేవయాని శుక్రునితో చెప్పుట. ఇది శుక్రుడు వృషపర్వునికి చెప్పుట. అది ఘూర్ణిక యయాతికి చెప్పుట అనౌచిత్యపరంపర.

"అతిలోకోత్తరుఁడైన యాంగిరసు మన్మండు-" అను నన్నయ పద్యమునకు అనుకరణము. ద్విరుక్తము. (132,133ప.3ఆ.)యయాతిదేవయానుల వృత్తాంతము ఒక ఆశ్వాసము. యయాతిశర్మిష్ఠల వృత్తాంతము ఒక ఆశ్వాసము. రెండును ఏకాశ్వాసశ్యం

గారప్రబంధసదృశములు.

అచ్చతెనుగు కావ్యమైనను వర్ణనలకు కొదువ లేదు పురవర్ణనము (75-89ప.1ఆ.) నాయకవర్ణనము (91-100ప.1ఆ.) వేటవర్ణనము (102-117ప.1ఆ;3-33ప.2ఆ.)నగవర్ణనము (35-41ప.2ఆ.) నదీవర్ణనము (42-46ప.2ఆ.) ఆశ్రమవర్ణనము(48-51ప.2ఆ.) సూర్యాస్తమయవర్ణనము (68-70ప.2ఆ.) నక్షత్రవర్ణనము(72ప.2ఆ.) అంధకారవర్ణనము (73-78ప.2ఆ.) చంద్రోదయవర్ణనము(79-80ప.2ఆ.) చంద్రికావర్ణనము (81-82ప.2ఆ; 109ప.5ఆ.) వనకేళివర్ణనము(54-57ప.3ఆ;14-31,46-59ప.5ఆ.) జలకేళివర్ణనము (59-72 ప.3ఆ.)వసంతర్తువర్ణనము (3-13ప.4ఆ.) నాయికావర్ణనము (33-53ప.4ఆ.)వివాహవర్ణనము (84-150ప.4ఆ.) పురప్రవేశవర్ణనము (151-161ప.4 ఆ.)సమాగమవర్ణనము (3-30;128-132;146-15౦ప.5ఆ.)కుమారోదయవర్ణనము(39,153ప.5ఆ.)నాయికా విరహవర్ణనము (70-77,118ప.5ఆ.)మన్మథోపాలంభనవర్ణనము (78-81ప.5ఆ.) శిశిరోపచార వర్ణనము(86-88,98-104,113-115ప.5ఆ.) నాయకవిరహవర్ణనము (90-95, 121-126ప.5 ఆ.) కలవు.

పొన్నికంటి తెలగన్న యయాతిచరిత్రము అచ్చతెనుగు కావ్యములకు ఆదర్శప్రాయమేగాక అగ్రేసరమైనది. ఒజ్జబంతియేగాక మేలుబంతి. సంస్కృతసమము రెండవశతాబ్దినే తెలుగు భాషయందు తేజరిల్లి, పదునాఱవ శతాబ్దికి తెలుగు పదమై పోయినను, తెలగన్న వెలివేయుటకు హేతువు, పారుష్యము లేని పాదుషాల భాష కావచ్చును. పరభాష వలన స్వభాషాభిమానమును కావచ్చును. అదొక వేడబము.

**రాయసము వేంకటపతి** :ఈతని కృతి లక్ష్మీవిలాసము. వేంకటేశ్వరాంకితము. ద్వైవాంకితము. అతని స్వప్న వృత్తాంతమునందు ఇట్లు కలదు.

> "అతిఘుప్రాభవగర్వభాక్కుతుపశాహామేయసైన్యంబున
> గ్గలికం బంపులచేతఁ గెల్చి బిరుదున్ గైకొన్న శ్రీరంగరా
> యల చిత్తం బిగురింప రాయసము వ్రాయంజాలితౌ నౌ సుధీ
> తిలకుండక్కయమంత్రివేంకటపతీదీవ్యత్కళావాక్పతీ.19ప.1ఆ.

ఇందు శ్రీరంగరాయలు కుతుబ్‌షాను జయించినట్లుకలదు. అతడు మొదటి శ్రీరంగరాయలు. రాజ్యకాలము 1572-85 అని పూర్వోక్తము. అప్పటి కుతుబ్‌షా ఇబ్రహీంకుతుబ్‌షా. (1550-1580.) అతనిని శ్రీరంగరాయలు జయించిన కాలము 1579 వ సంవత్సరము [273] కావున లక్ష్మీవిలాసము రచనాకాలము 1580 వ సంవత్సరము

కావలయును.

లక్ష్మీవిలాసము "రసవత్ప్రబంధంబు" అని కవి అభిప్రాయము. (36వచ.1ఆ.) "భార తమునం దాదిపర్వంబున .... మునుపటి సంకోచముగఁ బల్కితిరి .... విబుధు లేరీతి మందరంబున నంబుధిఁ ద్రచ్చి రందు శ్రీమధురవాణి జనన మేరీతి నడచె. నప్పుడు హరియెట్లు పరిణయంబయ్యె నదియు నానతీవలె" నని జనమేజయుడు అడుగ. వైశంపాయనుడు వివరించిన లక్ష్మీనారాయణపరిణయవృత్తాంతము లక్ష్మీవిలాసము. (38ప.1ఆ.)

"ప్రతిపద్యశిరఃకంపము
ప్రతిపదచిత్రార్థగోచరము ప్రతివాక్య
స్థితరసబంధురమై స
న్నుతిఁ గాంచెఁ బ్రబంధ మీ వొనర్చుము హరికిన్." 20ప.1ఆ.

అని పెద్దలు ఆదేశించినట్లు. శిరఃకంపము కలిగించు పద్యములు. చిత్రార్థగోచరములైన పదములు. రసబంధురమైన వాక్యములు లక్ష్మీవిలాసమునందు కలవు. పద్యరచనమునందు. కథానిర్వహణమునందు వసుచరిత్రప్రభావము సమధికము. సముద్రమథనకథానంతరము. సముద్రుడు వచ్చి "శ్రీవనితన్ మదీయగృహమున్ శోభిల్లఁ గల్యాణసంగతిచేఁ గైకొని నా మనోరథము సాకల్యంబుగాఁ గూర్పవే" అని కోరిన. విష్ణువు లక్ష్మిని పంపించును. ఫలితముగ లక్ష్మీనారాయణులు విరహమునకు గురి అగుదురు. వసుచరిత్రమునందు మంజువాణి రాయబారము వలె. లక్ష్మీవిలాసమునందు లక్ష్మి నెచ్చెలి రాయబారము కలదు. పర్యవసానము కల్యాణము.

లక్ష్మీవిలాసమునందు వర్ణనలు బహుళము. జగన్మోహినీవర్ణనము(40-53ప.2ఆ.) యుద్ధవర్ణనము (78-112ప.2ఆ.) పురవర్ణనము (40-62ప.3ఆ.)పురంధ్రీవర్ణనము (65-70 ప.3ఆ.) నాయకవిరహవర్ణనము (97-103ప.3ఆ.)వసంతర్తువర్ణనము (104-115ప. 3ఆ.) నాయకవిరహవర్ణనము (116-140ప.3ఆ.)వనకేళివర్ణనము (6-16ప.4ఆ.) జలకేళివర్ణనము (17-26ప.4ఆ.) శీతలోపచారవర్ణనము (23-30ప.4ఆ.)సుసూర్యాస్తమయాదిచంద్రోదయ, పర్యంతప్రకృతివర్ణనము (32-57వచ.4ఆ.)చంద్రోపాలంభవర్ణనము (63-66ప.4ఆ.) మన్మథోపాలంభవర్ణనము(68-74ప.4ఆ.) శుకపికమధుకరోపాలంభవర్ణనము (76-85 ప.4ఆ.)దూత్యవర్ణనము (88-116ప.4ఆ;3-21ప.5ఆ.) చంద్రాస్తమయాదిసూర్యోదయ పర్యంతప్రకృతివర్ణనము (118-127ప.4ఆ.)వివాహవర్ణనము (22-114ప.5ఆ.) రతి వర్ణనము (115-124ప.5ఆ.) మొదలైనవి మూసకట్టులు. జగన్మోహినీవర్ణనమునందు

సందర్భోచితమైన సాదృశ్యముల కల్పనము ముగ్ధమోహనము.

"హాలాహలశ్రీల నలరు వాలక(ము?)మును
బర్వేందుకాంతిచేఁ బరగు మోము
కౌస్తుభమణి మిన్న గల పలువరుసయుఁ
గామధేనువు తెల్వి గలుగు చూపు
చింతామణిస్ఫూర్తి జిగి మించు నెమ్మోవి
కల్పశాఖల మేలు గాంచు బాహు
లమృతకుంభవిభూతి నలరు పాలిండ్లు
నైరావతంబు శిరంబు లీవిఁ బిఱుదు
కాంతనిర్జరయువతిసీమంతభాగ
భద్రసిందూరరుచి నించు పదము లలర
వార్ధి నొదవిన వస్తుభావంబులెల్ల
దంభనారాయణి తనందె తనరఁ జేసె." 40వచ.2ఆ.

బహుళార్థద్యోతకపద్యములు (7,10ప.1ఆ;26ప.4ఆ.)గుచ్ఛబంధ. గోమూత్రికాబంధ.చక్రవాళబంధపద్యములు (46-48ప.1ఆ.)ద్విపదగర్భితసీసపద్యము (74ప.3ఆ.) లక్ష్మీవిలాసమునందు కలవు.

కవికి సంగీతసాహిత్యకళాధౌరంధర్య అను విశేషణము కలదుగాని. లక్ష్మీవిలాసమునందు సంగీతకళాధౌరంధర్యము మృగ్యము.

**చెదలువాడ మల్లన** : ఇతడు ఎఱ్ఱాప్రెగడ వంశీయుడు. "ఎఱ్ఱాప్రెగడ మనుమఁడవు" అని కృతిపతి సంబుద్ధి (21ప.1ఆ.) కలదుగాని; పౌత్రుడు. ప్రపౌత్రుడు కాడు. వంశీయుడు మాత్రమే. ఈతని కృతులు రుక్మాంగదచరిత్రము. ద్విపదకావ్యము; (21ప.1ఆ.) విప్రనారాయణచరిత్రము పద్యకావ్యము. మొదటిది అనుపలబ్ధము. విప్ర నారాయణ చరిత్రము మాకరాజు కుమారుడైన తిమ్మరాజునకు అంకితము. తిమ్మ రాజు కుమారుని రాజ్యకాలమునందు కార్వేటి నగరసంస్థానమునకు చెందిన నారాయణవనగ్రామములోని కల్యాణవేంకటేశ్వరస్వామి దేవాలయమునందు ఇతరుల శాసనములు రెండు కలవు.[274] శాసనకాలములు 1632,1633సంవత్సరములు. అది కుమారుని రాజ్యకాలమైన. తిమ్మరాజు ప్రాభవకాలము1592, 1593 ప్రాంతమగును. కావున విప్రనారాయణచరిత్రము రచనాకా లము1585ప్రాంతము కావలయును.

విప్రనారాయణచరిత్రము గురుపరంపరాప్రభావమునందు కలదు. తదనుసరణమైన తాళ్లపాక చిన్నన్న పరమయోగి విలాసమునందు ఒక ఆశ్వాసము. చతుర్థాశ్వాసము. ఎనిమిదివందల ఏబదియారు ద్విపదలు. అది పద్యగద్యకావ్యమైన సిద్ధరాజు తిమ్మరాజు పరమయోగివిలాసమునందు కలదు. చెదలువాడ మల్లన విప్ర నారాయణచరిత్రము ప్రప్రథమమైన ప్రత్యేకకావ్యము. తదుపరి కావ్యములు, యక్షగానములు, నాటకములు కలవు. విప్రనారాయణుడు పన్నిద్దరాళ్వారులలో ఒకడు. తొమ్మిదవ ఆళ్వార్. నవమయోగి. తొండరప్పొడియాళ్వార్. భక్తాంఘ్రిరేణువు. చెదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రము తదభ్యుచితము. మల్లన ఎఱ్ఱన వంశీయుడే కాడు;ఎఱ్ఱన శంభుదాసుడు వలె మల్లన శైవాచారుడు. (17ప.1ఆ.) శంభుదాసుని హరివంశనృసింహపురాణముల వలె శైవాచారుని విప్రనారాయణచరిత్రమును ఉదాత్త రసాన్వితము.

విప్రనారాయణుని జన్మస్థలము మండంగుడి. వాసస్థలము శ్రీరంగము. శ్రీరంగమే కథారంగము. కథ ప్రసిద్ధము. మొలక మీసము ప్రాయమునందే వైరాగ్యము చెంది, శ్రీరంగమునందు రంగశాయి కైంకర్యము సేయు విరక్తుడైన విప్రనారాయణుని వేశ్యారక్తుని చేయుటకు, దేవదేవి ఆమె అగ్రజ పందెము సఱచిన ఘట్టమునందు మల్లన గంటము ఘల్లుమన్నది. "వీని కథ యెంత?- ఈ సాములె కారా మగువల బాములఁ బడువారు?" అనుచు (72,73ప.2ఆ) దేవదేవి.

"పాటలగంధి! సౌఖ్యపరిపాటి యెఱుంగని మూఢుఁ డౌటనే
పాటియు వీఁడు తాఁ దనకె పైకొనఁ డాయెను గాక కాక నా
పాటల నాటల న్మధురభాషలఁ జొక్కి లతాంతబాణుచే
వాటులఁ జిక్కి కెంజిగురుఁ బానుపుఁ జెందకయుండ శక్యమే" 75ప.2ఆ.

"అనుటయుం గటకటంబడి యక్కుటిలకుంతల చెలియలిం జూచి యిట్లనియె."

"హరి హరి! యెంత మాట! యెటులాడితివే తరళాయతాక్షి! కా
పురుషులఁ బల్కి నట్లఖిలభోగములు న్విడనాడి సత్క్రియా
నిరతిని బ్రహ్మచర్యసరణి న్మహనీయతపోమహత్త్వముం
బొరసిన యట్టి నిట్టి మునిపుంగవు భావ మెఱుంగ వేమియున్." 77ప.2ఆ.

ఇంకను విప్రనారాయణుడు మహాయోగివరుడని వివరించి. (78-80ప.2ఆ.)

"వలువని మాటలు సారెం

బలుకం జనియేమి హావభావవిలాసా
దుల నీ వితనిఁ గరంచిన
నలికైశిక యేను దాసినయ్యెద నీకున్." 81ప.2ఆ.

అనిన, దేవదేవి "ఆడిన మాటకు వెనుకకుఁ బోకుమంచు" ఇట్లు ప్రతిజ్ఞ చేసినది.

"మాధవస్మరణంబు మాన్పికొక్కోకాది
పఠనంబునకుఁ బాలుపఱుపనేని
కనుసన్న సేసి యా కడవనె నా యింటి
కెల్లను నీళ్లు మోయింపనేని
తిరుచూర్ణరేఖ మచ్చరణలాక్షాలక్త
దృష్టితో వియ్య మొందింపనేని
మునిపండ్లఁ గొఱికివైచిన నాగవల్లికా
దళములకై యాస గొలుపనేని
కలఁ పనేనియు వలవంతఁ గలపనేని,
కేళికెలయింపనేని చొక్కింపనేని
విటుల కెకిమీసి వీనిఁ గావింపనేని
యుగ్మలీ! నీకు దాసినై యుండుదాన." 84ప.2ఆ.

ఇంత ప్రతిజ్ఞ చేసి, అంత సౌందర్యవతి అయి, ఎంత ప్రయత్నము చేసినను దేవదేవి సాధించలేకపోయినది.

"అక్కటా నాఁడు మాయపు వనానిల మేటికి వచ్చె వచ్చెఁ బో
యిక్కడికంచు వెంబడిన యే నరుదేఁ బనియేమి గల్గెఁ బో
యిక్కటినాత్మఁ డయ్యెడల నేల వసించె వసించెఁ బో యితం
డెక్కడఁ బోయె నేమనక యీగతిఁ బన్నిద మేల వైచితిన్." 41ప.3ఆ.

అని విప్రనారాయణుని అనురక్తుని చేసికొనుట అసాధ్యమని గ్రహించినది.(2ప.3)ఆ.

"నేరము చేసితి నెంతయు
నీరేరుహనాభ! కృష్ణ! నీ తిరువెళ్లం
బేరీతి నానతీవే
శ్రీరంగా! రంగరంగ! సేవకఫలదా!"43ప.3ఆ.

అని రంగధాముని ఆశ్రయించినది. అనంతరము విప్రనారాయణుడు అనురక్తుడగుటకు మూలకారణము దేవదేవి కాదు. రంగనాథుడే. దేవదేవి నిమిత్తమాత్రము.

"అనుచుం గంకణనిస్వనంబులు బెడంగై మ్రోయఁ గాంచీకల
స్వనముల్ వీనుల విందుసేయ నుదుటం జన్నుల్ గయాళింప లో
చనదీప్తుల్ చెలఁ గంగఁ బైకొను సరోజాతాస్యతోడం గడం
కను గ్రీడింపఁ దొడంగె నత్తపసి రంగస్వామి ప్రేరేపఁ గన్." 89ప.3ఆ.

రంగనాథాలయములోని "పురోభాగనిక్షిప్తంబును విభీషణదత్తంబును నానా రత్నఖచితంబును నుచితోపచారయోగ్యంబునుం బర్యంతవ్యాప్తనైగనిగ్యంబును నగు కనకపాత్రంబు"(54వచ.4ఆ.) వటురూపమున వేశ్యమాతకు తెచ్చి యిచ్చి, దేవదేవీవిప్ర నారాయణులకు పునస్సమాగమము కలిగించినది రంగపతియే. (54-64ప.4ఆ.) అంతే కాదు. చోళరాజు విప్రనారాయణుడే బంగరుగిన్నె దొంగ అని నిరూపించునెడ, ప్రత్యక్షమై నిజము చెప్పి, విప్రనారాయణుని భక్తాంఘ్రిరేణు నామధేయుని చేసినది కూడ రంగప్పడే.(65-80ప.5ఆ.) కారణము విప్రనారాయణుడు యోగికులాభరణము. విప్రనారాయణచరిత్రము శ్రీహరి లీలావినోదము.

గుడి నంబులే బంగరుగిన్నె దొంగలని ముద్రకర్త ముదలకించునెడ, నంబులే చెప్పిన వారి ప్రవర్తనము కలదు.

"విను మేము ప్రాలు మాలిన దీవెసుడి గాక
కినిసిన రెండు గుగ్గిళ్లు గాక
తక్కిన నింత గంధప్రసాదము గాక
మన(స్సైన నొ)క వడతునుక గాక
యటుమటించినఁ గుంచెఁడంత సాదము గాక
కాదేవి యొక గుల్లకాసు గాక
దాఁచికొన్నను బలితంపుఁ జింపుడు గాక
యగణితానర్ఘ మణిధగద్ధగితమహిమ
భాతిరోధానమ్మగితాహిపతిశయాన
సన్నిధానప్రతీప మీ గిన్నె మమ్ము
వంటివారలు గొన నెంతవారలయ్య! 19ప.5ఆ.

మల్లన విప్రనారాయణచరిత్రము. కథాప్రధానము. రసభరితము. ఔచిత్యవిలసితము. వర్ణనాభూయిష్ఠము కాదు. విప్రనారాయణుని జన్మస్థలమైన మండంగుడి అగ్రహారవర్ణనము (59-70ప. 1ఆ.) కథారంగమైన శ్రీరంగపురవర్ణనము (3-14ప.2ఆ.) విప్రనారాయణుడు పాదు కొల్పి ప్రోది చేసిన పుష్పవనవర్ణనము (16-25ప.2ఆ.) కథానాయిక దేవదేవి వర్ణనము (39-47ప.2ఆ.)వేసవి వర్ణనము (49-52ప.2ఆ.) సూర్యాస్తమయాదివర్ణనము (21-38ప. 3ఆ.) సూర్యోదయాదివర్ణనము (47-50ప.3ఆ.) వర్షావర్ణనము (52-55,61-62ప.3ఆ.) వేశ్యమాత వర్ణనము (19ప.4ఆ.) శ్రీరంగవిభుని వర్ణనము (65ప.5ఆ.) కథానుసారిగా. కథోపయోగిగా కలవు.

సూర్యోదయవర్ణనమునందు చెదలువాడ మల్లన సర్వమతసమానత్వమును ప్రతిపాదించుట ఇతోధికవిశేషము. ఇప్పటికిని సశేషము.

"స్మర్తల్ తత్త్వమటంచు నెంచఁ గ మహాశైవు ల్మనోజద్విష
న్మూర్తింగా నుతియింప వైష్ణవులు విష్ణుండంచు నెంచం దగం
గర్తారుం డనుచుం దురుష్కులు మొదల్గాఁ గొల్వఁ బ్రత్యక్షమై
మార్తాండుం డుదయించె నద్భితటసీమప్రాశితౌర్వాకృతిన్." 50ప.3ఆ.

ఇది విశ్వజగద్ధితము. శశ్వత్పరమసత్యము. తెలుగు కవితాకోటీరమణి.

**ప్రౌఢకవి మల్లన** : ఈతని కృతి రుక్మాంగదచరిత్రము. దాక్షారామభీమేశ్వరాంకితము. దైవాంకితము. ఇతడు "పోతయామాత్యపుత్త్రు"డని ఆశ్వాసాంతగద్యను కలదు. బమ్మెరపోతన కొడుకు మల్లన కలడు. అందువలన ప్రౌఢకవి మల్లన బమ్మెర పోతన కొడుకు మల్లన అని భావించుట జరిగినది.[275] కాని బమ్మెర పోతన కౌండిన్యసగోత్రుడు. ప్రౌఢకవి మల్లన తండ్రి పోతయ శ్రీవత్ససగోత్రుడు. (11ప.1ఆ.) కనుక ప్రౌఢకవి మల్లన. బమ్మెర పోతన కొడుకు మల్లన కాడు. మఱొకడు. ఆతని ప్రసక్తి రాజలింగకవి కూర్మపురాణములోని పూర్వకవిస్తుతియందు "ప్రౌఢకవి మల్లు" అని కలదు. కూర్మపురాణములోని తోటకవృత్తము. అప్పకవీయములోని అభేదప్రాసమునకు ఒక ఉదాహరణముగ కలదు. (371ప.3ఆ.) అప్పకవీయము రచనాకాలము 1656 వ సంవత్సరము. (33ప.పీ.)అనగా పదునేడవశతాబ్ది ఉత్తరార్ధము. కావున రాజలింగకవి కూర్మపురాణము రచనాకాలము పదునేడవ శతాబ్ది పూర్వార్ధము. ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రము రచనాకాలము పదునాఱశతాబ్ది ఉత్తరార్ధము కావలయును.

రుక్మాంగదచరిత్రములోని అవతారికను "ప్రౌఢకవీంద్రునకు" అని (34ప.1ఆ.) ఆశ్వాసాంతగద్యను "ప్రౌఢకవి మల్లన" అనికలదు. అదే కాలమునందు చెదలువాడ మల్లన, తరిగొొప్పుల మల్లన కలరు. చెదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రమునకు పూర్వము రుక్మాంగదచరిత్రము ద్విపదకావ్యము రచించినట్లు పూర్వోక్తము. పద్య కావ్యము ప్రౌఢరచనము. కనుక ప్రౌఢకవివ్యవహారము స్వయంకల్పితము కావచ్చును. అది పార్థక్యమునకు సార్థక్యము కలది. చెదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రము రచనాకాలము1585 ప్రాంతమని పూర్వోక్తము. అతని రుక్మాంగదచరిత్రము రచనాకాలము 1580ప్రాంతము కావచ్చును. ఇతని రుక్మాంగదచరిత్రము రచనాకాలము 1585ప్రాంతము కావచ్చును.

రుక్మాంగదచరిత్రమునందు కవితాలక్షణములు పది పద్యములందు కలవు. (18-27ప.1ఆ.) అందు వర్ణనలకు అగ్రస్థానము.

"వనజలకేళీశశిరవి
తనయోదయపానయానదౌత్యాబ్ధివివా
హనృపరతివిరహఋుతుమం
త్రనగాహవనగరవర్ణనలు దగుఁ గృతులన్." 18ప.1ఆ.

ఇది దండికావ్యాదర్శములోని అష్టాదశవర్ణనలకు అనుసరణము.

"నగరార్ణవశైలర్తు చన్ద్రార్కోదయవర్ణనైః
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః ॥ 16.
విప్రలమ్భై ర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మన్త్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయై రపి." 17శ్లో.1పరి.

ఇందలి ద్యూతము, అందలి దౌత్యము. ఇందలి నాయకాభ్యుదయమే అందలి నృపవర్ణనము . కడమ సమానము. సుకవులు నుతియించు సత్కృతిలక్షణమునందును వర్ణనలకు స్థానము కలదు.

"నానుఖ్లను శృంగారము
నానావిధవృత్తవర్ణనలు సంపూర్ణం
బై నిల్చిన కృతి సత్కృతిఁ
గా నుతియింతురుగదా సుకవు లెయ్యెడలన్." 25ప.1ఆ.

ఇది నాటి సగటు అభిప్రాయము. ఇంతకంటె మేటి పగటు అభిప్రాయమిది:

"జాజుల పొట్లము విప్పిన
యోజఁ గవిత్వంబు వెలయకుండిన సభలన్
బూజింతురె యా కృతి బుధ
రాజులు రాజులను సుకవిరాజులు గరిమన్." 26ప.1ఆ.

ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రమునందు షష్ఠ్యంతపద్యములు తొమ్మిది కలవు. (39-47ప.1ఆ.) కథాప్రారంభము "అభ్యుదయపరంపరాభివృద్ధిగా" కాదు."అత్యంతభయభక్తితాత్పర్యంబుల" (48వచ.1ఆ.)

రుక్మాంగదచరిత్రము మఱొక మాటను ఏకాదశీవ్రతమాహాత్మ్యము. ఏకాదశీవ్రతమాహాత్మ్యమున రుక్మాంగదునికి ధర్మాంగదుడు జన్మించును. అఖిలజనులు తామరతంపరగ వంశపరంపరాభివృద్ధి నందుదురు. యమలోకమునకు యాత్రికులు లేకపోవుట వలన యముడు నారదునితోను. బ్రహ్మతోను. మొఱపెట్టుకొనును. ఏకాదశీవ్రతభంగమునకు బ్రహ్మ మోహిని అను స్త్రీని సృజించును. మోహినీరుక్మాంగద వృత్తాంతమే మోదావహము. అందు "గృహగోధికాఖ్యానము, కాష్టకీటోపాఖ్యానము నందు చిత్రకథయుం" గలవు. మోహినీరుక్మాంగదసంవాదము. ధర్మాంగదరాజ్యాభిషేకము. రుక్మాంగదవైకుంఠాగమనములతో రుక్మాంగదచరిత్రము సమాప్తమగును. ఇది బ్రహ్మాండపురాణమధ్యస్థము. (54ప.1ఆ.) ప్రౌఢకవిమల్లన "పార్వతీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవి"త్రుడు.(ఆశ్వాసాంతగద్య) రుక్మాంగదచరిత్రము హరివాసరమాహాత్మ్యము. అయినను ఇష్టకామేశ్వరప్రశంస (121ప.3ఆ.) ఇష్టకామేశలింగస్తుతి (179,180 ప.3ఆ.)కాశీక్షేత్రవర్ణనము (53-64ప.5ఆ.) విశ్వేశ్వరస్తుతి (65-71ప.5ఆ.)విశ్వేశ్వరాది వివిధ దేవతాసమర్చనము (72ప.5ఆ.) కలవు. మల్లన కవిత చిత్రకవితను మచ్చు చూపును.

"తెల్లని పాము పానుపును దెల్లని వార్ధము నెక్కు బిడ్డఁడున్
దెల్లని దీవిపై విడిది తెల్లని తమ్ముల మీరు కన్నులున్
దెల్లని మోము గుజ్జమును దెల్లని మామయుఁ దెల్ల కైదువున్
దెల్లని కోడలుం గలుగు తెల్లని కూఁతురి తండ్రిఁ గొల్చెదన్." 60ప.1ఆ.
"పచ్చని పట్టు చేలమును బచ్చని కుంకుమపుష్పగంధమున్
బచ్చని పట్టు సింగిణియుఁ బచ్చని జోడును రాగవల్లులున్
బచ్చని రత్నకీలితవిభాసితభూషితముల్ దలిర్పఁగాఁ
బచ్చని వింటి జోదు క్రియఁ బార్థివశేఖరుఁ డొప్పె నయ్యెడన్." 83ప.3ఆ.

మల్లన కవితయందు నాచన సోమనాథ. శ్రీనాథ. పోతనల ప్రభావము సమధికము.

"నీటఁ దేలు శిలంబు పాటు సోలు సరంబు
ధరియింప భరియింపఁ దలఁపఁ దేని
యుబ్బి పొఱీన యాలు గబ్బు మీఱీన తోలు
జడలందు నొడలందుఁ బడయఁ దేని
యుగము గాల్చిన చేఁదు జగము గెల్చిన జోదు
గడిసేయఁ జొడిసేయఁ గలుగఁ దేని
యలివేణి వలిచంటు వెలయాలి వెలిగుంట
నుండఁగా బండఁగా నోపఁ దేని
యీడువత్తురె నీ సాటి యితరమూర్తు
లవనిమండలి దేవవేశ్యాభుజంగ!
కాశికాధీశ! విశ్వేశ!కలుషనాశ!" 71ప.5ఆ.

ఇది నాచన సోమనాథుని ప్రభావము. ఇందు దేవవేశ్యాభుజంగ బిరుదప్రదానము. పాలకుఱికి సోమనాథుని ప్రభావము.

"కల్పవృక్షము లిందుఁ గల భూరుహములెల్ల
సిద్ధలింగము లిందుఁ జిడిపిరాలు
కామధేనువు లిందుఁ గల గోగణములెల్లఁ
బటుసుధాంబుధు లిందుఁ బల్వలములు
గంగాసమము లిందుఁ గల నిర్ఝరములెల్ల
నమరు లిందుఁ జరించు నంత్యజనులు
ఖగకులాధిపు లిందుఁ గల మశకములెల్ల
సంజీవిలత లిందుఁ గుంజసమితి
పరుసవేదుల గనులిందుఁ బజ్జ గోచ
రంబులగుచున్న గండశైలంబులెల్లఁ
గములగర్భునకైన నీ కాశిమహిమ
ప్రస్తుతింపంగ వచ్చునా ప్రాభవమున." 61ప.5ఆ.

ఇది శ్రీనాథుని ప్రభావము. శ్రీశైలక్షేత్రవర్ణనములోని ఒక్కపంక్తి నిమిత్తము.

"జలజాక్షు పదపంకజములు పూజింపఁగా

వలవదా! చేతులు గలుగు ఫలము
శేషశాయికిఁ బ్రదక్షిణ మాచరింపఁగా
వలవదా! పదములు గలుగు ఫలము
దివిజాంతకుని దివ్యదేహంబు గనుఁగొన
వలవదా!! కన్నులు గలుగు ఫలము
దితిజాంతకుని దివ్యనామముల్ వినుతింప
వలవదా! నాలుక గలుగు ఫలము
కనకపీతాంబరుని దివ్యకథలు వినఁగ
వలవదా! కర్ణపుటములు గలుగు ఫలము
భక్తితాత్పర్యముల యదుపతికి మ్రొక్క
వలవదా!యుత్తమాంగంబు గలుగు ఫలము." 54ప.2ఆ.

ఇది పోతన ప్రభావము. పోతన అంత్యప్రాసమును పుష్కలము.(61,62,63,70,159, 160ప.1ఆ;51,52,137ప.2ఆ;85-98,108,112,113,115ప.3ఆ;119ప.4ఆ;100,132ప.5ఆ.)

" శ్రీదంబులు జితకలుషవి
షాదంబులు మునిమనఃప్రసాదంబులు భూ
మోదంబులు భవపాశ
చ్ఛేదంబులు వాసుదేవు శ్రీపాదంబుల్." 61ప.1ఆ.

పాత్రలసంభాషణములందు నానుడ్లు పుంఖానుపుంఖములు. ఇందుకు తారకపద్మనాభసంవాదము(26-29ప.5ఆ.)సంధ్యావళీమోహినీసంవాదము(119-128ప.5 ఆ.) ప్రముఖోదాహరణములు.

" పూనిక సురల జయించెడు
దానవులకు మనుజు లెంత తలపోయఁగ దు
ర్మానవ! గుడి దిగ మ్రింగెడు
వానికి నల నంది పిండివడియము గాదే" 27ప.5ఆ.
" రమణుని మన్నన గలదని
క్రమ మెడలఁగ మాటలాడఁగాఁ దగవగు నో
కమలాక్షి! వ్రేళ్ల తోడుత
నములుదురే చెఱకు తీయన గదాయనుచున్." 122ప.5ఆ.

పురవర్ణనము (65-73ప.1ఆ.) నాయకవర్ణనము(75-78ప.1ఆ.)ఏకాదశీవ్రతవర్ణనము

(89-104,118-136ప.1ఆ;58-111ప.2ఆ.) గర్భవతివర్ణనము(140-141ప.1ఆ.) కుమారోదయవర్ణనము (142-146ప.1ఆ.) నారదవర్ణనము(155ప.1ఆ.) యముని మొఱ వర్ణనము (156-170ప.1ఆ;3-47ప.2ఆ.) శ్రీహరివర్ణనము (50-57ప.2ఆ.) నాయికావర్ణనము (113-115ప.2ఆ.) (130-132ప.2ఆ.) వేట వర్ణనము (3-12, 69-100వచ.3ఆ.) రాజనీతివర్ణనము(15-66ప.3ఆ.) ఆశ్రమవర్ణనము (101-104ప.3ఆ.) వనకేళీవర్ణనము (138-139ప.3ఆ.)సూర్యాస్తమయాదికవర్ణనము (170-173ప.3ఆ;124-126,131-132 ప.4ఆ.)సూర్యోదయాదివర్ణనము (187-189ప.3ఆ;44ప.5ఆ.) జలకేళీవర్ణనము(193-206 ప.3ఆ.) అశ్వవర్ణనము (214ప.3ఆ.) సముద్రవర్ణనము (127ప.4ఆ.)సరోవరవర్ణనము (126ప.4ఆ.) మారుతవర్ణనము (45ప.5ఆ.) కలవు.

**తురగారాజకవి, అయ్యంకి బాలసరస్వతి** : ఇద్దఱు జంటకవులు. కృతి నాగరఖండము. పురాణము. ధవళేశ్వరపు మార్కండేయునికి అంకితము. గ్రంథాంతమునందు రచనాకాలమును తెలుపు పద్యము కలదు.

" శాలివాహనశకసంఖ్యాకములు నగు
పదియేనువందలపై నెనిమిది
వత్సరంబులలోన వసుధాస్థలంబున
కుతుబుషాహినిజాంకుతుబనాథు
ప్రాభవవేళమార్కండేయభూపతి
ధవళేశ్వరాన్వయభవుఁడు నగుచు
సకలదిశావ్యాప్తసాంద్రసుధాస్వచ్ఛ
కీర్తిపరంపరాస్ఫూర్తి నలరి
సురుచిరంబైన పెందోట పురిని నిలిచి
విశ్వకర్మాన్వయాంబుధి వెలయఁజేసి
సప్తసంతానములఁ గాంచి సాధువృత్తి
సుకవివర్యులు భళి యని స్తుతులు సేయ
ధరణి పాలింపు చుండెను ధర్మనిరతి.

శాలివాహనశకసంఖ్య 1508 + 78 = 1586 వ సంవత్సరము. మార్కండేయుడు మహమ్మద్ కుతుబ్‌షా కుడిభుజమని మఱొక పద్యమునందు కలదు.

" అతఁడు ప్రసిద్ధి వహించెన్
క్షితి నరగజపతుల గెలిచి చెలఁగి జయశ్రీ

సతిఁ జేకొనిన మహమ్మదు
కుతుపశహాచంద్రునకును గుడిభుజ మనఁ గన్."

మహమ్మద్ కుతుబ్‌షా కాలము 1580-1611 అని పూర్వోక్తము. కాబట్టి నాగరఖండము రచనాకాలము 1586 వ సంవత్సరమే.

నాగరఖండములోని పూర్వకవిస్తుతియందలి "వటుమూలు, సోమనాథుశివ తత్త్వ, శివదేవుఁ జిన్మయు, భవదూరు। శరభాంకు, రాజశేఖరుని, వేము"అను శైవకవుల పట్టికలోని వేముడు ప్రసిద్ధుడైన వేమనయే.[276]

**బైచరాజు వేంకటనాథుడు** : ఈతని కృతి పంచతంత్రము. హరిహరనాథాంకితము. వేంకటనాథుని ముత్తాత తిరుమలరాజు శాసనములు 1491, 1492 వ సంవత్సరములందు కలవు.[277] 1491, 1492 ముత్తాతకు, మునుమనుమనికి నడుమ మూడు తరములు కలవు. శతాబ్దికి మూడుతరముల పరిగణనమున వేంకటనాథుడు 1591, 1592 సంవత్సరములందుండును. కనుక పంచతంత్రము రచనాకాలము స్థూలముగ 1590 ప్రాంతమగును.

దూబగుంట నారాయణుని పంచతంత్రము కంటె, భానయ పంచతంత్రి కంటె బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము ప్రౌఢము. విపులము. వర్ణనాత్మకము.

" ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేఁట గాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవఁ బోలి గూఢతయుఁ జాటుదనంబును గాకయుండఁ జె
ప్పినయదెపో కవిత్వమనిపించు నగిం చటుగాకయుండినన్."

అని వేంకటనాథుని కవితానిర్వచనము. అందుకు వర్ణనలు అభ్యధికమైనవి. పంచతంత్రము కథారూపమున నీతులు ఉపదేశించు గ్రంథము. దూబగుంట నారాయణుని పంచతంత్రము, భానయ పంచతంత్రి అట్లే కలవు. నారాయణ, భానయల కథాకథనము సూత్రప్రాయము. వేంకటనాథుని కథాకథనము వివరణాత్మకము.

" జంబుకో హుడుయుద్ధేన వయం చాషాఢభూతినా
దూతికాపరకార్యేణ హూతా దోషైః స్వయంకృతైః."
" మేషయుద్ధమధ్యంబున మెలఁగి యొక్క
శివయు, నాషాఢభూతిచే సిద్ధమునియుఁ

దౌడరి సాలీని సతిచేత దూతికయును
ఆత్మకృతదోషమునఁ గాదె హానిఁ బడిరి." -నారాయణ
" ... ... మున్ను ధాత్రిపై మేషసం
గ్రామంబుచే జంబుకంబు, భిక్షుఁ
డఘమానసుండగు నాషాఢభూతిచే
వడి మంగలియుఁ దంతువాయుచేత
తమతమ చేయు నేరముల మోసము నొందె"-భానయ
"ఈ తఱి నక్క వెక్కసపుటేఁడిక కయ్యముచేతఁ దొల్లి చే
సేతఁ బరిగ్రహించి యతి శిష్యునిచే, నొక నేఁతకానిచే
దూతిక నొచ్చె నాత్మకృతదోషముననదద నావు డుల్లస
త్కౌతుకవల్లి పల్లటిలఁగా నతఁ డాతనిఁ జూచి యిట్లనున్."- వేంకటనాథుడు.

నారాయణ, భానయల నీతిపద్యములు సరళములు; మూలవిధేయములును. వేంకటనాథుని నీతిపద్యములు నాతికఠినములు. మూలాతిక్రమణములును.

"కోపప్రసాదచిహ్నము
లే పార్థివునందు భృత్యుఁ డెఱిఁగి చరించున్
దీపించి వాఁడు నృపుచే
నేపారఁగ మంతుకెక్కునెక్కుడు కరుణన్"- నారాయణ
"కోపప్రసాదగుణములు
భూపాలునియందుఁ దెలిసి బుద్ధి నధికుఁడై
చాపలవిరహితహృదయుం
డై పెంపునఁ గొలువ నధికుఁడగు సేవకుఁడున్." -భానయ
"కోపప్రసాదచిత్త
వ్యాపారము లెఱిఁగి కొలిచి వర్తిల్లు భటుల్
భూపాలబాహుశాఖా
రోపితులై యుంద్రు చనవు రొక్కం బవుటన్"- వేంకటనాథుడు.
"మలయజశీతలమ్ములగు మాటలఁ దేల్చును వచ్చినంతఁ బెం
పలవడ లేవఁ జూచును బ్రియమ్ము లొనర్చును లేఁతనవ్వువె
న్నెలలు ముఖేందునం దమర నిష్ఠురదంభము మానసమ్మునన్
దలముగఁ బొల్చు దుర్జనుఁడు ధాత్రితలమ్మున లక్ష్మధీమణీ!" -భానయ
"పురతఃప్రాంజలి, సాశ్రుదృగ్గలజుఁ డుత్ఫుల్లాస్యుఁ డాశ్లేషణా

చరణారంభణకేళిసత్ప్రియకథాసంప్రశ్నదత్తాధికా
దరుఁడున్ మాయి బహిర్మహామధురుఁ డంతర్గూఢహాలాహలుం
డరుదే! దుర్జనుఁ డెంత శిక్షితుఁ డపూర్వాఖర్వనాట్యోచితిన్." -వేంకట

ఇది వేంకటనాథుని శైలీప్రౌఢిమను కూడ పరిభవించును.

**తెనాలి రామభద్రకవి** : ఈతని కృతి ఇందుమతీపరిణయము పాలచురి కృష్ణభూపాలునికి అంకితము. అతడు తిరుమలశ్రీనివాసదేశికుని శిష్యుడు.(70ప.1ఆ.) సాంబోపాఖ్యానము కృతికర్త రామరాజు రంగపరాజు. కళాపూర్ణోదయము కృతిభర్త నంద్యాల కృష్ణమరాజు తిరుమల శ్రీనివాసాచార్యుల శిష్యులు. తిరుమల శ్రీనివాసాచార్యులే తిరుమలశ్రీనివాసదేశికుడగును. అతని శిష్యుడు పాలచురి కృష్ణభూపాలుని కాలము పదునాఱవశతాబ్ది ఉత్తరార్థమగును. తెనాలి రామభద్రకవి తెనాలి రామ(లింగ)కృష్ణ. తెనాలి అన్నయల తమ్ముడు శ్రీగిరి పౌత్రుడు. ఇమ్మడి రామకృష్ణుని పుత్త్రుడు. తెనాలి రామ(లింగ)కృష్ణుని కాలము 1500-1580 అని. తెనాలి అన్నయ కాలము 1505-1585 అని పూర్వోక్తము. కనుక తెనాలి శ్రీగిరి కాలము 1510-1590, ఇమ్మడి రామకృష్ణుని కాలము 1535-1615, రామభద్రకవి కాలము 1570-1640 కాగలదు. ఇందుమతీపరిణయము రచనాకాలము 1600 ప్రాంతము కావచ్చును. పెదతాత రామ(లింగ) కృష్ణుని పాండురంగమాహాత్మ్యము రచనా కాలము 1575 ప్రాంతము. పినతాత అన్నయ సుదక్షిణాపరిణయము రచనాకాలము 1560 ప్రాంతము కావున. వారి అనుజుని మనుమడు రామభద్రకవి ఇందుమతీపరిణయము రచనా కాలము 1600 ప్రాంతమగుట పరస్పరోపబలకము.

కాళిదాసు రఘువంశములోని పంచమ, షష్ఠ, సప్తమసర్గల విషయము, ఇందుమతీపరిణయములోని ఇతివృత్తము. కాళిదాసు శ్లోకములకు స్వతంత్రాంధ్రీకరణము, స్వతంత్రానుసరణమును కలదు.[278]

"రతే గృహీతానునయేన కామం ప్రత్యర్పితస్వాంగమివేశ్వరేణ
కాకుత్స్థ మాలోకయతాం నృపాణాం మనో బభూవేందుమతీ నిరాశమ్."
7శ్లో.6స.

"రఘనము చూపు శంకరు ఖరంబగు చూపునఁ బ్రాఁత మేను పో
నభినవమూర్తిఁ దాల్చు మకరాంకుని కైవడిఁ బొల్చు నా రఘు
ప్రభవుని సింహసంహననభావము రాజులు పీతతేజులై

యభిరతిఁ జూచి యిందుమతియందు నిరాశతఁ జెంది రందఱున్." 11ప.4ఆ.

ఇందు "రతేర్గృహీతానునయేన" అనుటలోని ఆంతర్యము పద్యమునందు కలదు."రఘుప్రభవుని సింహసంహననభావము రాజులు వీతతేజులై" అను విషయము స్వతంత్రకల్పనము. పద్యము స్వతంత్రాంధ్రీకరణము.

"కశ్చిత్కరాభ్యా ముపగూఢకాల మాలోలపత్త్రాభిహతద్విరేఫమ్
రజోభి రంతఃపరివేషబంధిలీలారవిందం భ్రమయాం చకార." 17శ్లో.6స.

"భ్రమణవశంబునం జెదరఁ బాఱిన రేకుల తాకునన్ మరం
దమహితసౌరభస్పృహల నంటున నంటుచుఁ బాయుచున్ మద
భ్రమరము లుగ్రసంసృతినిబద్ధుల కైవడి ఖేదమోదసం
గము వహియింపఁ గాఁ గరయుగంబున నొక్కఁడు త్రిప్పెఁ బద్మమున్."

శ్లోకమునందు స్వయంవరసభలోని ఒకరాజు ఇందుమతిని చూడగానే చేతిలోని లీలారవిందమును త్రిప్పసాగెను. నన్ను వరించిన నీవు నన్నిట్లు త్రిప్పగలవని అతని ఆంతర్యము. అది పద్యమునందు లేదు. సరికదా పద్యమునందు భ్రమరములు భయంకరమైన సంసారమునందు బంధింపబడి ఖేదమోదములను వహించినవని కలదు. సందర్భోచితము కాని స్వతంత్రానుసరణము.

ఇందుమతీపరిణయములోని అయోధ్యాపురవర్ణనము (91-112ప.1ఆ.) రఘుమహారాజువర్ణనము (114-119ప.1ఆ.) సంతానకాంక్షాదికవర్ణనము(121-137ప.1ఆ.) కొలువుకూటము వర్ణనము (2-11ప.2ఆ.) దౌహృదవర్ణనము(42-51ప.2ఆ.) కుమారోదయవర్ణనము (53-54ప.2ఆ.) నాయకబాల్యవర్ణనము(56-60ప.2ఆ.) నాయికావర్ణనము (66-81ప.2ఆ.) ప్రయాణవర్ణనము(87-89ప.2ఆ;3-8ప.3ఆ.) నదీవర్ణనము (90ప.2ఆ.) నగవర్ణనము (96-108ప.2ఆ.) వన్యద్వీపవర్ణనము (9-10ప.3ఆ.) సరోవరవర్ణనము (19ప.3ఆ.) వసంతర్తువర్ణనము (33ప.3ఆ.) వనకేళీవర్ణనము (35-50ప.3ఆ.) జలకేళీవర్ణనము (51-65ప.3ఆ.) నాయికానాయక పరస్పరావలోకనవర్ణనము(67-72ప.3ఆ.) నాయికావిరహవర్ణనము (137-142ప.3ఆ.) ప్రభాతవర్ణనము(145-147ప.3ఆ.) సూర్యోదయవర్ణనము (148-149ప.3ఆ.) నాయికాశృంగారనైపథ్యవర్ణనము (13-16ప.4ఆ.) మొదలైనవి తెనాలిరామభద్రుని స్వతంత్రకల్పనములే. వనకేళీవర్ణనమునందు పుష్పాపచయఘట్టము రగడయే. తురగవల్గనరగడ వివాహవర్ణనమునందు రఘువంశమునందు లేని వైదికసంప్రదాయములు, లౌకికసంప్రదాయములును ఇందుమతీపరిణయమునందు కలవు.

ఇందుమతీపరిణయము సభ్యతను అతిక్రమింపని శృంగారప్రబంధము.

**తరిగొప్పుల మల్లన** : ఈతని కృతి చంద్రభానుచరిత్రము. దత్తాత్రేయాంకితము. దైవాంకితము. మల్లన అగ్రజుడు దత్తన తిరుమలరాయల కుమారుడైన వేంకటపతిరాయల కార్యకర్త. (11,12,38,39ప.1ఆ.) వేంకటపతిరాయల వర్ణనము చంద్రభానుచరిత్రమునందు ఏడుపద్యములందు కలదు. (17-23ప.1ఆ.) ఆతని రాజ్యకాలము 1586-1614 అని పూర్వోక్తము. కనుక చంద్రభానుచరిత్రము రచనాకాలము 1600 ప్రాంతము కావచ్చును.[279]

చంద్రభానుచరిత్రము కుముదినీచంద్రభానుల పరిణయవృత్తాంతము. ఇది ప్రధానేతివృత్తము. పద్మినీవిజయలోలుర పరిణయవృత్తాంతము ఆనుషంగికేతివృత్తము. ఈరెండు ఇతివృత్తములకును మూలము మృగ్యము. తరిగొప్పుల మల్లన స్వతంత్ర కల్పనమే అగును. కథాసంవిధానమునందు పింగళి సూరన ప్రభావము. కవితాసంధానమునందు అల్లసాని పెద్దన ప్రభావము. పద్యరచనావిధానమునందు భట్టుమూర్తి ప్రభావము కలదు. కథ మూసకట్టు కాదు. నూతనాంశములు కలవు. సంతానవతియైన రుక్మిణి విఱ్ఱవీగుట. సంతానవతి కాని సత్యభామ వినయము కలిగియుండుట. సత్యభామకు చంద్రభానుడు జన్మించుట. రుక్మిణి సంతానమైన మన్మథునికి, సత్యభామ సంతానమైన చంద్రభానునికి నారదుడు సంగీతగురువగుట. నారదుడు మన్మథుని యెడ పక్షపాతము వహించుట. చంద్రభానుడు తుంబురుని సంగీతగురువును చేసికొనుటకు బయలుదేరుట. చంద్రకళ అను అప్సరస భరద్వాజమహర్షికి తపోభంగము కలిగింపబోయి శపింపబడుట. ప్రాణస్నేహితులైన చంద్రభానుడు, సాత్యకి పట్టి విజయలోలుడు అదృశ్యవిద్య, కామరూపవిద్య పడయుట. వారిని విడిపోవునట్లు దూర్వాసుడు శపించుట. చంద్రభానుడు కుండిననగరము చేరి తుంబురునకు శిష్యుడగుట. కుముదినిని చూచుట విజయలోలుడు తిరుపతియాత్ర చేసి పద్మినిని పొదరింట తార్చుట మొదలైనవి నూతనాంశములు.

కథాసంవిధానమునందు కాలక్రమపద్ధతి, కారణక్రమపద్ధతి రెండును కలవు. అంతేకాదు. కవి తానై కథలెల్ల చెప్పక, పాత్రలచేత చెప్పించిన కథలు కలవు. అవియెల్ల ప్రధానకథకు ప్రయోజనాత్మకములు. కథనమునందు కట్టుదిట్టము లేదు. పతనోత్థానములు కలవు. సంతానము లేని సత్యభామ,

"అఖిలవైభవముల మించినట్టి నాకు
వాంఛితమొకండు లేదైన వలయుఁ దెలుప

విన్నవింపఁ గఁ దగినట్టి చిన్నదొక్క
మనవి గల దాలకింపుము మనుజనాథ" 97ప.1ఆ.

అనగానే "సత్యావనిత తలంపెఱిఁగి చూడ్కుల ననుపమవాంఛితము లొదవ హరి కరుణించెన్" అని కలదు. (98ప.1ఆ.) సత్యభామ మనవిని తెలుపలేదు. కృష్ణుడు అభీష్టసిద్ధి కలిగించెను. అది సర్వాంతర్యామిలక్షణము. సంవిధానము సమున్నతము. ఇంద్రుడు ఒడ్డోలగమై ఉన్నప్పుడు చారుడొకడు వచ్చి సమీపించి రహస్యముగా "విన్నవించెనేమొ" (71ప 2ఆ.) ఇంద్రుడు.

"ఆ మాట కులికిపడి యే
మేమీ యని తెలియనడిగి యించుకవడి నె
మ్మోము మరవంచి సశంకము
గా మరుదాచార్యు నెమ్మొగముఁ గనుఁ గొనియెన్." 72ప.3ఆ.

కనుగొన్నంతనే దివిజమంత్రి "తత్కార్యము తన మనమున నూహించి"నట్లు కలదు. (73ప.3ఆ.) బృహస్పతి ఎంత బుద్ధిమంతుడైనను చారుని వార్త ఊహించుట సహజము కాదు. సంవిధానము సడలినది.

చంద్రకళ వరూథిని సయిదోడు. (148ప.2ఆ.) అంతేకాదు. ఎంత వేడుకొన్నను అచలుడై యుండిన భరద్వాజుని గికురించుటకు చంద్రకళ చేసిన వాదము(150 -154ప.2ఆ.) వరూథిని వాదమునకు అనువాదము.

"తేరుకుఁ దేరఁ గా భవదదృష్టవశంబున నేఁడు చెంతకుం
జేరిన మమ్ము గారవము సేయ నెఱుంగవుగాక యాత్మలో
నారసి చూడు మేమి ఫలమందుట కుంకువలై తనర్చునో
ధారుణిఁ జేయు జన్నములు తాపసవృత్తులు వీరకృత్యముల్." 151ప.2ఆ.

ఇది "యజ్ఞకోటులం బావను లౌటకున్ ఫలము మా కవుఁగిళ్ల సుఖించుటే కదా" అను వరూథిని వాచ్యార్థమునకు (54ప.2ఆ.మ.చ.) చంద్రకళ వ్యంగ్యార్థము.

కుముదినీచంద్రభానుల సంభోగశృంగారమునందు ఇట్లు కలదు.

"భావోజ్జృంభణమున్ రసోదయపరీపాకంబు నవ్యధ్వని
శ్రీవిస్ఫూర్తియు మించె నాతిదృఢసంశ్లేషైకబంధాప్తితో
నా వైదర్భి ప్రసన్నవృత్తి మృదుశయ్యం గూర్చి సాహిత్యమ

ర్మావిర్భావధురీణుఁ డై యలరె సత్యానందనుం డెంతయున్." 204ప.5ఆ.

ఇది వసుచరిత్రములోని "సతి సాహిత్యరహస్య"మునకు (94ప.6ఆ.) ప్రతిధ్వని.

"ఏలాయతడోలాయత
లీలాయతనంబు కడ నళిభ్రమకరశో
భాలాలసఖేలాలస
బాలాలసమానదృష్టిపథమున నిలుపన్. 67
వనితాజనతావినుతా
ననతామరసంబు మలఁచి నను నా చెలి భా
వినితాంతావసితాంతా
వనతాంతాపాంగకోణవైఖరిఁ గనుచున్." 68ప.5ఆ.

ఇవి భట్టుమూర్తి పద్యరచనావిధానమునకు ప్రతిబింబప్రాయములు.

ఇట్లు అవ్యవహితపూర్వకవుల ప్రభావము. అక్కడక్కడ కలదు. ఇంతమాత్రమున తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రము స్వయంప్రతిపత్తి లేని కావ్యము కాదు. ఈ యుగములోని ఇతరకవుల కావ్యములందు పైశ్రేణి నుండు కావ్యమే. అంతేకాదు. చంద్రభానుచరిత్రము ప్రభావము సురభిమాధవరాయల చంద్రికాపరిణయమునందు కలదు.[280]

"అరయ ననగ్నికుండాహుతిస్తోమమై
బూదిఁ గూడె సుమాస్త్రు పోడిమెల్లఁ
జర్చింప నూషరస్థాపితబీజమై
ధూళిఁ గూడె సమీరు హోళి యెల్లఁ
జింతింప వఱదఁ గూర్చిన చింతపండయి
నీటఁ గూడె హిమాంశు నేర్పు లెల్లఁ
గనుఁగొన నడవిని గాచిన వెన్నెలై
చెట్లఁ గూడె వసంతు చెల్వ మెల్ల
నకట చక్రాతిపై వాన యగుచుఁ జెదరి
పఱచె నలువంకలకుఁ బక్షిబలములెల్ల
విశ్వభూనాథ విను పదివేలమంది
మన్మథులకైన వానిఁ దెమల్ప వశమె." 168ప.2ఆ.చం.భా.చ.

"తన క్రొందళముల మన్నన చెట్లపాలుగాఁ
జనియె సూనశ్రీల నెనసి మధువు
తన తనూగరిమమెంతయు ధూళిపాలుగా
నరిగె వడంకుచు నసదు గాడ్పు
తన మహఃస్ఫూర్తి తొల్తనె యగ్నిపాలుగాఁ
బఱచె వెల్వెలఁ బాఱి పద్మవైరి
తన పాత్రవృత్తి తోడ్తనె మింటిపాలుగా
నడఁగెఁ గొమ్మలఁ బికాద్యభ్రగాళి
తన పురారాతిభీకరోదగ్రవిగ్ర
హస్ఫురణ భూతిపాలుగా నతనుఁ డేగెఁ
జాపశతజాతములు వనస్థలిని వైచి
యమ్మహామౌని కోపాప్తి నడరునపుడు." 114ప.2ఆ.చం.ప.

అన్న దత్తన తిరుమలరాయల కుమారుడైన వేంకటపతిరాయల కార్యకర్త అగుటవలన, మల్లన వేంకటపతిరాయలను ఏడు పద్యములందు వర్ణించుట వలన అతడు విజయనగరనివాసి అగును. రక్కసితంగడి యుద్ధమునందు విధ్వంసమైన విజయనగరములోని గుడిగోపురములు మొదలైనవి, మల్లన కనులార గాంచుట వలన కాబోలు జీర్ణాలయములు మొదలైనవి చంద్రభానుచరిత్రమునందు ప్రతిఫలించినవి.

"అధ్వగదత్తతిలాక్షతగ్రహణసం
కులమూషికారాజికూజితములు
శ్లథవప్రపాషాణసంధిజాతవటావ
నీరుహాలోలఝిల్లీరవములు
లూతాఘటితతంతుజాతాభివృతదారు
గోపానసీనటద్ఘుణరుతములు
ప్రశిథి.ప్రాసాదభాగగేహాన్యోన్య
నీడభ్రమత్పక్షినిస్వనములు
జీంఝుమని మ్రోయఁ జెదరిన చిత్తరువులఁ
బడిన గోడల నొరగు కంబములఁ బట్టు
వదలు గారలతోఁ గానవచ్చె బహుశి
వాలయంబైన శూన్యశివాలయంబు. 43.
చీలలు చెదరి బచ్చెన చిట్లి వానలఁ

గూలు కొమ్మలతోడి గోపురములు
పొరుగూరి ప్రజ పాడుపొలము మేఁపుచు రేల
మంద లాఁగిన భోగమండపములు
నుసిపట్టి పడి నుగ్గు నూచంబులై బండి
కండ్లు దక్కఁగ నేలఁ గలియు తేరు
లెడలేక తఱచు వ్రేలెడు జిబ్బటీలచే
గబ్బులు వెదచల్లు గర్భగృహము
లోరఁగలుఁ జలువడి తాప లూడి ప్రాఁచి
బూరటిలి నీరు గననీక పూరి మొలచు
బావులును గల్గు నచట భూపాలసుతులు
చేరి యొకచోట నలఁత వసించునంత." 48ప.3ఆ.

పురవర్ణనము (57 32ప.1ఆ.) వేటవర్ణనము (3-50ప.2ఆ.) నదీవర్ణనము(97-105 ప.2ఆ.) శ్రీరంగక్షేత్రవర్ణనము (107-116ప.2ఆ.) ఆశ్రమవర్ణనము(118-128ప.2ఆ.) యుద్ధవర్ణనము (51-65ప.3ఆ.) వసంతర్తువర్ణనము(101-107ప.3ఆ.) వనకేళీవర్ణనము (109-114ప.148.ప.3ఆ;3-21ప.4ఆ.) నాయికానాయకపరస్పరావలోకనవర్ణనము (119-128ప.3ఆ.) నాయికావర్ణనము(139-145ప.3ఆ.) జలకేళీవర్ణనము (22-38ప.4ఆ.) మన్మథపూజావర్ణనము(40-46ప.4ఆ.) నాయికావిరహవర్ణనము (48-63,81-103ప.4ఆ.) సూర్యాస్తమయాదివర్ణనము (64-80,87,88ప.4ఆ.) నాయకవిరహవర్ణనము(106- 117ప. 4ఆ.) దూత్యవర్ణనము (118-137ప.4ఆ.) ప్రభాతవర్ణనము(138-144ప.4 ఆ.) శరదృతువర్ణనము (3-9ప.5ఆ.) వర్షర్తువర్ణనము (30-39ప.5ఆ.) తిరుపతియాత్రావర్ణనము (41-62ప.5ఆ.) వివాహవర్ణనము (141-191ప.5ఆ.) పౌరాంగనావిలోకనవర్ణనము (193-197ప.5ఆ.) సంభోగవర్ణనము(203-205ప.5ఆ.) కలవు.

కవిత్రయమును మొదట త్రిమూర్తులుగ తలచినది (6ప.1ఆ.) తరిగొప్పుల మల్లనయే.

**బొడ్డుచెర్ల చినతిమ్మయ** : ఈతని కృతి ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము నంద్యాల తిమ్మరాజునకు అంకితము. అతడు నంద్యాల కృష్ణమరాజు పినతాత మనుమడు. కృష్ణమరాజు కాలము పదునాఱవశతాబ్ది ఉత్తరార్థమని పూర్వోక్తము. అతని తమ్ముడు తిమ్మరాజు కాలమును అదే అగును. కనుక ప్రసన్నరాఘవనాట్యప్రబంధము రచనాకాలము1600 ప్రాంతము కావచ్చును.

"ధీరుఁడు బొడ్డుచెర్ల చినతిమ్మయమంత్రికుమారుఁ డంచితా
కారుఁడు సత్కళావిదుఁడు కౌశికగోత్రుఁడు పద్మనేత్రసే
వారతబుద్ధి నందవరవంశ్యుడు ప్రాకవిలోకనాథుఁ డా
చారసమగ్రవర్తనుఁడు సారవచోనిధి యున్నవాఁ డొగిన్." 7ప.

"ప్రసన్నరాఘవంబను మహానాటకం బాంధ్రనాట్యప్రబంధంబుగా ననుసంధించి" నట్లు ప్రసన్నరాఘవనాట్యప్రబంధమునందు కలదు. (8ప.1అం.) పద్యము నందు కర్త చినతిమ్మయ అయిన. మంత్రికుమారుఁడు అతని విశేషణమగును. చినతిమ్మయమంత్రియొక్క కుమారుడైన. కర్తృనామము లేకుండ పోవును. అందుకు "ప్రాకవిలోకనాథుడు"అను చోట కల "సత్కవిలోకనాథుడుఅను పరిష్కరణమును బట్టి 28
చినతిమ్మయ మంత్రియొక్క కుమారుడు లోకనాథుడని ఒక సమన్వయముకలదు. "ప్రాకవి"అనుచోట "సత్కవి అను పరిష్కరణము కంటె "ప్రాక్కవిఅను పరిష్కరణము కతిపయాక్షరసంస్కారమగును. ప్రాక్కవి పూర్వకవి. పూర్వకవిలోకమునకు నాథుడు అనగా పూర్వకవులను మించిన వాడను తాత్పర్యము వచ్చును. అప్పుడు చిన తిమ్మయమంత్రి యొక్క కుమారుడు అనామకుడగును. సనామకుని చేయుటకు లోక నాథనామము ప్రసిద్ధము కాదు. కల్పనాగౌరవమునకు తావలమగును. ప్రసన్న రాఘవనాట్యప్రబంధకర్త బొడ్డుచెర్ల చినతిమ్మయ అని. అతడు మంత్రికుమారుడని గ్రహించుటయందు సారళ్యము కలదు.

ప్రసన్నరాఘవనాట్యప్రబంధము జయదేవుని ప్రసన్నరాఘవమను సంస్కృత నాటకమునకు తెనుగుసేత. నాటకరూపానువాదము కాదు. నాటకక్రమానువాదము. వల్లభామాత్యుని క్రీడాభిరామము వంటిది. క్రీడాభిరామమునందు "ఏకాశ్వాసంబు" అని కలదు. ఇందు ఆశ్వాసవిభాగము లేదు. అంకవిభాగము కలదు. "సూత్రధారుఁడు వెండియు హర్షించి" (80వ.1అం.)

"వీరిఁ జేరంగఁ బోయి నా పద్యఁ జూడుఁ
డనుచు నెంతయుఁ బ్రార్థింతునని తలంచి
యేల ప్రార్థింప నాకు నే నిందె పోయి
సాక్షి చెప్పెడు గతి నిది జాడ గాదు." 81ప.1అం.

అను ఉపక్రమణికయునుండే నాటకసంధిలేదు. ప్రబంధమంతయు ఇదే ఫక్కి. "ఇది

ప్రస్తావన.", "ఇదివిష్కంభము" ఇత్యాదినిర్దేశములు కలవు. అవి సంస్కృతనాటకమునకు సంబంధించినవి. సంస్కృతనాటకస్వభావమేగాని. సంస్కృతనాటకస్వరూపము పూజ్యము. ప్రసన్నరాఘవనాట్యప్రబంధము నాటకము కాదు. నాటకానుసారి ప్రబంధము. దృశ్యకావ్యము కాదు. శ్రవ్యకావ్యమే.

ప్రసన్నరాఘవనాట్యప్రబంధము అస్వతంత్రాంధ్రీకరణము కాదు. స్వతంత్రాంధ్రీకరణము. ప్రథమాంకములోని (229ప.) ద్వితీయాంకములోని(64-84ప.) సీతావర్ణనము సప్తమాంకములోని (224-245ప.) అయోధ్యాపురవర్ణనము మొదలైనవి అమూలకములు.[282]

ప్రసన్నరాఘవనాటకములోని ప్రసిద్ధమైన శ్లోకమిది:

"సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే
చండాంశు ర్నిశి కా కథా రఘుపతే! చంద్రోదయ మున్మీలతి
వత్సైతద్విధం కథం ను భవతా ధత్తే కురంగం యతః
క్వాసిప్రేయసి హా కురంగనయనే చంద్రాననే జానకీ."

ఇది భాస్కరరామాయణమునందు ఇట్లు కలదు.

"తపనుఁడు వేపఁజొచ్చె ననుఁ దమ్ముఁడ! వృక్షము క్రిందఁబెట్టు నాఁ
దపనుఁడు రేయి లేఁడు వసుధావర! చంద్రుఁడు గాని; చంద్రునిన్
నృపసుత! యెట్లెఱింగితివి నీవు; మృగాంకము చూడనున్కి; హా
చపలమృగాక్షి! చంద్రముఖి! జానకి! యెక్కడ నున్నదానవే.

మఱి ప్రసన్నరాఘవనాట్యప్రబంధమునందు ఇట్లు కలదు.

"మించెం జండమరీచి మింటఁ బద సౌమిత్రీ తరుచ్ఛాయకున్
మంచుంజాయలవేల్పు గా కితఁడు రామా! రాత్రి ప్రొద్దుండునే
చుంచుం(బాపఁ డదెట్లెఱింగితివి లోఁ జూడన్ మృగంబున్కి హా
చంచద్బాలమృగాక్షి యెందరిగితే చంద్రాననా జానకీ." 3ప.6అం.

**కోట శివరామకవి** : ఈతని కృతి సానందోపాఖ్యానము. పద్యకావ్యము. శ్రీకాళహస్తీశ్వరునికి అంకితము. దైవాంకితము. శివరామకవిని సానందోపాఖ్యానమును రచింపుమన్నది ఆతని దేశికస్వామి అభినవధూర్జటి. అతడు "సారచిత్రకవితగరిమ ప్రబంధములు చేసెనని కలదు. (11ప.1ఆ.) అందువలన అభినవధూర్జటి

సానందోపాఖ్యానము రచింపుమనిన, శివరామకవి కృతిభర్తగురించి చింతసేయ, శ్రీకాళహస్తీశ్వరుడు మనస్సునందు తోచిన, శ్రీకాళహస్తీశ్వరునికి అంకితముసేయుటకు నిశ్చయించుకొనును. అప్పుడు "సదాశివగురుండు" శ్రీకాళహస్తీశ్వరుని పేర అంకితము సేయమనును. (13-17ప.1ఆ.) సదాశివగురువు మఱొక గురువని ఒక అభిప్రాయముకలదు.[284] అది సందర్భోచితము కాదు. అభినవధూర్జటియే సదాశివగురువగును. "సదాశివస్వరూప సద్గురు చరణారుణరాజీవన మాసాదితాద్వైతానుభవ" అను విశేషణము శివరామకవికి కలదు. అభినవధూర్జటి "దక్షిణామూర్తిగతి శిష్యతతికి బోధించు నద్వైతబోధ" అని కలదు. (11ప.1ఆ.) అతడు "రాజయోగవిజ్ఞానైకసంయుక్తివెలసె"నని కూడ అందు కలదు. అతడు కవిధూర్జటి కాడు. యోగిధూర్జటి అగును. అభినవధూర్జటి సదాశివగురువే అగును. సదాశివ గురువు కాలము తెలియు సాధనసంపత్తి కానరాదు. శివరామకవి పూర్వకవిస్తుతియందు "తిక్కన ముఖ్యసత్కవుల విద్యావైఖరు ల్మెచ్చెదన్" అని కలదు. (9ప.1ఆ.) ఇంతమాత్రమున శివరామకవి ఎఱ్ఱనయుగములోని వాడు కాజాలడు. సానందోపాఖ్యానమునందు శ్రీనాథ,పోతనల ప్రభావము కలదు. ఇంతమాత్రమున సానందోపాఖ్యానము రాయలయుగములోని కావ్యము కాజాలదు. రాయల అనంతరయుగములోని కావ్యమును కావచ్చును. సానందోపాఖ్యానము రచనాకాలము అనిశ్చయము.

సానందోపాఖ్యానము భద్రకవి లింగన ద్విపదకావ్యమునకు పద్యగద్య రూపాంతరము. "ఇమ్మహాకావ్యంబు" అని (16ప.1ఆ.) కలదుగాని మహావేదాంతగ్రంథము. ప్రథమాశ్వాసములోని సానందముని వృత్తాంతము, పంచమాశ్వాసములోని శివరాత్రిమాహాత్మ్యప్రతిపాదకాదిసంగ్రహకథలు వినా కావ్యేతరము. యమపురవర్ణనము (46-72ప.3ఆ.) ప్రతిపురవర్ణనమే. యమపురమునందును బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు, వేశ్యలు, పుష్పలావికలు కలరు! గుణనిధికథ (3-55ప.5ఆ.) శ్రీనాథుని గుణనిధి కథకు నకలు. సానందముని యమ లోకములోని పాపులకు శివసామీప్యము కల్పించుట గ్రంథపరమార్థము.

**కాసె సర్వప్ప** : ఈతని కృతి సిద్ధేశ్వరచరిత్రము. ద్విపదగ్రంథము. అసమగ్రము. అందు ద్వితీయాశ్వాసాదిని ఇట్లు కలదు.

"నాగనాథుని యడ్డ న(ల?) కు మ్రొక్కి చాల
యతని యనుమతి నేకామ్రనాథుండు

మతి మీఱ చెప్పిన కత వచించెదను"

ఏకామ్రనాథుడు చెప్పిన కత ప్రతాపరుద్రచరిత్రము. అందు గ్రంథాదిని ఇట్లు కలదు.

"శ్రీసర్వదేవతామయుండును శ్రీశంభులింగంబునగు నీశ్వరుని
బూజించి నాగనాథుని యడుగులకు మ్రొక్కి ఏకాంబ్రనాథుం డను
వాఁడొక పూర్వకథను నిటుల వచింప నారంభించె."

ఇందలి ఏకామ్రనాథుడు వీరశైవుడైన ఏకామ్రనాథుడని, నాగనాథుడు పశుపతి నాగనాథుడని, ప్రతాపరుద్రచరిత్రము ఎఱ్ఱనయుగములోనిదని, సిద్ధేశ్వరచరిత్రము రాయలయుగములోనిదని కాలనిర్ణయములు కలవు. ప్రతాపరుద్రచరిత్రము ముద్రితగ్రంథము "వీరభద్రదేవుండు కొండవీడున నున్న రాయల కడ కేగుట" వఱకు కలదు. వీరభద్రదేవుడు ప్రతాపరుద్రగజపతి కొడుకు. రాయలు శ్రీకృష్ణదేవరాయలు. కనుక ప్రతాపరుద్రచరిత్రమే రాయలయుగములోని కావ్యము కాకపోవచ్చును.

మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని కాగితపుప్రతియందు శ్రీకృష్ణదేవరాయల, అచ్యుతదేవరాయల విషయము మాత్రమేగాక, మల్లిఖాను అతని కుమారుడు శికందర్ మొదలైన అర్వాచీనుల విషయము కూడ కలదు. అంతేకాదు. ప్రతి తుదిని ఇట్లు కలదు.

"నారాయణరావు గుమాస్తా యిలాకె కననల్ కాలన్ మక్కెంజీ సర్వియర్ జనరల్ అనుమకొండ వోరుగంటిలో దరియాప్తి చేశి వ్రాసినది. తారీఖు ౨౭ నవంబరు... 33 వ ధాతునామసంవత్సరకార్తిక ఱ 30-"

మెకంజీకాలము [285] 1753-1821. కావున పై తారీఖు 20-10-1823 కావలయును. నాటి ప్రతియందు కైఫియ్యతు. కైఫియతు అని కలదు. అందలి ప్రతాపరుద్రచరిత్రము పూర్వకథ ఏకామ్రనాథుడు రచించినదైనను రచనాకాలము పదునాఱవశతాబ్ది కంటె పూర్వము కాదు. తదనుసారి సిద్ధేశ్వరచరిత్రము పదునేడవ లేదా పదునెన్మిదవశతాబ్ది గ్రంథము కావచ్చును. ఏకామ్రనాథుడు ఎఱ్ఱనయుగములోని, సర్వప్ప రాయలయుగములోని కవులు కారు. ఉభయులును క్షీణయుగములోని కవులు.

# ప్రబంధయుగపార్థక్యము

నంది తిమ్మన పారిజాతాపహరణము. అల్లసాని పెద్దన మనుచరిత్రము. శ్రీకృష్ణదేరాయల ఆముక్తమాల్యద. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యము. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము. తెనాలి రామ(లింగ)కృష్ణుని పాండురంగమాహాత్మ్యము. పింగళి సూరన కళాపూర్ణోదయము. ప్రభావతీప్రద్యుమ్నము. భట్టుమూర్తి వసుచరిత్రము మొదలైన రాయలయుగములోని కొన్ని కావ్యములను ప్రబంధము లనుట పరిపాటి. కవులను ప్రబంధకవు లనుట ప్రసిద్ధము. అందువలన రాయలయుగమునకు ప్రబంధయుగమను వ్యవహారము కలదు. అంతేకాదు. ప్రబంధ మొక ప్రక్రియాభేదమను ప్రతిపాదనము [286] కలదు.

## ప్రబంధమొక ప్రక్రియాభేదమా?

అసలు ప్రబంధశబ్దమునకు గ్రంథము, కావ్యము, గేయము, పర్వము, ఆశ్వాసము అను బహ్వార్థములు కలవు.

"పరిష్కారం వినా అశోభా శాస్త్రప్రజ్ఞావతామపి
ఆలోచ్య దుఃఖసీమానం ప్రబన్ధోऽయం నిరూప్యతే"

అని పరిష్కారదర్పణమను తర్కశాస్త్రమునందు కలదు."శాస్త్రప్రజ్ఞావంతులకు గూడ పరిష్కారము లేనిచో ప్రకాశము లేదు. ఈ క్లిష్టస్థితిని ఆలోచించి. ఈ ప్రబంధము నిరూపింపబడుచున్నది" అని తాత్పర్యము. ఈ ప్రబంధమన పరిష్కారదర్పణమను తర్కశాస్త్రమే. తర్కశాస్త్రము ప్రబంధమన గ్రంథమని అర్థము.

"స_ కదాచిదాబద్ధవిదగ్ధమణ్డలః కావ్యప్రబన్ధరచనేన
కదాచిచ్ఛాస్త్రాలాపేన కదాచిదాఖ్యానకాఖ్యాయికేతిహాసపురాణా
కర్ణనేన .............. కదాచిదక్షరచ్యుతకమాత్రాచ్యుతకబిన్దుచ్యుతకాతి
గూఢచతుర్థపాదప్రహేళికాప్రదానాదిభిః ............. సుహృత్పరివృతో
దివసముపనయత్

అని భట్టబాణుని కాదంబరియందు కలదు. ఇందలి కావ్యప్రబంధరచనమన కావ్యగ్రంథరచనమని అర్థము. ప్రబంధమన గ్రంథమే.

ఇటు "కావ్యం పూర్ణవ్యావర్ణితస్వరూపం ప్రబన్ధాః కథా స్తేషాం రచనేన గ్రథ నేన" అని భానుచంద్రుని వ్యాఖ్యానమునందు కలదుగాని, ప్రబంధశబ్దమునకు కథ అను అర్థము కంటె, గ్రంథమను అర్థము గ్రాహ్యము.

భామహుడు, ఆనందవర్ధనుడు, కుంతకుడు, క్షేమేంద్రుడు, రాజశేఖరుడు, మమ్మ టుడు, భోజుడు, విద్యానాథుడు, విశ్వనాథుడు మొదలైన వారి అలంకారశాస్త్రగ్రం థములందు ప్రబంధశబ్దము కావ్యమను అర్థమునందు కలదు. అంతేకాదు. భోజుని చంపూరామాయణమునందు వాల్మీకిరామాయణము ప్రబంధమని కలదు.

"ఏవం ప్రబన్ధం ప్రయోక్తుం క స్సమర్థ ఇతి చిన్తా ముపగతవతి
భగవతి వాల్మీకౌ." 12గ.బా.కాం.

ఇటు రామచంద్రార్యుని వ్యాఖ్యానమునందు ఇట్లు కలదు.

"భగవతి వాల్మీకావేవం ప్రబన్ధం శ్రీమద్రామాయణాఖ్య మేత
త్కావ్యం ప్రయోక్తు మధ్యాపయితుం వా కః పుమాన్ సమర్థోzధి
కారీత్యేవం రూపాం చిన్తాం పర్యాలోచన ముపగతవతి సతి."

ప్రయోగించుటకు సమర్థుడెవడని వాల్మీకి చింతించిన ప్రబంధము తాను రచిం చిన రామాయణమే.

"శుభ మతనుత కావ్యం స్వాదు రామాయణాఖ్యం
మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః." ॥శ్లో.బా.కాం.

ఇటు "-కావ్యం ప్రబన్ధ మతనుత అకరోత్." అని రామచంద్రార్యుని వ్యాఖ్యా నము నందు కలదు. కావ్యమే ప్రబంధమని కరతలామలకము.

భోజుని శృంగారప్రకాశమునందు "స హయగ్రీవవధాదిప్రబన్ధ ఇవ సర్గబన్ధః స్యాత్." అని కలదు. ప్రాకృతభాషలోని హయగ్రీవవధ మొదలైన ప్రబంధములు సంస్కృ తభాషలోని సర్గబంధముల వలె ఆశ్వాసకబంధములని అర్థము. సంస్కృతములోని సర్గ బంధములు, ప్రాకృతములోని ఆశ్వాసకబంధములు, తెలుగులోని ఆశ్వాసబంధములు ప్రబంధములే. ప్రకృష్టమైన బంధము కలది ప్రబంధము.

శ్రీహర్షుని నైషధీయచరితము ప్రబంధమని సంస్కృతగ్రంథమునందు కలదు.

"కవీశః : వాదీన్ద్ర! కిఞ్చిత్ప్రబన్ధరత్నం కురు. తతో నైషధం మహాకావ్యం
బద్ధం దివ్యరసం మహాగూఢవ్యంగ్యభారసారం రాజ్ఞో దర్శితమ్. రాజ్ఞోచే_

సుష్ఠుతమమిదం కేవలం. కాశ్మీరాన్ వ్రజ. తత్రత్య పణ్డితేభ్యో దర్శయ- భారతీ హస్తే చ ముంచ. భారతీచ తత్ర పీఠే స్వయం సాక్షాద్వసతి.
అసత్యం ప్రబన్ధహస్తే న్యస్త మవకరనికరమివ దూరే క్షిపతి. సత్యంతు మూర్ధధూననపూర్వం సుష్ఠ్వితూర్యీకరోతి. ఉపరితః పుష్పాణి పతన్తి."

ఇది రాజశేఖరసూరి ప్రబంధకోశములోనిది. ప్రబంధకోశమను గ్రంథనామము గమనింపదగినది. ఇందు నైషధమహాకావ్యము ప్రబంధరత్నమని కలదు. కావ్య రత్నమని అర్థము.

వ్యాసభారతము "సత్యవాక్ప్రబంధశతసహస్రశ్లోకసంఖ్యాభరితమయిన"దని నన్నయ. వాల్మీకి రామాయణము "ప్రబంధ" మని, తాను రచించు భారతములోని పదియేను పర్వములు "ప్రబంధమండలి" అని తిక్కన. అరణ్యపర్వశేషము "ప్రబంధ" మని ఎఱ్ఱన. బసవపురాణము, పండితారాధ్యచరిత్రము ప్రబంధములని పాలకుఱికి సోమనాథుడు. "ప్రబంధమండలి", "ప్రబంధపరమేశ్వరప్రశంస" అను శీర్షికలను అరయునది. అనుసంధించునది. భారతము ప్రాధాన్యవివక్షను ఇతిహాసమైనను, పర్వమను అర్థమున ప్రబంధమండలి. అనగా పర్వసమూహము. రామాయణము కావ్యము. అదే అర్థమున ప్రబంధము. బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు ప్రత్యేకవివక్షను ద్విపదకావ్యములు. అయినను కావ్యమను అర్థమున ప్రబంధములే.

" చంపూచాటునాటకోదాహరణజయఘోషచక్రవాళచతుర్భద్ర
చతురాతిప్రబంధంబు లాకర్ణించుచు" 118వచ.1ఆ.

అని శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు కలదు. ఇందు చంపువులు, చాటువులు, నాటకములు, లేదా చాటునాటకములు, ఉదాహరణములు, జయఘోషలు (బిరుదుగద్యములు) చక్రవాళములు, చతుర్భద్రములు ప్రబంధములని కలదు. అవి కావ్యములే. చంపువులు మహాకావ్యములు. చాటునాటకోదా హరణాదులు లఘు కావ్యములు. అవి క్షుద్రప్రబంధములని అలంకారశాస్త్రములందు పరిగిణింపబడినది. మహాకావ్యములు మహాప్రబంధములు. లఘుకావ్యములు లఘు ప్రబంధములు. మహచ్ఛబ్దమిట భృశార్థకము.

" వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పిరిట్లు రసబంధురవాగ్విభవాభిరామధౌ

రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కిరే
యేయెడ నన్నపార్యుగతి నిర్ధర నట్టి మహాత్ముఁ గొల్చెదన్." 12.
" ఈ త్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీనరసింహరామచా
రిత్రములున్ బుధవ్రతగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వవాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్." 14ప.1ఆ.

అని జక్కన విక్రమార్కచరిత్రమునందు కలదు. ఇందు సత్ప్రబంధములు చెప్పిన పెద్దలు పదివేవురు కలరు. వారు జక్కనకు పూర్వులు. వారెవ్వరును నన్నయ వలె "రసబంధురవాగ్విభవాభిరామధౌరేయులు, శబ్దశాసనవరేణ్యులు అను ప్రశస్తికి ఎక్కలేదు. ఒక్క నన్నయ మాత్రమే రసబంధురవాగ్విభవాభిరామధౌరేయుడు. శబ్దశాసనవరేణ్యుడు. కారణము భారతము కాబట్టి నన్నయ భారతము సత్ప్రబంధమే. అనగా సత్కావ్యమే. అంతేకాదు. జక్కనకు పూర్వులైన పదివేవురు పెద్దలు చెప్పిన సత్ప్రబంధములును సత్కావ్యములే. ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడై విరచించిన అరణ్యపర్వము. నృసింహ పురాణము. రామాయణము సత్ప్రబంధములే. ఎఱ్ఱన రామాయణము ఆంధ్రప్రబంధమని ఆతని వంశీయుడు. రాయలయుగములోని కవి అయిన చెదలువాడ మల్లన విప్ర నారాయణచరిత్రమునందు కలదు.

" వల్మీకభవు వచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె." 13ప.1ఆ.

ఆంధ్రప్రబంధమన ఆంధ్రకావ్యమే. రాయలయుగములోని మఱొక కవి వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమునందు ఇట్లు కలదు.

" ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమయయన్నపోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటి వారిలోన్."

వెన్నెలకంటి కవులు కొండవీటి సామ్రాజ్యాధిపతి అనపోతారెడ్డికి అంకితమిచ్చినవి సత్ప్రబంధములు. అవి కూడ సత్కావ్యములే. ఎఱ్ఱన యుగములోనివి.

ప్రక్రియాభేదమైన ప్రబంధములనెడు మనుచరిత్రము. శ్రీకాళహస్తిమాహాత్మ్యము. కళాపూర్ణోదయము. వసుచరిత్రము. పాండురంగమాహాత్మ్యములందు- ప్రబంధ

శబ్దము కావ్యశబ్దమును ప్రయుక్తములైనవి. పెద్దన, ధూర్జటి, పింగళి సూరన, భట్టుమూర్తి, తెనాలిరామకృష్ణుడు ప్రభృతులకు కావ్యప్రబంధశబ్దములు పర్యాయ పదములు.

"అని యిష్టదేవతావం
దనసుకవిస్తుతులుఁ గుకవితతినికృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు
ననుకూలకథల్ దలంచు నా సమయమునన్." 10ప.1ఆ.మ.చ.
"ఈ శుభకావ్యరత్నమున కీశు నధీశునిఁ జేసినన్ మహా
దేశికసార్వభౌముఁ డు మదిం బ్రమదంబు వహించి ధూర్జటీ!
నీ శివభక్తి కావ్యసరణిం గడుఁ ధన్యతఁ బొంద నవ్యభా
షాశతథానిగుంభనరసస్థితినొప్పుఁ దలిర్చఁ జెప్పుమా!" 8ప.1ఆ.శ్రీ.కా.మా.
"అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయంబును,
శృంగారరసప్రాయంబును, బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును
నగు కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు" 16వచ.1ఆ.క.పూ.
"అని యిష్టదేవతావందనంబును సుకవితాభినందనంబును
గుకవినిందనంబును గావించి సనాతనాధునాతనాఖిలమహాకవి
జనానుగ్రహంబునంబురాతనపుణ్యశ్లోకరాజర్షివర్ణనాకర్ణనోత్కంఠిత
సకలజనసేవ్యంబగు నొక్క మహాకావ్యంబు రసోచితచమత్క్రియా
కల్పనాకల్పభవ్యంబుగా నొనరింపబూనియున్న సమయంబున"
"వాక్కాంతాశ్రయభట్టరు
చిక్కాచార్యులమహాత్ముశ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తిభజించెద
నిక్కావ్యకళాకలాపమిూడేరుటకున్". 17ప.1ఆ.పాం.రం.మా.

ఇందు మనుచరిత్రము నవీనకావ్యము. శ్రీకాళహస్తిమాహాత్మ్యము శుభకావ్యరత్నము. కళాపూర్ణోదయము మహాకావ్యము. వసుచరిత్రము మహాకావ్యము. పాండురంగ మాహాత్మ్యము కావ్యకళాకలాపము. ఆ యీ కావ్యములందు కొన్నిట "అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన" అని కలదు. మహాకావ్యమే మహాప్రబంధము. కావ్యప్రబంధములు పర్యాయపదములు. కాబట్టి ప్రబంధమన కావ్యమే.

ఎఱ్ఱన హరివంశమునందు ఇట్లు కలదు.

"మందారతరుపుష్పమంజరీమండిత
మస్తకయై యొప్పు మహితవీణ
ప్రసరించి త్రిస్థానబంధురస్థితిభేద
ములతోడ షడ్జంబు మొదలు గాఁగ
సప్తస్వరంబులు సారణావధి నభి
వ్యక్తిమూర్ఛనలతో నతిశయిల్ల
వాయించి మధురదివ్యధ్వని మెఱయఁ జి
త్రప్రబంధోజ్జ్వలతానరచనఁ
బూర్వభువనరక్షణము లాభోగములుగ
నద్భుతావతారంబు లింపారఁ బాడి
యఖిలలోకశరణ్యు దేవాదిదేవు
విష్ణు నలరించె సభ్యులు వేడ్క నలర." 51ప.5ఆ.పూ.భా.

ఇందు నారదుడు మహతిని ప్రసరించి. సప్తస్వరములతోను వివిధమూర్ఛనలతోను వాయించి. చిత్రప్రబంధముల ఉజ్జ్వలమైన తానరచనమున. అవతారగాథలను పాడి విష్ణువును అలరించెనని కలదు. ఉజ్జ్వలమైన తానరచనమునకు ఉద్దిష్టములైన చిత్రప్రబంధములు గేయవిశేషములు. గీతప్రభేదములు.

శ్రీనాథుని కాశీఖండమునందు ఇట్లు కలదు.

"వల్లకిచక్కికాహళము వంశము ఢక్క హుడుక్కఝర్ఝరుల్
ఝల్లరి యాదిగాఁ గలుగు శబ్దపరంపర తాళబద్ధమై
యుల్లసిలం బ్రబంధముల కొప్పుగ నాడుదు రగ్రవేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ బంటుమహీశులు పూజసేయఁగన్." 64ప.1ఆ.

ఇందు పంటుమహీశులు ఈశ్వరుని పూజించునపుడు. పల్లవపాణులు వల్లకిప్రభృతివాద్యవిశేషముల శబ్దపరంపర తాళబద్ధమై తనర. ప్రబంధములకు తగినట్లు అగ్రవేదిపై నృత్యము సేయుదురని కలదు. పల్లవపాణులు నృత్యము సేయుటకు పనికివచ్చు ప్రబంధములు గేయవిశేషములు. గీతప్రభేదములు.

శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యమునందు ఇట్లు కలదు.

"వేడ్క నృత్యంబు లాడిరి వీథులందు
బాడి రొత్తిలి పికకుహూపంచమమునఁ

బంజళంబున ధవళప్రబంధగీతి
కనుమ యవ్వలి కర్ణాటకమలముఖులు." 54ప.2ఆ.

ఇది యజ్ఞదత్తుని భార్య సుశీలకు సీమంతము జరిగిన పిమ్మటి ముచ్చట. ఇందు కర్ణాటాంగనలు పాడిన ధవళప్రబంధము గేయవిశేషము. గీతప్రభేదము.

కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికయందు ఇట్లు కలదు.

"గంధర్వుల్ పదునాల్గు దోషములు దక్కం దాళమానంబులన్
గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిం గావింపఁగా వాద్యముల్
ధింధింధిక్కధిమిక్కతక్కధికతోంధిక్కత్తకోఝుంకిణిం
ధింధాంఝుంకకుఝుక్కుధిగ్ధిగుడధాధీ యంచు మ్రోసె న్వెసన్." 129ప.1ఆ.
గద్యముఁ బద్యముం బెనుపఁ గైకొనుటొండె. ధ్రువాప్రబంధసం
పద్యుతుఁ దౌటయొండె మృదుభాషలఁ బ్రొద్దులు పుచ్చుటొండె. లో
కోద్యమలక్షణం బెఱుఁగుటొండెఁ గడు న్వఁడియించుఁ గాక యే
విద్యలు నేరఁడేనిఁ బృథివిం బశు వాతఁడెగా గణింపఁగన్." 171ప.4ఆ.

ఇందలి ధ్రువాప్రబంధములు గేయవిశేషములే. గీతప్రభేదములే.

అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు ఇట్లు కలదు.

-"ప్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గమ్రకరపంకరుహరత్నకటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప.
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండె." 27ప.2ఆ.

వరూథిని వీణ వాయించుచు ప్రౌఢితో పలికించిన గీతప్రబంధములు గేయవిశేషములే.

శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందు ఇట్లు కలదు.

"శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ జన్దోయి లేఁగౌనుపై
దయఁ దప్పన్ బసపాడి పావడపుఁ బాదంబొప్పఁ జెంగల్వడి
గ్గియ నీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపు లోత్రోవలన్." 56ప.1ఆ.

ద్రవిడాంగనలు పారాయణము సేయు దివ్యప్రబంధములు గేయవిశేషములే. ప్రబంధ శబ్దమునకు తమిళభాషయందు గేయమని అర్థము. తెలుగు భాషయందును ప్రబంధశబ్దమునకు గేయమను అర్థము కలదనుటకు ఇవియెల్ల నిదర్శనములే.

భట్టుమూర్తి వసుచరిత్రమునందు ఇట్లు కలదు.

"గంధగజయాన గీతప్రబంధకలన
నలరి యతి లియ్యమై వచ్చు నరిది మగువ
లార కనుఁ గొంటిరే యను నాళివాక్య
మొకటి విననైన నిదెవేళ యొదవె ననుచు." 80ప.2ఆ.
"అన్నగశేఖరుండును మహామణికూటసమర్పణంబుచేఁ
గిన్నరకోటులన్ నిలిపి గేయవిశారదఁ జేసెఁ గూఁతునుం
గిన్నర మీటు వీణఁ బలికింపఁ గ గీతములుం బ్రబంధముల్
వన్నియఁ బాడఁ జెప్ప ననివారితచాతురి గల్గ నట్లుగన్." 33ప.3ఆ.

ఇందలి గీతప్రబంధములు; గీతములు. ప్రబంధములును గేయవిశేషములే. ఇట్టి ప్రబంధములకు సంగీతశాస్త్రగ్రంథములందు లక్షణములు కలవు. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునందు ప్రబంధలక్షణనిర్దేశము ప్రత్యేక మొక అధ్యాయము. ఏవంవిధమైన ప్రబంధములు కాళిదాసు విక్రమోర్వశీయమునందు కలవు. అవి చర్చరీ. ఖురకా. ద్విప దీ.కుటిలికా.ఖండికాదిప్రబంధములు. కాబట్టి ప్రబంధము గేయము కూడ. తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసమునందు ఇట్లు కలదు.

"అల మహాశ్రీవచనాభిధానమున
నలవడఁ గృతియందు నాదికావ్యంబు
తిరుపతులందు వర్తిలు భాగవతులె
యరయఁ గాఁ గృతకృత్యులను నర్థమొదవ
నెనసి రెండవకృతి యిరువది పాట
దనరార ఘటియించె దంటకం బనఁ గ
ఘనచిత్రకావ్యభాగస్థితి యనఁ గ
ననువొందుచుండ మూడవ ప్రబంధంబు
తలఁ ప మహాతనుదళము లనంగ
నలరె నాల్గవకృతి యైదవకృతియు
ధరణి నెన్నఁ గ నీదు దండకం బనఁ గఁ

గరమొప్ప నాఱ(ల్గ?)వ కావ్యంబు చేసె" 11091-11102పం.7ల.

ఇందు మహాశ్రీవచనము " కృతి" అని కలదు. అనగా అదొక కావ్యము. అందు మఱల ఆదికావ్యము. రెండవకృతి. మూడవ ప్రబంధము , నాల్గవ కృతి. ఐదవ కృతి. ఆఱవ కావ్యము కలవు. కావ్యములోని కృతులు. కావ్యములు. ప్రబంధములు కావ్యములోని భాగములుకావలయును.అవి సంస్కృతకావ్యములోని సర్గములు. తెలుగు కావ్యములోని ఆశ్వాసములు వంటివి. "అందాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అను తిక్కన పరిగణనములోని కృతులు పర్వములు వలె. చిన్నన్న అవాంతరపరిగణములోని కృతులు. కావ్యములు. ప్రబంధములు ఆశ్వాసములు. కాబట్టి ప్రబంధము ఆశ్వాసము కూడ. కతిపయవాక్యసముదాయము కల ప్రకరణము కూడ ప్రబంధమని అలంకారశాస్త్రములందు కలదు.

మొత్తము మీద ప్రబంధశబ్దము ప్రథమతః సర్వగ్రంథసామాన్యవాచి. తదుపరి కావ్యగేయపర్వాశ్వాసవిశేషవాచి. అయినను ప్రబంధ మొక ప్రక్రియాభేదమనుటకు నిర్దేశించిన లక్షణములివి:[287]

"1.స్వతంత్రరచనలు. భాషాంతరీకరణములు కావు.

2. పురాణాంతర్గతోపాఖ్యానములను నిమిత్తములుగా గైకొని. ఆ అస్థిపంజరములను మాంసలములుగా సర్వావయవసుందరములుగా ఉన్మీలితములు చేసిన స్వతంత్రచిత్రణములు. భాషాంతరీకరణము గాని స్వతంత్రరచనయే ప్రబంధమున కాయువుపట్టు.

3. ఆలంకారికశైలి. అర్థాతిశాయియైన శబ్దము.

4. ప్రాయికముగా శృంగారరసప్రాధాన్యము.

5. ఇతర ఆలంకారికప్రబంధలక్షణములు:

i అష్టాదశవర్ణనాభూయిష్ఠము.

ii ఉదాత్తేతివృత్తము; ఉత్తమనాయకాశ్రితము.

iii ఏకనాయకాశ్రయము. ఇది ప్రబంధములను పురాణేతిహాసముల నుండియు అనిబద్ధకావ్యముల నుండియు వేఱు చేయును.

iv రసప్రాధాన్యము.

v నాటకమునందు వలె ముఖము నుండి నిర్వహణసంధి వఱకు

వికాసము సక్రమముగా జరుగవలెను. (వామనుఁ డీ లక్షణమును ప్రబంధమునకుఁ జెప్పెను. ధ్వన్యాలోకకారుఁ డు దీనిని కావ్యశరీరబంధమనెను.)

vi ఆశ్వాసవిభాగప్రయుక్తము.

ఇందు ఆశ్వాసవిభాగము వినా అన్ని లక్షణములును సంస్కృతకావ్యలక్షణములే. సంస్కృతకావ్యము సర్గవిభాగప్రయుక్తము. తెలుగు కావ్యము ఆశ్వాసవిభాగప్రయుక్తము. సర్గము, ఆశ్వాసము సమానమే. ధ్వన్యాలోకకారుడు కావ్యశరీరబంధమనిన, వామనుడు చెప్పిన ప్రబంధలక్షణము, సంస్కృతనాటకపంచసంధిప్రస్థానము సంస్కృతకావ్యలక్షణములే. రసప్రాధాన్యము, ఏకనాయకాశ్రయము, ఉత్తమనాయకాశ్రితము, ఉదాత్తేతివృత్తము, అష్టాదశవర్ణనాభూయిష్ఠమును సంస్కృతకావ్యలక్షణములే. అంతే కాదు.ఆలంకారికప్రబంధలక్షణములేవియైనను సంస్కృతకావ్యలక్షణములే.

కాళిదాసు కుమారసంభవము, మాఘుని శిశుపాలవధము, బిల్హణుని విక్రమాంకదేవచరితము, శ్రీహర్షుని నైషధీయచరితము శృంగారరసప్రాధాన్యమునకు శృంగగ్రాహికలు. కాబట్టి "ప్రాయికముగా శృంగారరసప్రాధాన్యము"ను సంస్కృతకావ్యలక్షణమే.

ఆలంకారికశైలి అను పదబంధము ఆర్నేట్‌స్టైల్ అను ఇంగ్లీషు మాటకు అనుకరణము. అర్థాతిశాయియైన శబ్దమన అర్థమును మించిన శబ్దము. అర్థగౌరవము కంటె శబ్దసౌందర్యము సమధికమైన శైలిని ఆలంకారికశైలి అనవచ్చును. భట్టబాణుని కాదంబరి, దండి దశకుమారచరితము, మాఘుని శిశుపాలవధము, శ్రీహర్షుని నైషధీయచరితము ఆలంకారికశైలికి ఆటపట్టులు. కాబట్టి ఆలంకారికశైలియును సంస్కృతకావ్యలక్షణమే.

"పురాణాంతర్గతోపాఖ్యానములను నిమిత్తములుగా గైకొని, ఆ అస్థిపంజరములను మాంసలములుగా సర్వావయవసుందరములుగా ఉన్మీలితములు చేసిన స్వతంత్రచిత్రణము ఇతివృత్తప్రపంచీకరణము. కుమారసంభవకథ వాల్మీకిరామాయణమునందు కలదు. కిరాతార్జునీయకథ, శిశుపాలవధకథ, నలోపాఖ్యానము భారతమునందు కలవు. అవి నిమిత్తములుగా గైకొని, ఆ అస్థిపంజరములను మాంసలములుగా సర్వావయవసుందరములుగా ఉన్మీలితములు చేసిన స్వతంత్రచిత్రణములే కాళిదాసు కుమారసంభవము, భారవి కిరాతార్జునీయము, మాఘుని శిశుపాలవధము, శ్రీహర్షుని నైషధీయచరితము మొదలైన సంస్కృతకావ్యములు.

భారతరామాయణములు కావ్యేతిహాసములు మాత్రమేగాక, పురాణములు కూడ. కాబట్టి ఇతివృత్తప్రపంచీకరణమును సంస్కృతకావ్యలక్షణమే.

సంస్కృతకావ్యములెల్ల స్వతంత్రరచనలు-భాషాంతరీకరణములు కావు. కాబట్టి స్వతంత్రరచన లగుట, భాషాంతరీకరణములు కాకపోవుట సహితము సంస్కృతకావ్య లక్షణములే.

పయి లక్షణములలోని "ఏకనాయకాశ్రయము" పల్లవికి, "వస్త్వైక్యము" అనుపల్లవి. [288]: ఇది అలంకారశాస్త్రప్రోక్తమైన కావ్యలక్షణము కాదు. ఆధునికవిమ ర్శప్రోక్తమైన కథాలక్షణము. [289]:

> "ఐక్యమను లక్షణము"
> కళాపూర్ణోదయముతో నుపమింపఁ దగినది. మూలము స్కంధము సామాన్యములయ్యు, వివిధగతుల దెసల వ్యాపింప శాఖోపశాఖలు గలిగి కనుపండువుగ నుండు మహావృక్షము. సామాన్యప్రబంధములు కొలుకులు ఒక దాని వెంట నింకొకటి యతికించుటచే నేర్పడిన గొలుసుల వంటివి. ఐక్యము వీనిలో లేదు. ఎన్ని కొలుకులైనఁ జేర్పవచ్చును. ఎన్నియైనఁ దీసి వేయవచ్చును. వైపుల్యము దక్క నింకెద్దానికిని లాభనష్టము లుండవు. ఆకృతి మాఱదు. వృక్షములు మొదలగు సజీవముల వలె నుండు కావ్యముల నే యంగమునైన భేదించుటకుఁ గాదు. నూతనాంశములఁ జేర్చుటకుఁ గాదు. ఎట్లు చేసినను పరిమాణభేదమే గాదు, ఆకారమును వికృతమగును ఐక్య మను కథాలక్షణమును పరీక్షించు పద్ధతి యేమనంగా ఉన్న భాగములం దీసివేయవచ్చునా? క్రొత్తవి యేమైనను జేర్పవచ్చునా యని విమర్శించుట. ఈ కార్యములు పొసగనివైన నైక్యము స్ఫుటము. సాధ్యములైన నైక్యభావ మపక్వము."
> ఇది అరిస్టోటిల్ పొయిటిక్సును అనుసరించినది. అందిట్లు కలదు. [290]

"The unity of plot does not consist, as some suppose, in having one man as subject , for the number of incidents that befall the individual is endless, and some of them cannnot be reduced to unity. In an epic or tragedy, the plot, which is an imitation of an action, must represent an action that is originally unified, the structural order of the incidents being such that transposing or removing any one of them will dislocate and disorganise the whole. Every part must be necessary,

and in its place, for a thing whose presence or absence makes no perceptible difference is not an organise plot of the whole."

ఇందు ఉన్న భాగములు తీసివేసినను, లేని భాగములు చేర్చినను భంగము లేనిచో వస్త్వైక్యము లేదని మాత్రమేగాక, ప్రతిభాగమును అవశ్యకమై ఉండి తీరవలయునని కలదు. అష్టాదశవర్ణనాభూయిష్ఠములైన సంస్కృతాంధ్రకావ్యములందు వస్త్వైక్యము గగనకుసుమము. ఒక్క పింగళి సూరన కళాపూర్ణోదయమునందు -అది కూడ ఆరవ ఆశ్వాసము 201 వ పద్యము వఱకు- మాత్రమే- వస్త్వైక్యము కలదు.

రాయలయుగములోని కవులకు సంస్కృతకవులే ప్రథమగణ్యులు. సంస్కృత కావ్యములే ఆదర్శములు. సంస్కృతాలంకారశాస్త్రములే ప్రమాణములు. సంస్కృతాలం కారశాస్త్రసంబంధము లేని తెలుగు అలంకారశాస్త్రము లేనేలేదు. సంస్కృతకావ్యములెల్ల స్వతంత్రరచనలు. అనగా స్వతంత్రకావ్యములు. ఆంధ్రకావ్యము లన్నియును స్వతం త్రకావ్యములు కావు. స్వతంత్రమో, అస్వతంత్రమో, స్వతంత్రాస్వతంత్రమో ఆంధ్రీకర ణములు కలవు. అవి రాయలయుగమునకు పూర్వము బహుళము. రాయల యుగము నందు విరళము. శివకవియుగములోని పాలకుఱికి సోమనాథుని బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, ఎఱ్ఱనయుగములోని ఎఱ్ఱన నృసింహపురాణము; శ్రీనాథ యుగములోని శ్రీనాథుని హరవిలాసము (గౌరీక ల్యాణమువినా) భీమేశ్వరపురా ణము, శివరాత్రిమాహాత్మ్యము, పలనాటివీరచరిత్రము; గౌరన హరిశ్చంద్రోపాఖ్యా నము; పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శాకుంతలము మొదలైనవి స్వతంత్రకావ్యములే. రాయల యుగములోని కావ్యములు చాలవఱకు స్వతం త్రకావ్యములే. అవి ప్రక్రియా భేదమను ప్రబంధములు కావు. కావ్యపర్యాయవాచియైన ప్రబంధములు. అంతేకాదు. సంస్కృతకావ్యములకు సహోదరములు. భాషాభేదము, ఛందోభేదము ప్రక్రియాభేదము కాదు. కాబట్టి ప్రబంధ మొక ప్రక్రియాభేదము కాదు. స్వతంత్రకావ్యము. ఈ అర్థమున పారిజాతాపహరణము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, శ్రీకాళహస్తిమాహాత్మ్యము, రామాభ్యుదయము, పాండురంగమాహాత్మ్యము, కళాపూర్ణోదయము, ప్రభావ తీప్రద్యుమ్నము వసుచరిత్రము మొదలైనవి ప్రబంధములు. కవులు ప్రబంధకవులు. రాయలయుగము ప్రబంధయుగము.

# స్వర్ణయుగసార్థక్యము

రాయల యుగము స్వర్ణయుగము. స్వర్ణమన బంగారము. బంగారము విలువైనది. విలువైన సాహిత్యము వికసించిన కాలము స్వర్ణయుగము. స్వర్ణయుగకర్త శ్రీకృష్ణదేవరాయలు. శ్రీకృష్ణదేవరాయల మహాకవిపోషణము, మహాకావ్యరచనము మార్గదర్శకమైనది రాయల యుగము. శ్రీకృష్ణదేవరాయల మహాకవిపోషణము పూర్వోక్తము. శ్రీకృష్ణదేవరాయలు అను శీర్షికను అరయునది. అనుసంధించునది. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమును నవరత్నకవులు. అష్టదిగ్గజకవులు అలంకరించుట కూడ పూర్వోక్తము. నవరత్నకవులు. అష్టదిగ్గజకవులు అను శీర్షికలను అరయునది. అనుసంధించునది. శ్రీకృష్ణదేవరాయల మహాకవిపోషణ మదియెల్ల రాయల యుగములోని రాజులకు ఆదర్శము. ఇతరులకు ఆరాధ్యము. కవులకు ఉద్దీపకము.

రాయల యుగములోని నంది తిమ్మన పారిజాతాపహరణము, అల్లసాని పెద్దన మనుచరిత్రము. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యము. శ్రీకాళహస్తీశ్వరశతకము; మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రము. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము. తెనాలి రామ(లింగ)కృష్ణుని ఉద్భటారాధ్యచరిత్రము. పాండురంగమాహాత్మ్యము. ఘటికాచలమాహాత్మ్యము; పింగళి సూరన రాఘవపాండవీయము. కళాపూర్ణోదయము. ప్రభావతీప్రద్యుమ్నము; భట్టుమూర్తి వసుచరిత్రము. హరిశ్చంద్రనలోపాఖ్యానము; సంకుసాల నృసింహాకవి కవికర్ణరసాయనము. కందుకూరి రుద్రయ జనార్దనాష్టకము. నిరంకుశోపాఖ్యానము. సుగ్రీవవిజయము ప్రథమశ్రేణిని ప్రసిద్ధము. మాడయ మైరావణచరిత్రము. చరిగొండ ధర్మన చిత్రభారతము. నాదిండ్ల గోపన కృష్ణార్జునసంవాదము. చింతలపూడి ఎల్లన రాధామాధవము. తారకబ్రహ్మరాజీయము. విష్ణుమాయానాటకము; ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రము. తాళ్లపాక వారి కృతులు. పచ్చకప్పురపు తిరువేంగళనాథుని చొక్కనాథుని చరిత్రము. నారన సూరన ఉదయనోదయము. రాయపరాజు రంగరాజు సాంబోపాఖ్యానము. అద్దంకి గంగాధరుని తపతీసంవరణము. చెదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రము. ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రము. తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రము మొదలైనవి ద్వితీయశ్రేణిని ప్రఖ్యాతము.

పారిజాతాపహరణములోని సత్యభామాశ్రీకృష్ణుల వృత్తాంతము. మనుచరిత్ర

ములోని వరూథినీప్రవరవృత్తాంతము. ఆముక్తమాల్యదలోని విష్ణుచిత్తుని వృత్తాంతము. గోదాదేవీవృత్తాంతము. మాలదాసరి వృత్తాంతము; శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని శ్రీకాళహస్తుల వృత్తాంతములు. తిన్నని వృత్తాంతము. నత్కీరుని వృత్తాంతము; రాజశేఖరచరిత్రములోని కాంతిమతీరాజశేఖరుల వృత్తాంతము. రామాభ్యుదయములోని దశరథుని వృత్తాంతము. సీతారాముల వృత్తాంతము; ఉద్భటారాధ్యచరిత్రములోని ఉద్భటుని వృత్తాంతము. మదాలసావృత్తాంతము; పాండురంగమాహాత్మ్యములోని రాధాదేవీవృత్తాంతము. నిగమశర్మవృత్తాంతము. అయుతనియుతుల వృత్తాంతము; ఘటికాచలమాహాత్మ్యములోని నారదుని పూర్వజన్మవృత్తాంతము. కళాపూర్ణోదయములోని కలభాషిణీమణికంధరుల వృత్తాంతము. నారదతుంబురుల వృత్తాంతము. రంభానలకూబరద్వయవృత్తాంతము. సుగాత్రీశాలీనుల వృత్తాంతము. సరస్వతీచతుర్ముఖుల వృత్తాంతము. సుముఖాసత్తీమణిస్తంభుల వృత్తాంతము. అభినవకౌముదీవృత్తాంతము. మధురలాలసాకళాపూర్ణుల వృత్తాంతము. అలఘువ్రతుని వృత్తాంతము. సుగ్రహుని వృత్తాంతము. మణిహారవృత్తాంతము. ప్రభావతీప్రద్యుమ్నములోని శుచిముఖీవృత్తాంతము. ప్రభావతీప్రద్యుమ్నుల వృత్తాంతము; వసుచరిత్రములోని శుక్తిమతీకోలాహలవృత్తాంతము. గిరికావసురాజుల వృత్తాంతము. చిత్రభారతములోని చతుర్దనుని వృత్తాంతము. రాధామాధవములోని రాధామాధవుల వృత్తాంతము. తారకబ్రహ్మరాజీయములోని తైర్థికభూసురుని వృత్తాంతము. విష్ణుమాయానాటకములోని సత్యాలక్ష్మీబ్రహ్మశివనారదగర్వభంగవృత్తాంతములు. కవికర్ణరసాయనములోని విమలాంగీమాంధాతల వృత్తాంతము. మల్హణచరిత్రములోని పద్మగంధీమల్హణుల ప్రేమవృత్తాంతము. సాంబోపాఖ్యానములోని సిద్ధాంతదర్పణగురువు వృత్తాంతము. నిరంకుశోపాఖ్యానములోని నిరంకుశుని వృత్తాంతము. తపతీసంవరణములోని తపతీసంవరణుల వృత్తాంతము. విప్రనారాయణ చరిత్రములోని దేవదేవీవిప్రనారాయణుల వృత్తాంతము. రుక్మాంగదచరిత్రములోని మోహినీరుక్మాంగదుల వృత్తాంతము. చంద్రభానుచరిత్రములోని కుముదినీచంద్రభానుల వృత్తాంతము రసవత్తరములు.

పారిజాతాపహరణములోని సత్యభామ. మనుచరిత్రములోని వరూథినీప్రవరులు. ఆముక్తమాల్యదలోని విష్ణుచిత్తుడు. మాలదాసరి; శ్రీకాళహస్తి మాహాత్మ్యములోని నత్కీరుడు. కళాపూర్ణోదయములోని కలభాషిణి. సుగాత్రీశాలీనులు. సరస్వతీ చతుర్ముఖులు; ప్రభావతీప్రద్యుమ్నములోని శుచిముఖి. పాండురంగమాహాత్మ్యములోని నిగమశర్మ అక్క; నిరంకుశోపాఖ్యానములోని నిరంకుశుని భార్య సజీవపాత్రలు.

ముక్కు తిమ్మన ముద్దుపలుకులు. అల్లసాని పెద్దన అల్లిక జిగిబిగి. శ్రీకృష్ణదేవరా

యల వర్ణనావైదగ్ధి, ధూర్జటి పల్కుల అతులితమాధురీమహిమ, మాదయగారి మల్లన ధారాశుద్ధి, అయ్యలరాజు రామభద్రుని వర్ణనాతిశయము, తెనాలి రామ(లింగ)కృష్ణుని పదగుంభనము, పింగళి సూరన ద్వికథాసంధానము, అపూర్వకథాసంవిధానవైచిత్రి, శృంగారరసవైవిధ్యము; భట్టుమూర్తి సంగీతసాహిత్యసమ్మేళనము, సంకుసాల నృసింహకవి యతివిటవ్యత్యయీకరణము, కందుకూరి రుద్రయ కల్పనాపాటవము మొదలైనవి ప్రత్యేకతలు.

రసవత్తరమైన రచనము, సజీవపాత్రచిత్రణము, శైలీమాధుర్యము, వర్ణనా వైదగ్ధ్యము, కథాసంవిధానవైచిత్ర్యము, శృంగారరసవైవిధ్యము, కల్పనా పాటవము మొదలైనవి సాహిత్యపు విలువలు. అవి పుష్కలములైన, రసపుష్కరములైన రచనలకు రాయల యుగము కాణాచి.

మనుచరిత్రము, వసుచరిత్రము, ఆముక్తమాల్యద, రాఘవపాండవీయము లేక పాండురంగమాహాత్మ్యము తెలుగు పంచకావ్యములందు పరిగణింపబడినవి. కళాపూర్ణోదయము ప్రపంచకావ్యములందు పరిగణింపదగినది.

రాయల యుగములోని కావ్యములు చాలవఱకు స్వతంత్రకావ్యములు. కథా మూలమే కాని, కవితామూలము లేని కావ్యము స్వతంత్రకావ్యము. కథామూలమును లేని కావ్యము సర్వతంత్రస్వతంత్రకావ్యము. మౌలికమైన మహాకావ్యము. పారిజాతాపహరణము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, శ్రీకాళహస్తిమాహాత్మ్యము, రాజశేఖరచరిత్రము, రామాభ్యుదయము, పాండురంగమాహాత్మ్యము; వసుచరిత్రము, కవికర్ణరసాయనము, నిరంకుశోపాఖ్యానము మొదలైనవి స్వతంత్రకావ్యములు. కళాపూర్ణోదయము సర్వతంత్రస్వతంత్రకావ్యము. మౌలికమైన మహాకావ్యము. స్వతంత్ర కావ్యముల స్వర్ణఖని రాయలయుగము.

పూర్వయుగముల లోని ద్విపదకావ్యములు, కథాకావ్యములు, లఘుకావ్యములు, వచనములు మొదలైన ఇతరప్రక్రియలును రాయలయుగమునందు రాజిల్లినవి. అందు కథాకావ్యములు మాత్రమే ఆంధ్రీకరణములు. కడమ రచనములెల్ల స్వతంత్ర రచనలే. లఘుకావ్యములందు యక్షగానము నూతనప్రక్రియావిశేషము. అది కూడ స్వతంత్రరచనమే. ప్రక్రియావైవిధ్యము కంటె స్వతంత్రకావ్యరచనమే రాయల యుగము ప్రత్యేకత.

కవులకు ముత్యాల పందిరి, కవితలకు రత్నాల మేల్కట్టు, స్వతంత్రకావ్యములకు స్వర్ణఖని అయిన రాయలయుగము సార్థకముగ స్వర్ణయుగము.

# సంఖ్యాసూచిక

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము. మూడవ సంపుటము. 1959. పుటలు 369-378.
2. పైది. పుటలు 378-387.
3. పైది. పుటలు 387-409.
4. పైది. పుటలు 409-427.
5. పైది. పుట 388.
6. కృష్ణదేవరాయలు. 1972. పుట 20.
7. ఆంధ్రకవితరంగిణి. సప్తమసంపుటము. 1963. పుట 68.
8. ఆరువలె. పుట 34.
9. పైది. పుటలు 35,51-52.
10. పైది. పుట 30.
11. పైది. పుటలు 38-39.
12. లక్ష్మణరాయవ్యాసావళి. 1923. పుట 42.
13. పైది.
14. ఆరువలె. పుట 43.
15. ఏడువలె. పుట 107.
16. పైది. పుట 108.
17. పైది. పుట 110.
18. పైది. పుట 109.
19. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము. 1963. పుటలు 103-104.
20. ఆరువలె. పుట 72.
21. ఏడు వలె. పుటలు 141-142.
22. సాహిత్య సంపద. 1989. పుటలు 245-246.
23. పైది. పుట 246.
24. పైది. పుట 237.
25. పైది.
26. పైది. పుట 247.
27. పైది. పుట 61.
28. పైది. పుట 215.
29. పైది. పుట 211.
30. పైది. పుటలు 211-213.
31. పైది. పుటలు 215-216.
32. పైది. పుటలు 220-226.

33. ఉద్భటారాధ్య చరిత్రము. 1926. పీఠిక. పుటలు 1-5.
34. పాండురంగమాహాత్మ్యము. 1988. పీఠిక. పుటలు. ix-xxii
35. ఇరువది రెండు వలె. పుట 236.
36. పైది. పుటలు 245-247.
37. విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము. ద్వితీయభాగము. 1939. పుట 206. అథసూచిక.
38. పైది. పుట 218.
39. తెలుగు సాహిత్యచరిత్ర. ప్రథమభాగము. 1991. పుట 245.
40. క. కవిజీవితములు. 1955. పుట 245.
చ. ఏడు వలె. పుటలు 252-253.
41. ముప్పదియేడు వలె. పుటలు 225-230.
42. కన్నడ సాహిత్యచరిత్ర. 1977. పుట 109.
43. ముప్పదియేడు వలె. పుటలు 221-234.
44. పారిజాతాపహరణపర్యాలోచనము. 1973. పుటలు 41-43.
45. ఒకటే వలె. పుట 820.
46. నలుబది నాలుగు వలె. పుటలు 51-76.
47. నలుబది రెండు వలె. పుట 134.
48. ఆంధ్రవాగ్గేయకారచరిత్రము. 1958. పుట 141.
49. ముప్పది తొమ్మిది వలె. పుటలు 410-411.
50. నలుబది రెండు వలె. పుటలు 108,107.
51. ముప్పదియేడు వలె. పుట 218.
52. అల్లిక జిగిబిగి. 1967. పుటలు 6-8, 15-35.
53. స్వారోచిషమనుచరిత్రము. 1928. కథావిమర్శనము. పుట 36.
54. ఏబది రెండు వలె. పుట 60.
55. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము 23. సంచిక6. పుటలు 246-247.
56. మనుచరిత్రము. 1968. పీఠిక. పుటలు 33-34.
57. ఏబది రెండు వలె. పుట 2.
58. ఏడువలె. మూడవసంపుటము. 1959. పుట 48.
59. పైది. సప్తమసంపుటము. పుటలు 216-218.
60. పైది. పుట 58.
61, పైది. పుట 127.
62. చాటుపద్యములు. ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథాలయములోని తాళపత్ర గ్రంథము. MS T 181C 49-1.
63. శ్రీకాళహస్తిమాహాత్మ్యము. 1930. మొదటికూర్పు పీఠిక. పుట 8.
64. చాటుపద్యమణిమంజరి. ద్వితీయభాగము. 1922. పుట 74; 1952. పుట 200.

65. ముప్పదియేడు వలె. పుట 47.
66. A History of South India. 1984. P. 392.
67. క. ఆముక్తమాల్యద. 1954. ఆముక్తమాల్యదాకర్తృత్వము. పుటలు 1-29.
చ. పైది. 1964. పీఠిక. పుటలు 23-26.
68. ముప్పదితొమ్మిది వలె. ద్వితీయభాగము. 1992. పుట 271.
69. ఏబదియైదు వలె. సంపుటము 24. సంచిక 4. పుట 21.
70. పండ్రెండు వలె. పుటలు 33-34.
71. ఏబదియైదు వలె. సంపుటము 1. సంచిక 3. పుట 76.
72. ఆదర్శసార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు. సంపుటము I. పుటలు 136-148.
73. As 66. P. 283.
74. ఏడు వలె. పుటలు 108-109.
75. ముప్పదియేడు వలె. పుటలు 323-324&335.
76. The Tamil Element in Telugu Literature. Typed copy. P. 146.
(Ph.D Thesis of Madras University)
77. As 66. PP 190, 198-199, 217-221.
78. Ibid P. 217.
79. పందొమ్మిది వలె. పుట 229.
80. డెబ్బదియారు వలె.
81. The Vijayanagara Empire. 1977. P. 145.
82. ఏడు వలె. పుట 192.
83. పైది. పుట 233-235.
84. పైది. పుట 242.
85. రాజశేఖరచరిత్రము. 1967. ఉపోద్ఘాతము. పుటలు viii-xi
86. ఒకటి వలె. పుట 398.
87. ఏడువలె. పదియవసంపుటము. 1953. పుట 9.
88. పైది. పుట 7.
89. శతకసంపుటము. అక్షయ. పీఠిక. పుటలు 1-3.
90. ఏడు వలె. ఆఱవ సంపుటము. 1961. పుటలు 7-12.
91. పైది. పుట 8.
92. పైది. పుట 7.
93. పైది.
94. పైది. పదియవ సంపుటము. 1953. పుటలు 12-13.
95. రామాభ్యుదయము. 1967. పీఠిక. పుట xxxiii.
96. ఏడు వలె. పదియవ సంపుటము. 1953. పుట 13.
97. పైది. పదకొండవ సంపుటము. 1954. పుట 152.

98. తొంబదియైదు వలె. పుట xxxi
99. క. ఏడు వలె. పదియవసంపుటము. 1985. పుటలు 13-15.
చ. రామాభ్యుదయవైభవము. 1985 పుటలు44-48.
100. తెలుగు వాఙ్మయము-సంగ్రహచరిత్ర. 1960. పుటలు 113,118.
101. శ్రీనాథుండు. 1972. పుట 256.
102. తొంబదితొమ్మిది. చ. వలె. పుట 103. అథస్సూచిక. 32.
103. కవిత్వతత్త్వవిచారము. 1947. పుటలు 18-19
104. ఆంధ్రకవులచరిత్రము. ద్వితీయసంపుటము. 1986. పుటలు 147-148.
105. పైది. పుట 171.
106. నలుబది క. వలె. పుటలు 239-243.
107. ఈ గ్రంథము. పుటలు 94-95
108. ముప్పదిమూడు వలె. 1926. పీఠిక. పుటలు I-VI.
109. ముప్పది నాలుగు వలె. 1988. పీఠిక. పుటలు ix-xxxiii
110. ముప్పదిమూడు వలె. 1926. పీఠిక. పుట I
111. పైది. 1974. పీఠిక. పుటలు 159-161.
112. నూట నాలుగు వలె.
113. పైది. పుటలు 172-173.
114. ఒకటి వలె. పుట 410.

115. పైది. పుట 412.
116. సంస్కృతవాఙ్మయచరిత్ర.ద్వితీయసంపుటము.1961. పుట 361.
117. వాఙ్మయవ్యాసమంజరి. 1967. పుటలు 125-127.
118. నూటపదారు వలె. పుట 308.
119. పైది. పుట 364.
120. ముప్పదిమూడు వలె. 1974. పీఠిక. పుటలు 140,141 నడుమ శాసనప్రతిబింబము.
121. పైది. 1926. పీఠిక. పుట vii అథస్సూచిక.
122. పైది. 1974. పీఠిక. పుట 142.
123. ఆరు వలె. పుట 83.
124. శాసన పద్యమంజరి ప్రథమభాగము. 1930. పుటలు 101-102.
125. ముప్పదిమూడు వలె. 1926.పీఠిక. పుట 13.
126. ఏడు వలె. ఎనిమిదవ సంపుటము. 1972. పుట 13.
127. నూటపదియేడు వలె. పుట 115
128. ముప్పదిమూడు వలె. 1974. పీఠిక. పుట 21.
129. నూటపదియేడు వలె. పుటలు 121-122.

130. పైది. పుట 123.
131. పైది.
132. పైది. పుటలు 120-121.
133. పైది. పుట 120.
134. పైది. పుటలు 119-120.
135. ఏడు వలె. ఎనిమిదవసంపుటము. 1972. పుట 18.
136. పైది. పుట 21.
137. As 66. P. 296.
138. ఒకటి వలె. పుట 398.
139. క. అరువది నాలుగు వలె. ప్రథమభాగము. 1913. పుటలు 101-109.
చ. చాటు పద్యరత్నాకరము. 1961. పుటలు 14-19, 24-27, 48-50.
140. అరువది నాలుగు వలె. ద్వితీయభాగము. 1952. పుట 124.
141. ముప్పదిమూడు వలె. 1974. పీఠిక. పుటలు 35-36.
142. నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?! 1983. పుటలు 191-192.
143. ముప్పది మూడు వలె. 1974. పీఠిక. పుట 39.
144. నూటతొమ్మిది వలె. 1952. గ్రంథపరిచయము. పుటలు 14-16.
145. సారస్వతాలోకము. 1964. పుటలు 74-83.
146. పైది. పుట 83.
147. ఘటికాచలమాహాత్మ్యము. 1969. ఉపోద్ఘాతము. పుట 15.
148. పైది. పుటలు 34-35.
149. ముప్పదినాలుగు వలె. 1988. పీఠిక. పుట xxx.
150. పైది. 1984. ఉపోద్ఘాతము. పుటలు 17-18.
151. పైది. 1988. పీఠిక. పుట xxvii
152. As 66. PP 432-433.
153. ప్రాక్పశ్చిమతత్త్వశాస్త్రము. ప్రథమ సంపుటము. 1961. పుట 378.
154. పైది. పుటలు 369-70.
155. The Cultural Heritage of India. Vol.IV. 1983. PP 360-361, 363.
156. Ibid. P. 357.
157. ముప్పది నాలుగు వలె. 1984. ఉపోద్ఘాతము. పుట 17.
158. నూటనలుబదియేడు వలె. ఉపోద్ఘాతము. పుట 63.
159. ఏడు వలె. పదియవ సంపుటము. 1953. పుట 108.
160. నూటయిరువది నాలుగు వలె. పుటలు 108-110.
161. As 66. P.298.
162. నూటనాలుగు వలె. ద్వితీయసంపుటము. 1986. పుట 118.
163. నూట పదాఱు వలె. ద్వితీయసంపుటము. 1961. పుట 305.

164. రాఘవ పాండవీయము. 1968. ఉపోద్ఘాతము. పుటలు 11-17.
165.
హరిశ్చంద్రనలోపాఖ్యానము. 1953. పీఠిక. పుటలు 128-130.
166. A. Pingali Surana. PP 78-83.
క. భారతి. 1941. డిశంబరు.
చ. పైది. 1947. ఏప్రిల్. పుటలు 313-318.
B. Studies in Kalapurnodayam. 1956.PP 36-77.
167. లింగపురాణమ్. 1980. Introduction. PP ix-xi
168. నూట మూడు వలె.
169. పైది. పుటలు 130-131.
170. పైది. పుటలు 142-145.
171. సంస్కృతి. ఏప్రిల్ సంచిక నుండి పునర్ముద్రితము.
172. ఆంధ్రసాహిత్య చరిత్ర. (లిఖితము)
173. నూటమూడు వలె. పుటలు 214-224.
174. నూట నలుబదియైదు వలె. పుటలు 1-28.
175. నూటపదారు వలె. పుట 308.
176. భారతి. 1959. ఆగస్టు. పుటలు 13-19.
177. గౌతమవ్యాసములు. 1964. పుటలు 172-173.
178. నలుబది. క. వలె. పుటలు 367-368.
179. నూట నాలుగు వలె. పుటలు 131-141.
180. వసుచరిత్ర విమర్శనము. 1965. పుటలు 65-72.
181. నూటనాలుగు వలె. పుటలు 131-141.
182. ఒకటి వలె. పుటలు 398,406.
183. As 66.P.296.
184. ఒకటి వలె. పుట 409.
185. నూటయెనుబది వలె. పుటలు 77-80.
186. పైది. పుట 99.
187. A. Journal of Sree Venkateswara Oriental Institute Vol.III. No.2. PP 25-30.
క. వసుచరిత్రము. 1948. పీఠిక. పుటలు 2,12.
188. పై క. వలె. పుట 10.
189. పైది. పుట 6.
190. Biographical Sketches of the Deccan Poets. 1975. PP 50-52.
191. నూటయెనుబది వలె. పుటలు 96-98.
192. భూషణకిరణావళి. 1972. పుటలు 141-149.
193. పైది. పుట 151.

194. పైది. పుటలు 152-153.
195. పైది. పుట 162.
196. పైది. పుట 161.
197. పైది. పుటలు 176-182.
198. నూటనాలుగు వలె. పుటలు 147-148.
199. నూటయెనుబది వలె. పుట 25.
200. నూట యెనుబదియేడు క వలె. పుట 7.
201. ఏడు వలె. ఆఱవ సంపుటము. 1961 పుట 262.
202. ఒకటి వలె. పుట 387.
203. ముప్పదియేడు వలె. పుటలు 29,30.
204. అరువది నాలుగు వలె. ప్రథమ భాగము. పుటలు 49-62.
205. క. పైది. ప్రథమభాగము. పుట 64. ద్వితీయభాగము. 1922. పుట 107.
చ. ఏడు వలె. ఆఱవ సంపుటము. 1961. పుటలు 263-264.
206. ముప్పదియేడు వలె. పుట 36.
207. ఒడియా సాహిత్యచరిత్ర. 1980. పుటలు 18-20.
208. ఏడు వలె. ఎనిమిదివ సంపుటము. 1972. పుటలు 121-127.
209. పైది. పుటలు 21-22.
210. పైది. పుటలు 17-18.
211. నూటపదియేడు వలె. పుట 81.
212. క. భారతి. 1949. పుటలు 21-22.
చ. వరాహపురాణము. 1978. పీఠిక. పుట5.
213. ఒకటి వలె. పుటలు 364-367.
214. కృష్ణార్జునసంవాదము. 1932. పీఠిక. పుట 26.
215. ఒకటి వలె. పుటలు 394-395.
216. ఏడు వలె. నాలుగవ సంపుటము. 1960. పుటలు 201-222.
217. పైది. తొమ్మిదవ సంపుటము. 1972. పుటలు 9-16.
218. సమగ్ర ఆంధ్రసాహిత్యం. నాలుగవ సంపుటం 1965. పుటలు 84-90.&
ఏడవ సంపుటం 1965. పుటలు 1965. పుటలు 242-244.
219. As 190. PP 77-78.
220. నూటనలుబది రెండు వలె. పుటలు 249-256.
221. అముద్రితసిద్ధాంతగ్రంథము.
222. నూటనాలుగు వలె. పుటలు 75-76.
223. అనర్ఘమణులు. 1991. పుట 72.
224. పైది. పుట 71.
225. ఏడువలె. నాలుగవ సంపుటము. 1960. పుటలు 156-158.

